పంచ కార్మికులారా! ఐక్యం కండి!

# సోవియట్ యూనియన్
# మ్యూనిస్టు (బోల్షివిక్) పార్టీ చరిత్ర



★

## సంక్షిప్త చరిత్ర




★

సంపాదకులు:
సో. యూ. క. (బో) పార్టీ
ంట్రల్ కమిటీ నియమించిన ఉపసంఘం

★

అనువాదకుడు:
**తుమ్మల వెంకటరామయ్య**

శాలాంధ్ర ప్రచురణాలయం - విజయవాడ

ే

# విషయసూచిక



## ఒకటో అధ్యాయం

### రష్యాలో సోషల్ - డెమాక్రటిక్ లేబర్ పార్టీ నిర్మాణానికై సాగించిన పోరాటం.

### [ 1883 - 1901 ]



## రెండో అధ్యాయం

### రష్యన్ సోషల్ - డెమాక్రటిక్ పార్టీ నిర్మాణం పార్టీలో బోల్షివిక్ - మెన్షివిక్ మతాల జననం

### [ 1901 - 1904 ]

## మూడో అధ్యాయం

### రష్యా – జపాన్ యుద్ధంలో బోల్షివిక్‌లు – మెన్షివిక్‌లు – రష్యా ప్రథమ విప్లవం.

[1904 – 1907]

## నాల్గో అధ్యాయం

స్టోలీపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో బోల్షివిక్‌లు - మెన్షివిక్‌లు - బోల్షివిక్‌లు స్వతంత్ర మార్క్సిస్టు పార్టీగా తయారగుట

[ 1908 - 1912 ]

## అయిదో అధ్యాయం

### ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధానికి ముందు కార్మికవర్గ ఉద్యమం తిరిగి తలయెత్తుచున్న సమయంలో బోల్షివిక్ పార్టీ

[ 1912 – 1914 ]



## ఆరవ అధ్యాయం

### సామ్రాజ్యవాద యుద్ధకాలంలో బోల్షివిక్ పార్టీ–రష్యాలో రెండవ విప్లవం

[ 1914 మార్చి–1917 ]

V

# ఏడవ అధ్యాయం

## అక్టోబరు సోషలిస్టు విప్లవాన్ని సన్నాహపరచి సాధించిన కాలంలో బోల్షివిక్ పార్టీ

[ 1917 ఏప్రిల్–1918 ]

## ఎనిమిదవ అధ్యాయం

### విదేశసైనిక దురాక్రమణకాలంలో, అంతర్యుద్ధ కాలంలో బోల్షివిక్‌పార్టీ

[1918 - 1920]



## తొమ్మిదవ అధ్యాయం

### శాంతియుత ఆర్థిక పునరుద్ధరణ కార్యకలాపానికి పరివర్తన చెందే దశలో బోల్షివిక్ పార్టీ

[1921 – 1925]

## ప ద వ అ ధ్యా యం

### దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం చేసే పోరాటంలో బోల్షివిక్‌పార్టీ

### [ 1926 - 1929 ]

## పదకొండవ అధ్యాయం

### సమిష్టి వ్యవసాయ నిర్మాణానికై సాగించిన పోరాటంలో బోల్షివిక్ పార్టీ.

### [ 1930 - 1934 ]

## పన్నెండవ అధ్యాయం

సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని పూర్తిగావించు పోరాటంలో బోల్షివిక్ పార్టీ నూతన రాజ్యాంగ శాసనాన్ని ప్రవేశపెట్టుట.

[ 1935 - 37 ]





# పరిచయం

1880 ప్రాంతాలలో రష్యాలో చిన్నచిన్న మార్క్సిస్టు సమితులు (Marxist circles), అధ్యయన కేంద్రాలు (Groups) ఏర్పడ్డాయి. ఆ చిన్నచిన్న సమితుల, అధ్యయన కేంద్రాల నుండి సుదీర్ఘమైన పంథాను శ్లాఘనీయంగా ప్రయాణంచేసి, ఈనాడు ప్రపంచంలో మొట్టమొదటి కార్మిక కర్షక సోషలిస్టు ప్రభుత్వాన్ని నడుపుతున్న మహత్తర బోల్షిక్ పార్టీగా సోవియట్ కమ్యూనిస్టు (బోల్షివిక్) పార్టీ రూపొందింది.

విప్లవానికి పూర్వం రష్యాలో ఉన్న కార్మికోద్యమపు పునాదిపైన సో. యూ. క. (బో) పార్టీ పెంపొందింది; కార్మికోద్యమంతో సంబంధాలేర్పరచుకొని, దానికి సోషలిస్టు చైతన్యం అందజేసిన మార్క్సిస్టు సమితుల, అధ్యయన కేంద్రాల నుండి ఇది తలయెత్తింది. మార్క్సిజం లెనినిజం అనే విప్లవ ఉపదేశాల ననుసరించియే, ఎల్లప్పుడూ నడుస్తూ వచ్చింది. సామ్రాజ్యవాద శక నూతనపరిస్థితులలో, సామ్రాజ్యవాద యుద్ధాలూ, శ్రామికవర్గ విప్లవాలూ ఏర్పడిన నూతన పరిస్థితులలో, సో. యూ. క. (బో) పార్టీ నాయకులు మార్క్స్, ఏంగెల్సుల ఉపదేశాలను మరింత విశదీకరించి వాటిని నూతన స్థాయికి కొనిపోయారు.

కార్మికవర్గ ఉద్యమంలోనే అనేక పెటీ బూర్జువా (మధ్యతరగతి) పార్టీలుండేవి. సోషలిస్టు రివల్యూషనరీలు (వీరికి పూర్వం నరోడ్నిక్‌లు), మెన్షివిక్‌లు, అనార్కిస్టులు (అరాచకవాదులు), నానాగోత్రీకులైన బూర్జువా జాతీయ వాదులు మొదలైనవారి పార్టీలవి. మార్క్సిస్టు మూల సూత్రాల విషయమై ఈ పార్టీలతో పోరాడి, సో. యూ. క. (బో) పార్టీ బలపడింది. ఇంతేగాక పార్టీలోనే ఆంతరంగికంగా వున్న మెన్షివిక్, అవకాశవాద ధోరణులను - ట్రాట్స్కీ-వాదులను, బుఖారిన్ వాదులను పెడత్రోవ బట్టించే జాతీయవాదులను (Nationalist deviators), ఇతర లెనినిస్టు - వ్యతిరేక మతాలను, మార్క్సిస్టు మూలసూత్రాల విషయమై ఎదిరించి పోరాడుటలో సో.యూ.క. (బో) పార్టీ బలపడి పెంపొందింది

కార్మికవర్గానికీ, పాటుబడే ప్రజలందరికీ శత్రువులయిన భూస్వాముల, పెట్టుబడిదారుల, ధనికరైతుల (కులక్‌ల), విధ్వంసకుల, విదేశ గూఢచారుల చుట్టూ నున్న పెట్టుబడిదారీ దేశాల శత్రువుల - వీరందరితో సాగించిన విప్లవ పోరాటంలో సో. యూ. క. (బో) పార్టీ బలపడింది; రాకలు తీరింది.

సో. యూ. క. (బో) పార్టీ చరిత్ర అంటే మూడు విప్లవాల చరిత్ర. 1905 నాటి బూర్జువా ప్రజాతంత్ర విప్లవం, (Bourgecis-democratic revolution) 1917 ఫిబ్రవరినాటి బూర్జువా ప్రజాతంత్ర విప్లవం, 1917 అక్టోబరునాటి సోషలిస్టు విప్లవం - ఈ మూడు విప్లవాల చరిత్ర అన్నమాట.

జారు ప్రభుత్వాన్ని కూలద్రోయుట, భూస్వాముల, పెట్టుబడిదారుల అధికారాన్ని కూలద్రోయుట, అంతర్యుద్ధ

కాలంలో విదేశ ప్రభుత్వాల సాయుధదాడిని ఓడించి పా
ద్రోలుట – ఈ చరిత్రయే సో. యూ. క. (బో) పార్టీ చరిత్ర. మన దేశంలో సోవియట్ ప్రభుత్వాన్ని, సోషలిస్టు సమాజాన్ని నిర్మించిన గాథయే సో. యూ. క. (బో) పార్టీ చరిత్ర.

ఈ చరిత్రను అధ్యయనం చేయుటద్వారా, మనదేశపు కార్మికులూ రైతులూ సోషలిజంకోసం చేసిన పోరాట అనుభవాన్ని తెలుసుకొని మనవిజ్ఞానాన్ని పెంపొందించుకోగల్గుతాం.

సో. యూ. క. (బో) పార్టీ చరిత్రను, మార్క్సిజానికి లెనినిజానికి శత్రువులయిన వారందరితో మనపార్టీ జరిపిన పోరాట చరిత్రను, పాటుబడే ప్రజల శత్రువులందరితోనూ మన పార్టీ జరిపిన పోరాట చరిత్రను అధ్యయనం చేయుట – మనం బోల్షివిజంలో ప్రావీణ్యత సంపాదించడానికి సహాయపడుతుంది; మనరాజకీయ జాగరూకత నిశితమవడానికి సహాయపడుతుంది.

బోల్షివిక్ పార్టీ వీరచరిత్రను అధ్యయనం చేయుటవల్ల, సామాజికాభివృద్ధి సూత్రాల, రాజకీయ పోరాట సూత్రాల, విప్లవ చలనశక్తుల పరిజ్ఞానం మనకు లభించుతుంది.

లెనిన్ – స్టాలిన్‌ల పార్టీ యొక్క మహత్తర ఆశయానికి అంతిమ విజయం తథ్యమనే – ప్రపంచమంతటా కమ్యూనిజం జయంపొందుట తథ్యమనే – విశ్వాసాన్ని సో. యూ. క. (బో) పార్టీ చరిత్ర అధ్యయనం బలపరుస్తుంది.

ఈ గ్రంథం సో. యూ. క. (బో) పార్టీ చరిత్రను క్లుప్తంగా వివరించుతుంది.



# ఒకటో అధ్యాయం

## రష్యాలో సోషల్ - డెమాక్రటిక్ లేబర్ పార్టీ నిర్మాణంకై సాగించిన పోరాటం

[1883 – 1901]

## రష్యాలో అర్ధ - బానిస విధానం (Serfdom) నిర్మూలనం - పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానాభి వృద్ధి. ఆధునిక పారిశ్రామిక కార్మికవర్గ జననం. కార్మిక వర్గ ఉద్యమ ప్రాథమికచర్యలు.

ఇతర దేశాలలోకంటె ఆలస్యంగా జారుచక్రవర్తుల రష్యాలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి కాజొచ్చింది. 1860కి పూర్వం రష్యాలో మిల్లులు, ఫ్యాక్టరీలు చాల స్వల్పంగా వుండేవి. అర్ధ - బానిస విధానంపై (Serfdom) ఆధారపడిన భూస్వాముల ఎస్టేట్లు అప్పటి ఆర్థిక విధానానికి పునాది. అర్ధ-బానిసవిధానంక్రింద నిజమైన పరిశ్రమాభివృద్ధి వుండజాలదు. అర్ధ - బానిసలుచేసే శ్రమ ఐచ్ఛికంకాదు. గనుక స్వభావ పాయంలో వారి శ్రమసామర్థ్యం చాల తక్కువగా వుండేది. ఆర్థికాభివృద్ధి పరిణామంవల్ల అర్ధ - బానిసవిధాన నాశనం అత్యవసరం అయింది. 1861లో క్రిమియన్ యుద్ధంలో జారు ప్రభుత్వం ఓడిపోయి బలహీనపడింది. ఇంతేగాక భూస్వాము లకు వ్యతిరేకంగా రైతులు లేవదీసిన తిరుగుబాట్లుచూసి, ప్రభుత్వం బేజారెత్తింది. ఈ కారణాలచే జార్ ప్రభుత్వం అర్ధ-బానిస విధానాన్ని రద్దుచేయవలసి వచ్చింది.

అర్ధ - బానిసవిధానం రద్దుచేయబడిన పిదపకూడా భూస్వాములు, రైతులను పీడించుతూనే వున్నారు. రైతులను బానిసత్వంనుండి 'విముక్తి' చేసే కార్యక్రమంలో వారు రైతులను అనేక విధాల దోపిడిచేశారు. ఇదివరలో రైతులు ఉపయోగించుకొంటూ వచ్చిన భూములలో కొంతభాగాన్ని విభజించి, తమ భూములలో కలుపుకొని, రైతులను దోపిడిచేశారు. ఇలా విభజింపబడిన భూభాగాలను రైతులు ఓట్రెజ్కీ (Otrezki - కోత)అని అనేవారు. తమను "ఉద్ధరించినందుకు" బదులుగా రైతులు భూస్వాములకు రెండువందల కోట్ల రూబుల్స్ ప్రతిఫలం ముట్టచెప్పవలసి వచ్చింది.

అర్ధ-బానిస విధానం రద్దుచేయబడిన పిదప, భూస్వాములనుండి రైతులు భూమిని అతినష్టదాయకమైన షరతులతో కౌలుకు తీసుకోవలసి వచ్చింది. ధనరూపేణా కౌలు చెల్లించుటే గాక, భూస్వాముల పొలాన్ని కొంత తమ గుర్రాలతోను, వ్యవసాయ పరికరాలలోను రైతు లుచితంగా సేద్యం చేయవలసి వచ్చేది. ఇలా ప్రతిఫలం లేకుండా నిర్బంధంతో చేసే పనిని "ఓట్రబోట్కీ" (Otrabotki) లేక "బార్షినా" (Barshchina) అని పిలిచేవారు. అంటె కూలి చేయుట ద్వారా సమర్పించుకొనే మగతా లేక వెట్టి (Labour rent corvee) అని అర్థం. తమకు పండిన దానిలో సగం ధాన్యరూపేణా భూస్వాములకు రైతులు చెల్లించడం చాల చోట్ల పరిపాటి అయింది. దీనినే "ఇస్పోలూ" (Ispolu) అనేవారు. అంటే సగపాలు పద్ధతి అన్నమాట.

ఈ విధంగా పూర్వం అర్ధ - బానిస విధానం క్రింద ఉన్నట్లే, రైతు పరిస్థితి దాదాపుగా వుండిపోయింది. అయితే

వున్న భేదమల్లా, ఇప్పుడు రైతు వ్యక్తిగతంగా స్వేచ్ఛావంతుడు. పూర్వంలాగా అతనిని పశువువలె, కొనడానికి అమ్మడానికి వీలులేదు.

భూస్వాములు, వెనుకబడ్డ రైతాంగాన్ని అనేకవిధాల పీడించి పిప్పిచేసేవారు (కౌలు, జరిమానాలువగైరా ద్వారా). భూస్వాముల దోపిడి వలన రైతాంగంలో ఎక్కువమంది తమ క్షేత్రాలను అభివృద్ధి చేసుకోలేక పోయేవారు. అందుచేతనే, విప్లవానికి పూర్వం రష్యాలో వ్యవసాయం చాల వెనుకబడి వుండేది. తత్ఫలితంగా తరచుగా పంటలు పండక, కరువులువచ్చేవి.

అర్ధ-బానిస చిహ్నాలయిన క్రుంగదీసే పన్నులభారం, భూస్వాములకు నష్టపరిహారాలు చెల్లించవలసిరావడం .. ఇవన్నీ తరచుగా రైతుకుటుంబాల ఆదాయాన్నే మించిపోయి, రైతులను నాశనం చేశాయి. రైతులు దరిద్రులయ్యారు. పొట్ట నింపుకోడంకోసం వారు తమ గ్రామాలను వదలిపెట్టి పోవలసి వచ్చింది. వారు ఫ్యాక్టరీలలో, మిల్లులలో పనిచేయడానికి వెళ్లారు. పరిశ్రమల యజమానులకు చౌకగా శ్రమశక్తి(కూలి) లభించడానికి యిది మార్గమయింది.

షెరీఫ్‌లూ (ప్రభుత్వాధికార్లు), డిప్యూటీ షెరీఫ్‌లూ, పోలీసు విధుల నిర్వర్తించే సైనికులూ (gendarmes) గ్రామ పోలీసులూ - ఇలా ఒక సైన్యం రైతుల, కూలీల నెత్తిమీద ఎక్కి కూర్చునేది. కష్టపడి పనిచేసే ప్రజల నుండి, దోపిడి చేయబడే ప్రజలనుండి, వీరు జారు ప్రభువును, పెట్టుబడిదారులను, భూస్వాములను రక్షించేవారు. 1903 వరకు కూడా దేహతాడన శిక్ష (Corporal punishment) అమ

లులో వుండేది. అర్ధ - బానిస విధానం రద్దుచేయబడినప్పటికీ, పన్నులు చెల్లించకపోయినా, ఏచిన్న నేరం చేసినా కొరడా శిక్ష విధించేవారు. ఇక ఏ మాత్రం సహించడాని స్థితికి తమ జీవితాలను యజమానులు తెచ్చారు. అందుచే కార్మికులు పనిమానేసి సమ్మెచేస్తే, ముఖ్యంగా సమ్మె కాలంలో, పోలీసులూ, కోసక్ (గుర్రపు-రౌతు)లూ కార్మికులపై చేయి జేసుకొనేవారు. జార్ చక్రవర్తుల పరిపాలనలో రైతులకు కూలీలకు ఎట్టి రాజకీయ హక్కులూ లేవు. జార్ నిరంకుశ ప్రభుత్వం ప్రజలకు అతి ప్రబల శత్రువు.

జార్ రాజుల నాటి రష్యా, వివిధ జాతులకు బందిఖానా అయింది. రష్యన్ జాతి కానట్టి అనేక ఇతర జాతులకు హక్కులంటూ ఏమీ లేవు. పైగా ఎల్లప్పుడూ ఆ జాతులు అన్ని విధాలయిన అవమానాలకు పరాభవాలకు గురిచేయబడేవి. తక్కిన జాతి ప్రజలను తక్కువజాతి వారుగా నీచంగా చూడటం రష్యన్ ప్రజలకు జారు ప్రభుత్వం నేర్పింది. వారిని అధికార ప్రకటనలలో పరాయి వారిగా (Inorodtsi) ప్రకటించింది. వారిపై ద్వేషమూ, అసహ్య భావమూ పురికొల్పింది. జార్ ప్రభుత్వం బుద్ధిపూర్వకంగా వివిధజాతులమధ్య విభేదాలు కల్పించింది. ఒక జాతిపై మరొక జాతిని పురికొల్పింది. యూదులపై హత్యాకాండలను (Pogroms) ప్రోత్సహించింది. ట్రాన్స్ కాకేషియాలో తాతార్లను (తార్తార్లను), ఆర్మేనియన్లను ఒకరి గొంతుక ఒకరు కోసుకొనేటట్లు రెచ్చగొట్టింది.

నూటికి నూరుపాళ్ళూ కాకపోయినా, దాదాపు వివిధ జాతీయ రాష్ట్రాలలో ప్రభుత్వోద్యోగాలన్నీ రష్యన్ ఉద్యోగుల చేతులలోనే వుండేవి. ప్రభుత్వ సంస్థలలోను, కోర్టులలోను వ్యవహార

మంతా రష్యన్ భాషలోనే జరిగేది. రష్యనేతర భాషలలో పుస్తకాలుగాని, పత్రికలుగాని ప్రకటించకూడదంటూ నిషేధం వుండేది. అలాగే స్కూళ్ళలో తమ మాతృభాషలలో బోధించరాదంటూ, రష్యనేతరజాతులపై ఆంక్షవిధించబడింది. జాతీయ సంస్కృతి అనే వెలుగుకణం ఎక్కడ మినుకుమినుకు మంటున్నా, ఆ కణాన్ని ఆర్పివేయడానికి జార్ ప్రభుత్వం ప్రయత్నించింది. రష్యనేతర జాతులన్నిటిని బలవంతంగా 'రష్యన్‌మయం' చేయాలని ప్రయత్నించింది. రష్యనేతర ప్రజలను నానాహింసలకు గురిచేసింది. వారిపాలిట కసాయి ప్రభుత్వమయింది జార్ ప్రభుత్వం.

అర్ధ-బానిసవిధాన నిర్మూలనం తర్వాత దాని అవశేషాలు ఇంకా కొన్ని అడ్డుతగిలినప్పటికీ, రష్యాలో పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం చాల త్వరితగతిని అభివృద్ధి చెందింది. 1865-90 ల మధ్య, పాతికేళ్ళలో, పెద్దపెద్ద మిల్లులలో ఫ్యాక్టరీలలో, రైల్వేలలోను పనిచేసే కార్మికుల సంఖ్య 7 లక్షల 6 వేలనుండి 14 లక్షల 33 వేలకు పెరిగింది. అంటే రెట్టింపు కంటె కూడ అధికమయింది.

1890 ప్రాంతాలలో రష్యాలో భారీపెట్టుబడిదారీ పరిశ్రమలు ఇంకా చాలా త్వరితగతిని వృద్ధికాజొచ్చాయి. ఆ దశాబ్దాంతానికి (1900 నాటికి) రష్యాలోని యావత్తు యూరోపియన్ రాష్ట్రాలలోనే (రష్యా కొంత యూరప్ ఖండంలోను, కొంత ఆసియాఖండంలోను వుంది - రాష్ట్రంఅంటే మనజిల్లా అనే భావంలో వాడబడింది., - అనువాదకుడు) పెద్దపెద్ద మిల్లులలో, ఫ్యాక్టరీలలో, గనులలో రైల్వేలలో పనిచేయు

కార్మికులసంఖ్య 22 లక్షల 7 వేలు. మొత్తం రష్యాలోని కార్మికుల సంఖ్య 27 లక్షల 92 వేలు.

వీరంతా ఆధునిక పారిశ్రామిక కార్మికవర్గం. అర్ధ - బానిస విధాన కాలంలో ఫ్యాక్టరీలలో నియమింపబడిన కార్మికులకూ, చిన్న చిన్న ఫ్యాక్టరీలలోను, చేతిపరిశ్రమలలోను, ఇతర పరిశ్రమలలోను వుండే కార్మికులకూ - పైనపేర్కొన్న ఆధునిక పారిశ్రామిక కార్మికవర్గానికీ - భేదంవుంది. ఈ భేదానికి కారణం పెద్దపెద్ద పెట్టుబడిదారీ పరిశ్రమలలో పనిచేసే కార్మికుల మధ్య వుండే ఐకమత్యభావం ఒకటి. రెండవది వారికిగల గాఢమైన విప్లవలక్షణాలు (Militant revolutionary qualities)

1890 ప్రాంతాలలో పారిశ్రామిక వికాసానికి (Boom) కారణం రైల్వేమార్గ నిర్మాణం. ఈదశాబ్దంలో (1890-1900) 21 వేల వెర్స్టుల (Verst-వెరస్టుఅంటే దాదాపు 1166 $\frac{2}{3}$ గజాలు, దాదాపు 5 ఫర్లాంగులపైన) కొత్త రైల్వేలైను వేశారు. రైల్వే నిర్మాణంతో లోహాలకు (రైలుపట్టాలు, ఇంజన్లు, కార్లు) గిరాకీ హెచ్చింది. ఇంకా ఇలాగే వంట చెఱకు పరిశ్రమలు (బొగ్గు, నూనె)గిరాకీ హెచ్చింది. ఇది లోహ, బొగ్గుపరిశ్రమల అభివృద్ధికి దారి తీసింది.

విప్లవపూర్వ రష్యాలో, అన్ని పెట్టుబడిదారీ దేశాలలో వలెనే, పారిశ్రామిక వికాసదశ దాటగానే, పారిశ్రామిక సంక్షోభమూ, స్తబ్ధతా తలయెత్తేవి. ఇవి కార్మికవర్గానికి పెద్ద దెబ్బ గొట్టాయి. తత్ఫలితంగా వేలాది కార్మికులు నిరుద్యోగానికీ, బీదరికానికీ గురిఅయ్యారు.

అర్ధ - బానిస విధానం నిర్మూలింపబడిన పిదప, రష్యాలో పెట్టుబడిదారీ విధానం చాల త్వరగా అభివృద్ధి

చెందినప్పటికీ, ఇతర పెట్టుబడిదారీ దేశాలకంటె రష్యా ఆర్థికా వృద్ధిలో వెనుకబడింది. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయంలోనే నిమగ్నులయి వున్నారు. "రష్యాలో పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధి" (The Development of Capitalism in Russia) అనే సుప్రసిద్ధ గ్రంథంలో, లెనిన్ 1897 నాటి జనాభా లెక్కలలో కొన్ని ముఖ్యమైన అంకెలను పేర్కొన్నారు. మొత్తం జనాభాలో ఆరింట అయిదుపాళ్ళు (5/6 అనగా 100కి 83⅓) వ్యవసాయమే వృత్తిగా జీవిస్తున్నారు. ఆరవవంతు జనాభా మాత్రమే (నూటికి 16⅔) చిన్నాపెద్ద పరిశ్రమలలోను, వర్తకంలోను, రైల్వేలలోను, నీటి ప్రయాణా లలోను (పడవులు, ఓడలు, రేవులు వగైరా - అనువాదకుడు), భవన నిర్మాణంలోను, కలప పరిశ్రమలలోను, తదితర పరిశ్ర మలలోను పనిచేస్తూవుండేవారు.

ఇది ఏం తెలియజేస్తుందంటే—రష్యాలో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతున్నప్పటికీ అది యింకా వ్యవసాయ దేశమే. ఆర్థికంగా వెనకబడ్డ పెటీ-బూర్జువాదేశమే. అంటే, స్వల్ప భూఖండాలపై ఆధారపడి తక్కువ ఉత్పత్తిఅయ్యే వ్యక్తి గత రైతువ్యవసాయమే ప్రధానంగా కల దేశం అన్నమాట.

ఒక్క పట్టణాలలోనే గాక గ్రామసీమలలో కూడ పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతూంది. విప్లవ పూర్వ రష్యాలో అధికసంఖ్యాక వర్గమయిన రైతాంగం క్రమంగా చీలికలై శిథిలమవుతూంది. కాస్త బాగా కలిగిన రైతులనుండి ఒక కులక్ (ధనికరైతు) వర్గం తలయెత్తసాగింది. దీనినే గ్రామీణ బూర్జువా (గ్రామీణ పెట్టుబడిదారీ వర్గం) అంటారు. ఇది రైతాంగంలో పైపొర. ఇక రెండవ ప్రక్క, అనేకమంది

రైతులు నాశనమయి పోతున్నారు. బీదరైతుల, గ్రామీణ శ్రామికుల (Rural proletarians) అర్ధ - శ్రామికుల (Semi-proletarians) సంఖ్య హెచ్చసాగింది. మధ్యతరగతి రైతుల సంఖ్యాపటేటా తగ్గుతూవచ్చింది.

రష్యాలో, 1903 లో ఒక కోటి రైతుకుటుంబాలుండేవి. "గ్రామీణ పేద ప్రజలకు" (To the Village Poor) అనే కరపత్రంలో, లెనిన్, ఈ కోటి కుటుంబాలలోను 35 లక్షల కుటుంబాలకు గుర్రాలు లేవని తెలియజేశాడు. (రష్యాలో పాశ్చాత్య దేశాలవలెనే గుర్రాలతో వ్యవసాయం చేసేవారు-అనువాదకుడు) వీరు అందరిలోకీ బీద రైతులు. వ్యవసాయం చేసుకొనే తాహతులేక వీరు తమ భూమిలో కొద్దిభాగాన్ని మాత్రమే సాగుచేసేవారు. తక్కినది కులక్‌లకు (ధనికరైతులకు) మగతాకు ఇచ్చేవారు. తాముమట్టుకు జీవనోపాధికి ఇతర మార్గాలను వెదుక్కోవలసివచ్చేది. వీరిపరిస్థితి దాదాపు శ్రామికవర్గ పరిస్థితికి వచ్చింది. లెనిన్ వీరినే గ్రామీణ శ్రామికులు లేక అర్ధ - శ్రామికులు అని పిలిచాడు.

మరొక ప్రక్క, 15 లక్షల ధనిక కులక్ కుటుంబాలు (మొత్తం రైతుకుటుంబాలు కోటి) రైతులు సాగుచేసే మొత్తం భూమిలో సగం తమ చేతుల్లోనే కేంద్రీకరించుకు కూర్చున్నాయి. రైతు పెట్టుబడిదారీ వర్గం, (Pesant bourgeoisie) బీద మధ్య రైతాంగాన్ని పీల్చి పిప్పిచేసి, వ్యవసాయ కూలీల కష్టాన్ని దోపిడి చేయుటద్వారా లాభాలు గడించి, గ్రామీణ పెట్టుబడిదారులుగావృద్ధి చెంద సాగింది.

1870 ప్రాంతాల, ముఖ్యంగా 1880 ప్రాంతాల రష్యన్ కార్మిక వర్గం మేల్కొన నారంభించింది; పెట్టుబడిదారులపై

పోరాటం ప్రారంభించింది. జార్ రాజులనాటి రష్యాలో, కార్మికుల స్థితి చాల అధ్వాన్నంగా వుండేది. 1880 ప్రాంతాలలో మిల్లులలోను, ఫ్యాక్టరీలలోను రోజుకు 12½ గంటలకు తక్కువ గాకుండా కార్మికులు పని చేసేవారు. బట్టల పరిశ్రమలలో (టెక్స్టైల్స్) 14 లేక 15 గంటలు కూడా పని చేసేవారు. స్త్రీలను పిల్లలను దోపిడి చేయడం ఎక్కువగా సాగుతుండేది. పిల్లలు, పెద్దవాళ్లు చేసినన్ని గంటలూ పని చేసేవారు. కాని స్త్రీలకువలెనే పిల్లలకు తక్కువజీతాలు ముట్టేవి. జీతాలు అతి తక్కువగా దారుణంగా వుండేవి. ఎక్కువమంది కార్మికులకు నెలకు 7 లేక 8 రూబుల్సు మాత్రం ఇచ్చేవారు. లోహ పరిశ్రమలోను ఫౌండరీలలోను ఎక్కువ జీతం పొందే కార్మికులకుసైతం, నెలకు 35 రూబుల్సు కన్న ఎక్కువవచ్చేది గాదు. కార్మికుల సంరక్షణకు ఎట్టి చట్టాలూ లేవు. ఈ నిర్లక్ష్య ఫలితంగా కార్మికులు అనేకమంది ప్రమాదాలకు గురియై చనిపోవడమూ, వికలాంగులవడమూ సంభవించుతుండేది. కార్మికులకు భీమా (ఇన్సూరెన్సు) లేదు. వైద్యసహాయానికి కార్మికులే డబ్బు చెల్లించుకోవలసివచ్చేది. ఇక ఇండ్ల వసతులు మరీ దారుణంగా వుండేవి. ఫ్యాక్టరీ యజమానుల బారకాసులలో (barracks) చిన్న చిన్న గదులలో (cells) పది పన్నెండు మంది దాకా నివసించుతుండేవారు. తరచుగా యజమానులు, కార్మికులను జీతాల విషయంలో మోసగించుతుండేవారు. పైగా యజమానుల ఫ్యాక్టరీ దుకాణాలలోనే, విపరీత ధరలకు వస్తువులను నిర్బంధంగా కార్మికులు కొనవలసి వచ్చేది. ఇంతే గాక కార్మికులపై జరిమానాలు వడ్డించేవారు యజమానులు.

దుస్సహమైన తమ పరిస్థితులను బాగుజేసుకోవడానికై కార్మికులంతా ఒకే మాటపై నిలబడి తమ కోర్కెలను ఫ్యాక్టరీ యజమానులకు తెలియజేయ సాగారు. పనిముట్లు క్రిందపారేసి సమ్మెలు చేస్తూవుండేవారు. అతిగా జరిమానాలు విధించడం, మోసగించడం, కార్మికుల జీతాలను వంచించి కాజేయడం, జీతాల తగ్గింపులు – మొదలైన చర్యలవలన 1870 – 80 ప్రాంతాలలో మొట్టమొదటి సమ్మెలు జరిగాయి.

ఈ ప్రాథమిక కాలంలోని సమ్మెలలో అప్పుడప్పుడు కార్మికులు నిస్పృహతో యంత్రాలను నాశనం చేసేవారు. ఫ్యాక్టరీ కిటికీలను, ఫ్యాక్టరీల యాజమాన్యాన నడిచే దుకాణాలను, వాటి ఆఫీసులను బద్దలు కొట్టేవారు.

పెట్టుబడిదారులపై సాగించే తమ పోరాటంలో విజయాన్ని సాధించాలంటే, నిర్మాణం (ఆర్గనైజేషన్ – Organisation) అవసరం అని బాగా అభివృద్ధి చెందిన కార్మికులు గుర్తించసాగారు. కార్మికసంఘాలు తలయెత్త మొదలు పెట్టాయి.

1875 లో దక్షిణ రష్యా కార్మికసంఘం (సౌత్ రష్యన్ వర్కర్సు యూనియన్) ఒడెస్సాలో ఏర్పడింది. కార్మికుల ఈ మొదటి సంఘం ఎనిమిది తొమ్మిది నెలలు మాత్రం నిలిచింది. తర్వాత జార్ ప్రభుత్వం దీనిని నాశనం చేసింది.

1878 లో ఉత్తర రష్యా కార్మికసంఘం (నార్తరన్ యూనియన్ ఆఫ్ రష్యన్ వర్కర్స్) సెంట్ పీటర్సబర్గ్‌లో ఏర్పడింది. వడ్రంగి అయిన ఖాల్టూరిన్ (Khalturin), ఫిట్టర్ అయిన ఓబ్నార్‌స్కీ (Obnorsky) దీనికి నాయకులు. పశ్చిమ

దేశాలలోని సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీల ఆశయాలు ఉద్దేశాలలాంటివే తమవీ అని ఈ కార్మికసంఘం తన కార్య క్రమంలో వివరించింది. సోషలిస్టు విప్లవాన్ని తీసుకురావడం, "ఇప్పుడున్న ఆర్థిక రాజకీయవ్యవస్థ అత్యంత అన్యాయ వ్యవస్థ గనుక, దానిని కూలద్రోయడం" తన అంతిమ ఆశయమని ఈ కార్మికసంఘం తెలియజేసింది. ఈ కార్మిక సంఘ స్థాపకు లలో ఒకడైన ఓబ్నార్‌స్కీ కొంతకాలం విదేశాలలో నివసిం చాడు. అక్కడ మార్క్సిస్టు సోషల్ డెమాక్రటిక్ పార్టీల కార్యకలాపాలతో, మార్క్స్ నడిపిన ఫస్ట్ ఇంటర్నేషనల్ (ప్రథమ అంతర్జాతీయ కార్మికవర్గ సంస్థ) కార్యకలాపాలతో సంబంధ మేర్పరుచుకొన్నాడు. ఉత్తర రష్యా కార్మిక సంఘ కార్యక్రమంపై ఈ పరిస్థితుల ప్రభావం పడింది. ఈ కార్మిక సంఘం యొక్క తక్షణ ఆశయం, రాజకీయ స్వాతంత్ర్యాన్ని, హక్కులనూ (వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాలను) ప్రజలకు సంపాదించడం. రోజుకు పనిచేసే గంటల పరిమితిని తగ్గించా లన్న కోర్కె కూడా తక్షణ కోర్కెలలో ఒకటి.

ఈ కార్మికసంఘ సభ్యత్వం రెండువందలవరకు చేరింది. చాలామంది సానుభూతిపరులు కూడా ఈ సంఘానికి ఉండేవారు. ఇది కార్మిక సమ్మెలలోపాల్గొని వాటిని నడిపించింది. జార్ ప్రభుత్వం ఈ కార్మిక సంఘాన్ని కూడా అణచి వేసింది.

కాని, కార్మికవర్గ ఉద్యమం ఒక జిల్లానుంచి మరొక జిల్లాకు వ్యాపిస్తూ, పెరుగుతూనే వచ్చింది. 1880 ప్రాంతా లలో అనేకసమ్మెలు జరిగాయి. 1881–86 సంవత్సరాల మధ్య అయిదేండ్లలో 48 సమ్మెలు జరిగాయి. 80 వేల కార్మికులు పాల్గొన్నారు.

1885లో ఒరెఖోవో-జుయెవో (Orekhovo-zuyevo) అనే ప్రదేశంలో మొరొజోవ్ (Morozov) మిల్లులో పెద్ద సమ్మె జరిగింది. విప్లవోద్యమచరిత్రలో ఈ సమ్మె అసాధారణమైన పాత్ర వహించింది.

ఈ మిల్లులో 8 వేల కార్మికులు పనిచేస్తూ వుండేవారు. రోజురోజుకూ కార్మికుల పరిస్థితులు అధ్వాన్నం కాజొచ్చాయి. 1882 - 84 సంవత్సరాల మధ్య అయిదుసార్లు జీతాలను కోశారు. 1884 లో ఒకేసారి జీతాలలో నాల్గవవంతు తగ్గించారు. దీనికితోడు మిల్లుయజమాని మోరోజోవ్ కార్మికులను జరిమానాలతో పీక్కుతినేవాడు. సమ్మె అనంతరం జరిగిన విచారణలో బయటపడిన విషయాలనుబట్టి, కార్మికుడు సంపాదించిన ప్రతి రూబుల్‌లోనూ 30 మొదలు 50 కోపెక్‌ల వరకు (రూబుల్‌కు 100 కోపెక్‌లు) జరిమానాల రూపేణ యజమాని జేబులోకి పోయేవి. ఈ నిలువు దోపిడీని కార్మికులిక సహించలేకపోయారు. 1885 జనవరిలో సమ్మె చేశారు. సమ్మె ఇంతకు ముందుగానే సంఘటిత పరచబడింది. రాజకీయంగా అభివృద్ధి చెందిన కార్మికుడు 'ప్యోటర్ మోయిసెయెంకో' (Pyotr Moisseyenko)) ఈ సమ్మెను నడిపాడు. ఇతడు ఉత్తర రష్యా కార్మికసంఘ సభ్యుడు. అప్పటికే అతనికి కొంత విప్లవానుభవం వుంది. సమ్మె ప్రారంభమయ్యేముందు, మోయిసెయెంకో, ఇంకా తదితర వర్గచైతన్యంగల నేత పనివారు, కార్మికుల కోర్కెల జాబితాను మిల్లుయజమానికి తెలియజేయడానికై తయారు చేశారు. కార్మికులు రహస్యంగా సమావేశమై ఈ కోర్కెలను ఆమోదించారు. జరిమానాల ద్వారా చేసే దోపిడీని రద్దు చేయాలన్నది వారి కోర్కెలలో ప్రధానమైనది.

సాయుధ శక్తి ద్వారా ప్రభుత్వం సమ్మెను అణచి వేసింది. 6 వందల మంది కార్మికులను అరెస్టు చేసింది. అనేక మందిపై విచారణ సాగింది.

1885 లో ఇలాంటిసమ్మెలే ఇవనోవో - వోజ్నెసెన్స్క (Ivanovo-Voznesensk) మిల్లులలో ప్రారంభమయినాయి.

కార్మికవర్గ ఉద్యమం చూచి భయపడి, జారుప్రభుత్వం ఆ మరుసటి సంవత్సరం ఒక చట్టం చేయవలసివచ్చింది. ఆచట్టం జరిమానాలగురించి, కార్మికులకు విధించిన జరిమానాలు యజమానుల జేబులలోకి గాక, కార్మికుల అవసరాలకే ఉపయోగించాలని ఆ చట్టం చెప్పింది.

సంఘటిత పోరాటంద్వారా చాలా లాభం పొంద వచ్చునని, మొరోజోవ్ మొదలగు సమ్మెలు కార్మికులను తెలియజేశాయి. కార్మికవర్గ ప్రయోజనాలకోసం తీవ్రంగా పోరాడే సమర్థులైన నాయకులను, ఆగ్నైజర్లను (ఉద్యమ సంఘటనాకర్తలను), కార్మికవర్గ ఉద్యమం తయారుచేయ ప్రారంభించింది.

ఇదే కాలంలో, కార్మికవర్గ ఉద్యమాభివృద్ధిని ఆధారం చేసుకొని, పశ్చిమ యూరప్‌లోని కార్మికోద్యమ ప్రభావంతో, రష్యాలో మొట్టమొదటి మార్క్సిస్టు సంస్థలు (Marxist Organisations) తల యెత్త ప్రారంభించాయి.

# 2

రష్యాలో నరోడిజం (పాప్యులిజం), మార్క్సిజం. ప్లెఖనావ్ అతని "కార్మిక విమోచనసమితి" ('Emancipation of labour' group) నరోడిజంతో ప్లెఖనావ్ పోరాటం. రష్యాలో మార్క్సిజం వ్యాప్తి.

మార్క్సిస్టు అధ్యయన కేంద్రాలు (గ్రూపులు) తల యెత్తకముందు, రష్యాలో విప్లవకార్యకలాపాలను, మార్క్సిజానికి ప్రతికూలులైన * నరోడ్నిక్‌లు (పాప్యులిస్టులు) కొనసాగించుతూ వుండేవారు.

రష్యాలో మొట్టమొదటి మార్క్సిస్టు అధ్యయనకేంద్రం (గ్రూపు) 1883 లో ఏర్పడింది. విప్లవ కార్యకలాపాలు సాగించుతున్నందుకు ప్లెఖనావ్‌ను జార్ ప్రభుత్వం వేటాడుతుంటే, అతను విదేశాలలో – జెనీవాలో – తలదాచుకోవలసి వచ్చింది. ప్లెఖనావ్ అక్కడ 'కార్మిక విమోచనసమితి'ని స్థాపించాడు.

---

* నరోద్ అంటే ప్రజ. నరోడిజంను ప్రచారంచేసేవారు నరోడ్నిక్కులు. నరోడిజం యొక్క సిద్ధాంతవివరణ మున్ముందు వస్తుంది.

— అనువాదకుడు

ఇంతకుపూర్వం ప్లెఖనావ్ కూడా ఒక నరోడ్నికే. విదేశాలలో వుండగా అతడు మార్క్సిజాన్ని అధ్యయనం గావించడంవల్ల, నరోడిజంతో తెగతెంపులు చేసుకొని, ప్రముఖ మార్క్సిస్టు ప్రచారకుడయ్యాడు.

రష్యాలో మార్క్సిజాన్ని వెదజల్లడానికి 'కార్మిక విమోచన' సమితి చాలా కృషి చేసింది. మార్క్స్, ఎంగెల్స్‌లు గ్రంథాలను - కమ్యూనిస్టు మానిఫెస్టో (కమ్యూనిస్టు ప్రణాళిక); వేజ్ లేబర్ అండ్ కాపిటల్ (కూలి పని - పెట్టుబడి); సోషలిజం, యుటోపియన్ అండ్ సైంటిఫిక్ (సోషలిజం, ఊహాజనితమూ - శాస్త్రీయమూ) మొదలైన వాటిని రష్యన్ భాషలోకి అనువదించి విదేశాలలో అచ్చొత్తించి రష్యాలో రహస్యంగా ఈ సమితివారు ప్రచారంలోకి తెచ్చారు. ప్లెఖనావ్, జాసులిచ్, అక్సెల్‌రాడ్ ఇంకా తదితర (Pleknanov, Zasulich Axelrod) సమితి సభ్యులు మార్క్స్, ఎంగెల్సుల ఉపదేశాలను వివరించుతూ, శాస్త్రీయ సోషలిస్టు భావాలను విశదీకరించుతూ, అనేక గ్రంథాలను వ్రాశారు.

ఊహాజనిత సోషలిస్టులు భావించునట్లుగా సోషలిజం అనేది కలలు గనేవారు (యుటోపియన్లు - ఊహాప్రపంచ సంచారులు) కనిపెట్టినది కాదనీ, ఆధునిక పెట్టుబడిదారీ సమాజాభివృద్ధివలన తప్పనిసరిగా కలిగే ఫలితమనీ, మొట్టమొదటిసారిగా వివరించినవారు మహాబోధకులైన మార్క్స్, ఎంగెల్సులు. అర్ధ-బానిస విధానం పడిపోయినట్లుగానే, పెట్టుబడిదారీవిధానం కూడా తప్పనిసరిగా పడిపోతుందనీ, పెట్టుబడిదారీవిధానం శ్రామికవర్గాన్ని సృష్టించుటద్వారా తన గొయ్యిని

తానే ప్రత్యక్షొంటున్నదనీ వారు నిరూపించారు. వర్గ పోరాటం ద్వారానే, పెట్టుబడిదారీవర్గాన్ని శ్రామికవర్గం జయించుట ద్వారానే, అది పెట్టుబడిదారీ విధానంనుండీ, దోపిడినుండీ మానవజాతిని విముక్తి చేస్తుంది - అని వారు నిరూపించారు.

కార్మికవర్గం స్వకీయబలాన్ని గుర్తెరుగవలసిందనీ, తమ వర్గ ప్రయోజనాలను తెలుసుకొని యుండవలెననీ పెట్టుబడి దారులపై కృతనిశ్చయంతో పోరాడటానికి ఐక్యమవాలనీ, మార్క్సు, ఎంగెల్సులు ఉపదేశించారు. మార్క్సు, ఏంగెల్సులు పెట్టుబడిదారీ సమాజాభివృద్ధి సూత్రాలనుకని పెట్టారు. పెట్టుబడిదారీ సమాజాభివృద్ధీ, దానిలో అంతర్గతంగా సాగుతూన్న వర్గపోరాటమూ, తప్పనిసరిగా పెట్టుబడిదారీవిధాన పతనానికి, శ్రామికవర్గ విజయానికి, శ్రామికవర్గ నియంతృత్వానికి దారితీస్తుందని, వారు నిరూపించారు.

శాంతియుత పద్ధతులద్వారా పెట్టుబడి యొక్క అధికారం వదలించుకోలేమనీ, పెట్టుబడిదారీ ఆస్తిని ప్రజల ఆస్తిగా మార్చలేమనీ, మార్క్సు, ఎంగెల్సులు బోధించారు. పెట్టుబడి దారీ వర్గంపై శ్రామికవర్గం విప్లవయుత హింసామార్గం ద్వారానే, శ్రామికవర్గ విప్లవం ద్వారానే, తన రాజకీయ అధికారాన్ని స్థాపించగలదు - శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించగలదు. ఆ శ్రామికవర్గ నియంతృత్వం దోపిడీదారుల ప్రతిఘటనను అణచివేసి, నూతన, వర్గరహిత, కమ్యూనిస్టు సమాజాన్ని నిర్మించాలని మార్క్సు, ఎంగెల్సులు బోధించారు.

పారిశ్రామిక కార్మికవర్గం అత్యంత విప్లవవర్గం. అందుచే పెట్టుబడిదారీ సమాజంలో చాలా అభివృద్ధిచెందిన వర్గం.

శ్రామికవర్గంలాంటి వర్గమే, పెట్టుబడిదారీ విధానంపై అసంతృప్తి చెందిన శక్తులన్నింటినీ తనచుట్టూ సమీకరించి, పెట్టుబడిదారీ విధానంపై దాడిచేయడానికి నడపగలదు - అని మార్క్సు, ఎంగెల్సులు బోధించారు. పాతప్రపంచాన్ని జయించి నూతనవర్గరహిత సమాజాన్ని సృష్టించాలంటే శ్రామికవర్గం తన స్వంతకార్మికవర్గ పార్టీని కలిగియుండాలి. ఆ పార్టీనే మార్క్సు, ఎంగెల్సులు కమ్యూనిస్టుపార్టీ అన్నారు.

మార్క్సు, ఎంగెల్సుల ఈ అభిప్రాయాలను వెదజల్లుటకే, రష్యాలోని మొట్టమొదటి మార్క్సిస్టు అధ్యయన కేంద్రం అయిన ప్లెఖనావ్ "కార్మిక విమోచనాసమితి" తన యావచ్ఛక్తినీ వినియోగించింది.

రష్యాలో ఇంకా సోషల్ - డెమాక్రటిక్ ఉద్యమం వేరూనకముందు, విదేశాలలోని రష్యన్ పత్రికలలో "కార్మిక విమోచనా సమితి". మార్క్సిజం అనే నినాదాన్ని లేవదీశారు. మొదట అలాంటి ఉద్యమానికి తాత్విక సిద్ధాంత పునాదిని (Theoretical, ideological ground) తయారు జేయుట అవసరం. మార్క్సిజమూ, సోషల్ డెమాక్రటిక్ ఉద్యమమూ వ్యాపింపకుండా ఉండటానికి ప్రధాన సిద్ధాంత (Ideological) అవరోధం, నరోడ్నిక్‌ల భావాలే. ఆ రోజులలో నరోడ్నిక్ భావాలు, అభివృద్ధిచెందిన కార్మికులలోను, విప్లవధోరణిగల మేధావులలోను వ్యాపించి యుండేవి.

రష్యాలో పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి అయినకొలదీ, సంఘటిత విప్లవపోరాటాన్ని సాగించ సమర్థతగల బలోపేతమైన అభ్యుదయశక్తిగా, రష్యన్ కార్మికవర్గం పెంపొందింది.

కాని కార్మికవర్గంయొక్క నాయకత్వ పాత్రను నరోడ్నిక్కులు అర్థంచేసుకోలేదు. ముఖ్యమైన విప్లవశక్తి కార్మికవర్గం కాదనీ, రైతాంగమనీ, జారుయొక్క, భూస్వాములయొక్క అధికారాన్ని రైతు తిరుగుబాటుల ద్వారానే కూలద్రోయగలమనీ, రష్యన్ నరోడ్నిక్కులు ఒక తప్పుడు అభిప్రాయాన్ని కలిగి వుండేవారు. నరోడ్నిక్కులకు కార్మికవర్గం అంటే ఏమిటో తెలియదు. కార్మికవర్గంతో మైత్రిలేనిదే, కార్మికవర్గ నాయకత్వంలేనిదే, జారు ప్రభుత్వాన్నీ భూస్వాములనూ, రైతులొక్కరే జయించ సామర్థ్యం కలవారు కారని నరోడ్నిక్కులు గ్రహించలేదు. సమాజంలో కార్మికవర్గం అత్యంత విప్లవకరవర్గమనీ, చాల ముందుకు పోయిన వర్గమనీ, నరోడ్నిక్కులు అర్థంచేసుకోలేదు.

జారుప్రభుత్వంపై పోరాడేందుకు రైతులను పురికొల్ప డానికి మొదట నరోడ్నిక్కులు ప్రయత్నించారు. ఇది దృష్టిలో వుంచుకొని, యువకులైన విప్లవ మేధావులు "ప్రజల వద్దకు" వెళ్ళుతున్నామనే పేరుతో రైతు వేషాలు ధరించి గ్రామ సీమల వెంటబడ్డారు. 'నరోడ్' అంటే ప్రజలు. ఈ పదం నుండే 'నరోడ్నిక్' అనేమాట కూడావచ్చింది. కాని రైతులు వారిని సమర్థించలేదు. కారణం, వారికి రైతులంటే సరియైన జ్ఞానమూ లేదు; రైతులను వారు సరిగా అర్థమూ చేసుకో లేదు. వారిలో అధికభాగాన్ని పోలీసులు అరెస్టు చేశారు. దీనిమీదట, ఒంటరిగానే, ప్రజలులేకుండానే తామే స్వయంగా జారు నిరంకుశ ప్రభుత్వంతో పోరాటం సాగించాలని నరో డ్నిక్‌లు నిశ్చయించుకొన్నారు. ఇది మరింత తీవ్రమైన తప్పులు చేయడానికి దారితీసింది.

ఒక రహస్య నరోడ్నిక్ సంఘం స్థాపించారు. దీనిని "నరోడ్నయా వాల్యా" (Nordnaya Volya) అనేవారు. అంటే "ప్రజాభీష్టం" అని దీని అర్థం. ఈ సంఘం జారును హత్యచేయడానికి కుట్ర పన్నింది. 1881 మార్చి 1వ తేదీన, "నరోడ్నయా వాల్యా" సభ్యులు బాంబుతో రెండవ అలెగ్జాండర్‌ను (జార్‌ను) చంపేశారు. కాని ప్రజలకు దీనివల్ల కలిగిన మేలు ఏ మాత్రం లేదు. వ్యక్తులను హత్యచేయుటవల్ల జార్ నిరంకుశ ప్రభుత్వాన్ని కూలద్రోయుట, భూస్వామ్య వర్గాన్ని రద్దుచేయుట సాధ్యంకాదు. హత్య కావించబడిన జార్ స్థానే మరొకడు వచ్చాడు. అతడు మూడవ అలెగ్జాండరు. అతని పరిపాలనలో రైతుల కూలీల పరిస్థితులు మరింత అధ్వాన్నమయాయి.

నరోడ్నిక్‌లు జార్ ప్రభుత్వాన్ని ఎదుర్కోడానికి అవలంబించిన పద్ధతి – అనగా వ్యక్తుల హత్య వ్యక్తిగత హింసాకాండ (టెర్రరిజం) తప్పు. విప్లవానికిహానికరమైనది. ఉత్సాహభరితులైన 'వీరులు' అనీ, నిస్తబ్ధులైన 'గుంపు' అనీ – ఇలా ప్రజలను నరోడ్నిక్‌లు విభజించారు. 'వీరులే' ఏవో అద్భుత సాహసకృత్యాలు చేస్తారని ఆ 'గుంపు' ఎదురు చూస్తుందని కూడా వారి భావం. ఈ తప్పుడు సిద్ధాంతంపైననే వ్యక్తిగత హింసాకాండ విధానం ఆధారపడింది. ప్రముఖ వ్యక్తులే చరిత్రను నిర్మించుతారనీ, ప్రజలు, జనసామాన్యం, వర్గం, 'గుంపు'(నరోడ్నిక్ రచయితలు తృణీకారభావంతో పైవిధంగా ప్రజను పిలిచేవారు) చైతన్యవంతమయిన సంఘటిత కార్యకలాపాలు చేయ సామర్థ్యం కలవారు కారనీ, 'వీరులను' గ్రుడ్డిగా అనుసరించుతారనీ, నరోడ్నిక్‌ల తప్పుడు సిద్ధాంతం

తెలియజేసేది. ఈ కారణంచేత రైతాంగంలోను కార్మికవర్గం లోను నరోడ్నిక్‌లు ప్రజా విప్లవ కార్యకలాపాలను వదలి వేశారు. వ్యక్తిగత హత్యాకాండకు దిగారు. ఆ కాలంలో చాలా ప్రముఖ విప్లవకారులలో ఒకడైన స్టెపాన్ ఖాల్టూరిన్ (Stepan Khalturin)ను, విప్లవ కార్మిక సంఘ నిర్మాణాన్ని వదలి, పూర్తిగా హింసావాదానికి (టెర్రరిజం)అతని కాలాన్ని వినియోగించ వలసిందని నరోడ్నిక్‌లు ప్రేరేపించి జయం పొందారు.

దోపిడిగాండ్రవర్గానికి ప్రాతినిధ్యం వహించిన వ్యక్తుల ఈ హత్యలు, విప్లవానికి ఏమీ లాభకరంగావు. మొత్తం దోపిడీవర్గానికి వ్యతిరేకంగా సాగించవలసిన పోరాటంనుండి, కార్మిక ప్రజల దృష్టిని, ఈ హత్యలద్వారా నరోడ్నిక్‌లు మరో ప్రక్కకు మరల్చారు. కార్మికవర్గ, రైతాంగాల విప్లవచొరవను, చురుకుదనాన్ని పెంపొందకుండా వారు అడ్డుతగిలారు.

విప్లవంలో తమ నాయకత్వ పాత్రను అర్థం చేసుకొనకుండా, కార్మికవర్గానికి నరోడ్నిక్‌లు అడ్డుతగిలారు. కార్మికవర్గ స్వతంత్ర పార్టీ నిర్మింపబడకుండా వారు ప్రతిబంధం కల్పించారు.

నరోడ్నిక్‌ల రహస్య నిర్మాణాన్ని జార్ ప్రభుత్వం నాశనం చేసినప్పటికీ, విప్లవ భావాలుగల మేధావులలో నరోడ్నిక్ భావాలు చాలకాలంవరకు నిలిచియున్నాయి. మిగిలిపోయిన నరోడిక్కులు రష్యాలో మార్క్సిజం వ్యాప్తి చెందకుండా తీవ్రంగా ప్రతిఘటించారు. కార్మికవర్గ నిర్మాణానికి అడ్డుతగిలారు.

అందుచేత నరోడ్నిజంను ఎదుర్కొనుటద్వారానే, రష్యాలో మార్క్సిజం పెంపొంది బలాన్ని సంపాదించుకో గల్గింది.

నరోడ్నిక్‌ల తప్పుడు భావాలపైన "కార్మిక విమోచనా సమితి" వారు దండయాత్ర ప్రారంభించారు. వారి పోరాట పద్ధతులు, భావాలు కార్మికవర్గ ఉద్యమానికి ఎంత ఎక్కువగా హాని కల్గించుతున్నాయో "కార్మిక విమోచనా సమితి" నిరూపించింది.

నరోడ్నిక్‌లు తాము సోషలిస్టులమని చెప్పుకొన్నప్పటికీ వారి భావాలకూ శాస్త్రీయ సోషలిజానికీ ఎట్టి సంబంధమూ లేదని, నరోడ్నిక్‌లను విమర్శిస్తూ వ్రాసిన తన రచనలలో ప్లెఖనావ్ తెలియజేశాడు.

నరోడ్నిక్‌ల తప్పుడు భావాలపైన మొట్టమొదటిసారిగా మార్క్సిస్టు విమర్శన చేసినది ప్లెఖనావ్. నరోడ్నిక్ భావాలపై సూటిగా గురిచూసి దెబ్బలు కొట్టడమేగాక, మార్క్సిస్టు భావాలను ప్లెఖనావ్ అత్యద్భుతంగా సమర్థించాడు.

ప్లెఖనావ్ చేతిలో నాశనమయ్యేటట్లు చావుదెబ్బలు తిన్న నరోడ్నిక్‌ల ముఖ్యమైన తప్పిదా లేమిటి?

మొదటిది: రష్యాలో పెట్టుబడిదారీ విధానం 'యాదృచ్ఛికంగా' వచ్చినదనీ, అదివృద్ధికాజాలదనీ, అందుచే శ్రామిక వర్గం పెరిగి పెద్దదికాదనీ నరోడ్నిక్‌లు వాదించారు.

రెండవది: విప్లవంలో అగ్రగామిగా నిల్చేది కార్మిక వర్గమని నరోడ్నిక్‌లు భావించేవారుకారు. శ్రామికవర్గం లేకుండానే సోషలిజం సాధించవచ్చునని వారు కలలు గన్నారు.

మేధావివర్గంచే నడుపబడే రైతాంగం ప్రధాన విప్లవ శక్తియనీ, రైతాంగ కమ్యూన్* సోషలిజానికి బీజమూ పునాదీ అనీ, వారు భావించసాగారు.

మూడవది: యావత్ మానవ చరిత్ర పరిణామాన్ని గురించి కూడా, నరోడ్నిక్‌లకు గల దృష్టి తప్పుమదీ హానికరమైనదీ. సమాజంయొక్క ఆర్థిక రాజకీయ అభివృద్ధి సూత్రాలు వారికి తెలియనూ తెలియవు - అర్థం చేసుకోనూ లేదు. ఈ విషయంలో వారు పూర్తిగా వెనకబడ్డారు. వారి దృష్టిలో చరిత్రను నిర్మించేది వర్గాలు గాని, వర్గ పోరాటాలు గాని కాదు. కాని జనసామాన్యం, 'గుంపు', ప్రజలు, వర్గాలు గ్రుడ్డిగా ఎవరిని అనుసరిస్తారో ఆ ముఖ్య వ్యక్తులచేత - వీరులచేత- చరిత్ర నిర్మింప బడుతుందట.

నరోడ్నిక్‌ల తప్పులను బట్ట బయలు చేస్తూ, వారిని ఎదుర్కొంటూ, ప్లెఖనావ్ అనేక మార్క్సిస్టు రచనలు గావించాడు. అవి రష్యాలోని మార్క్సిస్టులకు తర్ఫీదునిచ్చి విద్యావంతుల చేయుటలో సాధనా లయినాయి. రష్యాలో మార్క్సిజం విజయవంత మవడానికి త్రోవదీసిన అతని గ్రంథాలలో కొన్ని ఇవి: "సోషలిజమూ, రాజకీయ పోరాటమూ" (Socialism and Political Struggle) "మా విభేదాలు" (Our differences), "చరిత్ర అంటే ఒక వీరుల చరిత్రయే అన్న అభిప్రాయ అభివృద్ధిపైన" (On the development of the monostic view of History).

---

* రైతాంగ కమ్యూన్ అంటే రైతాంగ స్వయం సంపూర్ణ ఆర్థిక విధానం. రష్యాలో పూర్వం గ్రామాలలో ఈ విధానం వుండేది.

— అనువాదకుడు

ప్లెఖనావ్ తన రచనల్లో మార్క్సిజం యొక్క మూల సూత్రాలను వివరించాడు. అందులో ఈ కడపటి గ్రంథం ప్రత్యేకంగా ప్రాముఖ్యమైనది. అది 1895 లో ప్రచురించబడి నది. "ఒక తరానికి చెందిన రష్యన్ మార్క్సిస్టులను ఇదిసృష్టిం చింది" అని లెనిన్ అన్నాడు.

(లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్, 14 వ వాల్యూం, 347 వ పేజీ)

రష్యాలో పెట్టుబడిదారీ విధానం వృద్ధి చెందాలా లేదా? — ఈ విధంగా నరోడ్నిక్‌లు ప్రశ్నించడం అర్థ రహిత మని, నరోడ్నిక్‌లకు వ్యతిరేకంగా ఉద్దేశించివ్రాసిన వ్రాతల్లో, ప్లెఖనావ్ నిరూపించాడు. వాస్తవానికి రష్యా అప్పటికే పెట్టుబడిదారీ విధాన మార్గంలో ప్రవేశించినదనీ; రష్యాను ఆ మార్గంనుండి తప్పించగల శక్తి ఏదీ లేదనీ ప్లెఖ నావ్ తెలియజేశాడు. దీనిని నిరూపించడానికి అవసరమైన విషయాలను పేర్కొన్నాడు.

రష్యాలో విప్లవకారుల కర్తవ్యం పెట్టుబడిదారీ విధా నాభివృద్ధిని అరికట్టడంకాదు - అది ఎలాగూ వారు చేయలేరు కూడా. పెట్టుబడిదారీ విధానాభివృద్ధి మూలంగా ఉనికిలోకి వచ్చిన బలోపేతమైన విప్లవశక్తియైన కార్మికవర్గ సహాయాన్ని సంపాదించడం, దాని వర్గచైతన్యాన్ని పెంపొందించడం, దాన్ని సంఘటిత పరచడం - తన స్వంతవర్గ పార్టీని నిర్మించుకోడంలో దానికి సహాయపడటం వారి కర్తవ్యం.

విప్లవ పోరాటంలో శ్రామికవర్గం నాయకపాత్ర వహించుతుందనే విషయాన్ని నరోడ్నిక్‌లు తిరస్కరించారు.

ఈ రెండవ గొప్పతప్పిదాన్నికూడ ప్లెఖనావ్ తుత్తునియలు చేశాడు. రష్యాలో శ్రామికవర్గం తలయెత్తడం ఏదో "చారిత్రకంగా సంభవించిన దురదృష్టం" అని నరోడ్నిక్‌లు భావించేవారు. "శ్రామికవర్గ తత్వం ఒకరాచపుండు" అని అనేవారు. మార్క్సిస్టు ఉపదేశాలను పూర్తిగా సమర్థించుతూ ప్లెఖనావ్ అవి రష్యాలో పూర్తిగా అనువర్తింపజేయ వీలుకల్గినవేనని నిరూపించాడు. సంఖ్యారీత్యా రైతాంగం అత్యధికంగా వున్నప్పటికీ, రైతాంగంతో పోల్చి చూచినపుడు శ్రామికవర్గం సంఖ్య స్వల్పమైనప్పటికీ, విప్లవకారులెప్పుడూ ముఖ్యంగా తమ ఆశలను శ్రామికవర్గంపైనా దాని అభివృద్ధిపైనా పెట్టుకోవాలి.

శ్రామిక వర్గంపైననే ఎందుకు ఆశపెట్టుకోవాలి ?

ఎంచేతనంటే, శ్రామికవర్గం ఇంకా సంఖ్యారీత్యా చిన్నదయినప్పటికీ, చాలాముందుకు వెళ్ళిన ఆర్థిక విధానంతో, విస్తారప్రమాణ ఉత్పత్తితో (Large-scale production) సంబంధం కల్గిన వర్గమది. అందుచే దానికి మంచి భవిష్యత్తు వుంది.

ఎంచేతనంటే, శ్రామికవర్గం ఒకవర్గంగా ప్రతిసంవత్సరం పెరుగుతూవుంది; రాజకీయంగా అభివృద్ధి చెందుతూంది. విస్తార ప్రమాణ ఉత్పత్తి (Large-scale production) లో ఉండే కార్మిక పరిస్థితులవల్ల దానిని సంఘటితపరచడం సులభసాధ్యం. శ్రామికవర్గానికి విప్లవంలో పోయేది సంకెళ్లుతప్ప మరేదీ లేదు. అందుచే తన శ్రామికవర్గ స్థాయినిబట్టి అదిచాలా విప్లవకర వర్గం.

ఇక రైతాంగ విషయమా ? అది వేరు.

రైతాంగం (అంటే వ్యష్టిగా వ్యవసాయం చేసుకొనే వ్యక్తిగత రైతులని ఇక్కడ అర్థం - సంపాదకుడు.) అధికసంఖ్య కలదయినప్పటికీ, అది బాగా వెనుకబడ్డ ఆర్థికవిధానంతో, స్వల్పప్రమాణోత్పత్తితో సంబంధం కలిగిన కష్టజీవివర్గం. అందుచే దానికి గొప్ప భవిష్యత్తు ఏదీ ఉండదూ; ఉండబోదు.

ఒక వర్గంగా రైతాంగం పెరగక పోవడమే గాక, అది మరింత మరింత చీలిపోసాగింది. బూర్జువా రైతులుగా (కులక్ లేక ధనిక రైతులుగా), బీదరైతులుగా (శ్రామికులు, అర్థ - శ్రామికులుగా) చీలిపోసాగింది. ఇంతేగాక రైతాంగం చెల్లా చెదరుగా వుండటంవల్ల, శ్రామిక వర్గంవలె సులభంగా నిర్మాణం వైపుకు మొగ్గదు. రైతాంగం చిన్నచిన్న స్వంత ఆస్తి పరులవడం వలన, శ్రామికవర్గంవలె వెంటనే విప్లవోద్యమంలో చేరడానికి ఇష్టపడదు.

రష్యాలో సోషలిజం శ్రామికవర్గ నియంతృత్వంద్వారా రాదని, సోషలిజానికి బీజమూ పునాదీ అయిన రైతాంగ కమ్యూన్ ద్వారానే వస్తుందనీ, నరోడ్నిక్‌లు వాదించుతూ వచ్చారు. కాని రైతాంగ కమ్యూన్ సోషలిజానికి బీజమూ కాదు; ప్రాతిపదికా కాదు; కాజాలదు. ఎందుచేతనంటే, కమ్యూన్ అంతా కులక్‌ల పెత్తనం క్రింద వుంది. ఈ కులక్‌లు బీద రైతులను, వ్యవసాయ కూలీలను, ఆర్థికంగా బలహీనులయిన మధ్యతరగతి రైతులను దోపిడి చేసి వారి రక్తాన్ని పీల్చి పిప్పిచేస్తున్నారు. నామ మాత్రమైన సమిష్టి భూ యజమాన్యం (Communal Land Owner-ship) గానీ, రైతు కుటుంబంలోని మనుష్యుల సంఖ్య ననుసరించి అప్పుడప్పుడు

జరిగే భూమి పునర్విభజన గాని, ఏవిధంగాను పరిస్థితిలో మార్పును తీసుకురాలేదు. సాగుచేయడానికి అవసరమైన పశువులు, సాధనాలు, విత్తనాలు కలిగిన స్థితిపరులైన మధ్యతరగతి రైతులు, కులక్ లయిన కమ్యూన్ సభ్యులు భూమిని ఉపయోగించుకొంటూ వుండేవారు. గుర్రాలులేని రైతులు, బీదరైతులు, చిన్నచిన్న రైతులు సాధారణంగా తమ భూమిని కులక్‌లకు అప్పగించి, తాము వ్యవసాయ కూలీలుగా శరీర కష్టాన్ని అమ్ముకోవలసి వచ్చేది. వాస్తవానికి కులక్‌లు తమ పెత్తనం కప్పిపుచ్చుకోడానికి అనుకూలమైన సాధనం రైతు కమ్యూన్. ఇంతేగాదు. జారు ప్రభుత్వం, రైతులనుండి పన్నులను సమిష్టి బాధ్యత పేరిట వసూలు చేసుకోడానికి, అనుకూలమైన- ఖర్చులేని - సాధనంగా కమ్యూన్ ఉపయోగపడింది. అందుచేతనే రైతు కమ్యూన్‌ను జార్ ప్రభుత్వం యధాతధంగా వుంచింది. ఇలాంటి స్వభావంగల కమ్యూన్‌ను సోషలిజంయొక్క బీజంగాగానీ, ప్రాతిపదికగా గాని భావించడం అర్థంలేని విషయం.

ప్రధానమైన తప్పులలో మూడవది ఈ క్రిందిది: "వీరులు", మహోన్నత వ్యక్తులూ, వారి భావాలూ సామాజికాభివృద్ధిలో ప్రధాన పాత్ర వహించుతాయనీ; ప్రజా సామాన్యం, "గుంపులు", ప్రజలు, వర్గాలూ - వీరి పాత్ర సామాజికాభివృద్ధిలో లెక్కించ వీలులేనిదనీ, నరోడ్నిక్‌ల వాదన. ప్లెఖనావ్ ఈ వాదనను తుత్తునియలు చేశాడు. ఈ వాదన భావవాదం (ఐడియలిజం - స్థూల ప్రపంచం కల్ల అనే వాదం) అనీ, దీనిలో సత్యంలేదనీ, మార్క్స్, ఎంగెల్సులు

బోధించిన భౌతికవాదం (మెటీరియలిజం)లోనే సత్యమున్నదని ప్లెఖనావ్ నిరూపించాడు.

ప్లెఖనావ్ మార్క్సిస్టు భౌతికవాదాన్ని భాష్యీకరించి, అది సత్యమని సోదాహరణంగా నిరూపించాడు. మార్క్సిస్టు భౌతికవాదాన్ని సమర్థిస్తూ ప్లెఖనావ్ ఇలా వాదించాడు: దీర్ఘకాల దృష్టితో చూస్తే, సామాజికాభివృద్ధి, మహోన్నత వ్యక్తుల అభిప్రాయాల, కోర్కెల, భావాల ననుసరించి నిర్ణయింపబడదు. అమలులోనున్న సమాజ భౌతిక పరిస్థితుల అభివృద్ధి ననుసరించీ, సమాజ అస్తిత్వానికి కావలసిన భౌతిక వస్తువుల ఉత్పత్తి విధానంలో మార్పుల ననుసరించీ నిర్ణయింపబడుతుంది. భౌతిక వస్తువుల ఉత్పత్తి విధానంలో వర్గాల యొక్క పరస్పర సంబంధాలలోని మార్పుల ననుసరించీ, భౌతిక వస్తువుల ఉత్పత్తి పంపకాలలో తమ స్థానమూ స్థాయీ ఏమిటో నిర్ణయించుకొనేందుకు ఆయా వర్గాలు జరిపే ఘర్షణ ననుసరించీ, సామాజికాభివృద్ధి నిర్ణయింపబడుతుంది. మానవుల సామాజిక ఆర్థికస్థాయిని నిర్ణయించునది భావాలు కావు. కాని మానవుల సామాజిక ఆర్థికస్థాయియే వారి భావాలను నిర్ణయించుతుంది. సమాజ ఆర్థికాభివృద్ధికీ, అగ్రగామి వర్గం యొక్క అవసరాలకూ ప్రతికూలంగా, మహోన్నత వ్యక్తుల అభిప్రాయాలు కోర్కెలు గనుక నడిచిన పక్షంలో, వారు అనామకులై పోవచ్చు. అలాగే, ఆ మహోన్నత వ్యక్తుల అభిప్రాయాలూ కోర్కెలూ సమాజాభివృద్ధి యొక్క అవసరాలను, అగ్రగామిగా నిలిచే వర్గంయొక్క అవసరాలను, సరిగా వెల్లడి చేసినట్లయితే – వారు నిజంగానే మహోన్నత వ్యక్తులు కావచ్చు.

ప్రజాసామాన్యం వట్టి 'గుంపు' తప్ప మరేమీకాదనీ, వీరులే చరిత్రను నిర్మించుతారనీ, 'గుంపును' ప్రజలుగా వీరులే మారుస్తారనీ వాదించే నరోడ్నిక్‌లను జవాబుగా మార్క్సిస్టులు ఇలా వాదించారు: చరిత్రను నిర్మించేది వీరులు కాదు. చరిత్రయే వీరుల్ని నిర్మిస్తుంది. అందుచేత ఒక ప్రజను (జాతిని—అనువాదకుడు) సృష్టించేది వీరులుకాదు. ప్రజయే వీరులను సృష్టించి, చరిత్రను ముందుకు నెడుతుంది. సమాజాభివృద్ధియొక్క పరిస్థితులను సరిగా అర్థంచేసుకొనగలిగినంతవరకు, ఇంకా బాగా మార్చగలిగినంతవరకు మాత్రమే, సామాజిక జీవితంలో వీరులూ మహోన్నతవ్యక్తులూ ప్రముఖపాత్ర వహించవచ్చు. అలాగాక సామాజికాభివృద్ధి పరిస్థితులను సరిగా అర్థంచేసుకొనకపోయినట్లైతే, తామే చరిత్ర 'నిర్మాతల' మనే అహంభావంతో సమాజంయొక్క చారిత్రికావసరాలను విరుద్ధంగా నడిచినట్లయితే, ఆ మహోన్నత వ్యక్తులు, వీరులు పరిహాసాస్పదులౌతారు. వట్టి నిష్ప్రయోజకులు అవుతారు.

దురదృష్టజాతక వీరులయిన ఈ రకానికే నరోడ్నిక్‌లు చెందుతారు.

నరోడ్నిక్‌లపై ప్లెఖనావ్ సాగించిన పోరాటమూ, ప్లెఖనావ్ వ్రాతలూ విప్లవ మేధావులలో నరోడ్నిక్‌ల పలుకుబడిని పూర్తిగా నాశనం గావించాయి. అయినప్పటికీ సిద్ధాంత రీత్యా నరోడిజాన్ని నాశనంచేయడం ఇంకా పూర్తికాలేదు. మార్క్సిజానికి శత్రువగు నరోడిజాన్ని ఆఖరు దెబ్బగొట్టడం లెనిన్‌వంతు అయింది.

"నరోడ్నయావాల్యా" పార్టీని అణచివేసిన పిదప, నరోడ్నిక్‌లలో ఎక్కువమంది జారు ప్రభుత్వంపై విప్లవ పోరా

టాన్ని వదులు కొన్నారు. జారు ప్రభుత్వంతో సమాధానపడి ఒడంబడికకు రావాలనే విధానాన్ని బోధించ మొదలు బెట్టారు. 1880 – 90 ప్రాంతాలలో కులక్‌ల ప్రయోజనాలను నరోడ్నిక్‌లు వెలిబుచ్చ మొదలు బెట్టారు.

'కార్మిక విమోచనా సమితి', రష్యన్ సోషల్–డెమాక్రేట్ల కోసం, రెండు కార్యక్రమ ముసాయిదాలను (Drafts) తయారు చేసింది. (మొదటిది 1884 లో, రెండవది 1887 లో) రష్యాలో మార్క్సిస్టు – సోషల్ – డెమాక్రటిక్ పార్టీ ఏర్పడ టానికి, ఇది చాల ముఖ్యమైన ప్రారంభ ప్రయత్నం.

కాని 'కార్మిక విమోచనా సమితి' చాలా తీవ్రమైన తప్పులను కూడా చేయకపోలేదు. దాని మొదటి ముసాయిదాలో ఇంకా నరోడ్నిక్ భావాల ముద్ర లున్నాయి. అది వ్యక్తిగత దౌర్జన్యపు ఎత్తుగడలను ఆచరణలో సమర్థించింది. ఇంతేగాక, విప్లవ గమనంలో రైతాంగాన్ని శ్రామిక వర్గమే నడిపించుతుందనీ, నడిపించాలనీ, రైతాంగ సమ్మేళనంతోనే శ్రామిక వర్గం జార్ ప్రభుత్వంపై విజయాన్ని సాధించగలదనీ ప్లెఖనావ్ గమనించలేక పోయాడు. విప్లవానికి అండను – నిలకడలేని అండ అయినప్పటికీ – ఇవ్వగల శక్తి లిబరల్ బూర్జువా యని ప్లెఖనావ్ భావించాడు. కాని రైతాంగాన్ని పూర్తిగా ప్లెఖనావ్ లెక్కలోకి తీసుకోలేదు. ఉదాహరణకు అతని వ్రాతలలో,

"బూర్జువావర్గం, శ్రామికవర్గం – ఈ రెండూ తప్ప – విప్లవ సమ్మేళనానికిగాని, లేక ప్రతికూల సమ్మేళనానికిగాని సహాయపడగల శక్తులేవీ లేవు" అని అన్నాడు.

(ప్లెఖనావ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్, మూడవ వాల్యూం 119వ పేజీ)

ఈ తప్పుడు భావాలే తర్వాత మైఖనావ్ చూపిన మెన్షివిక్ భావాలకు అంకురాలు.

ఆనాటి 'కార్మిక విమోచనా సమతి'కి గాని ఆ కాలపు మార్క్సిస్టు సమితులకు (సర్కిల్సు)గాని, కార్మికవర్గ ఉద్యమంతో ప్రత్యక్ష సంబంధం ఏమీలేదు. మార్క్సిస్టు సిద్ధాంతం మార్క్సిస్టు భావాలు, సోషల్ - డెమాక్రటిక్ కార్యక్రమ సూత్రాలు రష్యాలో అప్పుడే తలయెత్తి కాలూనుకొంటు న్నాయి. 1884 - 94 మధ్య పదేండ్ల కాలంలోనూ, కార్మిక వర్గ ప్రజాఉద్యమంతో సంబంధం లేనేలేని - ఉన్నా చాలా స్వల్పంగా వున్న - సోషల్ డెమాక్రటిక్ వుద్యమం, చిన్నచిన్న ప్రత్యేక కేంద్రాలుగాను, సమితులుగాను, గ్రూపులుగాను, సర్కిల్సుగాను వుండేది. మాతృగర్భంలో వృద్ధి పొందుతూ ఇంకా జన్మించని శిశువులాగా, సోషల్ డెమాక్రటిక్ ఉద్యమం "గర్భస్థ శిశువు అవస్థ"లో (Process of foctal development) వుందని లెనిన్ వ్రాశాడు.

"సోషల్ డెమాక్రటిక్ ఉద్యమానికి సిద్ధాంతరీత్యా పునాదిని మాత్రమే 'కార్మిక విమోచనా సమితి' వేసిందనీ, కార్మికవర్గ ఉద్యమంవైపుకు మొదటి అడుగు మాత్రమే వేసిందనీ" లెనిన్ వ్రాశాడు.

రష్యాలో మార్క్సిజాన్ని కార్మికోద్యమాన్ని ఐక్య పరచే కర్తవ్యమూ, "కార్మిక విమోచనా సమితి" తప్పులను దిద్దే కర్తవ్యమూ లెనిన్‌పై బడింది.

# 3

## లెనిన్ విప్లవ కార్యకలాపాల ప్రారంభం - సెంట్‌పీటర్స్‌బర్గ్ 'కార్మికవర్గ విమోచనా పోరాట సంఘం' స్థాపన.

వ్లాడిమిర్ ఇల్యిచ్ యుల్యనావ్ (లెనిన్) బోల్షివిక్ సిద్ధాంత సంస్థాపకుడు. ఈయన సింబిర్స్క్ (Simbirsk - ఇప్పుడు దీనిని యుల్యనావస్క్ అని పిలుస్తారు) లో 18,0 లో జన్మించాడు. లెనిన్ 1887 లో కజాన్ యూనివర్సిటీలో ప్రవేశించాడు. కాని త్వరలోనే విప్లవ విద్యార్థి ఉద్యమంలో పాల్గొంటున్నందుకు గాను అరెస్టుచేసి అక్కడనుండి వెళ్ళ గొట్టారు. కజాన్ యూనివర్సిటీలో ఫెడోసియెవ్ (Fedoseyev) అనునతడు ఏర్పరచిన మార్క్సిస్టు సమితిలో లెనిన్ చేరాడు. తర్వాత లెనిన్ సమారా (Samara) పట్టణానికి వెళ్లాడు. ఆ పట్టణంలో మొట్టమొదటిసారిగా మార్క్సిస్టు సమితి ఏర్పడింది. దానిలో ప్రధానవ్యక్తి లెనినే. ఆరోజులకే లెనిన్, మార్క్సిజంలో తనకుగల సంపూర్ణ విజ్ఞానంతో ప్రతి వారినీ ఆశ్చర్య పరిచాడు.

1893 సంవత్సరాంతంలో లెనిన్, సెంట్‌పీటర్స్‌బర్గ్‌కు మారాడు. ఆ పట్టణ మార్క్సిస్టు సమితిలోని అతని ప్రథమ ప్రసంగమే, తోటిసభ్యులలో గాఢమైన సదభిప్రాయం కల్గించింది. మార్క్సును గురించి అతనికిగల అసాధారణ విజ్ఞానమూ, ఆకాలంలో రష్యాలోని ఆర్థిక రాజకీయ పరిస్థితులకు మార్క్సిజాన్ని అన్వయించడంలోగల అతనిసామర్థ్యమూ, కార్మికఆశయ విజయంలో అతనికిగల మనఃపూర్వకమైన అచంచల విశ్వాసమూ, ఆర్గనైజరుగా (ఉద్యమ సంఘటనాకర్త) అతనికిగల అసాధారణ చాతుర్యమూ, లెనిన్‌ను సెంట్‌పీటర్స్‌బర్గ్ మార్క్సిస్టులచే గుర్తించబడిన నాయకునిగా చేశాయి.

మార్క్సిస్టు సమితులలో తనవద్ద అధ్యయనం చేసే రాజకీయంగా అభివృద్ధిచెందిన కార్మికుల గాఢ సౌహార్దతను లెనిన్ చూరగొన్నాడు.

బబూష్కిన్ అనే కార్మికుడు ఆనాటి కార్మిక సమితుల లోని లెనిన్ బోధనా కార్యకలాపాలను జ్ఞాపకంచేస్తూ ఇలా అన్నాడు: "ఆ ఉపన్యాసాలు చాలా ఉత్సాహంగానూ సజీవంగానూ ఉండేవి. మేమంతా ఆ ఉపన్యాసాలకు చాలా సంతసించేవాళ్ళం. మా ఉపన్యాసకుని (లెనిన్) తెలివితేటలను నిరంతరం ప్రశంసించేవారం."

సెంట్ పీటర్స్‌బర్గ్‌లో ఆగోజుల్లో సుమారు 20 మార్క్సిస్టు కార్మిక సమితులుండేవి. వాటి నన్నిటినీ 1895 లో లెనిన్ ఒక్కటిగా కలిపి, "కార్మిక వర్గ విమోచనా పోరాట సంఘం"(League of struggle for the Emancipation of the working class) గా మార్చాడు. ఆ విధంగా విప్లవ

మార్క్సిస్టు కార్మికపార్టీ సంస్థాపనకు లెనిన్ మార్గం సుగమం చేశాడు.

కార్మిక వర్గ జన సామాన్య ఉద్యమంతో సన్నిహిత సంబంధాలు పెట్టుకోవలసిన కర్తవ్యాన్ని, దానికి రాజకీయ నాయకత్వాన్ని ఇవ్వవలసిన ఆవశ్యకతనూ, లెనిన్ "కార్మికవర్గ విమోచనా పోరాట సంఘం" ముందు పెట్టాడు. ప్రచార కేంద్రాలలో సమావేశమైనట్టి రాజకీయంగా అభివృద్ధి చెందిన కొద్దిమంది కార్మికులలో మార్క్సిజం ప్రచారం చేసేదశనుండి ఆనాటి సమస్యలపై కార్మికవర్గ ప్రజాబాహుళ్యంలో రాజకీయ ఆందోళన చేసే దశకు పొమ్మని లెనిన్ సూచించాడు. ప్రజాందోళన వైపుకు మరలాలనే ఈ నిశ్చయం, రష్యాలో ఆతర్వాతి కార్మిక ఉద్యమాభివృద్ధికి అత్యంత ప్రాముఖ్యకరమైన విషయం.

1890 ప్రాంతాలలో పరిశ్రమలు మంచి వికాసదశలో వున్నాయి. కార్మికుల సంఖ్య హెచ్చుతూంది. కార్మికవర్గ ఉద్యమం నానాట బలపడుతోంది. 1895 - 99 సంవత్సరాల మధ్య, అసంపూర్ణమైన లెక్కల ననుసరించి, రెండు లక్షల ఇరువై యొక్క వేల (2,21,000) కార్మికులు సమ్మెలలో పాల్గొన్నారు. దేశ రాజకీయ జీవితంలో కార్మిక వుద్యమం ఒక ప్రధాన శక్తిగా తయారవుతోంది. విప్లవోద్యమంలో కార్మిక వర్గం ప్రధానపాత్ర వహించవలసి యుంటుంది - అని నరోద్నిక్ లతో మార్క్సిస్టులు పోరాడుతూ తెల్పినదృక్పథమే సరియైన దని తర్వాత ఘటనాక్రమం రుజువుచేసింది.

కార్మికులు ఆర్థికహక్కులకై సాగించే పోరాటాన్ని - అనగా తమ పరిస్థితులను బాగుచేయాలనీ, పని గంటలు తగ్గిం

చాలనీ, ఎక్కువ జీతాలు కావాలనీ కార్మికులు సాగించే పోరాటాన్ని - జార్ పై సాగించే రాజకీయ పోరాటంతో, లెనిన్ నాయకత్వాన 'కార్మికవర్గ విమోచనా పోరాట సంఘం' మిళితం చేసింది. పోరాట సంఘం, కార్మికులను రాజకీయంగా తర్ఫీదు చేయ ప్రారంభించింది.

లెనిన్ నాయకత్వాన సెంట్‌పీటర్స్‌బర్గులోని 'కార్మిక వర్గ విమోచన పోరాట సంఘమే' రష్యాలో కార్మికవర్గ ఉద్యమంలో సోషలిజాన్ని ఐక్యపరచడానికి పూనుకున్న మొదటి సంఘం. ఏదన్నా ఒక ఫ్యాక్టరీలో సమ్మె జరిగితే, పోరాట సంఘం తన సమితి (సర్కిల్) సభ్యుల ద్వారా ఆఫ్యాక్టరీలోని పరిస్థితులను క్షుణ్ణంగా తెలుసుకొనేది. వెంటనే కరపత్రాలను సోషలిస్టు నినాదాలను (proclamations) ప్రకటించేది. ఈ కరపత్రాలు యజమానులు కార్మికులను ఎలా పీడించు తున్నదీ తెలియపరచేవి. కార్మికులు తమ కోర్కెల కోసం ఎలా పోరాడాలో తెలియజేసేవి. కార్మికుల కోర్కెలేమిటో ప్రకటించేవి. పెట్టుబడిదారీ విధానంలోని రాచపుండు అనే నగ్నసత్యాన్ని అనగా కార్మికుల దారిద్ర్యాన్ని, రోజుకు 12 మొదలు 14 గంటలు దాకా పనిచేసే దుస్సహమైన జీవితాన్ని, ఎలాంటి హక్కులూ లేని వారి జీవితాన్ని, తేట తెల్లంగా యీ కరపత్రాలు తెలియజేసేవి. తగిన రాజకీయ కోర్కెలను (డిమాండ్స్)గూడా ఇవి తెలియపరచేవి. బబుష్కిన్ అనే కార్మికునితో కలిసి లెనిన్ 1894 సంవత్సరాంతాన, ఇలాంటి మొట్టమొదటి రాజకీయ ఆందోళనా కరపత్రాన్ని (Agitational leaflet) ప్రకటించాడు. ఆ రోజుల్లో పీటర్స్

బర్గ్ నగరంలో సెమ్యాన్నికావ్ పరిశ్రమలలో సమ్మెచేయుచున్న కార్మికులకు ఒక విజ్ఞప్తి ప్రకటించాడు. 1895 అనురాలు కాలం (అక్టోబరు డిసెంబరుల మధ్య కాలం)లో థారన్టన్ మిల్లులలో సమ్మెచేస్తున్న స్త్రీ పురుషకార్మికుల నుద్దేశించి ఒక కరపత్రాన్ని లెనిన్ వ్రాశాడు. ఈ మిల్లులు ఇంగ్లీషు వాళ్ళవి. వీళ్ళ మిల్లులనుండి లక్షలు, కోట్ల లాభాలు గడిస్తున్నారు. ఈ మిల్లులలో రోజుకు 14 గంటలు మించి పని చేయించేవారు. కాని అందులో నేత పనివానికి నెలకు జీతం దాదాపు 7 రూబుల్సు. ఈ సమ్మెలో కార్మికులు జయం పొందారు. 'పోరాట సంఘం' వివిధ ఫ్యాక్టరీలలోని కార్మికుల నుద్దేశించి అనేక కరపత్రాలను, విజ్ఞప్తులనూ అచ్చువేసింది. ప్రతి కరపత్రమూ కార్మికుల స్థైర్యాన్ని మరింత గట్టి పరచడానికి చాలా సహాయపడింది. సోషలిస్టులు తమను కాపాడుతున్నారని తమకు సహాయపడుతున్నారని కార్మికులు గ్రహించ మొదలు పెట్టారు.

1896 వేసవిలో, సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో పోరాటసంఘం నాయకత్వాన 30 వేల టెక్స్‌టైల్ కార్మికులసమ్మె జరిగింది. పనిచేసే గంటలు తగ్గించాలనేది ప్రధానమైన కోరిక. ఈసమ్మె ఒత్తిడి ఫలితంగా, జార్ ప్రభుత్వం 1897 జూన్ 2 వ తేదీన, రోజుకు $11\frac{1}{2}$ గంటలకన్న ఎక్కువపని చేయించరాదని ఒక శాసనం ప్రకటించవలసి వచ్చింది. దీనికి ముందు రోజుకు పని చేసే గంటలకు పరిమితిలేదు.

1895 డిసెంబరులో జార్ ప్రభుత్వం లెనిన్‌ను అరెస్టు చేసింది. కాని జైలులోకూడ లెనిన్ తన విప్లవ కార్యకలాపా

లను వదలిపెట్టలేదు. పోరాట సంఘానికి సలహానిచ్చి త్రోవ చూపేవాడు. దానికి కరపత్రాలు చిన్న పుస్తకాలు వ్రాసి పెట్టాడు. "సమ్మెలపైన", "జారు ప్రభుత్వానికి" అనే రెండు కరపత్రాలను వ్రాశాడు. రెండవ దానిలో జార్ ప్రభుత్వ క్రూర నిరంకుశత్వాన్ని బయటపెట్టాడు. జైలులోనే పార్టీ కార్యక్రమాన్నిగూడ తయారుచేశాడు. (ఒక వైద్యగ్రంథములో పంక్తికీ పంక్తికీ మధ్య పాలను కనపడని సిరాలాగ ఉపయోగించి వ్రాశేవాడు లెనిన్.)

రష్యాలోని ఇతర పట్టణాలలోను ప్రాంతాలలోను ఉన్న వివిధ సమితులు (సర్కిల్సు) ఇలాంటి పోరాట సంఘాలుగా సమ్మేళనవడానికి, సెంట్ పీటర్స్ బర్గ్ పోరాట సంఘం చాలా ప్రోత్సాహమిచ్చింది. 1890 - 1900 మధ్య ట్రాన్సకాకేషియాలో మార్క్సిస్టు సంస్థలు (ఆర్గనైజేషన్స) తలయెత్తాయి. 1894 లో మాస్కోలో ఒక కార్మికసంఘం ఏర్పడింది. 1890-1900 మధ్య సైబీరియాలో సోషల్ డెమాక్రటిక్ యూనియన్ ఏర్పడింది. 1890 - 1900 మధ్య ఇవనోవో - వొజ్నెసెన్స్క, యారోస్లావెల్, కొస్ట్రోమా, మొదలగుచోట్ల మార్క్సిస్టు అధ్యయన కేంద్రాలు (గ్రూపులు) ఏర్పడ్డాయి. తర్వాత ఇవి ఉత్తర సోషల్ డెమాక్రటిక్ పార్టీ యూనియన్‌లో కలిసిపోయాయి. 1895 - 1900 మధ్య రోస్టావ్ - ఆన్ - డాన్ (డాన్ నదీ తీరంలోని రోస్టావ్), ఎకాటెరినోస్లావ్, కీవ్, నికొలాయెవ్, తులా, సమారా, కజాన్, ఒరెఖోవో-జుయెవో ఇంకా తదితర పట్టణాలలో సోషల్ డెమాక్రటిక్ అధ్యయన కేంద్రాలు (గ్రూపులూ), సంఘాలూ (యూనియన్లూ) ఏర్పడ్డాయి.

పీటర్స్‌బర్గ్ "కార్మికవర్గ విమోచనా పోరాట సంఘం" యొక్క ప్రాముఖ్యతను లెనిన్ ఇలా తెలియజేశాడు: "కార్మికవర్గ ఉద్యమంచే బలపరచబడిన మొట్టమొదటి విప్లవ పార్టీ అంకురమే ఈ సంఘం."

రష్యాలో మార్క్సిస్టు సోషల్ డెమాక్రటిక్ పార్టీని ముందుముందు నిర్మించే కృషిలో, పీటర్స్‌బర్గ్ పోరాట సంఘం యొక్క విప్లవానుభవాన్ని లెనిన్ ఉపయోగించుకొన్నాడు.

లెనినూ, అతని సన్నిహిత సహచరులూ అరెస్టయిన తర్వాత పీటర్స్‌బర్గ్ పోరాట సంఘ నాయకత్వంలో చాల మార్పులు వచ్చాయి. కొత్తవాళ్లు వచ్చారు. వీరు తాము "యువకులమనీ", లెనినూ అతని అనుచరులూ "ముసలివాళ్లు" అనీ పిలిచేవారు. వీరు ఒక తప్పుడు రాజకీయ ధోరణిని అనుసరించారు. తమ యజమానులకు వ్యతిరేకంగా ఒక్క ఆర్థిక పోరాటాన్ని మాత్రమే సాగించాలని కార్మికులను ప్రబోధించాలని వీరన్నారు. రాజకీయ పోరాటం లిబరల్ బూర్జువా పనియట. రాజకీయ పోరాటానికి నాయకత్వం లిబరల్ బూర్జువాకే వదలివేయాలట.

వీరినే "ఎకనమిస్టులు" (ఆర్థికవాదులు) అని పిలిచేవారు.

రష్యాలోని మార్క్సిస్టు సంస్థల అనుచరులలో రాజీ బేరగాళ్ళ, అవకాశవాదుల మొట్టమొదటి ముఠా ఇదే.

# 4

నరోడిజం .. 'లీగల్ మార్క్సిజం'లపై లెనిన్ పోరాటం. కార్మిక కర్షక సమ్మేళనం గురించి లెనిన్ అభిప్రాయాలు. రష్యన్ సోషల్-డెమాక్రటిక్ లేబర్ పార్టీ ప్రథమ కాంగ్రెస్.

**1880** ప్రాంతాలలో నరోద్నిక్ భావనా విధానంపై ప్లెఖనావ్ ముఖ్యమైన దెబ్బకొట్టినా, 1890 ప్రాంతాలలో నరోద్నిక్ భావాలు ఇంకా కొంతమంది యువకులలో సానుభూతిని పొందగలిగాయి. పెట్టుబడిదారీ విధానాభివృద్ధి పంథాను రష్యా తప్పించుకోవచ్చనీ, విప్లవంలో ప్రధానపాత్ర వహించేది రైతాంగంకాని కార్మికవర్గంకాదనీ, వారిలో కొందరు ఇంకా వాదిస్తూవచ్చారు. ఇంకా మిగిలిపోయిన నరోద్నిక్‌లు, రష్యాలో మార్క్సిజం వ్యాపించకుండా అడ్డుపడటానికి తమ శక్తికొలదీ ప్రయత్నించారు. మార్క్సిస్టులతో పోరాడి, వారిని అన్నివిధాలా అప్రతిష్టపాలుచేయ ప్రయత్నించారు. మార్క్సిజం ఇంకా వ్యాపించాలంటే, సోషల్ - డెమాక్రటిక్ పార్టీ తప్పని

సరిగా నిర్మింపబడాలంటే, నరోడిజంను సిద్ధాంతరీత్యా పూర్తిగా నాశనంచేయాలిసి వుంది.

ఈ కర్తవ్యాన్ని లెనిన్ పూర్తి చేశాడు.

1894 లో లెనిన్, "ప్రజాస్నేహితు లెలాంటివారు? సోషల్ - డెమాక్రాట్లతో వారెలా పోరాడుతున్నారు?" అనే గ్రంథం వ్రాశాడు. దీనిలో నరోడ్నికుల నిజస్వభావాన్ని పూర్తిగా బయటపెట్టాడు. వారు ప్రజలకు "కపట స్నేహితులనీ", వాస్తవంలో ప్రజలకు విరుద్ధంగా పనిచేస్తున్నారని లెనిన్ తెలియజేశాడు.

ముఖ్యంగా, 1890 ప్రాంతాలనాటి నరోడ్నిక్‌లు, జార్ ప్రభుత్వ ప్రతికూల విప్లవపోరాటాన్ని ఎప్పుడో వదులుకొన్నారు. జార్ ప్రభుత్వంతో సమాధాన మార్గాన్ని లిబరల్ నరోడ్నిక్‌లు బోధించారు. ఆ కాలంలోని నరోడ్నిక్‌లను గురించి లెనిన్ ఇలా వ్రాశాడు: "ప్రభుత్వంతో తగినంత మర్యాదగాను విధేయతగాను వాదించితే ప్రతిదీ దానంతకదే చక్కబడుతుంది-అని నరోడ్నిక్‌ల భావం."

("ప్రజా స్నేహితులెట్టివారు? సోషల్ డెమాక్రేట్లతో వారెలా పోరాడుతున్నారు?" అనే లెనిన్ గ్రంథం. ఇంగ్లీష్ ఎడిషన్, మాస్కో. 1946, 157 వ పేజీ).

1890 ప్రాంతాలలోని నరోడ్నిక్‌లు, బీదరైతుల పరిస్థితులను, గ్రామసీమలోని వర్గ కలహాన్ని, బీదరైతులను కులక్‌లు దోపిడీ చేయుటనూ చూడ నిరాకరించారు.

కులకొల (ధనిక రైతుల) వ్యవసాయాభివృద్ధిని భట్రాజులలా కీర్తించారు. నిజం చెప్పాలంటే, వారు కులకొల ప్రయోజనాలనే వ్యక్తపరచారు.

దానితోపాటు నరోడ్నిక్‌లు తమ పత్రికలలో మార్క్సిస్టులపై దండయాత్ర ప్రారంభించారు. రష్యన్ మార్క్సిస్టుల అభిప్రాయాలను వారు బుద్ధిపూర్వకంగా తప్పుడు భాష్యాలు చేశారు. గ్రామసీమలను మార్క్సిస్టులు నాశనం చేయదలచుకొన్నారనీ, "ప్రతి రైతునూ ఫ్యాక్టరీ అండా (పాత్ర)లో ఉడకబెట్టదలచారనీ" ప్రచారం చేశారు. నరోడ్నిక్‌ల విమర్శనలోని తప్పుడువాదాన్ని లెనిన్ బయటపెట్టాడు. రష్యాలో పెట్టుబడిదారీవిధానం మార్క్సిస్టుల 'కోరిక'వల్ల పెరగడం లేదనీ; అక్కడ వాస్తవంగానే పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి చెందుతున్నదనీ; ఈ అభివృద్ధితోపాటు దానివెంటనే శ్రామిక వర్గంకూడా అనివార్యంగా పెరుగుతున్నదనీ, లెనిన్ తెలియజేశాడు. ఆ శ్రామికవర్గమే పెట్టుబడిదారీ విధానానికి గోరీ కట్టేదనికూడా లెనిన్ తెలియజేశాడు.

ప్రజలకు నిజమైన స్నేహితులు మార్క్సిస్టులు గాని నరోడ్నిక్‌లు కాదనీ, జార్ ప్రభుత్వాన్ని, పెట్టుబడిదారీ భూస్వామ్య బానిసత్వాన్ని కూలద్రోయదలచినది మార్క్సిస్టులేననీ, లెనిన్ నిరూపించాడు.

జార్ ప్రభుత్వాన్ని భూస్వాములను బూర్జువాను కూలద్రోయుటకు ప్రధానసాధనం కార్మిక రైతు విప్లవసమ్మేళనమే అన్న అభిప్రాయాన్ని, లెనిన్ మొట్టమొదటిసారిగా "ప్రజాస్నేహితులెట్టివారు" అనే తన గ్రంథములో తెలియజేశాడు.

ప్రధానమైన నరోడ్నిక్‌ల ముఠా "నరోడ్నియావాల్యా" అవలంబించిన రాజకీయ పోరాటపద్ధతులను, ఆ తర్వాత వారి వారసులు సోషలిస్టు-రివల్యూషనరీ లవలంబించిన రాజకీయ పోరాటపద్ధతులను, అందులో ముఖ్యంగా వ్యక్తిగత హింసావాదపు ఎత్తులు, లెనిన్ ఆకాలంలో వ్రాసిన అనేక వ్రాతలలో విమర్శించాడు. ఈ ఎత్తుగడలు ప్రజాసామాన్య పోరాటం స్థానే వ్యక్తిగతవీరుల పోరాటాన్ని తెచ్చిపెడుతున్నాయి కనుక విప్లవోద్యమానికి హానికరమని లెనిన్ భావించాడు. పై పద్ధతులు ప్రజల విప్లవోద్యమంలో నమ్మకం లేకపోవడాన్ని తెలియజేస్తున్నాయి.

"ప్రజాస్నేహితు లెట్టివారు?" అనే తన గ్రంథంలో లెనిన్. రష్యన్ మార్క్సిస్టుల ప్రధాన కర్తవ్యాలను స్పష్ట పరచాడు. ఐక్యత లేకుండావున్న వివిధ మార్క్సిస్టు సమితుల (సర్కిల్స్ నన్నిటినీ) ఒకే "ఐక్య సోషలిస్టు వర్కర్సు పార్టీ"గా కలపడం రష్యన్ మార్క్సిస్టుల మొదటి కర్తవ్యం అని లెనిన్ భావించాడు. లెనిన్ ఇంకా ఇలా తెలియజేశాడు: రష్యా కార్మిక వర్గం, రైతాంగ సమ్మేళనంతో జారు నిరంకుశ ప్రభుత్వాన్ని కూలద్రోస్తుంది. ఆ తర్వాత రష్యన్ శ్రామికవర్గం, పీడిత జనసామాన్యంతోనూ, కష్టజీవులతోనూ సమ్మేళనమై, యితర దేశాల శ్రామికవర్గంతో పాటు కమ్యూనిస్టు విప్లవ విజయానికై జరిగే బహిరంగ రాజకీయ పోరాట పంథాను, తిన్నగా అనుసరించుతుంది.

ఆ విధంగా 40 ఏండ్ల క్రితమే, లెనిన్ కార్మికవర్గానికి దాని పోరాట పంథా యేమిటో సరిగా చూపించాడు. సమా

జంలోకల్లా విప్లవకరశక్తి కార్మికవర్గమేననీ - రైతాంగం, కార్మికవర్గానికి సహాయకవర్గమనీ తెలియబరిచాడు.

నరోడ్నిజంకు వ్యతిరేకంగా లెనినూ, అతని అనుచరులూ 1890 ప్రాంతాలలో సాగించిన పోరాటఫలితంగా, నరోడ్నిక్‌ల సిద్ధాంతానికి పూర్తిగా అపజయం సంభవించింది.

'లీగల్ మార్క్సిజం' (శాసన బద్ధ మార్క్సిజం) తో లెనిన్ గావించిన పోరాటం గూడా అపారమైన ప్రాముఖ్యం కల్గివుంది. చరిత్రలో జరిగే పెద్ద పెద్ద సామాజిక ఉద్యమాలలో తాత్కాలికపు "తోడి ప్రయాణీకులు" తటస్థపడుతూంటారు. "లీగల్ మార్క్సిస్టు"లని పిలువబడేవారు కూడా అలాంటి "తోడి ప్రయాణీకులే". రష్యా అంతటా మార్క్సిజం విశాలంగా వ్యాపింపసాగింది. అందుచేత బూర్జువా మేధావులు మార్క్సిస్టు ముసుగును అలంకరించుకోసాగారు. వారు శాసన బద్ధమైన (లీగల్) దినపత్రికలలోను, పక్ష పత్రికలలోను — అనగా జారు ప్రభుత్వం అనుమతించిన పత్రికలలో వ్యాసాలను ప్రకటించసాగారు. అందుచేతనే వారిని "లీగల్ మార్క్సిస్టులు" అని పిలిచేవారు.

వారుకూడ, వారికి తోచిన విధంగా నరోడిజంతో పోరాడారు. కాని, పెట్టుబడిదారీ సమాజ ప్రయోజనాలకు, పెట్టుబడిదారుల ప్రయోజనాలకు అనుగుణ్యంగా కార్మికవర్గ ఉద్యమం ఉపయోగపడి లొంగిపోయేందుకుగాను పై పోరాటాన్నీ మార్క్సిస్టు జెండానూ (బ్యానర్) ఉపయోగించుకోదలిచారు. మార్క్సిజంయొక్క గుండెకాయనే- అనగా శ్రామిక వర్గ విప్లవమూ, శ్రామికవర్గ నియంతృత్వమూ అనే సిద్ధాం

తాన్నే - లీగల్ మార్క్సిస్టులు కోసివేశారు. పీటర్ స్ట్రూవ్ (Peter Struve) అనే ప్రముఖ లీగల్ మార్క్సిస్టు పెట్టుబడి దారీ విధానానికి ప్రతికూలంగా విప్లవోద్యమాన్ని లేవదీయ వలసిందని చెప్పుటకు బదులుగా, పెట్టుబడిదారీ వర్గాన్ని పొగడుతూ ఇలా అన్నాడు: "మనకు సంస్కృతి లేదన్న విషయం అంగీకరించుతున్నాం. దీనిని నేర్చుకోడానికి పెట్టుబడి దారీ విధానం వద్దకే పోవాలి."

నరోడ్నిక్‌లపై సాగించే పోరాటంలో 'లీగల్ మార్క్సిస్టు లతో 'తాత్కాలికపు ఒడంబడిక చేసుకోవడం తప్పులేదని లెనిన్ భావించాడు. నరోడ్నిక్‌లకు వ్యతిరేకంగా వారిని ఉపయోగించుకోవచ్చునని తలచాడు. ఉదాహరణకు నరోడ్నిక్ లకు ప్రతికూలంగా వ్రాసిన వ్యాస సంపుటిని లీగల్ మార్క్సిస్టు లతో కలిసి ప్రచురించడం తప్పుకాదని లెనిన్ భావించాడు. కాని "లీగల్ మార్క్సిస్టు"లను విమర్శించుటలో లెనిన్ ఏమాత్రం దయాదాక్షిణ్యాలు చూపలేదు. లీగల్ మార్క్సి స్టుల లిబరల్ బూర్జువా స్వభావాన్ని లెనిన్ బయలుపరిచాడు.

ఈ తోడి ప్రయాణీకులలో చాలమంది ఆ తర్వాత శాసనబద్ధ ప్రజాతంత్రవాదులుగా (కాన్స్టిట్యూషనల్ డెమా క్రేట్సు) మారారు. (ఇదే రష్యన్ పెట్టుబడిదారుల ప్రధాన పార్టీ). తర్వాత అంతర్యుద్ధ కాలంలో వీరు నూటికి నూరుపాళ్లు వైట్‌గార్డ్సు (విప్లవ శత్రువులు)గా తయారయ్యారు.

పీటర్స్‌బర్గ్, మాస్కో, కీవ్ మొదలగు ప్రదేశాలలోని పోరాటసంఘాలతోపాటు రష్యా పశ్చిమసరిహద్దులోని ప్రాంతీయ జాతులలో సోషల్ - డెమాక్రటిక్ సంఘాలు తలయెత్తాయి.

1890 ప్రాంతాలలో పోలిష్ జాతీయ పార్టీలోని మార్క్సిస్టు వ్యక్తులు విడిపోయి, పోలెండ్ - లిథూనియాల సోషల్-డెమాక్రటిక్ పార్టీని ఏర్పరచారు. ఈ దశాబ్దాంతంలోనే (1890 - 1900) లాట్వియాలో సోషల్ - డెమాక్రటిక్ సంస్థలు ఏర్పడినాయి. 1897 అక్టోబరులో రష్యా పశ్చిమరాష్ట్రాలలో యూదు సోషల్ - డెమాక్రటిక్ సంఘం ఏర్పడింది. దీనినే 'బండ్' (Bund) అనేవారు.

1898 లో సెంట్‌పీటర్స్‌బర్గ్, మాస్కో, కీవ్, ఏకాటెరినోస్లావ్ మొదలగు పట్టణాల పోరాట సంఘాలు 'బండ్'తో కలిసి సోషల్-డెమాక్రటిక్ పార్టీగా ఐక్యంగావడానికి ప్రథమ ప్రయత్నంచేశాయి. ఇందుకోసం రష్యన్ సోషల్-డెమాక్రటిక్ లేబర్ పార్టీ (ఆర్. యస్. డి. యల్. పి.) మొదటి కాంగ్రెస్ (మహాసభ) ను సమావేశ పరచారు. 1898 మార్చిలో మిన్స్కులో ఈ కాంగ్రెస్ సమావేశమయింది.

ర. సో. డె. లేబర్ పార్టీ కాంగ్రెసుకు తొమ్మిదిమంది ప్రతినిధులు మాత్రమే హాజరయ్యారు. లెనిన్ ఆ కాలంలో సైబీరియాలో ప్రవాసంలో ఉండుటచేత హాజరు కాలేక పోయాడు. ఈ కాంగ్రెస్‌లో ఎన్నుకోబడిన పార్టీ సెంట్రల్ కమిటీని (కేంద్ర కమిటీని) త్వరలోనే ప్రభుత్వం అరెస్టుచేసింది. కాంగ్రెసు పేరిట ప్రచురించినప్రణాళిక అనేకవిధాల అసంతృప్తికరంగా వుంది. శ్రామికవర్గం రాజకీయ అధికారాన్ని హస్తగతం చేసుకోవలసిన సమస్యను ఈ ప్రణాళిక దాటవేసింది. శ్రామికవర్గ నాయకత్వం (హెజిమొనీ) గురించీ, జార్ ప్రభుత్వంతో, పెట్టుబడిదారీ వర్గంతో జరిపే పోరాటంలో శ్రామిక

వర్గానికి మిత్రులు (Allies) ఎవరనే విషయం గురించీ ఇది ఏమీ ప్రస్తావించలేదు.

పై కాంగ్రెస్, తన నిర్ణయాలలోను, ప్రణాళికలోను, రష్యన్ సోషల్ - డెమాక్రటిక్ లేబరుపార్టీని ఏర్పరచినట్లు ప్రకటించింది.

ఈ లాంఛన చర్యయే గొప్ప విప్లవ ప్రచారపాత్రను వహించింది. ర. సో. డె. లేబర్ పార్టీ మొదటి కాంగ్రెసు ప్రాముఖ్యత ఈ విప్లవప్రచారంలోనే వుంది.

మొదటి కాంగ్రెస్ సమావేశమయినప్పటికీ, వాస్తవానికి రష్యాలో మార్క్సిస్టు సోషల్ - డెమాక్రటిక్ పార్టీ ఇంకా ఏర్పడ లేదు. విడివిడిగా నున్న మార్క్సిస్టు సమితులను(సర్కిల్సు)ను సంస్థలను ఐక్యపరచి సంఘటనా రూపంలో వాటిని అతకలేదు. వివిధ స్థానిక సంఘాలకు ఒకే రకమైన కార్యాచరణ మార్గం గాని, పార్టీ కార్యక్రమంగాని, నిబంధనలుగాని, ఏకైక కేంద్రీకృత నాయకత్వంగాని లేవు.

ఇందుచేత, ఇంకా అనేక యితర కారణాలచేత స్థానిక సంఘాలలో సిద్ధాంత విషయమై గందరగోళం హెచ్చసాగింది. ఈ గందరగోళ ఫలితంగా కార్మికవర్గ ఉద్యమంలోనే "అర్థిక వాదం" (ఎకనమిజం)అనే అవకాశ ధోరణి పెరగడానికి అనుకూల వాతావరణం ఏర్పడింది.

ఈ గందరగోళాన్ని పోగొట్టడానికీ, ఈ అవకాశవాదపు ఊగిసలాటలను అంతం చేయడానికీ, రష్యన్ సోషల్ - డెమాక్రటిక్ లేబర్ పార్టీ నిర్మాణానికై మార్గం సుకరం చేయడానికీ, లెనినూ, ఆయన స్థాపించిన "ఇస్క్రా" (కణం) పత్రికా చాల సంవత్సరాలు తీవ్రమైనకృషి చేయవలసివచ్చింది.

# 5

## ‘ఎకనమిజం’తో లెనిన్ పోరాటం.

## లెనిన్ పత్రిక “ఇస్క్రా” అవతరణ.

ర. సో. డె. లేబర్ పార్టీ మొదటి కాంగ్రెస్‌కు లెనిన్ హాజరు కాలేదు. ఆరోజుల్లో లెనిన్ సైబేరియాలోని షుషెన్స్కోయీ గ్రామంలో ప్రవాస శిక్షను అనుభవించుతున్నాడు. పోరాటసంఘాన్ని అణచివేసే సందర్భములో ప్రభుత్వం లెనిన్‌ను పీటర్స్‌బర్గులో చాలకాలం నిర్బంధించి, ఆతర్వాత సైబీరియాకు ప్రవాసం పంపింది.

ప్రవాసంలో వుండికూడ లెనిన్ తన విప్లవ కార్యకలాపాలను కొనసాగించుతూనే వచ్చాడు. అక్కడ ఒక ముఖ్యమైన శాస్త్రీయగ్రంథాన్ని పూర్తి చేశాడు. దానిపేరు “రష్యాలో పెట్టుబడిదారీ విధాన అభివృద్ధి” (The Development of Capitalism in Russia). ఇది నరోడిజంయొక్క సిద్ధాంత వినాశనాన్ని పూర్తిచేసింది. అక్కడే మరొక సుప్రసిద్ధ కరపత్రాన్ని కూడా ఒకదానిని రచించాడు. దీనిపేరు “రష్యన్-

సోషల్ డెమాక్రేట్ల కర్తవ్యాలు" (The Tasks of the Russian Social Democrates).

ప్రత్యక్ష విప్లవకార్యాచరణతో దూరమైపోయినప్పటికీ, లెనిన్ ఈ విప్లవ కార్యకలాపాలలో నిమగ్నులయినవారితో ఏదో రకంగా సంబంధాలు పెట్టుకోగలిగాడు. ప్రవాసప్రవేశం నుండే వారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపాడు. వారివద్ద నుండి భోగట్టా సంపాదించి సలహాలిస్తూ ఉండేవాడు. ఈ రోజుల్లో ఎక్కువగా 'ఆర్థికవాదుల'ను (ఎకనమిస్టుల) ఖండించుటలోనే లెనిన్ నిమగ్నుడయ్యాడు. 'ఆర్థికవాదం', రాజకీ అవకాశవాదానికి ముఖ్యమైనబీజం. కార్మికవర్గ ఉద్యమంలో గనుక 'ఆర్థికవాదం' పై చేయి సంపాదించిందంటే, అది శ్రామికవర్గ విప్లవోద్యమాన్ని క్రుంగదీస్తుంది. ఆవిధంగా మార్క్సిజంయొక్క ఓటమికే దారితీస్తుంది- అని లెనిన్ అందరి కంటె బాగా గ్రహించాడు.

అందుచేత 'ఆర్థికవాదులు' రంగంమీాద ప్రత్యక్షం కాగానే, లెనిన్ వారిపై తీవ్రమైన దాడి ప్రారంభించాడు.

కార్మికులు కేవలం ఆర్థిక పోరాటాలలోనే పాల్గొనాలి. రాజకీయ పోరాటాలను లిబరల్ బూర్జువాకు వదలివేయాలి. ఆ లిబరల్ బూర్జువాను బలపరచడమే శ్రామికవర్గం పని. - ఇదీ "ఆర్థికవాదుల" వాదన. లెనిన్ దృష్టిలో ఈసిద్ధాంతం మార్క్సిజాన్ని ఉల్లంఘించడమే; కార్మికవర్గ రాజకీయ పార్టీ ఒకటి స్వతంత్రంగా ఉండవలసిన ఆవశ్యకతను నిరాకరించడమే; కార్మికవర్గాన్ని పెట్టుబడిదారీవర్గానికి రాజకీయంగా ఒక తోకగా తయారుచేయడమే.

1899 లో 'ఆర్థికవాదుల' ముఠా (ప్రోకోపోవిచ్, కుస్కోవా మొదలైనవారు. తర్వాత వీరు శాసనబద్ధ ప్రజాతంత్రవాదులుగా తయారయ్యారు.) ఒక ప్రణాళికను ప్రకటించారు. అందులో వారు విప్లవ మార్క్సిజంను ఎదిరించారు. కార్మికవర్గానికి స్వతంత్ర రాజకీయ పార్టీ ఉండాలనే అభిప్రాయాన్ని, కార్మికవర్గం స్వతంత్ర రాజకీయ కోర్కెలను కోరడమనే భావాన్ని, వీరు పదే పదే తిరస్కరించారు. రాజకీయ పోరాటం అనేది లిబరల్ బూర్జువాకు సంబంధించినదనీ, కార్మికులకు సంబంధించినంతవరకు వారికి యజమానులపై ఆర్థిక పోరాటం చాలుననీ "ఆర్థికవాదులు" వాదించారు.

ఈ అవకాశవాద పత్రాన్ని (Document) చూడగానే లెనిన్, సమీపంలోనున్న మార్క్సిస్టు రాజకీయ ప్రవాసుల నందరినీ పిలిచి ఒక సమావేశం జరిపాడు. ఆ సమావేశానికి 17గురు హాజరయ్యారు. లెనిన్ ఆధ్వర్యాన వారు "ఆర్థిక వాదుల" అభిప్రాయాలను ఖండించారు. నిశితంగా తమ అసమ్మతిని తెలియజేశారు.

లెనిన్ వ్రాసిన ఈఖండనపత్రం దేశమంతటామార్క్సిస్టు సంస్థలలో ప్రచారం చేయబడింది. రష్యాలోని మార్క్సిస్టు పార్టీయొక్క, మార్క్సిస్టు భావాలయొక్క అభివృద్ధిలో ఇది అత్యంత ప్రముఖపాత్ర వహించింది.

విదేశాలలోని సోషల్ - డెమాక్రటిక్ పార్టీలలోని మార్క్సిస్టు ప్రతికూలుర అభిప్రాయాల వంటి వాటినే రష్యాలోని "ఆర్థిక వాదులు" ప్రచారం చేయసాగారు. విదేశాలలోని ఆ మార్క్సిస్టు ప్రతికూలురను బెర్న్‌స్టీనైట్స

Bernsteinites) అని పిలిచేవారు. అనగా అవకాశవాది అయిన బెరెన్‌స్టీన్ అనుచరులన్నమాట.

"ఆర్థికవాదుల"పై లెనిన్ సాగించిన ఈ పోరాటం, వీరొక్కరిమీద నేగాక అంతర్జాతీయ రంగంలో అవకాశవాదం మీద సాగించిన పోరాటమే.

"ఆర్థికవాదం"పై సాగించిన పోరాటం కార్మికవర్గం యొక్క స్వతంత్ర రాజకీయ పార్టీ నిర్మాణానికై సాగించిన పోరాటం, ముఖ్యంగా లెనిన్ స్థాపించిన రహస్యపత్రిక "ఇస్క్రా" (అగ్ని కణం) యే కొనసాగించింది.

1900 ప్రారంభంలో లెనినూ, పోరాట సంఘంలోని తదితర సభ్యులూ, సైబీరియా ప్రవాసం నుండి రష్యాకు తిరిగి వచ్చారు. రష్యాకంతకూ సరిపోయే పెద్ద రహస్య మార్క్సిస్టు పత్రికను స్థాపించాలని లెనిన్ తలిచాడు. రష్యాలో అప్పటికే వున్న వివిధ మార్క్సిస్టు సమితులనూ సంస్థలనూ ఇంకా కలప లేదు. కామ్రేడ్ స్టాలిన్ మాటలలో చెప్పాలంటే "సమితుల లోని సంకుచిత స్థానిక తత్వమూ, అనుభవ రాహిత్యమూ (అమెచ్యూరిష్‌నెస్) పార్టీని ఆపాదమస్తకమూ ఆవహించి తినివేయ సాగింది. పార్టీ ఆంతరంగిక జీవితంలో సిద్ధాంత గందర గోళం ప్రధాన లక్షణంగా వుండేది". అలాంటి సమయంలో రష్యాకంతకూ సరిపడే, రహస్య వార్తాపత్రికను నెలకొల్పడం రష్యన్ విప్లవ మార్క్సిస్టుల ముఖ్యకర్తవ్యం. అలాంటి పత్రిక ఒక్కటే అనైక్యంగా వున్న మార్క్సిస్టు సంస్థలనన్నిటినీ కలిపి నిజమైన పార్టీ నిర్మాణానికి మార్గాన్ని సుకరం చేయగలదు.

కాని జార్ రష్యాలో పోలీసుల నిరంతర బాధవలన అక్కడ పత్రికను ప్రచురించుట కష్టం. ఒకనెలలో మహా అయితే రెండునెలల్లో, పోలీసుకుక్కలు (గూఢచారులు) దానిని కనిపెట్టి నాశనంచేస్తాయి. అందుచే లెనిన్ ఆ పత్రికను విదేశాలలో ప్రచురించ నిశ్చయించాడు. విదేశాలలో పల్చటి-అయినా నిల్వవుండగల - కాగితంపైన దానిని అచ్చువేసి రహస్యంగా రష్యాలోకి చేరవేసేవారు. కొన్ని "ఇస్క్రా" పత్రిక సంచికలను మళ్లా రష్యాలో రహస్యంగా అచ్చువేసే వారు. ముఖ్యంగా బాకూ, కిషినెవ్, సైబీరియాలలో దీనిని పునర్ముద్రించేవారు.

రష్యాకంతకూ సరిపోయే రాజకీయ వార్తాపత్రికను ప్రచురించేనిమిత్తం, "కార్మిక విమోచనాసమితి" (Emancipation of Labour Group) కామ్రేడ్స్‌తో ఏర్పాట్లు చేసేందుకు లెనిన్, 1900 ఆకురాలుకాలంలో విదేశాలకు వెళ్లాడు. లెనిన్ ప్రవాసంలో వుండగానే, పత్రిక ఎలా ఉండాలన్న వివరాలన్నిటినీ ఆలోచించాడు. ప్రవాసంనుండి తిరిగివస్తూ త్రోవలో ఈ విషయమై, యుఫా, ప్స్కొవ్, మాస్కో, సెంట్ పీటర్స్‌బర్గ్ మొదలగు చోట్ల అనేక సమావేశాలు జరిపాడు. ప్రతిచోటా, రహస్య ఉత్తర ప్రత్యుత్తరాలకు సాంకేతికభాష (కోడ్), సాహిత్యం పంపవలసిన చిరునామాలు వగైరా ఏర్పాట్లుగావించాడు. భవిష్యత్ పోరాటాల ప్లానులను గురించి కూడా లెనిన్ చర్చించాడు.

లెనిన్ తమకు అతిప్రమాద శత్రువని, జారు ప్రభుత్వం పసిగట్టింది. జారుప్రభుత్వ గూఢచార శాఖకు, (Okhrana-

ఓఖ్రానా) చెందిన పోలీసు ఉద్యోగి జుబటొవ్ ఒక రహస్య రిపోర్టులో ఇలా తెలియజేశాడు: "ఈనాటి విప్లవంలో యుల్యనావ్ (లెనిన్) కంటె పెద్దవాడెవడూ లేడు". ఆ కారణంచేత లెనిన్‌ను హత్య కావించడం అవసరమని అతడు భావించాడు.

విదేశాలలో "కార్మిక విమోచనా సమితి" ముఠాతో అనగా ప్లెఖనోవ్, ఆక్సెల్‌రాడ్, వి. జాసువిచ్ అనువారలతో, సంయుక్త ఆధ్వర్యాన "ఇస్క్రా" పత్రికను ప్రచురించడానికి ఒక ఒడంబడిక చేసుకొన్నాడు. పత్రిక ప్రచురణ ప్లానంతా, ఆద్యంతమూ, లెనినే తయారుచేశాడు.

1900 డిసెంబరులో "ఇస్క్రా" మొదటిసంచిక విదేశాలలో వెలువడింది. "అగ్నికణమే జ్వాలను రగుల్చుతుంది" అన్న వాక్యం ముఖపత్రంపై వుంది. సైబీరియాలో ప్రవాసంవున్న డిసెంబరిస్టులకు పుష్కిన్ మహాకవి పంపిన సందేశానికి వారు తిరిగి పంపిన జవాబునుండి యీ వాక్యాన్ని తీసుకొన్నారు. (నిరంకుశ రాచరికాన్నీ, దాస్యవిధానాన్నీ ఎదిరించిన ఉన్నత ప్రభువంశీకులైన విప్లవకారులే డిసెంబరిస్టులు. వీరు 1825 డిసెంబరులో తిరుగుబాటు తెచ్చారు. కాని అది విఫలమైంది. అనువాదకుడు.)

నిజంగానే లెనిన్ రగిల్చిన ఈ 'కణం' నుండే మహా విప్లవ జ్యోతి ఒకటి జాజ్వల్యమానంగా వెలిగింది. ఆ జ్యోతిలోనే, భూస్వామ్య ప్రభువులతో కూడిన జార్ ప్రభుత్వ రాచరికమూ, పెట్టుబడిదారీవర్గ అధికారమూ భస్మీపటలం అయ్యాయి.

# క్లుప్తసారాంశం

నరోడిజమూ, నరోడ్నిక్ భావాలూ, విప్లవ ఆశయానికి హానికరమైనవీ, తప్పుడువీ. అట్టి నరోడిజంతోను, నరోడ్నిక్ భావాలతోను రష్యాలో ప్రారంభించిన పోరాటంలో మార్క్సిస్టు సోషల్-డెమాక్రటిక్ పార్టీ నిర్మింపబడుతూ వచ్చింది.

సిద్ధాంతరీత్యా నరోడ్నిక్ భావాలను నాశనంచేయుట వల్లనే, రష్యాలో మార్క్సిస్టు కార్మిక పార్టీ నిర్మాణానికి మార్గం సుకరం చేయుట సాధ్యమయింది. 1880 ప్రాంతాలలో ప్లెఖనావూ, అతని "కార్మిక విమోచనా సమితీ" నరోడిజంపై గట్టిదెబ్బ తీశారు.

లెనిన్, నరోడిజంను సిద్ధాంతరీత్యా ఓడించుటను పూర్తిచేసి, 1890 ప్రాంతాలలో దానిపై తుదిదెబ్బగొట్టాడు.

1883 లో స్థాపించబడిన "కార్మిక విమోచనాసమితి" రష్యాలో మార్క్సిస్టు భావాలను వెదజల్లడానికి చాలా కృషి చేసింది. అది సోషల్ డెమాక్రసీ (సోషల్-డెమాక్రటిక్ పార్టీ)కి సిద్ధాంత పునాదులను వేసింది. కార్మికవర్గ ఉద్యమంతో సంబంధ మేర్పరచుకోడానికి మొదటి అడుగు వేసింది.

రష్యాలో పెట్టుబడిదారీవిధానం అభివృద్ధి అయినకొలదీ పారిశ్రామిక కార్మికుల సంఖ్య త్వరితంగా వృద్ధిఅయింది. 1880 - 90 సంవత్సరాల మధ్య కార్మికవర్గం సంఘటిత పోరాట మార్గాన్ని చేపట్టింది. సంఘటిత సమ్మెలరూపంలో ప్రజా పోరాటాలకు పూనుకొంది. కాని మార్క్సిస్టు అధ్యయన

కేంద్రాలూ, సమితులూ (సర్కిల్సు) ప్రచారాన్ని మాత్రమే చేశాయి గాని, కార్మికవర్గంలో ప్రజాందోళనా దశకు పోవల సిన ఆవశ్యకతను అవి గుర్తించలేదు. అందుచే అప్పటికీ వాటికి కార్మికవర్గ ఉద్యమంతో ప్రత్యక్ష సంబంధం లేకపోయింది. తత్ఫలితంగా కార్మికవర్గ ఉద్యమాన్ని అవి నడుపలేదు.

1895 లో, సెంట్‌పీటర్స్ బర్గ్‌లో "కార్మికవర్గ విమో చనా పోరాట సంఘాన్ని" లెనిన్ ఏర్పరిచాడు. అది కార్మి కులలో ప్రజాందోళనసాగించి ప్రజాసమ్మెలను నడుపసాగింది. ఆ విధంగా కార్మికులలో ప్రజాందోళన, కార్మికవర్గ ఉద్య మంతో మార్క్సిజాన్ని మేళవించుట అనే నూతన పరివర్తన దశలో ఏర్పడింది. సెంట్‌పీటర్స్ బర్గ్‌లోని "కార్మికవర్గ విమో చనా పోరాటసంఘం" రష్యాలోని విప్లవశ్రామికపార్టీకి బీజం అయింది. పీటర్స్‌బర్గ్‌లో "పోరాటసంఘం" ఏర్పడినపిదప, అన్ని ముఖ్య పారిశ్రామిక కేంద్రాలలోను సరిహద్దు రాష్ట్రాల లోను మార్క్సిస్టు సంస్థలు ఏర్పడ్డాయి.

1898 లో రష్యన్ సోషల్- డెమాక్రటిక్ లేబర్ పార్టీ ప్రథమకాంగ్రెస్ సమావేశమయింది. ఇందులో మార్క్సిస్టు సోషల్ - డెమాక్రటిక్ సంస్థలన్నిటినీ ఒక పార్టీగా ఐక్యపరచ డానికి ప్రయత్నం జరిగింది. అది విఫలమయినా అది ప్రథమ ప్రయత్నం. ఈకాంగ్రెస్, పార్టీని ఇంకా ఏర్పరచలేకపోయింది. ఒక పార్టీ కార్యక్రమంగాని, పార్టీనిబంధనలుగానీ ఏర్పరచలేదు. ఒక కేంద్రీకృత నాయకత్వమూ లేదు. విడివిడిగానున్న మార్క్సిస్టు సమితులకూ, అధ్యయన కేంద్రాలకూ మధ్య ఎలాంటి సంబంధమూ లేదు.

విడివిడిగా వున్న మార్క్సిస్టు సంస్థలను కలిపి లింకుచేసి ఒకే పార్టీగా నిర్మించడానికిగాను, ఒకపత్రిక అవసరం. అలాంటి పత్రిక "ఇస్క్రా". రష్యాకంతకూ సరిపోయే, విప్లవ మార్క్సిస్టుల ప్రథమ వార్తా పత్రిక అది. ఆ పత్రికను స్థాపించడానికి లెనిన్ ప్లాను వేసి దానిని కొనసాగించాడు.

ఒకే రాజకీయ కార్మికవర్గపార్టీని నిర్మించడానికి ప్రధాన వ్యతిరేకులు ఆ కాలంలో "ఆర్థిక వాదులు" (ఎకనమిస్టులు)- అలాంటి పార్టీయొక్క ఆవశ్యకత లేనేలేదని వారు వాదించారు. వారు అనైక్యతను, విడివిడిగానున్న అధ్యయన కేంద్రాల అనుభవ రాహిత్య పద్ధతులను (అమెచ్యూరిష్ పద్ధతులను) ప్రోత్సహించారు. ఇలాంటివారిపైననే, లెనినూ, అతడు సంఘటితమొనర్చిన "ఇస్క్రా" వార్తా పత్రికా దెబ్బతీశాయి.

"ఇస్క్రా" మొదటిసంచిక (1900 - 1901) వెలువడుట ఒక నూతన దశకు పరివర్తన చిహ్నం. చెల్లాచెదురుగా వున్న అధ్యయన కేంద్రాలనుండి సమితులనుండి ఒకే రష్యన్ సోషల్-డెమాక్రటిక్ లేబర్ పార్టీ వాస్తవంగా ఏర్పడినదశ ఇది.

# రెండో అధ్యాయం

## రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ నిర్మాణం.

## పార్టీలో బోల్షివిక్ - మెన్షివిక్ ముఠాల జననం.

[ 1901 – 1904 ]

## 1901—04 సంవత్సరాలలో
## రష్యాలో విప్లవోద్యమ విజృంభణ

19 వ శతాబ్దాంతంలో, యూరప్‌లో పారిశ్రామిక సంక్షోభం పొడచూపింది. త్వరలోనే అది రష్యాను కూడా వ్యాపించింది. సంక్షోభ కాలంలో (1900_03) చిన్నవిగాని పెద్దవికాని మూడువేల పారిశ్రామిక సంస్థలు (Enterprises) మూతపడ్డాయి. లక్షమంది కార్మికులు నడివీధులలోకి బికారులుగా గెంటబడ్డారు. ఇక మిగిలిన పనిచేసే కార్మికుల జీతాలు బాగా తగ్గించివేశారు. గట్టిగా పోరాడి ఆర్థిక సమ్మెలద్వారా పెట్టుబడిదారులనుండి కార్మికులు ఇదివరలో గణించిన నామమాత్రపు సౌకర్యాలనుకూడ రద్దుచేశారు.

పారిశ్రామిక సంక్షోభమూ, నిరుద్యోగమూ కార్మికోద్యమాన్ని ఆపనూలేదు; బలహీనపరచనూలేదు. పైగా కార్మిక పోరాటాలు మరింత విప్లవ స్వభావం దాల్చుతూ వచ్చాయి. ఆర్థిక సమ్మెలనుండి ముందుకు నడిచిన కార్మికులు రాజకీయ సమ్మెలకు దిగారు. చిట్టచివరకు ప్రదర్శనాలు

ప్రారంభించారు. ప్రజాతంత్ర హక్కులను గురించిన రాజకీయ కోర్కెలను అడుగసాగారు. తుదకు "జారు నిరంకుశ ప్రభుత్వం నశించాలి!" అనే నినాదాన్ని లేవదీశారు.

1901 లో సెంట్‌పీటర్స్‌బర్గ్‌లోని ఆబుఖావ్ (Obukhov) ఆయుధ కర్మాగారంలో మే డే సమ్మె జరిగింది. ఆ సందర్భంలో కార్మికులకూ సైనికులకూ మధ్య క్రూరమైన ఘర్షణ జరిగింది. సాయుధులైన జార్ సేనలతో పోరాడటానికి కార్మికులకున్న ఆయుధాలల్లా రాళ్ళూ ఇనుపముక్కలూ. కార్మికుల తీవ్ర ప్రతిఘటనను ప్రభుత్వం భగ్నం చేసింది. ఆ తర్వాత పైశాచిక ప్రతీకారాన్ని సాగించింది. 800 మంది కార్మికులను అరెస్టు చేసింది. చాలమంది జైలుకు గురిఅయ్యారు. లేదా కఠినశిక్షకు ప్రవాసశిక్షకు గురిఅయ్యారు. కాని "ఆబుఖోవ్ ఆత్మరక్షణ పోరాటం" రష్యా కార్మికులలో పెద్ద సంచలనం కల్గించింది. కార్మికులలో వారిపట్ల సానుభూతి వెల్లువ ప్రవహించసాగింది.

1902 మార్చిలో బాటుమ్ (Batum) లో ప్రదర్శనా, సమ్మెలూ జరిగాయి. వీటిని బాటుమ్ సోషల్ డెమాక్రటిక్ కమిటీ సంఘటిత పరచింది. బాటుమ్ ప్రదర్శన ట్రాన్స్-కాకేషియా కార్మికులను రైతులను బాగా కదిలించింది.

రోస్టావ్-ఆన్-డాన్‌లోకూడ 1902లో ఒక పెద్ద సమ్మె జరిగింది. మొట్టమొదట పని వదలి బయటకు వచ్చింది రైల్వే కార్మికులు. త్వరలోనే అనేక ఫ్యాక్టరీలలోని కార్మికులు సమ్మెలో చేరారు. సమ్మె, కార్మికులందరినీ కదలించివేసింది. పట్టణం వెలుపల వరుసగా అనేక దినాలు సభలు జరిగేవి.

ఆ సభలకు 30 వేల దాకా కార్మికులు హాజరయ్యేవారు. ఈ సభలో సోషల్-డెమాక్రటిక్ ప్రకటనలను బిగ్గరగా చదివే వారు. ఉపన్యాసకులు కార్మికులను ఉద్దేశించి ఉపన్యసించే వారు. ఈ సభలకు వేలకొలది కార్మికులు హాజరుకావడంవల్ల, వాటిని చెదరగొట్టడం పోలీసులకు కోసక్‌లకు (ఆశ్వికదళం) సాధ్యంకాని పని అయింది. పోలీసులు అనేకులను చంపితే, వారి అంత్యక్రియలకు కార్మిక ప్రజ బ్రహ్మాండమైన ఊరేగింపు కొనసాగించేది. చుట్టుప్రక్కలనున్న పట్టణాలనుండి సైనికులను పిలిపించిగాని సమ్మెను అణచలేకపోయింది ప్రభుత్వం. రష్యన్ సోషల్-డెమాక్రటిక్ లేబరుపార్టీయొక్క డాన్ ప్రాంతకమిటీ, రోస్టావ్ కార్మికులను నడిపింది.

1903 లో చెలరేగిన సమ్మెలు ఇంకా చాలా పెద్దవి. ఆ సంవత్సరం ప్రజా రాజకీయ సమ్మెలు దక్షిణాన ప్రారంభించి ట్రాన్స్ కాకేషియాను (బాకూ, టిఫ్లిస్, బాటుమ్), యుక్రెయిన్‌లోని పెద్ద పట్టణాలను (ఒడెస్సా, కివ్, ఎకాటెరినోస్లావ్) వలదలా ముంచెత్తాయి. సమ్మెలు మరింత పట్టుదలతోను బాగా సంఘటితంగాను జరిగాయి. పూర్వపు కార్మికవర్గ పోరాటాలవలెగాక, ఇప్పుడు కార్మికుల రాజకీయ పోరాటం ప్రతిదీ అన్నిచోట్లా సోషల్ - డెమాక్రటిక్ కమిటీలచే నడుప బడేవి.

జార్ ప్రభుత్వంపైన, రష్యన్ కార్మికవర్గం విప్లవ పోరాటం సాగించడానికి తలయెత్తుతోంది.

కార్మికవర్గ ఉద్యమ ప్రభావం రైతాంగంపైకూడ పడింది. 1902 వసంతంలోనూ వేసవిలోనూ, యుక్రెయిన్

(పోల్టావా, ఖార్కోవ్ రాష్ట్రాలలో), వోల్గా ప్రాంతాలలోను రైతు వుద్యమం ప్రారంభమయింది. రైతులు భూస్వాముల భవనాలకు నిప్పంటించారు. వారి భూములను లాక్కొన్నారు. తమకు ద్వేషకారకులైన గ్రామోద్యోగులను (జెమిస్కీ నాచల్నిక్స్ - Zemsky nachalniksను), భూస్వాములను చంపారు. (జెమిస్కీ నాచల్నిక్స్ అంటే పోలీసు, మేజిస్ట్రేట్, పరిపాలనా అధికారాలుగల ఉద్యోగులు. వీరిని రాచవంశీయుల నుండే నియోగిస్తారు. - అనువాదకుడు) తిరుగుబాటు చేయు చున్న రైతాంగాన్ని అణచడానికి సైన్యాలను ప్రభుత్వం పంపింది. రైతులను తుపాకులతో సైనికులు కాల్చారు. వందలాది రైతులను అరెస్టుచేశారు. వారి నాయకులను, ఉద్యమ సంఘటనా కర్తలను (ఆర్గనైజర్లను) జైళ్ళలో కుక్కారు. కాని విప్లవ రైతువుద్యమం వృద్ధిపొందుతూనే వుంది.

కార్మికుల రైతుల ఈ విప్లవ చర్యలు, రష్యాలో విప్లవం పరిపక్వమై సమీపించుతున్నదని తెలియజేశాయి.

కార్మికుల విప్లవ పోరాట ప్రభావంగా, జారు ప్రభుత్వ ప్రతికూల విద్యార్థి ఉద్యమం మరింత తీవ్రతరమైంది. విద్యార్థుల సమ్మెలకు ప్రదర్శనాలకు ప్రతీకారంగా ప్రభుత్వం విశ్వవిద్యాలయాలను (యూనివర్సిటీలను) మూసివేసింది; వందలాది విద్యార్థులను జైళ్ళలో త్రోసింది; చివరకు ప్రభుత్వ చట్టాలను ఉల్లంఘించుతున్న విద్యార్థులను సాధారణ సైనికులవలె సైన్యంలోకి పంపాలనే నిశ్చయానికి ప్రభుత్వం వచ్చింది. 1901-02 శీతకాలంలో దీనికి జవాబుగా అన్ని విశ్వవిద్యాలయాల విద్యార్థులు సర్వవ్యాపిత సమ్మె (జనరల్ స్ట్రయిక్)

ప్రారంభించారు. ఈ సమ్మెలో 30 వేలమంది విద్యార్థులు పాల్గొన్నారు.

కార్మిక కర్షకుల విప్లవోద్యమమూ, ప్రత్యేకంగా విద్యార్థులపై సాగించబడిన ప్రతీకారచర్యలూ, లిబరల్ బూర్జువాను, లిబరల్ భూస్వాములను కూడా కదిలించినవి. జెమ్‌స్ట్వోస్ (Zemstvos-స్థానికసంస్థలు) పై పీఠం వేసుకుకూచున్న వీరు వళ్లు దులపరించుకొని లేచి, జారు ప్రభుత్వం తమవిద్యార్థి పుత్రులపై "అతిగా" సాగించుతున్న చర్యలకు తమ "అసమ్మతి"ని తెలియజేశారు.

జెమ్‌స్ట్వో బోర్డులలో పైనచెప్పిన లిబరల్స్‌కు బలం వుంది. ఇవి స్థానికసంస్థలు. వీటికి గ్రామప్రజలకు సంబంధించిన స్థానిక వ్యవహారలలోనే (రోడ్లు, స్కూళ్లు, హాస్పిటల్స్ నిర్మాణం) అధికారం వుంది. జెమ్‌స్ట్వో బోర్డులలో లిబరల్ భూస్వాములు తగినంత ప్రముఖ పాత్రనే వహించారు. వీరు లిబరల్ బూర్జువాతో సన్నిహిత సంబంధం కలిగియుండేవారు. వాస్తవానికి దాదాపు వారిలో మిళితమయిపోయారు. ఎంచేతనంటే: ఇంకా మిగిలియున్న అర్ధ - బానిసవిధాన పద్ధతులపై వ్యవసాయం చేయడం మానివేయసాగారు. తమ యెస్టేట్లలో ఎక్కువ లాభకరమైన పెట్టుబడిదారీవిధాన పద్ధతులను వ్యవసాయంలో ప్రవేశపెట్టసాగారు. ఈ రెండు రకాల లిబరల్ ముఠాలు జారు ప్రభుత్వాన్ని బలపరచినవారే. అయినా జారు ప్రభుత్వం "మితిమించిన" చర్యలను వీరు వ్యతిరేకించారు. ఈ "మితిమించిన" పనులు విప్లవోద్యమాన్ని మరింత తీవ్రం చేస్తాయనే వీరి భయం. జారు చేసే "మితిమించిన" పనులకు వీరు

భయపడుతున్నా, వీరు విప్లవమంటే మరింత భయపడ్డారు. ఈ "దురాగతాల"కు అసమ్మతిని తెలియజేయుటలో వారిఉద్దేశాలు రెండు: మొదటిది జారుకు "బుద్ధి తెప్పించడం", రెండవది, జారుప్రభుత్వంపట్ల "తీవ్ర అసంతృప్తి" అనే ముసుగును ధరించి ప్రజల విశ్వాసాన్ని సంపాదించి ప్రజలను లేక కనీసం వారిలో ఒక భాగాన్ని విప్లవాన్నుండి చీలదీసి విప్లవబలాన్ని కుంటువరచడం.

జార్ ప్రభుత్వపు ఉనికికి జెమ్‌స్ట్వో లిబరల్ ఉద్యమం ఎలాంటి ప్రమాదం కల్గించనిమాట నిజమే. కాని జార్ ప్రభుత్వం అనే భవనానికి "శాశ్వత" స్తంభాలని అనుకొన్న వారిలో కూడా అసంతృప్తివున్నదని చూపడానికి ఈ ఉద్యమం ఉపయోగించింది.

1902 లోని జెమ్‌స్ట్వో ఉద్యమం, తర్వాత బూర్జువా 'లిబరేషన్' గ్రూపు (విమోచన సంఘం) అనేది ఏర్పడడానికి త్రోవతీసింది. ఇదే ఆ తర్వాత రష్యాలో బూర్జువా యొక్క ముఖ్యపార్టీయైన కాన్‌స్టిట్యూషనల్ - డెమాక్రటిక్ పార్టీకి (శాసనబద్ధ ప్రజాతంత్రపార్టీకి) బీజమయింది.

కార్మిక కర్షక ఉద్యమం దేశాన్ని అప్రతిహతమైన వరదలో ముంచివేయడం జూచి, ఆ విప్లవ వెల్లువ నరికట్టడానికి తనకు చేతనైనదంతా చేసింది. కార్మికుల సమ్మెలను, ప్రదర్శనాలను అణచడానికి సాయుధ సైనికులను అనేకసార్లు ఉపయోగించింది. కార్మికుల రైతుల చర్యలకు జవాబుగా లాఠీ, తుపాకులను ప్రయోగించడం సర్వసాధారణమైంది. జైళ్ళు, ప్రవాస ప్రదేశాలు ఖాళీలేకుండా క్రిక్కిరిసి పోయాయి.

ఒక ప్రక్క నిర్బంధ పద్ధతులను మరింత ఎక్కువ జేస్తూనే, జార్ ప్రభుత్వం మరొకవైపు నిర్బంధ విధానేతర పద్ధతులను, విప్లవోద్యమంనుండి కార్మికులను మరల్చి "వశ పరచుకొనే" ఇతర పద్ధతులను అవలంబించింది. పోలీసుల గ్రామసైనికుల ఆధ్వర్యాన, కృత్రిమ కార్మిక సంఘాలను నిర్మించడానికి ప్రయత్నించింది. గ్రామ సైనికుల కల్నల్ జుబటొవ్ అనునతడు ఈ పోలీసు అధీన కార్మిక సంఘాలను స్థాపించాడు. అందుచేత వాటికి జుబటొవ్ కార్మిక సంఘాలనీ, వీరి సోషలిజం "పోలీసు సోషలిజం" అనీ పేరు వచ్చింది. కార్మికుల ఆర్థిక కోర్కెలను తీర్చేందుకు జార్ ప్రభుత్వం స్వయంగానే సిద్ధంగా వున్నదని నమ్మించడానికి, తన ఏజెంట్ల ద్వారా ఓఖ్రానా (గూఢచారిశాఖ) ప్రయత్నించింది. "జార్ ప్రభువే కార్మికుల తరఫున ఉంటున్నప్పుడు రాజకీయాలలో పాల్గొనడం దేనికి? విప్లవం దేనికి?" అని జుబటొవ్ ఏజెంట్లు కార్మికులను నిరుత్సాహ పరిచేవారు. జుబటొవ్ సంఘాలు అనేక పట్టణాలలో ఏర్పడ్డాయి. ఇదే ఆశయంతో, ఈ సంఘాలను నకలుగానే, పీటర్స్‌బర్గ్‌లో రష్యన్ ఫ్యాక్టరీ కార్మికుల సంఘం (Assembly of Russian Factory Workers of St. Petersburg) 1904 లో ఏర్పడింది. 'గేపన్' అనే మత గురువు దీనిని ఏర్పరచాడు.

జార్ ప్రభుత్వపు ఓఖ్రానా, (గూఢచారిశాఖ) కార్మిక వర్గ ఉద్యమంపై పెత్తనం సంపాదించాలని చేసిన ప్రయత్నం విఫలమయింది. అభివృద్ధి చెందుతూన్న కార్మికవర్గ ఉద్యమాన్ని అలాంటి పద్ధతులతో జార్ ప్రభుత్వం అణచలేకపోయింది. విజృంభించుతున్న కార్మికవర్గ విప్లవోద్యమం, ఈ పోలీసు అధీన సంఘాలను తమ త్రోవ కడ్డులేకుండా తుడిచిపారవేసింది.

# 2

మార్క్సిస్టు పార్టీ నిర్మాణానికి లెనిన్ పథకం. "ఆర్థికవాదుల" అవకాశవాదం. లెనిన్ పథకానికి "ఇస్క్రా" పత్రిక జరిపిన పోరాటం. "ఏం చేయాలి?" అనే లెనిన్ గ్రంథం. మార్క్సిస్టు పార్టీ సిద్ధాంతపు పునాదులు.

1898 లో రష్యన్ సోషల్-డెమాక్రటిక్ పార్టీ యొక్క ప్రథమ కాంగ్రెసు సమావేశం జరిగినప్పటికీ, ఆ కాంగ్రెసులో పార్టీని నిర్మించినట్లు ప్రకటించినప్పటికీ, నిజమైన పార్టీ ఇంకా ఏర్పడనే లేదు. అప్పుడు పార్టీ కార్యక్రమంగాని, నిబంధనలు గాని లేనేలేవు. మొదటి కాంగ్రెసులో ఎన్నుకోబడిన సెంట్రల్ కమిటీ (కేంద్రకమిటీ) సభ్యులను ప్రభుత్వం అరెస్టు చేసింది. కాని వారిస్థానే మరొక కేంద్రకమిటీ ఏర్పడలేదు. వారి స్థానాన్ని నింపడానికి మరెవరూ లేకపోవడమే అందుకు కారణం. ఇంత కంటె అధ్వాన్నమయిన విషయం ఏమంటే, మొదటికాంగ్రెసు తర్వాత, సిద్ధాంత గందరగోళమూ, పార్టీలో సంఘటనా సన్నిహిత రాహిత్యం (Lack of organisational cohesion) మరింత ప్రస్ఫుటంగా కన్పించసాగాయి.

1884-94 సంవత్సరాలలో నరోడిజంపై పార్టీ విజయం సాధించింది. సోషల్ డెమాక్రటిక్ పార్టీని నిర్మించడానికవసర మైన సిద్ధాంతపు పునాదులను సన్నాహపరచినకాలం ఇది. 1894-98 సంవత్సరాలలో విడివిడిగా మార్క్సిస్టు సంఘాలన్నిటినీ ఒకే సోషల్ డెమాక్రటిక్ పార్టీగా తయారుచేయాలనే ప్రయత్నం జరిగింది. కాని ఇది ఫలించలేదు. 1898 తర్వాత పార్టీలో సిద్ధాంతగందరగోళం, పార్టీనిర్మాణ గందరగోళం ఎక్కువయింది. నరోడిజంపైన మార్క్సిస్టులు సాధించిన విజయమూ, కార్మికవర్గ విప్లవచర్యలూ, మార్క్సిస్టులదే సరియైన మార్గమని నిరూపించాయి; మార్క్సిజంపట్ల యువకుల సానుభూతిని పెంపొందించాయి. మార్క్సిజం ఒక ఫేషన్ అయిపోయింది. దీని ఫలితంగా మార్క్సిస్టు సంఘాలలో విప్లవ మేధావులు గుంపులు గుంపులుగా వచ్చిపడ్డారు. వీరు సిద్ధాంత పరిజ్ఞాన విషయంలోనూ బలహీనులు; రాజకీయ నిర్మాణవిషయంలోనూ అనుభవశూన్యులు. వారి మార్క్సిజం అనిశ్చిత అభిప్రాయాలతో కూడివుండేది. లేదా ఆనాటిపత్రికలనిండా అచ్చవుతున్న "లీగల్ మార్క్సిస్టుల" అవకాశవాదపు రాతలనుండి తల యెత్తిన తప్పుడు అభిప్రాయాలతో, చాలవరకు నిండివుండేది. దీని ఫలితంగా మార్క్సిస్టుసంఘాల సిద్ధాంత - రాజకీయస్థాయి తగ్గిపోయింది. వాటిలో 'లీగల్ మార్క్సిస్టుల' అవకాశవాద ధోరణులు ప్రవేశించాయి. తత్ఫలితంగా సిద్ధాంత గందరగోళమూ, రాజకీయపు టూగిసలాటా, నిర్మాణంలో అరాచకమూ హెచ్చాయి.

కార్మికవర్గ ఉద్యమంయొక్క పెల్లుబికే వెల్లువా, త్వరలోనే విప్లవం తథ్యమనే సూచనా, విప్లవోద్యమాన్ని నడపు

సామర్థ్యంగల ఐక్య కేంద్రీకృతపార్టీ అవసరాన్ని తెలియజేశాయి. కాని స్థానికపార్టీ సంస్థలూ, స్థానిక కమిటీలూ, అధ్యయన కేంద్రాలూ, సమితులూ ఎంతో శోభనీయ పరిస్థితిలో వున్నాయి. సంఘనిర్మాణంలో అనైక్యత బాగా ప్రబలింది. సిద్ధాంత విభేదాలు తీవ్రంగా వున్నాయి. కనుక అలాంటి పార్టీని నిర్మించడం చాలా కష్టసాధ్యమైనపని.

మాటిమాటికీ ప్రజాసంఘాలలో ఉత్తమ కార్యకర్తలను ఏరి ప్రవాసాలకు, జైళ్ళకు, కఠినశిక్షలకు గురిచేస్తున్న జార్ ప్రభుత్వ పైశాచిక నిర్బంధ విధానాగ్ని మధ్య పార్టీని నిర్మించవలసి వచ్చింది. ఇదొకటేకాదు కష్టం. అనేక స్థానిక కమిటీలకు స్థానిక సభ్యులకు స్థానికంగా ఏవో చిన్నచిన్న కార్యకలాపాలు తప్ప మరో పనిలేదు. పైగా, పార్టీలో నిర్మాణరీత్యా, సిద్ధాంత రీత్యా ఐక్యత లేకపోవడంవల్ల కలిగే హానిని వారు గుర్తించలేదు. పార్టీలోవున్న అనైక్యతకు, సిద్ధాంత గందరగోళానికి వారు అలవాటుపడ్డారు. ఐక్య కేంద్రీకృత పార్టీ లేకుండానే నెట్టుకు పోవచ్చునని వారు తలచారు.

ఒకే కేంద్రీకృత పార్టీని నిర్మించాలంటే, స్థానిక సంఘాలలోని ఈ వెనుకబడ్డతనం, జడత్వం, సంకుచితదృష్టి-వీటన్నిటినీ జయించాలి.

ఇంతటితోనే సరిపోదు. పార్టీలోనే మరొక చెప్పుకో దగిన పెద్దముఠా వుంది. వారికి స్వంత పత్రికలు కూడా వున్నాయి. "రబోచయా మిసెల్" (Rabochaya Mysl) ("కార్మికాభిప్రాయం") అనే పత్రిక రష్యాలోను, విదేశాలలో "రబోచెయిూడెలో" (Rabocheye Delo-"కార్మికాశయం")

అనే పత్రికా వుండేవి. పార్టీలోవున్న సిద్ధాంత గందరగోళాన్ని, సుసంబద్ధ సంఘటన లేకపోవడాన్నికూడా వారు సమర్థింప జూచారు. ఒక్కొక్కసారి అలాంటి పరిస్థితులనుకూడ హర్షిం చారు. ఐక్య కేంద్రీకృత కార్మికవర్గ రాజకీయ పార్టీని నిర్మించే పథకం అనవసరమనీ, కృత్రిమమనీ వారు వాదించసాగారు.

వీరే "ఆర్థికవాదులూ" వారి అనుచరులూ.

ఐక్య శ్రామికవర్గ రాజకీయ పార్టీని నిర్మించేముందు "ఆర్థికవాదులను" ఓడించవలసియుంది.

ఈ కర్తవాన్ని పూర్తి చేసేందుకూ, కార్మికవర్గ పార్టీని నిర్మించేందుకూ లెనిన్ స్వయంగా పూనుకొన్నాడు.

కార్మికవర్గ ఐక్యపార్టీ నిర్మాణం ఎలా ప్రారంభించాలి అన్న విషయంపైన అభిప్రాయ భేదాలేర్పడ్డాయి. పార్టీ రెండవ కాంగ్రెస్‌ను సమావేశపరచితే, అది స్థానిక సంస్థలను ఐక్య పరచి పార్టీని నిర్మించుతుందని కొందరు భావించారు. కాని లెనిన్ దీనికి ప్రతికూలం. కాంగ్రెస్‌ను సమావేశపరచేముంద పార్టీ ఆశయాలను ఉద్దేశాలను స్పష్టపరచడం అవసరం. ఎలాంటి పార్టీ కావాలో తేల్చుకోడం అవసరం. "ఆర్థిక వాదుల"తో సిద్ధాంతరీత్యా విడివడటం అవసరం. పార్టీ ఆశయాలు ఉద్దేశాల గురించి – "ఆర్థికవాదుల"ది ఒకటీ, విప్లవకర సోషల్-డెమా క్రేట్లది ఒకటీ – రెండు వ్యతిరేక అభిప్రాయాలున్నాయని పార్టీ నిష్కపటంగా చిత్తశుద్ధితో చెప్పాలి. "ఆర్థికవాదులు" తమ అభిప్రాయాలకు అనుకూలంగా తమ పత్రికల్లో ప్రచారం గావించుకొంటున్నట్లే, విప్లవ సోషల్-డెమాక్రటిక్ సిద్ధాంతాల కనుకూలంగా పత్రికలలో విరివిగా ప్రచారం సాగించాలి

ఈ రెండు ధోరణులలో తమ కేది కావాలో ఆలోచించి నిర్ణ
యించుకోవలసిందని స్థానిక సంస్థలకు అవకాశం ఈయాలి.
అప్పునిసరియైన యీ ప్రాథమిక కార్యక్రమం పూర్తియైన
తమ్మాటనే కాంగ్రెస్‌ను సమావేశపరచాలి - అని లెనిన్
అభిప్రాయపడ్డాడు.

లెనిన్ సుస్పష్టంగా ఇలా చెప్పాడు :

"మనం ఐక్యమయేముందు, ఐక్యమయేందుకుగాను,
అన్నిటికన్నా ముందు మన విభేదాలను తెలియజేసే నిశ్చితమైన
చెరుపరాని హద్దుగీతలను (డిమార్కేషన్స్) గీయాలి."

(లెనిన్, సెలెక్టెడ్ వర్క్స్, ఇంగ్లీష్ ఎడిషన్,
మాస్కో- 1947, 1వ వాల్యూం, 162 వ పేజీ)

అందుచేత లెనిన్ అభిప్రాయంలో, కార్మికవర్గ రాజ
యపార్టీ నిర్మాణం, రష్యాకంతకూ సరిపోయే తీవ్ర
మిలిటెంట్) రాజకీయ వార్తాపత్రిక స్థాపనతో ప్రారం
భించాలి. విప్లవ సోషల్-డెమాక్రటిక్ సిద్ధాంతభావాలకు అను
కూలంగా ఆ పత్రిక ప్రచారం కావించుతుంది. అలాంటి
వార్తా పత్రికను స్థాపించడం పార్టీ నిర్మాణంలో మొదటి
మెట్టుగా ఉండాలి.

"ఎక్కడ ప్రారంభించాలి ?" ("Where to begin?")
అనే ప్రఖ్యాత వ్యాసంలో పార్టీ నిర్మాణ విషయమై ఒక
నిర్దిష్ట కార్యక్రమాన్ని లెనిన్ సూచించాడు. తర్వాత ఈకార్య
క్రమాన్నే "ఏం చేయాలి?" (What is to be done?) అనే
అతని ప్రముఖ గ్రంథంలో విశదీకరించాడు.

లెనిన్ ఈ వ్యాసంలో ఇలా వ్రాశాడు :

"మన కార్యకలాపాలకు ప్రారంభం, మనం కోరే సం
(అంటే పార్టీ నిర్మాణం-సంపాదకులు) నిర్మించడానికి మొ
మొదటి మెట్టు, రష్యాకంతకూ సరిపోయే రాజకీయ వార్త
పత్రికను స్థాపించడమే. ఇంతేగాదు. మనం ముమ్ముందు అచం
లంగా పార్టీ నిర్మాణాన్ని వృద్ధిపరచి విస్తృతపరచి పెంచిం
గల ముఖ్యసూత్రం ఇదే...అట్టి పత్రిక లేకుండా సర్వవ్యాపి
ప్రచారాన్ని ఆందోళననూ నిరంతరం కొనసాగించలేమ
మూలసూత్రాలకు అనుగుణ్యమైన అలాంటి ప్రచారము
ఆందోళనా, సాధారణంగా సోషల్ డెమాక్రట్లకు నిరంత
ముఖ్య కర్తవ్యం. ఇక రాజకీయాలలోను సోషలిస్టు సమస్య
లోను అభిరుచి బహుళ ప్రజానీకంలో వృద్ధిచెందుతున్న
రోజులలో, అలాంటి ప్రచారమూ ఆందోళనా సోషల్-డెమ
క్రట్లకు మరింత తక్షణ కర్తవ్యం. అందుచే అట్టి పత్రి
లేకుండా సర్వవ్యాపిత ప్రచారాన్ని ఆందోళననూ నిరంతర
కొనసాగించలేము." (లెనిన్, కలెక్టెడ్ వర్క్సు, రష్య
ఎడిషన్, నాల్గవ వాల్యూం, 110 వ పేజీ)

అలాంటి వార్తా పత్రిక పార్టీని సిద్ధాంతరీత్యా గట్టి
ఐక్యపరచడమే గాక, పార్టీలోని స్థానిక సంస్థలను నిర్మా
రీత్యా ఐక్యపరచుతుందని కూడా లెనిన్ భావించాడు. స్థా
సంస్థల ప్రతినిధులయిన వార్తా పత్రికా విలేఖర్లు, ఏజం
పార్టీకి అస్థిపంజరం లాంటివారు. ఈ అస్థిపంజరంచుట్టూ పార్టీ
సంఘటిత రూపంలో నిర్మింపవచ్చునని లెనిన్ భావించా
(అంటే దీనికి ఒక రూపం కల్పించి జీవం పోయవచ్చునని భావ
అనువాదకుడు). లెనిన్ ఇలా అన్నాడు: "వార్తా పత్రిక

సమిష్టి ప్రచారమూ, సమిష్టి ఆందోళనా మాత్రమే గాదు. అది సమిష్టి ఉద్యమ నిర్మాత (ఆర్గనైజరు) కూడా."

ఇదే వ్యాసంలో లెనిన్ ఇంకా ఇలా వివరించాడు:

"మనం కోరే నిర్మాణం (ఆర్గనైజేషన్) ఎలాంటిదై యుండాలి? దేశమంతా విస్తరించినంత పెద్దదిగా ఉండాలి. ఖచ్చితమైన వివరమైన పని విభజన కలియుండేందుకుగాను, విశాలంగాను బహుముఖంగానూ ఉండాలి. అన్ని పరిస్థితుల లోను, కొత్త మార్గం తొక్కే సమయాలలోను (turns), హఠాత్ ఘటనలన్నిటిలోను అది తన పనిని అచంచలంగా సాగించగల్గేందుకు అవసరమైన పరీక్ష నెగ్గిందిగాను, కాకలు తీరిందిగాను ఉండాలి. తన యావచ్ఛక్తులనూ ఒక చోట కేంద్రీకరించి అత్యధిక సంఖ్యాబలం కలిగిన శత్రువుతో ప్రత్యక్ష పోరాటం తప్పించుకోగలిగిన చాకచక్యం కలిగివుండాలి. అయి నప్పటికీ శత్రువు యొక్క విషమపరిస్థితిని అదునుగా తీసుకొని, ఎప్పుడు ఎక్కడ శత్రువు మన దాడిని తక్కువగా అంచనా వేస్తున్నాడో అపుడు అక్కడ శత్రువుపై దాడి చేయగలిగి నట్టిదిగా వుండాలి. అలాంటి నిర్మాణానికి వార్తాపత్రిక ఏజెంట్ల పరంపరయే అస్థిపంజరంగా ఏర్పడుతుంది." (పై గ్రంథమే, 112 వ పేజీ).

"ఇస్క్రా" అలాంటి పత్రిక కావాలి.

"ఇస్క్రా" నిజంగా అలాగే రష్యాకంతకూ సరిపోయే రాజకీయ వార్తాపత్రిక అయింది. పార్టీ సిద్ధాంతరీత్యా, నిర్మాణ త్యా సుస్థిరపరుచుకోడానికి ఇది త్రోవదీసింది.

ఇక పార్టీ ఆకృతి, అంగ నిర్మాణాల (Structure and Composition) గురించి లెనిన్ అభిప్రాయమిది: పార్టీ రెండు భాగాలను కలిగియుండాలి. (1) ముఖ్యమైన పార్టీ వర్కర్లయిన రెగ్యులర్ కాడర్స్‌తో (నిత్యకార్యకర్తలతో) కూడిన సన్నిహిత బృందం. వీరిలో ఎక్కువగా విప్లవమే వృత్తిగాగల వారు ఉండాలి! వారికి పార్టీపని తప్ప మరోపని వుండరాదు. కనీస సిద్ధాంత పరిజ్ఞానమూ, రాజకీయ అనుభవమూ, నిర్మాణ విషయాలలో అలవాటూ, జార్ పోలీసులతో పోరాడే చాతుర్యమూ, తప్పించుకొనే నేర్పూ వారు కలిగియుండాలి. (2) విస్తృతమైన అల్లికతో కూడిన పార్టీ స్థానిక సంస్థలు ఏర్పడాలి. లక్షలాది శ్రమజీవుల సానుభూతిని పొందగలిగిన పార్టీ సభ్యుల సంఖ్య బహుళంగా వుండాలి.

లెలిన్ ఇంకా ఇలా వ్రాశాడు :

"నేను నొక్కి చెప్పేదేమంటే: (1) నిరంతరాయమైన నాయకులు కల్గిన నిలకడమైన నిర్మాణం లేకుండా ఏ విప్లవోద్యమమూ నిలవజాలదు. (2) అప్రయత్నంగా తమంతకు తామే (Spontaneously) పోరాటంలోకి ఎంత ఎక్కువగా ప్రజా సామాన్యం వస్తారో, ...పైనచెప్పిన ఆ నిర్మాణంకూడా అంత త్వరగా మనకవసరం. ఇంతేగాదు. ఆ నిర్మాణం అంతదృఢంగా కూడా వుండాలి. (3) విప్లవ కార్యకలాపాలలోనే వృత్తిగా నిమగ్నులయినవారితో ముఖ్యంగా అటువంటి నిర్మాణం నిండి వుండాలి. (4) నిరంకుశ ప్రభుత్వం పైన ఉన్నప్పుడు అలాంటి నిర్మాణంలో, విప్లవ కార్యకలాపాలే వృత్తిగా కలిగినవారినే, రాజకీయ పోలీసులతో పోరాడే చాతుర్యంలో వృత్తిగా

తర్ఫీదుపొందిన వారినే సభ్యులుగా తీసుకొన్నకొలదీ అలాంటి నిర్మాణాన్ని రూపుమాపటం ప్రభుత్వానికి కష్టమౌతుంది. (5) ఇంతేగాదు. తత్ఫలితంగా కార్మికవర్గంనుండీ సమాజము లోని ఇతర వర్గాలనుండీ వచ్చినవారు ఆ ఉద్యమంలో ఎక్కువగాచేరి దానిలో మరింత తీవ్రంగా పనిచేయగల్గుతారు."

(పై గ్రంథమే, 456 వ పేజీ)

నిర్మింపబడుతూన్న పార్టీ స్వభావం ఏమిటి? కార్మిక వర్గంతో దాని సంబంధ పాత్ర యేమిటి? పార్టీ ఆశయాలు ఉద్దేశాలు ఏమిటి?— ఈ విషయాలపై లెనిన్ అభిప్రాయం ఇది: పార్టీ, కార్మికవర్గానికి పురోగామిగా (వేన్‌గార్డ్‌గా) వుండాలి. శ్రామిక జనవర్గ పోరాటాన్ని నడిపించుతూ, సమన్వయించుతూ, అది కార్మికవర్గ ఉద్యమానికి మార్గదాయక శక్తిగా వుండాలి. పార్టీయొక్క అంతిమ ఆశయం పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోసి సోషలిజాన్ని స్థాపించడం. తక్షణ ఆశయం జార్ ప్రభుత్వాన్ని కూలద్రోసి ప్రజాతంత్ర విధానాన్ని నెలకొల్పడం. జార్ ప్రభుత్వాన్ని మొదట కూలద్రోయనిదే పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయడం అసాధ్యం. కాబట్టి, ఈ సమయంలో పార్టీ ప్రధాన కర్తవ్యం కార్మికవర్గాన్నీ ప్రజలందరినీ జార్ ప్రభుత్వ వ్యతిరేక పోరాటానికి ఉత్తేజపరచడం, ప్రజా విప్లవోద్యమాన్ని వృద్ధిచేయడం, సోషలిస్టు మార్గానికి మొదటి తీవ్ర ప్రతిబంధకమైన జార్ ప్రభుత్వాన్ని కూలద్రోయడం—అని లెనిన్ అభిప్రాయం.

లెనిన్ ఇలా వ్రాశాడు: "ఏ దేశపు శ్రామికవర్గమూ ఎదుర్కొనని ఒక తక్షణకర్తవ్యాన్ని చరిత్ర మనపై విధించింది.

ఆ కర్తవ్యం అన్నిటికంటె అత్యంత విప్లవకర తక్షణ కర్తవ్యం. యూరప్‌లోనేగాక (ఇప్పుడు ఇలాగకూడ చెప్పవచ్చు.) ఆసియాలోకూడ అత్యంత శక్తియుతమైన విప్లవ ప్రతీఘాతపు కోటను (అంటే జార్ ప్రభుత్వాన్ని - అను) రష్యన్ శ్రామికవర్గం నాశనం చేయాలి. ఈ కర్తవ్యాన్ని పూర్తి చేయడంవల్ల, అంత ర్జాతీయ విప్లవశ్రామికవర్గానికి రష్యన్ శ్రామికవర్గం పురోగామి (వేన్‌గార్డ్) అవుతుంది." (పై గ్రంధమే, 382వ పేజీ)

లెనిన్ ఇంకా ఇలా వ్రాశాడు:

"పాక్షిక కోర్కెలకోసం ప్రభుత్వంతో జరిపేపోరాటం, పాక్షిక కోర్కెలను కొన్నింటిని సాధించడం, శత్రువుతో చిన్న చిన్న తగాదాలు మాత్రమే, శివారులలో (Outposts) శత్రువులతో జరిపే చిన్నచిన్న ఘర్షణలు మాత్రమే - అని మనం గుర్తించాలి. నిశ్చితపోరాటం ఇకముందు జరుపవలసియుంది. మనముందు శత్రువుకోట తన యావచ్ఛక్తితోనూ నిలబడివుంది. మనపై అది తుపాకిగుండ్లను ఫిరంగిగుండ్లను కురిపించుతూంది. మన ఉత్తమయోధులను రంపపుకోత కోస్తూంది. ఈ కోటను మనం పట్టుకోవాలి. జాగృతమవుతున్న శ్రామికవర్గ శక్తులతో, రష్యన్ విప్లవకారుల శక్తులన్నిటినీ కలిపి ఒకపార్టీని ఏర్పరచి నట్లయితే ఆ కోటను పట్టుకోగలం. ఆ పార్టీలోకి రష్యాలోని ఉత్సాహవంతులను చిత్తశుద్ధిగల వారినందరినీ ఆకర్షించాలి. అప్పుడే 'లక్షలకొలది కష్టజీవుల దృఢహస్తం లేస్తుంది. సైనికుల బాయ్‌నెట్ల (తుపాకిసన్నీల)చే కాపాడబడుతూన్న నిరంకుశ ప్రభుత్వ దాస్యం తుత్తునియలై ధ్వంసమవుతుంది' అని రష్యన్ విప్లవకార్మికుడు ప్యోటర్ అలెక్జియెవ్ Pyotr-Alexyev) చెప్పిన ప్రవచనం నిజమౌతుంది."

(పై గ్రంధమే 59 వ పేజీ)

నిరంకుశ జార్ ప్రభుత్వ రష్యాలో కార్మికవర్గ పార్టీని నిర్మించడానికి లెనిన్ వేసిన పథకం అది.

లెనిన్ పథకంపై దాడి సల్పడానికి "ఆర్థికవాదులు" ఏమాత్రం ఆలస్యం చేయలేదు. వారీ విధంగా వాదించారు.

జార్ ప్రభుత్వ వ్యతిరేక రాజకీయ పోరాటం అన్ని వర్గాలకు చెందినది. ముఖ్యంగా పెట్టుబడిదారులకు చెందినది. అందుచేత కార్మికవర్గానికి అంత ముఖ్య అవసరంలేదు. ఎక్కువ జీతాలకోసం, పనిచేసే పరిస్థితులు బాగుపడడంకోసం, యజమానులపై ఆర్థికపోరాటం సాగించుటలోనే, కార్మికుల ముఖ్య ప్రయోజనం వుంది. అందుచేత, సోషల్-డెమాక్రట్ల ప్రధాన తక్షణ కర్తవ్యం "యజమానులపైన, ప్రభుత్వంపైన కార్మికుల ఆర్థిక పోరాటాన్ని" సంఘటితపరచుటేగాని, జార్ ప్రభుత్వంపై పోరాడుటకుగాని, దాన్ని కూలద్రోయుటకుగాని కాదు. ప్రభుత్వంపై ఆర్థికపోరాటం అంటే, ఎక్కువ సౌకర్యాలు కల్గించే ఫ్యాక్టరీ చట్టాకోసం పోరాట మన్నమాట. ఈ విధంగా "ఆర్థిక పోరాటానికి దానంతకదే రాజకీయ స్వభావం కల్గించుట" సాధ్యమని "ఆర్థికవాదులు" వాదించారు.

కార్మికవర్గానికి ఒక రాజకీయ పార్టీ కావలసిన ఆవశ్యకతను "ఆర్థికవాదులు" బహిరంగంగా ఎదిరించ సాహసించలేకపోయారు. కార్మికవర్గ ఉద్యమానికి మార్గదాయకశక్తిగా పార్టీ ముందుండ రాదట. అప్రయత్నంగా వచ్చే కార్మికవర్గ ఉద్యమాన్ని నడపడంమాట అలావుంచి పార్టీ అసలు దానిలో జోక్యంకల్గించుకోరాదట. కాని ఆ వుద్యమం తోకవెనుక పార్టీ నడిచి దానినిపరిశీలించి దానినుండి గుణపాఠాలు నేర్చుకోవాలట.

"ఆర్థికవాదులు" ఇంకా ఇలా వాదించారు : కార్మిక వర్గ ఉద్యమంలో చైతన్యశక్తుల (Conscious element) పాత్ర; సోషలిస్టు చైతన్యానికీ సోషలిస్టు సిద్ధాంతానికీ గల నిర్మాణాత్మక మార్గదర్శక పాత్ర పూర్తిగా లేనేలేదని లేక దాదాపు లేనేలేదని ఆర్థికవాదులు వాదించారు. సోషలిస్టు చైతన్య స్థాయికి కార్మికుల మనస్సులను సోషల్-డెమొక్రట్లు తీసుకుపోరాదనీ, పైపెచ్చు సోషల్-డెమొక్రట్లే సాధారణ కార్మికుల స్థాయికి - ఇంకా మాటాడితే - చాలా వెనకబడ్డ కార్మికవర్గ ప్రజల స్థాయికి దిగిపోవాలనీ, సరిపుచ్చుకోవాలనీ ఆర్థికవాదులు వాదించారు. కార్మికవర్గానికి సోషలిస్టు చైతన్యాన్ని సోషల్-డెమొక్రట్లు అందించరాదనీ, అప్రయత్నంగా వచ్చిన కార్మికవర్గ ఉద్యమం తనంతకు దాను సోషలిస్టు చైతన్యాన్ని పొందేవరకు వారు వేచివుండాలనీ "ఆర్థికవాదులు" వాదించారు.

లెనిన్ సూచించిన పార్టీ నిర్మాణ పథకం, అప్రయత్న (స్పాంటేనియస్) ఉద్యమంపైన దాదాపుగా హింసాచర్య అని "ఆర్థికవాదులు" భావించారు.

"ఇస్క్రా" పత్రికలోనూ, "ఏంచేయాలి ?" (What is to be Done ?) అనే అతని మహోన్నత గ్రంథంలోనూ, లెనిన్ "ఆర్థికవాదుల" ఈ అవకాశవాద తత్వంపై తీవ్రంగా దాడిచేసి, సమూలంగా నాశనం గావించాడు.

(1) జార్ ప్రభుత్వ ప్రతికూలమైన రాజకీయపోరాటం నుండి కార్మికవర్గాన్ని పెడమార్గం పట్టించి, ప్రభుత్వాన్నీ యజమానులనూ ముట్టకుండా అలాగే వుంచి, వారితో ఆర్థిక

పోరాటం మాత్రమే సాగించుట కార్మికుల కర్తవ్యమని నిర్ధారణ చేయడం అంటే— కార్మికులను శాశ్వత దాస్యానికి లోను చేయడమే. ప్రభుత్వంతోను, యజమానులతోను కార్మికుల ఆర్థిక పోరాటంఅంటే ఏమిటి? తమ శ్రమశక్తిని పెట్టుబడిదారులకు అమ్ముకొనుటలో మంచి షరతులకోసం పోరాడే ట్రేడ్ యూనియన్ పోరాటం. పెట్టుబడిదారులకు తమ శ్రమశక్తిని అమ్ముకొనుటలో మంచి షరతులకోసమేగాక పెట్టుబడిదారీ విధానం రద్దుచేయడానికి కూడా కార్మికులు పోరాడదలచారు. ఎంచేతనంటే, తమ శ్రమశక్తిని పెట్టుబడిదారులకు అమ్ముకొనే దుస్థితికి తెచ్చినదీ, దోపిడికి గురియై బాధపడునట్లు చేసినదీ ఈ పెట్టుబడిదారీ విధానమే. అందుచేత ఈ పెట్టుబడిదారీ విధానాన్నే రద్దు చేయడానికి పోరాటం సాగించాలని కార్మికులు తలిచారు. కాని పెట్టుబడిదారీ విధానంయొక్క కావలికుక్క అయిన జార్ ప్రభుత్వం, వారి ఉద్యమ పంథాలో ప్రతిబంధకంగా వున్నన్నాళ్లు కార్మికులు పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగాను సోషలిజం కోసమూ తాము జరిపే పోరాటాన్ని పూర్తిగా వృద్ధిచేయలేరు. అందుచేత మార్గమధ్యంనుండి జార్ ప్రభుత్వాన్ని తొలగించి సోషలిజానికి మార్గం సుగమంచేయడం పార్టీయొక్కయూ, కార్మికవర్గం యొక్కయూ తక్షణ కర్తవ్యం.

(2) కార్మికోద్యమంలోని అప్రయత్న క్రమాన్ని (స్పాంటేనియస్ ప్రోసెస్‌ను) పొగడటం అంటే, పార్టీకినాయక పాత్ర ఉన్నదన్న విషయాన్ని నిరాకరించడం అంటే, జరుగుతున్న ఘటనలను చిత్రించుటే పార్టీ పాత్ర అని అనడం అంటే, "ఖోస్టిజం"ను (రైలు పట్టాలనుబడి అనుసరించడం – తోక

పట్టుకు పోవడం) బోధించడమే. అప్రయత్న ఉద్యమక్రమాన్ని మార్చి మాత్రమే ధ్యానిస్తూ ఘటనలను వాటి ఇష్టంవచ్చిన మార్గం పట్టనిచ్చేటటువంటి ఉద్యమ నిశ్చేష్టశక్తిగా, అప్రయత్న ఉద్యమక్రమం (స్పాంటేనియస్ ప్రాసెస్) యొక్క తోకగా, పార్టీని మార్చమని బోధించడమే. ఇలా ప్రచారం చేయడం పార్టీని నాశనంచేయడం. అనగా కార్మికవర్గానికి పార్టీ లేకుండా నిరాయుధం చేయడం. ఆపాదమస్తకమూ సాయుధమైన జారు ప్రభుత్వమూ, నవీనపద్ధతులపై నిర్మాణం కలిగి కార్మికవర్గంపై పోరాటాన్ని సాగించడానికి తమ పార్టీని ఏర్పరచుకొన్న పెట్టుబడిదారీవర్గమూ కార్మికవర్గానికి శత్రువులు. ఇలాంటప్పుడు కార్మికవర్గాన్ని నిరాయుధంగా వదలివేయడమంటే దానికి ద్రోహం చేయడమే.

(3) లెనిన్ ఈక్రింది విధంగా వాదించాడు: అప్రయత్న కార్మికవర్గ ఉద్యమాన్ని పూజిస్తూ తలఒగ్గడం, అంటే చైతన్యంయొక్క, సోషలిస్టు చైతన్యంయొక్క, సోషలిస్టు సిద్ధాంతంయొక్క ప్రాముఖ్యతను తక్కువ చేయడమే. అంధకారంలోనుండి వెలుగును కొనిరాబడినట్లుగా చైతన్యం పొందుతున్న కార్మికులను అవమానపరచడం మొదటి తప్పు. పార్టీ దృష్టిలో సిద్ధాంత విలువను తగ్గించడం అనగా వర్తమానాన్ని అర్థం చేసుకొని భవిష్యత్తును పారజూడగలిగేందుకు పార్టీకి అవసరమయిన సాధనాన్ని తక్కువ అంచనా వేయడం రెండవ తప్పు. అవకాశవాదం అనే ఊబిలో మళ్ళా తలయెత్తకుండా దిగజారడం మూడవ తప్పు.

లెనిన్ ఇలా అన్నాడు: "విప్లవ సిద్ధాంతం లేనిదే విప్లవోద్యమ మనేదేలేదు ... బాగా అభివృద్ధినొందిన సిద్ధాంతంచే నడుపబడే పార్టీయే, ముందుండి పోరాడే (వేన్‌గార్డ్ ఫైటర్) పాత్రను నిర్వహించగలదు." (లెనిన్, సెలెక్టెడ్ వర్క్స్ ఇంగ్లీష్ ఎడిషన్, మాస్కో 1947, వాల్యూం ఒకటి. 163, 164 పేజీలు)

(4) అప్రయత్న కార్మికవర్గ ఉద్యమంనుండి సోషలిస్టు సిద్ధాంత తత్వం తలయెత్తవచ్చునని "ఆర్థికవాదులు" వాదించారంటే, వారు కార్మికవర్గాన్ని మోసగించుతున్నారు. వాస్తవానికి సోషలిస్టు సిద్ధాంతం అప్రయత్న ఉద్యమంనుండి గాక విజ్ఞానశాస్త్రం (సైన్సు)నుండి తలయెత్తుతుంది. కార్మికవర్గానికి సోషలిస్టు చైతన్యాన్ని అందజేయవలసిన ఆవశ్యకతను నిరాకరించుటద్వారా, "ఆర్థికవాదులు", బూర్జువా సిద్ధాంతానికి దారి సుగమం చేస్తున్నారు. కార్మికవర్గంలో బూర్జువా సిద్ధాంతాన్ని చొప్పించి వెదజల్లడానికి సహాయపడుతున్నారు. తత్ఫలితంగా, కార్మికవర్గ ఉద్యమాన్నీ సోషలిజాన్నీ ఐక్యంచేయాలనే భావాన్ని పాతిపెడుతున్నారు. ఆవిధంగా బూర్జువాజీకి సహాయపడుతున్నారు—అని లెనిన్ నిరూపించాడు.

లెనిన్ ఇంక ఇలా అన్నాడు: "అప్రయత్న కార్మికోద్యమాన్ని పూజించడం, 'చైతన్యాంశం' యొక్క పాత్రను, సోషల్ - డెమాక్రటిక్ పార్టీయొక్క పాత్రను చిన్నచూపు చూడటం కార్మికులలో బూర్జువాసిద్ధాంత పలుకుబడిని బలపరచడమే. ఇలా చేసేవారు తమ కిష్టమై చేసినా, లేక ఇష్టంగాక చేసినా, ఫలితం మాత్రం ఒకటే."

(పై గ్రంథమే 173వ పేజీ)

ఇంకా :

"బూర్జువా సిద్ధాంతాన్నో, సోషలిస్టు సిద్ధాంతాన్నో – ఈ రెంటిలో – ఏదో ఒక దానిని ఎన్నుకోవాలి. మరో మధ్య మార్గంలేదు... ఏవిధంగానైనాసరే సోషలిస్టు సిద్ధాంతాన్ని చిన్నచూపు చూడటం అంటే, సోషలిస్టు సిద్ధాంతంనుండి స్వల్పమాత్రంగానైనా తిరిగి పోవడం అంటే బూర్జువా సిద్ధాంతాన్ని బలపరచడం అన్నమాట."

(పై గ్రంథమే. 174–175 పేజీలు)

(5) "ఆర్థికవాదుల" ఈ తప్పులన్నిటినీ క్రోడీకరించుతూ లెనిన్ ఈ క్రింది నిర్ణయానికి వచ్చాడు: పెట్టుబడిదారీవిధానం నుండి కార్మికవర్గాన్ని స్వతంత్రులను చేయడానికి కావలసిన సామాజిక విప్లవపార్టీని వారు కోరరు. కాని పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని రక్షించదలచిన "సామాజిక సంస్కరణ" పార్టీని వారు అపేక్షించుతారు. అందుచే "ఆర్థికవాదులు" శ్రామిక వర్గ ప్రధాన ప్రయోజనాలకు ద్రోహంచేస్తున్న సంస్కరణ వాదులు.

(6) ఆఖరు విషయం. "ఆర్థికవాదం"రష్యాలో అకస్మాత్తుగా సంభవించినది కాదు. కార్మికవర్గంపైన పెట్టుబడిదారుల పలుకుబడికి ఆర్థికవాదులు ఒక సాధనం. పశ్చిమ యూరోపియన్ సోషల్–డెమాక్రటిక్ పార్టీలలో ఆర్థికవాదులను స్నేహితులున్నారు. వారు అవకాశవాది బెరన్‌స్టీన్ యొక్క అనుచరులైన కుసంస్కర్తలు (రివిజనిస్టులు). పశ్చిమ యూరప్‌లో సోషల్ డెమాక్రటిక్ పార్టీలలో అవకాశవాదధోరణి బలపడుతూంది. మార్కున్ను "విమర్శించే స్వాతంత్ర్యం" కావాలనే

వంకతో వారు మార్క్సిస్టు సిద్ధాంతాలనే సంస్కరించాలని (తిరిగి దిద్దాలని) అన్నారు. (అందుచేతనే వీరికి కుసంస్కర్తలని పేరు వచ్చింది). వీరి ధోరణి, విప్లవాన్ని సోషలిజాన్ని శ్రామిక నియంతృత్వాన్ని పరిత్యజించాలనుటే. విప్లవ పోరాటాన్ని సోషలిజాన్ని శ్రామిక నియంతృత్వాన్ని – ఇవన్నీ వదులుకోవడమే రష్యన్ ఆర్థికవాదుల పాలసీ కూడా అని లెనిన్ నిరూపించాడు.

అవీ, "ఏంచేయాలి" (What is to be done?) అనే తన గ్రంథంలో లెనిన్ విశదపరచిన ముఖ్య సిద్ధాంతసూత్రాలు.

ఈ గ్రంథం 1902 మార్చిలో ప్రచురించబడింది. ఇది ప్రకటించిన తర్వాత సంవత్సరానికి – రష్యన్ సోషల్–డెమాక్రటిక్ పార్టీ రెండవ కాంగ్రెసునాటికి ఇది బాగా ప్రచారమయినందున 'ఆర్థికవాదం' యొక్క సిద్ధాంత పటిమ ఏదో అప్రతిష్టాకరమైన స్మృతిగా మాత్రం నిలిచిపోయింది. ''ఆర్థికవాదుల''ని పిలవబడటం అవమానమని పార్టీలో అధికసంఖ్యాకులు భావించేవారు.

ఆర్థికవాదం సిద్ధాంతరీత్యా పూర్తి అపజయం పొందడం వల్ల అవకాశవాదం, ఖ్వోస్టిజం (Khvostism) అప్రయత్న ఉద్యమం (Spontaneity) మొదలగువాటి సిద్ధాంతాలు కూడా పూర్తిగా అపజయం పొందాయి.

కాని "ఏం చేయాలి?" (What is to be done?) అనే గ్రంథం యొక్క ప్రాముఖ్యత ఇంతటితోనే తీరిపోలేదు.

ఈ మహోన్నత గ్రంథంయొక్క చారిత్రక ప్రాముఖ్యత ఈ క్రింది విషయాలవల్ల తెలుస్తుంది. దీనిలో లెనిన్,

(1) మార్క్సిస్టు ఆలోచనా క్రమ చరిత్రలో మొట్ట మొదటిసారిగా, అవకాశవాదం యొక్క సిద్ధాంత బీజాలేమిటో బట్టబయలు చేశాడు. అప్రయత్న కార్మికోద్యమాన్ని పూజించుటలోను, కార్మికవర్గ ఉద్యమంలో సోషలిస్టు చైతన్యం యొక్క పాత్రను చిన్న చూపు చూచుటలోనూ ముఖ్యంగా ఆ సిద్ధాంత బీజాలున్నాయని తెలియజేశాడు.

(2) సిద్ధాంతంయొక్క, చైతన్యంయొక్క గొప్పప్రాముఖ్యతనూ,అప్రయత్న జనితకార్మికవర్గ ఉద్యమానికి నాయకత్వం వహించి దానిని విప్లవ ఉద్యమంగా మార్చే పార్టీ యొక్క గొప్ప ప్రాముఖ్యతనూ లెనిన్ స్పష్టీకరించాడు.

(3) మార్క్సిస్టుపార్టీ అంటే కార్మికవర్గ ఉద్యమంతో సోషలిజాన్ని మేళవించుటయే అన్న ప్రధాన మార్క్సిస్టు సిద్ధాంత ప్రతిపాదనను (థీసిస్‌ను) అత్యంత చాకచక్యంతో లెనిన్ నిరూపించాడు.

(4) మార్క్సిస్టు పార్టీ సిద్ధాంత పునాదులను అత్యద్భుతంగా విశదపరచాడు.

"ఏం చేయాలి ?" (What is to done ?) అనే గ్రంథంలో లెనిన్ విశదీకరించిన సిద్ధాంత ప్రతిపాదనలే ఆ తర్వాత బోల్షివిక్‌పార్టీకి సిద్ధాంత పునాది అయాయి.

పార్టీ నిర్మాణానికి, పార్టీ శక్తులను కూడగట్టడానికి, పార్టీ రెండవ కాంగ్రెసును సమావేశపరచడానికి లెనిన్ ఒక పథకం వేశాడు. దీనికి అనుకూలముగాను, విప్లవ సోషల్ - డెమాక్రటిక్ సిద్ధాంతాలకు అనుకూలంగాను - ఆర్థికవాదులకు కుసంస్కర్తలకు అన్నిరకాల అవకాశవాదులకు వ్యతిరేకంగాను,

సిద్ధాంతసంపద గల్గియుండుటవల్లనే "ఇస్క్రా" పత్రిక బహుళ ప్రచారాన్ని చేయగల్గింది; వాస్తవంగా చేసింది కూడా.

"ఇస్క్రా" చేసిన అతి ప్రముఖ కార్యాలలో ఒకటి పార్టీ కార్యక్రమాన్ని తయారుచేయడం. కార్మికపార్టీ కార్యక్రమం అంటే, క్లుప్తంగా శాస్త్రీయంగా కార్మికవర్గపోరాట ఆశయాలను ఉద్దేశాలను సూత్రీకరించిన ప్రకటన అని మనకు తెలిసిన విషయమే. శ్రామికవర్గ విప్లవోద్యమంయొక్క అంతిమ ధ్యేయాన్నీ, ఆ అంతిమ ధ్యేయం చేరేలోపల మార్గమధ్యంలో పార్టీ పోరాడవలసిన కోర్కెలనూ, ఈకార్యక్రమం నిర్వచించింది. అందుచే దీనిని తయారుచేయుట ప్రధాన ప్రాముఖ్య విషయం.

ఈ కార్యక్రమం తయారుచేస్తున్నప్పుడు, "ఇస్క్రా" సంపాదకవర్గంలో లెనిన్‌కూ ప్లెఖనావ్ మొదలైన తదితరులకూ మధ్య తీవ్రమైన విభేదాలు తలయెత్తాయి. ఈ విభేదాలు తగాదాలే చివరకు లెనిన్‌కూ ప్లెఖనావ్‌కూ మధ్య పూర్తి తెగతెంపులకు కారణమయింది. కాని ఆనాడే పూర్తిగా అంతవరకు పోలేదు. కార్యక్రమ ముసాయిదా (డ్రాఫ్ట్‌ప్రోగ్రాం)లో, లెనిన్, శ్రామికవర్గ నియంతృత్వాన్ని గురించిన ఒక అతిముఖ్యమగు క్లాజును, విప్లవంలో కార్మికవర్గ నాయకపాత్రను గురించిన ఒక విస్పష్ట ప్రకటనను చేర్పించ గలిగాడు.

ఇంతేగాక, ఈ కార్యక్రమంలోని వ్యవసాయక సంబంధమైన భాగమంతా లెనినే వ్రాశాడు. అప్పటికే భూమిని జాతిపరం చేయడానికి లెనిన్ అనుకూలంగా వున్నాడు. కాని పోరాటం మొదటిదశలో, రైతులకు 'ఓట్రెజ్కీ' (Otrezky)ని

తిరిగి ఈయాలనేది మొదటికోర్కెగా పెట్టాలని లెనిన్ అన్నాడు. రైతులకు 'విమోచనం' కల్గించినప్పుడు (అనగా అర్ధ - బానిస విధానం రద్దుచేసినప్పుడు - అనువాదకుడు) భూస్వాములు రైతులనుండి విభజించి లాక్కొన్న భూభాగాలను (వీటినే "ఓట్రెజ్కీ' అంటారు) తిరిగి రైతులకు ఈయాలనేదే ఈ కోర్కె. భూమిని జాతిపరం గావించడాన్ని ప్లెఖనావ్ వ్యతిరేకించాడు.

పార్టీ కార్యక్రమంమీద లెనిన్‌కూ ప్లెఖనావ్‌కూ ఏర్పడిన తగాదాలు, ముందుముందు రానున్న బోల్షివిక్ - మెన్షివిక్ విభేదాలను కొంతవరకు నిర్ణయించాయి.

# 3

## రష్యన్ సోషల్ - డెమూక్రటిక్ లేబర్ పార్టీ రెండవ కాంగ్రెసు-ఏకైక పార్టీ (సింగిల్ పార్టీ)- నిర్మాణం- పార్టీ కార్యక్రమం, నిబంధనల ఆమోదం- కాంగ్రెసులో విభేదాలు- పార్టీలో బోల్షివిక్, మెన్షివిక్ అనే రెండు ధోరణులు తలయెత్తుట

ఆవిధంగా లెనిన్ ముఖ్యసూత్రాలు విజయం పొందడమూ, లెనిన్ నిర్మాణ పథకాన్ని గురించి "ఇస్క్రా" పత్రిక విజయవంతంగా సాగించిన పోరాటమూ, పార్టీ నిర్మాణానికి (ఆ రోజుల్లో చెప్పినట్లు నిజమైన పార్టీ నిర్మాణానికి) అవసరమైన

ముఖ్య పరిస్థితులన్నిటినీ సమకూర్చాయి. రష్యాలో సోషల్-డెమాక్రటిక్ సంఘాలలో "ఇస్క్రా" ధోరణియే పై చేయి సంపాదించింది. పార్టీ రెండవ కాంగ్రెసును ఇక సమావేశపరచ వచ్చును.

1903 జూలై 17 న (కొత్త క్యాలండరు ప్రకారం జూలై 30 వ తేదీన) ర. సో. డె. లేబర్ పార్టీ రెండవ కాంగ్రెస్ ప్రారంభమయింది. అది విదేశాలలో రహస్యంగా జరిగింది. మొదట ఈ కాంగ్రెస్ బ్రసెల్స్‌లో సమావేశమయ్యింది. కాని బెల్జియన్ పోలీసులు కాంగ్రెసు ప్రతినిధులను దేశంనుండి వెళ్ళిపొమ్మని కోరారు. అందుచే కాంగ్రెస్ లండన్‌కు మారి అచట సమావేశమయింది.

26 సంఘాలకు ప్రాతినిధ్యం వహించిన 43 ప్రతినిధులు కాంగ్రెసుకు హాజరయ్యారు. ఒక్కొక్క కమిటీకి ఇద్దరు ప్రతినిధులను పంపవచ్చు. కాని కొన్ని కమిటీలు ఒక్కొక్కరినే పంపాయి. మొత్తం 43 ప్రతినిధులకు 51 వోట్లున్నాయి.

"'ఇస్క్రా' పత్రిక సూచించి విశదీకరించిన ముఖ్య సూత్రాలనూ నిర్మాణాన్నీ ఆధారంగా తీసుకొని నిజమైన పార్టీని నిర్మించడమే" కాంగ్రెసుయొక్క ప్రధాన ఉద్దేశ్యం. (లెనిన్, సెలెక్టెడ్ వర్క్స్, ఇంగ్లీష్ ఎడిషన్-మాస్కో 1947. 1 వ వాల్యూం. 273 వ పేజీ.)

కాంగ్రెసుకు వచ్చినవారిలో నానాగోత్రేభ్యు లున్నారు. తమకు అపజయం సంభవించినందున ఖచ్చితమైన 'ఆర్థిక వాదులు' కాంగ్రెసుకు హాజరు కాలేదు. కాని తమ భావాలను చాకచక్యంగా దాచుకొని, ఆర్థికవాదులు తమ ప్రతినిధులను

చాలమందిని కాంగ్రెసుకు పంపగలిగారు. ఇంతేగాక 'బంద్' ప్రతినిధులు "ఆర్థికవాదులతో" విభేదించినట్లు బయటకు అగపడ్డారు. కాని వాస్తవంలో వారు "ఆర్థికవాదుల"ను బలపరచారు.

ఆ విధంగా కాంగ్రెసుకు "ఇస్క్రా"ను బలపరచే వారే గాక తద్వ్యతిరేకులుకూడా హాజరయ్యారు. 33 ప్రతినిధులు అంటే అత్యధిక సంఖ్యాకులు "ఇస్క్రా"ను బలపరచారు. "ఇస్క్రా"యిస్టులమనుకొనే వారంతా నిజానికి గట్టిగా నిలబడే "లెనినిస్టు ఇస్క్రా-యిస్టులు"కారు. ప్రతినిధులలో అనేక ముఠాలకు చెందిన వారున్నారు. లెనిన్‌ను బలపరచిన వారికి అనగా దృఢమైన ఇస్క్రా-యిస్టులకు 24 వోట్లున్నాయి. తొమ్మిది మంది "ఇస్క్రా"యిస్టులు మార్టావ్‌ను అనుసరించారు. వీరు నిలకడలేని "ఇస్క్రా" యిస్టులన్న మాట. ప్రతినిధులలో కొందరు "ఇస్క్రా" బృందానికీ తద్వ్యతిరేకులకూ మధ్యా ఊగిసలాడారు. ఈరకం వారికి 10 వోట్లున్నాయి. వీరు మాధ్య బృందంగా (సెంటర్‌గా) తయారయ్యారు. "ఇస్క్రా"ను బాహాటంగా ప్రతికూలించిన ముఠాకు 8 వోట్లున్నాయి. (ఇందులో ముగ్గురు "ఆర్థికవాదులు" అయిదుగురు 'బంద్' పార్టీవారు) "ఇస్క్రా" యిస్టులలో చీలికవస్తేచాలు "ఇస్క్రా" వ్యతిరేకులది పై చేయి అవుతుంది.

అందుచే కాంగ్రెస్‌లో పరిస్థితు లెంత క్లిష్టంగా వున్నాయో చూడవచ్చు. "ఇస్క్రా"పక్ష విజయానికి లెనిన్ చాల శక్తిని ధారపోశాడు.

కాంగ్రెస్ ఎజెండా (చర్చనీయాంశాల)లో అతి ప్రాముఖ్యమైన విషయం పార్టీ కార్యక్రమ నిర్ణయం. శ్రామిక వర్గ నియంతృత్వ సమస్యపైన కాంగ్రెసులోని అవకాశవాద ముఠా తన అభ్యంతరాలను తెలియజేసింది. ఇదే కార్యక్రమ చర్చలో ముఖ్యాంశం. కాంగ్రెస్‌లోని విప్లవ విభాగంతో అవకాశవాదులు అంగీకరించని విషయాలు కార్యక్రమంలో ఇంకా అనేకం వున్నాయి. కాని వాళ్ళు శ్రామికవర్గ నియంతృత్వ సమస్యపైననే ముఖ్యమైన పోరాటం సాగించదలిచారు. ఇందుకు వారుచూపినసాకు ఏమంటే - అనేక విదేశ సోషల్ - డెమాక్రటిక్ పార్టీల కార్యక్రమంలో శ్రామికవర్గ నియంతృత్వానికి సంబంధించిన క్లాజులేదు. అందుచే రష్యన్ సోషల్ - డెమాక్రటిక్‌పార్టీ కార్యక్రమంలోకూడ దానిని వదలి వేయవచ్చు.

రైతాంగ సమస్యపై కోర్కెలను (డిమాండ్స్) పార్టీ కార్యక్రమంలో చేర్చడానికికూడ ఈ అవకాశవాదులు అభ్యంతర పెట్టారు. వీరికి విప్లవం అవసరంలేదు. అందుచే శ్రామిక వర్గ మిత్రమైన రైతాంగం అంటే దూరంగా వుండాలన్నారు. రైతాంగంపట్ల స్నేహవిరుద్ధ వైఖరిని ప్రదర్శించారు.

వివిధజాతులకు స్వయం నిర్ణయహక్కు- నీయడానికి 'బండ్' అనుచరులూ, పోలిష్ సోషల్ - డెమాక్రట్లూ అభ్యంతరం తెలియజేశారు. ఒక జాతిని మరొకజాతి అణచి వుంచడాన్ని కార్మికవర్గం ఎప్పుడూ ప్రతికూలించాలని లెనిన్ నిరంతరం చెబుతూ వచ్చాడు. కార్యక్రమంలో ఈ కోర్కెను చేర్చడానికి అభ్యంతరపెట్టడం అంటే, శ్రామికవర్గ అంతర్జాతీయతను వదలుకోడం అన్నమాట - ఒక జాతిని మరొక జాతి అణచుటలో సహకరించడం అన్నమాట.

ఈ అభ్యంతరాలన్నిటినీ లెనిన్ తుత్తునియలు జేశాడు.

"ఇస్క్రా" సూచించిన కార్యక్రమాన్నే కాంగ్రెసు ఆమోదించింది.

కార్యక్రమంలో రెండు భాగాలున్నాయి. ఒకటి గరిష్ట కార్యక్రమం (మాక్సిమమ్). రెండవది కనీస కార్యక్రమం (మినిమమ్). కార్మికవర్గ పార్టీ ముఖ్యధ్యేయాన్ని గురించి — అనగా — సోషలిస్టు విప్లవం పెట్టుబడిదారుల అధికారాన్ని కూలద్రోయుట, శ్రామికవర్గ నియంతృత్వ స్థాపన అనువాటిని గురించి సంపూర్ణ కార్యక్రమం చర్చించింది. పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోసి శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించే ముందు, సాధించవలసిన పార్టీ తక్షణ ఆశయాలను కనీస కార్యక్రమం చర్చించింది. అనగా, జార్ నిరంకుశప్రభుత్వాన్ని కూలద్రోయుట, ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను స్థాపించుట, 8 గంటల పని దినం సాధించుట, గ్రామ సీమలో అన్నిరకాల అర్థ - బానిస విధాన అవశేషాలను రద్దుచేయుట, భూస్వాములు రైతుల నుండి విభజించి లాక్కొన్న భూభాగాలను (ఓట్రెజ్కి) తిరిగి రైతులకు ఇప్పించుట — మొదలగు తక్షణ అవసరాలను కనీస కార్యక్రమం పేర్కొన్నది.

విభజించి లాక్కొన్న భూమిని (ఓట్రెజ్కి)తిరిగి రైతుల కీయాలనే కోర్కెను బదులుగా, ఆ తర్వాత భూస్వాముల ఎస్టేట్లన్నీ వశపరచుకోవాలనే డిమాండ్‌ను బోల్షివిక్‌లు పెట్టారు.

రెండవ కాంగ్రెసులో ఆమోదించబడిన కార్యక్రమం, కార్మికవర్గ పార్టీయొక్క విప్లవ కార్యక్రమమే.

శ్రామికవర్గ విప్లవ విజయానంతరం సమావేశమయిన పార్టీ 8 వ కాంగ్రెసు కొత్త కార్యక్రమాన్ని అంగీకరించేవరకు ఈ కార్యక్రమం అమలులోవుంది.

పార్టీ రెండవకాంగ్రెస్ కార్యక్రమాన్ని అంగీకరించిన తర్వాత, పార్టీ నిబంధనల ముసాయిదాను చర్చించ ప్రారంభించింది. కాంగ్రెసు, కార్యక్రమాన్ని అంగీకరించింది; పార్టీలో సిద్ధాంత ఐక్యతకు పునాదులను వేసింది; ఇక సమితులలోని స్థానిక తత్వాన్ని, అనుభవ రాహిత్యాన్ని, పార్టీలో ఖచ్చితమైన క్రమశిక్షణ లేకపోవడాన్ని, నిర్మాణ అనైక్యతను (ఆర్గనైజేషనల్ డిస్‌యూనిట్) అంతమొందించేందుకు అవసరమైన పార్టీ నిబంధనలను కాంగ్రెసు ఏర్పరచవలసి వచ్చింది.

కార్యక్రమాన్ని చాలా సులభంగానే అంగీకరించారు. కాని కాంగ్రెస్‌లో పార్టీ నిబంధనలపై తీవ్రమైన ఘర్షణలు తలయెత్తాయి. పార్టీ నిబంధనలలో మొదటిపేరా అనగా పార్టీ సభ్యత్వం చర్చకు వచ్చినపుడు అతినిశితమైన విభేదాలుదయించాయి. ఎట్టివాడు పార్టీసభ్యుడు కాగలడు? పార్టీ అంగ నిర్మాణం ఎలా వుండాలి? పార్టీసంఘటనా (ఆర్గనైజేషనల్) స్వభావం ఎలా వుండాలి? పార్టీ ఏకీకృత సంఘటిత స్వరూపమా? (Organised whole) లేక, ఏదో సంఘటనా రహిత రూపమా? (Amorphous) - ఇలాంటి ప్రశ్నలు పార్టీ నిబంధనలలోని మొదటిపేరాను చర్చించినపుడు తలయెత్తాయి. కాంగ్రెసులో రెండురకాల ప్రతిపాదనల (Formulations) మధ్య ఘర్షణవచ్చింది. ఒకటి లెనిన్ ప్రతిపాదన. దీనిని ప్లెఖనావ్, దృఢమైన "ఇస్క్రా" యిస్టులూ బలపరచారు. రెండ

వది మార్టావ్ తీర్మానం. దీనిని కాంగ్రెసులోని బయటపడ్డ అవకాశవాదులంతా - ఆగ్జెల్‌రాడ్, జాసులిచ్, నిలకడలేని "ఇస్రాక" యిస్టులు ట్రాట్స్కీ మొదలగువారు బలపరచారు.

లెనిన్ ప్రతిపాదన ప్రకారం, పార్టీ కార్యక్రమాన్ని అంగీకరించి దానికి అర్థికంగా సహాయపడుతూ, పార్టీ సంఘాలలో ఏదో ఒకదానికి చెందియుంటే అతడు పార్టీ సభ్యుడు కావచ్చు. కాని మార్టావ్ తీర్మానం ప్రకారం మొదటి రెండూ అవసరమైనవే కాని మూడవది అవసరంలేదు. అంటే పార్టీ కార్యక్రమాన్ని ఆమోదించి దానికి ఆర్థికంగా సహాయం చేయాలనే షరతులు అవసరమేనని అంగీకరించుతున్నా పార్టీ సంఘాలలో ఏదో ఒక దానికి చెందియుండాలన్న షరతును మార్టావ్ అంగీకరించుటలేదు. పార్టీ సభ్యుడైనవాడు, పార్టీ సంఘాలలో ఏదోఒక దానికి చెందియుండాలన్నది అవసరం లేదని అతనివాదన.

లెనిన్ వాదన ఇది: పార్టీ అంటే ఒక సంఘటిత సైనిక దళం. దానిలోకి సభ్యులు తమంతకుతామే ఊరికే చేరజాలరు. పార్టీ సంస్థలలో ఏదో ఒకదాని ద్వారానే అతడు పార్టీలో చేరాలి. అందుచేత పార్టీ క్రమశిక్షణకుకూడ లొంగియుండాలి. కాని దీనికి విరుద్ధమైన వాదన మార్టావ్‌ది. పార్టీ సంఘటనా రహిత (Amorphous) స్వరూపం కల్గియుందని, పార్టీలో ఊరికే సభ్యులుగా చేరవచ్చుననీ, పార్టీ సంస్థలలో దేనికో ఒక దానికి చెందియుండ నవసరంలేదు గనుక పార్టీ క్రమశిక్షణకు వారు లొంగనవసరంలేదనీ మార్టావ్ భావించాడు.

ఆ విధంగా లెనిన్ ప్రతిపాదనవలెగాక మార్టావ్ ప్రతిపాదన ప్రకారం, నిలకడ లేని - శ్రామికవర్గేతర వ్యక్తులనుకూడ పార్టీ ద్వారం తెరచబడి వుంటుంది. బూర్జువా ప్రజాతంత్ర విప్లవం సమీపించుతున్నప్పుడు విప్లవంపట్ల కొంతకాలం సానుభూతిచూపేవారు బూర్జువామేధావులలోకొందరున్నారు. అప్పుడప్పుడు వారుపార్టీకి కొద్దిగా సహాయంచేసినాచేయవచ్చు. కాని అలాంటి వారు ఒకసంస్థలోచేరడం, పార్టీక్రమశిక్షణకు లోబడటం, పార్టీకర్తవ్యాలనునెరవేరుస్తూ తత్ఫలితంగావచ్చే కష్టాలను ఎదుర్కొనడం-మొదలైన పనులను చేయలేరు. అయినప్పటికీ మార్టావ్ ఇతర మెన్షివిక్‌లూ అలాంటివారినికూడ పార్టీ సభ్యులుగా ఎంచాలనీ, పార్టీ విషయాలలో వారు తమ పలుకుబడిని పెంపొందించుకోడానికి వారికి అవకాశమూ హక్కు-ఈయాలని వాదించారు. సమ్మేళలో అనేక రకాలవారు, సోషలిస్టులు కానివారు, అరాచకవాదులు, సోషలిస్టు-రివల్యూషనరీలు పాల్గొన్నారు. సమ్మేళలో పాల్గొన్న వీరందరికీ పార్టీలో చేరే 'హక్కు'ఈయాలని మార్టావ్ ప్రభృతులు ప్రతిపాదించారు.

ఏకశిలాఖండంవంటి మిలిటెంట్ పార్టీ కావాలని, స్పష్టంగా నిర్వచించబడిన నిర్మాణంతో కూడినదై పార్టీ వుండాలనీ, లెనినూ లెనినిస్టులూ కాంగ్రెసులో పోరాడారు. దీనికి విరుద్ధంగా మార్టోవైటులు (మార్టోవ్ అనుచరులు) నానాగోత్రేభ్యమయిన, సంఘటనా రహితమైన, బిగిలేని (Hetero geneous, loose, and amorphous) పార్టీకావాలని కోరారు. ఇతర కారణాల మాట అటుంచి, సంకీర్ణ

స్వభావం ననుసరించియైనా అలాంటి పార్టీ, గట్టి క్రమశిక్షణతో కూడిన మిలిటెంట్ పార్టీ కాజాలదు.

నిలకడయైన "ఇస్క్రా" యిస్టులతో, నిలకడలేని 'ఇస్క్రా' యిస్టులు విడిపోయి సెంట్రిస్టుల (మధ్యస్థుల)తో కలిసారు. బయటపడిన అవకాశవాదులు వీరికితోడుగా కలిశారు. అందుచే ఈ విషయంలో మార్టావ్ వైపు త్రాసు మొగ్గింది. పార్టీ నిబంధనలకు సంబంధించిన మొదటి పేరాపై చర్చలో మార్టావ్ తీర్మానాన్ని కాంగ్రెసు ఆమోదించింది. మార్టావ్‌కు అనుకూలంగా 28 వోట్లు, ప్రతికూలంగా 22 వోట్లు వచ్చాయి. ఒకరు వోటు చేయలేదు.

పార్టీ నిబంధనలకు సంబంధించిన మొదటి పేరాపై "ఇస్క్రా" యిస్టులలో చీలికవచ్చినతర్వాత, కాంగ్రెస్‌లో పోరాటం మరింత తీవ్రమయింది. ఎజెండాలోని చివరివిషయం పార్టీ నాయక సంస్థలను ఎన్నుకొనడం. అంటే పార్టీ కేంద్ర పత్రిక 'ఇస్క్రా'కు సంపాదకవర్గాన్ని ఎన్నుకొనుట, సెంట్రల్ కమిటీని ఎన్నుకొనుట, మొదలైనవి. ఈ అంశముపై చర్చ సాగకముందే, ఎన్నికలు కాకముందే, కొన్ని ఘటనల ఫలితంగా వివిధశక్తుల బలాబలాలలో మార్పులు వచ్చాయి.

పార్టీ నిబంధనల సందర్భంలో 'బండ్' సమస్యను కాంగ్రెస్ పరిష్కరించవలసి వచ్చింది. పార్టీలో తమకు ప్రత్యేక స్థానం వుండాలని 'బండ్' కోరింది. రష్యాలోని యూదు కార్మికులందరికీ ప్రతినిధిగా తననేగుర్తించాలని కోరింది. ఈకోర్కెను అంగీకరించడం అంటే అర్థమేమిటి? పార్టీ సంస్థలలో జాతుల ననుసరించి కార్మికులను చీలదీయడమన్నమాట. కార్మికులకు

ప్రాంతీయ వర్గసంస్థలుండాలనే సూత్రాన్ని వదులుకోడం అన్న మాట. 'బండ్' సూచించిన జాతిననుసరించి సంస్థలనేర్పరచాలనే పద్ధతిని, కాంగ్రెస్ త్రోసివేసింది. అందుచే 'బండ్' అనుచరులు కాంగ్రెస్‌ను విడిచిపోయారు. ఇద్దరు "ఆర్థికవాదులు"కూడా కాంగ్రెస్‌ను విడిచిపోయారు. విదేశాలలోని పార్టీ ప్రతినిధిగా తమ "విదేశ సమితి"ని గుర్తించాలని వీరుకోరగా కాంగ్రెస్ అందుకు నిరాకరించడంవల్ల వీరు వెళ్ళిపోయారు.

ఈ ఏడుగురు అవకాశవాదులూ లేచిపోవడంవల్ల కాంగ్రెస్‌లో లెనినిస్టులవైపుకు త్రాసు మొగ్గింది.

ప్రప్రథమంనుంచీ. పార్టీ కేంద్రసంస్థల నిర్మాణంపైన లెనిన్ తన దృష్టిని మరల్చాడు. సెంట్రల్ కమిటీ దిట్టమైన నిలకడగల విప్లవకారులతో కూడియుండాలని లెనిన్ భావించాడు. మార్టావ్ అనుచరులు, సెంట్రల్ కమిటీలో నిలకడ లేని అవకాశవాద వ్యక్తుల ప్రాబల్యాన్ని సంపాదించాలని ప్రయత్నించారు. కాంగ్రెస్‌లో మెజారిటీ ఈ సమస్యపై లెనిన్‌ను బలపరచింది. సెంట్రల్ కమిటీలో లెనిన్ అనుచరులనే ఎన్నుకొన్నారు.

లెనిన్ సూచనపై, "ఇస్క్రా" సంపాదకవర్గానికి లెనిన్, ప్లెఖనావ్, మార్టావ్‌లను ఎన్నుకొన్నారు. తన అనుచరులు అధిక సంఖ్యాకులుగా వున్న పూర్వపు సంపాదకవర్గ సభ్యుల నార్గురినీ తిరిగి ఎన్నుకోవాలని మార్టావ్ ఒత్తిడిచేశాడు. కాంగ్రెస్‌లో మెజారిటీ దీనిని తిరస్కరించింది. లెనిన్ సూచించిన ముగ్గురినీ ఎన్నుకొంది. దానిపై కేంద్రపత్రిక సంపాదకవర్గంలో తాను చేరనని మార్టావ్ ప్రకటించాడు.

ఆ విధంగా పార్టీ కేంద్ర సంస్థల ఎన్నికతో కాంగ్రెస్, మార్టావ్ అనుచరులకు అపజయాన్నీ, లెనిన్ అనుచరులకు విజయాన్నీ ధృవపరచింది.

అప్పటినుండి, కాంగ్రెసులో జరిగిన ఎన్నికలలో అధిక సంఖ్యాకమైన వోట్లు సంపాదించిన లెనిన్ అనుచరులను బోల్షివిక్‌లని పిలువసాగారు. (బోల్షిన్‌స్ట్వో అనే పదం నుండి ఇది వచ్చింది. దీనికి అర్థం మెజారిటీ - అధిక సంఖ్య - అని) ఆ కాంగ్రెసులో తక్కువ వోట్లు వచ్చిన లెనిన్ ప్రతిపక్షులు మెన్షివిక్‌లని పిలువబడుతూ వచ్చారు. (మెన్షిన్‌స్ట్వో అనే పదం నుండి ఇది వచ్చింది. దీని అర్థం మైనారిటీ - అల్పసంఖ్య - అని.)

రెండవ కాంగ్రెస్ పనిని సమీక్షించి చూస్తే ఈ క్రింది అభిప్రాయాలకు వస్తాం.

(1) అవకాశవాదంపైన 'ఆర్థికవాదం'పైన మార్క్సిజం విజయం పొందింది. దీనిని కాంగ్రెస్ స్థిరపరచింది.

(2) పార్టీ కార్యక్రమాన్ని, నిబంధనలను కాంగ్రెసు అంగీకరించింది. సోషల్-డెమొక్రటిక్ పార్టీని నిర్మించింది. ఆ విధంగా ఏకపార్టీకి (సింగిల్ పార్టీకి) బాహ్య స్వరూపాన్ని తయారుచేసింది.

(3) నిర్మాణ సమస్యలపైన చాల తీవ్రమైన విభేదాలున్నాయని కాంగ్రెస్ బయటపెట్టింది. ఈ విభేదాలు, పార్టీని రెండు భాగాలుగా, బోల్షివిక్‌లు - మెన్షివిక్‌లుగా చీల్చింది. బోల్షివిక్‌లు విప్లవ సోషల్-డెమొక్రసీ యొక్క నిర్మాణ

సూత్రాలకోసం పోరాడారు. నిర్మాణరాహిత్యమనే ఫూబిలోకి అవకాశవాదంలోకి మెన్షివిక్‌లు దిగిపోయారు.

(4) ఇదివరకే పార్టీ చేతిలో ఓడిపోయిన పాత అవకాశవాదులగు "ఆర్థికవాదుల" స్థానాన్ని కొత్త అవకాశవాదులగు మెన్షివిక్‌లు తీసుకొన్నారని కాంగ్రెసు నిరూపించింది.

(5) నిర్మాణ విషయాలకు సంబంధించినంతవరకు కాంగ్రెస్ తన కర్తవ్యాన్ని సరిగా నిర్వహించలేకపోయింది. ఊగిసలాడింది. ఒక్కొక్కసారి మెన్షివిక్‌లకు ప్రాబల్యం ఇచ్చింది. చిట్టచివరకు తన పరిస్థితిని చక్కబరచుకొన్నప్పటికీ, కాంగ్రెస్, నిర్మాణవిషయాలలో మెన్షివిక్‌ల అవకాశవాదాన్ని బయటపెట్టలేకపోయింది. పార్టీలో వారిని దూరం చేయలేకపోయింది. వారిని బయటపెట్టి దూరంచేసే కర్తవ్యాన్నయినా పార్టీ ముందు పెట్టలేకపోయింది.

కాంగ్రెస్ ముగిసిన తర్వాతగూడ బోల్షివిక్‌ల మెన్షివిక్‌ల మధ్య పోరాటం సమసిపోడానికి బదులుగా మరింత తీవ్రమవడానికి ఈ చివర పరిస్థితియే ముఖ్య కారణం.

# 4

మెన్షివిక్ నాయకుల విచ్ఛిన్న చర్యలు – రెండవ కాంగ్రెస్ అనంతరం పార్టీలో ఆంతరంగిక పోరాటం మరింత నిశితమగుట – మెన్షివిక్‌ల అవకాశవాదం – "ఒకడుగు ముందు, రెండడుగులు వెనక్కి" అనే లెనిన్ గ్రంథం – మార్క్సిస్టు పార్టీ నిర్మాణ సూత్రాలు.

రెండవ కాంగ్రెస్ తర్వాత పార్టీలో ఆంతరంగిక పోరాటం మరింత తీవ్రమయింది. రెండవ కాంగ్రెస్ తీర్మానాలను నిష్ఫలం చేయడానికీ, పార్టీ కేంద్ర సంస్థలను వశం చేసుకోడానికీ మెన్షివిక్‌లు తమ యావచ్ఛక్తినీ ఉపయోగించారు. "ఇస్క్రా" సంపాదక వర్గంలోను, సెంట్రల్ కమిటీలోనుతమ ప్రతినిధులకు స్థానం ఈయాలని వీరు ఒత్తిడిచేశారు. అంతేగాదు సెంట్రల్‌కమిటీలో బోల్షివిక్‌లతో సరిసమానంగాను సంపాదకవర్గంలో తమకు మెజారిటీని ఈయాలని మెన్షివిక్‌లు ఒత్తిడి చేశారు. ఇది పూర్తిగా రెండవ కాంగ్రెస్ తీర్మానాలకు విరుద్ధంగనుక, మెన్షివిక్‌ల ఈ కోరికను బోల్షివిక్‌లు తిరస్కరించారు. అటుపిమ్మట పార్టీకి తెలియకుండా రహస్యంగా మెన్షివిక్‌లు తామొక పార్టీ వ్యతిరేకమైన ముఠాతత్వంతో గూడిన సంస్థను (ఫాక్షనల్ ఆర్గనైజేషన్‌ను) నిర్మించారు. దీనికి నాయకులు మార్టావ్, ట్రాట్స్కీ, ఆగ్జెల్‌రాడ్ మొదలైనవాళ్లు. మార్టావ్ వ్రాసికొన్నట్లు వీరు "లెనినిజానికి వ్యతిరేకంగా తిరుగుబాటు లేవదీశారు." పార్టీని ఎదుర్కోడానికి వారవలంబించిన పద్ధతులనుగురించి లెనిన్ ఇలా చెప్పాడు: "పార్టీపనినంతా ఛిన్నాభిన్నంచేయడం, పార్టీఆశయానికి నష్టం కలుగచేయడం, ప్రతిపనినీ, అన్నిటినీ కుంటుపరచడం"- ఇవే వీరి ఆశయాలు. రష్యన్ సోషల్ - డెమాక్రట్ల విదేశ సమితిలో వీరు ఏదోవిధంగా స్థానం సంపాదించి, ఆ స్థానంనుండి లెనిన్‌పైన, లెనినిస్టులపైన, పార్టీపైన కత్తి కట్టారు. రష్యాలోని కార్యకలాపాలతో సంబంధంలేక దూరమైయున్న ప్రవాస మేధావులే ఇందులో 100 కి 90 మంది.

మెన్షివిక్‌లు ప్లెఖనావ్‌నుండి తగినంత సహాయం పొందారు. రెండవకాంగ్రెస్‌లో ప్లెఖనావ్ లెనిన్‌నుబలపరచాడు. కాని రెండవ కాంగ్రెస్ పిమ్మట, చీలికలు తెస్తామని మెన్షివిక్‌లు తనను భయపెట్టడానికి ప్లెఖనావ్ అవకాశం ఇచ్చాడు. మెన్షివిక్‌లతో ఏమయినా సరే 'రాజీ చేసుకోవాలి' అని నిశ్చయించుకొన్నాడు. అతని ప్రారంభదశలోని అవకాశవాదపు పొరపాటు లనే గుదిబండయే ప్లెఖనావ్‌ను చివరకు మెన్షివిక్‌ల లోకి దిగజార్చింది. అవకాశవాద మెన్షివిక్‌లతో సమాధాన పడాలనే దశనుండి అతడు స్వయంగా మెన్షివిక్ అయే పరిస్థితికి పోయాడు. "ఇస్క్రా" పత్రిక సంపాదకవర్గంలోని మెన్షివిక్ సభ్యులందరినీ తిరిగి ఎన్నుకోడానికి కాంగ్రెస్ ఇదివరకే తిరస్క రించింది. కాని అలాంటివారి నందరినీ తిరిగి సంపాదకవర్గంలో చేర్చుకోవలసిందని ప్లెఖనావ్ ఇప్పుడు కోరాడు. లెనిన్ సహజంగానే దీనికి అంగీకరించలేదు. 'ఇస్క్రా' సంపాదక వర్గంనుండి రాజీనామా నిచ్చాడు లెనిన్. ఇందువల్ల పార్టీ సెంట్రల్ కమిటీలో సుస్థిరపడి, ఆ స్థానంనుండి అవకాశ వాదులను దెబ్బగొట్టవచ్చునని లెనిన్ భావించాడు. కాంగ్రెస్ అభీష్టాన్ని ధిక్కరించి, తనకుదానుగా వ్యవహరిస్తూ, ప్లెఖనావ్ "ఇస్క్రా" పత్రిక సంపాదకవర్గంలోకి మాజీ మెన్షివిక్ సంపాద కులను ఎన్నుకొన్నాడు. అప్పటినుండి అంటే "ఇస్క్రా" 52 వ సంచికనుండి, మెన్షివిక్‌లు దానిని తమస్వంతపత్రికగా మార్చి వేశారు. దానిలో తమ అవకాశవాద భావాలను ప్రచారం చేయ ప్రారంభించారు.

ఆనాటినుండి లెనిన్ యొక్క బోల్షివిక్ పత్రిక "ఇస్క్రా"ను "పాత ఇస్క్రా" అని పార్టీ పరిభాషలో పిలుస్తూ వుండేవారు.

మెన్షివిక్‌ల అవకాశవాద "ఇస్క్రా"ను, "కొత్త ఇస్క్రా" అని పిలుస్తూ వచ్చారు.

మెన్షివిక్‌ల చేతుల్లోకి పోయిననాటినుండి "ఇస్క్రా" లెనిన్‌పైన బోల్షివిక్‌లపైన సాగించే పోరాటంలో ఒక ఆయుధంగా తయారయింది. ముఖ్యంగా నిర్మాణ సమస్యలపైన మెన్షివిక్‌ల అవకాశవాదాన్ని ప్రచారంచేసే పత్రికగా తయారయింది. 'ఆర్థికవాదుల'తోను 'బండ్' అనుచరులతోను కలిసి మెన్షివిక్‌లు "ఇస్క్రా" పత్రికలలో - తాము చెప్పుకొన్నట్లు - లెనినిజానికి వ్యతిరేకంగా దండయాత్ర ప్రారంభించారు. ఇరుపక్షాలకు సమాధానం కుదర్చాలనే పరిస్థితికి ప్లెఖనావ్ అంటుకొని ఉండలేకపోయాడు. త్వరలోనే అతడు కూడ పైన చెప్పిన ప్రచారోద్యమంలో కలిసిపోయాడు. ఇది సంభవించి తీరక తప్పదని ఆ పరిస్థితులే చెబుతున్నాయి. ఎంచేతనంటే, అవకాశవాదులకు సామరస్యభావం చూపాలని ఎవరు పదేపదే వాదించుతారో, వారు స్వయంగా అవకాశవాదంలో మునగక తప్పదు. కొత్త "ఇస్క్రా" నుండి గంగా ప్రవాహంలాగా (As from Cornucopia) వ్యాసాలు ప్రకటనలు వెలువడసాగాయి. వాటి సారాంశం ఇది: పార్టీ ఏకీకృత సంఘటిత స్వరూపం (Organised whole) కల్గియుండనవసరం లేదు. పార్టీ సంఘాల యొక్క నిర్ణయాలకు కట్టుబడవలసిన బాధ్యతఏమీ లేకుండానే స్వేచ్ఛగా ముఠాలను వ్యక్తులను పార్టీ అనుచరులలో ఉండనీయవచ్చు. పార్టీకి సానుభూతి చూపిన ప్రతిమేధావికీ, "సమ్మె చేసిన ప్రతివానికీ", "ప్రదర్శనాలలో పాల్గొన్న ప్రతివానికీ", తాను పార్టీ సభ్యుడనని చెప్పుకోడానికి అనుమతి ఈయాలి. పార్టీ నిర్ణయాలన్నింటికీ తలయొగ్గాలని కోరడం 'లాంఛన

ప్రాయమూ—నిరంకుశమూ (Formal and Bureaucratic) మెజారిటీకి మైనారిటీ లొంగాలనడం పార్టీ సభ్యుల అభిప్రాయాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేయడం. పార్టీ సభ్యులంతా - నాయకులూ, అనుచరులూ అందరూ - పార్టీ క్రమశిక్షణను సరిసమానంగా గౌరవించాలనడం పార్టీలో 'దాస్యం' నెలకొల్పడం. పార్టీలో "మనకు" కావలసింది సెంట్రలిజం (కేంద్రీకృత ప్రజాతంత్రం) కాదు. అరాచక 'స్వపరిపాలన' (అనార్కిస్టు ఆటానమిజం) అంటే వ్యక్తులూ పార్టీ సంస్థలూ కూడా పార్టీ నిర్ణయాలకు తలయొగ్గవలసిన అవసరంలేదు. ఇదీ మెన్షివిక్‌ల ప్రచార సారాంశం.

ఇది పార్టీ ముఖ్యసూత్రాలను క్రమశిక్షణను కుంటు పరచేటటువంటిది. నిర్మాణ విషయాలలో విచ్చలవిడితనం కావాలనేవారి హద్దూపద్దూలేని ప్రచారం ఇది. మేధావుల వ్యక్తి అహంకార వాదాన్ని ఇది స్తోత్రం చేస్తుంది. క్రమశిక్షణ అంటే అరాచకవాదులను గల ఏహ్యభావాన్ని సమర్థించుతుంది.

రెండవ కాంగ్రెసునుండీ పూర్వమున్న నిర్మాణ అనైక్యతకు, సమితులలో ఇదివరకున్న స్థానికతత్వ దృష్టికి, పూర్వపు అనుభవరాహిత్య పద్ధతులకు పార్టీని లాగాలని మెన్షివిక్‌లు ప్రయత్నించుతున్నారనేది స్పష్టం.

మెన్షివిక్‌లపైన తీవ్రమైన తిరుగుదెబ్బ కొట్టవలసివుంది.

"ఒకడుగు ముందుకు, రెండడుగులు వెనక్కి" అనే తన ఉత్కృష్ట గ్రంథంలో లెనిన్ ఈ తిరుగుదెబ్బ కొట్టాడు. ఈ గ్రంథం 1904 మేలో ప్రచురించబడింది.

తన గ్రంథంలో లెనిన్ కొన్ని ముఖ్య నిర్మాణసూత్రాలు (ఆర్గానిజేషనల్ ప్రిన్సిపుల్స్) విశదీకరించాడు. ఇవే ఆతర్వాత బోల్షివిక్ పార్టీ నిర్మాణ ప్రాతిపదిక లయ్యాయి. అవి ఇవి :

(1) మార్క్సిస్టు పార్టీ, కార్మికవర్గంలో ఒక భాగమూ, ఒక దళమూ. కాని కార్మికవర్గం అనేక దళాలను కలిగియుంటుంది. కాబట్టి కార్మికవర్గపు ప్రతిదళాన్నీ పార్టీ అని పిలవడానికి వీలులేదు. కార్మికవర్గ ఇతర దళాలకూ పార్టీకీ తేడా వుంది. ముఖ్యంగా ఈ తేడాను కారణం ఏమంటే, పార్టీ సాధారణ దళంకాదు. అగ్రగామి (వేన్‌గార్డ్) దళం. వర్గచైతన్యంకల దళం. కార్మికవర్గ మార్క్సిస్టుదళం. సమాజ జీవితం గురించి, సమాజాభివృద్ధి సూత్రాల గురించి, వర్గకలహ సూత్రాల గురించిన పరిజ్ఞానంకల మార్క్సిస్టుదళం. ఈ కారణంచేత అది కార్మిక వర్గానికి నాయకత్వం వహించి దాని పోరాటాన్ని నడుపగలిగినదళం. అందుచేత పార్టీని, కార్మికవర్గాన్ని ఒకటిగా భావించి గందరగోళ పడరాదు. అలాగే ఒక మొత్తాన్ని, దాని భాగంతో జతచేసి గందరగోళ పరచరాదు. ప్రతి సమ్మెదారుడూ తాను పార్టీ మెంబరునని ప్రకటించుకోడానికి అనుమతి నీయాలని కోరరాదు. ఎందువల్లనంటే, పార్టీని, వర్గాన్ని జతచేసి గందరగోళ పరిచేవారు - పార్టీ చైతన్యస్థాయిని "ప్రతి సమ్మెదారుని" స్థాయికి దిగజారుస్తున్నారు. కార్మికవర్గానికి వర్గచైతన్యంతో గూడిన అగ్రగామియగు పార్టీని నాశనం చేస్తున్నారు. పార్టీ కర్తవ్యం, తన స్థాయిని "ప్రతి సమ్మెదారుని" స్థాయికి దిగజార్చడం కాదు; కార్మిక జనసామాన్యాన్ని

పైస్థాయికి కొనిపోవాలి – "ప్రతి సమ్మెదారునీ" పార్టీ స్థాయికి పై కెత్తాలి.

లెనిన్ ఇలా వ్రాశాడు :

"మనం ఒకవర్గ పార్టీ. అందుచే దాదాపు వర్గమంతా (యుద్ధకాలంలో, అంతర్యుద్ధకాలంలో వర్గమంతా) మన పార్టీ నాయకత్వాన నడుచుకోవాలి; సాధ్యమైనంత సన్నిహితంగా పార్టీకి అంటిపెట్టుకొని వుండాలి. కాని, పెట్టుబడిదారీ విధానం క్రింద ఏ కాలంలోనైనాసరే, వర్గంయావత్తూ లేక దాదాపు వర్గమంతా, తన కగ్రగామియైన సోషల్ – డెమాక్రటిక్ పార్టీ యొక్క చైతన్యస్థాయికిగాని కార్యకలాపాల స్థాయికిగాని పోలేదు. అలా పోగలదని అనుకోడం 'మానిలోవిజం', 'ఖ్వోస్టిజమూ' అవుతుంది. (మానిలోవిజం అంటే చక్కని ఆత్మ సంతృప్తి, సోమరితనం, నిరుపయోగమైన పగటికలలు కనడం. రష్యన్ రచయిత గొగోల్ గ్రంథం "డెడ్ సోల్స్"లోని ఒ పాత్ర మానిలోవ్. ఖ్వోస్టిజం అంటే 'తోకవెంట నారాయణా' అనడం. అప్రయత్న ఉద్యమాన్ని తాము నడపడానికి బదులుగా దానితోక బట్టుకుపోవడాన్నే ఖ్వోస్టిజం అంటారు – అనువాదకుడు) పెట్టుబడిదారీ విధానంక్రింద, కార్మిక సంస్థలు సైతం (ఇవి ప్రాథమిక దశలోను, వెనుకబడియున్నా ప్రజా విభాగానికి బాగా సన్నిహితంగాను, వుంటాయి.) కార్మిక వర్గాన్నంతా లేక దాదాపు కార్మిక వర్గాన్నంతా తమలో సమీకరించగలవని ఆలోచనగల సోషల్ – డెమాక్రట్ ఎవడూ అనలేడు. అగ్రగామికీ, దానివైపు మ్రొగ్గే యావత్ ప్రజా సామాన్యానికీగల తేడాను మరచిపోవడం అంటే ఏమిటి ?

ఈ అత్యున్నతస్థాయికి సామాన్య ప్రజాబాహుళ్యాన్ని చేర్చవలసిన నిత్యకర్తవ్యం అగ్రగామిది అని మరచిపోవడమే; అంటే ఆత్మవంచన చేసుకోవడమే. మన కర్తవ్యాల అపారతను చూడకుండా కళ్లుమూసుకోడమే. ఈ కర్తవ్యాలను సంకుచిత పరచడమే." (లెనిన్, సెలెక్టెడ్ వర్క్సు ఇంగ్లీష్ ఎడిషన్, మాస్కో 1947 1వ వాల్యూం, 294 వ పేజీ.)

(2) పార్టీ, ఒక అగ్రగామీ, వర్గచైతన్యంతో కూడిన కార్మికవర్గ దళమూ మాత్రమే కాదు. అది సంఘటితమైన కార్మికవర్గ దళం. దీనికి ఒక క్రమశిక్షణ వుంటుంది. ఆ క్రమశిక్షణకు దాని సభ్యులందరూ లోబడాలి. కాబట్టి పార్టీ సభ్యులు, పార్టీ సంస్థలలో ఏదో ఒకదానిసభ్యులై తీరాలి. పార్టీ గనుక ఒక వర్గంయొక్క సంఘటిత దళం కానట్లయితే, సంఘటనా పద్ధతి (System of organisation) వ్యక్తుల కలగూరగంపయే అవుతుంది. వీరు తాము పార్టీ మెంబర్లమని చెప్పుకుంటూనే పార్టీ సంస్థలో ఏదో ఒకదానిలో సభ్యులు కాకుండా - అనగా సంఘటితం కాకుండా వుంటారు. తత్ఫలితంగా పార్టీ నిర్ణయాలకు తల యొగ్గవలసిన అవసరం వీరికి ఉండదు. పార్టీ ఎప్పుడూ ఒక ఐక్యభావాన్ని కలిగియుండజాలదు. పార్టీ సభ్యులచే ఐక్య కార్యాచరణ చేయించజాలదు. దీని ఫలితంగా కార్మికవర్గ పోరాటాన్ని నడపజాలదు. పార్టీ సభ్యులంతా ఒకే సర్వసాధారణ దళంలో సంఘటితమయితే, భావంలో కార్యాచరణలో క్రమశిక్షణలో ఐక్యతతో వారు మేళవింపబడినట్లయితే, కార్మికవర్గ ప్రత్యక్ష పోరాటాన్ని నడిపి దానిని ఒకే ఆశయంవైపుకు, పార్టీ తీసుకుపోగలదు.

దీనికి మెన్షివిక్‌లు ఈ అభ్యంతరాలు తెలిపారు. అట్టి సందర్భంలో అనేకమంది మేధావులు - ఉదాహరణకు అధ్యాపకులు, విశ్వవిద్యాలయ, ఉన్నత పాఠశాల విద్యార్థులువగైరా- పార్టీ అనుచరులకు దూరంగా వుండవలసి వుంటుంది. వారు పార్టీ సంస్థలలో దేనిలోనూ చేరదలచుకోరు. బహుశా దీనికి కారణం పార్టీ క్రమశిక్షణ అంటే భయపడటమన్నా కావాలి; లేదా రెండవ కాంగ్రెస్‌లో ప్లెఖనావ్ చెప్పినట్లు "ఏదో ఒక స్థానిక సంస్థలో చేరడము తమ ఘనతకు లోపమని భావించడమైనా" అయివుండాలి. మెన్షివిక్‌ల అభ్యంతరం తిరిగి వారినే దెబ్బగొడుతుంది. ఎందుచేతనంటే పార్టీ క్రమశిక్షణ అంటే భయపడేవారుగాని, పార్టీ సంస్థలలో చేరడానికి భయపడేవారుగాని పార్టీకి అవసరంలేదు. కార్మికులు క్రమశిక్షణ అన్నా నిర్మాణం అన్నా భయపడరు. పార్టీసభ్యులు కావాలని వారు కృతనిశ్చయులైతే వారు ఏదో ఒక పార్టీ సంస్థలో బుద్ధిపూర్వకంగా చేరతారు. క్రమశిక్షణ అన్నా నిర్మాణంఅన్నా వ్యక్తిఅహంకారపూరితులైన మేధావులే భయపడతారు. పార్టీ అనుచరవర్గంలో చేరక నిజంగానే దూరంగా వుంటారు. కాని ఇది పార్టీకే క్షేమం. బూర్జువా ప్రజాతంత్ర విప్లవం ఉచ్ఛస్థాయికి పోతున్న ఆ సమయంలో ఎక్కువగా కన్పడే ఇలాంటి నిలకడలేని వ్యక్తుల గుంపు వదిలిపోతే అది పార్టీకే మంచిది.

లెనిన్ ఇలా వ్రాశాడు:

"సంఘాల కూటమియే పార్టీ (Sum of organisations) అని నే నన్నపుడు (సంఖ్యారీత్యాగాదు. మిశ్రణస్వభావంలో) నా ఉద్దేశం ఇది... వర్గానికి అగ్రామిమైన పార్టీ

ఎంత సాధ్యమైతే అంతవరకు సంఘటితమై వుండాలనీ, కనీస నిర్మాణ చైతన్యాన్ని కలిగిన వ్యక్తులనే పార్టీ తన అనుచరులుగా తీసుకోవాలని నా కోరిక. దీన్ని స్పష్టంగాను ఖచ్చితంగాను వెలిబుచ్చాను."
(పై గ్రంథమే 292 వ పేజీ)

ఇంకా :

"మార్టావ్ ప్రతిపాదన, పైకి శ్రామికవర్గజన బాహుళ్య ప్రయోజనాలను రక్షించుతున్నట్లు కన్పడుతుంది. కాని వాస్తవంలో, శ్రామికవర్గ క్రమశిక్షణ అన్నా నిర్మాణం అన్నా సంకోచించే బూర్జువా మేధావుల ప్రయోజనాలనే కాపాడుతుంది. వ్యక్తి అహంకారవాదం, క్రమశిక్షణకూ, నిర్మాణానికీ లొంగని స్వభావమూ సర్వసాధారణంగా వారిని ఆధునిక పెట్టుబడిదారీ సమాజంలో ఒక ప్రత్యేకభాగంగా వేరుపరుస్తున్నాయన్న విషయాన్ని ఎవరూ కాదన సాహసించలేరు."
(పై గ్రంథమే 298-299)

మరియూ :

"ఒక సంస్థలో చేరడంగాని, ఒకసంస్థ యాజమాన్యాన పనిచేసినంత మాత్రాన పార్టీ సభ్యులుగా గుర్తించబడటాన్ని, హైస్కూలు విద్యార్థులు ఘనమైన ప్రొఫెసర్లు (విశ్వవిద్యాలయ, కాలేజీల అధ్యాపకులు) ఇష్టపడరు. ఇలాంటివారిని గురించి శ్రామికవర్గం ఏమీ పట్టించుకోదు. నిర్మాణం, క్రమశిక్షణ విషయాలలో స్వయంశిక్షణ లేనిది పార్టీలో కొందరు మేధావులకు గాని శ్రామికులకు గాదు."
(పై గ్రంథమే 322 వ పేజీ)

(3) పార్టీ ఒకసంఘటిత దళంమాత్రమే కాదు. కార్మిక వర్గంయొక్క "నిర్మాణ రూపాలన్నిటిలోకి ఉత్తమమైనదిపార్టీ" కార్మికవర్గపు ఇతరసంస్థలన్నిటినీ నడపవలసిన కర్తవ్యం దానిదే. వర్గంలో కల్లా మంచి సభ్యులను కలిగియుండటంవల్లా, అభివృద్ధి మైన సిద్ధాంతకవచం ధరించుటవల్లా, వర్గకలహ సూత్ర పరి జ్ఞానం కలిగియుండటంచేతా, విప్లవ వుద్యమానుభవం కలిగియుం డుటవల్లా, పార్టీనిర్మాణ స్వరూపాలలోకల్లా అతి ఉన్నతమైనది. కార్మికవర్గ ఇతరసంఘాల నన్నిటినీ నడిపేందుకు పార్టీకి అన్ని విధాలా అవకాశంవుంది_నడుపవలసిన బాధ్యతకూడా దానికి ఉంది. పార్టీయొక్క నాయకత్వ పాత్రను చిన్నచూపు చూస్తూ తక్కువ అంచనా వేసే మెన్షివిక్‌ల ప్రయత్నం, పార్టీచే నడుప బడే ఇతర శ్రామికవర్గ సంస్థలను బలహీనపరుస్తుంది. తత్ఫలి తంగా శ్రామికవర్గాన్ని బలహీనపరచి నిరాయుధులనుచేస్తుంది. ఎందుచేతనంటే "అధికారం చేపట్టడానికి చేసే పోరాటంలో శ్రామికవర్గానికి నిర్మాణం తప్ప మరొక ఆయుధంలేదు."

(పై గ్రంథమే 340 వ పేజీ)

(4) లక్షలాది కార్మికవర్గ ప్రజలతో కార్మికవర్గ అగ్ర గామి (వేన్‌గార్డ్) యొక్క సన్నిహితానికి స్వరూపమే పార్టీ. పార్టీ ఎంతమంచి అగ్రగామి (వేన్‌గార్డ్) అయినప్పటికీ, ఎంత బాగా సంఘటితమయినప్పటికీ, పార్టీసభ్యులు కాని ఇతర ప్రజా సామాన్యంతో సంబంధాలు పెట్టుకోననిదే, ఆ సంబంధాలను మరింత హెచ్చిస్తూ బలపరచనిదే, పార్టీ బ్రతకలేదు - అభివృద్ధి కాజాలదు. తనచుట్టూ గూడుకట్టుకొని బయటను కదలనిపార్టీ,

ప్రజాసామాన్యంనుండి విడివడిపోయిన పార్టీ, తన వర్గంతో సంబంధాలను వదులుకొన్న లేక సడలించినపార్టీ, ప్రజాసామాన్యంయొక్క విశ్వాసాన్ని అందనుకోలుపోక తప్పదు. తత్ఫలితంగా తప్పనిసరిగా నశించక తప్పదు. సమగ్రంగా బ్రతికి పెంపొందాలంటే, పార్టీ ప్రజలతోటి సంబంధాలను ఎన్నోరెట్లు హెచ్చించుకోవాలి. తనవర్గంయొక్క లక్షలాది జనసామాన్యం విశ్వాసాన్ని చూరగొనాలి.

లెనిన్ ఇలా అన్నాడు: "సోషల్ - డెమాక్రటిక్ పార్టీగా మనవలపివుంటే, మనం ఖచ్చితంగా వర్గంయొక్క ప్రోద్బలాన్ని పొందాలి." (లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్, 6 వ వాల్యూం, 208 పేజీ)

(5) సరిగ్గా పని నిర్వహించాలంటే, జనసామాన్యాన్ని క్రమపద్ధతిని నడపాలంటే, పార్టీ "సెంట్రలిజం" (కేంద్రీకృత ప్రజాతంత్రం) అనే సూత్రంపై పనిచేయాలి. అనగా పార్టీకి నిబంధనావళి వుండాలి. అందరికీ వర్తించే పార్టీ క్రమశిక్షణ ఉండాలి. ఒక నాయక సంస్థ - అనగా పార్టీ కాంగ్రెసు ఉండాలి. కాంగ్రెసు సమావేశానికీ మర్రో సమావేశానికీ మధ్య పార్టీ సెంట్రల్ కమిటీ పనిచేస్తూ వుండాలి. మెజారిటీ నిర్ణయాలకు మైనారిటీ, క్రింది సంస్థలు పైసంస్థలకూ, వివిధ సంస్థలన్నీ కేంద్రానికీ బద్ధులైవుండాలి. ఈ షరతులను తప్పినట్లయితే, కార్మికవర్గ పార్టీ నిజమైనపార్టీ కాజాలదు. కార్మిక వర్గాన్ని నడిపే తన కర్తవ్యాలను పూర్తి చేయజాలదు.

జార్ నిరంకుశ ప్రభుత్వం క్రింద, పార్టీ రహస్యంగా పని చేయవలసి వచ్చిన మాట నిజమే. క్రిందినుంచి ఎన్నుకొనే

సూత్రంపైన ఆ రోజుల్లో పార్టీ సంస్థలు నిర్మించడానికి వీలులేక పోయింది. అందుచేత ఆ రోజుల్లో పార్టీ పూర్తిగా కుట్రదారుల పార్టీగా వుండవలసి వచ్చింది. కాని మన పార్టీ జీవితంలోని ఈ తాత్కాలిక పరిస్థితి, జార్ ప్రభుత్వ నిర్మూలనంతో రద్దయి పోతుంది. తర్వాత ప్రజాతంత్ర ఎన్నికల సూత్రం పైన, డెమాక్రటిక్ సెంట్రలిజం (కేంద్రీకృత ప్రజాతంత్రం) సూత్రాల పైన పార్టీ సంఘాలు నిర్మించబడి బహిరంగంగాను చట్టబద్ధంగాను పనిచేస్తాయని లెనిన్ భావించాడు.

లెనిన్ ఇలా వ్రాశాడు :

"పూర్వం మన పార్టీ, ఏకీకృత సంఘటిత స్వరూపం (Organised whole) పొందియుండలేదు. అది విడివిడిముఠాల (గ్రూపుల) కూటమి మాత్రమే. అందుచే ఈ ముఠాల మధ్య సిద్ధాంత ప్రభావశీలత్వ తప్ప ఇతర సంబంధాలేమీ లేవు. ఇపుడు మనం ఒక సంఘటితపార్టీ అయాము. భావాలశక్తిని, అధికార శక్తిగా రూపొందచేసి, క్రింది పార్టీ సంఘాలు పై పార్టీ సంఘాలకు లోబడునట్లు చేసి, పార్టీ అధికారాన్ని స్థాపించామని దీని అర్థం.

పార్టీ అధికారానికి క్రమశిక్షణకు లొంగనటువంటి మెన్షివిక్ ల ప్రభుకుటుంబాల అరాచకత్వాన్ని దూషిస్తూ, నిర్మాణ సమస్యలకు సంబంధించిన నిహిలిజంను (నిర్మూలనావాదాన్ని) ఖండిస్తూ లెనిన్ ఇలా వ్రాశాడు :

"ఈ ప్రభు కుటుంబ అరాచకతత్వం రష్యన్ నిహిలిస్టులకు ప్రత్యేకమైన నైజం. పార్టీనిర్మాణం అంటే భయంకర

మైన ఫ్యాక్టరీగా అతను భావించుతాడు. మెజారిటీకి మైనారిటీ శిరసావహించడం, ఒక మొత్తానికి అందులో ఒకభాగం తల యొగ్గడం, 'అర్ధబానిసత్వం' అని భావించుతాడు...ఒక కేంద్ర పర్యవేక్షణక్రింద పనిని విభజించుకోడంకూడా-'చక్రాలుగాను చక్రపుపళ్ళు'గా మనుష్యుల్ని మార్చివేయడ మాతుందని, ఒక విషాద - హాస్యాస్పద ఆర్తారవం అతనివద్దనుంచి విన వొతుంది. [సంపాదకులను విలేఖరులుగా మార్చడం (ఇది ఏ సందర్భంలోనైనా జరిగితే - అనువాదకుడు) పై విధమైన మార్పిడికి దారుణమైన ఉదాహరణగా వీరు భావిస్తారు.] పార్టీ నిర్మాణ నిబంధనల పేరెత్తితేచాలు అసహ్యభావాన్ని ద్యోతక పరుస్తూ ముఖంపెడతారు. నిబంధనలన్నీ అసలు అవసరమే లేదు అని (ఫార్మలిస్టులవలె) ఒక తిరస్కార పూరితమైన విసురు విసురుతారు." (లెనిన్, సెలెక్టెడ్ వర్క్స్, ఇంగ్లీష్ ఎడిషన్ మాస్కో 1947, 1వ వాల్యూం, 324వ పేజీ)

(6) తన నిత్యవ్యవహారంలో, పార్టీ తన అనుచరుల మధ్య ఐక్యతను కాపాడదలుచుకొన్నట్లయితే, పార్టీ ఒక సర్వ సాధారణ శ్రామికవర్గ క్రమశిక్షణను విధించాలి. ఆ క్రమశిక్షణ నాయకులకు అనుచరులకు ఇద్దరికీ, పార్టీ సభ్యులందరికీ సమానంగా వర్తించాలి. అందుచే పార్టీలో క్రమశిక్షణ వర్తించని "కొద్దిమంది ముఖ్యులు" అనీ, క్రమశిక్షణ వర్తించే "అనేకులు" అనీ, ఒక విభజన వుండరాదు. ఈ నియమాన్ని గనుక పాటించని పక్షంలో పార్టీప్రతిష్ఠ పార్టీ అనుచరులలో ఐక్యత నిలబడజాలదు.

లెనిన్ ఇలా వ్రాశాడు:

"కాంగ్రెస్ నియమించిన సంపాదకవర్గానికి వ్యతిరేకంగా మార్టావ్ అండ్ కంపెనీ వాదనలలో అర్థం పూర్తిగా శూన్యం. "మేము బానిసలంకాము'అనేవారి స్వంత పడికట్టురాయి పదం లోనే ఇదిబాగాద్యోతకమవుతుంది. ప్రజాసంస్థలకూ ప్రజాక్రమ శిక్షణకు అతీతులయిన "కొద్దిమంది నాయకుల"లో తానొక డనని తలిచే బూర్జువామేధావి మనస్తత్వం, ఇక్కడ గమనించ దగిన స్పష్టతతో ప్రదర్శిత మయింది... మేధావి వ్యక్తి అహం కారానికి... శ్రామికకర్గ నిర్మాణమూ క్రమశిక్షణా ఇదంతా బానిసత్వంగా కన్పించుతుంది." (లెనిన్, కలెక్టెడ్‌వర్క్స్, రష్యన్ ఎడిషన్ 6 వ వాల్యూం 282 వ పేజీ)

మరియూ;

"మనం నిజమైన పార్టీని నిర్మించుతూ పోతున్నపుడు, శ్రామికవర్గ సైన్యంలోని సైనిక మనస్తత్వానికీ - అరాచక వాద పదజాలాన్ని ప్రదర్శించే బూర్జువా మేధావి మనస్తత్వానికీ - గల విభేదాన్ని గుర్తించడం వర్గచైతన్యంగల కార్మి కుడు నేర్చుకోవాలి. పార్టీ మెంబరు యొక్క విధులను ఒక్క అనుచరులు మాత్రమేగాక "పైనడున్న ప్రజలు" (నాయకులు) కూడా నిర్వర్తించాలని ఒత్తిడి చేయడం అతను నేర్చుకోవాలి" (లెనిన్ సెలెక్టెడ్‌వర్క్స్, ఇంగ్లీషుఎడిషన్ మాస్కో 1947, 1వ వాల్యూం 326 పేజీ)

విభేదాలను గురించి తన పరిశీలనను సమీక్షించుతూ "నిర్మాణ విషయాలలో మెన్షివిక్కుల వాదన అవకాశవాద మని" నిర్వచించుతూ లెనిన్ యిలా అన్నాడు. తన విమోచన

పోరాటంలో శ్రామికవర్గానికి ఆయుధం పార్టీ నిర్మాణమే (పార్టీ ఆర్గానిజేషన్) ఈ విషయాన్ని, తక్కువ అంచనా వేయడమే మెన్షివిజంయొక్క, మహాపరాధాలలో ఒకటి. విప్లవ విజయానికి శ్రామికవర్గ పార్టీనిర్మాణం అంత ప్రాముఖ్యమైనదికాదని మెన్షివిక్‌లు భావించారు. మెన్షివిక్కులకు విరుద్ధంగా లెనిన్, శ్రామికవర్గంలో సిద్ధాంత ఐక్యత ఒకటే విజయానికి చాలదని భావించాడు. విజయాన్ని సాధించాలంటే శ్రామికవర్గంయొక్క ఐక్యతను "భౌతికమైన నిర్మాణ ఐక్యత"తో "స్థిరపరచు"కొని తీరాలి. ఇట్టి పరిస్థితిలోనే శ్రామికవర్గం ఒక అభేద్యమైన శక్తి అవుతుందని లెనిన్ భావించాడు.

"అధికార కైవశంకై జరిపే పోరాటంలో శ్రామిక వర్గానికి తన నిర్మాణం (ఆర్గనైజేషన్) తప్ప మరో ఆయుధం లేదు. బూర్జువా ప్రపంచంలోని అరాచకపు పోటీయొక్క పరిపాలనా ఫలితంగా శ్రామికవర్గంలో ఐక్యతలేదు. పెట్టుబడిదారులక్రింద నిర్బంధంగా కూలిచేస్తూ తిరుగలిలో నలిగినట్లు నలిగిపోతున్నారు శ్రామికులు. పేదరికమూ, పశుత్వమూ, నైతికపతనమూ అనే 'అధమాధమ కూపాల'లోకి నిరంతరం శ్రామికులు త్రోసివేయ బడుతున్నారు. లక్షలాది శ్రామికులను శ్రామికవర్గ సైన్యంగా మార్చగల నిర్మాణంయొక్క (ఆర్గానిజేషన్) భౌతికఐక్యతను సిద్ధాంత ఐక్యతతో, మార్క్సిస్టు సూత్రాలతో సుస్థిరపరచినపుడే, ఇలాంటి శ్రామికవర్గం తప్పనిసరిగా అజేయమైన శక్తికాగలదు - అయితీరుతుంది కూడా. దుర్బలమైన రష్యన్ జారుప్రభుత్వం కాని, అంతర్జాతీయ పెట్టుబడిదారుల వార్ధక్యదశలోని ప్రభుత్వంగాని ఈ సైన్యంముందు నిలువలేవు."

(పై గ్రంథమే, 340 వ పేజీ)

భవిష్యత్తును తెలిపే పై వాక్యాలతో లెనిన్ తన గ్రంథాన్ని పూర్తిచేశాడు.

"ఒక అడుగు ముందుకు, రెండడుగులు వెనక్కి" (One step Forward two steps back) అనే తన సుప్రసిద్ధ గ్రంథంలో లెనిన్, ప్రధాననిర్మాణ సూత్రాలను పై విధంగా వివరించాడు. సమితి (సర్కిల్) సూత్రాలకు వ్యతిరేకంగా, పార్టీ సూత్రాలను ఈ గ్రంథం విజయవంతంగా సమర్థించింది. సంఘటనా విధ్వంసకారులకు వ్యతిరేకంగా పార్టీని నిలబెట్టింది. నిర్మాణసమస్యల విషయంలో మెన్షివిక్కుల అవకాశ వాదాన్ని నాశనం జేసింది. బోల్షివిక్ పార్టీకి నిర్మాణ పునాదులను వేసింది. ఈ గ్రంథంయొక్క ప్రాముఖ్యత యిందులోనే వుంది.

కాని ఇంతటితోనే ఈ గ్రంథ ప్రాముఖ్యత తీరిపోలేదు. మార్కిస్టు చరిత్రలో మొట్టమొదటిసారి లెనిన్ పార్టీ, శ్రామిక వర్గాన్ని నడిపే నిర్మాణస్వరూపం అని దాని ప్రధాన ఆయుధం అనీ, ఆ ఆయుధం లేకుండా శ్రామికవర్గ నియంతృత్వాంకై సాగించే పోరాటంలో విజయం లభించదనీ విశదీకరించాడు. ఇందులోనే ఈ గ్రంథంయొక్క చారిత్రిక ప్రాముఖ్యతవుంది.

'ఒకడుగు ముందుకు, రెండడుగులు వెనక్కి' (One step forward. Two steps back) అనే లెనిన్ గ్రంథం పార్టీ వర్కర్లలో వ్యాప్తిచెందుటవలన అత్యధిక స్థానిక సంఘాలు లెనిన్ వైపుకు వచ్చాయి.

బోల్షివిక్కులవైపుకు స్థానిక సంఘాలు మొగ్గినకొలదీ, మెన్షివిక్కు నాయకుల ప్రవర్తన మరింత ద్వేషపూరితమయింది.

1904 వేసవిలో, నైతిక పతనమందిన ఇద్దరు బోల్షివిక్కులు క్రాస్సిన్, నోస్కోవ్ అనే వారల ద్రోహంవల్లనూ, ప్లెఖనావ్ తోడ్పాటుతోనూ, సెంట్రల్ కమిటీలో, మెన్షివిక్కులు మెజారిటీని సంపాదించగలిగారు. మెన్షివిక్కులు చీలికకోసం ప్రయత్నించుతున్నారనేది స్పష్టమే. "ఇస్క్రా" పత్రికనూ సెంట్రల్ కమిటీని పోగొట్టుకొనడంవలన బోల్షివిక్కుల పని కష్టమయింది. తాము ఒక ప్రత్యేక బోల్షివిక్ వార్తా పత్రికను ఏర్పాటు చేసుకోవలసివచ్చింది. పార్టీ కొత్త కాంగ్రెసుకు అనగా మూడవ కాంగ్రెసుకు ఏర్పాట్లు చేయవలసి వచ్చింది. దానిలో కొత్త సెంట్రల్ కమిటీని ఎన్నుకోడం, మెన్షివిక్‌ల వ్యవహారం తెల్చుకోడం అవసరం.

లెనిన్ నాయకత్వాన బోల్షివిక్కులు ఈ పని చేయనారంభించారు.

పార్టీ మూడవ కాంగ్రెస్‌ను సమావేశపరచడానికి బోల్షివిక్కులు ప్రచారం ప్రారంభించారు. 1904 ఆగస్టులో, స్విట్జర్లండ్‌లో లెనిన్ అధ్వర్యాన 22 రు బోల్షివిక్కులు సమావేశమయ్యారు. ఈసమావేశం "పార్టీని సంబోధించుతూ చేసిన ఒక విజ్ఞప్తి"ని ఆమోదించింది. మూడవ కాంగ్రెసును సమావేశ పరచాలనే పోరాటంలో బోల్షివిక్కులు ఈ విజ్ఞప్తిని తమ కార్యక్రమంగా ఉపయోగించుకొన్నారు.

బోల్షివిక్ కమిటీల మూడు ప్రాంతీయ మహాసభలలో (కాకేషియా, దక్షిణ రష్యా, ఉత్తర రష్యా) అధిక సంఖ్యాకులు ఆమోదించిన కమిటీల బ్యూరోలు ఎన్నుకోబడినాయి. మూడవ పార్టీ కాంగ్రెసుకు ఇవే ఆచరణయోగ్య సన్నాహాలన్నీ చేశాయి.

1905 జనవరి 4వ తేదీన బోల్షివిక్ వార్తా పత్రిక "వెపెర్‌యాడ్" (Vperyod - forword - ముందడుగు) మొదటి సంచిక వెలువడింది.

ఆవిధంగా పార్టీలో రెండు ప్రత్యేకముఠాలు తల యెత్తాయి. వారు బోల్షివిక్కులూ, మెన్షివిక్కులూ. ప్రతి ముఠాకు ఒక స్వంత పత్రికా, కేంద్ర సంఘమూ ఉన్నాయి.

## క్లుప్తసారాంశం

1901 - 1904 సంవత్సరాల మధ్యకాలంలో కార్మిక వర్గ విప్లవోద్యమం పెరుగుటతోపాటు, రష్యాలో మార్క్సిస్టు సోషల్ - డెమాక్రటిక్ సంస్థలుకూడా పెంపొంది బలపడ్డాయి. "ఆర్థికవాదుల" పై సిద్ధాంతసూత్రాల విషయమై సాగించిన తీవ్రమైన పోరాటంలో లెనిన్ పత్రిక "ఇస్క్రా" యొక్క విప్లవ పోకడయే విజయం పొందింది. సిద్ధాంత విషయంలో గందరగోళాన్ని, 'అనుభవరాహిత్య కార్యపద్ధతులనూ' (అమెచ్యూరిష్ మెథడ్స్ అఫ్ వర్క్స్) దాటగల్గాము.

చెల్లాచెదరయిన సోషల్ డెమాక్రటిక్ సర్కిల్సునూ, (సమితులను) గ్రూపులను (అధ్యయన కేంద్రాలను) కలిపి, పార్టీ రెండవకాంగ్రెసు సమావేశానికి "ఇస్క్రా" మార్గం సుకరంచేసింది. 1903 లో సమావేశమయిన రెండవ కాంగ్రెసులో, రష్యన్ సోషల్ - డెమాక్రటిక్ లేబరుపార్టీ ఏర్పడింది. పార్టీ కార్యక్రమము నిబంధనలూ ఆమోదించబడినాయి. పార్టీ కేంద్రనాయక సంస్థలు ఏర్పడినాయి. ర. సో. డె. లే. పార్టీలో "ఇస్క్రా"ధోరణికి సంపూర్ణవిజయాన్ని సాధించాలని

సాగించిన పోరాటఫలితంగా, బోల్షివిక్కులూ, మెన్షి విక్కులూ అనేరెండు గ్రూపులు తల ఎత్తాయి.

రెండవకాంగ్రెసు అనంతరం, బోల్షివిక్కులకు మెన్షి విక్కులకు మధ్య ముఖ్య విభేదాలు, నిర్మాణసమస్యలపైన కేంద్రీకరించ బడినాయి.

మెన్షివిక్కులు 'ఆర్థికవాదుల'కు సన్నిహితులై పార్టీలో ఆర్థికవాదుల స్థానాన్ని ఆక్రమించారు. నిర్మాణ సమస్యలలో మాత్రమే అప్పటికి మెన్షివిక్కుల అవకాశవాదం బయట పడింది. లెనిన్ దృఢమైన (మిలిటెంట్) విప్లవపార్టీ కావా లన్నాడు. అలాంటి దానికి మెన్షివిక్కులు వ్యతిరేకించారు. వదులైన సంఘటనా రహితమైన, ఖోవ్‌స్టిస్టు (తోకవెంబట నారాయణా అంటూ అప్రయత్న ఉద్యమాలవెంట బోయే - నాయకత్వం వహించలేని అనిఅర్థం - అనువాదకుడు) పార్టీ కావాలని వారన్నారు. పార్టీ అనుచరులను చీలదీయడానికి వారు ప్రయత్నించారు. ప్లెఖనావ్ సహాయంతో వారు "ఇస్కా్రి" పత్రికను, సెంట్రల్ కమిటీని వశపరచు కొన్నారు. ఈ కేంద్ర సంస్థలను పార్టీని చీలదీసే తమ స్వప్రయోజనాలకు ఉపయోగించు కున్నారు.

మెన్షివిక్కులు తెచ్చిపెట్టుతున్న చీలిక ప్రమాదాన్ని చూచి, ఈ విచ్ఛిన్నకారులను అణచడానికి బోల్షివిక్కులు కొన్ని చర్యలు తీసుకొన్నారు. మూడవ కాంగ్రెసును సమా వేశ పరచాలనే నినాదాన్ని బలపరచడానికి, స్థానిక సంస్థలను కూడదీశారు. తమ స్వతంత్రవార్తాపత్రిక "వెపెర్‌యోడ్" (ముందడుగు)ను ప్రారంభించారు.

ఈవిధంగా రష్యన్ ప్రథమవిప్లవం రేపోమాపో అనగా అప్పటికే ప్రారంభమయిన రష్యా - జపాను యుద్ధకాలంలో, బోల్షివిక్కులు, మెన్షివిక్కులు రెండు విడివిడి రాజకీయ ముఠాలుగా పనిచేయ నారంభించారు.

# మూడో అధ్యాయం

రష్యా - జపాను యుద్ధకాలంలో

బోల్షివిక్కులూ - మెన్షివిక్కులూ

రష్యా ప్రథమ విప్లవం

[ 1907 ]



## 1. రష్యా - జపాను యుద్ధం - రష్యాలో విప్లవోద్యమం ఇంకా వృద్ధిచెందుట - పీటర్స్‌బర్గ్‌లో సమ్మెలు - 1905 జనవరి 9వ తేదీ విప్లవం - రాజ భవనంముందు కార్మికుల ప్రదర్శనం - కాల్పులు - విప్లవం తలయెత్తుట

19వ శతాబ్దం చివర, పసిఫిక్ సముద్రంపై ఆధిపత్యాం సంపాదించడానికీ, చైనాను పంచుకోడానికీ, సామ్రాజ్యవాద దేశాలు తీవ్రపోరాటాన్ని ప్రారంభించాయి. ఈ పోరాటంలో జార్ ప్రభుత్వ రష్యా కూడా పాల్గొంది. విదేశ సామ్రాజ్య వాదులను ప్రతికూలంగా చైనా ప్రజలు గావించిన తిరుగు బాటును జపాన్, జర్మన్, బ్రిటిష్, ఫ్రెంచి సైన్యాలతో కలసి జార్ సైన్యాలు, కనివిని యెరుగని క్రూరత్వంతో అణచి వేశాయి. దీనికి పూర్వం కూడ జార్ ప్రభుత్వం (పోర్టు ఆర్థర్ కోటతో సహా) లియావ్-టుంగ్ ద్వీపకల్పాన్ని తన కిచ్చునట్లు చైనాను నిర్బంధించింది. చైనాలో తన రైల్వేలను నిర్మించు కొనే హక్కును రష్యా సంపాదించింది. ఉత్తర మంచూరి యాలో తూర్పు చైనా రైల్వేలను రష్యా నిర్మించింది. దానిని రక్షించడానికి తన సైన్యాలను కాపలా పెట్టింది. ఉత్తర

మంచూరియా రష్యా జార్ ప్రభుత్వపు సైనిక ఆక్రమణకు గురియై పడిపోయింది. రష్యా జార్ ప్రభుత్వం కొరియావైపు పురోగమించుతూంది. మంచూరియాలో "రష్యా" ప్రభుత్వ స్థాపనకు రష్యన్ పెట్టుబడిదారులు ప్లానులు వేయ ప్రారంభించారు.

దూరప్రాచ్యంలో తన దురాక్రమణవల్ల జార్ ప్రభుత్వం మరొక బందిపోటు దొంగ ప్రభుత్వమయిన జపానుతో ఢీకొనవలసి వచ్చింది. అప్పటికే జపాను త్వరితగతిని సామ్రాజ్యవాద దేశమయింది. ఆశియా ఖండంలో, మొట్టమొదట చైనాలోని ప్రదేశాలను దురాక్రమణ చేయడానికి సిద్ధపడింది జపాను. జార్ ప్రభుత్వ రష్యావలెనే, జపాను కూడా కొరియా మంచూరియాలపైన చేయివేయ ప్రయత్నించుతోంది. ఆ కాలంలో సఖాలిన్‌ను, దూరప్రాచ్య రష్యాను ఆక్రమించాలని జపాను కలలు గంటున్నది. దూరప్రాచ్యంలో జార్ ప్రభుత్వ రష్యా బలం పెరుగుట చూచి భయపడుతున్న గ్రేట్ బ్రిటన్ రహస్యంగా జపానును బలపరచింది. రష్యా - జపానుల మధ్య యుద్ధం రాజుకొంటూంది. కొత్త మార్కెట్లకోసం వెదుకుతూన్న పెద్దపెద్ద పెట్టుబడిదారులూ, భూస్వాములలో మిక్కిలి అభివృద్ధి నిరోధకులైనవారూ, జార్ ప్రభుత్వాన్ని యుద్ధంలోకి నెట్టారు.

జార్ ప్రభుత్వం యుద్ధం ప్రకటించేవరకు వేచియుండకుండానే, జపానే మొదట యుద్ధ చర్యలు ప్రారంభించింది. రష్యాలో జపాన్‌కు మంచి గూఢచారిశాఖవుంది. పోరాటానికి తనశత్రువు సంసిద్ధంగాలేడని జపాన్ తలచింది. 1904 జనవరిలో,

యుద్ధం ప్రకటించకుండానే, రష్యనదైన పోర్ట్ఆర్థర్ కోటపై జపాను హఠాత్తుగా దాడిచేసి, ఆ రేవు పట్టణంలోనున్న రష్యన్ నౌకలకు విపరీత నష్టాలను కల్గించింది.

అదీ రష్యా – జపాను యుద్ధం ప్రారంభమయిన విధం.

విప్లవాన్ని అదుపులో పెట్టడానికి, తన రాజకీయ పరిస్థితిని బలపరచుకోడానికి యుద్ధం సహాయపడుతుందని జార్ ప్రభుత్వం అంచనా వేసింది. కాని దాని అంచనా తప్పుడు అంచనా. యుద్ధం మూలాన జార్ ప్రభుత్వ పునాదులు ఇదివర కెన్నడూ లేనంతగా కదలసాగాయి.

చాలినన్ని ఆయుధాలు లేవు. తగిన తర్ఫీదులేదు. అసమర్థులూ అవినీతిపరులూ అయిన సైనికాధిపతులచే నడప బడిన రష్యన్ సైన్యం ఓటమిపై ఓటమిని పొందుతూ వచ్చింది.

యుద్ధం అదనుగా తీసుకొని పెట్టుబడిదారులు, గవర్న మెంటు ఉద్యోగులు, సైనికాధిపతులు మరింతధనికు లయ్యారు. ప్రభుత్వాస్తి అపహరణ విపరీతమయింది. సైన్యాలకు సరఫరా చాల తక్కువ. ఒకప్రక్క సైన్యాలకు మందుగుండు సామగ్రి తక్కువయితే, అపహాస్యంపాలు చేయడానికా అన్నట్లు బండ్ల కొద్దీ ఐకన్లు (మతసంబంధమైన విగ్రహాలు, పటాలు, దేవుళ్ళ విగ్రహాలు, పటాలు) వచ్చిపడేవి. సైనికులు కోపంకొద్దీ యిలా అనేవారు. "జపానువారు మనపై గుండ్ల వర్షం కురిపించు తున్నారు. మనం బొమ్మల వర్షం కురిపించుతున్నాం." గాయ పడినవారిని వెనక్కి మరలించడానికి బదులుగా రైళ్ళన్నీ, జార్ సైనికాధిపతులు లూటీచేసిన ఆస్తితో నిండివుండేవి.

జపాన్ వాళ్ళు పోర్టు ఆర్థర్‌ను ముట్టడించి ఆతర్వాత దానిని వశంచేసుకొన్నారు. జార్ సైన్యానికి అనేక అపజయాలను కల్గించి చివరకు ముక్డెన్‌వద్ద దానిని పూర్తిగా ఓడించారు. ఈ యుద్ధంలో 3 లక్షల సైన్యంగల జార్ ప్రభుత్వం, గాయపడ్డవారు, చనిపోయినవారు, ఖైదీలుగా చిక్కినవారు అంతా కలసి లక్షా 20 వేల మందిని నష్టపోయింది. దానితర్వాత పోర్టు ఆర్థర్‌ను రక్షించడానికి బాల్టిక్ సముద్రంనుండి వెళ్ళిన జార్ నౌకాదళానికి, సుషిమా (Tsushima) జలసంధిలో తీవ్ర పరాజయమూ నాశనమూ సంభవించింది. సుషిమావద్ద అపజయం వినాశకరమైంది. జార్ పంపిన 20 యుద్ధనౌకలలోనూ, 13 నౌకలను ముంచడమో నాశనంచేయడమో జరిగింది. మరో నాల్గింటిని శత్రువు వశపరచుకున్నాడు. జార్ రష్యా నిశ్చయంగా యుద్ధంలో ఓడిపోయింది.

జార్ ప్రభుత్వం జపానుతో అతి అవమానకరమైన సంధిని చేసుకోవలసి వచ్చింది. జపాను కొరియాను వశంచేసుకొంది. రష్యానుండి పోర్టు ఆర్థర్‌ను సఖాలిన్ దీవిలో సగభాగాన్ని లాక్కొంది.

ప్రజలీయుద్ధాన్ని కోరలేదు. ఇది దేశాని కెంత హానికరమో ప్రజలుగుర్తించారు. జార్ రష్యా వెనుకబడియుండటం ఫలితంగా, ప్రజలు ఎక్కువ నష్టపడవలసివచ్చింది.

యుద్ధంపట్ల బోల్షివిక్కులూ మెన్షివిక్కులూ విభిన్న వైఖరులను అవలంబించారు.

మెన్షివిక్కులు – ట్రాట్‌స్కీతో సహా – రక్షణ తత్వానికి అనగా పెట్టుబడిదారుల భూస్వాముల జార్ చక్రవర్తి యొక్క 'మాతృభూమి'ని రక్షించే పరిస్థితికి దిగసాగారు.

ఇందుకు విరుద్ధంగా, కొల్లగొట్టడానికై చేసే ఈ యుద్ధంలో జార్ ప్రభుత్వం ఓడిపోవడం అవసరమనీ, యుద్ధం వల్ల జార్ ప్రభుత్వం బలహీనపడి విప్లవం బలపడుతుందనీ, లెనిన్ - బోల్షివిక్కులూ భావించారు.

జార్ ప్రభుత్వం ఎంతకుళ్లిపోయివుందో జార్ సైన్యాల ఓటమితో ప్రజాసామాన్యం కనువిప్పింది. జార్ ప్రభుత్వంపై ప్రజల ద్వేషం రోజురోజుకూ మరింత వృద్ధికాజొచ్చింది. పోర్టు ఆర్థర్ పతనం అంటే నిరంకుశ ప్రభుత్వ పతనప్రారంభం అని లెనిన్ వ్రాశాడు.

విప్లవం గొంతు నులిమివేయడానికి యుద్ధాన్ని ఉపయోగించుకోవాలని జార్ తలిచాడు. కాని దానికివిరుద్ధమైన ఫలితం కలిగింది. రష్యా - జపాను యుద్ధం, విప్లవం తలయెత్తడాన్ని త్వరితపరచింది.

జార్ రష్యాలో పెట్టుబడిదారులు విధించిన దాస్య భారం, జార్ ప్రభుత్వ దాస్యంతో మరింత భారమయింది. పెట్టుబడిదారుల దోపిడివల్లనూ, అమానుషమైన శ్రమవల్ల నేగాను కార్మికులు బాధపడింది. ప్రజలందరితో బాటుగా కార్మికులకు ఎట్టి హక్కులూ లేవు. అందుచే జార్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా, పట్టణాలలోని, పల్లెలలోని ప్రజాతంత్రవాదులందరి యొక్క విప్లవోద్యమాన్ని నడపడానికి, రాజకీయంగా అభివృద్ధి చెందిన కార్మికులు ప్రయత్నించారు. ఇక రైతుల విషయం. భూములులేవు. అర్ధ-బానిస విధాన చిహ్నాలు ఇంకా అనేక రకాలుగా మిగిలియున్నాయి. భూస్వాములకు కులక్‌లకు ఒక రకంగా బానిసలుగా నివసించుతున్నారు. ఈ విధంగా భయం

కర దారిద్ర్యంతో బాధపడుతున్నారు. జార్ రష్యాలోని వివిధ జాతులు రెండురకాల దాస్యబాధలో నలిగిపోతున్నాయి. ఒకటి తమ తమ జాతుల భూస్వాముల, పెట్టుబడిదారులక్రిందా, రెండవది రష్యన్ జాతి భూస్వాముల పెట్టుబడిదారుల క్రిందా. **1900–1903** నాటి ఆర్థిక సంక్షోభం, కష్టజీవులయిన ప్రజా సామాన్యంయొక్క బాధలను మరింత హెచ్చించింది. యుద్ధం వాటిని మరింత తీవ్రతరం చేసింది. యుద్ధ పరాజయాలు జార్ ప్రభుత్వంపట్ల ప్రజల ద్వేషాగ్నికి ఆజ్యం పోసినట్లయింది. ప్రజల ఓర్పు ఇక భరింపలేని స్థితికి వచ్చింది.

మనం చూస్తున్నట్లు, విప్లవానికి కావలసిన పరిస్థితులన్నీ ఇంకా ఎక్కువగా కూడా వున్నాయి.

**1904** డిసెంబరులో, బాకూ బోల్షివిక్ కమిటీ నాయకత్వాన, బాకూలో ఒక పెద్దసమ్మె జరిగింది. ఇది సుసంఘటితమైన సమ్మె. ఈ సమ్మెలో కార్మికులు విజయం పొందారు. నూనెగనుల కార్మికులకూ యజమానులకూ మధ్య ఒక సమిష్టి ఒడంబడిక కుదిరింది. రష్యాలోని కార్మికవర్గ ఉద్యమచరిత్రలో ఇలాంటిది ఇదే మొదటిది. ట్రాన్సుకాకేషియాలోను, రష్యాలో వివిధ భాగాలలోను విప్లవ విజృంభణను ప్రారంభాన్ని బాకూ సమ్మె సూచించింది.

"రష్యా అంతటా జనవరి ఫిబ్రవరి నెలలలో జరిగిన ఉజ్వల పోరాటాలకు, బాకూసమ్మె ఒక నాంది" (స్టాలిన్)

రాబోయే మహావిప్లవ ప్రభంజనాన్ని సూచించే మేఘగర్జనయే ఈ సమ్మె.

సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో 1905 జనవరి 9 న (జనవరి 22న) విప్లవతుఫాను ప్రారంభమయింది.

1905 జనవరి 3వ తేదీన సెంటుపీటర్స్‌బర్గ్ పరిశ్రమలో కెల్లా పెద్దదైన ప్యూటిలావ్ (Putilov) పరిశ్రమలో (ఇపుడు కిరోవ్ పరిశ్రమలనిపేరు) సమ్మె ప్రారంభ మయింది. సమ్మెకు కారణం నల్గురు కార్మికులను బర్తరఫు చేయడం. ఈ సమ్మె త్వరలోనే పెద్దదయింది. సెంట్‌పీటర్స్‌బర్గ్‌లోని ఇతరమిల్లుల ఫ్యాక్టరీల కార్మికులుకూడా సమ్మెలో చేరారు. సమ్మె సర్వవ్యాపిత సమ్మెగామారింది. కార్మికోద్యమం అప్రతిహత మయింది. ప్రారంభదశలోనే దానిని అణిచివేయడానికి జార్ ప్రభుత్వం నిశ్చయించు కొంది.

ప్యూటిలావ్ సమ్మెకుపూర్వం 1904లో పోలీసులు గేపన్ అనే మతాధిపతిని గూఢచారిగా ఉపయోగించు కొన్నారు. తత్ఫలితంగా "రష్యన్ ఫ్యాక్టరీ కార్మికులసంఘం" (Assembly of Russian Factory workers) అనే ఒక కార్మిక సంఘాన్ని గేపన్ నెలకొల్పాడు. ఈ సంఘానికి, సెంట్ పీటర్స్‌బర్గ్ జిల్లా (పేటల) లన్నింటిలోనూ శాఖలున్నాయి. సమ్మె ప్రారంభంకాగానే, మతాధిపతి గేపన్ ఒక విద్రోహకర మైన పథకాన్ని తన సంఘాలలో సూచించాడు. జనవరి 9 వ తేదీన కార్మికులందరూకూడి చర్చి జండాలను (బానర్సు) జారు చక్రవర్తి చిత్రపటాలను పట్టుకొని శాంతియుతంగా వింటర్ రాజభవనం వద్దకు ఊరేగింపు చేసుకుంటూ వెళ్లాలని, అక్కడ జార్ చక్రవర్తికి తమ కోర్కెలను నివేదించుకొనే దరఖాస్తును ఈయాలని గేపన్ పథకం. జార్ ప్రజల ముందుకువచ్చి వారి

కోర్కెలువిని వాటిని తీర్చుతాడని గేపన్ చెప్పాడు. జార్ ప్రభుత్వ గూఢచార శాఖను (Okhrana) సహాయపడటానికి గేపన్ అంగీకరించాడు. ఏదోఒక వంకపై కార్మికులను తుపాకులతో కాల్చి కార్మికవర్గ ఉద్యమాన్ని రక్తపాతంలో ముంచడానికి సాకును కల్పించాడు గేపన్. కాని పోలీసుల పన్నాగం తిరిగి వారినే దెబ్బగొట్టింది.

ఈ దరఖాస్తు కార్మికుల మీటింగులలో చర్చించారు. కొన్ని సవరణలను సూచించారు. బోల్షివిక్కులు కూడా యీ మీటింగులలో - తామెవరో బహిరంగంగా చెప్పకుండానే - మాట్లాడారు. వారి పలుకుబడివల్ల దరఖాస్తులో మరికొన్ని అదనపు కోర్కెలను చేర్చారు. అవి; కార్మికులకు వాక్సభా పత్రికా స్వాతంత్ర్యం, రష్యా రాజకీయ విధానం మార్చడానికిగాను కాన్‌స్టిట్యూయంట్ ఎసెంబ్లీ (ప్రజాపరిషత్తు) సమావేశపరచడం, న్యాయ సూత్రాలందరికీ సమానంగా వర్తించడం, ప్రభుత్వం నుండి చర్చిని, (మత సంస్థలను) విడదీయడం, యుద్ధం అంతమొందించడం, దినానికి 8 గంటల పని, రైతులకు భూమిని అప్పగించడం.

జార్‌కు దరఖాస్తులు పెట్టుకొనుటద్వారా కార్మికులకు స్వాతంత్రం రాదనీ, సాయుధ శక్తి ద్వారానే స్వాతంత్రాన్ని సంపాదించుకోవాలనీ, ఈ మీటింగులలో బోల్షివిక్కులు విశదీకరించి చెప్పారు. కార్మికులపై కాల్పులు కూడా జరుగుతాయని బోల్షివిక్కులు హెచ్చరించారు. కాని వింటర్ రాజభవనానికి ఊరేగింపు వెళ్ళడాన్ని వారు ఆపలేకపోయారు. జార్ తమకు సహాయంచేస్తాడని ఇంకానమ్మే కార్మికులు చాలామంది

ఉన్నారు. ఈ ఉద్యమం ప్రజాసామాన్యంపై చాలా పలుకుబడిని సంపాదించింది.

సెంట్ పీటర్స్‌బర్గ్ కార్మికులు తమ దరఖాస్తులో ఇలా తెలియజేశారు :

"మేము, సెంట్‌పీటర్స్ బర్గ్ కార్మికులం, మా భార్యలు, పిల్లలు, నిరాధారులయిన మా తలిదండ్రులు, మా ప్రభువు గారయిన తమవద్దకు సత్యాన్ని సంరక్షణను కోరి వచ్చాము. మేం దరిద్రులం. పీడితులం. భరింపరాని శ్రమభారంతో కృంగిపోతున్నాం. అవమానాలకు గురిఅవుతున్నాం. మానవులలాగా మమ్మల్ని చూడటంలేదు......మేము ఓపికతో ఇన్నాళ్ళు బాధను సహిస్తూవచ్చాం. రోజురోజుకూ దరిద్రం, అజ్ఞానం, హక్కులు లేకపోవడం అనే బురదలోకి లోతుకు మరింత లోతుకు కూరుకుపోతున్నాం. నిరంకుశత్వం, నియంతృత్వం మా గొంతులను నులిమివేస్తున్నాయ్...మా ఓపిక ఇక అంతమయిపోయింది. ఇక ఏమాత్రం ఈ దుస్సహమైన బాధలు సహించడంకన్నా చావడమే మేలు అని అనుకొనే భయంకర సమయం ఆసన్నమయింది......"

1905 జనవరి 9 వ తేదీ ప్రాతఃకాలాన, జార్ ప్రభువు ఆరోజుల్లో నివసించుతూవున్న వింటర్ భవనానికి, కార్మికులు ఊరేగింపుతో వెళ్ళారు. కుటుంబాలకు కుటుంబాలుసహా – భార్యాపిల్లలూ ముసలిముతక అంతా – జార్ ప్రభువు చిత్రపటాలతోనూ చర్చి జండాలతోనూ వచ్చారు. ఊరేగింపులో మత గేయాలు వల్లించారు. వారు నిరాయుధులు. లక్షానలభై వేలమంది ప్రజలు వీధులలో గుమిగూడారు.

వారిని రెండవ నికలస్ (జార్) శత్రువుల వలె ఆహ్వానించాడు. నిరాయుధ కార్మికులపైన కాల్పులు సాగించమని అతడు ఆజ్ఞాపించాడు. జార్ సైనికుల చేతులలో వెయ్యిమందికి పైగా కార్మికులు చనిపోయారు. రెండు వేలమందికి పైగా గాయాలు తగిలాయి. కార్మికరక్తంతో సెంట్‌పీటర్స్‌బర్గ్ వీధులు ముంచివేయ బడినాయి.

కార్మికులతో పాటు బోల్షివిక్కులు కూడా ఊరేగింపులోకి వెళ్ళారు. వారిలో అనేకమందిని అరెస్టు చేశారు. అనేక మందిని చంపివేశారు. కార్మికుల రక్తంతో తడిసిన ఆ వీధుల్లో నీచ కిరాతకకృత్యానికి కారకుడెవడో, అతనిని ఎలా ఎదిరించాలో, బోల్షివిక్కులు కార్మికులకు తెలియజెప్పారు.

ఆనాటినుండే జనవరి 9 "బ్లడీసండే" (రక్తసిక్తరవివారం) అని పిలవబడుతూ వచ్చింది. ఆరోజున కార్మికులు ఒక గుణపాఠం నేర్చుకొన్నారు. జార్ ప్రభుత్వంపైవుండే నమ్మకం తుపాకి గుండ్లతో వదలిపోయింది. పోరాటం ద్వారానే తమ హక్కులను రక్షించుకొనగలమని వారుగుర్తించారు. ఆసాయంకాలమే, కార్మికవర్గ పేటలలో 'బారికేడ్ల'ను నిలబెట్టడం ప్రారంభించారు. "జార్ మనకు ఇచ్చిందిదీ. అతనికిదే తిరిగి అప్పజెపుదాం" అని కార్మికులన్నారు. (జార్ దెబ్బకొట్టాడు. తిరిగి అతనికి దెబ్బకొట్టాలి అని భావం – అనువాదకుడు.)

జార్ చేసిన దారుణకృత్యంయొక్క భయంకరవార్త నలుదిశలా వ్యాపించింది. కార్మికవర్గమంతా, దేశమంతా ద్వేషంతో క్రోధముతో అట్టుడికినట్లు ఉడికిపోయింది. జార్ చేసిన ఈ కిరాతకచర్యకు అసమ్మతిగా రాజకీయ కోర్కెలతో

కూడిన సమ్మె చేయని పట్టణమంటూ ఏదీ లేదు. "నిరంకుశ ప్రభుత్వం నశించాలి" అనే నినాదంతో కార్మికులు వీధులలోకి వచ్చారు. జనవరిలో సమ్మె చేసిన వారి సంఖ్య నాలుగులక్షల నలభై వేలమంది. గత పదిఏండ్లలోకంటే ఈ ఒక్క నెలలోనే ఎక్కువమంది సమ్మె చేశారు. కార్మికవర్గ ఉద్యమం ఇదివర కెన్నడూ లేనంత ఉచ్ఛస్థాయికి లేచింది.

రష్యాలో విప్లవం ప్రారంభ మయింది.

## 2

కార్మికుల రాజకీయ సమ్మెలూ ప్రదర్శనలూ- రైతులలో విప్లవోద్యమాభివృద్ధి- 'పోటెమ్కిన్' యుద్ధ నౌకలో తిరుగుబాటు.

జనవరి 9 తర్వాత కార్మికుల విప్లవ పోరాటం మరింత తీవ్రమై రాజకీయ స్వభావాన్ని వహించింది. ఇదివరలో ఆర్థిక సమ్మెలు, సానుభూతి సమ్మెలు చేసే కార్మికులు రాజకీయ సమ్మెలకు ప్రదర్శనాలకు పూనుకొన్నారు. కొన్నిచోట్ల జార్ సైన్యాలను సాయుధంగా ప్రతిఘటించ ప్రారంభించారు. అధిక సంఖ్యలో కార్మికులు కేంద్రీకృతమైయున్న సెంట్‌పీటర్స్‌బర్గ్, మాస్కో, వార్సా, రీగా, బాకూ మొదలయిన పెద్ద పట్టణా లలో సమ్మెలు బాగా సుసంఘటితంగాను మంచి పట్టుదల గాను జరిగాయి. పోరాడుతున్న శ్రామిక ప్రజల ముందు

శ్రేణిలో, లోహపు కార్మికులు నడిచారు. తమ సమ్మె ద్వారా కార్మికవర్గ అగ్రగామిదళం తక్కువ వర్గచైతన్యంగల కార్మికులనుకూడా కదిలించింది. పోరాటానికి కార్మికవర్గా న్నంతటినీ ఉత్తేజపరచింది. సోషల్ - డెమాక్రట్ల పలుకుబడి త్వరత్వరగా వృద్ధిఅయింది.

మేడే ప్రదర్శనాలలో అనేక పట్టణాలలో పోలీసుల తోను సైనికులతోను సంఘర్షణలు జరిగాయి. వార్సాలో ప్రదర్శనంపై ప్రభుత్వంతుపాకులనుపేల్చింది. అనేకవందలమంది గాయపడ్డారు; చనిపోయారు. వార్సాలో కాల్పులకు జవా బుగా పోలిష్ సోషల్-డెమాక్రట్ల ఆదేశంపై, కార్మికులు సర్వ వ్యాపిత సమ్మెచేశారు. మేనెల అంతటా సమ్మెలూ ప్రదర్శ నాలూ తగ్గలేదు. ఆ నెలలో రెండులక్షలమంది కార్మికులు రష్యా అంతటా సమ్మెచేశారు. బాకూ, లాడ్జ్, ఇవనోవో - వోజ్నెసెన్స్క నగరాలలో సర్వవ్యాపిత సమ్మెలు జరిగాయి. జార్ సైన్యాలను మాటిమాటికీ - ఎక్కువగా సమ్మెదారులు ప్రదర్శనాలలో పాల్గొన్న కార్మికులు ఎదుర్కొన్నారు. ఒడెస్సా, వార్సా, రీగా, లాడ్జ్ మొదలగు పట్టణాలలో అలాంటి సంఘర్ష ణలు జరిగాయి.

పోలెండులో పెద్ద పారిశ్రామిక కేంద్రాలయిన లాడ్జ్ పట్టణంలో జరిగిన పోరాటం ముఖ్యంగా తీవ్రమైనది. లాడ్జ్ పట్టణంలో కార్మికులు డజన్లకొలది బారికేడ్లను నిర్మించారు. మూడురోజులవరకు (1905 జూన్ 22 నుండి 24 వరకు) జార్ సైన్యాలతో వీధులలో పోరాటాలు సాగించారు. ఇక్కడ సాయుధ పోరాటం, సర్వవ్యాపిత సమ్మెతో మేళవించింది.

రష్యాలో కార్మికుల మొట్టమొదటి సాయుధ పోరాటాలుగా వీటిని లెనిన్ భావించాడు.

ఆ వేసవిలో జరిగిన అతిప్రాముఖ్యమైనసమ్మె ఇవనోవో వోజ్నెసెన్‌స్కలో జరిగింది. 1905 మేనెల ఆఖరులో ప్రారంభమై ఆగస్టు ప్రారంభంవరకు - సుమారు రెండున్నర నెలలు ఈ సమ్మె సాగింది. సమ్మెలో 70 వేలమంది - అందులో అనేకులు స్త్రీలు - పాల్గొన్నారు. ఉత్తర బోల్షివిక్ కమిటీ ఈ సమ్మెను నడిపింది. పట్టణానికి బయట టాల్కా (Talka) నది ఒడ్డున, దాదాపు రోజూ వేలకొలది కార్మికులు సమావేశ మవుతూ వుండేవారు. ఈ మీటింగులలో తమ అవసరా లేమిటో వారు చర్చించేవారు. కార్మికుల మీటింగులలో బోల్షివిక్‌లు ఉపన్యసించేవారు. సమ్మెను నాశనం చేయడానికి జార్ ప్రభుత్వం కార్మికులను చెదరగొట్టి, వారిపై కాల్పులు సాగించవలసిందని సైనికులను ఆజ్ఞాపించింది. వందలకొలది కార్మికులు చనిపోయారు. ఇంకా అనేక వందలమంది కార్మికులు గాయపడ్డారు. పట్టణంలో "ఉద్రిక్త పరిస్థితి" (స్టేట్ ఆఫ్ ఎమర్జన్సీ) ప్రకటించారు. పనిలో తిరిగి ప్రవేశించలేదు. వారూ వాళ్ళ కుటుంబాలూ ఆకలితో మాడిపోయారు. అయినాసరే లొంగిపోలేదు. సంపూర్ణంగా అలసిపోయిన పిదపనే తుట్టతుదకు వారు పనిలో తిరిగి ప్రవేశించవలసి వచ్చింది. ఈ సమ్మె కార్మికులను కాకలుతీర్చింది. కార్మికవర్గ ధైర్యానికీ, అచంచల విశ్వాసానికీ, కష్టసహిష్ణతకూ, ఐక్యతకూ సమ్మె ఒక ఉదాహరణ. ఇవనోవో - వోజ్నెసెన్‌స్క పట్టణ కార్మికులకు ఇది ఒక రాజకీయ పాఠం.

సమ్మెకాలంలో ఇవానోవో-వాజ్నెసెన్స్కి కార్మికులు "ప్రతినిధుల సమితి"ని (Council of Representatives) ఒక దానిని ఏర్పరచారు. వాస్తవంలో ఇది రష్యాలో మొట్ట మొదటి కార్మిక ప్రతినిధుల సోవియట్‌లలో ఒకటి.

కార్మికుల రాజకీయ సమ్మెలు దేశాన్నంతా ఉద్రూత లూగించాయి. పట్టణాలను అనుసరించి గ్రామసీమల్లోకూడ తిరుగుబాటులు ప్రారంభమయ్యాయి. వసంతకాలంలో రైతుల తిరుగుబాట్లు తలయెత్తాయి. భూస్వాములపైకి పెద్దపెద్ద గుంపులుగా రైతులువెళ్ళి వారి ఎస్టేట్లను పంచదార ఫ్యాక్టరీలను సారాబట్టీలను (Sugar refineries and distilleries) కొల్లగొట్టారు. వారి భవనాలకు నగరులకు నిప్పంటించారు. అనేక చోట్ల రైతులు భూస్వాముల భూమిని లాక్కొన్నారు. అడవులను ఒక్కపెట్టున నరికివేయ ప్రారంభించారు. ఎస్టేట్ భూములను ప్రజలకు అప్పగించాలని కోరారు. భూస్వాముల నిల్వ ధాన్యాన్ని ఇతర ఉత్పత్తిని పట్టుకొని ఆకలిగొన్నవారికి పంచిపెట్టారు. భూస్వాములకు బేజారెత్తి పట్టణాలకు పారిపోయారు. జార్ ప్రభుత్వం, సైనికులను ఆశ్వికులను (కొసాక్స్) రైతుల తిరుగుబాట్లను అణచడానికి పంపింది. సైన్యాలు రైతులపై కాల్పులు సాగించాయి. 'రింగ్ లీడర్స్'ను (ముఖ్యనాయకులను) అరెస్టుచేసి కొరడాలతో కొట్టి ఇతర విధాల చిత్రహింసలు పెట్టారు. కాని రైతులు తమ పోరాటాన్ని మాత్రం విడిచిపెట్టలేదు.

రైతు ఉద్యమం, రష్యా మధ్యభాగాలలో, ఓల్గా ప్రాంతంలో, ట్రాన్స్ కాకేషియాలో, ముఖ్యంగా జార్జియాలోనూ మరింతగా వ్యాపించింది.

సోషల్ డెమాక్రట్‌లు గ్రామ సీమలలోకి బాగా చొచ్చుకుపోయారు. "రైతులారా! మీకు మాదొక మాట!" అనే పేరుతో ఒక విజ్ఞప్తిని పార్టీ సెంట్రల్ కమిటీ ప్రకటించింది. ట్వెర్, సారటావ్, పోల్టావా, చెర్నిగావ్, ఎకాటెరినోస్లావ్, టిఫ్లిస్‌లలోనూ ఇంకా అనేక యితర రాష్ట్రాలలోను సోషల్ డెమాక్రటిక్ కమిటీలు రైతులకు విజ్ఞప్తులను ప్రకటించాయి. గ్రామాలలో సోషల్ డెమాక్రట్లు మీటింగులు జరిపేవారు. రైతులలో "సమితులు" ఏర్పాటు చేసేవారు. రైతు కమిటీలను నెలకొల్పేవారు. 1905 వేసవిలో, సోషల్ డెమాక్రట్లచే నడుపబడిన వ్యవసాయకూలీ సమ్మెలు అనేక ప్రాంతాలలో జరిగాయి.

రైతాంగ పోరాటానికి ఇది ప్రారంభం మాత్రమే. రైతాంగ ఉద్యమం 85 'యుయెజడ్' లకు (జిల్లాలకు) మాత్రమే ప్రాకింది. అంటే జార్ ప్రభుత్వ రష్యాలోని యూరే పియన్ భాగంలో ఉన్న మొత్తం జిల్లాలలో ఇది 7వ వంతు మాత్రమే.

రైతు కూలీల ఉద్యమం, రష్యా - జపాను యుద్ధంలో సైనికులు పొందిన అపజయాలు, సైనికులలో కొంత అలజడి కల్గించాయి.

జార్ ప్రభుత్వం యొక్క యీ బురుజు కంపించ సాగింది..

1905 జూన్‌లో, నల్ల సముద్ర నౌకాదళంలోని 'పోటెమ్కిన్' అనే యుద్ధ నౌకలో తిరుగుబాటు వచ్చింది. తిరుగబడ్డ సమయంలో అది ఒడెస్సా సమీపంలో వుంది. అపుడు

ఒడెస్సాలో కార్మికుల సర్వవ్యాపిత సమ్మె సాగుతూ వుంది. తాము అమితంగా ద్వేషించుతున్న అధికారులపై తిరుగబడ్డ నావికులు పగదీర్చుకొన్నారు. నౌకను ఒడెస్సాకు తీసుకు వచ్చారు. "పోటెమ్కిన్" యుద్ధనౌక విప్లవ పక్షంవైపుకు వచ్చివేసింది.

ఈ తిరుగుబాటుకు లెనిన్ చాలా ప్రాముఖ్యతనిచ్చాడు. ఈ ఉద్యమానికి బోల్షివిక్కులు నాయకత్వం వహించి, కార్మికుల, రైతుల, స్థానిక పటాలాల (Garrison) ఉద్యమంతో దానిని మేళవించుట అవసరమని లెనిన్ భావించాడు.

"పోటెమ్కిన్" పై యుద్ధం చేయడానికి జార్ అనేక యుద్ధనౌకలను పంపాడు. కాని తిరుగబడ్డ తమతోటి కామ్రేడ్సుపై తుపాకులు పేల్చడానికి ఆ నావికులు తిరస్కరించారు. "పోటెమ్కిన్" యుద్ధనౌక స్తంభంపైన (Mast) చాలా రోజులవరకు విప్లవ చిహ్నమైన ఎఱ్ఱజెండా ఎగురుతూనేవుంది. 1905 లో ఉద్యమాన్ని, 1917 నాటికి జరిగినట్లు ఒక్క బోల్షివిక్ పార్టీ మాత్రమేనడపలేదు. మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు, అరాచకవాదులు మొదలగు వారనేకులు 'పోటెమ్కిన్' యుద్ధనౌకలో వున్నారు. అందుచేత, సోషల్ డెమాక్రట్‌లు వ్యక్తిగతంగా తిరుగుబాటులో పాల్గొన్నప్పటికీ, ఆ తిరుగుబాటుకు సరియైన తగుఅనుభవంగల నాయకత్వం లేకపోయింది. క్లిష్టసమయాలలో నావికులలో కొందరు ఊగిసలాడజొచ్చారు. నల్లసముద్ర నౌకాదళంలోని ఇతర నౌకలు "పోటెమ్కిన్" తిరుగుబాటులో కలియలేదు. బొగ్గు, భోజనపదార్థాలు అయిపోవడంచేత ఈ విప్లవ యుద్ధనౌక రుమేనియా తీరానికి పోయి అధికారులకు లొంగి పోవలసి వచ్చింది.

'పోటెమ్కిన్' యుద్ధనౌకా సైనికుల తిరుగుబాటు అప జయం పొందింది. తర్వాత జార్ ప్రభుత్వం, చేజిక్కిన నావికు లను విచారణ చేసింది. కొందరిని ఉరితీసింది. కొందరికి ప్రవాసశిక్ష విధించింది. మరికొందరికి కఠినశిక్ష విధించింది. కాని ఈతిరుగుబాటు జరుగుటే అత్యంత ప్రాముఖ్యఘటన. సైని కులలోను నావికులలోను మొట్టమొదటిసారిగా జరిగిన ప్రజా విప్లవచర్య 'పోటెమ్కిన్' తిరుగుబాటు. జార్ ప్రభుత్వ సైనికు లలో ఒక పెద్దదళం విప్లవంవైపుకు మ్రొగ్గడంకూడా ఇదే మొట్టమొదటసారి. కార్మికవర్గ శక్తులతో ప్రజలతో సైనికులు నావికులు చేరాలనే; కార్మికుల రైతుల హృదయానికి సన్ని హితంగా వారుండాలనే; ముఖ్యంగా సైనికులూ నావికులూ తమలోదాము మరింత సన్నిహితంగా వుండాలనే - ఒక భావాన్ని ఈ తిరుగుబాటు కల్గించింది.

ప్రజా బాహుళ్య రాజకీయ సమ్మెలను, ప్రదర్శనాలను కార్మికులు పూనుకోవడం, రైతుఉద్యమ అభివృద్ధి, పోలీసుల తోను సైనికులతోను ప్రజలకు జరిగినసంఘర్షణలు, తుదకు నల్ల సముద్రనౌకాదళంలో తిరుగుబాటూ, ఇవన్నీ, ప్రజలసాయుధ తిరుగుబాటుకు పరిస్థితులు పరిపక్వ మవుతున్నాయని తెలియ జేస్తున్నాయి. లిబరల్ బూర్జువానుకూడా కార్యాచరణకు ఇది కదలించింది. విప్లవమంటే ఒకప్రక్క వారికి భయంవుంది. కాని మరొకప్రక్క విప్లవం అనే పెనుభూతంచూపి జార్‌ను భయ పెడుతూ, విప్లవానికి వ్యతిరేకంగా జార్‌తో రాజీపడటానికి ప్రయత్నించారు. ప్రజలను 'చల్లబరచడానికి' 'ప్రజలకు' కొన్ని సంస్కరణలు కావాలని అది కోరింది. ఈ సంస్కరణలు విప్లవశక్తులలో చీలికతెచ్చి, "విప్లవ అఘాయిత్యాలను"

తప్పించడానికేనట. "మనతలకాయలు పోయేకన్నమనభూములు కొన్ని పోతే పోనీయండి" అని లిబరల్ భూస్వాములన్నారు. జార్ ప్రభుత్వంతో అధికారాన్ని పంచుకోడానికి లిబరల్ బూర్జువా సిద్ధమౌతూవుంది. కార్మికవర్గపు ఎత్తుగడలను లిబరల్ బూర్జువాఎత్తుగడలనుగురించిఆరోజులలో లెనిన్ఇలావ్రాశాడు.

"శ్రామికవర్గం పోరాడుతూంది; అధికారం కైవశం చేసుకోవడానికి బూర్జువా ప్రాకులాడుతూంది."

జార్ ప్రభుత్వం క్రూర పైశాచికతతో కార్మికులను రైతులను అణచుతూనేవుంది. ఒక్క నిర్బంధపద్ధతులద్వారానే విప్లవాన్ని ఎదుర్కోలేమని అది గమనించక తప్పిందికాదు. అందుచే నిర్బంధ పద్ధతులను వదులుకోకుండానే, కుటిల యత్న విధానానికి పూనుకొంది. ఒకప్రక్క తన గూఢచారుల సహాయంతో, రష్యాలోని వివిధ జాతులను ఒకరిపై ఒకరిని ఉసికొల్పింది. యూదులను వేటాడటం, ఆర్మేనియన్లు, తాతార్లు ఒకరి గొంతుక లొకరు కోసుకొనేటట్లు చేయడం-మొదలగు పనులను ప్రోత్సహించింది. మరొకప్రక్క "ప్రతినిధి సంస్థను" జెమిస్కీ సోబార్ (Zemsky Sobor) రూపంలో అనగా స్టేట్ డ్యూమాను (ప్రభుత్వ శాసనసభ) సమావేశ పరచడానికి ప్రభుత్వం వాగ్దానంచేసింది. బులీజిన్ (Bulygin) అనే మంత్రిని అలాంటి డ్యూమాకు ఒక పథకం వ్రాయవల సిందని నియమించింది. కాని దానికి శాసనంచేసే హక్కులు మాత్రం ఉండకూడదట. (16, 17 శతాబ్దాలలో ప్రభుత్వంతో సంప్రదించడానికి, రష్యాలో ఏస్టేట్లను చెందినవారి ప్రతినిధుల

సమావేశం ఒకటి వుండేది. దానినే జెమ్స్కీ సోబార్ అనే వారు - అనువాదకుడు) విప్లవశక్తులను చీల్చి, ప్రజలలో మితవాద పక్షాలను విప్లవంనుండి తెగ తెంపులు చేయడానికి గాను ఈ చర్యలన్నీ అవలంబించబడ్డాయి.

ప్రజా ప్రాతినిధ్యం పేరిట చేసే ఈ వికట ప్రయత్నాన్ని వమ్ము చేయాలనే ఉద్దేశంతో, బులీజిన్ డ్యూమాను, బహిష్కరించవలసిందని బోల్షివిక్కులు ప్రకటించారు.

తద్వ్యతిరేకంగా, మెన్షివిక్కులు, డ్యూమాను విధ్వంసం చేయదలచలేదు. దానిలో పాల్గొనడం అవసరమని వారు తలిచారు.

# 3

బోల్షివిక్కుల మెన్షివిక్కుల మధ్య ఎత్తుగడలలో విభేదాలు - పార్టీ మూడవ కాంగ్రెస్ - "ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ - డెమాక్రసీ అవలంబించవలసిన రెండు ఎత్తుగడలు" అనే లెనిన్ గ్రంథం. మార్క్సిస్టు ఎత్తుగడలకు పునాది.

సమాజంలోని అన్ని వర్గాలను విప్లవం కదలించింది. విప్లవ ఫలితంగా దేశ రాజకీయ జీవితంలో వచ్చిన మార్పు, ఆయా వర్గాలను వారలవాటుపడిన పాత స్థానాలనుండి దిగలాగింది; నూతన పరిస్థితులకు అనుగుణ్యంగా వారు పునస్సమ్మేళన మయేటట్లు ఒత్తిడి చేసింది. ప్రతి వర్గమూ, ప్రతి

పార్టీ, తన ఎత్తుగడలను, తన ప్రవర్తనా గతిని, ఇతర వర్గాల యెడ తన వైఖరిని, ప్రభుత్వం పట్ల తన వైఖరిని నిర్ణయించు కొనసాగాయి. జార్ ప్రభుత్వం సైతం అలవాటులేని కొత్త ఎత్తులను వెతకవలసి వచ్చింది. ఉదాహరణకు "ప్రతినిధి సంస్థ" బులీజిన్ డ్యూమాను (శాసనసభ) సమావేశ పరచడానికి వాగ్దానం చేయుట.

సోషల్ - డెమాక్రటిక్ పార్టీ కూడా తన ఎత్తుగడలను నిర్ణయించుకోవలసి వచ్చింది. నానాట వృద్ధి చెందుతున్న విప్లవ వెల్లువ కారణంగా ఇది అవుసరమయింది. శ్రామిక వర్గాన్ని ఎదుర్కొన్న ఈ క్రింది ప్రత్యక్ష సమస్యలవల్ల సోషల్ డెమాక్రటిక్ పార్టీ తన ఎత్తుగడలను ఏమాత్రం ఆలస్యం లేకుండా నిర్ణయించుకోవలసి వచ్చింది. ఆ ప్రత్యక్ష సమస్యలివి: సాయుధ తిరుగుబాటును సంఘటిత మొనర్చుట, జార్ ప్రభుత్వాన్ని కూలద్రోయుట, విప్లవ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరుచుట, అలాంటి ప్రభుత్వంలో సోషల్ - డెమాక్రట్లు పాల్గొనుట, రైతాంగంపట్ల లిబరల్ బూర్జువా పట్ల అవలంబించవలసిన వైఖరి మొదలైనవి జాగ్రత్తగా ఆలోచించి ఒకే విధమయిన మార్క్సిస్టు ఎత్తుగడలను సోషల్ - డెమాక్రట్లు నిర్ణయించవలసి యుంది.

కాని మెన్షివిక్కుల ఆవకాశవాదం వలన, చీలికలు దెచ్చే చర్యలవలన, రష్యన్ సోషల్ - డెమాక్రటిక్ పార్టీ ఆ కాలంలో రెండు ముఠాలుగా విభజింపబడింది. ఈ చీలిక సంపూర్ణమయినదని భావించరాదు. ఇంకా ఈ రెండు ముఠాలూ పైకిమాత్రం రెండు పార్టీలుగా విడిపోలేదు. కాని

వాస్తవంలో అవి రెండుపార్టీలులాగానే ఉండేవి. ప్రతిదానికీ ఒక స్వంత కేంద్రనాయకత్వమూ స్వంత పత్రికా వున్నాయి.

ఇదివరకు మెన్షివిక్కులకు పార్టీ ఆంతరిక సంఘ్యానులకూ నిర్మాణ సమస్యలపైన (ఆర్గానిజేషనల్ ప్రాబ్లెమ్స్) మాత్రమే భేదాభిప్రాయాలుండేవి. వీటికి తోడుగా యెత్తుగడలపై కూడా మరికొన్ని విభేదాలు ఏర్పడ్డాయి. ఇది చీలికను మరింత పెద్దది చేసింది.

ఒక సంయుక్త పార్టీ లేని ఫలితంగా ఒకేరకపు పార్టీ ఎత్తుగడలు లేకుండా పోయాయి.

ఈ పరిస్థితులనుండి బయటపడే మార్గం ఏమిటి? మరొక కాంగ్రెసును, పార్టీ 3వ కాంగ్రెస్‌ను సమావేశ పరచడం, అందులో ఒకేరకపు ఎత్తుగడలను అవలంబించడం; మెజారిటీ నిర్ణయాలను, కాంగ్రెసు నిర్ణయాలను హృదయ పూర్వకంగా మైనారిటీ అమలుపరచునట్లు నిర్ణయించడం. ఈ విషయాన్నే మెన్షివిక్కులకు బోల్షివిక్కులు సూచించారు. మూడవ కాంగ్రెసు సమావేశపరచడానికి మెన్షివిక్కులు చెవి యొగ్గనైనా లేదు. పార్టీచే ధృవపరచబడి, సభ్యులందరూ శిరసావహించవలసిన ఎత్తుగడలు లేకుండా పార్టీని అలావదలి వేయడం ఇక క్షంతవ్యంకాదని బోల్షివిక్కులు భావించారు. అందుచే మూడవ కాంగ్రెసును సమావేశపరచే చొరవను బోల్షివిక్కులు తమ చేతుల్లోకి తీసుకొన్నారు.

పార్టీ సంఘాలన్నిటినీ – బోల్షివిక్ – మెన్షివిక్ సంఘాల రెండింటినీ కాంగ్రెసుకు ఆహ్వానించారు. కాని మెన్షివిక్కులు మూడవ కాంగ్రెసులో పాల్గొన నిరాకరించారు. తాము వేరే

ఒక కాంగ్రెసును జరుప నిశ్చయించారు. ఆ కాంగ్రెసుకు ప్రతినిధులు తక్కువవచ్చుటచే దానిని 'కాంగ్రెసు' (మహాసభ) అనుటకు బదులుగా 'కాన్ఫరెన్సు' (సమావేశం)అని పిలిచారు. కాని వాస్తవంలో అది కాంగ్రెసే. మెన్షివిక్ పార్టీ కాంగ్రెసు దాని నిర్ణయాలకు మెన్షివిక్‌లందరూ బద్ధులవాలని ఎంచబడింది.

రష్యన్ సోషల్-డెమాక్రటిక్ పార్టీ మూడవ కాంగ్రెస్, 1905 ఏప్రిల్‌లో, లండన్‌లో సమావేశమయింది. 20 బోల్షివిక్ కమిటీలకు ప్రాతినిధ్యం వహించిన 24మంది ప్రతి నిధులు దానికి హాజరయ్యారు. పార్టీలోని పెద్ద సంస్థలన్నిటి ప్రతినిధులూ కాంగ్రెసుకు వచ్చారు.

"పార్టీ నుండి చీలిపోయిన ఒక భాగం" గా మెన్షివిక్కు లను కాంగ్రెసు ఖండించింది. తర్వాత పార్టీ ఎత్తుగడలను నిర్ణయించే తక్షణ కర్తవ్యానికి పూనుకొంది.

ఈకాంగ్రెసు జరుగుతున్న సమయంలోనే మెన్షివిక్కులు జెనీవాలో కాన్ఫరెన్సు జరిపారు. "రెండు కాంగ్రెసులూ - రెండు పార్టీలూ" అని లెనిన్ ఈ పరిస్థితిని సమీక్షించాడు.

కాంగ్రెసూ, కాన్ఫరెన్సూ దాదాపు ఒకేసమస్యనులనగా ఎత్తుగడలను గురించి చర్చించాయి. కాని అవిచేసిననిర్ణయాలు మాత్రం పూర్తిగా విభిన్నమైనవి. కాంగ్రెసు, కాన్ఫరెన్సూ రెండు రకాలయిన తీర్మానాలను ఆమోదించినవి. ఇవి బోల్షివిక్కులకూ, - మెన్షివిక్కులకూ, మూడవ కాంగ్రెసుకూ-మెన్షివిక్ కాన్ఫరెన్సుకూ ఎత్తుగడల విషయంలో గల లోతయిన విభేదాలను బయటపెట్టినాయి.

ఈ విభేదాలలోని ముఖ్యాంశాలివి :

పార్టీ మూడవ కాంగ్రెసు ఎత్తుగడ విధానం. అభివృద్ధి చెందుతున్న విప్లవం, బూర్జువా ప్రజాతంత్ర స్వభావం కలిగియున్నది. ఆ సమయంలో పెట్టుబడిదారీవిధాన చట్రం హద్దులలో సాధ్యమయ్యేదానికన్నా ముందుకు పోజాలదు. ఇది వాస్తవమైనప్పటికీ విప్లవం సంపూర్ణవిజయం పొందాలనే అభిలాష ప్రధానంగా శ్రామికవర్గానికి మాత్రమే వుంటుంది. ఎందువల్లనంటే, విప్లవవిజయంమూలంగా శ్రామికవర్గం తాను సంఘటితమవడానికీ, రాజకీయంగా అభివృద్ధిచెందడానికీ, శ్రామిక ప్రజాసామాన్యానికి, రాజకీయ నాయకత్వం వహించుటలో అనుభవమూ సమర్థతా సంపాదించడానికీ, బూర్జువావిప్లవం నుండి సోషలిస్టు విప్లవానికి పురోగమించడానికీ అవకాశముంది.

బూర్జువా ప్రజాతంత్రవిప్లవం విజయం పొందడానికి నిర్మించిన శ్రామికవర్గపు ఎత్తుగడలకు, రైతాంగంనుండే సహాయంలభించుతుంది. ఎంచేతనంటే, విప్లవాన్ని సంపూర్ణంగా జయించకపోయినట్లయితే, రైతులు తమ భూస్వాములతో వ్యవహారం పరిష్కరించుకోలేరు. తమ భూములపై అధికారాన్ని పొందలేరు. అందుచేత రైతాంగం శ్రామికవర్గానికి సహజమైన సహాయకారి.

ఈ విప్లవం సంపూర్ణంగా విజయంపొందడం, లిబరల్ బూర్జువాకు ఇష్టంలేదు. కూలీలపైన రైతులపైన జార్ప్రభుత్వం కొరడాలాగ వుండటం దానికి ఇష్టం. అందరికన్నా కార్మికులంటేను రైతులంటేను దానికి భయంఎక్కువ. జార్ ప్రభుత్వాధికారులను కొద్దిగా తగ్గించుతూ, ఆ ప్రభుత్వాన్ని అలాగే

నిలబెట్టాలని అదికోరుతుంది. అందుచేత, శాసన బద్ధరాచరికం (Constitutional monorchy) ప్రాతిపదికపై జార్ ప్రభుత్వంతో రాజీపడి, అంతటితో ముగించుదామని లిబరల్ బూర్జువా ప్రయత్నించుతుంది.

విప్లవం విజయం పొందాలంటే ఈక్రింది షరతులు నెరవేరాలి. శ్రామికవర్గం నాయకత్వం వహించితేనే; విప్లవ నాయకత్వం వహించిన శ్రామికవర్గం రైతాంగంతో మైత్రి (Alliance) సంపాదించితేనే; జార్ ప్రభుత్వంపై తిరుగుబాటును సంఘటితం చేయుటలో సోషల్ - డెమాక్రటిక్ పార్టీ చురుకుగా పనిచేస్తేనే; లిబరల్ బూర్జువాను వేరుచేయగలిగితేనే విప్లవం జయంపొందుతుంది. విజయవంతమైన తిరుగుబాటు ఫలితంగా, సమూలంగా విప్లవ ప్రతీఘాతాన్ని నాశనం చేయగల తాత్కాలిక విప్లవప్రభుత్వం ఏర్పడి అది ప్రజలందరకూ ప్రాతినిధ్యం వహించే ప్రజాపరిషత్తును ఏర్పర్చాలి. అనుకూలంగా పరిస్థితులుండటంవల్ల, విప్లవాన్ని తుదిదాకా కొనసాగించుటకుగాను సోషల్ డెమాక్రటిక్ పార్టీ తాత్కాలిక విప్లవ ప్రభుత్వంలో పాల్గొనాలి కాని, నిరాకరించరాదు.

## మెన్షివిక్కు కాన్ఫరెన్సు ఎత్తుగడ విధానం

విప్లవం బూర్జువా విప్లవమే గనుక లిబరల్ బూర్జువాయే దానికి నాయకత్వం వహించుతుంది. రైతాంగంతో శ్రామికవర్గ సన్నిహిత సంబంధాలను ఏర్పరచుకోరాదు; లిబరల్ బూర్జువాతోనే ఏర్పరచుకోవాలి. ప్రధాన విషయం ఏమంటే, విప్లవతత్వాన్ని ప్రదర్శించి లిబరల్ బూర్జువాన్ను

భయపెట్టరాదు. విప్లవంనుండి వెనుదిరగడానికి లిబరల్ బూర్జువాకు సాకుకల్పించరాదు. అదిగనుక విప్లవంనుండి వెనుదిరిగితే విప్లవం బలహీన పడుతుంది.

తిరుగుబాటు విజయప్రదమనడం సంభవమే కావచ్చు. కాని తిరుగుబాటు జయంపొందిన పిదప, లిబరల్ బూర్జువాను భయపెట్టకుండా వుండేందుకుగాను సోషల్ - డెమాక్రటిక్ పార్టీ దూరంగా నిలబడాలి. తిరుగుబాటు ఫలితంగా ఒక తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడవచ్చు. ఈ ప్రభుత్వం సోషలిస్టు స్వభావం కలిగివుండదు గనుక ప్రభుత్వంలో సోషల్ - డెమాక్రటిక్ పార్టీ ఏ పరిస్థితులలోను పాల్గొనరాదు. ఎందువల్ల నంటే (ఇదే అసలు ముఖ్యవిషయం) విప్లవ తత్వంగల సోషల్-డెమాక్రటిక్ పార్టీ ప్రభుత్వంలో పాల్గొన్నట్లయితే లిబరల్ బూర్జువాజీ భయపడుతుందట. అందువల్ల విప్లవం బలహీన పడుతుందట !

జెమ్‌స్కీ- సోబార్ (Zemsky Sobor) లాంటి స్వభావం కలదానినిగాని, లేక స్టేట్‌డ్యూమా (ప్రభుత్వ శాసనసభ)ను గాని, ఇలాంటి ఏదో ఒక ప్రతినిధి సంస్థను సమావేశపరచడం, రాబోవు విప్లవానికి మంచిది. ఎంచేతనంటే, పై ప్రతినిధి సంస్థను ప్రజాపరిషత్తుగా (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ) మార్పుచేయడానికి లేదా వేరే ప్రజాపరిషత్తును అదే సమావేశపరచడానికి, పైనుండి కార్మికవర్గం తగిన వత్తిడిని తీసుకురావచ్చు.

శ్రామికవర్గానికి తన స్వంత ప్రత్యేక ప్రయోజనాలున్నాయి. అంటే జీతం పుచ్చుకొని పనిచేయడంకన్నా కార్మి

కులకు వేరే ప్రయోజనాలులేవు. ఈ ప్రయోజనాలను సాధించుకోడానికి మాత్రమే అది శ్రద్ధ వహించాలి. ప్రయత్నించాలి. అందుచే శ్రామికవర్గం బూర్జువా విప్లవానికి నాయకత్వం వహించ ప్రయత్నించరాదు. బూర్జువా విప్లవం సర్వ సాధారణ రాజకీయ విప్లవం. అది అన్నివర్గాలకు చెందినది. ఒక్క శ్రామికవర్గానికేకాదు.

క్లుప్తంగా చెప్పాలంటే, సోషల్ - డెమాక్రటిక్ లేబరు పార్టీలోని రెండుమతాల రెండురకాల ఎత్తుగడలు ఆ విధంగా వున్నాయి.

"ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ - డెమాక్రసీయొక్క రెండు ఎత్తుగడలు" (**Two Tactics of Social Democracy in the Democratic Revolution**) అనే తన చారిత్రిక గ్రంథంలో లెనిన్, మెన్షివిక్కుల ఎత్తుగడలను గురించి చిర స్థాయిగా వుండదగిన (క్లాసికల్) విమర్శన గావించాడు. బోల్షివిక్కు ఎత్తుగడలను అత్యద్భుతంగా సమర్థించాడు.

**1905** జులైలో, అనగా, పార్టీ మూడవ కాంగ్రెసు జరిగిన రెండు నెలలకు యీ పుస్తకం వెలువడింది.

పుస్తకం పేరునుబట్టి, లెనిన్ యీగ్రంథంలో బూర్జువా ప్రజాతంత్ర విప్లవకాలానికి సంబంధించిన ఎత్తుగడల సమస్యలను గురించి మాత్రమే చర్చించాడని భావించవచ్చు. ఒక్క రష్యన్ మెన్షివిక్కులను మనసులోఉంచుకొని మాత్రమేవ్రాశాడని కూడా భావించవచ్చు. కాని వాస్తవంలో, మెన్షివిక్కుల ఎత్తుగడలను అతడు విమర్శించినపుడు అంతర్జాతీయంగా ఉన్న అవకాశవాదుల ఎత్తుగడలనుకూడా అదే సమయాన బట్టబయలు

చేశాడు. బూర్జువా విప్లవకాలంలో మార్క్సిస్టు ఎత్తులను గురించి నిరూపించుతూ, బూర్జువా విప్లవానికీ సోషలిస్టు విప్లవానికీ గల తేడాని చూపించాడు. బూర్జువా విప్లవం నుండి సోషలిస్టువిప్లవ పరివర్తన దశలో మార్క్సిస్టుఎత్తుగడల యొక్క ప్రధాన సూత్రాలనుకూడ అపుడే నిర్ధారణ చేశాడు.

"ప్రజాతంత్ర విప్లవంలో సో. డె. యొక్క రెండు ఎత్తుగడలు" అనే గ్రంథంలో ఎత్తుగడలకు సంబంధించిన ప్రధాన సూత్రాలను లెనిన్ ఈ క్రింది విధంగా వివరించాడు:

(1) లెనిన్ గ్రంథమంతటా కనిపించే ముఖ్యమయిన ఎత్తుగడ సూత్రం ఇది: బూర్జువా ప్రజాతంత్ర విప్లవానికి శ్రామిక వర్గమే నాయకత్వం వహించగలదు; వహించి తీరాలి. రష్యాలో ప్రజాతంత్ర విప్లవానికి మార్గంచూపే శక్తి శ్రామికవర్గమే అవుతుంది; అయి తీరాలి.

"ఈ విప్లవానికి సూటిగా ప్రజాతంత్ర విప్లవ హద్దుల కన్నా దాటిపోగల సమర్థతలేదు" అంటూ లెనిన్ ఈ విప్లవం యొక్క బూర్జువా స్వభావాన్ని అంగీకరించాడు. అయినప్పటికీ అది పై తరగతి వారి విప్లవం కాదు. కార్మికవర్గాన్నంతా, రైతాంగాన్నంతా, ప్రజలనంతా కదలించేటటువంటి ప్రజా విప్లవం. బూర్జువా విప్లవం అంటే శ్రామికవర్గానికి గల ప్రాముఖ్యతను చిన్నచూపు చూస్తూ, ఆ విప్లవంలో శ్రామిక వర్గపాత్రను తక్కువ అంచనా వేస్తూ ఆ విప్లవంనుండి కార్మిక వర్గాన్ని దూరంగా వుంచాలని మెన్షివిక్కులు ప్రయత్నించారు. ఈ ప్రయత్నాలు శ్రామికవర్గ ప్రయోజనాలకు ద్రోహం చేయుటేనని లెనిన్ భావించాడు.

లెనిన్ ఇలా అన్నాడు:

"బూర్జువా విప్లవం నుండి శ్రామికవర్గం దూరంగా ఉండరాదు. బూర్జువా విప్లవంపట్ల శ్రామికవర్గం అలక్ష్యం చూపరాదు. విప్లవానికి నాయకత్వం బూర్జువా చేతులలో పడనీయరాదు. అందుకు బదులుగా శ్రామికవర్గం బూర్జువా విప్లవంలో అత్యంత శక్తివంతంగా తుదిదాకా విప్లవాన్ని కొనసాగించేందుకూ, అచంచలమైన శ్రామికవర్గ ప్రజాతంత్రం కోసమూ, అతిదృఢనిశ్చయంతో పోరాడాలి - అని మార్క్సిజం శ్రామికవర్గానికి బోధిస్తూంది" (లెనిన్ సెలెక్టెడ్‌వర్క్స్, ఇంగ్లీష్ ఎడిషన్, మాస్కో 1947, 1వ వాల్యూం 369వ పేజీ)

లెనిన్ ఇంకా ఇలా చెప్పాడు: "ప్రస్తుతసమయంలో, సంపూర్ణ రాజకీయ స్వాతంత్ర్యంకన్న, ప్రజాతంత్ర రిపబ్లిక్ కన్న సోషలిజాన్ని దగ్గరకు తీసుకొచ్చే సాధనం మరొకటిలేదనీ మరొకటి ఉండబోదనీ మనం మరచిపోగూడదు."

(పై గ్రంథమే 414వ పేజీ)

విప్లవఫలితాలు బహుశా రెండురకాలుగా వుండవచ్చునని లెనిన్ భవిష్యత్తు నూహించాడు.

(ఎ) జార్ ప్రభుత్వాన్ని కూలద్రోసి నిశ్చితవిజయం పొంది ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను స్థాపించుట.

(బి) లేదా, బలాలు తగినంతగా లేనట్లయితే, ప్రజలను నష్టపరచి బూర్జువావర్గమూ, జార్ ప్రభువు రాజీపడవచ్చు. ఈ రాజీవలన ఒక సంకుచిత రాజ్యాంగచట్ట మేదైనా, లేక బహుశా రాజ్యాంగచట్టమనే దిష్టిబొమ్మ ఒకటి ప్రసాదించబడవచ్చు.

ఈ రెంటిలో మొదటి సత్ఫలితాన్నే శ్రామికులు కోర తారు. అంటే జార్ ప్రభుత్వంపై నిశ్చితవిజయాన్నే వారు కోరుతారు. విప్లవానికి నాయకత్వం వహించుటలోను, మార్గ దర్శక మగుటలోను, శ్రామికవర్గం జయంపొందుతేనే అలాంటి ఫలితం కల్గుతుంది.

లెనిన్ ఇలా అన్నాడు:

"శ్రామికవర్గం బూర్జువాకు సహాయకపాత్రను ప్రద ర్శించుతుందా? నిరంకుశ ప్రభుత్వంపై దెబ్బతీయుటలో శక్తి వంతంగా వుండినా, రాజకీయంగా నిర్వీర్యమయిన పాత్రను ప్రదర్శించుతుందా? అనేదానిపైన విప్లవ ఫలితం ఆధార పడుతుంది." (పై గ్రంథమే 344 వ పేజీ)

శ్రామికవర్గం బూర్జువాకు సహాయక పాత్రను వహించే దురదృష్టదశను తప్పించుకొని బూర్జువా ప్రజాతంత్ర విప్లవానికి నాయకత్వం వహించేందుకు అన్ని విధాలా అవకాశం వుందనీ, లెనిన్ వాదించాడు. ఆ అవకాశం ఈ క్రింది విషయాలవలన లభిస్తుందని లెనిన్ భావించాడు.

మొదటిది: "శ్రామికవర్గం - దాని స్థితి ననుసరించే - చాలా పురోగామివర్గం. నిరంతరాయ విప్లవకరవర్గం. అదే కారణంవల్ల, రష్యాలోని సర్వసాధారణ ప్రజాతంత్ర విప్ల వోద్యమంలో శ్రామికవర్గం నాయకత్వం వహించవలసి యుంటుంది." (పై గ్రంథమే 386 వ పేజీ)

రెండవది: శ్రామిక వర్గానికి తన స్వంత రాజకీయ పార్టీ ఉంటుంది. అది బూర్జువాతో సంబంధంలేక స్వతంత్రంగా

వుంటుంది. శ్రామికవర్గాన్ని అది 'ఒక ఐక్య స్వతంత్ర రాజకీయ శక్తిగా' మూసపోయ గల్గుతుంది.

(పై గ్రంథమే 386 వ పేజీ)

మూడవది: "ఒకవిధంగాచూస్తే బూర్జువా విప్లవం, పెట్టుబడిదారీ వర్గానికన్నా శ్రామిక వర్గానికే ఎక్కువ లాభకరం" అన్నవిషయాన్ని దృష్టిలో పెట్టుకొంటే, విప్లవంలో నిశ్చిత విజయాన్ని అభిలషించేది పెట్టుబడిదారీ వర్గంకన్నా శ్రామికవర్గమే. (పై గ్రంథమే 368 వ పేజీ)

లెనిన్ ఇలా వ్రాశాడు:

"శ్రామిక వర్గానికి వ్యతిరేకంగా గతకాలపు కొన్ని అవశేషాలపైన ఆధారపడటం బూర్జువాకు లాభదాయకం. ఉదాహరణకు రాచరికం, స్థిరసైన్యం (స్టాండింగ్ ఆర్మీ) మొదలైనవి. బూర్జువా విప్లవం గత అవశేషాలను నిశ్చితంగా తుడిచివేయక పోయినట్లయితే ఇంకా కొన్నిటిని అలాగే వదలిపెట్టినట్లయితే, అది పెట్టుబడిదారులకే లాభకరం. అంటే విప్లవం పూర్తిగా సుసంగతమైనది కాకపోతే, సంపూర్ణమైనదీ నిర్ణయాత్మకమైనదీ నిరంతరాయమైనదీ గాకపోతే, అది పెట్టుబడిదారులకే లాభం...బూర్జువా ప్రజాతంత్ర అభిముఖంగా కావలసిన మార్పులుగనుక, చాలానెమ్మదిగా, అతిజాగ్రతగా, అంతగా గట్టిపట్టుదల లేకుండా, సంస్కరణల రూపంలోనే గాని విప్లవమార్గంలోగాకుండా జరిగినట్లయితే, అది పెట్టుబడిదారీ వర్గానికే ఎక్కువలాభకరం...సామాన్యప్రజల - అంటే రైతుల - ముఖ్యంగా కార్మికుల, చొరవనూ స్వతంత్ర విప్లవ కార్యాచరణనూ, శక్తినీ ఈ మార్పులు సాధ్యమైనంత తక్కు-

వగా పెంపొందించితే మంచిది. లేకపోయినట్లయితే ఫ్రెంచి సామెత చెప్పినట్లు. కార్మికులకు "తుపాకిని ఒక భుజంనుండి మరొకభుజానికి మార్చడం" సులభం. అనగా అర్థ బానిసత్వం నిర్మూలింపబడి ఆస్థానంలో ఉద్భవిల్లిన ప్రజాతంత్ర సంస్థలను, విప్లవంతెచ్చిన స్వాతంత్ర్యాన్ని, బూర్జువా విప్లవం తమచేతులలో పెట్టిన పై ఆయుధాలను, పెట్టుబడిదారీ వర్గంపైననే తిరిగి ఉపయోగించడం సులభం. బూర్జువా ప్రజాతంత్రంకోసం అవసరమైన మార్పులు సంస్కరణద్వారా గాక విప్లవంద్వారా జరిగితే కార్మికవర్గానికి మరీ లాభకరం. ఎందువల్లనంటే సంస్కరణమార్గం అంటే ఆలస్యం జేయడం, కాలయాపన జేయడం, జాతీయ వ్యవస్థలోని కుళ్ళిపోయిన భాగాలు బాధాకరంగా నెమ్మదిగా శిథిలమవడం. దీనివల్ల మొట్టమొదట నష్టపడేదీ, ఎక్కువగా నష్టపడేదీ శ్రామికవర్గమూ రైతాంగమున్నూ. విప్లవమార్గం త్వరగా శస్త్రచికిత్స చేయడంవంటిది. ఇది శ్రామికవర్గానికి అతితక్కువ బాధాకరం. కుళ్ళిపోయిన అంగాలను తిన్నగా తొలగించేమార్గంఇది. రాచరికాన్ని, రాచరికంతోపాటు వుండే అసహ్యాకరమైన నైతికపతనం చెందిన, కుళ్ళిన అంటువ్యాధితో కూడిన వ్యవస్థలను గురించి విచారించ నవసరంలేని విధానంఇది. వాటికి అతిస్వల్పమైన సౌకర్యాలను ఇచ్చే విధానం." (పై గ్రంథమే 368-69)

లెనిన్ యింకా ఇలా అన్నాడు:

"అందుచేతనే శ్రామికవర్గం రిపబ్లిక్‌కోసం ముందు వరుసలో నిలబడి పోరాడుతుంది. 'బూర్జువాను భయపెట్ట కూడదు - అందుకోసం జాగ్రత వహించాలి సుమీ' అనే

పనికిమాలిన అవమానకరమైన సలహాను శ్రామికవర్గం తిరస్కార భావంతో త్రోసివేస్తుంది."

(పై గ్రంథమే 405 వ పేజీ)

విప్లవంలో శ్రామికవర్గ నాయకత్వం "సాధ్యం" అనే విషయాన్ని "వాస్తవం"లోకి మార్చాలంటే, శ్రామికవర్గం "యదార్థంగా" నాయకత్వం వహించాలంటే - బూర్జువా విప్లవానికి దారిచూపే శక్తి కావాలంటే, లెనిన్ అభిప్రాయ ప్రకారం కనీసం ఈ క్రింది రెండు విషయాలు అవసరం.

మొదటిది: జార్ ప్రభుత్వంపైన నిశ్చిత విజయం పొందాలనే అభిరుచి గల్గిన సహచరవర్గం ఒకటి శ్రామిక వర్గానికి కావాలి. ఆ సహచరవర్గం శ్రామికవర్గనాయకత్వాన్ని అంగీకరించడానికి సిద్ధపడాలి. నాయకత్వం అనే భావంలోనే ఇది యిమిడివున్నది. నడిపించవలసిన వారెవరూ లేకపోతే నాయకుడు, నాయకుడు కాజాలడు. దారి జూపింపవలసిన వారెవరూ లేకపోతే మార్గదర్శి, మార్గదర్శి కాజాలడు. రైతాంగం అలాంటి సహచరవర్గమని లెనిన్ భావించాడు.

రెండవ విషయం: విప్లవ నాయకత్వం సంపాదించి దానికి ఏకైక నాయకత్వం వహించాలన్నీ, శ్రామికవర్గంతో పోరాడుతున్న ఆ వర్గాన్ని నాయకత్వ రంగంనుండి నెట్టివార వేసి దూరం చేయాలి. ఇదికూడా నాయకత్వం అనే భావం లోనే ఇమిడివుంది. ఎంచేతనంటే విప్లవానికి ఇద్దరు (రెండు వర్గాలు) నాయకత్వం వహించడం సాధ్యం కాజాలదు గనుక. అలాంటివర్గం (నాయకత్వానికై అలా తాపత్రయపడే వర్గం - అను) లిబరల్ బూర్జువా అని లెనిన్ భావించాడు.

లెనిన్ ఇలా అన్నాడు:

"ప్రజాతంత్రంకోసం నిలకడగా పోరాడేది శ్రామిక వర్గం మాత్రమే. విప్లవపోరాటంలో రైతాంగ జనసామాన్యం చేరితేనే అది ప్రజాతంత్రంకోసం విజయవంతమైన పోరాటం సాగించగల్గుతుంది." (పై గ్రంథమే 376 వ పేజీ)

లెనిన్ ఇంకా ఇలా అన్నాడు:

"రైతాంగంలో అనేకమంది అర్థశ్రామికులు, మధ్యతరగతి (పెటీబూర్జువా) వ్యక్తులు ఉంటారు. ఇందుచేత కూడా రైతాంగం నిలకడ అయిందికాదు. అందుచే శ్రామికులు ఒక ఖచ్చితమైన వర్గ పార్టీలో తప్పనిసరిగా ఐక్యంకావాలి. అయితే పెట్టుబడిదారీవర్గం అస్థిరత్వానికీ, రైతాంగం యొక్క అస్థిరత్వానికీ పూర్తిగా భేదముంది. వ్యక్తి ఆస్తియొక్క ప్రధాన రూపాలలో ఒకటి భూస్వాముల ఎస్టేట్లు. వీనిని వశపరచుకోడంలోనే ప్రస్తుతం రైతాంగానికి గాఢమైన ఆసక్తి వుంది. కాని వ్యక్తిగత ఆస్తివిధానాన్ని పూర్తిగా కాపాడుకోవాలనే పట్టుదల వారికి ప్రస్తుతానికి అంతగాలేదు. దీని అర్థం రైతాంగం సోషలిస్టుగా మారిందనిగాని, పెటీ బూర్జువాగా వుండటం మారిందనిగాని కాదు. కాని ప్రజాతంత్ర విప్లవానికి హృదయపూర్వకంగా చాల ప్రధానమైన సన్నిహితవర్గంగా రైతాంగం అంటిపెట్టుకొనగలదు. తనకు వివేచనాశక్తి (Enlightenment) కలిగించుచున్న విప్లవ ఘటనల అభివృద్ధిని, బూర్జువా విద్రోహం, శ్రామికవర్గం ఓటమి త్వరలోనే అంతరాయం కల్గించని పక్షంలోనే పైన చెప్పినట్లు రైతాంగం, తప్పనిసరిగా ప్రజాతంత్ర విప్లవానికి అంటిపెట్టుకొని వుంటుంది. పైనచెప్పిన

పరిస్థితులలో తప్ప, (బూర్జువా విద్రోహంజరిగి కార్మికవర్గం ఓడింపబడే పరిస్థితులలో - అనువాదకుడు) రైతాంగం విప్ల వానికీ, రిపబ్లిక్‌కూ తప్పనిసరిగా కోటగోడ అవుతుంది. ఎందు వల్లనంటే రైతాంగానికి వ్యవసాయ సంస్కరణల రంగంలో సమస్తమూ యివ్వగలిగినది సంపూర్ణ విప్లవ విజయమే. రైతాంగం కోరేటటువంటి, కలలు కనేటటువంటీ, నిజంగా వారికి అవుసరమైనటువంటీ కోర్కెలన్నిటినీతీర్చగల్గేది, సంపూర్ణ విప్లవ విజయమే". (పై గ్రంథమే 405వ పేజీ)

బోల్షివిక్కుల యీ ఎత్తుగడలు "విప్లవం నుండి బూర్జువావర్గాలు పలాయనం చిత్తగించేటట్లు చేస్తుందనీ, విప్లవ విస్తృతి తగ్గించివేస్తుందనీ" మెన్షివిక్కులు అభ్యంతరా లను పెట్టారు. "ఇవి విప్లవానికి ద్రోహం చేసే ఎత్తుగడలు", "బూర్జువావర్గాలకు తుచ్ఛమైన అనుబంధంగా శ్రామికవర్గాన్ని మార్చివేసే ఎత్తుగడలు" అని వీటి స్వభావాన్ని లెనిన్ తెలియ జేశాడు.

లెనిన్ ఇలా వ్రాశాడు.

"విజయవంతమైన రష్యన్ విప్లవంలో రైతాంగపాత్రను నిజంగా అర్థంచేసుకొనేవారు, బూర్జువా వెనుదిరిగిపోవడంవల్ల విప్లవ విస్తృతి తగ్గిపోతుందని కలలోనైనా చెప్పరు. విప్లవం నుండి బూర్జువా వెనుదిరిగిపోయినప్పుడే, రైతాంగ జనసామా న్యం శ్రామికవర్గంతో భుజంభుజంకలిపి కార్యోత్సాహ విప్లవ కారులుగా వచ్చినపుడే, వాస్తవానికి రష్యావిప్లవం నిజమైన విస్తృతిని పొందుతుంది - బూర్జువా ప్రజాతంత్ర విప్లవదశలో సాధ్యమైనంత విశాల విప్లవ విస్తృతి పొందుతుంది. మన ప్రజా

తంత్రవిప్లవాన్ని ఒకే నిశ్చితగా చరమదశవరకూ కొనసాగిం చాలంటే, బూర్జువావర్గంయొక్క అనివార్యమైన వైరుధ్యాలను స్తంభింపచేయ సామర్థ్యంగల శక్తులపైననే, ప్రజాతంత్ర విప్లవం ఆధారపడాలి. అనగా "విప్లవంనుండి బూర్జువాను వెనుదిరిగిపోయేటట్లు చేయ" సామర్థ్యంగల శక్తులపైననే మన ప్రజాతంత్ర విప్లవం ఆధారపడాలి."

(పై గ్రంథమే 406 వ పేజీ)

బూర్జువా విప్లవంలో శ్రామికవర్గ నాయకత్వంగురించి, నాయకత్వ పాత్రగురించి ముఖ్యమైన, ప్రధానమైన ఎత్తుగడ సూత్రం అది. దీనినే "ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమా క్రసీయొక్క రెండు ఎత్తుగడలు" (Two tactics of social democracy in the democratic Revolution) అనే తన గ్రంథములో లెనిన్ విశదీకరించాడు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవంలో ఎత్తుగడల విషయంలో మార్క్సిస్టుపార్టీ అవలంబించిన క్రొత్తపోకడ ఇది. ఈ పోకడ యింతవరకూ వున్న, మార్క్సిస్టు ఆయుధాగారంలోని పోకడలకు, పూర్తిగా భిన్నమైనది. ఇంతకు పూర్వం బూర్జువా విప్లవాలలో పరిస్థితి ఏమంటే ఉదాహరణకు పశ్చిమ యూరప్‌లో బూర్జువాయే నాయకపాత్ర వహించింది. శ్రామికవర్గం, తనకు యిష్టమున్నా లేకపోయినా, బూర్జువాకు సహాయక పాత్ర వహించింది. రైతాంగం బూర్జువాకు అదనపు బలంగా (రిజర్వు) నిలచింది. మార్క్సిస్టులు అలాంటి కలయిక దాదాపు తప్పనిసరియని తలచారు. అయితే అదే సమయంలో శ్రామికవర్గం సాధ్యమైనంతవరకు తక్షణ వర్గకోర్కెలకోసం పోరాడాలనీ, తన స్వంత రాజకీయపక్షం కలిగి వుండాలనీ తెలియచేశారు. ఇప్పుడు

లెనిన్ అభిప్రాయప్రకారం నూతన చారిత్రిక పరిస్థితులలో పరిస్థితి ఏవిధంగా మారుతున్నదంటే, బూర్జువా విప్లవాన్ని నడిపే శక్తిగా శ్రామికవర్గం తయారగుచున్నది. విప్లవ నాయకత్వంనుండి బూర్జువా నెట్టివేయబడుతున్నది; రైతాంగం శ్రామికవర్గ అదనపుబలంగా తయారగుచున్నది.

ప్లెఖనావ్ 'కూడా' శ్రామికవర్గ నాయక పాత్రను 'అంగీకరించాడనటం' పొరపాటుగా అర్థం చేసికోవడమే. శ్రామికవర్గ నాయకపాత్ర అనే భావాన్ని ప్లెఖనోవ్ అంగీకరించినమాట నిజమే. కాని వాస్తవంలో యీ అభిప్రాయ సారాంశానికే అతను వ్యతిరేకి. శ్రామికవర్గ నాయకపాత్ర అంటే అర్థం బూర్జువా విప్లవంలో శ్రామికవర్గం నాయకత్వం వహించుట; దానితోపాటు శ్రామికవర్గ రైతాంగాల సమ్మేళనమూ, లిబరల్ బూర్జువాని దూరంచేయుట అను పాలసీయే. కాని ప్లెఖనావ్ లిబరల్ బూర్జువాని దూరంచేయటాన్ని వ్యతిరేకించాడనీ లిబరల్ బూర్జువాతో ఒడంబడిక చేసుకోవాలనే విధానాన్ని ఆమోదించాడనీ, శ్రామికవర్గ రైతాంగాల సమ్మేళనా విధానాన్ని వ్యతిరేకించాడని మనకు తెలుసు. నిజానికి ప్లెఖనోవ్ ఎత్తుగడ విధానంకూడా శ్రామికవర్గ నాయక పాత్రను తిరస్కరించిన మెన్షివిక్కుల పోకడయే.

(2) జార్ ప్రభుత్వాన్ని కూలద్రోసి ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను స్థాపించడానికి సరైన సాధన విజయవంతమైన సాయుధప్రజల తిరుగుబాటేనని లెనిన్ అభిప్రాయం. "సర్వసాధారణ ప్రజాతంత్ర విప్లవోద్యమం సాయుధ తిరుగుబాటు ఆవశ్యకతను అప్పటికే రుజువుచేసింది". "తిరుగుబాటును శ్రామిక

వర్గాన్ని సంఘటితం చేయటం పార్టీయొక్క ఆవశ్యకమైన, ముఖ్యమైన, త్యజింపరాని కర్తవ్యాలలో ఒకటిగా పరిగణించబడింది." శ్రామికవర్గాన్ని సాయుధం చేయటానికీ, తిరుగుబాటును శ్రామికవర్గం స్వయంగా నడిపే అవకాశాన్ని అనివార్యంగా కలిగించడానికీ అత్యంత శక్తివంతమైన చర్యలను పూనుకోవాలి" అని లెనిన్ మెన్షివిక్కులను వ్యతిరేకంగా వాదించాడు.

తిరుగుబాటును ప్రజాసామాన్యాన్ని నడపాలంటే, ఆ తిరుగుబాటును, యావత్ ప్రజల తిరుగుబాటుగా మార్చాలంటే, ప్రజల విప్లవచొరవను వృద్ధిపరచేటటువంటివీన్నీ, ప్రజలను తిరుగుబాటుకు సంఘటితపర్చేటటువంటివీన్నీ, జార్ ప్రభుత్వ అధికార యంత్రాన్ని విచ్ఛిన్నం చేసేటటువంటివీన్నీ నినాదాలు విజ్ఞప్తులూ ప్రకటించుట అవసరమని లెనిన్ భావించాడు. పార్టీ మూడవకాంగ్రెసులో ఎత్తుగడల విషయమై చేసిన నిర్ణయాలలో యీ నినాదాలున్నవని లెనిన్ భావించాడు. వీటిని సమర్థించడానికే "ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమాక్రసీయొక్క రెండు ఎత్తులు" అనే గ్రంథం పాటు పడింది.

ఈ క్రిందివి ఆ నినాదాలని లెనిన్ భావన :

(క) "ప్రజారాజకీయ సమ్మెలు. ఇవి తిరుగుబాటు ప్రారంభంలోనూ, ముఖ్యంగా తిరుగుబాటు పరిణామంలోనూ చాలా ప్రాముఖ్యతను పొందవచ్చును."(పై గ్రంథమే386వ పేజీ)

(ఖ) "8 గంటల పనినీ, తదితర కార్మికవర్గ తక్షణ కోర్కెలనూ విప్లవమార్గంద్వారా వెంటనే సాధించుట."

(పై గ్రంథమే 358 వ పేజీ)

(గ) "ఎస్టేటు భూములను వశపర్చుకొనుటతో సహా 'ప్రజాతంత్రపు మార్పులన్నిటినీ' విప్లవమార్గంలో కొన సాగించుటకుగాను తక్షణం విప్లవరైతాంగ కమిటీలను సంఘటిత పర్చుట." (పై గ్రంథమే 398 వ పేజీ)

(ఘ) కార్మికులను సాయుధులను చేయుట. ఇక్కడ ముఖ్యంగా గమనింపదగ్గవి రెండు అంశాలున్నాయి.

మొదటిది: పట్టణాలలో దినానికి 8 గంటల పనినీ, గ్రామసీమలో ప్రజాతంత్రపుమార్పులనూ విప్లవమార్గంద్వారా సాధించే ఎత్తుగడలు. అనగా ఇవి ప్రభుత్వాన్నీ, ప్రభుత్వ చట్టాన్నీ లెక్కించక ఉపేక్షించి ప్రస్తుతపు చట్టాలను భగ్నపరచి అధికార ధిక్కార చర్యలద్వారా ఒక క్రొత్తవ్యవస్థను నిర్మించుతాయి. ఈ నూతనవ్యవస్థ పైచర్యలద్వారా అనివార్యఘటన అవుతుంది. ఇది క్రొత్త ఎత్తుగడపద్ధతి. దీని నుపయోగించుటవలన జారు ప్రభుత్వ అధికారయంత్రం స్థంభించింది. ప్రజల నిర్మాణాత్మకపు చొరవకు దోహదమిచ్చింది. ఈ ఎత్తుగడలు పట్టణాలలో విప్లవసమ్మెకమిటీలు, గ్రామసీమలో విప్లవ రైతుకమిటీలు తలఎత్తటానికి దోహద మిచ్చాయి. ఆ తరువాత యీ విప్లవసమ్మెకమిటీలే కార్మికప్రతినిధి సోవియట్లుగానూ (Soviets of Workers' Deputies) విప్లవ రైతు కమిటీలు రైతుప్రతినిధి సోవియట్లుగానూ (Soviets of Peasents' Deputies) మారాయి.

రెండవది – విప్లవకాలంలో ప్రజాసామాన్య విప్లవసమీకరణానికి ప్రజారాజకీయ సమ్మెలు సర్వజనీన రాజకీయ సమ్మెలుకొనసాగించుట చాలా ప్రాధానమైనది. శ్రామికవర్గపు

చేతులలో ఇది చాలా ముఖ్యమైనది. శ్రామికవర్గపు చేతులలో ఇది చాలా ముఖ్యమైన క్రొత్త ఆయుధం. మార్క్సిస్టు పార్టీలు ఇంతవరకూ ఉపయోగించ నటువంటి ఆయుధం. మార్క్సిస్టులచే తరువాత తరువాత గుర్తింపబడిన ఆయుధం.

విజయవంతమైన ప్రజల తిరుగుబాటు తరువాత, జార్ ప్రభుత్వం స్థానే, తాత్కాలిక విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించాలని లెనిన్ అభిప్రాయం. తాత్కాలిక విప్లవ ప్రభుత్వం యొక్క కర్తవ్యమేమిటంటే, విప్లవ విజయాలను సుస్థిరంచేసుకోడం, విప్లవ ప్రతీఘాత ప్రతిఘటనను నాశనం చేయటం, రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరు పార్టీయొక్క కనీస కార్యక్రమాన్ని అమలులో పెట్టటం. ఈ కర్తవ్యాలను నెరవేర్చనిదే జార్ ప్రభుత్వంపైన నిశ్చిత విజయం అసంభవమని లెనిన్ అన్నాడు. ఈ కర్తవ్యాలను నెరవేర్చటానికి జార్ ప్రభుత్వంపై నిశ్చితవిజయాన్ని సాధించటానికి తాత్కాలిక విప్లవ ప్రభుత్వం మామూలు ప్రభుత్వాల్లాంటిది కాగూడదు. విజయమొందిన వర్గాల, అనగా కార్మికకర్షకుల నియంతృత్వమై ఉండాలి. అది శ్రామికవర్గ రైతాంగాల విప్లవ నియంతృత్వమై ఉండాలి.

"విప్లవానంతరం ప్రతి తాత్కాలిక రాజ్యాంగవ్యవస్థకు నియంతృత్వం అవుసరం. అందులోనూ ఆ నియంతృత్వం శక్తివంతమైనది కావాలి" అనే సుప్రసిద్ధమైన మార్క్సుప్రతిపాదనను ఉదహరిస్తూ, తాత్కాలిక విప్లవ ప్రభుత్వం జార్ ప్రభుత్వంపై నిశ్చిత విజయాన్ని పొందాలంటే, అది శ్రామికవర్గ, రైతాంగాల నియంతృత్వ ప్రభుత్వమై యుండాలిగాని మరొకటి కారాదు – అని లెనిన్ నిర్ధారణ చేశాడు.

లెనిన్ యిలా అన్నాడు:

"జారు ప్రభుత్వంపైన విప్లవం నిశ్చితవిజయం పొందటం అంటే, శ్రామికవర్గ, రైతాంగాల విప్లవ ప్రజాతంత్ర నియంతృత్వం అన్నమాట. అలాంటి విజయం ఖచ్చితంగా నియంతృత్వమే ఐ ఉంటుంది. అంటే అది తప్పకుండా సైనికశక్తిపైన ప్రజాసామాన్యాన్ని సాయుధులను చేయుటపైన, తిరుగుబాటుపైన తప్పనిసరిగా ఆధారపడాలి. అంతేగాని "శాంతియుతంగా" "చట్టసమ్మతంగా" ఏర్పరచబడిన ఏవో కొన్ని సంస్థలపై ఆధారపడకూడదు. శ్రామికవర్గానికీ, రైతాంగానికీ తప్పని అత్యావశ్యకమైన మార్పులను సాధించేటప్పుడు, భూస్వాములూ, పెద్ద పెద్ద పెట్టుబడిదారులూ, జార్ ప్రభుత్వమూ తెగించి ప్రతిఘటనను సాగిస్తారు. అలాంటప్పుడు యీ ప్రతిఘటనను నియంతృత్వ మొక్కటే ఎదుర్కొనగలిగి పై మార్పులను సాధించుతుంది. నియంతృత్వం లేకుండా ప్రతిఘటనను నాశనంచేయటం అసాధ్యం. విప్లవ ప్రతిఘాతక ప్రయత్నాలను తరిమికొట్టడం అసాధ్యం. అయితే యీ నియంతృత్వం ప్రజాతంత్ర నియంతృత్వమేగాని సోషలిస్టు నియంతృత్వం గాదు. ఇది పెట్టుబడిదారీ విధానపు పునాదులను (విప్లవాభివృద్ధిలో అనేక మధ్యదశలను దాటనిదే) కదల్చలేదు. మహా అయితే రైతాంగానికి జమీందారీభూములను పూర్తిగా పంచవచ్చును; సంపూర్ణమైన, స్థిరమైన (Consistant) ప్రజాతంత్రాన్ని, రిపబ్లిక్‌ను స్థాపించుటతోసహా ఏర్పాటు చేయవచ్చును. పల్లెలలోనేగాక ఫ్యాక్టరీ జీవితంలోకూడా ఆసియా ఖండంలోల్లాంటి బానిస సంకెళ్ళను, నిర్బంధ స్వరూపాలను నిర్మూలించవచ్చు.

కార్మికుల స్థితిగతులలో సంపూర్ణాభివృద్ధికి, వారి జీవిత ప్రమాణాన్ని హెచ్చించుటకు పునాదిని వేయవచ్చును. అఖరునైనా అప్రాముఖ్యం కానటువంటి మరొక విషయం ఏమిటంటే ఇవి విప్లవాగ్నిని యూరపును వ్యాపింప జేయవచ్చును. అలాంటి విజయం బూర్జువా విప్లవాన్ని పోషలిస్టు విప్లవంగా ఏ విధంగానూ మార్చలేదు. ప్రజాతంత్ర విప్లవం బూర్జువా సామాజిక ఆర్థిక సంబంధాల సరిహద్దులను సూటిగా దాటలేదు. ఇంతేగాక రష్యా భవిష్యదభివృద్ధికి అలాంటి విజయంయొక్క ప్రాముఖ్యత అపారమైనది. ఇప్పుడు రష్యాలో ప్రారంభమైన విప్లవంయొక్క నిశ్చిత విజయంలాగా, మరొకటేదీ, ప్రపంచ శ్రామికవర్గంయొక్క విప్లవశక్తిని పెంపొందించలేదు — శ్రామికవర్గ సంపూర్ణ విజయమార్గాన్ని అంతగా సుగమం చేసేది మరొకటిలేదు." (పై గ్రంథమే 373 వ పేజీ)

తాత్కాలిక విప్లవ ప్రభుత్వంపట్ల సోషల్ డెమాక్రట్ల యొక్క వైఖరినిగురించి, ఆ ప్రభుత్వంలో వారు పాల్గొనవచ్చునా, లేదా అనే విషయాన్నిగురించి పార్టీ మూడవ కాంగ్రెసుచేసిన తీర్మానాన్ని లెనిన్ పూర్తిగా సమర్థించాడు. ఆతీర్మానం ఇది:

"వివిధశక్తుల పరస్పర సంబంధాలనూ, ఇంకా యితర విషయాలనూ ముందుగానే ఇప్పుడే సరిగా నిర్ణయించలేమనే విషయాన్ని గుర్తుపెట్టుకొని, మనపార్టీ ప్రతినిధులు తాత్కాలిక విప్లవప్రభుత్వంలో పాల్గొనవచ్చును. ఈ పాల్గొనటం దేనికి? విప్లవ ప్రతీఘాత ప్రయత్నాలకు వ్యతిరేకంగా ఎడతెగని పోరాటాన్ని సాగించేందుకూ, కార్మికవర్గ ప్రత్యేక ప్రయోజనాలను

రక్షించేందుకూ మనం పాల్గొనాలి. అలా పాల్గొనేందుకు తప్పని సరియైన షరతుఏమంటే - ప్రతినిధులను పార్టీ ఖచ్చితమైన కంట్రోల్లో పెట్టుకోవాలి. సంపూర్ణమైన సోషలిస్టు విప్లవం కోసం ప్రయత్నించుచున్న - తత్ఫలితంగా బూర్జువా పార్టీ లన్నిటికీ రాజీలేని వ్యతిరేకత కలిగిన - మన సోషల్ డెమా క్రటిక్ పార్టీ స్వతంత్రాన్ని ఖచ్చితంగా నిలబెట్టుకోవాలి. తాత్కా లిక విప్లవ ప్రభుత్వంలో సోషల్ డెమాక్రట్లు పాల్గొనడం సాధ్యంకావచ్చూ, కాకపోవచ్చు. అయినా మనం విప్లవ విజ యాలను వృద్ధిపరచటానికీ, సుస్థిరం చేసుకోటానికీ, రక్షించు కోటానికీగాను. సోషల్ డెమాక్రటిక్ పార్టీచే నడుపబడిన సాయుధ శ్రామికవర్గం ఎల్లప్పుడూ తాత్కాలిక ప్రభుత్వం పైన వత్తిడితీసుకురావాలి. ఈ వత్తిడి తీసుకురావలసిన ఆవశ్య కతను గురించి శ్రామికవర్గ జనబాహుళ్యంలో మనం ప్రచారం చేయాలి." (పై గ్రంథమే 348-49 పేజీ)

తాత్కాలిక ప్రభుత్వం యింకా బూర్జువా ప్రభుత్వమే ననీ, ఫ్రెంచి బూర్జువా ప్రభుత్వంలో చేరిన ఫ్రెంచి సోషలిస్టు మిలెరాండ్ (Millerand) వలెనే మళ్ళీ తప్పులు చేయదలచు కుంటే తప్ప, అలాంటి ప్రభుత్వంలో సోషల్ డెమాక్రట్లను పాల్గొన నీయరాదని మెన్షివిక్కులు అభ్యంతర పెట్టారు. ఈ అభ్యంతరాన్ని త్రోసిపుచ్చుతూ లెనిన్ ఒక విషయాన్ని తెలియ జేశాడు. మెన్షివిక్కులు ఇక్కడ రెండు విభిన్న విషయాలను కలగాపులగం చేస్తున్నారు. మార్క్సిస్టులుగా యీ సమస్యను పరిష్కరించుటలో తమ అసమర్థతను చాటుకుంటున్నారు. ఫ్రాన్సులో విప్లవపరిస్థితి లేనిరోజుల్లో అభివృద్ధి నిరోధకమైన

బూర్జువా ప్రభుత్వంలో సోషలిస్టులు పాల్గొనవచ్చునా, లేదా అన్నది అప్పటిసమస్య. అట్టి పరిస్థితుల్లో అలాంటి ప్రభుత్వంలో సోషలిస్టులు చేరకుండటం వారివిధి. కాని రష్యాలో పరిస్థితి వేరు. ఇక్కడ విప్లవం మంచి ఉన్నతస్థాయిలోవుంది. అలాంటప్పుడు విప్లవవిజయం కోసం పోరాడే విప్లవ బూర్జువాప్రభుత్వంలో సోషలిస్టులు పాల్గొనటమూ, లేదా అనేది ఇచ్చటి సమస్య. ఈ పరిస్థితుల్లో సోషల్ డెమాక్రట్లు ప్రభుత్వంలో "పాల్గొనవచ్చును." అనుకూల పరిస్థితుల్లో విప్లవ ప్రతీఘాతాన్ని దెబ్బగొట్టుటకుగాను ప్రభుత్వంలో "పాల్గొని తీరాలి." ఎందుకంటే "క్రిందినుంచి" దెబ్బగొట్టటమే కాకుండా ప్రభుత్వంలో పాల్గొని "పైనుంచి" దెబ్బగొట్టడంకూడా సోషల్ డెమాక్రట్ల విధి.

(3) బూర్జువా విప్లవవిజయాన్ని, ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను సాధించుటను గురించి ప్రచారం చేస్తున్న లెనిన్ అంతటితో ఆగమనలేదు. విప్లవం ప్రజాతంత్ర దశలోనే ఆగిపోయి, బూర్జువా ప్రజాతంత్ర కర్తవ్యాలను సాధించుటవరకే విప్లవోద్యమం యొక్క అవకాశాన్ని పరిమితంచేయాలనే ఉద్దేశం లెనిన్‌కు ఎన్నడూ లేనేలేదు. పైగా ప్రజాతంత్ర కర్తవ్యాలను పూర్తిచేసిన వెంటనే యీసారి, శ్రామికవర్గమూ, తదితర పీడిత జనసామాన్యమూ సోషలిస్టు విప్లవంకోసం పోరాటాన్ని ప్రారంభించాలని లెనిన్ వాదించాడు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్ని సోషలిస్టు విప్లవంలోకి నడిపించుట సోషల్ డెమాక్రట్ల విధి అని లెనిన్‌కు తెలుసు – అలా భావించాడు. జార్ ప్రభుత్వంపై విజయాన్ని పూర్తిచేయుట అనే అంశంతోనే

విప్లవాన్ని "ఆపడానికి" కాదు. శ్రామికవర్గ, రైతాంగాల నియంతృత్వాన్ని లెనిన్ కోరేది. పైగా సాధ్యమైనంతవరకూ విప్లవ స్థితిని కొనసాగించడానికే విప్లవ ప్రతిఘాత అవశేషాలను తుదముట్టించడానికే, యూరప్‌లో విప్లవాగ్నిని వ్యాపింపజేయడానికే, శ్రామికవర్గ, రైతాంగ నియంతృత్వంకావాలని లెనిన్ భావించాడు. ఇంతేగాక యీలోగా శ్రామికవర్గం రాజకీయంగా తన్నుతాను విజ్ఞానవంతం చేసికోడానికీ, గొప్ప సైన్యంగా తాను సంఘటితమవడానికీ, సోషలిస్టు విప్లవంలోనికి తిన్నగా పరివర్తనం ప్రారంభించడానికీ, పైన చెప్పిన నియంతృత్వం అవకాశమిస్తుందని లెనిన్ భావించాడు.

బూర్జువా విప్లవం యొక్క గమ్యాన్నిగురించి చర్చిస్తూ మార్క్సిస్టు పార్టీ ఆ విప్లవానికి ఎట్టి స్వరూపం కల్పించాలో వివరించుతూ లెనిన్ యిలా వ్రాశాడు:

"శ్రామికవర్గం ప్రజాతంత్ర విప్లవాన్ని పూర్తిచేయాలంటే, రైతాంగజన సామాన్యంతో సమ్మేళనమై, నిరంకుశత్వం యొక్క ప్రతిఘటనను బలప్రయోగం ద్వారా అణచివేయాలి. బూర్జువా యొక్క ఊగిసలాటను స్తంభింప చేయాలి. సోషలిస్టు విప్లవాన్ని నెరవేర్చేందుకుగాను, అర్ధశ్రామిక ప్రజాబాహుళ్య వ్యక్తులతో సమ్మేళనమై, బూర్జువా యొక్క ప్రతిఘటనను బలప్రయోగం ద్వారా అణచాలి. రైతాంగం యొక్క, పెట్టీ బూర్జువా (మధ్యతరగతి) యొక్క ఊగిసలాటను స్తంభింప జేయాలి. ఇవీ శ్రామికవర్గ కర్తవ్యాలు - వీటిని కొత్త "ఇస్క్రాయిస్టులు" (మెన్షివిక్కులు) విప్లవగమ్యాన్ని గురించి

చర్చించిన తమ తీర్మానాలలోనూ, వాదనలలోనూ చాల సంకుచిత పరచారు". (పై గ్రంథమే 406వ పేజీ)

ఇంకా—

"సంపూర్ణ స్వాతంత్ర్యంకొరకు సుస్థిర ప్రజాతంత్ర విప్లవంకోసం, రిపబ్లిక్‌కోసం చేసే పోరాటంలో యావత్ ప్రజలకు-ముఖ్యంగా రైతాంగానికి-శ్రామికవర్గం అగ్రగామిగా ఉండాలి. సోషలిజం సాధించేందుకు కష్టజీవులు, పీడితులందరికీ శ్రామికవర్గం అగ్రగామిగా వుండాలి. ఆచరణలో విప్లవ శ్రామికవర్గంయొక్క విధానం అలా ఉండాలి. విప్లవ కాలంలో కార్మికపార్టీయొక్క ప్రతి ఎత్తుగడ సమస్యలోనూ, ఆచరణలో వేయవలసిన ప్రతి అడుగులోను అంతర్వ్యాప్తమై నిర్ణయించ వలసిన వర్గ నినాదం అదే". (పై గ్రంథమే 415 వ పేజీ)

అస్పష్టంగా దేనినీ వదలివేయకుండేందుకుగాను "రెండు ఎత్తుగడలు" (Two tactics) అనే గ్రంథాన్ని ప్రచురించిన రెండునెలలకు లెనిన్ మరొక వ్యాసాన్ని ప్రకటించాడు. "రైతు ఉద్యమంపట్ల సోషల్ డెమాక్రట్ల వైఖరి" అని ఆ వ్యాసం పేరు. అందులో లెనిన్ యిలా విశదీకరించాడు:

"మనకుగల బలము ననుసరించీ, వర్గచైతన్యం కలిగి సంఘటితమైన శ్రామికవర్గ బలాన్ననుసరించీ, ప్రజాతంత్ర విప్లవంనుండి సోషలిస్టు విప్లవానికి పురోగమించుతాం. నిరంతరాయమైన విప్లవం కొనసాగాలని మనం చూస్తాం. మధ్యలో ఆగిపోము." (పై గ్రంథమే 442 వ పేజీ)

బూర్జువా సోషలిస్టు విప్లవాల పరస్పర సంబంధం గురించి ఇది ఒక క్రొత్త విధానం. బూర్జువా విప్లవ అంత్య

కాలంలో సోషలిస్టు విప్లవానికి తిన్నగా పరివర్తన చెందడానికై శ్రామికవర్గం తనచుట్టూ వివిధ శక్తులను తిరిగి సమకూర్చు కొనే ఒక క్రొత్త సిద్ధాంతం ఇది. బూర్జువా ప్రజాతంత్ర విప్లవం సోషలిస్టు విప్లవంలోకి మారిపోయే సిద్ధాంతం ఇది.

ఈ క్రొత్త పోకడను నిర్ణయించుటలో లెనిన్ యీ క్రిందివాటిపై ఆధారపడ్డాడు. మొదటిది: 1840-50 సంవత్సర ముల మధ్య కమ్యూనిస్టులీగును సంబోధిస్తూ "నిరంతరాయ విప్లవం" అనే సుప్రసిద్ధమైన మార్క్సు ప్రతిపాదన. రెండవది: 1856 లో మార్క్సు, ఎంగెల్సుకు వ్రాసిన లేఖలో శ్రామిక వర్గ విప్లవంతో రైతాంగ విప్లవోద్యమాన్ని మిళితం చేయ వలసిన ఆవశ్యకతను తెలియజేశాడు. ఆ జాబులో సువిదితమైన యీ క్రింది విషయాన్ని తెలియజేశాడు.

"జర్మనీలో శ్రామికవర్గ విప్లవం విజయం పొందాలంటే రైతులయుద్ధం మరోసారి పునరావృత్తి చెందాలి." (1525 లో రైతులయుద్ధం ఒకటి జర్మనీలో జరిగింది. అలాంటిదే మరొకటి జరగాలని మార్క్సు భావం - అనువాదకుడు.) కాని మార్క్సు యొక్క యీ ప్రతిభావంతమైన అభిప్రాయాలను తరువాత మార్క్సు, ఎంగెల్సులు తమ రచనలలో అభివృద్ధిచేయలేదు. రెండవ ఇంటర్నేషనల్ (Second International) సిద్ధాంత కర్తలు వీటిని మర్చిపోవడానికీ, పూడ్చిపెట్టడానికీ తాము చేయవలసినదంతా చేశారు. మరచిపోయిన యీ మార్క్సు భావాలను వెలుగులోనికి తీసుకొనివచ్చే భారం, వాటి ప్రాధా న్యతను పునరుద్ధరించే భారం లెనిన్‌పై బడింది. కాని యీ మార్క్సు భావాలను పునరుద్ధరించుటలో లెనిన్ వాటిని

వూరికే వల్లెవేయుటతోనే సరిపుచ్చుకోలేకపోయాడు - సరిపుచ్చుకోనూలేదు. ఇంకా అభివృద్ధిపర్చాడు. సర్వసంపన్నమైన సోషలిస్టు విప్లవ సిద్ధాంతానికి మూసపోశాడు. శ్రామికవర్గ విప్లవం విజయం పొందాలంటే ప్రధానమైన షరతు శ్రామిక వర్గమూ, అర్ధశ్రామిక వ్యక్తులూ సమ్మేళం కావాలనే ఒక కొత్త విషయాన్ని, సోషలిస్టు విప్లవానికి అత్యావశ్యకమైన ఒక కొత్త విషయాన్ని ప్రవేశపెట్టుటద్వారా లెనిన్ యీ సిద్ధాంతాన్ని మూసపోశాడు.

ఈ పోకడ పశ్చిమ యూరప్ సోషల్ డెమాక్రటిక్ పార్టీల ఎత్తుగడలను నాశనం చేసింది. ఆ పార్టీలు బూర్జువా విప్లవంతరువాత రైతు జనసామాన్యం - బీదరైతులతోసహా - విప్లవాన్ని తప్పనిసరిగా వదలిపోతారని భావించాయి. తత్ఫలితంగా బూర్జువా విప్లవంతరువాత దీర్ఘమైన విరామం - మరీ దీర్ఘం కాకపోయినా - 50 లేక 100 సంవత్సరాల దీర్ఘ సుషుప్తావస్థ వస్తుందని ఆ పార్టీలు భావించాయి. నూతన విప్లవమైన సోషలిస్టు విప్లవం వచ్చేలోగా, శ్రామికవర్గం "శాంతియుతంగా" తన సంపదను పెంపొందించుకుంటుందని వాటి వాదన. ఈ వాదనలన్నిటినీ లెనిన్ కొత్తసిద్ధాంతం ఛిన్నాభిన్నం చేసింది.

లెనిన్ యొక్క యీ కొత్త సిద్ధాంతాన్ని (Theory) అనుసరించి, యావత్తు బూర్జువాకు వ్యతిరేకంగా శ్రామిక వర్గం ఒక్కటే ఒంటరిగా సోషలిస్టు విప్లవాన్ని కొనసాగించలేదు. "కష్టజీవులూ, పీడితులూ అయిన లక్షలాది ప్రజలను" ప్రజాసామాన్యంలోని అర్ధ శ్రామిక వ్యక్తులను మిత్రులుగా

కలిగి, వారిని నడిపేవర్గమైన శ్రామికవర్గమే సోషలిస్టు విప్లవాన్ని కొనసాగించగలదు.

ఈ సిద్ధాంతం ప్రకారం, బూర్జువా విప్లవంలో రైతాంగంతో సమ్మేళనమై నాయకత్వం వహించిన కార్మికవర్గం, సోషలిస్టు విప్లవంలో ఇతర పీడితులైన కష్టజీవులతో సమ్మేళనమై నాయకత్వం వహించుతుంది. కార్మిక రైతాంగ ప్రజాతంత్ర నియంతృత్వం, కార్మికవర్గంయొక్క సోషలిస్టు నియంతృత్వానికి మార్గం సుకరంచేస్తుంది.

పశ్చిమ యూరోపియన్ డెమాక్రట్లలలో వ్యాపించియున్నసిద్ధాంతాన్ని ఇదితిరస్కరించింది. వీరుపల్లెలలోనూ, పట్టణాలలోనూ అర్ధశ్రామిక జనసామాన్యంయొక్క విప్లవపటుత్వ గుణాలను త్రోసిపుచ్చారు. "బూర్జువావర్గమూ, శ్రామిక వర్గమూ గాక మనదేశంలో ప్రభుత్వ ప్రతిపక్ష సమ్మేళనంలో గానీ, విప్లవపక్ష సమ్మేళనంలోగానీ చేరి సహాయం చేయగల సామాజిక శక్తులేవీ మాకు కన్పించుటలేదు" అని వీరి అభిప్రాయం. (ప్లెఖనావ్ అన్నమాటలివి. పశ్చిమ యూరోపియన్ సోషల్ డెమాక్రట్ల భావాలకిది చక్కని నమూనా.)

సోషలిస్టు విప్లవంలో యావత్తు బూర్జువాకు వ్యతిరేకంగా, శ్రామికేతర వర్గాలకూ, భాగాలకూ అన్నిటికీ వ్యతిరేకంగా ఒంటరిగా, మిత్రులులేకుండా శ్రామికవర్గం నిలబడుతుందని పశ్చిమ యూరోపియన్ సోషల్ డెమాక్రట్ల భావన. పెట్టుబడి శ్రామికులనేగాక పట్టణాలలోనూ, పల్లెలలోనూ వున్న లక్షలాది అర్ధశ్రామికులనుకూడా దోపిడీ చేస్తున్నదన్న విషయాన్ని వారు లెక్కించరు. పెట్టుబడిచే అణచివేయబడ్డ

లకులాది అర్ధశ్రామికులు, పెట్టుబడిదారీ నిరంకుశత్వంనుండి సమాజవిముక్తికై సాగించే సమరంలో, శ్రామికవర్గానికి మిత్రులు కాగలరనే విషయాన్ని వారు గమనించరు. అందుచే పశ్చిమ యూరోపియన్ సోషల్ డెమాక్రట్లు, యూరపులో సోషలిస్టు విప్లవానికి పరిస్థితులింకా పరిపక్వం కాలేదని భావించారు. సమాజంయొక్క ఆర్థికాభివృద్ధి మరింత పెంపొందిన ఫలితంగా దేశంలోను సమాజంలోను శ్రామికులు అధిక సంఖ్యాకులుగా అయినప్పుడే సోషలిస్టు విప్లవానికి పరిస్థితులు పరిపక్వమైనట్లు వారి అభిప్రాయం. పశ్చిమ యూరోపియన్ సోషల్ - డెమాక్రట్లు యీ శ్రామికవర్గ వ్యతిరేక దగాకోరు వాదనను, లెనిన్ యొక్క సోషలిస్టు విప్లవసిద్ధాంతం పూర్తిగా తలక్రిందులు చేసింది. ఒంటరిగా ఒకదేశంలో సోషలిజం విజయం పొందుట సాధ్యం అనే విషయమై లెనిన్ తన సిద్ధాంతంలో ప్రత్యక్షంగా యింకా ఏ నిర్ధారణా చేయలేదు. కాని ఇప్పుడు గాకపోతే, మరొకప్పుడు త్వరలోనే అలాంటి నిర్ధారణకు వచ్చుటకవుసరమైన ప్రధానాంశాలు దాదాపు అన్నిటినీ - యీ సిద్ధాంతం కలిగివుంది.

లెనిన్ తరువాత 10 సంవత్సరాలకు, అంటే 1915 లో ఇట్టి నిర్ణయానికి వచ్చాడని మనకు తెలుసు.

"ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ - డెమాక్రసీయొక్క రెండు ఎత్తుగడలు" అనే యీ చారిత్రిక గ్రంథంలోని ప్రధానమైన ఎత్తుగడ సూత్రాలివి.

ఈ గ్రంథంద్వారా మెన్షివిక్కుల పెటీ బూర్జువా ఎత్తుగడల పోకడను సిద్ధాంతరీత్యా (ఐడియలాజికల్ గా) నాశనం

చేశాడు. జార్ ప్రభుత్వంపై క్రొత్తదాడికీ, బూర్జువా ప్రజాతంత్ర విప్లవం యింకా పెంపొందడానికీ రష్యన్ కార్మికవర్గాన్ని యీ సిద్ధాంతంతో సాయుధులను చేశాడు. బూర్జువావిప్లవం సోషలిస్టు విప్లవంలోనికి మారవలసిన ఆవశ్యకతను గురించి స్పష్టమైన దృక్పథం (Perspective) రష్యన్ - సోషల్ డెమాక్రట్ల ముందు లెనిన్ ఉంచాడు. ఇదే అన్నిటికన్నా, ఈ గ్రంథం యొక్క చారిత్రిక ప్రాముఖ్యత.

కాని లెనిన్ గ్రంథం యొక్క ప్రాముఖ్యత ఇంతటితోనే తీరిపోదు. అది విప్లవాన్ని గురించి నూతన సిద్ధాంతంతో మార్క్సిజాన్ని పెంపొందించింది. బోల్షివిక్ పార్టీ విప్లవకరమైన ఎత్తుగడలకు పునాదిని వేసింది. ఈ సిద్ధాంత సహాయంతోనే 1917లో మనదేశ శ్రామికవర్గం పెట్టుబడిదారీ విధానంపై విజయాన్ని సాధించింది. ఇదే గ్రంథంలోని అమూల్యమైన ప్రాముఖ్యత.

## 4

విప్లవం మరింత పెంపొందుట - 1905 అక్టోబరులో అఖిల రష్యన్ రాజకీయసమ్మె - జార్ ప్రభుత్వ తిరోగమనం - జార్ ప్రణాళిక - "కార్మిక ప్రతినిధుల సోవియట్లు" తలయెత్తుట.

**1905** ఆకురాలు కాలానికి (Autumn) విప్లవోద్యమం దేశమంతటా ప్రాకి అద్భుతమైన ఉద్వేగాన్ని పొందింది.

సెప్టెంబరు 19వ తేదీన మాస్కోలో అచ్చుపనివారల సమ్మె ప్రారంభమైంది. అది సెంట్‌పీటర్స్‌బర్గ్, ఇంకా అనేక ఇతర పట్టణాలకూ వ్యాపించింది. మాస్కోలోని అచ్చు పనివారల సమ్మెను ఇతర పరిశ్రమలలోని కార్మికులుగూడా బలపరచారు. అది సర్వవ్యాపిత రాజకీయ సమ్మెగామారింది.

అక్టోబరు నెల ప్రారంభంలో మాస్కో - కజాన్ రైల్వేలో ఒక సమ్మె ప్రారంభమైంది. రెండు రోజులలో మాస్కో రైల్వే జంక్షన్‌లోని కార్మికులందరూ సమ్మెలో చేరారు. త్వరలోనే దేశంలోని రైల్వేలన్నీ సమ్మె సంరంభం లోకి ఈడ్వబడి పోస్టల్, టెలిగ్రాఫ్ సర్వీసులు నిలచిపోయాయి. రష్యాలో వివిధ పట్టణాలలో కార్మికులు పెద్ద పెద్ద సభలు పెట్టి సమ్మెచేయడానికి నిశ్చయించుకున్నారు. ఒక ఫ్యాక్టరీ తరువాత మరొక ఫ్యాక్టరీకీ, ఒక మిల్లు తరువాత మరొక మిల్లుకు, ఒక పట్టణంనుండి మరొక పట్టణానికి, ఒక ప్రాంతం నుంచి మరొక ప్రాంతానికి సమ్మె వ్యాపించింది. చిన్న చిన్న ఉద్యోగులూ, విద్యార్థులూ - ప్లీడర్లూ, ఇంజనీర్లూ, డాక్టర్లూ మొదలగు మేధావులంతా కార్మికుల సమ్మెలో చేరారు. అక్టోబరు రాజకీయ సమ్మె యావత్ రష్యా వ్యాపిత సమ్మెగా మారింది. అది దేశమంతా చాలా మారుమూలలనున్న జిల్లాలకు సహితం వ్యాపించింది. వెనుకబడ్డ కార్మికులతోసహా అది కార్మికులందరి లోనూ వ్యాపించింది. అనేకమంది రైల్వేకార్మికులూ, పోస్టల్, టెలిగ్రాఫ్ పనివారలూ, తదితర కార్మికులూ గాక, ఒక్క పారిశ్రామిక కార్మికులే దాదాపు 10 లక్షలమంది సర్వవ్యాపిత రాజకీయసమ్మెలో పాల్గొన్నారు. దేశజీవితమంతా స్థంభించి పోయింది. ప్రభుత్వం స్థంభించిపోయింది.

నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రజాసామాన్యం సాగించిన పోరాటానికి, కార్మికవర్గం నాయకత్వం వహించింది.

ప్రజా రాజకీయసమ్మె సాగించాలని యిచ్చిన బోల్షివిక్కుల నినాదం ఫలప్రదమైంది.

అక్టోబరునాటి సర్వవ్యాపితసమ్మె శ్రామికవర్గ ఉద్యమ బలాన్ని, శక్తినీ బహిర్గతం చేసింది. భయంతో చస్తున్న జారు ప్రభువు 1905 అక్టోబరు 17 వ తేదీన ఒక ప్రణాళికను ప్రకటించాడు. ఈ ప్రణాళిక "పౌరసత్వ హక్కుల అచంచలమైన పునాదులను, అనగా వ్యక్తి స్వాతంత్ర్యం, ప్రార్థనా స్వాతంత్ర్యం, వాక్ సభా సమావేశ స్వాతంత్ర్యాలను" వాగ్దానం చేసింది. మరొక డ్యూమాను (శాసనసభ) సమావేశపర్చడానికీ, ప్రజలలో అన్నితరగతులవారి వోటింగు హక్కును విస్తరింపజేయటానికీ కూడ అది వాగ్దానం చేసింది.

అంతూ పొంతూలేని చర్చలు సాగించే బులిజిన్ శాసనసభ (డ్యూమా) విప్లవ వెల్లువతో కొట్టుకుపోయింది. బులిజిన్ డ్యూమాను (శాసనసభ) బహిష్కరించాలనే బోల్షివిక్కుల ఎత్తుగడలు సరియైనవని నిరూపించబడినాయి.

అయితే అక్టోబరు 17 వ ప్రణాళిక ప్రజలను దగా చెయ్యడానికి ప్రకటించబడినది. ఏదో రకంగా కొంత వ్యవధిని సంపాదించి యీ వ్యవధిలో అమాయకులను జోకొట్టడానికీ, తన శక్తులను సమీకరించి తరువాత విప్లవంపై దెబ్బకొట్టడానికీ, జార్ ప్రభుత్వం చేసిన దగా ఇది. మాటలలో జారు ప్రభుత్వం స్వాతంత్ర్యాన్ని వాగ్దానం చేసింది. కాని క్రియలో యిచ్చింది శూన్యం. కార్మికులూ, రైతులూ ప్రభుత్వం నుండి

పొందిందల్లా ఉత్తవాగ్దానాలు మాత్రమే. అక్టోబరు 21 న రాజకీయ ఖైదీల నందరినీ విడుదల చేస్తారని ఆశించారు. కాని తద్వ్యతిరేకంగా, రాజకీయ ఖైదీలలో కొద్దిభాగాన్ని మాత్రమే విడుదల చేసింది ప్రభుత్వం. ఇదే కాలంలో ప్రజాశక్తులను చీల్చివేసే ఉద్దేశంతో యూదులను వేటాడి చంపే రక్తపిపాస కలహాలను సృష్టించింది. ఈ కలహాలలో వేలకొలది ప్రజలు మరణించారు. విప్లవాన్ని నాశనం చేయటానికిగాను, పోలీసుల అధీనంలో వుండే కొడీ సంఘాలను నెలకొల్పింది. వీటికి "రష్యన్ ప్రజాసంఘం" (League of the Russian people) అనీ, "లీగ్ ఆఫ్ మైకేల్ ది ఆర్చేంగిల్" అనీ పేరు పెట్టారు. ఈ సంఘాలలో అభివృద్ధి నిరోధకులైన భూస్వాములూ, వర్తకులూ, మతగురువులూ, గాలికి తిరిగే దేశద్రిమ్మరులులాంటి నేరస్థులూ ప్రముఖమైన పాత్రను వహించారు. వీరినే ప్రజలు "బ్లాక్ హండ్రెడ్స్" అని పిల్చేవారు. వీరు పోలీసుల సహాయంతో రాజకీయంగా అభివృద్ధి చెందిన కార్మికులనూ, విప్లవ మేధావులనూ, విద్యార్థులనూ హింసించారు - హత్య గావించారు. మిాటింగు ప్రదేశాలను తగులబెట్టారు. పౌర సమావేశాలపై తుపాకులు పేల్చారు. జారు ప్రణాళికవల్ల కలిగిన ఫలితాలు ఇంతవరకు ఇవి మాత్రమే.

ఆ రోజుల్లో ప్రజలలో యీ క్రింది పాట బాగా వ్యాపించింది.

" జారు తారుకున్నాడు
ప్రకటించాడొక ప్రణాళిక
చచ్చినవారికి స్వాతంత్ర్యం
బ్రతికినవారికి బందిఖానా "

అక్టోబరు 17 ప్రణాళిక ఒక ఉచ్చు అని బోల్షివిక్కులు ప్రజలకు తెలియజేశారు. ప్రణాళిక ప్రకటించిన తరువాత ప్రభుత్వ చర్యలు, రెచ్చగొట్టడానికి చేసినవని బోల్షివిక్కులు తెలియజేశారు. కార్మికులను సాయుధులు కమ్మనీ, సాయుధ తిరుగుబాటుకు సిద్ధంగమ్మనీ బోల్షివిక్కులు పిలుపునిచ్చారు (హెచ్చరించారు).

ఎన్నడూ లేనంత ఉత్సాహంతో కార్మికులు పోరాట దళాలను ఏర్పరచ సాగారు. సర్వవ్యాపిత సమ్మె ద్వారా సాధించిన మొదటి విజయంతోనే సంతృప్తిపడక మరింత కృషి చేయాలనీ, జార్ ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి పోరాటాన్ని కొనసాగించవలసి వుంటుందనీ వారికి స్పష్టమైంది.

అక్టోబరు 17 నాటి ప్రణాళిక ప్రజాశక్తులా, ప్రభుత్వ శక్తులా తాత్కాలిక సమానబలాన్ని (Equilibrium) తెలియజేస్తుందని లెనిన్ భావించాడు. అనగా శ్రామికవర్గమూ, రైతాంగమూ ప్రణాళికను ప్రకటించేటట్లు జార్‌ను లొంగదీయ గలిగాయి. కాని జారుప్రభుత్వాన్ని కూలద్రోయటానికి తగినంతబలంగా అవి యింకా లేవు. జారుప్రభుత్వానికి పాత పద్ధతులద్వారా పరిపాలించే సామర్థ్యం ఇక ఏమాత్రమూ లేదు. అందుచే "పౌరసత్వ హక్కులూ, లెజిస్లేటివ్ డ్యూమా" (శాసనసభ) అనునవి నామకః కాగితంపైన వాగ్దానం చేయవలసి వచ్చింది.

అక్టోబరు రాజకీయసమ్మె పెనుతుపాను దినాలలో, జారుప్రభుత్వ వ్యతిరేక పోరాటాగ్నిలో, కార్మికవర్గ ప్రజల

విప్లవ నిర్మాణాత్మకపు చొరవ, శక్తివంతమైన ఒక నూతన ఆయుధాన్ని నిర్మించింది. ఆ ఆయుధం కార్మిక ప్రతినిధుల సోవియట్లు.

కార్మిక ప్రతినిధుల సోవియట్లు అంటే అన్ని ఫ్యాక్టరీలా మిల్లులనుండి వచ్చిన ప్రతినిధుల సమావేశాలే. ఇవి యిది వరకు ప్రపంచం ఎన్నడూ ఎరుగని క్రొత్తరకపు కార్మికవర్గ ప్రజా రాజకీయ సంఘటనను తెలియపర్చుతున్నాయి. బోల్షివిక్ పార్టీ నాయకత్వాన శ్రామికవర్గం 1917 లో స్థాపించిన సోవియట్ అధికారానికి మూలం, 1905 లో మొట్టమొదటి సారిగా తలయెత్తిన ఈ సోవియట్లే. ప్రజల నిర్మాణాత్మకపు చొరవయొక్క నూతన విప్లవరూపాలే సోవియట్లు. జారు ప్రభుత్వ ఆజ్ఞలనూ చట్టాలనూ ధిక్కరించి విప్లవ ప్రజానీకం కొందరు ప్రత్యేకంగా నెలకొల్పినవే యీ సోవియట్లు. జారు ప్రభుత్వంతో పోరాడుటకు తల యెత్తుచున్న ప్రజల స్వతంత్ర కార్యాచరణను అవి తెలియజేస్తున్నాయి.

బొల్షివిక్కులు సోవియట్లను విప్లవ అధికార బీజాలుగా భావించారు. సోవియట్ల బలమూ, ప్రాముఖ్యతా తిరుగుబాటు యొక్క బలవిజయాలపైననే ఆధారపడి వుంటుందని బోల్షివిక్కులు వాదించారు. మెన్షివిక్కులు యీ సోవియట్లను విప్లవ అధికార బీజరూపాలుగాగానీ, తిరుగుబాటు సాధనాలుగా గానీ భావించలేదు. వారు సోవియట్లను స్థానిక ప్రభుత్వ రూపాలుగా, ప్రజాతంత్ర మొనర్చబడిన మునిసిపల్ పరిపాలక సంస్థలుగా మాత్రమే నాటిని పరిగణించారు. 1905 అక్టోబరు 13వ తేదీన (క్రొత్తకాలెండరు ప్రకారం అక్టోబరు 26) సెంట్‌పీటర్స్

బర్గ్‌లో అన్ని మిల్లులలోనూ, ఫ్యాక్టరీలలోనూ కార్మిక ప్రతినిధుల సోవియట్‌కై ఎన్నికలు జరిగాయి. సోవియట్ ప్రథమ సమావేశం ఆరాత్రే జరిగింది. సెంట్‌పీటర్స్‌బర్గ్‌ను అనుసరించి మాస్కోలో కూడా కార్మిక ప్రతినిధుల సోవియట్ ఏర్పడింది.

జార్ సామ్రాజ్య రాజధాని నగరమయిన సెంట్ పీటర్స్ బర్గ్, రష్యాలో ముఖ్యమైన పారిశ్రామిక కేంద్రమూ, విప్లవ కేంద్రమూకూడా. అందుచేత అచ్చట కార్మికప్రతినిధుల సోవియట్ 1905 విప్లవంలో నిశ్చితమైన పాత్రను ప్రదర్శించే వుండవలసింది. కాని దాని నాయకత్వం చెడ్డదగుటవల్లా, మెన్షివిక్కులదై యుండుటచేతా, అది తన కర్తవ్యాన్ని పూర్తి చేయలేదు. అప్పటికి లెనిన్ యింకా సెంట్‌పీటర్స్ బర్గ్‌లో ప్రవేశించలేదనీ, అతనింకా విదేశాలలోనే వున్నాడనీ మనకు తెలుసు. లెనిన్ అక్కడ లేకపోవడాన్ని అదనుగా తీసుకొని మెన్షివిక్కులు సెంట్‌పీటర్స్‌బర్గ్ సోవియట్‌లో ప్రవేశించారు. దాని నాయకత్వాన్ని తమచేతులలోకి తీసుకోవడానికి ప్రయత్నించారు. అట్టి పరిస్థితులలో మెన్షివిక్కులైన ఖ్రుస్టలావ్, ట్రాట్‌స్కీ, పార్వస్ మొదలైనవారు సెంట్‌పీటర్స్‌బర్గ్ సోవియటును, తిరుగుబాటు విధానానికి వ్యతిరేకంగా తయారు చేశారంటే ఆశ్చర్యం ఏమీలేదు. సైనికులను సోవియట్‌తో సన్నిహిత సంబంధం కలిగించి ఉమ్మడి పోరాటంలో వారిని కూడా కలుపుకొని రావడానికి బదులు, సెంట్‌పీటర్స్‌బర్గ్‌నుండి సైనికులను ఉపసంహరించాలని వారు కోరారు. ఈ సోవియట్, కార్మికులను సాయుధంచేసి తిరుగుబాటుకు సన్నాహం చేయుటకు బదులు మీనమేషాలు లెక్కపెట్టుకుంటూకూర్చుంది. పైగా తిరుగుబాటు సన్నాహాలను వ్యతిరేకించింది.

మాస్కో కార్మిక ప్రతినిధులు సోవియట్ విప్లవంలో ప్రదర్శించిన పాత్ర పూర్తిగా దీనికి విరుద్ధం. మొట్టమొదటి నుంచీకూడా మాస్కో సోవియట్ పూర్తిగా విప్లవ పాలసీని అనుసరించింది. మాస్కో సోవియట్ నాయకత్వం బోల్షివిక్కుల చేతులలోవుంది. వారి కృషి ఫలితంగా కార్మిక ప్రతినిధుల సోవియట్లతోపాటు మాస్కోలో సైనిక ప్రతినిధుల సోవియట్ కూడా ఏర్పడింది. మాస్కో సోవియట్, సాయుధ తిరుగుబాటు సాధనంగా తయారైంది. 1905 అక్టోబరు, డిశంబరుల మధ్య పెద్దపట్టణాలనేకంలో, దాదాపు కార్మికవర్గ కేంద్రాలన్నిటిలోనూ, కార్మిక ప్రతినిధుల సోవియట్లు ఏర్పడ్డాయి. సైనికుల నావికుల ప్రతినిధుల సోవియట్లనుకూడా సంఘటిత పరచి, వాటిని కార్మిక ప్రతినిధుల సోవియట్లతో ఏకంచేయడానికి ప్రయత్నాలు జరిగాయి. మరికొన్ని ప్రదేశాలలో కార్మిక కర్షక ప్రతినిధుల సోవియట్లు ఏర్పడ్డాయి.

ఈ సోవియట్ల పలుకుబడి అత్యద్భుతం. వాటంతటవే (Spontaniously) తలయెత్తినప్పటికీ, ఒక నిశ్చితస్వరూపం లేకపోయినప్పటికి, సక్రమంగా సంఘటితం కాకపోయినప్పటికీ (Loosely Organised) అవి పరిపాలక శక్తిలాగానే వ్యవహరించాయి. చట్టబద్ధమైన అధికారాన్ని పొందకుండానే అవి పత్రికా స్వాతంత్ర్యాన్ని, దినానికి 8 గంటల పనిని ప్రవేశపెట్టాయి. జారు ప్రభుత్వానికి పన్నులు చెల్లించవద్దని ప్రజలను ప్రబోధించాయి. కొన్నిచోట్ల అవి ప్రభుత్వ ఖజానాలను వశపరచుకొని విప్లవ అవసరాలకు ఖర్చుపెట్టాయి.

# 5

## డిశెంబరు సాయుధతిరుగుబాటు దాని ఓటమి – విప్లవ తిరోగమనం – ప్రభుత్వ ప్రథమ డ్యూమా – పార్టీ నాల్గవ (ఐక్య) కాంగ్రెస్

**1905** అక్టోబరు, నవంబరు నెలలలో ప్రజాసామాన్య విప్లవ పోరాటం తీవ్రమైన పటిమతో వృద్ధిపొందుతూ వచ్చింది. కార్మికుల సమ్మెలు కొనసాగాయి.

1905 ఆకురాలు కాలంలో (autumn) భూస్వాము లపై రైతులు సాగించిన పోరాటాలు చాలా ప్రాంతాలకు విస్తరించాయి. దేశంలో మూడోవంతు జిల్లాలలో రైతు ఉద్యమం వ్యాపించింది. సారట్సావ్ టాంబోవ్, చర్నిగోవ్, టిఫ్లిస్, కుటైజ్ మొదలగు రాష్ట్రాలు ఉద్భృతమైన రైతు తిరుగుబాట్లకు ఉనికి పట్టయినవి. అయినప్పటికీ రైతాంగ ప్రజల దాడి యింకా తగినంతగా లేదు. రైతు ఉద్యమంలో సంఘటనా, నాయకత్వమూ లోపించాయి.

టిఫ్లిస్, వ్లాడివాస్టాక్, టాష్కెంట్, సామర్కండ్, కర్స్కా, సుకుం, వార్సా, కీవ్, రీగా మొదలగు పట్టణాలలో – సైనికులలో సహితం అసంతృప్తి వృద్ధిచెందింది. క్రాన్ స్టాట్‌లో తిరుగుబాటు లేచింది. 1905 నవంబరులో సెవాస్తపోల్‌లో నల్లసముద్ర నౌకాదళానికి చెందిన నావికులు తిరుగబడ్డారు. అయితే యీ తిరుగుబాట్లు ఒంటరిగా జరిగాయి. అందుచే జారు ప్రభుత్వం వీటిని అణచివేయగల్గింది.

సైనిక, నావికా దళాలలో చెత్తతిండి, ఆఫీసర్ల క్రూర ప్రవర్తన ఇలాంటి ఇతర కారణాలు తరచు తిరుగుబాటును రెచ్చగొట్టేవి. వీటిని బీన్ (చిక్కుడుగింజల్లు లాంటివి. ఇవి ఆహార పదార్థములుగా వాడుతారు.) తిరుగుబాట్లు అనేవారు. తిరుగబడ్డ సైనికులలోనూ, నావికులలోనూ అధికసంఖ్యాకులు జారు ప్రభుత్వాన్ని పడగొట్టవలసిన అవసరాన్ని, సాయుధ పోరాటాన్ని శక్తివంతంగా కొనసాగించవలసిన అవసరాన్ని స్పష్టంగా యింకా గ్రహించలేదు. వారింకా చాలా శాంతి యుతంగానూ, ప్రమత్తతతోనూ వున్నారు. తిరుగుబాటులలో తాము అరెస్టుచేసిన ఆఫీసర్లను వదలివేయడంలాంటి తప్పులను తరచు చేస్తూండేవారు. తమ పై ఉద్యోగస్థులు చేసే వాగ్దానాలకూ బుజ్జగింపులకు లొంగి దగా పడేవారు.

విప్లవోద్యమం సాయుధ తిరుగుబాటు స్థాయికివచ్చింది. జారు పైనా, భూస్వాములపైనా సాయుధులై తిరుగబడండని ప్రజలను బోల్షివిక్కులు ఆదేశించారు. ఈతిరుగుబాటు తప్పని సరి అని విప్పిచెప్పారు. సాయుధ తిరుగుబాటును సన్నాహం చేయుటలో బోల్షివిక్కులు విసుకూ, విరామం లేకుండా పని చేశారు. సైనికులంలోనూ, నావికులలోనూ విప్లవ కార్య కలాపం కొనసాగించబడింది. సైన్యాలలో పార్టీసైనిక సంస్థలు నెలకొల్పబడ్డాయి. అనేక పట్టణాలలో కార్మికుల పోరాట దళాలు (Fighting squads) నిర్మించబడ్డాయి. ఆ దళసభ్యులకు ఆయుధాలు ఉపయోగించటం నేర్పారు. విదేశాలనుండి ఆయుధాలను కొనడానికీ, వాటిని రష్యాలోనికి రహస్యంగా చేరవేయడానికీ ఏర్పాటు చేయబడింది. పార్టీలోని ప్రముఖ వ్యక్తులు వీటి గనాగాకై కృషిచేశారు.

1905 నవంబరులో లెనిన్ రష్యాకు తిరిగివచ్చాడు. ఒకప్రక్క జారు ప్రభుత్వ పోలీసుకుక్కలకూ, గూఢచారులకూ దొరకకుండానే సాయుధ తిరుగుబాటును సన్నాహపరచుటలో స్వయంగా పాల్గొన్నాడు. బోల్షివిక్ వార్తాపత్రిక "నూతన జీవితం" (నోవాయా ఝిజిన్, (New Life) అనే దానిలో లెనిన్ వ్యాసాలు ప్రకటించబడుతూ వచ్చాయి. అవి పార్టీకి దైనందిన కార్యకలాపాలు నడుపుటలో సాయపడ్డాయి.

ఈకాలంలో కామ్రేడ్ స్టాలిన్, ట్రాన్సుకాకేషియాలో అత్యద్భుత విప్లవకార్యాన్ని కొనసాగిస్తున్నాడు. విప్లవానికీ, సాయుధ తిరుగుబాటుకూ మెన్షివిక్కులు శత్రువులని బట్టబయలుచేసి వారిని దెబ్బకొట్టాడు. నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా నిశ్చిత పోరాటాన్ని సాగించడానికి కార్మికులను పట్టుదలతో తయారుచేశాడు. జారు ప్రణాళిక ప్రకటించబడిన రోజున టిఫ్లిస్ నగరంలో ఒక కార్మికుల సభలో మాట్లాడుతూ స్టాలిన్ ఇలా అన్నాడు :

"మనం నిజంగా విజయం పొందాలంటే మనకు కావలసినదేమిటి? అవి మూడు. మొదటిది - ఆయుధాలు. రెండవది - ఆయుధాలు. మూడవది - ఆయుధాలు! మళ్లా మళ్లా ఆయుధాలే!"

1905 డిసెంబరులో బోల్షివిక్ మహాసభ ఫిన్‌లాండ్‌లోని టామర్‌ఫర్సులో జరిగింది. బోల్షివిక్కులూ, మెన్షివిక్కులూ నామకః ఒకే సోషల్ డెమాక్రటిక్ పార్టీకి చెందియున్నప్పటికీ వాస్తవంలో వారు రెండు విభిన్నపార్టీలుగా

పనిచేస్తున్నారు. ఇద్దరికీ రెండు విభిన్న కేంద్ర నాయకత్వా లున్నాయి. ఈ మహాసభలోనే మొట్టమొదటి సారిగా లెనిన్, స్టాలిన్‌లు కలుసుకున్నారు. అంతవరకూవారు ఉత్తర ప్రత్యుత్త రాల ద్వారానూ, ఇతర కామ్రేడ్స్ ద్వారానూ మాత్రమే పరస్పర సంబంధం కలిగియున్నారు.

టామర్ ఫర్సు మహాసభ నిర్ణయాలలో ఈ క్రింది రెండు విషయాలు గమనింపదగినవి. (1) వాస్తవంగా రెండు పార్టీ లుగా చీలిన పార్టీలో ఐక్యతను పునరుద్ధరించడం, (2) విట్టీ డ్యూమా అనే మొదటి డ్యూమాను (Witte Duma) బహిష్కరించటం.

ఈ సమయానికే మాస్కోలో సాయుధ తిరుగుబాటు ప్రారంభమైంది. అందుచే లేనిన్ సలహాపై యీ మహాసభ తన పనిని త్వరత్వరగా ముగించుకొని తిరుగుబాటులో ఈ ప్రతి నిధులు స్వయంగా పాల్గొనేటందుకుగాను సమావేశాన్ని ముగించింది.

కాని జార్ ప్రభుత్వం కూడా నిద్రపోవడంలేదు. అది కూడా నిశ్చితపోరాటానికి తయారవుతూవుంది. జపాన్‌తో సంధి చేసుకున్నందువల్ల జారుప్రభుత్వపు కష్టాలు కొన్నితగ్గి దాని పరి స్థితికొంతబాగుపడింది. కనుక జార్ ప్రభుత్వం కార్మిక కర్షకులపై దాడిసాగించ గలిగింది. రైతుల తిరుగుబాట్లు తీవ్రంగా వున్న అనేక రాష్ట్రాలలో "మార్షల్‌లా" ప్రకటించింది. "ఖైదీలుగా తీసుకోవద్దు", "గుండ్లను మిగల్చవద్దు" అని (అంటే కాల్చి చంపమని) క్రూరమైన ఆర్డర్లు నిచ్చింది. విప్లవోద్యమ నాయ కులను అరెస్టుచేసి కార్మిక ప్రతినిధుల సోవియట్లను చెదరగొట్ట

మని ఆజ్ఞాపించింది. దీనికి జవాబుగా మాస్కో బోల్షివిక్కులూ వారి నాయకత్వాననున్న ఆ పట్టణ కార్మికుల ప్రతినిధుల సోవియట్లు సాయుధ తిరుగుబాటుకు తక్షణసన్నాహాలను చేయనారంభించాయి. ఈ సోవియట్‌కు కార్మిక సామాన్యంతో సన్నిహిత సంబంధముంది. డిశంబరు 5 (18)వ తేదీన సోవియటును సర్వవ్యాపిత రాజకీయ సమ్మె ప్రకటించవలసిందిగా మాస్కో బోల్షివిక్ కమిటీ కోరుతూ తీర్మానించింది. పోరాటక్రమంలో యీ సమ్మెను తిరుగుబాటుగా మార్చాలని దీని ఉద్దేశం. ఈ నిర్ణయాన్ని కార్మికులు బహిరంగ ప్రజా సమావేశాలలో బలపరచారు. కార్మికవర్గ కోర్కె ననుసరించి మాస్కో సోవియట్ సర్వవ్యాపిత రాజకీయ సమ్మెను ప్రారంభించటానికి ఏకగ్రీవంగా నిర్ణయించింది.

మాస్కో శ్రామికవర్గం తిరుగుబాటు సాగించినప్పుడు, దాని పోరాట సంఘంలో దాదాపు 1000 మంది యోధులున్నారు. వారిలో సగానికిపైగా బోల్షివిక్కులే. వీరికితోడు మాస్కోలో అనేక ఫ్యాక్టరీలలో పోరాటదళాలున్నాయి. మొత్తంమీద తిరుగుబాటుదార్లకు 2000 మంది యోధులున్నారు. కొంతమంది సైనికులను తటస్థపరచి వారిలో కొంతమందిని తమవైపుకు లాక్కురాగలమని కార్మికులు ఆశించారు.

మాస్కోలో డిశంబరు 7 (20)వ తేదీన రాజకీయ సమ్మె ప్రారంభమైంది. కాని యీ సమ్మెను దేశమంతా వ్యాపింపచేయాలనే ప్రయత్నాలు విఫలమయ్యాయి. దీనికి సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో తగినంత మద్దతురాలేదు. ఇది తిరుగుబాటు విజయంపొందే అవకాశాలను మొట్టమొదటనే తగ్గించివేసింది.

నికోలాయెవాస్కయా రైల్వే (యిప్పుడు అక్టోబరు రైల్వే అని పిలుస్తారు) జారుప్రభుత్వపు చేతుల్లోనే వుండిపోయింది. ఈ లైన్‌లో రాకపోకలు ఆగలేదు. అందుచే సెంట్‌పీటర్స్‌బర్గ్ నుండి తిరుగుబాటును అణచడానికి మాస్కోకు సైన్యాలను ప్రభుత్వం పంపగలిగింది. ఇంకా మాస్కోలోని సైన్యం ఊగిసలాడింది.

ఈ సైనికదళ మద్దతును పొందగలమనే సగంఆశతోనే కార్మికులు ఈ తిరుగుబాటును లేవదీశారు. కాని విప్లవకారులు తిరుగుబాటును చాలా ఆలస్యంగా ప్రారంభించారు. అప్పటికే ప్రభుత్వం సైనికదళాలలోని అశాంతిని తట్టుకోగలిగింది.

డిశెంబరు 9 (22)వ తేదీన మాస్కోలో మొదటిసారిగా బారికేడ్లు ఏర్పడ్డాయి. జారుప్రభుత్వం ఫిరంగులను (Artillery) ఉపయోగించింది. తిరుగుబాటు దారులబలాన్ని మించి అనేకరెట్ల బలాన్ని అది కేంద్రీకరించింది. తొమ్మిది దినాలవరకూ వేలకొలది సాయుధ కార్మికులు వీరోచితంగా పోరాటాన్ని సాగించారు. సెంట్‌పీటర్స్‌బర్గ్‌నుండీ, ట్వెర్‌నుండీ, పశ్చిమ రాష్ట్రాలనుండీ జారుప్రభుత్వం సైన్యాలను తీసుకవచ్చుట వలననే తిరుగుబాటును అణచగలిగింది. తిరుగుబాటు కేంద్రం మాస్కో అనగా దాని నాయకులలో కొందరిని అరెస్టుచేసి ప్రభుత్వం కొంతవరకు నాయకత్వాన్ని వేరుచేయగల్గింది. మాస్కో బోల్షివిక్ కమిటీ సభ్యులు అరెస్టుచేయబడ్డారు. ఈ సాయుధ తిరుగుబాటు వివిధజిల్లాలలో పరస్పర సంబంధం లేకుండా జరిగింది. తిరుగుబాటు నంతటినీ నడిపే ఒక కేంద్ర నాయకత్వం లేదు. మొత్తం పట్టణ మంతటా ఒకేరకంగా

సాయుధచర్యలను సాగించే ఉమ్మడి పథకంలేదు. అందుచే వివిధ జిల్లాలలో (పేటలలో) ఆత్మరక్షణా చర్యలను మాత్రమే చేయగలిగాయి. మాస్కో తిరుగుబాటుయొక్క బలహీనతకు ప్రధానకారణం ఇదే. ఓడిపోవడానికి కారణాలలోకూడా ఇది ఒకటని ఆ తరువాత లెనిన్ పేర్కొన్నాడు. ముఖ్యంగా మాస్కోలోని క్రాస్నయా ప్రస్నయా జిల్లాలో (పేటలో) తిరుగుబాటుదారులు చాలా మొండిగానూ, తీవ్రంగానూ పోరాడారు. ఇది తిరుగుబాటుకు ముఖ్యమైన బలమైన కేంద్రం. ఇక్కడ బోల్షివిక్కుల నాయకత్వాన మంచి పోరాటదళాలు కేంద్రీకరించబడినాయి. కాని క్రాస్నియా ప్రస్నయా తిరుగుబాటు కత్తిబలంతో, తుపాకిగుండ్ల అగ్నివర్షంతో అణచివేయబడింది. అది రక్తస్రవంతులలో తేలియాడింది. ఫిరంగిగుండ్ల మంటలలో మండిపోయింది. మాస్కో తిరుగుబాటు అణచివేయబడింది.

తిరుగుబాటు మాస్కోతోనే ఆగలేదు. అనేకమైన ఇతర పట్టణాలలో, జిల్లాలలో విప్లవ తిరుగుబాట్లు ప్రారంభమయ్యాయి. క్రాస్నోయార్స్క్, మోటోవిలిఖా (పెరమ్) నోవారోసిస్క్, సోర్మోవో, సెవాస్తపోల్, క్రాన్‌స్టాట్ మొదలగుచోట్ల సాయుధ తిరుగుబాట్లు జరిగాయి.

రష్యాలోని పీడితజాతులుకూడా సాయుధ పోరాటానికి తలపడ్డాయి. దాదాపు జార్జియా అంతా సాయుధపోరాటాన్ని సాగించింది. యుక్రైన్‌లోని గోర్లోకా, అలెగ్జాండ్రోవస్క్, డానెడ్జిబేసిన్‌లోని లుగాన్‌స్క్ (ఇప్పుడు వరోషిలోవ్‌గ్రాడ్) మొదలగు పట్టణాలలో సాయుధ తిరుగుబాట్లు జరిగాయి. లాట్వియాలో మొండి పోరాటం సాగింది. ఫిన్‌లాండులో

కార్మికులు "రెడ్‌గార్డు"లుగా ఏర్పడి తిరుగబడ్డారు. కాని ఈ తిరుగుబాట్లన్నీ మాస్కో తిరుగుబాటువలెనే నిశంకుశ ప్రభుత్వంచే అమానుష క్రూరత్వంతో అణచివేయబడ్డాయి.

డిసెంబరు సాయుధ తిరుగుబాట్లను గురించి మెన్షివిక్కులు, బోల్షివిక్కులు నేర్చుకొన్న గుణపాఠాలు కూడా విభిన్నంగా వున్నాయి. తిరుగుబాటు తరువాత మెన్షివిక్కు ప్లెఖనావ్ "వారు ఆయుధాలను ధరింపవలసిందికాదు" అని పార్టీపై విరుచుకుపడ్డాడు. తిరుగుబాటు అనవసరమనీ, వినాశకరమైనదనీ, విప్లవంలో తిరుగుబాటును వదలివేయవచ్చుననీ, సాయుధపోరాటంవల్లగాక శాంతియుత పోరాట పద్ధతులవల్ల విజయం పొందవచ్చుననీ మెన్షివిక్కులు వాదించారు. బోల్షివిక్కులు యీ వాదన ద్రోహమని అన్నారు. మాస్కో సాయుధ తిరుగుబాటు అనుభవం మనకు కార్మికవర్గం విజయవంతమైన సాయుధ తిరుగుబాటును సాగించగలదని రుజువు చేసింది. "వారు ఆయుధాలు చేపట్టవలసిందికాదు" అన్న ప్లెఖనావ్ ఖండనకు జవాబుగా లెనిన్ యిలా అన్నాడు:

"అది సరికాదు. పైగా మనం సాయుధ పోరాటాన్ని మరింత దృఢంగా, శక్తివంతంగా, చావుదెబ్బకొట్టేదిగా కొనసాగించి ఉండవలసింది. శాంతియుతమైన సమ్మెను మాత్రమే కట్టుబడివుండటం సాధ్యమైనపనికాదనీ, నిర్భయమైన, నిరంతరాయమైన సాయుధ పోరాటం ఆవశ్యకమనీ ప్రజలకు మనం విశదపరచి ఉండవలసింది." (లెనిన్ సెలెక్టెడ్‌వర్క్సు, ఇంగ్లీషు ముద్రణ మాస్కో 1947 ఎడిషన్ 1వ వాల్యూం 446వ పేజీ)

1905 డిశెంబరు తిరుగుబాటు విప్లవానికి ఉన్నతస్థాయి. జారు నిరంకుశప్రభుత్వం తిరుగుబాటును అణచివేసింది. తరువాత విప్లవం వెనుతిరిగి (Took a turn) పోనారంభించింది. విప్లవతరంగం క్రమంగా అణగిపోయింది.

ఈ ఓటమిని అదనుగా తీసుకొని విప్లవాన్ని తుదిదెబ్బ కొట్టడానికి జార్ ప్రభుత్వం త్వరపడింది. జార్ కసాయిలు, జైలర్లు యీ హంతక కార్యాన్ని ప్రారంభించారు. పోలండ్, లాట్వియా, ఎస్తానియా, ట్రాన్స్‌కాకేషియా, సైబీరియాలలో ప్రతీకార దండయాత్రలు చెలరేగాయి.

కాని విప్లవం యింకా అణగిపోలేదు. పోరాడుతూనే కార్మికులూ, విప్లవరైతాంగమూ, నెమ్మదిగా వెనుకకుతగ్గారు. కార్మికులలో కొత్తవారిని పోరాటంలోకి లాగారు. 1906 లో జరిగిన సమ్మెలలో 10 లక్షలమంది కార్మికులు పాల్గొన్నారు. 1907 లో జరిగిన సమ్మెలో 7 లక్షల 40 వేలమంది పాల్గొన్నారు. 1906 మొదటి అర్ధసంవత్సరంలో, జార్ ప్రభుత్వరష్యాలోని జిల్లాల్లో సగభాగానికి రైతుఉద్యమం ప్రాకింది. తర్వాత అర్ధసంవత్సరములో 5 వ వంతుకు ప్రాకింది. సైనికులలో, నావికులలో అశాంతి ప్రబలుతూనే వుంది.

జార్ ప్రభుత్వం విప్లవంతో పోరాడేటప్పుడు ఒక్క నిర్బంధ విధానాలతోనే సరిపుచ్చుకోలేదు. నిర్బంధవిధానాల ద్వారా ప్రాథమిక విజయాలను సాధించినమీదట ప్రభుత్వం ఒక క్రొత్త డ్యూమాను, లెజిస్లేటివ్ డ్యూమాను (శాసన సభను) సమావేశపరచడం ద్వారా విప్లవంపై మరొక దెబ్బ కొట్టాలని నిశ్చయించింది.

ఈ విధంగా విప్లవంనుండి రైతాంగాన్ని విడదీసి దాన్ని నాశనం చేయడానికి ఆశించింది. బోల్షివిక్కుల బహిష్కరణ ఫలితంగా తుడుచుకుపోయిన బులిజిన్ ఏర్పరచిన "సలహా" డ్యూమాకు బదులుగా, కొత్త లెజిస్లేటివ్ డ్యూమాను సమావేశపరచే శాసనాన్ని 1905 డిసెంబరులో జారు ప్రభుత్వం చేసింది. జారు ప్రభుత్వపు ఎన్నికచట్టం ప్రజాతంత్ర విరుద్ధమని వేరే చెప్పనక్కరలేదు. ఎన్నికలు అందరికీ ఓటు కలిగిన పద్ధతిపై జరిగేవికావు. జనాభాలో సగం – ఉదాహరణకు స్త్రీలకు, 20 లక్షలమంది కార్మికులకు – ఓటుచేసే అధికారం పూర్తిగా తీసివేసింది. ఎన్నికలు సమానత్వ సూత్రంపై ఆధారపడలేదు. ఓటర్లను నాలుగు ముఠాలుగా (Cuaris) విభజించింది. వ్యవసాయ దారులు (భూస్వామి) పట్టణవాసులు (బూర్జువా), రైతులు, కూలీలు అని ఈ విభజన. ప్రత్యక్ష ఎన్నికలు (డైరెక్ట్ ఎలక్టరేట్) గాక అనేక దశలుద్వారా యీ ఎన్నికలు జరుగుతాయి. రహస్య ఓటింగు పద్ధతి వాస్తవానికి లేనేలేదు. లక్షలాది కార్మిక కర్షకులకంటె కొద్దిమంది భూస్వాములకు, పెట్టుబడిదార్లకు డ్యూమాలో అత్యధిక సంఖ్యాబలం కలిగేట్లు, ఎన్నిక చట్టం అవకాశాన్నిచ్చింది.

విప్లవాన్నుండి ప్రజాసామాన్యాన్ని మరొకప్రక్కకు మరల్చడానికి డ్యూమా నుపయోగించుకోవాలని జారు తలచాడు. ఆరోజుల్లో రైతాంగంలోని అధికభాగం డ్యూమా సాయంతో భూమి సంపాదించవచ్చునని ఆశించారు. శాసనబద్ధ ప్రజాతంత్రవాదులు (కాన్‌స్టిట్యూషనల్ డెమాక్రట్స్), మెన్షివిక్కులు, సోషలిస్టు–రివల్యూషనరీలు, ప్రజలుకోరే రాజ్యాంగ

పద్ధతి, తిరుగుబాటు లేకుండా, విప్లవం లేకుండా వస్తుందని చెప్పి రైతులను, కార్మికులను మోసగించారు. ప్రజలను మోసగించే యీ దగాను ఎదుర్కొనుట బోల్షివిక్కుల కర్తవ్య మయింది. మొదటి ప్రభుత్వ డ్యూమాను బహిష్కరించుట తమ ఎత్తుగడ అని బోల్షివిక్కులు ప్రకటించారు. డ్యూమాను బహిష్కరించారు. టామర్‌ఫర్సు (ఫిన్లండు) కాన్ఫరెన్సులో వ్యాసైన తీర్మానాల ననుసరించే యీ నిశ్చయానికి వచ్చారు.

జారుప్రభుత్వ వ్యతిరేక పోరాటంలో పార్టీలోని విభిన్న శక్తులు ఐక్యంగావాలని, శ్రామికవర్గపార్టీ ఐక్యంగావాలని కార్మికులు కోరారు. టామర్‌ఫర్సు కాన్ఫరెన్సులో చేయబడిన ఐకమత్య తీర్మానాన్ని ఆధారబలంతో కార్మికుల యీకోర్కెను బోల్షివిక్కులు బలపరచారు. పార్టీ ఐక్య కాంగ్రెసును సమావేశ పరచాలని మెన్షివిక్కులకు బోల్షివిక్కులు సూచించారు. కార్మికుల వత్తిడిఫలితంగా మెన్షివిక్కులు, కలయికకు అంగీకరించవలసి వచ్చింది.

లెనిన్ ఈ ఐక్యతను అనుకూలుడే కాని విప్లవ సమస్యలపైనున్న విభేదాలను మరుగుపరచే ఐక్యతకుమాత్రం కాదు. బోల్షివిక్కులకు మెన్షివిక్కులకు మధ్య అట్టే తీవ్రమైన విభేదాలులేవని నిరూపించడానికి ప్రయత్నించిన రాజీబేరగాళ్ళ వల్ల (బోగ్దనావ్, క్రాస్సిన్ మొదలగువారు) పార్టీకి చాలా నష్టం కలిగింది. కాంగ్రెసుకు బోల్షివిక్కులు తమప్రత్యేక ప్రణాళికతో ముందుకు రావాలనీ, అలారావడంవల్ల కార్మికులు బోల్షివిక్కుల వైఖరిఏమిటో స్పష్టంగా తెలుసుకుంటారని, ఏ ప్రాతిపదికపైన ఐక్యత కుదురుతున్నదో వారు తెలుసుకుంటా

రని నొక్కి చెపుతూ, లెనిన్ రాజీబేరగాళ్ళతో పోరాడాడు. బోల్షివిక్కులు అలాంటి ఒక రాజకీయ వేదికను తయారుచేసి పార్టీ సభ్యుల చర్చకు ప్రవేశపెట్టారు.

ఐక్యతా కాంగ్రెస్ అని పిలువబడిన రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరుపార్టీ నాల్గవకాంగ్రెస్ 1906 ఏప్రిల్‌లో స్టాక్‌హోమ్‌లో (స్వీడన్) సమావేశమైంది. దానికి ఓటింగ్ హక్కు కలిగిన ప్రతినిధులు 111 మంది హాజరయ్యారు. యాభై ఏడు (పార్టీ) స్థానికసంస్థలనుండి యీ ప్రతినిధులు ఎన్నుకోబడ్డారు. వీరుగాక జాతీయ సోషల్ డెమాక్రటిక్ పార్టీ ప్రతినిధులు వచ్చారు. వారు ముగ్గురు బండ్ (యూదుకార్మికసంస్థ) ప్రతినిధులు; ముగ్గురు పోలిష్ సోషల్ డెమాక్రటిక్ పార్టీ ప్రతినిధులు, ముగ్గురు లెట్టిష్ (లాట్వియా) సోషల్ డెమాక్రటిక్‌సంస్థ ప్రతినిధులు.

డిసెంబరు తిరుగుబాటు కాలంలోను, ఆ తర్వాతను బోల్షివిక్కు సంస్థలు గట్టిదెబ్బతిన్నాయి. అందుచే అవి అన్నీ గాక కొన్నిమాత్రమే ప్రతినిధులను పంపగల్గాయి. ఇంతేగాక 1905 "స్వాతంత్ర్య దినాలలో", మెన్షివిక్కులు విప్లవ మార్క్సిజంతో ఏట్టిసంబంధమూలేని అనేకమంది పెటీబూర్జువా మేధావులను తమలోకి తీసుకున్నారు. టిఫ్లిస్ మెన్షివిక్కులు, (టిఫ్లిస్‌లో పారిశ్రామిక కార్మికులు తక్కువ) శ్రామికవర్గ సంఘాలన్నింటిలోను 'పెద్దదైన పీటర్స్‌బర్గ్‌సంఘం పంపినంతమంది ప్రతినిధులను పంపారు. ఇదొక ఉచాలు పై విషయానికి నిదర్శనం. దీనిఫలితంగా స్టాక్‌హోమ్ కాంగ్రెసులో మెన్షివిక్కులను మెజారిటీ లభించింది. ఆ మెజారిటీ అంత ప్రాముఖ్యమైనది కాకపోయినమాట నిజమే.

కాంగ్రెస్‌లో యిలాంటి ప్రతినిధులు వుండడంవలన అనేక సమస్యలపై చేసిన తీర్మానాలు మెన్షివిక్కు స్వభావాన్ని కల్గివున్నాయి. ఈ కాంగ్రెస్‌లో నామకః మాత్రమే ఐక్యత సాధించబడింది. నిజానికి బోల్షివిక్కులు, మెన్షివిక్కులు తమతమ అభిప్రాయాలను తమ స్వంత సంస్థలను అలాగే వుంచుకున్నారు.

నాల్గవకాంగ్రెసులో చర్చించిన ముఖ్యసమస్యలు ఇవి: వ్యవసాయపుసమస్య, ప్రస్తుతస్థితి, శ్రామికజనవర్గ కర్తవ్యాలు, ప్రభుత్వ డ్యూమాయెడల అవలంబించవలసిన వైఖరి, ఇంకా నిర్మాణ (ఆర్గానిజేషనల్) సమస్యలు. ఈ కాంగ్రెస్‌లో మెన్షివిక్కులకు మెజారిటీవున్నా కార్మికులతో విరోధం తెచ్చిపెట్టుకోనకుండా వుండేటందుకుగాను వారు, పార్టీ సభ్యత్వానికి సంబంధించిన పార్టీ నిబంధనావళియొక్క మొదటిపేరాను, లెనిన్ వ్రాసినట్లుగానే అంగీకరించవలసి వచ్చింది.

వ్యవసాయకసమస్యపై, భూమిని జాతీయపరం చేయాలని లెనిన్ వాదించాడు. జారు ప్రభుత్వాన్ని కూలద్రోసిన తర్వాత విప్లవం విజయం పొందితేనే భూమిని జాతీయపరమొనర్చుట సాధ్యమవుతుందని లెనిన్ అన్నాడు. అలాంటి పరిస్థితుల్లో భూమిని జాతీయపర మొనర్చుటవల్ల బీదరైతాంగ సమ్మేళనంతో శ్రామికవర్గం సోషలిస్టు విప్లవానికి పురోగమించడం సులభమవుతుంది. భూమిని జాతీయపర మొనర్చుట అంటే ఎట్టి నష్ట పరిహారం యివ్వకుండా ఎస్టేట్ల భూములను వశపరచుకొని వాటిని రైతాంగానికి యిచ్చివేయడం. జార్ పైన,

భూస్వాములపైన తిరగబడి విప్లవంచెయ్యమని బోల్షివిక్ వ్యవసాయక కార్యక్రమం ప్రబోధించింది.

కాని మెన్షివిక్కులు మరొక వైఖరి అవలంబించారు. మ్యునిసిపలైజేషన్ కార్యక్రమాన్ని కొనసాగించాలన్నారు. ఈ కార్యక్రమం అనుసరించి ఈ ఎస్టేటు భూములు గ్రామసంఘాల (కమ్యూనిటీస్)కు యివ్వరాదు. కనీసం వ్యవసాయం చేయడానికైనా యివ్వరాదు. కాని మ్యునిసిపాలిటీల (అంటే స్థానిక స్వపరిపాలన సంఘాల — వీటినే రష్యన్ భాషలో జమ్‌స్త్వోలంటారు.) చేతులలో పెట్టాలి. ఈ భూమిని తాను చేయగలిగినంతమట్టుకు కౌలుకు (రెంట్) తీసుకోవచ్చు.

మెన్షివిక్కుల మ్యునిసిపలైజేషన్ కార్యక్రమం రాజీ మార్గం. కాబట్టి విప్లవానికి ప్రతిబంధకం. అది విప్లవ పోరాటానికి రైతులను సమీకరించలేదు. భూస్వాముల భూమి ఆస్తి హక్కులను పూర్తిగా రద్దుచేయుటకు అది ఉద్దేశింపబడలేదు. మెన్షివిక్ కార్యక్రమం విప్లవాన్ని మధ్యమార్గంలో నిలిపివేయటానికి వుద్దేశింపబడింది. విప్లవానికై రైతులను ఉత్తేజపరచడాన్ని మెన్షివిక్కులు కోరలేదు.

ఈ కాంగ్రెస్‌లో మెన్షివిక్కు కార్యక్రమానికే మెజారిటీ లభించింది.

ప్రస్తుత(ఆనాటి)పరిస్థితిని గురించిన, ప్రభుత్వద్యూమాను గురించిన తీర్మానాలను చర్చించేటప్పుడు, మెన్షివిక్కులు, తమ అవకాశవాద స్వభావాన్ని శ్రామికవర్గ వ్యతిరేకస్వభావాన్ని ప్రధానంగా వెడలగ్రక్కారు. విప్లవంలో శ్రామికవర్గ నాయకత్వ పాత్రను (హెజిమొనీ) వ్యతిరేకించుచుతూ, మెన్షివికకులు

మార్టినోవ్ నిర్మొగమాటంగా మాట్లాడాడు. మెన్షివిక్కులకు జవాబుగా కామ్రేడ్ స్టాలిన్ కుండ బ్రద్దలుకొట్టినట్లు యిలా అన్నాడు:

"శ్రామికవర్గ నాయకత్వమా? (హెజిమొనీ) లేక ప్రజాతంత్ర బూర్జువా యొక్క నాయకత్వమా? యిదే పార్టీలోవున్న సమస్య. అక్కడే మనము విభేదించుచున్నాము."

ఇక ప్రభుత్వ డ్యూమాను మెన్షివిక్కులు తమ తీర్మానంలో తెగ పొగిడారు. అది విప్లవ సమస్యలను పరిష్కరించే మంచి సాధనమని, జార్ ప్రభుత్వాన్నుండి ప్రజలను విముక్తి చేస్తుందనిఅన్నారు. తద్వ్యతిరేకంగా బోల్షివిక్కులు డ్యూమాను గురించి యిలా అన్నారు: డ్యూమా జారు ప్రభుత్వానికి నిర్జీవమైన బానిస. జారుప్రభుత్వపు చెడుగులను కప్పే తెర. జారు ప్రభుత్వం తనకు అది అనుకూలంగా లేదని రుజువైన వెంటనే దానిని త్రోసివేస్తుంది.

నాల్గవ కాంగ్రెసులో ఎన్నుకోబడిన కేంద్రకమిటీలో (సి. సి.) ముగ్గురు బోల్షివిక్కులు, ఆరుగురు మెన్షివిక్కులు వున్నారు. కేంద్ర పత్రిక సంపాదక వర్గంలో అందరూ మెన్షివిక్కులే.

దీనినిబట్టి పార్టీలో అంతర్గత పోరాటం యింకా సాగుతుందనుట స్పష్టమే.

నాల్గవకాంగ్రెసు తర్వాత బోల్షివిక్కుల, మెన్షివిక్కుల మధ్య ఘర్షణ కొత్త పటిమతో చెలరేగింది. నామకః ఐక్యమైన స్థానిక సంస్థలలో కాంగ్రెసును గురించిన రిపోర్టులను సాధారణంగా యిద్దరు ఇచ్చేవారు. ఒకరు బోల్షివిక్కుల

నుంచి, రెండవవారు మెన్షివిక్కుల నుంచి వచ్చిన ప్రతినిధులు. ఈ రెండు పోకడలను చర్చించినఫలితంగా స్థానికసంస్థలలో అధిక సంఖ్యాక సభ్యులు అనేకచోట్ల బోల్షివిక్కులను బలపర్చారు.

తర్వాత ఘటనలు బోల్షివిక్కులదే సరియైన మార్గమని నిరూపించాయి. నాల్గవ కాంగ్రెసులో ఎన్నుకోబడిన మెన్షివిక్ కేంద్రకమిటీ తన అవకాశవాదాన్ని ప్రజాసామాన్య విప్లవ పోరాటం నడుపుటలో పూర్తి అసమర్థతను మరింత బయట పెట్టుకుంది. 1906 వేసవిలోను, ఆకురాలు కాలంలోను ప్రజాసామాన్య విప్లవ పోరాటం కొత్త పటిమను ప్రదర్శించింది. క్రాన్‌స్టాట్, స్వియాబర్గ్‌లలో నావికుల తిరుగుబాట్లు లేచాయి. భూస్వాములకు వ్యతిరేకంగా రైతుల పోరాటం విజృంభించింది. అయినా మెన్షివిక్ కేంద్రకమిటీ అవకాశవాద నినాదాలనే యిచ్చింది. కాని వాటిని ప్రజాసామాన్యం అనుసరించలేదు.

## 6

ప్రభుత్వ ప్రథమ డ్యూమాను రద్దుచేయుట – ప్రభుత్వ ద్వితీయ డ్యూమాను సమావేశపరచుట – పార్టీ అయిదవ కాంగ్రెస్ – ప్రభుత్వ ద్వితీయ డ్యూమాను రద్దుచేయుట – మొదటి రష్యన్ విప్లవం అపజయం పొందటానికి కారణాలు

ప్రభుత్వపు మొదటి డ్యూమా తగినంత అణకువ చూపకపోవడంవల్ల, 1906 వేసవిలో జారుప్రభుత్వం దాన్ని

రద్దుచేసింది. ప్రభుత్వం ప్రజలపై మరింత తీవ్రమైన నిర్బంధ విధానాలకు పూనుకుంది. దేశమంతటా ప్రతీకార దండయాత్రలను సాగించి సర్వనాశక చర్యలను విస్తరింప జేసింది. ప్రభుత్వపు రెండవ డ్యూమాను త్వరలో సమావేశపరచే నిర్ణయాన్ని తెలియజేసింది. జారు ప్రభుత్వం రోజు రోజుకు పొగరుబోతుగా తయారైంది. దానికి యిక విప్లవ భయంలేదు - ఎందుకంటే విప్లవం వెనుదిరగటం అది గమనించింది.

రెండవ డ్యూమాను బహిష్కరించాలా లేక దానిలో పాల్గొనాలా; అన్నది బోల్షివిక్కులు నిశ్చయించవలసి వచ్చింది. బహిష్కారమంటే బోల్షివిక్కుల అర్థంలో తీవ్రమైనబహిష్కరణే గాని వూరికే ఎన్నికలలో ఓటుయివ్వకుండా, మెదలకుండా కూర్చోవడం గాదు. విప్లవ మార్గంనుండి "చట్ట" బద్ధ మార్గానికి ప్రజలను మరల్చడానికి జారుచేసే ప్రయత్నాలను గురించి హెచ్చరించడానికీ, యీ ప్రయత్నాలను నాశనం చేసి జారు ప్రభుత్వంపై నూతన ప్రజాదాడిని సంఘటితం పరచడానికీ, తీవ్రమైన బహిష్కరణయే విప్లవ సాధనమని బోల్షివిక్కులు భావించారు.

బులిజిన్ డ్యూమాను బహిష్కరించిన అనుభవం తెలియజేసిం దేమంటే, ఆ బహిష్కారం "ఒక్కటే ఆకాలంలో సరియైన ఎత్తుగడ. ఆతర్వాత సంఘటనలవల్ల ఇది పూర్తిగా రుజువైంది." (లెనిన్ సెలెక్టెడ్ వర్కు్స, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947, వ వాల్యూమ్ 450 పేజీ)

జారిస్టు చట్టబద్ధ మార్గం వల్ల కలిగే అపాయాన్ని గురించి ప్రజలను హెచ్చరించడమేగాక, డ్యూమా పుట్టుకనే,

ఆ బహిష్కరణ నాశనం చేసింది. అందుచే యీ బహిష్కారం విజయవంతమైంది. బహిష్కారం ఎందుకు జయప్రదం కాగలి గిందంటే విప్లవం వెనుతిరిగి పోయేటప్పుడు గాక విప్లవ వెల్లువ వెల్లుబుకుతున్నప్పుడు, దాని సహాయంతో ఆ బహిష్కరణ కొనసాగింది. అందుచే అది జయప్రద మయింది. విప్లవ వెల్లువ ఉచ్ఛస్థాయిలో వున్నప్పుడే డ్యూమా సమావేశాన్ని నాశనం చేయడం సాధ్యమయింది.

డిసెంబరు తిరుగుబాటు ఓడిపోయిన పిదప, అంటే జారువిజయం పొందుతున్నాడని నిర్ధారణ అవుతున్నప్పుడు, విప్లవం వెనుకడుగు వేయ ప్రారంభించిందని నమ్మడానికి తగు హేతువు కన్పించి నపుడు, విట్టీడ్యూమాను అనగా మొదటి డ్యూమాను బహిష్కరించటం సంభవించింది.

లెనిన్ యిలా వ్రాశాడు:

"కాని ఆకాలంలో యీ విజయం (జారువిజయం) నిశ్చిత విజయమని తలచడానికి అవకాశంలేదని వేరే చెప్ప నక్కరలేదు. 1905 డిసెంబరు తిరుగుబాటు ఫలితంగా 1906 వేసవిలో అక్కడక్కడ పరస్పర సంబంధం లేకుండా పాక్షిక సైనిక తిరుగుబాట్లు, సమ్మెలు అనేకం వరుసగా చెలరేగాయి. విట్టీ డ్యూమాను బహిష్కరించమనే పిలుపు ఈ తిరుగుబాట్లను కేంద్రీకరించి సర్వవ్యాపితమైన తిరుగుబాటుగా మార్చ డానికే." (లెనిన్ కలెక్టెడ్‌వర్క్స్, రష్యన్ ఎడిషన్ 12వ వాల్యూం, 20 వ పేజీ)

విట్టీడ్యూమా బహిష్కరణ దాని ప్రతిష్టను తగినంతగా కుంటువడ జేసినప్పటికీ, ప్రజానీకంలో కొంతభాగానికి దానిలో

విశ్వాసం తగ్గించేటట్లు చేసినప్పటికీ, డ్యూమా అసలు సమా వేశమే కాకుండా యీ బహిష్కరణ చేయలేకపోయింది. విప్లవం వెనుకడుగు వేయుచున్న సమయంలో, అది క్షీణ దశలో నుండగా బహిష్కరణ జరగటంవల్ల డ్యూమా సమా వేశ మవడాన్ని అది భగ్నంచేయలేక పోయిందని తర్వాత స్పష్టమైంది. ఈ కారణంవల్ల 1906 లో మొదటి డ్యూమా బహిష్కరణ విజయం పొందలేదు. ఈ సందర్భంలో లెనిన్ తన ప్రఖ్యాత కరపత్రం "లెఫ్ట్‌వింగ్ కమ్యూనిజం - యాన్ ఇన్‌ఫెంటైల్ డిజార్డర్" (అతివాద కమ్యూనిజం ఒక కుర్ర తనపు అవలక్షణం)లో ఇలా వ్రాశాడు:

"1905 పార్లమెంటును బోల్షివిక్కులు బహిష్కరించ టం, విప్లవశ్రామికవర్గానికి చాలా అమూల్యమైన రాజకీయ అనుభవాన్ని సంపాదించి పెట్టింది. బహిరంగ పోరాటాలతో రహస్య పోరాటాలను, శాసనబద్ధ పోరాటాలతో శాసన విరుద్ధ ప్రజా పోరాటాలను (ఎక్స్‌ట్రా పార్లమెంటరీ) కలిపే సందర్భంలో ఒకప్పుడు, పార్లమెంటరీపద్ధతులను తిరస్కరించడం అవసరమని, ఉపయోగకరమని యీ బహిష్కరణ రుజువు చేసింది... కాని 1906 లో బోల్షివిక్కులు డ్యూమాను బహి ష్కరించటం తప్పు. ఈ తప్పు చిన్నదీ, సులభంగా దిద్దుకో తగినదీ అయినప్పటికీ ఇది తప్పే, వ్యక్తులకు వర్తించేదే - అవ సరమైన సవరణలతో - రాజకీయాలకు, పార్టీలకు కూడా వర్తించుతుంది. ఎప్పుడూ తప్పులుచేయనివాడు మాత్రమే అను భవజ్ఞానికాడు. అలాంటి మనుష్యులు లేరు, వుండబోరు.

మరీతీవ్రమైన తప్పులు చేయకుండాను, చేసిన తప్పులను సులభంగాను, త్వరగాను దిద్దుకొనేవాడే విజ్ఞుడు.”

(లెనిన్, సెలక్టెడ్ వర్క్స్, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో - 1947, 2 వ వాల్యూమ్, 582 - 83 పేజీలు.)

ప్రభుత్వపు రెండవ డ్యూమాను గురించి లెనిన్ అభిప్రాయం ఇది. పరిస్థితులు మారడంవల్ల, విప్లవం వెనుదిరగడంవల్ల "ప్రభుత్వడ్యూమాను బహిష్కరించే సమస్యను గురించి బోల్షివిక్కులు తిరిగి ఆలోచించాలి" అని లెనిన్ అన్నాడు.

(పై గ్రంథమే 1వ వాల్యూమ్ 450 వ పేజీ)

లెనిన్ యింకా యిలా వ్రాశాడు:

"డ్యూమా సమావేశమైనప్పుడు, డ్యూమాలోపల నుండి, ఇందు కనుగుణ్యంగానే బయటనుండి ఉపయోగకరమైన ఆందోళన సాగించడానికి అవకాశాలు లభించుతాయని చరిత్ర రుజువుచేసింది. శాసనబద్ధ ప్రజాతంత్రవాదులకు వ్యతిరేకంగా విప్లవ రైతాంగాన్ని విప్లవశక్తులతో కలిపే ఎత్తుగడలు డ్యూమాలో ఆచరించవచ్చునని చరిత్ర రుజువుచేసింది."

(పై గ్రంథమే 453 వ పేజీ)

ఇదంతా ఏం తెలియజేస్తుంది? విప్లవం ఉచ్ఛస్థాయిలో నున్నప్పుడు ముందు శ్రేణిలో పురోగమించటం, దృఢనిశ్చయంతో ముందు కడుగు వేయడం నేర్చుకొని వుండాలి. ఇంతే గాదు. విప్లవం యిక ఉచ్ఛస్థాయిలో లేదని తెలియగానే, పరిస్థితులతోబాటు తన ఎత్తులనుకూడా మార్చుకుంటూ, సరిగా తిరోగమించటం, ఆ తిరోగమనంలో తాను ఆఖరువాడుగా వుండటం నేర్చుకోవాలి. అయితే ఆ తిరోగమనంలో చెల్లా

చెదురై పోరాదు. సంఘటిత రూపంలో ప్రశాంతంగా, గాభరా లేకుండా తిరోగమనం సాగాలి. శత్రువు కురిపించే అగ్నివర్షం నుండి తన అనుచరులను తిరోగమింప చేయడానికి గల ప్రతి చిన్న అవకాశాన్ని వినియోగించుకోవాలి. తన అనుచరులను తిరిగి సంయుక్తపరచి, తన శక్తులను సమకూర్చుకొని, తన శత్రువుపై కొత్తదాడి చేయటానికి సన్నాహం చేయాలి.

బోల్షివిక్కులు రెండవడ్యూమా ఎన్నికలలో పాల్గొన నిశ్చయించారు.

కాని మెన్షివిక్కులులాగ శాసనబద్ధ ప్రజాతంత్ర వాదులతో ఒక కూటమిగా ఏర్పడి, ప్రధానమైన 'శాసనసభ'లో నిర్మాణయుత కార్యకలాపాలను కొనసాగించు వుద్దేశంతో బోల్షివిక్కులు డ్యూమాకు వెళ్ళలేదు. విప్లవ ప్రయోజనాల కోసం దానిని ఒక వేదికగా వుపయోగించుకోవాలనే ఉద్దేశంతోనే వారు వెళ్లారు. మెన్షివిక్కుల దృష్టిలో జారుప్రభుత్వానికి కళ్ళెంవేయ సమగ్రతగల శాసనబద్ధ ప్రజాతంత్ర వాదులతో ఎన్నికల ఒడంబడికలు చేసుకోవాలనీ, డ్యూమాలో వారిని బలపరచాలని కోరింది.

పార్టీ సంస్థలో మెజారిటీ మెన్షివిక్కు కేంద్రకమిటీ పాలసీకి వ్యతిరేకంగా అభిప్రాయపడ్డారు. బోల్షివిక్కులు నూతన పార్టీ కాంగ్రెసును సమావేశపరచాలని కోరారు.

1907 మేలో పార్టీ అయిదవ కాంగ్రెస్ లండన్‌లో సమావేశమైంది. ఈ కాంగ్రెసు సమావేశంలో రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ (జాతీయ సోషల్ డెమాక్రటిక్ సంస్థలతో కూడ కట్టుకొని) దాదాపు లక్షా యాభై వేలమంది

సభ్యులను కలిగివుంది. కాంగ్రెస్‌కు మొత్తం 336 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అందులో బోల్షివిక్కులు 105 గురు. మెన్షివిక్కులు 97 మంది. మిగతావారు జాతీయ సోషల్ డెమాక్రటిక్ సంస్థలయిన పోలిష్, లెట్టిష్ సోషల్ డెమాక్రట్ల సంఘాలకూ, బండ్‌కూ ప్రతినిధులు. ఈ పైచెప్పిన సంస్థలన్నీ క్రిందటి కాంగ్రెసులో రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరుపార్టీలో చేర్చుకొనబడినవి.

ట్రాట్‌స్కీ ఈ అయిదవ కాంగ్రెస్‌లో తాను ఒక సెంట్రిస్టు (మధ్యస్థ) ముఠాను అనగా, సెమీ మెన్షివిక్కు ముఠాను ఏర్పరచడానికి ప్రయత్నించాడు. కాని అనుచరులను సంపాదించలేక పోయాడు.

పోలెండు, లాట్వియా ప్రతినిధులు బోల్షివిక్కులకు బలపరచడంవల్ల, కాంగ్రెసులో నిలకడయైన మెజారిటీ బోల్షివిక్కులకు లభించింది. కాంగ్రెసు ప్రధానసమస్యలలో ఒకటి, బూర్జువా పార్టీలయెడ ఎలాంటి వైఖరి అవలంబించాలి అన్నది. బోల్షివిక్కులకు, మెన్షివిక్కులకు యీ విషయమై ఇదివరకే రెండవ కాంగ్రెసులో తగాదా జరిగింది. శ్రామికవర్గేతర పార్టీలను గురించి అనగా బ్లాక్‌హండ్రడ్స్, అక్టోబరిస్టుల (అక్టోబరు 17 యూనియన్) శాసనబద్ధ ప్రజాతంత్రవాదుల, సోషలిస్టు-రివల్యూషనరీల గురించి అయిదవ కాంగ్రెస్, ఒక బోల్షివిక్ అంచనా వేసింది. ఈ పార్టీల విషయమై అనుసరించవలసిన బోల్షివిక్ ఎత్తుగడలను నిర్ణయించింది.

బోల్షివిక్కుల పాలసీని కాంగ్రెస్ అంగీకరించింది. బ్లాక్ హండ్రడ్ పార్టీలైన రష్యన్ ప్రజాసమితి, రాచరికవాదులు,

ఐక్యప్రభుసమితి (కౌన్సిల్ ఆఫ్ యునైటెడ్ నోబిలిటీ) మొద లగు వాటికి వ్యతిరేకంగాను, అక్టోబరిస్టులకు - అనగా వాణిజ్య పారిశ్రామిక పార్టీ, శాంతియుత పునరుద్ధరణ పార్టీ (Party of peaceful Renovation) మొదలగు పార్టీలకు - వ్యతిరేకం గాను, నిరంతర పోరాటాన్ని సాగించవలెనని కాంగ్రెస్ నిశ్చ యించింది. పైన జెప్పిన పార్టీలన్నీ బహిరంగ విప్లవ ప్రతిఘాత పార్టీలే.

లిబరల్ బూర్జువాను, అనగా శాసనబద్ధ ప్రజాతంత్ర వాద పార్టీని రాజీలేకుండా బట్టబయలు చేస్తూ వుండాలనే కాంగ్రెస్ సలహా యిచ్చింది. శాసనబద్ధ ప్రజాతంత్రవాద పార్టీ యొక్క కపట అసత్య "ప్రజాతంత్రాన్ని" బట్టబయలు చేయా లనీ, లిబరల్ బూర్జువా ప్రయత్నాలను ఎదుర్కోవాలనీ కాంగ్రెస్ సలహా యిచ్చింది.

ఇంకా నరోడ్నిక్ లేక ట్రుడోవిక్ పార్టీలనబడే వాటిని గురించి (పాప్యులర్ సోషలిస్టులు, ట్రుడోవిక్ ముఠా, సోషలిస్టులమని ముసుగు వేసుకునే ప్రయత్నాలను బయట పెట్టవలసిందని కాంగ్రెస్ సలహా యిచ్చింది. ప్రభుత్వపు మొదటి డ్యూమాలో సోషలిస్టు రివల్యూషనరీ మేధావుల నాయకత్వాన 9 6 లో ఏర్పడిన కొంతమంది రైతు సభ్యుల పెటీబూర్జువా ముఠాయే ట్రుడోవిక్ - అనువాదకుడు) కాని యీ పార్టీలు ఆకాలంలో ప్రజాతంత్ర పార్టీలనడంవల్లా, పట్టణ పల్లెలలోని పెటీబూర్జువా ప్రయోజనాలను వెలిబుచ్చే పార్టీ లవడంవల్లా, యీ పార్టీలతో అప్పుడప్పుడు ఒడంబడికలు చేసు కోడానికి కాంగ్రెస్ అనుమతించింది. ఒకేసారి సంయుక్తంగా

జార్ ప్రభుత్వంపైనా, శాసనబద్ధ ప్రజాతంత్ర బూర్జువాపైనా దెబ్బకొట్టేందుకుగాను, అప్పుడప్పుడు పైన చెప్పినట్లు ఒడంబడికలు చేసుకోవచ్చునని కాంగ్రెస్ అనుమతించింది.

ఈ కాంగ్రెస్‌కు పూర్వమే మెన్షివిక్కులు "లేబర్ కాంగ్రెస్" అంటూ ఒక సమావేశాన్ని ఏర్పరచాలని సూచించారు. సోషల్ - డెమాక్రట్లు, సోషలిస్టు - రివల్యూషనరీలు, అరాచకవాదులూ - వీరంతా యీ కాంగ్రెస్‌కు ప్రతినిధులుగా రావాలని మెన్షివిక్కుల అభిప్రాయం. ఎట్టి కార్యక్రమం లేని ఒక "విశాలమైన" పెటీబూర్జువా లేబర్ పార్టీని "నిష్పాక్షికమైన పార్టీ" లాంటి దానిని యీ "లేబరు కాంగ్రెస్" ఏర్పాటు చేయాలని వారి ఉద్దేశం. సోషల్ డెమాక్రటిక్ లేబరుపార్టీని రద్దుచేసి, శ్రామికవర్గ అగ్రశ్రేణిని (వాన్‌గార్డ్) పెటీబూర్జువా గుంపులో ముంచివేయటానికి, మెన్షివిక్కులు చేయుచున్న హానికరమైన ప్రయత్నమే యిది అని, లెనిన్ వారిని బట్టబయలు చేశాడు. లేబర్ కాంగ్రెస్‌ను సమావేశపరచాలన్న మెన్షివిక్కులను యీ కాంగ్రెస్ తీవ్రంగా ఖండించింది.

కార్మిక సంఘాల విషయమై కాంగ్రెస్ ప్రత్యేకమైన శ్రద్ధతీసుకుంది. కార్మిక సంఘాలు "తటస్థత" వహించాలని మెన్షివిక్కులు వాదించారు. మరొక మాటలో చెప్పాలంటే కార్మిక సంఘాలలో పార్టీ యొక్క నాయకత్వ పాత్రను వీరు వ్యతిరేకించారు. కాంగ్రెస్ మెన్షివిక్కుల తీర్మానాన్ని త్రోసిపుచ్చింది. బోల్షివిక్కులు ప్రతిపాదించిన తీర్మానాన్ని అంగీకరించింది. కార్మిక సంఘాలలో రాజకీయ నాయకత్వాన్ని, సిద్ధాంత (ideological) నాయకత్వాన్ని పార్టీ సంపాదించాలని యీ తీర్మానం తెలియజేసింది.

అయిదవ కాంగ్రెస్, బోల్షివిక్కులకు కార్మికవర్గ ఉద్యమంలో పెద్దవిజయాన్ని సమకూర్చింది. కాని దానితో వారు తమ తలలు తిరిగిపోయేటట్లు ప్రవర్తించలేదు. తమవిజయాలతో సంతృప్తిపడి, మెదలకుండా కూర్చొననూలేదు. లెనిన్ వారికి నేర్పింది యిదికాదు. మెన్షివిక్కులతో మరింత పోరాడవలసిన సమయం రానున్నదని బోల్షివిక్కులకు తెలుసు.

"ఒక ప్రతినిధి నోట్సు" అనే శీర్షిక క్రిందవ్రాస్తూ, **1907** లో కామ్రేడ్ స్టాలిన్ కాంగ్రెస్ ఫలితాలను ఈ క్రింది విధంగా అంచనా వేశాడు.

"రష్యాలోని పురోగామి కార్మికుల నందరినీ ఒక అఖిల రష్యన్ పార్టీగా విప్లవ సోషల్ డెమాక్రసీ జెండాక్రింద వాస్తవంగా ఐక్యపరచుటే లండన్ కాంగ్రెస్ యొక్క ప్రాముఖ్యత. అదే దాని ప్రధాన స్వభావము."

ఈ వ్యాసంలో కాంగ్రెస్ <u>అంగనిర్మాణాన్ని</u> గురించిన సమాచారాన్ని ఉదహరించాడు. ముఖ్య పారిశ్రామిక కేంద్రాలైన సెంట్‌పీటర్స్‌బర్గ్, మాస్కో, యూరల్స్, ఇవానోవో-వోజ్నసెన్స్క మొదలైన వాటినుండి బోల్షివిక్ ప్రతినిధులు కాంగ్రెస్‌కు ఎన్నుకోబడ్డారు. చిన్న ఉత్పత్తి ప్రధానంగావున్న జిల్లాలనుండి చేతిపారిశ్రామికులు, అర్ధ శ్రామికులూ ఎక్కువగానున్న ప్రదేశాలనుండియే గాక అచ్చమైన అనేక గ్రామీణ ప్రదేశాలనుండి కూడ, మెన్షివిక్ ప్రతినిధులు ఎన్నుకోబడ్డారు. కామ్రేడ్ స్టాలిన్ ఉదహరించిన సమాచారం వల్ల పై విషయం తేలింది.

కాంగ్రెస్ ఫలితాలను సమీక్షించుతూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"కాబట్టి బోల్షివిక్కుల ఎత్తుగడలు, పెద్ద పరిశ్రమలకు చెందిన శ్రామికుల ఎత్తుగడలన్నమాట. వర్గ వైరుధ్యాలు స్పష్టంగాను అతి తీవ్రంగాను ఉన్న ప్రదేశాలకు చెందిన శ్రామికుల ఎత్తుగడలన్నమాట. బోల్షివిజం నిజమైన శ్రామికుల ఎత్తుగడ. ఇక మెన్షివిక్కుల విషయం దానికి వ్యతిరేకం. చేతి పరిశ్రమ కార్మికులకు, రైతులకు చెందిన అర్ధ శ్రామికుల ఎత్తుగడలే మెన్షివిక్కుల ఎత్తుగడలు. వర్గ వైరుధ్యాలు సుస్పష్టంగా లేక వర్గకలహం తెరమరుగున ఉన్న ప్రదేశాలకు చెందిన ఎత్తుగడలు మెన్షివిక్కుల ఎత్తుగడలు. శ్రామికుల లోని అర్ధ - ధనస్వామికవ్యక్తుల (సెమీ బూర్జువా ఎలిమెంట్సు) ఎత్తుగడయే మెన్షివిజం. దీనినే పై లెక్కలు తెలియ జేస్తున్నాయి."

(రష్యన్ సోషల్ డెమోక్రెటిక్ లేబరుపార్టీ - 5వ కాంగ్రెస్ పూర్తి (Verbatium) రిపోర్టు. రష్యన్ ఎడిషన్ **1935, 11-12** పేజీలు)

మొదటి డ్యూమాను రద్దుపరచటంలో జారు రెండవ డ్యూమా తనకు యింకా అణకువగా వుంటుందని ఆశించాడు. కాని రెండవ డ్యూమా కూడా అతని ఆశలను తల్లక్రిందులు చేసింది. అందుచేత దాన్నికూడా రద్దుచేసి, మూడవ డ్యూమాను సమావేశపరచ దలచాడు. మరింత సంకుచితమైన ఓటింగు విధానంతో కూడిన ఈ డ్యూమా, తనకు ఎక్కువ అనుకూలంగా వుండగలదని జారు ఆశించాడు.

ఆయిదవ కాంగ్రెస్ జరిగిన కొద్దికాలానికి జూన్ 3 వ రాచరికఅతిరుగుబాటు (కూప్) అని పిలవబడే ఘటనను జారు ప్రభుత్వం కల్పించింది. 1907 జూన్ 3వ తేదీన రెండవ డ్యూమాను జార్ రద్దుచేశాడు. డ్యూమాలోని సోషల్ డెమాక్రటిక్ పక్షానికిచెందిన 65 మంది శాసన సభ్యులను అరెస్టుచేసి సైబీరియాకు ప్రవాసం పంపాడు. ఒక కొత్త ఎన్నిక చట్టాన్ని జారు ప్రభుత్వం ప్రకటించింది. కార్మిక – కర్షకుల హక్కులు ఇంకా తగ్గించ బడ్డాయి. జారు ప్రభుత్వం తన దాడిని కొనసాగించింది.

జారు మంత్రియైన స్టొలీపిన్, కార్మికుల, రైతులపైన తీవ్ర ప్రతీకార వుద్యమాన్ని మరింత ఎక్కువచేశాడు. ప్యూనిటివ్ సైన్యాలచే వేలకొలది విప్లవకారులైన రైతులను, కార్మికులను ఉరితీయించాడు- కాల్పించాడు. జారు ప్రభుత్వపు చీకటి కొట్లలో విప్లవకారులను మానసికంగాను, శారీరకంగాను చిత్రహింసలు పెట్టారు. ముఖ్యంగా కార్మికవర్గ సంఘాలపైన, ప్రత్యేకంగా బోల్షివిక్కులపైన, పైశాచిక వేటసాగింది. ఫిన్లండులో దాక్కొనివున్న లెనిన్ కోసం జార్ కుక్కలు వెదుకసాగాయి. విప్లవనాయకునిపై పగతీర్చుకోవాలని వారు తలచారు. 1907 డిసెంబరులో ప్రాణాపాయానికికూడా తెగించి, విదేశాలకు లెనిన్ పోగలిగాడు. తిరిగి లెనిన్ ప్రవాసిఅయ్యాడు.

స్టొలీపిన్ అభివృద్ధి నిరోధకత్వమనే అంధకార యుగం ప్రారంభమైంది.

రష్యా ప్రథమవిప్లవం ఆ విధంగా అపజయంతో ముగిసింది.

ఈ అపజయానికి దోహదమైన కారణాలివి:

(1) విప్లవంలో జారుకు వ్యతిరేకంగా, కార్మిక - కర్షకుల సుస్థిర సమ్మేళనం ఇంకా ఏర్పడలేదు. భూస్వాములపై పోరాటానికి రైతులు దుమికారు. వారు కార్మికులతో సమ్మేళనమై, భూస్వాములను ఎదిరించడానికి యిష్టపడేవున్నారు. కాని జారును పడద్రోస్తేగాని భూస్వాములను పడద్రోయలేమన్న సంగతిని వారింకా గ్రహించలేదు. భూస్వాములతో చేయిచేయికలిపి జారు పనిచేస్తున్నాడన్న సంగతిని గ్రహించలేదు. ఇంకా రైతుల్లో అనేకమందికి జారులో నమ్మకముంది. జార్ ప్రభుత్వ డ్యూమాలో వారు ఆశలు పెట్టుకున్నారు. అందుచేతనే రైతులలో తగుభాగం జారును కూలద్రోయడానికి కార్మికులతో సమ్మేళనమైనందుకు యిష్టపడలేదు. రైతులకు నిజమైన విప్లవకారులగు బోల్షివిక్కులపై కంటే, రాజీపడే సోషలిస్టు రివల్యూషనరీ పార్టీపైన ఎక్కువ నమ్మకం వుంది. తత్ఫలితంగా భూస్వాములపై రైతులు సాగించిన పోరాటం తగినంతగా సంఘటితం కాలేదు. లెనిన్ యిలా అన్నాడు:

"రైతుల పోరాటాలు చాలా చెదురుగాను సంఘటితం కాకుండాను, తగినంత తీవ్రత లేకుండాను వున్నాయి. అది విప్లవం ఓడిపోవటానికి ప్రధాన కారణాలలో ఒకటి."

(లెనిన్ కలెక్టెడ్ వర్క్సు - రష్యన్ ఎడిషన్, 19 వ వాల్యూం 354 పేజీ)

(2) జారు ప్రభుత్వాన్ని కూలద్రోయడంలో కార్మికులతో కలియడానికి, రైతులలోని ఒక పెద్దభాగం తలయొగ్గక

పోవడంవల్ల, సైనికుల ప్రవర్తనలో కూడా దాని ప్రభావం పడింది. సైనికులలో చాలమంది సైనికుల దుస్తులు ధరించిన రైతు బిడ్డలే. జారు సైన్యంలో కొన్ని దళాలలో అశాంతి, తిరుగుబాటు చెలరేగినమాట నిజమే. కాని సైనికులలో అధిక సంఖ్యాకులు కార్మిక సమ్మెలను, తిరుగుబాట్లను అణచటంలో జారుకు సహాయపడ్డారు.

(3) కార్మికుల పోరాటం కూడా తగినంతగా ఏకీకృతం కాదు. కార్మికవర్గంలో ముందడుగిడిన భాగాలు 1905 లో వీరోచిత విప్లవ పోరాటాన్ని ప్రారంభించాయి. వెనుకబడిన భాగాలు, అంటే పారిశ్రామికంగా వెనుకబడిన ప్రదేశాలలోని కార్మికులు, గ్రామాలలో నివసించే కార్మికులు, పోరాటంలోకి నెమ్మదిగా వచ్చారు. విప్లవపోరాటంలో వారు పాల్గొనటం ముఖ్యంగా, 1906 లో తీవ్రమైంది. కాని అప్పటికే కార్మికవర్గ అగ్రశ్రేణి (Vanguard) చాలవరకు బలహీనపడింది.

(4) కార్మికవర్గం విప్లవంలో అన్నిటికన్న ప్రధానమైన ముఖ్యమైన శక్తి. కాని కార్మికవర్గపార్టీ అనుచరులలో తగినంత ఐక్యతా, దృఢమైత్రి (Solidarity) లేవు. కార్మిక వర్గ పార్టీ యైన రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరుపార్టీ, బోల్షివిక్కులు, మెన్షివిక్కులు అని రెండు ముఠాలుగా చీలివుంది. బోల్షివిక్కులు అచంచలమైన విప్లవ పంథాను అనుసరించారు. జారు ప్రభుత్వాన్ని కూలద్రోయమని కార్మికులను ఆదేశించారు. కాని మెన్షివిక్కులు తమరాజీ ఎత్తుగడలద్వారా విప్లవాన్ని కుంటుపరచారు. కార్మికులలో అధిక సంఖ్యాకుల మనస్సులను

గందరగోళ పరచారు. కార్మిక వర్గాన్ని చీల్చారు. అందుచే కొన్ని సమయాల్లో విప్లవ కార్మికులు ఏకీకృతంగా పని చేయలేక పోయారు. తన అనుచరులలో ఇంకా ఐక్యత లేనటు వంటి కార్మికవర్గం, విప్లవానికి నిజమైన నాయకత్వం వహించ లేకపోయింది.

(5) 1905 విప్లవాన్ని అణచుటలో జారు నిరంకుశ ప్రభుత్వం, పశ్చిమ యూరోపియన్ సామ్రాజ్యవాదుల సహా యాన్ని పొందింది. రష్యాలో తను పెట్టుబడులు, తాము పొందే విపరీత లాభాలు పోతాయని, విదేశీ పెట్టుబడిదారులు భయపడ్డారు. పైగా రష్యన్ విప్లవం విజయం పొందితే ఇతర దేశాల కార్మికులు కూడా విప్లవానికి పూనుకుంటారని వారు భయపడ్డారు. అందుచే పశ్చిమ - యూరోపియన్ సామ్రాజ్య వాదులు కసాయి జారుకు సహాయపడ్డారు. విప్లవాన్ని అణ చేందుకై ఫ్రెంచి బ్యాంకర్లు, జారుకు పెద్ద ఋణమిచ్చారు. రష్యన్ జారు చక్రవర్తికి సహాయంగా అవసరమైతే కలుగ చేసుకోడానికి, జర్మనీలో కైజర్ చక్రవర్తి పెద్ద సైన్యాన్ని సిద్ధంగా వుంచాడు.

(6) 1905 సెప్టెంబరులో జపానుతో సంధి చేసుకో వడం జారుకు చాలా సహాయపడింది. యుద్ధంలో ఓటమీ, ప్రమాదకరమైన విప్లవ అభివృద్ధీ, సంధి పత్రంపై సంతకం పెట్టడానికి జారును త్వరపరచాయి. యుద్ధంలో నష్టం జారు ప్రభుత్వాన్ని బలహీన పరచింది. సంధి పత్రంపై సంతకం చేయడం జారు పరిస్థితిని బలపరచింది.

# క్లుప్తసారాంశం

మన దేశ అభివృద్ధిలో ఒక సంపూర్ణ చారిత్రక దశ, మొదటి రష్యన్ విప్లవంలో యిమిడివుంది. ఈ చారిత్రక దశను రెండు కాలాలుగా విభజించవచ్చు. అక్టోబరు సర్వవ్యాపిత రాజకీయ సమ్మెనుండి, డిశంబరునాటి సాయుధ తిరుగు బాటుకు, విప్లవ తరంగం పెల్లుబికిన కాలం మొదటిది. ఈ కాలంలో, మంచూరియా యుద్ధరంగాల్లో ఓడిపోయిన జారు బలహీనతను అవకాశంగా తీసుకొనుట, బులీజిన్ డ్యూమాను తుడిచిపెట్టుట, ఒకదాని తర్వాత మరొకటి జారునుండి సంస్కరణలను ( concessions )లాగుకొనుట జరిగాయి. జపానుతో సంధి చేసుకొని, సంబాళించుకున్న జారుప్రభుత్వం, విప్లవ మంటే లిబరల్ బూర్జువాకున్న భయాన్ని ఆధారంగా తీసుకొని, రైతుల వూగిసలాటను అవకాశంగా తీసుకొని, విట్టీ డ్యూమా రూపంలో వారికెంత బిచ్చం పారేసి, కార్మికవర్గంపై విప్లవంపై తిరుగుదాడి సాగించిన కాలం రెండవది.

విప్లవం జరిగిన మూడేండ్ల కొద్దికాలంలోనే (1905 - 1907) కార్మికవర్గం, రైతాంగం విలువైన రాజకీయ పాఠాలు నేర్చుకున్నాయి. మామూలు శాంతియుతపరిణామంలో ముప్పై ఏండ్లలోనైనా అవి ఆ పాఠాన్ని నేర్చుకోలేవు. శాంతియుత పరిణామకాలంలో అనేక శతాబ్దాలలో స్పష్టంకానటువంటి విషయాలను విప్లవ కాలంలో కొద్ది సంవత్సరాలు స్పష్టంచేశాయి.

విప్లవం, ప్రజలకు జార్ ప్రభుత్వం గర్భశత్రువని తెలియజేసింది. ఏదో సామెత చెప్పినట్లు జార్ ప్రభుత్వం గూనిది. ఆ గూని పుడకలతోగాని పోదు.

లిబరల్ బూర్జువా ప్రజలతోగాక జారుతో సమ్మేళనం కోరుతోంది. అది విప్లవ ప్రతిఘాతశక్తి. దానితో ఒడంబడికకు రావడం ప్రజలకు ద్రోహం చేయుటతో సమానమవుతుంది - అని విప్లవం తెలియజేసింది.

బూర్జువా ప్రజాతంత్ర విప్లవానికి నాయకత్వం కార్మిక వర్గమే వహించగలదు. కార్మికవర్గ మొక్కటే శాసనబద్ధ ప్రజాతంత్ర లిబరల్ బూర్జువాను ప్రక్కకునెట్టి, దానికి రైతాంగంపై గల పలుకుబడిని నాశనంచేసి భూస్వాములను పార ద్రోలి విప్లవాన్ని తుదిదాకా కొనసాగించగలదని, సోషలిజానికి మార్గాన్ని సుకరం చేయగలదని, విప్లవం తెలియజేసింది. ఆఖరు విషయం : కష్టపడే రైతాంగం ఎంత వూగిసలాడు చున్నా - కార్మికవర్గంతో సమ్మేళనంకాగల ఒకే ఒక ప్రధానమైన శక్తియని విప్లవం తెలియజేసింది.

విప్లవకాలంలో రెండు పోకడలు - బోల్షివిక్ మెన్షివిక్ పోకడలు, రష్యన్ సోషల్ - డెమాక్రటిక్ పార్టీలో ఘర్షణ పడుతున్నాయి. సాయుధ తిరుగుబాటుతో జార్‌ను కూల ద్రోయుట, కార్మికవర్గ నాయకత్వపాత్ర (హెజిమొనీ), శాసన బద్ధ ప్రజాతంత్ర బూర్జువాను వేరుచేయుట, రైతులతో సమ్మేళనం, రైతు-కార్మిక ప్రతినిధులతోగూడిన విప్లవ తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పరచుట, విప్లవాన్ని విజయవంతంగా ముగించుట - ఇదీ బోల్షివిక్కులు విప్లవాన్ని విస్తరింప చేయడానికి అనుసరించిన మార్గం. తద్వ్యతిరేకంగా మెన్షివిక్‌లు విప్లవాన్ని రద్దుపరచే కార్యక్రమాన్ని అవలంబించారు. జార్ ప్రభుత్వాన్ని తిరుగుబాటు ద్వారా కూలద్రోయడానికి బదులు

దాన్ని సంస్కరించి, "బాగుపరచా" లన్నారు. శ్రామికవర్గ నాయకత్వానికి (హెజిమొనీ) బదులుగా లిబరల్ బూర్జువా నాయకత్వాన్ని సూచించారు. రైతాంగంతో సమ్మేళనానికి బదులుగా శాసనబద్ధ ప్రజాతంత్ర బూర్జువాతో సమ్మేళనం కావాలన్నారు. విప్లవ తాత్కాలిక ప్రభుత్వానికి బదులుగా, దేశంలోని "విప్లవశక్తుల"ను ప్రభుత్వ ద్వ్యామా కేంద్రమని సూచించారు.

ఆవిధంగా మెన్షివిక్కులు రాజీఅనే ఊబిలో దిగబడ్డారు. కార్మికవర్గంపైన బూర్జువా పలుకుబడికి సాధనాలయ్యారు. కార్మికవర్గం లోపలనే పక్కా-బూర్జువా ఏజెంట్లుగా తయారయ్యారు.

పార్టీలోను, దేశంలోను బోల్షివిక్కులొక్కరే మార్క్సిస్టు విప్లవశక్తియని నిరూపించబడింది.

అలాంటి తీవ్రవిభేదాలుండటంవల్ల, బోల్షివిక్కు-మెన్షివిక్కు అనే రెండుపార్టీలుగా, రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ సహజంగానే చీలివున్నదనే విషయం రుజువయింది. పార్టీలోని వాస్తవ అంతరంగిక పరిస్థితులను నాల్గవకాంగ్రెస్ ఏమీ మార్చలేదు. పార్టీలో నామకః వున్న ఐక్యతను నిలిపి, ఏదో కొంత బలపరచింది. పార్టీ అయిదవకాంగ్రెస్, పార్టీలో బోల్షివిక్కు జెండాక్రింద వాస్తవిక ఐక్యతను ఏర్పరచడానికి ఒక అడుగు ముందుకు వేసింది.

విప్లవోద్యమాన్ని సింహావలోకనంచేస్తూ, మెన్షివిక్కుల పోకడ రాజీపోకడ అని ఖండించింది. బోల్షివిక్కుల పోకడ మార్క్సిస్టు విప్లవపోకడ అని, పార్టీ అయిదవకాంగ్రెస్ అంగీక

రించింది. అలాచేయుటలో మొదటి రష్యన్ విప్లవ పరిణామం యిదివరకే ధృవపరచిన దానినంతటినీ, పార్టీ కాంగ్రెస్ మరొక సారి ధృవపరచింది.

విప్లవం యీక్రింది విషయాలను తెలియజేసింది: సమయం పరిపక్వమైనప్పుడు, ఎలా ముందుకువెళ్ళాలో బోల్షివిక్కులను తెలుసు. ముందు శ్రేణిలో ముందుకు సాగుట, ముట్టడిలో యావత్ ప్రజలను నడుపుట వారు నేర్చుకున్నారు. ఇంతేగాక ఈ క్రిందివిషయాలనుకూడ విప్లవం తెలియజేసింది. పరిస్థితి ప్రతికూలమైన మార్గాన్ని పట్టినపుడు, విప్లవం వెనుకడుగు వేసినపుడు, ఎలాక్రమమార్గాన తిరోగమించాలో బోల్షివిక్కులను తెలుసు. తమ అనుచరులను నిలబెట్టుకొని, తమ శక్తులను కూడగట్టుకొని, నూతన పరిస్థితుల కనుగుణ్యంగా తమ అనుచరులను పునర్నిర్మించి, మున్ముందు మరొకసారి శత్రువుపై దాడిదీయడానికిగాను – బోల్షివిక్కులు భయాందోళనలు లేకుండా క్రమబద్ధంగా తిరోగమించడం నేర్చుకున్నారు.

శత్రువును సరిగా ఎలా దెబ్బకొట్టాలో తెలియకుండా అతన్ని ఓడించటం అసాధ్యం.

క్రమబద్ధంగా, భయగందరగోళాలు లేకుండా తిరోగమించడం తెలియకపోతే, అపజయం సంభవించినప్పుడు, సర్వనాశనాన్ని తప్పించుకొనుట అసంభవం.

# నాల్గో అధ్యాయం

## స్టోలీపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో
## మెన్షివిక్కులు - బోల్షివిక్కులు
## బోల్షివిక్కులు స్వతంత్ర మార్క్సిస్టు పార్టీగా తయారగుట

[ 1908 – 12 ]



స్టోలోపిన్ అభివృద్ధి నిరోధం-ప్రతికూల మేధావి వర్గంలో శిధిలత - క్షీణత - పార్టీ మేధావులలో కొంత భాగం, మార్క్సిజానికి శత్రువులైన వారిలోకి జారి పోవుట - మార్క్సిస్టు సిద్ధాంతాన్ని కుసంస్కరించే ప్రయత్నం - "భౌతిక వాదం - అనుభవవాద విమర్శ" (Materialism and Emprio-criticism) అనే గ్రంథంలో సిద్ధాంత కుసంస్కర్తలను (రివిజనిస్టులను) లెనిన్ ఖండించుట - మార్క్సిస్టు పార్టీ సిద్ధాంతపు పునాదులను లెనిన్ సమర్థించుట.

**1907** జూన్ మూడవ తేదీన జార్ ప్రభుత్వం తన రెండవ డ్యూమాను రద్దు చేసింది. దీనిని చరిత్రలో "జూన్ మూడు తిరుగుబాటు"గా (కూప్) వర్ణించడం ఆచారం. ప్రభుత్వపు మూడవ డ్యూమా ఎన్నికల విషయమై ఒక కొత్త చట్టాన్ని జార్ ప్రభుత్వం ప్రకటించింది. డ్యూమా అనుమతితోనే కొత్త చట్టాలను ప్రకటించాలి అని చెప్పిన తన 1905 అక్టోబరు 17 వ నాటి ప్రణాళికను, తానే ఉల్లంఘించింది. ప్రభుత్వపు రెండవ డ్యూమాలోని సోషల్ - డెమాక్రటిక్ ముఠాను కోర్టులో విచారణ చేసింది. కార్మికవర్గ ప్రతినిధులను

కఠినశిక్షలకు, ప్రవాస శిక్షలకు గురిచేసింది. డ్యూమాలో భూస్వాముల, వ్యాపార, పారిశ్రామిక, బూర్జువా ప్రతినిధుల సంఖ్య తగినంత హెచ్చేటట్లు ఎలక్షన్ చట్టం తయారుచేయ బడింది. అంతేగాక అసలే తక్కువగానున్న కార్మికుల, రైతుల ప్రాతినిధ్యం మునుపటి దానిలో కొద్దిభాగమే అయ్యేటట్లు తగ్గించబడింది. మూడవ డ్యూమాలో బ్లాక్ హండ్రెడ్సు, శాసనబద్ధ ప్రజాతంత్రవాదులు, అధిక సంఖ్యాకులయ్యారు. మొత్తం 442 మంది ప్రతినిధులలోనూ 171 మంది కుడిపక్షం వారు (వీరినే బ్లాక్ హండ్రెడ్సు అంటారు). 113 గురు అక్టోబ రిస్టులు లేక వారి బంధువర్గ ముఠాలు, 101 మంది శాసనబద్ధ ప్రజాతంత్రవాదులు - వారి బంధువర్గ ముఠాలు, 13 గురు ట్రుడోవిక్ పక్షమువారు, 18 గురు సోషల్ డెమాక్రట్లు వున్నారు.

కుడిపక్షంవారు (డ్యూమాలో కుడిప్రక్క బెంచీలపై కూర్చోవడంవల్ల వీరికాపేరు వచ్చింది) కార్మికులకు, రైతులకు ఘోర శత్రువులైన బ్లాక్ హండ్రడ్స్ ఫ్యూడల్ భూస్వాముల ప్రతినిధులు. ఈ భూస్వాములు రైతు ఉద్యమాల్ని అణచివేసి నప్పుడు రైతులను సమూహంగా కొరడా దెబ్బలకు, తుపాకి కాల్పులకు గురిచేశారు. యూదులపై వేటను ప్రోత్సహిం చారు. విప్లవ కాలంలో మీటింగులు జరిగిన ప్రదేశాలను అతిక్రూరంగా తగులబెట్టారు. ప్రదర్శనాలు గావించే కార్మికు లను చిత్రహింసలు పెట్టారు. కార్మిక ప్రజలను అతి నిర్దాక్షి ణ్యంగా అణచివేయాలనీ - జార్‌కు అంతులేని అధికారాన్ని యివ్వాలనీ, వీరు కోరారు. 1905 అక్టోబర్ 17వ నాటి జార్ ప్రణాళికకు వీరు వ్యతిరేకులు.

అక్టోబరిస్టు పార్టీ లేక అక్టోబరు 17 వ యూనియన్, డ్యూమాలో కుడిపక్షం వారికి చాలా సన్నిహితంగా వుండే వారు. పెద్ద పెద్ద పారిశ్రామిక పెట్టుబడిదారుల ప్రయోజనా లకూ, పెట్టుబడిదారీ పద్ధతులపైన తమ ఎస్టేట్లను నడుపుతున్న పెద్ద భూస్వాముల ప్రయోజనాలకూ, అక్టోబరిస్టులు ప్రతి నిధులు (1905 విప్లవ ప్రారంభంలో శాసనబద్ధ ప్రజాతంత్ర పార్టీకి చెందిన పెద్ద భూస్వాములు చాలమంది అక్టోబరిస్టులతో కలసిపోయారు). కుడిపక్షంవారికీ, అక్టోబరిస్టులకు వున్న విభేద మల్లా, అక్టోబరిస్టులు అక్టోబరు 17వ నాటి ప్రణాళికను - మాటలలోనైనా అంగీకరించడం. అక్టోబరిస్టులు జార్ ప్రభు త్వపు స్వదేశ, విదేశ రాజనీతిని పూర్తిగా సమర్థించారు.

మొదటి రెండు డ్యూమాలలో కంటె, మూడవ డ్యూమాలో, శాసనబద్ధ ప్రజాతంత్రపార్టీకి చాల తక్కువ స్థానాలు లభించాయి. దీనికి కారణం, భూస్వాముల ఓట్లలో కొంతభాగం శాసనబద్ధ ప్రజాతంత్రవాదులకు బదులుగా అక్టో బరిస్టులకు పోవడం.

మూడవ డ్యూమాలో ట్రుడోవిక్ అనే పెటీ - బూర్జువా ప్రజాతంత్రవాదులు చిన్న ముఠా ఒకటి వుంది. వారు శాసనబద్ధ ప్రజాతంత్రవాదులకు, కార్మిక ప్రజాతంత్ర వాదులకు (బోల్షివిక్కులు) మధ్య వూగిసలాడేరు. డ్యూమాలో ట్రుడో విక్ చాలాబలహీన పక్షమైనప్పటికీ, వారు జనసామాన్యానికి, అనగా రైతాంగ జనసామాన్యానికి ప్రాతినిధ్యం వహించరని లెనిన్ తెలియజేశాడు. శాసనబద్ధ ప్రజాతంత్రవాదులకూ కార్మిక ప్రజాతంత్రవాదులకూ మధ్య వూగిసలాడడం ట్రుడో

విక్కి సహజమే. ఎందువల్లనంటే చిన్న చిన్న ఆస్తిదారుల వర్గ పరిస్థితి మూలంగానే ఆ వూగిసలాట సంభవిస్తుంది. "పెటీ - బూర్జువా ప్రజాతంత్రవాదులకు సహాయం చేయవలసిన కర్తవ్యాన్ని లిబరల్సుయొక్క పలుకుబడినుండి వారిని బయటకు లాగవలసిన కర్తవ్యాన్ని, కుడిపక్షంవారికి వ్యతిరేకంగానే కాకుండా విప్లవ ప్రతీఘాతకులగు శాసనబద్ధ ప్రజాతంత్రవాదులకు వ్యతిరేకంగాకూడ, ప్రజాతంత్రశిబిరాన్ని సమీకరించవలసిన కర్తవ్యాన్ని" బోల్షివిక్కు ప్రతినిధులకు, కార్మిక ప్రజాతంత్రవాదులకు లెనిన్ నిర్దేశించాడు. (లెనిన్ - సెలక్టెడ్ వర్క్సు - ఇంగ్లీషుఎడిషన్ -మాస్కో - 1947, 1వ వాల్యూం 535 వ పేజీ)

1905 విప్లవకాలంలో, ముఖ్యంగా అది అపజయం పొందినతర్వాత, శాసనబద్ధ ప్రజాతంత్రవాదులు, విప్లవ ప్రతీఘాతక శక్తిగా మరింత బట్టబయలయ్యారు. "ప్రజాతంత్ర"మనే ముసుగును తొలగించుకొని, రాచరిక వాదులుగా, జార్ ప్రభుత్వాన్ని సమర్థించేవారుగా మాటిమాటికి వారు ప్రవర్తించారు. 1909 లో ప్రముఖ శాసనబద్ధ ప్రజాతంత్రవాదుల రచయితల ముఠా ఒకటి విఖీ (Vekhi-మైలురాళ్లు) అనే వ్యాససంపుటిని ప్రకటించింది. విప్లవాన్ని అణచినందుకు, జారును, బూర్జువా తరఫున వారు అభినందించారు. కొరడాలతో (Knout), వురికంబాలతో పరిపాలించే జార్ ప్రభుత్వానికి యిచ్చకాలు పలుకుతూ, దాసి దయా దాక్షిణ్యాలకు దేవెరించుతూ, శాసనబద్ధ ప్రజాతంత్రవాదులు ఈ గ్రంథంలో సిగ్గులేకుండా ఇలా అన్నారు: "ప్రజల ఆగ్రహాల నుండి మనలను

(లిబరల్ బూర్జువాను) తన బాయొనెట్లతోను, జైళ్ళతోను జార్ ప్రభుత్వం ఒక్కటే రక్షించుతూంది. అలాంటి ప్రభుత్వాన్ని మనం ఆశీర్వదించాలి."

ప్రభుత్వ రెండవ డ్యూమాను రద్దుపరచి, డ్యూమాలోని సోషల్ డెమాక్రటిక్ పక్షాన్ని వదలించుకొని, జార్ ప్రభుత్వం, శ్రామికవర్గానికి చెందిన ఆర్థిక, రాజకీయ సంఘాలను నాశనంచేయడం ప్రారంభించింది. కాన్విక్ట్ జైళ్ళు, కోటలు, ప్రవాస ప్రదేశాలు విప్లవకారులతో పూర్తిగా నిండిపోయాయి. వారిని జైళ్ళల్లో క్రూరంగా కొట్టి, బాధించి, నానా చిత్రహింసలు పెట్టింది ప్రభుత్వం. బ్లాక్ - హండ్రడ్స్ హింసాకాండ అడ్డూ, ఆపు లేకుండా విజృంభించింది. జార్ మంత్రి అయిన స్టోలోపిన్ దేశమంతటా వురికంబాలు నెలకొల్పాడు. వేలకొలది విప్లవకారులు ఉరితీయబడ్డారు. ఆరోజుల్లో ఈ ఉరి కంబాలను "స్టోలీపిన్ నెక్ టై" లని పిలిచేవారు.

రైతుల, కార్మికుల విప్లవోద్యమాన్ని అణచే ప్రయత్నాలలో జారు ప్రభుత్వం నిర్బంధవిధానం, ప్రతీకార శిక్షలు, కాల్పులు, జైళ్ళు, కఠినశిక్షలు మొదలగు వాటితోనే సంతృప్తి పడలేదు. "చిన్నతండ్రి జారు" (రష్యాలో పెద్దతండ్రి దేవుడు, చిన్నతండ్రి జారుచక్రవర్తి అని పిలవడంకద్దు - అనువాదకుడు) అంటే రైతులకున్న నిర్వ్యాజమైన విశ్వాసం క్రమంగా అంతరానమై పోతున్నదని గ్రహించి, ఆందోళన పడసాగింది. అందుచేత ఒక పెద్దకుట్రచేయ పూనుకుంది. గ్రామసీమలో తనకు దృఢమైన అండను నిర్మించుకోవాలని భావించింది. గ్రామీణ బూర్జువా అనే పెద్దవర్గం - అంటే కులక్ వర్గమే - అలాంటి అండను ఇవ్వగలవర్గం.

1906 నవంబరు 9 వ తేదీన స్టోలీపిన్ ఒక కొత్త వ్యవసాయ చట్టాన్ని ప్రకటించాడు. దీనివలన రైతులు కమ్యూన్‌లను (సాముదాయక భూములు) వదలి, ప్రత్యేకంగా వ్యవసాయ క్షేత్రాలను ఏర్పరచుకొనే అవకాశం కలిగింది. స్టోలీపిన్ వ్యవసాయచట్టం సాముదాయకంగా భూమిని అనుభవించే పద్ధతిని భగ్నంచేసింది. సాముదాయక భూములనుండి విడిపోయి, తమ భాగాలను స్వంతఆస్తిగా స్వాధీనం చేసుకోవలసిందని రైతులను ప్రోత్సహించింది. తమ భాగాలను యిప్పుడు రైతులు అమ్ముకోవచ్చు. పూర్వం అలా అమ్ముకోనిచ్చేవారుకాదు. రైతుగ్రామ సంఘాన్ని (కమ్యూన్‌ను) వదలి వెళ్ళినప్పుడు అది అతనికి ఏకఖండ భూమిని (రష్యన్ భాషలో ఖుతార్, ఓట్రుబ్ **Khutor, Otrub** అని పిలిచేవారు) యిచ్చితీరాలి.

ఇప్పుడు ధనికరైతులు, (కులక్‌లు) బీదరైతుల భూమిని తక్కువధరలకు కొనుక్కునే అవకాశం లభించింది. ఈ చట్టం ప్రకటించిన కొన్నిసంవత్సరాలకే పదిలక్షలకుపైగా రైతులు తమ భూమినంతా పోగొట్టుకుని, సర్వనాశనం అయ్యారు. బీదరైతులు తమ భూమిని పోగొట్టుకున్న కొలదీ, కులక్‌ల భూఖండాల సంఖ్య పెరిగింది. జీతమిచ్చి కూలీలను – వ్యవసాయ కూలీలను – పెద్దపెట్టున నియమించే శాశ్వత ఎస్టేటుగా కొన్ని సందర్భాలలో ఇవి మారేయి. ప్రభుత్వం గ్రామసంఘాల (కమ్యూన్)లోని మంచి భూమిని కులక్ రైతులకు యిచ్చునట్లు రైతులను ఒత్తిడిచేసింది.

రైతుల "విమోచన" కాలంలో భూస్వాములు వారి భూములను కొల్లగొట్టారు. ఇప్పుడు కమ్యూన్‌లనుండి వారి

భూమిని కులక్‌లు కొల్లగొట్టసాగారు. కమ్యూన్‌లలోని మంచి ప్లాటులను కాజేయడమేగాక బీదరైతుల భూములను తక్కువ ధరలకు కొనివేశారు.

భూములు కొనేందుకు, వ్యవసాయ సరంజామాకు, జారు ప్రభుత్వం, కులక్‌లకు పెద్దపెద్ద ఋణాలను యిచ్చింది. కులక్‌లను చిన్నభూస్వాములుగా తయారుచేసి, జారు నిరంకుశ ప్రభుత్వాన్ని విశ్వాసంతో సంరక్షించే వారిగా వారిని తయారు చేయాలని స్టోలీపిన్ వాంఛించాడు.

1906 - 15 సంవత్సరాల మధ్య అంటే 9 ఏండ్ల లోపు ననే 20 లక్షల కుటుంబాలు గ్రామ సంఘాలను (కమ్యూన్‌లను) వదలి వెళ్లాయి.

స్టోలీపిన్ విధాన ఫలితంగా చిన్న భూఖండాలు గల రైతుల స్థితి, బీదరైతుల స్థితి, ఎన్నడూ లేనంత అధ్వాన్నస్థితికి మారింది. రైతాంగంలో వ్యత్యాసం మరింత స్పష్టంగాజొచ్చింది. కులక్ రైతులతో సాధారణ రైతులు ఘర్షణ పడసాగారు.

ఇంతేగాక జార్‌ప్రభుత్వ మున్నంతకాలం భూస్వాముల శాసనబద్ధ ప్రజాతంత్రవాదుల ప్రభుత్వద్వారామా వున్నంతవరకు ఎస్టేటు భూములను తాము స్వాధీనపరచుకోలేమని కూడా రైతులు గ్రహించసాగారు. కులక్‌భూఖండాలు అధికసంఖ్యలో ఏర్పడుతున్న రోజుల్లో (1907 - 09) రైతు ఉద్యమం తగ్గిపో జొచ్చింది. కాని త్వరలోనే (1910 - 11) సంవత్సరాలలోను ఆతర్వాతను, గ్రామ కమ్యూన్ సభ్యులకు, కులక్ రైతులకు మధ్య జరిగిన దెబ్బలాటలవల్ల, రైతు ఉద్యమం కులక్ రైతులకు భూస్వాములకు వ్యతిరేకంగా తీవ్రం కాజొచ్చింది.

విప్లవానంతరం పరిశ్రమలలోకూడ పెద్దమార్పులు జరిగాయి. పరిశ్రమల కేంద్రీకరణ అనగా కొత్త పరిశ్రమల విస్తరణ, వృద్ధియగుచున్న శక్తివంతమైన పెట్టుబడిదారీ ముఠాల చేతులలోకి పరిశ్రమ కేంద్రీకరింప బడుట, చాలత్వరిత గతిని కొనసాగింది. 1905 విప్లవానికి పూర్వంకూడా పెట్టుబడిదారులు సంఘాలుగా ఏర్పడ మొదలు పెట్టారు. తమదేశంలో ధరలను పెంచి, ఆవిధంగా పొందిన అధిక లాభాలతో 'ఎగుమతి వర్తకాన్ని ప్రోత్సహించడమూ, తద్వారా విదేశాలలో తమవస్తువులను తక్కువ ధరలకు డంప్‌చేసి (కొల్లలు కొల్లలుగా గుమ్మరించి) విదేశీ మార్కెట్లను స్వాధీన పరచుకోటమూ యీ సంఘాల ఉద్దేశం. ఈ పెట్టుబడిదారీ సంఘాలు (గుత్త వ్యాపార సంఘాలు) ట్రస్టులని, సిండికేట్లని పిలువబడేవి. విప్లవానంతరం వాటిసంఖ్య మరింత పెరిగింది. పెద్దబ్యాంకుల సంఖ్యకూడా హెచ్చింది. పరిశ్రమలలో వీటిపాత్రకూడా హెచ్చింది. రష్యాలో విదేశీయుల పెట్టుబడి ప్రవాహం హెచ్చింది.

ఆవిధంగా రష్యాలోని పెట్టుబడిదారీ విధానం, గుత్త వ్యాపార పెట్టుబడిదారీ విధానంగా, సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ విధానంగా, పెద్దపెట్టున మార జొచ్చింది. అనేక సంవత్సరాలుగా మందకొడిగా వున్న పరిశ్రమలు తిరిగి తలెత్త సాగాయి. బొగ్గు,లోహం, నూనె, పంచదార, టెక్స్టైయిల్స్ (బట్టలు) పరిశ్రమల వుత్పత్తి హెచ్చింది. ధాన్యం ఎగుమతి విస్తరించింది.

ఆ కాలంలో రష్యా పారిశ్రామికంగా కొంత అభివృద్ధి చెందినప్పటికీ, పశ్చిమయూరోప్‌తో పోల్చిచూస్తే, అది యింకా

వెనుకబడ్డ దేశమే. ఇంకా అది విదేశ పెట్టుబడిదారులపైననే ఆధారపడివుంది. యంత్రాలను, యంత్రసామగ్రిని రష్యా వుత్పత్తిచేయుటలేదు. వాటిని విదేశాలనుండి దిగుమతి చేసుకొనేది. మోటారు పరిశ్రమగాని, రసాయనిక పరిశ్రమగాని, కృత్రిమ ఎరువులను తయారుచేసే పరిశ్రమలుగాని లేవు. ఆయుధోత్పత్తిలోగూడా యితర పెట్టుబడిదారీ దేశాలకంటే రష్యా వెనుకబడివుంది.

రష్యాలో లోహాల వినియోగం తక్కువస్థాయిలో వుండుట దేశం వెనుకబడి యుండటాన్ని తెలియజేస్తుంది. ఈ విషయాన్ని పేర్కొంటూ లెనిన్ ఇలా అన్నాడు:

"రైతుల 'విమోచనం' తర్వాత, రష్యాలో ఇనుము వినియోగం అయిదురెట్లు పెరిగింది. అయినప్పటికీ రష్యా కనీ విని ఎరుగని దరిద్రదేశం, వెనుకబడ్డదేశం. దాదాపు ఆటవిక, అనాగరికదేశం. ఇంగ్లండులో నాల్గవవంతు, జర్మనీలో అయిదవ వంతు, అమెరికాలో పదవవంతు మాత్రమే రష్యాకు ఆధునిక వుత్పత్తి సామగ్రివుంది." (లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్, 16 వ వాల్యూమ్ 543 వ పేజీ)

ఆర్థికంగాను, రాజకీయంగాను రష్యా వెనుకబడి వుండటంవల్ల కల్గిన ప్రత్యక్ష ఫలితమేమంటే, రష్యన్ పెట్టుబడిదారీవర్గమూ, జారుప్రభుత్వమూ రెండూకూడా పశ్చిమ యూరప్ పెట్టుబడిదారీ విధానంపై ఆధారపడవలసి వచ్చింది.

ఈ క్రింది విషయాలవల్ల ఆ విషయం స్పష్టం అవుతుంది. ముఖ్య పారిశ్రామిక విభాగాలయిన బొగ్గు, నూనె, విద్యుత్ పరికరాలు, లోహపరిశ్రమ మొదలగునవి విదేశీపెట్టుబడిదారుల

చేతుల్లో వున్నాయి. తనకు కావలసిన యంత్రసామగ్రినంతా, పరికరాలన్నిటినీ విదేశాలనుండే రష్యా దిగుమతి చేసుకోవలసి వచ్చేది.

ఇంతేగాదు. సంకెళ్ళతో గూడిన విదేశ ఋణాలు వుండనే వున్నాయి. ఈ ఋణాలకు వడ్డీచెల్లించే నిమిత్తం ఏటేటా ప్రజలనుండి కోట్లకొలది రూబుల్సను జారుప్రభుత్వం పిండుతుండేది.

"మిత్రమండలి"తో జారుప్రభుత్వం రహస్య ఒడంబడిక లను చేసుకుంది. వీటిప్రకారం, యుద్ధంవచ్చినపుడు బ్రిటిష్, ఫ్రెంచి పెట్టుబడిదారుల అత్యధికమైన లాభాలను రక్షించేందుకు సామ్రాజ్యవాద యుద్ధరంగాలలో "మిత్రమండలి"ని బలపరి చేందుకు, జారుప్రభుత్వం లక్షలాది తన సైన్యాలను పంపవలసి వుంది.

గ్రామసైనికులు, పోలీసులు, జారుప్రభుత్వ గూఢ చారులు, బ్లాక్‌హండ్రెడ్ గూండాలు, కార్మికవర్గంపై సాగిం చిన రాక్షస దౌర్జన్యకృత్యాలతో స్టోలీపిన్ అభివృద్ధి నిరోధక కాలం, ముఖ్యంగా నిండివుంది. కార్మికులను బాధించి, శిక్షించి నది జారుప్రభుత్వ తాబేదారు లొక్కరేకాదు. ఈ విషయంలో ఫ్యాక్టరీ యజమానులు, మిల్లుయజమానులు ప్రభుత్వానికి ఏమీ వెనుదీయలేదు. పరిశ్రమలు మందకొడిగావుండి నిరు ద్యోగం హెచ్చిన సంవత్సరాలలో కార్మికవర్గంపై వీరిదాడి ముఖ్యంగా మరింత తీవ్రమయింది. ఫ్యాక్టరీ యజమానులు ఒక్కుమ్మడిగా, లాకౌట్లు ప్రకటించారు. సమ్మెలలో ఉత్సా హంగా పాల్గొని పనిచేసిన వర్గచైతన్యంగల కార్మికుల పేర్లతో

"బ్లాక్‌లిస్టు"లను (దుష్ప్రవర్తన జాబితా) తయారు చేశారు. ఒకసారి ఆ జాబితాలో చేరినవ్యక్తికి, ఆ ప్రత్యేక పారిశ్రామిక శాఖలో ఉత్పత్తిదార్ల సంఘానికిచెందిన ఏ కర్మాగారం లోనూ ఉద్యోగం దొరుకుతుందనే ఆశలేదు. 1908 నాటికే జీతాలు నూటికి 10 నుండి 15 వరకు కోసివేశారు. దినానికి పనిచేసే గంటల పరిమితి 10 నుండి 12 వరకు పెంచ బడింది. నెత్తురుపీల్చే జరిమానాల పద్ధతి తిరిగి తలయెత్తింది. 1905 విప్లవాపజయంతో, దానితోటి ప్రయాణీకులలో నైతిక పతనమూ క్షీణతా ప్రారంభమయ్యాయి. ముఖ్యంగా మేధావు లలో నైతిక పతన క్షీణతా ధోరణులు తలయెత్తాయి. విప్లవం ఉచ్ఛస్థాయిలో వున్నకాలంలో బూర్జువాశిబిరంనుండి వచ్చిన తోడి ప్రయాణీకులు, స్టోలీపిన్ అభివృద్ధినిరోధక కాలంలో పార్టీని విడిచిపోయారు. వారిలో కొందరు విప్లవ శత్రుశిబిరంలో బహిరంగంగా చేరిపోయారు. మరికొందరు, అప్పటికి యింకా మిగిలియున్న బహిరంగంగా పనిచేస్తున్న కార్మికవర్గ సంఘా లలో పాతుకుపోయారు. అలాచేరి శ్రామికవర్గాన్ని విప్లవ మార్గంనుండి తప్పించడానికి ప్రయత్నంచేశారు. శ్రామికవర్గ విప్లవపార్టీని అపఖ్యాతిపాలు చేయసాగారు. విప్లవాన్ని వదలి పారిపోయిన తోడిప్రయాణీకులు, అభివృద్ధి నిరోధకుల దయా దాక్షిణ్యాలను సంపాదించడానికీ, జారుప్రభుత్వంతో ఒడంబడిక చేసుకొని బ్రతకడానికీ ప్రయత్నించారు.

విప్లవం ఓడిపోవటాన్ని అదునుగా తీసుకొని ఎక్కువ స్వార్థపరులునూ, పిరికి పందలునూ అగు తోడిప్రయాణీ కులను గూఢచారులుగా జార్ ప్రభుత్వం తీసుకొంది. ఈ నమ్మక

ద్రోహులయిలన నీచులు జార్ గూఢచారి శాఖ తరఫున (Okhrana ఓఖ్రానా) కార్మికవర్గంలోకి, పార్టీ సంఘాలలోకి పోయి, లోపలనుండే గూఢచారి కార్యక్రమం చేస్తూ, విప్లవ కారులకు ద్రోహం చేశారు. విప్లవ ప్రతీఘాతకదాడి సిద్ధాంత రంగంపైన కూడా సాగింది. ఫేషన్‌బుల్ ప్రాయసగాండ్ర గుంపు ఒకటి బయలుదేరి మార్క్సిజాన్ని "విమర్శించారు". దాన్ని "కూల్చివేశారు." విప్లవాన్ని గేలిచేసి దూషించారు. ద్రోహాన్ని పొగిడారు. "వ్యక్తిత్వపూజ" అనే ముసుగుక్రింద వ్యభిచార అవినీతిని పొగిడారు.

తత్వశాస్త్రరంగంలో కూడా మార్క్సిజాన్ని "విమర్శించడానికి", కుసంస్కరించడానికి ప్రయత్నాలెక్కువయ్యాయి. సూడో-సైంటిఫిక్ థీరీలతో (కపట శాస్త్రీయసిద్ధాంతం) కల్పి వేయబడిన అనేకరకాల మత ధోరణులు కూడా తలెత్తాయి.

మార్క్సిజాన్ని విమర్శించడం ఫేషన్ అయిపోయింది.

ఈ పెద్దమనుష్యులందరూ బహు వేషధారులైనప్పటికీ, వారంతా ఒకే ఆశయానికి పాటుపడ్డారు. అది విప్లవం నుండి ప్రజలను మరలించటం.

పార్టీ మేధావి వర్గంలో ఒకభాగాన్ని సంశయవాదమూ (Scepticism), పతనమూ ఆవరించాయి. వీరు తాము మార్క్సిస్టులమని అనుకొన్నా, ఎప్పుడూ మార్క్సిస్టు సిద్ధాంతానికి గట్టిగా అంటిపెట్టుకొని యుండలేదు. వారిలో బోగ్దనావ్, బాజరోవ్, లూనాచర్స్కి (1905 విప్లవంలో వీరంతా బోల్షివిక్కులతో చేతులు గల్పినవారు) యూష్కెవిచ్, వేలెంటినోవ్ (వీరు మెన్షివిక్కులు) మొదలగు రచయి

తలు గలరు. మార్క్సిస్టు సిద్ధాంతంయొక్క తత్వశాస్త్ర పునాదులపైన వారు ఒక్కసారిగా తమ విమర్శనాయుధాన్ని ప్రయోగించారు. అనగా గతితార్కిక భౌతికవాదానికి వ్యతిరేకంగాను, చారిత్రక విజ్ఞానంయొక్క ప్రధానమార్క్సిస్టు సూత్రాలైన చారిత్రక భౌతికవాదానికి వ్యతిరేకంగాను వారు తమ దాడిని సాగించారు. ఈ విమర్శన మామూలు విమర్శన లాంటిదికాదు. ఈ విమర్శనను బహిరంగంగాను, నియమబద్ధంగాను చేసేవారుకాదు. మార్క్సిజంయొక్క ప్రధాన సిద్ధాంతాలను "సమర్థించే" ముసుగుతో, మిషతో, కపటంగా యీ విమర్శనను సాగించేవారు. వీరు అసలు విషయాల్లో మార్క్సిస్టులేనట. కాని మార్క్సిజాన్ని దాని కొన్ని ప్రధాన సూత్రాలను త్రోసివేసి, "అభివృద్ధి" చేయదలచుకున్నారట. వాస్తవంలో వీరు మార్క్సిజానికి ప్రతికూలురు. ఎందుచేతనంటే వీరు మార్క్సిస్టు సిద్ధాంతపు పునాదులనే కూలద్రోయ ప్రయత్నించారు. తాము మార్క్సిజానికి వ్యతిరేకులం కామని కపటంగా కల్లలాడినప్పటికీ, తాము మార్క్సిస్టులమంటూ రెండు నాల్కలతో ప్రవర్తించినప్పటికీ, వారు నిజానికి మార్క్సిజానికి వ్యతిరేకులే! పార్టీ అనుచరులను మోసగించి, వారిని తప్పుడు త్రోవకు పట్టించడానికే యీ కపటవిమర్శన చేయబడింది. ఇందులోనే దీని ప్రమాదం వుంది. మార్క్సిజం సిద్ధాంతంయొక్క పునాదులను భగ్నపరచదలచిన యీ విమర్శన కుటిలతరమైనకొలదీ పార్టీకి మరింత అపాయకరమైంది. ఎందువల్లనంటే లెనినిజానికి వ్యతిరేకంగా, పార్టీకి వ్యతిరేకంగా అభివృద్ధి నిరోధకులు జరిపే సాధారణ దుష్ప్రచారంలో యిదికూడా మిళితమైంది. మార్క్సిజాన్ని వదలి పారిపోయిన కొంతమంది

మేధావులు ఒక కొత్తమతాన్ని స్థాపించాలని ప్రచారంచేసే దాకా పోయారు. వీరినే "భగవదన్వేషకులు", "భగవన్నిర్మాతలు" అని పిలిచేవారు. మార్క్సిస్టు సిద్ధాంతాన్ని వదలిపోయిన స్వామి ద్రోహులకు తగురీతిగా జవాబిచ్చుట, వారి ముఖాలనుండి ముసుగులను తొలగించి పూర్తిగా బట్టబయలు చేయుట, ఆవిధంగా మార్క్సిస్టుపార్టీ సిద్ధాంతపు పునాదులను సంరక్షించుట మార్క్సిస్టుల అత్యావసర కర్తవ్యమయింది.

"మార్క్సిస్టు సిద్ధాంత కర్తలలో ఘనులము" అని భావించే ప్లెఖనావ్, అతని మెన్షివిక్ స్నేహితులూ ఈ కర్తవ్యాన్ని నెరవేర్చుతారని అనుకోవచ్చు. కాని ఏవో వార్తాపత్రికల విమర్శల లాంటివి ఒకటి రెండు అనామక ముక్కలు విసిరేసి, ఆ రంగాన్ని వీరు వదలివేశారు.

1909లో ప్రచురించిన "భౌతిక వాదము-అనుభవ వాద దృష్ట్యావిమర్శ "(Materialism and Emprio-criticism) అనే తన సుప్రసిద్ధ గ్రంథంలో యీ కర్తవ్యాన్ని లెనిన్ నెరవేర్చాడు.

లెనిన్ ఇలా వ్రాశాడు :

"గతితార్కిక భౌతికవాదంపైనే ప్రధానంగా కేంద్రీకరించి దాడిసల్పిన నాలుగు పుస్తకాలు గత ఆరు మాసాలలో వెలువడ్డాయి. వాటిలో మొట్టమొదటివీ, ప్రధానమైనవీ ఇవి : 1908 లో సెంట్‌పీటర్స్ బర్గ్‌లో ప్రచురించబడిన మార్క్సిస్టు తత్వశాస్త్ర అధ్యయనములు (Studies in the Philosophy of Marxism- నిజానికి 'మార్క్సిస్టు తత్వశాస్త్రానికి వ్యతిరేక అధ్యయనములు' అని అంటే బాగుండేది); బాజరోవ్,

బోగ్డనోవ్, లూనాచెరెస్కీ, బెర్మన్, హెల్ఫాండ్, యుస్కెవిచ్, సువరోవ్ అనువారల వ్యాససంపుటి; యుస్కెవిచ్ వ్రాసిన భౌతికవాదము - విమర్శనాత్మక వాస్తవికత (Materialism and critical Realism); బెర్మన్ వ్రాసిన "ఆధునిక దర్శన శాస్త్ర దృష్ట్యా గతితర్కం" (Dialectics in the light of Modern theory of knowledge); వాలెంటినోవ్ వ్రాసిన "మార్కిస్టు తత్వశాస్త్ర అన్వయములు (The Philosophical Construct.cns of Marxism)... వీరంతా రాజకీయంగా తీవ్రంగా విభిన్నాభిప్రాయాలు కలిగివున్నప్పటికీ, గతితార్కిక భౌతికవాదానికి ప్రతికూలతలో ఒక్కటే. పైగా తత్వశాస్త్రంలో తాము మార్కిస్టులమని చెప్పుకునేవారు. ఏంగెల్సు గతితార్కికవాదము, నిగూఢవాదమని (Mysticism) బెర్మన్ వాదించాడు.

అదేదో ప్రత్యక్ష నిదర్శన విషయమైనట్లు ఏంగెల్సు భావాలు "పాతబడ్డాయి" అని బాజరోవ్ చులకనగా అనేశాడు. 'ఆధునిక దర్శనశాస్త్రం', 'మొన్న మొన్నటి తత్వశాస్త్రం' (లేక రూఢివాదం — Recent Philosophy or Recent Positivism), 'ఆధునిక ప్రకృతి శాస్త్ర తత్వశాస్త్రము', '20 వ శతాబ్దపు ప్రకృతిశాస్త్ర తత్వశాస్త్రము' మొదలగువాటిని గురించి సగర్వంగా ఉదహరించే యీ సాహసిక యోధులు భౌతిక వాదాన్ని ఆ విధంగా త్రోసిపుచ్చారు" (లెనిన్, భౌతిక వాదము అనుభవ వాద దృష్ట్యా విమర్శ — ఇంగ్లీషు ఎడిషన్ - మాస్కో 1947, 9వ పేజీ).

తత్వశాస్త్ర కుసంస్కర్తలగు (రివిజనిస్టులు) తన స్నేహితులను సమర్థించుతూ లూనాచరెస్కీ యిలా అన్నాడు: "మేము దారి తప్పితే తప్పవచ్చు. కాని దానికోసం అన్వేషించుతున్నాం". దీనికి జవాబుగా లెనిన్ ఇలా వ్రాశాడు:

"నామట్టుకు నేను గూడా తత్వశాస్త్రంలో అన్వేషకుడనే. (భౌతికవాదము - అనుభవ వాదదృష్ట్యా విమర్శ, అనే గ్రంథంలో - సంపాదకుడు) మార్క్సిజం అనే ముసుగుక్రింద అభివృద్ధి నిరోధకమైన, గందరగోళమైన, నమ్మరాని, అయోమయ విషయాలను తెలియజేసే, వీరి పొరపాట్లు ఏమిటో కనుగొనుటయే యీ విమర్శల (గ్రంథం) వుద్దేశ్యం." (పై గ్రంథమే - 10వ పేజీ).

కాని వాస్తవానికి లెనిన్ గ్రంథం ఈ స్వల్ప కర్తవ్యంతోనే సరిపుచ్చుకోలేదు. బోగ్డనోవ్, యుష్కెవిచ్, బాజరోవ్, వాలెంటినోఫ్ - వారికి తత్వ శాస్త్రంలో గురువులైన ఎవనోరియస్, మాష్ అను వారిని విమర్శించుట తోనే ఈ గ్రంథం సరిపుచ్చుకోలేదు. మార్క్సిస్టు భౌతిక వాదానికి వ్యతిరేకంగా ఎవనోరియస్, మాష్ అనువారలు మెరుగుపెట్టిన, నాజూకైన భావవాదాన్ని తమ వ్రాతలలో తెలియజేశారు. వీరందరిని విమర్శించుటయేగాక లెనిన్ గ్రంథం మార్క్సిస్టు సిద్ధాంతపు పునాదులను అంటే గతి తార్కిక చారిత్రక భౌతిక వాద సిద్ధాంతపు పునాదులను సమర్థించింది. ఏంగెల్స్ చనిపోయిన నాటినుండి లెనిన్ ప్రచురించిన "భౌతికవాదము - అనుభవవాద దృష్ట్యా విమర్శ" అనే గ్రంథం వెలువడేవరకు, అంటే యీచారిత్రక కాలమంతటిలోను, సైన్సువల్ల ముఖ్యంగా

ప్రకృతి విజ్ఞానశాస్త్రంవల్ల (Natural Science) సంపాదించ బడిన ప్రతి ముఖ్యమైన, కీలకమైన విషయానికి భౌతికవాదాన్ని అన్వయించి సూత్రీకరించింది. రష్యన్ అనుభవవాద–విమర్శకు లను, వారి విదేశీగురువులను తీక్ష్ణంగా విమర్శించి, తత్వశాస్త్ర సిద్ధాంత కుసంస్కరణ విధానాన్ని (రివిజనిజం) గురించి యీ క్రింది నిర్ణయాలకు లెనిన్ వచ్చాడు :

1. "అర్థశాస్త్రంలోను, ఎత్తుగడలకూ తత్వశాస్త్రానికి సంబంధించిన సమస్యలలోను, ఆధునిక కుసంస్కరణవాదం (రివిజనిజమ్)లో విశిష్టమైన రూపం ఇది: మార్క్సిజం అనే ముసుగుక్రింద ఎప్పుడూ భౌతికవాద సిద్ధాంతాలను అతి నేర్పుతో ప్రకటించడం, మార్క్సిజాన్ని తప్పుడు తడకగా నేర్పుగా ప్రదర్శించడం." (పై గ్రంథమే 342–43 పేజీలు)

2. "మాఖ్, ఎవెనోరియస్ అనువారల ముఠా అంతా భావవాదంవైపు నడుస్తున్నది. (పై గ్రంథమే 370 వ పేజీ)

3. "మాఖ్‌ను అనుసరించే మనవారంతా భావవాద మనే వలలో తగుల్కొన్నారు." (పై గ్రంథమే 359 వ పేజీ)

4. "అనుభవవాద విమర్శయొక్క తర్కజ్ఞాన పాండి త్యాల వెనుక, తత్వశాస్త్రంలోని వివిధపక్షాల పోరాటాన్ని చూడకుండా వుండలేము. ఈ పోరాటం ఆధునిక సమాజం లోని పరస్పర వ్యతిరేకవర్గాలయొక్క సిద్ధాంతాన్ని, ధోరణు లను ప్రతిబింబించుతుంది." (పై గ్రంథమే 371 వ పేజీ)

5. "సాధారణంగా భౌతికవాదానికి, ముఖ్యంగా చారిత్రక భౌతికవాదానికి వ్యతిరేకంగా జరిపే పోరాటంలో, అంధమత విశ్వాసకులకు (Fiendists: శాస్త్ర విజ్ఞానంకంటే మత విశ్వా

సానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చే అభివృద్ధినిరోధకులు.) నమ్మకమైన సేవను చేయుటయే అనుభవవాద - విమర్శయొక్క స్వతస్సిద్ధమైన వర్గపాత్ర (Objective class role)."

(పై గ్రంథమే 371 వ పేజీ)

6. "తాత్విక భావవాదం(Philosophical idealism) మత అంధకార అజ్ఞానవాదానికి మార్గం." (లెనిన్ కలెక్టడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్ - 13 వవాల్యూం 304 పేజీ)

మనపార్టీ చరిత్రలో లెనిన్ గ్రంథం ప్రదర్శించిన అద్భుతమైన పాత్రను హర్షించాలంటే; స్టోలీపిన్ ప్రతీఘాత కాలంలో కుసంస్కరణవాదులు (రివిజనిస్టులు), నమ్మకద్రోహులు (రెనిగేడ్స్) మొదలైన నానా గోత్రేభ్యుల గుంపు నుండి, లెనిన్ సంరక్షించిన సిద్ధాంత సంపదను మనం గుర్తించాలి. మనం క్లుప్తంగానైనాసరే గతితార్కిక చారిత్రక భౌతికవాద ప్రధాన సూత్రాలను తెలుసుకోవాలి.

గతితార్కిక చారిత్రక భౌతికవాదాలు కమ్యూనిస్టు సిద్ధాంతానికి పునాది. మార్క్సిస్టు పార్టీకి సిద్ధాంత పునాది. అందుచే వీటిని తెలుసుకోవటం అవసరం. పార్టీ కార్యోత్సాహం గల (Active) ప్రతిసభ్యుడు యీ సూత్రాలను తెలుసుకొని అధ్యయనం చేయాలి.

అయితే ఇక——

(1) గతితార్కిక భౌతిక వాదమంటే ఏమిటి?

(2) చారిత్రక భౌతిక వాదమంటే ఏమిటి?

# 2

## గతితార్కిక, చారిత్రక భౌతికవాదం

గతితార్కిక భౌతికవాదం (Dialectical Materialism) మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీయొక్క ప్రపంచదృక్పథం. ప్రకృతియొక్క దృగ్గోచర విషయాలను (Phenomena) పరిశీలించే విధానమూ, వాటిని అధ్యయనంచేసి అర్థమొనర్చుకొనే విధానమూ గతితార్కికం. ప్రకృతిదృగ్గోచర విషయాలను భాష్యీకరించు విధానమూ, ఆదృగ్గోచర విషయాలను గురించి భావించుటా, దాని సిద్ధాంతమూ (Theory) భౌతికము. అందుచే దీనిని గతితార్కిక భౌతికవాదమని అంటారు.

చారిత్రక భౌతికవాదమనగా గతితార్కిక భౌతికవాద సూత్రాలను సామాజిక జీవితాన్ని అధ్యయనం చేసుకోడానికి విస్తరింపజేయుట, సామాజిక జీవిత దృగ్విషయాలకూ, సమాజాన్ని సమాజచరిత్రను అధ్యయనం చేయడానికీ, గతి తార్కిక భౌతికవాద సూత్రాలను అనువర్తింప చేయుటయే చారిత్రక భౌతికవాదం.

తమ తార్కిక పద్ధతిని (Dailectical method) వర్ణించుతూ మార్క్స్ - ఏంగెల్స్‌లు, గతితర్కంయొక్క ప్రధాన రూపాలను నిర్మించిన తత్వవేత్తగా హెగెల్‌ను తరచుగా పేర్కొంటారు. అంతమాత్రాన దీని అర్థం మార్క్స్ - ఏంగెల్స్‌ల గతితర్కమూ, హెగెల్ గతితర్కమూ పూర్తిగా

ఒకటి అనుకోరాదు. మార్క్సు, ఏంగెల్సులు వాస్తవానికి హెగెల్ గతితర్కంనుండి "హేతువాదం అనే గుజ్జును" తీసుకుని, వాని భావవాదపు టెంకెను అవతల పారవేశారు. గతితర్కాన్ని యింకా అభివృద్ధిపరచి ఆధునిక శాస్త్రీయరూపాన్ని (Modern scientific form) కలిగించారు.

మార్క్సు ఇలా అన్నాడు :

"నా గతితార్కిక విధానం హెగెల్ విధానంతో విభేదించుటేగాక దానికి పూర్తిగా వ్యతిరేకంకూడా. హెగెల్ ఆలోచనాక్రమాన్ని "భావం" (idea) అనే పేరుతో ఒక ప్రత్యేక వస్తువుగా మార్చివేశాడు. దీనినే నిజమైన ప్రపంచానికి సృష్టికర్త అనీ, భావంయొక్క బాహ్యాదృగ్గోచర స్వరూపమే-ప్రపంచమనీ, హెగెల్ వాదన. కాని నావిషయంలో అది తద్వ్యతిరేకం. మానవమనస్సుచే ప్రతిబింబింపబడి, ఆలోచనా రూపాలలోకి మారినట్టి భౌతిక ప్రపంచమే భావనకాని మరొకటికాదు." (కారల్ మార్క్సు-కాపిటల్ 1వ వాల్యూమ్ 39వ పేజీ జార్జి ఎలెన్ అండ్ అన్విన్ లిమిటెడ్. 1938)

తమ భౌతికవాదాన్ని వర్ణించునపుడు మార్క్సు, ఏంగెల్సులు తరచుగా "ఫ్యూయర్‌బా" (Feuerbach)ను పేర్కొంటారు. ఈయన భౌతికవాదాన్ని యథాస్థానానికి పునరుద్ధరించిన తత్వవేత్త. అందుచేత మార్క్సు, ఏంగెల్సుల భౌతికవాదం ఫ్యూయర్‌బా భౌతికవాదమూ ఒకటేనని అర్థంకాదు. వాస్తవానికి ఫ్యూయర్‌బా భౌతికవాదంనుండి "లోపలిగుజ్జు"ను తీసుకొని, మార్క్సు, ఏంగెల్సులు దానిని శాస్త్రీయతాత్విక భౌతికవాదసిద్ధాంతంగా (Scientific Philosophical theory of Materialism) వృద్ధిచేశారు. దాని భావవాద సంబంధ

మైన, మత - నైతిక సంబంధమైన అడ్డంకులను త్రోసివేశారు. ఫ్యూయర్ బా ప్రధానంగా భౌతికవాది అయినా, భౌతికవాదం అనే పేరుకు ఆయన ఆక్షేపణ తెలియజేశాడని మనకు తెలుసు. ఏంగెల్స్ అనేకసార్లు యిలా అన్నాడు: "భౌతికవాదపు పునాదులను కలిగివున్నప్పటికీ, ఫ్యూయర్ బా, పారంపర్యమైన భావవాద శృంఖలాలచే బంధింపబడ్డాడు. మత సమాజ నైతిక విషయాలకు సంబంధించిన అతని తత్వశాస్త్రాన్ని పరిశీలించినపుడు, ఫ్యూయర్ బాయొక్క నిజమైన భావవాదం స్పష్టమవుతుంది." (కారల్ మార్క్స్ - సెలెక్టెడ్ వర్క్స్ - ఇంగ్లీషు ఎడిషన్-మాస్కో 1946, 1వ వాల్యూమ్ 373-375 పేజీలు)

"డైలెక్టిక్స్" (గతితర్కం) అనే పదం గ్రీక్ భాషలోని "డైలిగో" అన్న పదం నుండి వచ్చింది. దీని అర్థం సంభాషించుట - తర్కించుట. పూర్వకాలంలో ఎదుటివాని వాదనలోని పరస్పర విరుద్ధతలను బయట పెట్టి, వాటిని అధిగమించి సత్యాన్ని నిర్ణయించుకళయే గతితర్కం. ఆలోచనలోని పరస్పర విరుద్ధతలను బహిరంగపరచుట, పరస్పర అభిప్రాయాల ఘర్షణ సత్యాన్ని నిర్ణయించుటకు మంచిపద్ధతి అని నమ్మిన తత్వశాస్త్ర వేత్తలు పూర్వకాలంలో వుండేవారు. ఆలోచనకు సంబంధించిన ఈ గతితార్కిక పద్ధతి, ఆ తర్వాత, ప్రకృతి దృగ్గోచర విషయాలకు కూడా వర్తింపజేయబడి ప్రకృతిని అర్థంచేసుకోడానికి గతితార్కిక పద్ధతిగా యిది పెంపొందింది. ప్రకృతి యొక్క దృగ్గోచర విషయాలు నిరంతరమూ చలనం కలిగివుంటాయనీ, నిరంతరమూ మార్పుకు లోనవుతుంటాయనీ, యీ పద్ధతి తెలియజేస్తుంది. ఇంతేగాక ప్రకృతిలోని పరస్పర వైరుధ్యాల

అభివృద్ధి ఫలితంగా, ప్రకృతిలోని విరుద్ధశక్తుల పరస్పర సంసర్గం (Inter-action) ఫలితంగా, ప్రకృతి వృద్ధిచెందుతుందని ఈగతి తార్కిక పద్ధతి తెలియజేస్తుంది.

దీని సారాంశమేమంటే గతితార్కికం మెటాఫిజిక్సుకు పూర్తిగా వ్యతిరేకం.

1. మార్క్సిస్టు గతితార్కిక పద్ధతియొక్క ప్రధాన లక్షణాలు ఇవి :

(ఎ) మెటాఫిజిక్సువలె గతితర్కం ప్రకృతిని పరస్పర సంబంధంలేని విడివడిపోయిన, కలయికలేని దృగ్గోచర విషయాలుగా యాదృచ్ఛిక ఘటనల కుప్పగా పరిగణించదు. దేనిలో వస్తువులు, దృగ్విషయాలు, ఆంగికముగా కలయిక గలిగి ఒకదానిపై ఒకటి ఆధారపడుతూ, ఒకదానిచే నొకటి నిర్ణయింపబడుతూ వున్నవో అట్టి కలయికగల అభిన్న సముదాయంగా ప్రకృతిని గతితర్కం పరిగణించుతుంది.

అందుచే ప్రకృతిలోని దృగ్విషయాల్ని, చుట్టూవున్న దృగ్విషయాలనుండి వేరుచేసి విడిగా చూసినట్లైతే అర్థంకాదు. చుట్టునున్న పరిస్థితులతో సంబంధించి చూడకపోయినట్లైతే, చుట్టూనున్న పరిస్థితులనుండి విడదీసి దానిని చూసినట్లైతే ప్రకృతి తాలూకు ఏదృగ్విషయమైనా అర్థరహితం అవుతుంది; తద్వ్యతిరేకంగా, చుట్టూవున్న దృగ్విషయాలచే నిర్ణయించబడి వాటితో విడివడరాని సంబంధాన్ని కలియున్నదని ఆలోచించినట్లైతే ఆదృగ్విషయాన్ని అర్థంచేసుకోవచ్చు; విశదపరచనూ వచ్చు.

(బి) మెటాఫిజిక్సుకు వ్యతిరేకంగా గతితర్కం యిలా వాదించుతుంది. ప్రకృతి నిశ్చలమైనదీ, కదలనిదీ, స్థాణువు

అయినదీ, నిర్వికారమైనదీకాదు. పైగా నిరంతర గమనమూ, మార్పు నిరంతర పునఃసృష్టి, అభివృద్ధికలిగిన పరిస్థితియే ప్రకృతి. ప్రకృతిలో ఎల్లప్పుడూ ఏదోఒకటి ఉదయించుతూ, వృద్ధి చెందుతూ వుంటుంది; అదే సమయంలో ఏదో ఒకటి క్షీణించుతూ, చనిపోవుతూవుంటుంది.

గతితార్కికపద్ధతి దృష్ట్యా దృగ్విషయాలను గురించి ఆలోచించునపుడు ఈ క్రిందిదృక్పథం నుంచికూడా చూడాలి. వాటి అన్యోన్య సంసర్గము, అన్యోన్య ఆధారము, అంతేగాక దృగ్విషయాల గమనం, మార్పు - అభివృద్ధి - అవి ఉనికిలోకి వచ్చుట, ఉనికినుండి బయటకు పోవుట అనే దృక్పథాన్నుంచి కూడా చూడాలి.

తత్కాలానికి దీర్ఘకాలం జీవించేదానిలా కనపడినప్పటికీ, వాస్తవంగా అప్పటికే చనిపోవ ప్రారంభించినదానిని గతి తర్క పద్ధతి ముఖ్యంగా ప్రధానవిషయంగా ఎంచదు. కాని తత్కాలానికి, అది దీర్ఘకాలం వుండేదిలా కనిపించకపోయినా తల యెత్తి వృద్ధియగుచున్న విషయాన్ని ముఖ్యంగా ప్రధాన విషయంగా గతితర్కం భావించుతుంది. ఎందువల్లనంటే తల యెత్తి వృద్ధిఅవుతున్న దొకటే అజేయమని గతితర్కం భావించుతుంది.

ఏంగెల్స్ యిలా అన్నాడు :

"చిన్న నలుసు మొదలుకొని పెద్దవస్తువువరకు, యిసుక రేణువు మొదలుకొని సూర్యబింబమువరకు, ప్రొటిస్టా (ప్రాథమిక జీవకణాలు - సంపాదకుడు) మొదలుకొని మానవుని వరకు ఉనికిలోనికి వచ్చుట, ఉనికినుండి బయటకుపోవుట అనే

నిరంతర ప్రవాహమే, ఎడతెగని చలనమే, పరిణామస్థితియే ప్రకృతి అంతా." (ఏంగెల్సు - డైలెక్టిక్స్ ఆఫ్ నేచర్)

ఏంగెల్సు యింకా యిలా అన్నాడు:

"అందుచేత గతితర్కం ఆయా వస్తువుల అన్యోన్య సంసర్గంనుండి, గొలుసులాంటి సంబంధంనుండి, వాటి చలనంనుండి, వాటి జనన, అంతర్ధానములనుండి, వస్తువులను వాటి భావనాచిత్రములను గ్రహించుతుంది." (ఏంగెల్స్ - యాంటీ డూరింగ్ అనే గ్రంధంనుండి)

(సి) శ్రీ అభివృద్ధిక్రమాన్ని, సాధారణ అభివృద్ధిక్రమంగా, గతితర్కం మెటాఫిజిక్స్‌వలె ఎంచదు. అట్టి సాధారణ అభివృద్ధి క్రమంలో పరిమాణపు మార్పులు గుణాత్మకమైన మార్పులుగా మారవు. కాని (గతితర్కపద్ధతిలో) అప్రాధాన్యమైన అగోచరమైన పరిమాణపు మార్పులనుండి ప్రధానమైన బహిరంగమైన, గుణాత్మకమైన మార్పులకు దారితీయుటయే అభివృద్ధి. ఆ అభివృద్ధిలో మార్పులు క్రమక్రమంగా జరగవు. ఒక స్థితినుండి మరొక స్థితికి గంతువేసేరూపంలోనూ, హఠాత్తుగానూ, త్వరితంగానూ సంభవిస్తాయి. అవి ఏదో యాదృచ్ఛికంగా సంభవించవు. అగోచరమైన, క్రమక్రమమైన పరిమాణపు మార్పులు పోగవుటవలన సహజంగా అవి సంభవిస్తాయి.

అందుచేత గతితార్కిక పద్ధతి దృష్టిలో అభివృద్ధిక్రమం ఒక చక్రగమనంగా అర్థంచేసుకోరాదు. ఇదివరకే సంభవించినది తిరిగి సంభవించుటకాదు. అది ముందుకు, పైపైకిపోయే గమనం. పాత గుణాత్మకస్థితినుండి కొత్తగుణాత్మకస్థితికి పరివర్తన

జెందటం. సాధారణస్థితినుండి క్లిష్టస్థితికి, నిమ్నస్థితినుండి ఉన్నత స్థితికి పరివర్తన చెందటం.

ఏంగెల్స్ యిలా అన్నాడు:

"గతితర్కానికి ప్రకృతియే పరీక్ష. ఆధునిక ప్రకృతి విజ్ఞానశాస్త్రం, యీ పరీక్షకు అత్యంత సంపన్నమైన, దిన దినాభివృద్ధి చెందుతున్న విషయాలను సంపాదించిందని గుర్తు పెట్టుకోవాలి. ఆ విధంగా తుట్టతుదకు ప్రకృతిక్రమం మెటాఫిజికల్ కాదనీ, గతితార్కికమేననీ నిరూపించింది. ప్రకృతి శాశ్వతంగా ఏకరీతిని నిరంతరం పరిభ్రమించెడు ఒక వలయంలో తిరుగుతూవుండదనీ వాస్తవిక చరిత్రద్వారా నడుస్తుందనీ నిరూపించింది. ఇక్కడ ముఖ్యంగా డార్విన్‌ను పేర్కొనాలి. ప్రకృతిని మెటాఫిజికల్‌గా అర్థంచేసుకున్నవారిని డార్విన్ గట్టిదెబ్బ కొట్టాడు. నేటి జీవ ప్రపంచమంతా - అంటే వృక్షాలు, జంతువులు, తత్ఫలితంగా మనుష్యులుకూడా, అంతా - లక్షలాది సంవత్సరాలనుండి పరిణామం చెందుతున్న అభివృద్ధి క్రమం యొక్క వుత్పత్తియే అని డార్విన్ నిరూపించాడు." (పైగ్రంథమే)

పరిమాణపు మార్పులనుండి గుణాత్మక మార్పులకు పరివర్తనమే గతితార్కిక అభివృద్ధి అని వర్ణించుతూ ఏంగెల్స్ యిలా అన్నాడు:

"...ఒక వస్తువులో స్వతస్సిద్ధంగా గాని లేక మరొక దానిచే చేర్చబడిగాని ఏదో ఒక గమనరీతి వుంటుంది. ఇది పరిమాణాత్మక మార్పును చెందుతూ గుణాత్మకమైన మార్పులోకి వెళుతుంది - అని ప్రతి మార్పునుగురించీ పదార్థవిజ్ఞానశాస్త్రం

చెబుతుంది. ఉదాహరణకు నీటిని కాచుటవలన దాని ద్రవస్థితిలో మొట్టమొదట ఎట్టిమార్పురాదు. కాని ద్రవరూపంలోనున్న ఉష్ణం హెచ్చినప్పుడు లేక తగ్గినపుడు దీని సంసక్తతాస్థితి (Cohesion; పరమాణువులో అంటుకొని యుండుస్థితి) మారుతుంది. ఆదశలో ఒక్కొక్కసారి ఆవిరిగాను, మరొకసారి మంచు గడ్డగాను మారుతుంది... ప్లాటినమ్‌తీగ (ఎలెక్ట్రిక్ బల్బులో నుండు సన్నని తీగె) వెలుగుటకు ఒక నిశ్చితమైన కనీసవిద్యుత్తు అవసరం. ప్రతిలోహమూ ద్రవపదార్థంగా మారేందుకు ఒక నిశ్చిత ఉష్ణోగ్రత (Melting Temperature) అవసరం. వాతావరణపు ఒత్తిడి మారనంతవరకు ప్రతి ద్రవపదార్థమూ గడ్డగట్టుకు పోవడానికి మరియు ఆవిరిగావడానికి నిశ్చిత ఉష్ణోగ్రతలున్నాయి. (ఫ్రీజింగ్ పాయింట్, బాయిలింగ్ పాయింట్) ఉష్ణోగ్రతలు కొలవడానికి మనకుగల సాధనసంపత్తితో సాధ్యమైనంతవరకు పై విషయాలను తెలుసుకున్నాము. అలాగే ప్రతి వాయుపదార్థానికి (Gas) ఒక క్రిటికల్ పాయింట్ (అంటే వాయురూపంనుండి తిరిగి ద్రవపదార్థంగా మారడానికి అవసరమైన చల్లదనం) వుంటుంది. ఆ పాయింట్‌వద్ద తగిన ఒత్తిడి, చల్లదనముయిస్తే అది ద్రవపదార్థంగా మారుతుంది. పదార్థ విజ్ఞాన శాస్త్రంలో స్థిరరాశులు అనేవి యున్నవి. (ఒక పరిస్థితి నుండి మరో పరిస్థితికిపోవు పాయింట్ స్థిరరాశి) ఇవి చాలా విషయాలలో నోడల్ పాయింట్సు (సంధి క్షణాల) కు పెట్టినపేర్లే.

"ఈ పాయింట్లవద్ద గమనంలోని పరిమాణపు పెరుగుదల లేక తగ్గుదల (మార్పు)వల్ల ఆ వస్తువుస్థితిలో, గుణాత్మక

మైన మార్పు కలుగుతుంది. తత్ఫలితంగా పరిమాణం గుణంగా మారుతుంది." (డైలెక్టిక్స్ ఆఫ్ నేచర్)

రసాయన శాస్త్రాన్ని గురించి చెబుతూ ఏంగెల్స్ యిలా అన్నాడు:

"వస్తువులయొక్క పరిణామాత్మక అంగనిర్మాణంలోని మార్పులవల్ల వచ్చే గుణాత్మక మార్పులయొక్క శాస్త్రమే రసాయన శాస్త్రం. ఇది అదివరకే హెగెల్‌కు తెలుసు... ఉదాహరణకు ప్రాణవాయువును తీసుకుందాం. మాలెక్యూల్ (అణువు)లో సాధారణంగా వుండే రెండు పరమాణువులకు (Atoms) బదులు మూడు పరమాణువులుంటే అది "ఓజోన్" (Ozone - ప్రాణవాయువుయొక్క మరోరూపము) అవుతుంది. ఇది సాధారణ ప్రాణవాయువుతో పోల్చితే, వాసనలోను, ప్రతిక్రియ (రియాక్షన్)లోను పూర్తిగా విభిన్నంగా వుంటుంది. నత్రజనితోగాని, గంధకంతోగాని ప్రాణవాయువును వేరువేరు పాళ్ళల్లో కలిపితే, ప్రతిదికూడా తదితర వస్తువులకు పూర్తిగా సంబంధంలేని కొత్తగుణములు కలిగిన వస్తువులుగా తయారవుతాయని మనకు తెలుసుగదా!" (పై గ్రంథమే)

హెగెల్‌ను తన యిష్టం వచ్చినట్లు తిట్టిన డూరింగ్‌ను విమర్శిస్తూ ఏంగెల్స్ యిలా అన్నాడు:

"అచేతన (insentient) ప్రపంచంనుండి చేతన ప్రపంచానికి పరివర్తన చెందుట, జడపదార్థ ప్రపంచంనుండి జీవపదార్థ ప్రపంచానికి పరివర్తనచెందుట ఒక నూతన స్థితికి గంతువెయ్యడమే అని హెగెల్ సుప్రసిద్ధ సిద్ధాంతం. డూరింగ్ దీనిని దొంగిలించాడు."

ఏంగెల్స్ యింకా యిలా అన్నాడు :

"నిశ్చితసంధి సమయాలలో (nodal points) పరిమాణములను హెచ్చించుట లేక తగ్గించుటచేతనే గుణాత్మక లంఘనం (గంతు) కల్గుతుంది. ఉదాహరణకు నీటిని వెచ్చ చేసినపుడు లేక చల్లబరచినపుడు బాయిలింగ్ లేక ఫ్రీజింగ్ పాయింట్ (నీరు ఆవిరియగు క్రమము లేక గడ్డకట్టు క్రమము) యిక్కడ సంధి సమయములు. వాతావరణం సాధారణంగా వున్నపుడు ఈ సమయాలలో సంపూర్ణంగా ఒక నూతన స్థితికి గంతువేయడం జరుగుతుంది. తత్ఫలితంగా పరిమాణ గుణంగా మారుతుంది. దీనినే పరస్పర సంబంధాలను కొలిచే హెగెలియన్ నోడల్ లైన్ అంటారు."

(ఏంగెల్స 'యాంటీ డూరింగ్' అనే గ్రంధంనుండి).

(డి) మెటాఫిజిక్స్‌కు వ్యతిరేకంగా గతితర్కవిధానం యిలా అభిప్రాయపడుతుంది: అన్నివస్తువులలోను ప్రకృతిదృగ్విషయాలలోను స్వతస్సిద్ధంగా ఆంతరంగిక వైరుధ్యాలువుంటాయి. వాటిఅన్నిటికీ వ్యతిరేక (నెగెటివ్), అనుకూల (పాజిటివ్)ముఖాలుంటాయి. భూత,భవిష్యత్తులుంటాయి. ఏదోచనిపోవుచున్నదీ, ఏదో అభివృద్ధి చెందుతున్నదీ వుంటాయి. పాతకొత్తలమధ్య, మరణించుచున్న జనియించుచున్న దానికీ మధ్య, అంతర్థానమవుతున్నదానికీ, అభివృద్ధి అవుతున్నదానికీ మధ్య పోరాటమే-అభివృద్ధి క్రమంయొక్క గర్భబీజాన్ని ఏర్పరుస్తుంది. పరిమాణపు మార్పులనుండి గుణాత్మకమైన మార్పులకు దారితీసే రూపాంతరమే ఈ గర్భస్థబీజం. నిమ్నస్థితినుండి ఉన్నతస్థితికి అభివృద్ధి క్రమం, దృగ్విషయాలు ఘర్షణా రహితంగా వికాసంపొందుట

వల్ల కాజాలదు అని గతితర్కపద్ధతి అభిప్రాయపడుతుంది. వస్తువులలో దృగ్విషయాలలో స్వతస్సిద్ధంగావున్న పరస్పర వైరుధ్యాలు బహిర్గతం చేయుటవల్లనూ, యీ పరస్పర వైరుధ్యాలపై ఆధారపడి జరిగే పరస్పర ప్రతికూల ధోరణుల "పోరాటం"వల్లనూ అభివృద్ధి క్రమం జరుగుతుంది.

లెనిన్ ఇలా అన్నాడు: "గతితర్కానికి సరియైన అర్థం చెప్పాలంటే, వస్తుసారములలోనున్న వైరుధ్యాలను అధ్యయనం చేయుటయే గతితర్కం (లెనిన్ - ఫిలసాఫికల్ నోట్‌బుక్స్ - రష్యన్ ఎడిషన్ -263 వ పేజీ)

ఇంకా "వైరుధ్యాల పోరాటమే అభివృద్ధి" అని లెనిన్ అన్నాడు. (లెనిన్-కలెక్టెడ్‌వర్క్స్ - రష్యన్ ఎడిషన్ - 13వ వాల్యూమ్ - 301 వ పేజీ)

క్లుప్తంగా చెప్పాలంటే మార్క్సిస్టు గతితార్కిక పద్ధతియొక్క ప్రధాన సూత్రా లివి :

గతితర్కపద్ధతి సూత్రాలను, సామాజిక జీవితాన్నీ సామాజిక చరిత్రనూ అర్థంచేసుకోడానికి అన్వయింపచేయటం ఎంత అత్యంత ప్రాముఖ్యమైన విషయమో, యీసూత్రాలను, సామాజిక చరిత్రను శ్రామికవర్గ పార్టీయొక్క ఆచరణ కార్యకలాపాలకు అనువర్తింపజేయడం ఎంత అత్యంత ప్రాముఖ్యమైన విషయమో, ఇప్పుడు అర్థంచేసుకోవడం సులభం.

ప్రపంచంలో విడివడిన దృగ్విషయాలన్నీ అన్యోన్య సంపర్కం కలిగి పరస్పరం ఆధారపడి వున్నాయి. కనుక ప్రతి సామాజిక విధానాన్నీ, చరిత్రలోని ప్రతి సామాజిక ఉద్యమాన్నీ, 'శాశ్వత న్యాయ' దృక్పథం నుండిగానీ లేక

యితఃపూర్వం అలవరచుకున్న అభిప్రాయ దృక్పథంనుండిగానీ, పరిగణించరాదు. కానిచరిత్రకారులు తరచుఇలాగే పరిగణించారు. ఆసామాజికవిధానం లేక ఆసామాజిక వుద్యమం ఏర్పడటానికి గల పరిస్థితుల దృక్పథంనుండి, లేక పైరెండింటికి ఆధారభూతములైన వాటి దృక్పథంనుండి పరిగణించాలి.

ఆధునిక పరిస్థితులలో బానిసవిధానం సహజమూ అర్థరహితమూ, బుద్ధి హీనమూ అవుతుంది. కాని, క్షీణించిపోవుచున్న ఆదిమ సమాజవిధాన పరిస్థితులలో, బానిసవిధానాన్ని బాగా అర్థంచేసుకోవచ్చు. ఆదిమ సామాజిక విధానంకంటే బానిస విధానం పురోగమనాన్ని సూచించుతుంది. కనుక అది సహజమైన దృగ్విషయం.

ఉదాహరణకు 1905 లో రష్యాలో జారు ప్రభుత్వం, బూర్జువాసమాజం వున్నపుడు బూర్జువాప్రజాతంత్ర రిపబ్లిక్‌ను కోరడం చాలా సహజమైన అర్థం చేసుకోదగిన - విప్లవకరమైన కోరిక. అప్పుడు బూర్జువా రిపబ్లిక్‌ను కోరడం అంటే ఒక అడుగు ముందుకు వేయడం అన్నమాట. కాని సోవియట్ యూనియన్ (U.S.S.R.) ఏర్పడిన నేటిపరిస్థితులలో బూర్జువా ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను కోరడం మతిలేని, విప్లవ ప్రతీఘాతమైన కోరిక. ప్రజాతంత్ర సోవియట్ రిపబ్లిక్‌తో పోల్చినట్లైతే బూర్జువా రిపబ్లిక్‌ను కోరడం వెనకడుగు వేయడమే.

ప్రతిదీకూడా దేశ, కాలమాన పరిస్థితులపై ఆధారపడి వుంటుంది.

సామాజిక దృగ్విషయాలకు అలాంటి చారిత్రక పరిశీలన లేకపోయినట్లయితే, చరిత్రశాస్త్రంయొక్క ఉనికే అభివృద్ధి

(Development of the Science of History) అసాధ్యమని తేటతెల్లమే. అలాంటి పరిశీలన లేనిపక్షంలో చరిత్ర శాస్త్రాన్ని అనేక యాదృచ్ఛిక ఘటనల కలగాపులగంగానూ, అత్యంత అసంగతమైన తప్పులకుప్పగానూ అర్థం చేసుకుంటాం. అలాంటి ప్రమాదంనుండి యీ పరిశీలన కాపాడుతుంది.

ఇంతేగాక ప్రపంచం నిరంతర గమనమూ, అభివృద్ధీ కల్గివున్నట్లయితే, పాతది చచ్చిపోతూవుండడం, కొత్తది ఉద్భవించుతూ వుండడం అభివృద్ధి సూత్రమయినట్లయితే, 'మార్పు చెందని' సామాజిక విధానాలు వుండవనిసుస్పష్టం. స్వంతఆస్తి, దోపిడి అనే "శాశ్వత సూత్రాలు" ఉండవనుట స్పష్టం. రైతు భూస్వామికీ, కార్మికుడు పెట్టుబడిదారునికీ లొంగివుండాలనే "శాశ్వత భావాలు" ఉండజాలవనుట స్పష్టం.

అందుచేత భూసామ్య విధానం స్థానే పెట్టుబడిదారీ విధానం వచ్చినట్లుగానే, పెట్టుబడిదారీ విధానం స్థానే సోషలిస్టు విధానాన్ని నెలకొల్పవచ్చు.

అందుచేత, సమాజంలో ప్రస్తుతం ప్రాబల్యశక్తిగా ఉన్నప్పటికీ ఇక ఏమాత్రమూ వృద్ధిచెందనటువంటి సామాజిక శక్తులను (Strata of the society) ఆధారం చేసుకొని, మనం నిర్ణయాలకు రాకూడదు. ప్రస్తుతం ప్రబలశక్తిగా లేకపోయినప్పటికీ, వృద్ధిచెందుతున్న భవిష్యత్ కలిగియున్న - సామాజిక శక్తులపై ఆధారపడి నిర్ణయాలకు రావాలి.

1880-90 సంవత్సరాలలో, మార్క్సిస్టులకు, నరోద్నిక్లకు మధ్య సిద్ధాంత ఘర్షణ జరుగుతున్న కాలంలో, రష్యన్ శ్రామిక వర్గం జనాభాలో గణింపరాని అల్పసంఖ్యాకంగా

వుండేది. జనాభాలో అధికసంఖ్యాకులు వ్యక్తిగతరైతులే. కాని శ్రామికులు ఒక వర్గంగా పెంపొందుతున్నారు. రైతాంగం ఒక వర్గంగా శిథిలమైపోతూంది. శ్రామికులు ఒక వర్గంగావృద్ధి చెందుతున్నారు. కాబట్టే మార్కిస్టులు వారిపైన ఆధారపడి తమదృక్పథాన్ని నిర్ణయించుకున్నారు. ఇలా చేయుటలో వారు పొరపడలేదు. ఎందువల్లనంటే ఆతర్వాత అశ్రామికవర్గం అప్రాముఖ్యశక్తిగా నున్నస్థితినుండి మొదటి రకపు చారిత్రక రాజకీయశక్తిగా అభివృద్ధిచెందిందని మనకు తెలుసు.

అందుచేత పాలసీలో (విధానంలో) పొరబడకుండా వుండాలంటే ముందుకు చూడాలిగాని, వెనక్కు చూడరాదు.

అంతేగాక, నెమ్మదియైన పరిమాణపు మార్పులు హాఠాత్తుగా, త్వరితంగా గుణాత్మకమైన మార్పులలోకి నడచుట అభివృద్ధి సూత్రమైనట్లయితే - పీడితవర్గాలు చేసే విప్లవాలు అతిసహజమైనవనీ, అనివార్యమైన దృగ్విషయాలనీ సుస్పష్టమే.

అందుచేత పెట్టుబడిదారీ విధానం నుండి సోషలిజానికి పరివర్తన, పెట్టుబడిదారీ బానిసతనము నుండి కార్మికవర్గాన్ని విముక్తి చేయటం, నెమ్మదియైన మార్పులతో, సంస్కరణ లతో జరగజాలదు. పెట్టుబడిదారీ విధానంలో గుణాత్మక మైన మార్పు ద్వారా అనగా విప్లవం ద్వారానే, అది సాధ్య మవుతుంది.

అందుచేత పాలసీలో పొరబడకుండా వుండాలంటే, విప్లవవాది అయివుండాలి కాని సంస్కరణవాది కాగూడదు.

ఇంతేకాదు. అంతర్గత వైరుధ్యాలను బహిర్గతపరచే మార్గం ద్వారానే అభివృద్ధి నడుస్తుంది. ఈ వైరుధ్యాలను జయించుటకు, వీటిపై ఆధారపడిన ప్రతికూల శక్తులమధ్య ఘర్షణయే మార్గం. ఈ సూత్రమే నిజమైనట్లయితే, శ్రామిక వర్గ పోరాటం అతి స్వభావసిద్ధమైన, అనివార్యమైన దృగ్విషయమని స్పష్టమే.

అందుచేత పెట్టుబడిదారీ విధానంలోని వైరుధ్యాలను మనం కప్పిపుచ్చకూడదు. పైగా చిక్కు విడదీసి బహిర్గతం చేయాలి. మనం వర్గపోరాటాన్ని అడ్డుకొనే ప్రయత్నించరాదు. దానిని తుదిదాక కొనసాగించాలి.

అందుచే పాలసీలో పొరబడకుండా వుండాలంటే రాజీ లేని శ్రామికవర్గ పంథా అవలంబించాలి. అంతేగాని, శ్రామికుల, పెట్టుబడిదారుల ఉభయ ప్రయోజనాలను సామరస్యం కలదనే సంస్కరణవాదాన్ని అనుసరించకూడదు. "సోషలిజంలోకి పెట్టుబడిదారీ విధానం దానంతటకదే పెంపొందుతుంది" అనే రాజీ బేరగాళ్ళ పాలసీని అనుసరించరాదు.

ఇదీ, సామాజిక జీవితానికి, సమాజ చరిత్రకు మార్క్సిస్టు గతితార్కిక పద్ధతిని అనుసరించు పద్ధతి.

ఇక మార్క్సిస్టు తాత్విక భౌతికవాదం, ప్రధానంగా తాత్విక భావవాదానికి ప్రత్యక్ష వ్యతిరేకం.

**2. <u>మార్క్సిస్టు తాత్విక భౌతికవాదం</u> యొక్క ప్రధానలక్షణాలివి:**

(ఎ) "స్వయం భూ శక్తి" (Absolute idea) "విశ్వ విరాట్"(Universal spirit), "చైతన్యం" (Conciousness)-

వీటి ఆ కృతియే ప్రపంచమని భావవాదం అంటుంది. దీనికి వ్యతిరేకంగా, మార్క్సిస్టు తాత్విక భౌతికవాద అభిప్రాయం ఇది: ప్రపంచం స్వతస్సిద్ధంగానే భౌతికం (Material) ప్రపంచం లోని బహువిధమైన దృగ్విషయాలు చలనాత్మక పదార్థం యొక్క వివిధరూపాలు. దృగ్విషయాల అన్యోన్య సంసర్గమూ, పరస్పర ఆధారమూ, చలించే పదార్థముయొక్క చలన సూత్రాల ననుసరించి ప్రపంచం వృద్ధి చెందుతుంది. అందుచే "విశ్వవిరాట్" యొక్క అవసరంలేదు. దీనిని గతితార్కికపద్ధతి రుజువుచేసింది.

ఏంగెల్సు యిలా అన్నాడు:

"ఎట్టి అన్యపదార్థ మిశ్రణంలేకుండా ప్రకృతిని, ఉన్న దున్నట్లు భావించడమే ప్రకృతిని భౌతికవాద దృక్పథంతో చూడటం." (ఏంగెల్సు: లడ్విగ్ ఫ్యూయర్ బా - ఇంగ్లీషు ఎడిషన్ మాస్కో - 1934 - 79వ పేజీ)

పురాతన తత్వవేత్తయగు హెరాక్లిటస్ (Heraclitus) భౌతికవాద భావాల ననుసరించి "ఏకజన్యమైన ప్రపంచాన్ని ఏ దేవుడుగాని, మానవుడుగాని సృష్టించలేదు. అది క్రమ పద్ధతిని ప్రజ్వరిల్లుతూ క్రమపద్ధతిని ఆరిపోతూవుండే జీవన జ్వాల. గతంలోనూ, నేడూ రేపూకూడా అంతే." దీనిపై వ్యాఖ్యానించుతూ లెనిన్ యిలా అన్నాడు: "ఇతడు గతి తార్కిక భౌతికవాదంయొక్క మూలసూత్రాలను చక్కగా వివరించాడు." (లెనిన్: ఫిలసాఫికల్ నోట్‌బుక్స్, రష్యన్ ఎడిషన్ 318వ పేజీ).

(బి) భావవాదం ఇలా వాదించుతుంది:

మన మనస్సు (Conciousness) మాత్రం తథ్యం. భౌతిక ప్రపంచం, ఉనికి, ప్రకృతి మన మనస్సులోనే, మన యింద్రియజ్ఞానాలలోనే, మన భావాలలోనే, మన అనుభూతిలో (Perception) మాత్ర ముంటాయి. (అంటే భౌతిక ప్రపంచం మిథ్య అని భావం - అనువాదకుడు) మార్క్సిస్టు భౌతికవాద తత్వశాస్త్రం దీనికి వ్యతిరేకంగా ఇలా అంటుంది:

పదార్థం, ప్రకృతి, ఉనికి మనమనస్సుకు సంబంధం లేకుండా వేరే బయటవున్న స్వతస్సిద్ధ వాస్తవికత (Objective Reality) పదార్థం ప్రాథమికమైనది. ఎందుచేతనంటే అది యింద్రియ జ్ఞానాలకు, భావాలకు, చైతన్యానికి మూలం. చైతన్యం అప్రధానం. అది పదార్థంనుండి పుట్టింది. అది పదార్థం యొక్క, ఉనికియొక్క ప్రతిబింబం. ఆలోచన అనేది పదార్థ జన్యం. అది అభివృద్ధిచెంది, ఉన్నతస్థాయికి చెందిన పరిపూర్ణతనుపొందు రూపమేమెదడు. మెదడు ఆలోచన యొక్క అంగం. అందుచేత పదార్థంనుండి ఆలోచనను విడదీయలేము. అలా విడదీస్తాననడం పెద్దపొరపాటు.

ఏంగెల్సు యిలా అన్నాడు:

"ఉనికి, ఆలోచనకు గల సంబంధమేమిటి? ప్రకృతికి, ఆత్మకు (Spirit) గల సంబంధమేమిటి? ఈ ప్రశ్నయే తత్వశాస్త్రమంతటికీ ప్రధానతమమైనది... ఈ ప్రశ్నకు సమాధానమిచ్చిన తత్వశాస్త్రజ్ఞులు రెండు పెద్దపక్షాలుగా చీలిపోయారు. ప్రకృతికంటే ఆత్మ ప్రధానమని వాదించేవారు... భావవాద పక్షంలో చేరుతారు. ఇతరులు అనగా ప్రకృతియే ప్రధానమని

వాదించేవారు భౌతికవాద పక్షంలో వివిధ శాఖలకు చెందు తారు. (కారల్ మార్క్స్ సెలెక్టెడ్ వర్క్స్ - ఇంగ్లీషు ఎడిషన్ మాస్కో - 1946, 1వ వాల్యూమ్ 366-67 పేజీ)

ఇంకా ఏంగెల్స్ యిలా ఉన్నాడు :

"భౌతిక ప్రపంచం ఇంద్రియ గ్రాహ్యా ప్రపంచం. మన మంతా చెందియున్న యీప్రపంచం ఒక్కటే నిజమైనది... మన చైతన్యం, ఆలోచన ఎంత యింద్రియాతీతంగా (Supra-sensuous) పైకి, కనిపించినా భౌతికమైన దేహాంగమైన, మెదడునుండి పుట్టినవే. పదార్థంచైతన్యంయొక్క ఉత్పత్తికాదు. పైగా చైతన్యమే పదార్థంనుండి ఉత్పన్నమైన అత్యున్నత స్వరూపం మాత్రమే." (కారల్ మార్క్స్ - సెలెక్టెడ్ వర్క్స్ రష్యన్ ఎడిషన్ 1 వ వాల్యూమ్ 332 వ పేజీ)

పదార్థం, ఆలోచన అనే సమస్యపై మార్క్స్ యిలా అన్నాడు :

"ఆలోచించు పదార్థమునుండి ఆలోచనను విడదీయుట అసాధ్యం. అన్నిమార్పులకు పదార్థమే మూలం."

(పై గ్రంధమే 335 వ పేజీ)

మార్క్సిస్టు తాత్విక భౌతిక వాదాన్ని వర్ణించుచూ లెనిన్ ఇలా అన్నాడు :

"చైతన్యం, ఇంద్రియ జ్ఞానం, అనుభవం - వీటికి సం బంధంలేని స్వతస్సిద్ధమైన బాహ్యాపుటునికి (పదార్థం) సాధా రణంగా భౌతికవాదం గుర్తించుతుంది......చైతన్యం ఉనికి

యొక్క ప్రతిబింబంమాత్రమే. మహా అయితే దాదాపు దాని నిజమైన (తగిన) సంపూర్ణంగా ఖచ్చితమైన ప్రతింబం."

(లెనిన్ - మెటీరియలిజం అండ్ ఎంప్రిరియో క్రిటిసిజమ్. ఇంగ్లీషు ఎడిషన్ - మాస్కో 1947, 337 - 38 పేజీలు)

ఇంకా లెనిన్ ఇలా అన్నాడు:

— "పదార్థం మన జ్ఞానేంద్రియాలమీద పనిచేస్తూ ఇంద్రియ సంచలనాలను పుట్టిస్తుంది. పై ఇంద్రియ సంచలనం ద్వారా గ్రాహ్యమయ్యే స్వతస్సిద్ధ వాస్తవికతయే పదార్థం... పదార్థం ప్రకృతి, ఉనికి అంటే జడ ప్రపంచం ప్రధానమైనది. ఆత్మ, చైతన్యం, ఇంద్రియజ్ఞానం అంటే మానసిక ప్రపంచము-అప్రధానమైనది." (పై గ్రంథమే 145 - 146 పేజీలు)

— "ప్రపంచ చిత్రపటమంతా పదార్థం ఎలా కదులుతోంది, పదార్థం ఎలా ఆలోచించుతోంది అను దాని చిత్రపటమే." (పై గ్రంథమే 367 వ పేజీ)

— "ఆలోచనయొక్క అంగమే మెదడు." (పై గ్రంథమే152 వ పేజీ)

(సి) భావవాదం ప్రపంచాన్ని, దాని సూత్రాలను తెలుసుకోవటం సాధ్యం కాదంటుంది. మన జ్ఞానంయొక్క ప్రామాణికత్వాన్ని నమ్మదు. స్వతస్సిద్ధ సత్యాన్ని (Objective truth)గుర్తించదు. శాస్త్రవిజ్ఞానం ఎన్నడూ తెలుసుకోజాలని అగోచర విషయాలతో (Things in themselves) ప్రపంచంనిండి వుంటుందని దాని వాదన. దీనికి వ్యతిరేకంగా మార్క్సిస్టు తాత్విక భౌతికవాదం ఇలా అభిప్రాయపడుతుంది: ప్రపంచాన్ని, దాని సూత్రాలనూ సంపూర్ణంగా తెలుసుకో

గలము. ఆచరణద్వారా ప్రయోగంద్వారా పరీక్షచేయబడిన ప్రకృతిసూత్రాలను గురించిన మన జ్ఞానం ప్రామాణికమైనది. స్వతస్సిద్ధ సత్యానికిగల రూఢి దానికేవుంది. ప్రపంచములో తెలుసుకోలేని వస్తువులంటూ లేవు. ఇంకా మనకు తెలియ నటువంటి వస్తువులుంటే వుండవచ్చు. శాస్త్రవిజ్ఞానం, ఆచరణ, ప్రయత్నాలద్వారా వాటినిబహిర్గతంచేసి, తెలియపరచవచ్చు.

ప్రపంచాన్ని తెలుసుకోలేమనీ, తెలియజాలనటువంటి "అగోచర వస్తువులు" (Things in themselves) ఉన్నవని చెప్పే కాంట్, ఇంకా తదితర భావవాద ప్రతిపాదనను(థీసిస్) ఏంగెల్సు విమర్శించాడు. పైగా మన జ్ఞానం ప్రామాణికమైన జ్ఞానమని చెప్పే సుప్రసిద్ధ భౌతికవాద ప్రతిపాదనను (థీసిస్) ఏంగెల్స్ సమర్థించాడు. ఆ సందర్భంలో ఏంగెల్సు యిలా వ్రాశాడు:

"ఈ పిచ్చిధోరణిని, యిలాంటి యితర తాత్విక పిచ్చి ధోరణులను, పరిశోధన పరిశ్రమలతో గూడిన ఆచరణతో నిశ్శేషంగా ఖండించవచ్చు. ప్రకృతిక్రమాన్ని దాని పరిమితుల నుండి బయను తీసుకొనివచ్చి దానిచే మన ప్రయోజనాలను పూర్తిచేయించుకొనుట ద్వారా, ప్రకృతిక్రమాన్ని గూర్చి మనమే సృష్టించుట ద్వారా దానిని, మన భావన ఎంతవరకు సరియైనదో రుజువు చేయగలిగినట్లయితే, బుద్ధికి అందని అగోచర వస్తువు కలదనే కాంట్ వాదం సమసిపోతుంది. జంతువుల, వృక్షాల శరీరాలలో ఉత్పత్తి కాపాడిన రసాయనిక ద్రవ్య ములు, జీవరసాయన శాస్త్రం (Organic Chemistry) ఒకొక్కటీ ఉత్పత్తి చేసేవరకు, అగోచర వస్తువులుగానేవుండి

పోయాయి. కాని ఆ తర్వాత యీ అగోచర వస్తువు గోచర
వస్తువుగా మారింది. ఉదాహరణకు, అలిజారిన్ అనే చాయ
వేరుయొక్క రంగు పదార్థాన్ని తయారుచేయాలంటే, ఇప్పుడు పొలాలలో చాయవేరులను నాటి పెంచి, కష్టపడనక్కరలేదు. దానిని యింకా చౌకగాను, సులభంగాను బొగ్గు తారునుండి తయారుచేయవచ్చు. మూడువందల సంవత్సరాల క్రితంవరకు * కోపర్నికస్ కనిపెట్టిన సూర్యకుటుంబం యింకా ఊహా విషయమే (Hypothesis). ఒకటికి వంద, వెయ్యి, పదివేలు ఛాన్సులు దానికి అనుకూలంగా వున్నప్పటికీ అది ఊహా విషయమే. కాని యీపద్ధతి యిచ్చినలెక్కలద్వారా "లెవెరియాక్" మనకు తెలియనటువంటి ఒక గ్రహం (Planet) ఉండితీరాలని తేల్చాడు. ఇంతేగాక యీ గ్రహం ఆకాశంలో తప్పకుండా ఏ ప్రదేశాన్ని ఆక్రమించి వుండితీరాలో ఆ ప్రదేశాన్ని కూడా గుణించాడు. తర్వాత గ్యాలీ (Gallee) శాస్త్రజ్ఞుడు నిజంగానే యీ గ్రహాన్ని కనుగొన్నాడు. అంతటితో కోపెర్నికస్ పద్ధతి నిజమని రుజువు కాబడింది" (కారల్ మార్క్సు: సెలెక్టెడ్ వర్క్సు - ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1946, 1వ వాల్యూమ్ 368 వ పేజీ).

మాక్ అశాస్త్రీయ (ఫీడిజమ్ - శాస్త్రవిజ్ఞానాన్ని తిరస్కరించే అంధవిశ్వాసం) వాదాన్ని అనుసరించే బోగ్డనోవ్, బాజరోవ్, యుష్కెవిచ్ మొదలైనవారిని లెనిన్ ఖండించాడు. ప్రకృతిసూత్రాలను గురించి మనకుగల శాస్త్రీయ విజ్ఞానం (Scientific Knowledge) ప్రామాణికమైన జ్ఞానమేనని,

---

* కోపర్నికస్ ప్రష్యన్ (జర్మన్) ఖగోళశాస్త్రజ్ఞుడు. 1473—1543

సైన్సుసూత్రాలు స్వతస్సిద్ధ సత్యాన్ని చిత్రించుతాయని అన్న సుప్రసిద్ధ భౌతికవాద ప్రతిపాదనను (థీసిస్) లెనిన్ సమర్థించాడు. ఈ సందర్భంలో లెనిన్ ఇంకా ఇలా అన్నాడు:

"వర్తమాన ఫీడిజమ్ విజ్ఞానశాస్త్రాన్ని తిరస్కరించనే తిరస్కరించదు. అదివిజ్ఞానశాస్త్రంయొక్క 'అతిశయ సామర్థ్యాలను' (Exaggerated Claims of Science) మాత్రం తిరస్కరిస్తుంది. అనగా విజ్ఞానశాస్త్రంకూడా స్వతస్సిద్ధ సత్యం అనేమాటను మాత్రమే తిరస్కరిస్తుందట. భౌతికవాదులు అనుకున్నట్లు స్వతస్సిద్ధసత్యం ఉన్నట్లయితే మానవ 'అనుభవం'లో ప్రతిబింబించే బాహ్యప్రపంచాన్ని ప్రకృతిశాస్త్రం ఒకటే స్వతస్సిద్ధసత్యాన్ని యివ్వగలిగినదైతే, ఫీడిజమ్ పూర్తిగా ఖండింపబడిందన్నమాట." (లెనిన్ - మెటీరియలిజమ్ అండ్ ఎంప్రిమోక్రిటిసిజం. ఇంగ్లీషు ఎడిషన్- మాస్కో - 1947 - 123-124 పేజీలు)

ఇవీ క్లుప్తంగా చెప్పాలంటే, మార్క్సిస్టు తాత్విక భౌతికవాదంయొక్క విలక్షణమైన సూత్రాలు.

సామాజిక జీవితాన్ని, సమాజ చరిత్రను అధ్యయనం చేయటానికి, తాత్విక భౌతికవాద సూత్రాలను విస్తరింపజేయుట ఎంత అత్యంత ప్రాముఖ్యమో సులభంగా అర్థం చేసుకోవచ్చు. సమాజ చరిత్రకు, శ్రామికవర్గ పార్టీ ప్రత్యక్ష కార్యకలాపాలకు వీటిని వర్తింపజేయడం ఎంత అత్యంత ప్రాముఖ్యమో సులభంగా గ్రహించవచ్చు.

ప్రకృతి దృగ్విషయాల, వాటి అన్యోన్య సంసర్గాల మధ్య సంబంధం, ప్రకృతి అభివృద్ధి సూత్రమైనట్లైతే-సామాజిక

దృగ్విషయాల సంబంధమూ, పరస్పర ఆధారమూ కూడా సామాజికాభివృద్ధి సూత్రాలేగాని, ఏవో హఠాత్ ఘటనలు కావు.

అందుచేత సామాజిక జీవితం, సమాజ చరిత్రా, హఠాత్ ఘటనల కుప్పకాదు; ఒక నిశ్చితసూత్రాల ననుసరించి జరుగుతున్న సమాజ అభివృద్ధి చరిత్రయే అది. అందుచే సమాజచరిత్ర అధ్యయనం ఒకశాస్త్రం (Science) అవుతుంది.

అందుచేత శ్రామికవర్గపార్టీ ప్రత్యక్ష కార్యకలాపం "మహోన్నతవ్యక్తుల" మంచి కోర్కెలపై ఆధారపడి యుండ కూడదు; "సబబు" (Reason), "విశ్వజనీన నీతులు" అనే నిబంధనల ననుసరించి యుండరాదు. కాని సమాజ అభివృద్ధి సూత్రాలమీద వాటి అధ్యయనంమీద ఆధారపడి యుండాలి.

ఇంతేగాదు. ప్రపంచం తెలుసుకొనగలిగినదైతే, ప్రకృతి అభివృద్ధి సూత్రాలను గురించిన మనజ్ఞానం స్వతస్సిద్ధసత్యం వలెనే రూఢియైన ప్రామాణిక జ్ఞానమే. అయితే, సామాజిక జీవితం, సమాజ అభివృద్ధి తెలియదగినవే. సామాజికాభివృద్ధి సూత్రాలను గురించిన శాస్త్రీయ సమాచారమే (Data of Science) స్వతస్సిద్ధిసత్యం వలెనే రూఢియైన ప్రామాణిక సమాచారమే.

కాబట్టి చరిత్రయొక్క విజ్ఞానశాస్త్రం - సమాజజీవిత దృగ్విషయాలు ఎంత క్లిష్టంగా వున్నప్పటికీ - జీవశాస్త్రంవలె ఖచ్చితమైన విజ్ఞానశాస్త్రం కాగలదు. అంతేగాక సమాజ చరిత్ర సైన్సు, సమాజ అభివృద్ధి సూత్రాలను తన నిత్యకృత్యావసరాలకు ఉపయోగించుకోగలిగిన సామర్థ్యంకలది.

అందుచేత శ్రామికవర్గపార్టీ తన ప్రత్యక్ష కార్యకలాపాన్ని యదాలాప (Casual) వుద్దేశాలతో నడుపకూడదు. సామాజికాభివృద్ధి సూత్రాలచేత, యీ సూత్రాలనుండివచ్చిన ప్రత్యక్ష అనుభవాలచేత, అది నడిపింపబడాలి. కాబట్టి సోషలిజం, మానవలోకానికి మంచి భవిష్యత్ ను కోరే స్వప్నంనుండి (నిజమైన) సైన్సుగా మారింది.

అందువల్ల సైన్సుకు ప్రత్యక్ష కార్యకలాపానికి మధ్య-సిద్ధాంతానికీ, ఆచరణకూ మధ్య గల బంధము, వాటి ఐక్యత, శ్రామికవర్గపార్టీని నడుపు వేగుచుక్కగా వుండాలి.

ఇంతేగాకు. ప్రకృతీ, ఉనికీ, భౌతిక ప్రపంచమూ ప్రధానమైనవి - చైతన్యం, ఆలోచన అప్రధానమైనవి, తదుద్భవములూ (పూర్వవిషయంనుండి జనించినవి) చైతన్యం స్వతస్సిద్ధవాస్తవికత యొక్క ప్రతిబింబం. మానవుల చైతన్యంతో సంబంధంలేకుండా వుంటున్న స్వతస్సిద్ధవాస్తవికతను భౌతికప్రపంచం చిత్రించుతుంది. ఇవన్ని నిజంకాబట్టి, సమాజం యొక్క భౌతిక జీవితం సమాజపుటునికీ ప్రధానమైనవే. సమాజ ఆముష్మిక జీవితం (Spiritual life) అప్రధానమూ, తదుద్భవమూ అవుతుంది. మానవులు యిచ్ఛతో సంబంధం లేకుండా వున్న స్వతస్సిద్ధ వాస్తవికతయే సమాజ భౌతిక జీవితం. స్వతస్సిద్ధ వాస్తవికతయొక్క ప్రతిబింబమే, ఉనికె యొక్క ప్రతిబింబమే సామాజిక ఆముష్మిక జీవితం.

కాగా, సమాజ ఆముష్మిక జీవితం ఏర్పడటానికిగల మూలాన్ని - సామాజిక అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ, రాజకీయ దృక్పధాలూ, వ్యవస్థలూ - వీటికిగల మూలాన్ని

ఆ భావాలలోనే, సిద్ధాంతాలలోనే, దృక్పథాల్లోనే, రాజకీయ వ్యవస్థలోనే (ఉన్నదని) వెదకకూడదు. కాని భావాలూ, సిద్ధాంతాలూ, దృక్పథాలూ, రాజకీయ వ్యవస్థలూ మొదలైనవి దేనికి ప్రతిబింబమో ఆ సామాజపుటునికిలోనే, దాని భౌతిక జీవిత పరిస్థితుల్లోనే వెదకాలి.

కాబట్టి సమాజ చరిత్రలోని వివిధ కాలాలలోని వివిధ సామాజికాభిప్రాయాలూ, సిద్ధాంతాలూ, దృక్పథాలూ, రాజకీయవ్యవస్థలూ కనిపించుతాయి. బానిసవిధానంక్రింద ఒకరకపు సామాజికాభిప్రాయాలూ, సిద్ధాంతాలూ, దృక్పథాలూ, రాజకీయ వ్యవస్థలున్నూ, భూస్వామ్య విధానంక్రింద మరొరకమున్నూ, పెట్టుబడిదారీ విధానంక్రింద యింకా విభిన్నమైనటువంటివిన్నీ మనకు తారసిల్లుతాయి. దీనికికారణం ఏమిటి? ఆ భావాల, సిద్ధాంతాల, దృక్పథాల, రాజకీయ వ్యవస్థల "స్వభావమే," "నైజగుణమే" అందుకు కారణమని వివరించరాదు. సమాజ అభివృద్ధిలో విభిన్నకాలాలలోని భౌతికజీవితంయొక్క విభిన్నపరిస్థితులే, వాటికికారణమని విశదపర్చాలి.

సమాజపుటునికి ఎలాంటిదో, భౌతికజీవిత పరిస్థితులెలాంటివో ఆ సమాజంయొక్క అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ, రాజకీయదృక్పథాలూ, వ్యవస్థలూకూడా అలాంటివే.

ఈ సందర్భంలో మార్క్సు యిలా అన్నాడు :

"మానవుల ఉనికి నిశ్చయించేది వారి చైతన్యంకాదు. తద్వ్యతిరేకంగా, సమాజపుటునికియే వారి చైతన్యాన్ని నిశ్చయించుతుంది." (కారల్ మార్క్సు, సెలెక్టెడ్ వర్క్సు - ఇంగ్లీషు ఎడిషన్ - మాస్కో - 1946, 1వ వాల్యూమ్ 300 పేజీ)

కాబట్టి పాలసీలో పొరబడకుండా వుండాలంటే, కలలు గనే సోమరిపోతుల స్థితిలో పడిపోకుండా వుండాలంటే, శ్రామికవర్గ పార్టీ తన కార్యకలాపాలను కేవలం "మానవ హేతు సూత్రాలపై" ఆధారపడి కొనసాగించరాదు. అది తన కార్యకలాపాలను సమాజ అభివృద్ధిని నిర్ణయించే భౌతికజీవిత నిర్ణీత పరిస్థితులపై ఆధారపడి కొనసాగించాలి. "మహాత్ముల" యొక్క మంచి కోర్కెలపై ఆధారపడకూడదు. సమాజ భౌతికజీవితాభివృద్ధికి కావలసిన నిజమైన అవసరాలపై ఆధార పడాలి.

ఉటోపియన్ల (ఊహపై ఆధారపడేవారు - కలలుగనే వారు, నరోడ్నిక్‌ల, అనార్కిస్టుల (అరాచక వాదుల) సోష లిస్టు రివల్యూషనరీల పతనానికి కారణం (యితరకారణాలతో పాటు) సమాజాభివృద్ధిలో దాని భౌతిక జీవితపరిస్థితులు ఎలాంటి ప్రధానపాత్ర వహించుతాయో వారు గుర్తించక పోవుటయే. పైగా భావవాదంలో మునిగిపోయి, తమ ప్రత్యక్ష కార్యాచరణకు, సమాజ భౌతికజీవిత అభివృద్ధికి కావలసిన అవస రాలపై ఆధారపడరు. ఈ అవసరాలను నిర్లక్ష్యపరచి, వీటికి సంబంధం లేకుండా సమాజ నిజజీవితంనుండి వేరుచేయబడిన "స్వాప్నిక ప్రణాళికల" (Ideal plans) మీాద, "సర్వతో ముఖ ప్లానుల" (All embracing projects) పైన, తమ ప్రత్యక్ష కార్యకలాపాలను కొనసాగించుతారు.

సమాజ భౌతిక జీవితాభివృద్ధికి కావలసిన అవసరాలపై మార్కిస్జం - లెనినిజం, తన ప్రత్యక్షకార్యకలాపాలకు ఆధార పడింది. ఎప్పుడూకూడా సమాజ నిజజీవితం నుండి అది

విడిపోలేదు. ఇందులోనే మార్క్సిజం - లెనినిజంయొక్క శక్తి, పటిమా యిమిడివున్నాయి.

సామాజిక భావాలు, సిద్ధాంతాలు, రాజకీయ దృక్పథాలు, వ్యవస్థలు - వీటికి సమాజ జీవితంలో ఎట్టి ప్రాముఖ్యతా లేదని మార్క్స్ మాటల ఆంతర్యం కాదు. అవి సమాజపు టునికినీ, సమాజ జీవిత భౌతికపరిస్థితుల అభివృద్ధినీ పరస్పరం మార్పుచేయజాలవని మార్క్స్ భావం కాదు. మేమింతవరకు సామాజిక భావాలూ, సిద్ధాంతాలూ, దృక్పథాలూ, రాజకీయ వ్యవస్థలూ-వీటి మూలాన్ని గురించీ, ఇవి ఎలా తలఎత్తినవి అనే విషయాన్ని గురించీమాత్రమే వివరిస్తున్నాము. సమాజ భావ జీవితం సమాజ భౌతికజీవిత పరిస్థితుల ప్రతిబింబం అన్న విషయాన్ని గురించి మాత్రమే మాట్లాడుతున్నాం. సామాజిక భావాల, సిద్ధాంతాల, దృక్పథాల, రాజకీయ వ్యవస్థల ప్రాముఖ్యతను చరిత్రలో వాటిపాత్రను చారిత్రక భౌతికవాదం తిరస్కరించదు. పైగా, సామాజికజీవితంలో - చరిత్రలో ఈ అంశాల ప్రాముఖ్యతను, ప్రముఖపాత్రను నొక్కిచెపుతుంది

సామాజిక భావాలలో, సిద్ధాంతాలలో అనేకరకాలున్నాయి. తమ సామాజికపాత్రను ముగించుకొని మృత్యుశయ్యపై నున్న సమాజశక్తుల ప్రయోజనాలకోసం పాటుబడుతున్నటువంటి పాతభావాలూ, సిద్ధాంతాలూ కొన్ని వుంటాయి. సమాజ అభివృద్ధిని పురోగమనాన్ని అరికట్టుటలోనే వాటి ప్రాముఖ్యత వుంది. సమాజంలో పురోగమించిన శక్తుల ప్రయోజనాలకోసం పాటుబడే, నూతన అభివృద్ధికర భావాలూ, సిద్ధాంతాలూ మరికొన్ని వున్నాయి. సమాజ

అభివృద్ధినీ, పురోగమనాన్ని సులభంచేయుటలోనే వీటి ప్రాముఖ్యత వుంది. సమాజ భౌతికజీవిత అభివృద్ధికి కావలసిన అవసరాలను ఎంత ఖచ్చితంగా ఇవి ప్రతిబింబించితే అంత ప్రాముఖ్యత వీటికి వుంది.

సమాజ భౌతిక జీవితాభివృద్ధి, ఆసమాజంముందు కొన్ని నూతన కర్తవ్యాలను నిర్దేశించుతుంది. ఆ తర్వాతనే నూతన సామాజిక అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ తలయెత్తాయి. ఒకసారి తలయెత్తిన తర్వాత అవి చాలా బలిష్టమైన శక్తిగా తయారవుతాయి. సమాజ భౌతికజీవితాభివృద్ధి నిర్దేశించిన కర్తవ్యాలను పూర్తిచేయడానికి, ఆశక్తి, సులభంచేస్తుంది. సమాజ పురోగమనాన్ని సులభపరుస్తుంది. నూతన భావాల, సిద్ధాంతాల, రాజకీయదృక్పథాల, రాజకీయ వ్యవస్థలయొక్క అత్యద్భుత సంఘటనా ప్రాధాన్యత, మార్పుచేసే ప్రాధాన్యత యిందులోనే యిమిడివుంది. సమాజానికి అవసరం కనుకనే నూతన సామాజిక అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ ఉదయించుతాయి. వాటిని సంఘటిత పరచకుండా, సమీకరించకుండా, మార్పుచేయకుండా సమాజ భౌతిక జీవితాభివృద్ధియొక్క తక్షణ కర్తవ్యాలను నెరవేర్చుట అసాధ్యం. సమాజం భౌతిక జీవిత అభివృద్ధి నిర్దేశించిన నూతన కర్తవ్యాలనుండి ఉద్భవించిన నూతన సామాజికాభిప్రాయాలూ, సిద్ధాంతాలూ ముందుకు చొచ్చుకు పోతాయి. ప్రజలసొత్తు అవుతాయి సమాజంలో చనిపోవుచున్న శక్తులకు వ్యతిరేకంగా, వారిని సమకూర్చి సంఘటిత పరుస్తాయి. ఆవిధంగా సమాజ భౌతిక జీవితాభివృద్ధిని అరికట్టే యీశక్తులను పడద్రోయుటను సులభపరచుతాయి. ఆవిధంగా సామాజిక భావాలూ, సిద్ధాంతాలూ,

రాజకీయ వ్యవస్థలూ, సమాజభౌతిక జీవితాభివృద్ధియొక్క తక్షణకర్తవ్యాల నాధారంచేసుకొని ఉదయించినాయి. సమాజపు ఉనికియొక్క అభివృద్ధిపై ఆధారపడి ఉదయించుతాయి. అలా ఉదయించి, అవి, మరల సామాజిక ఉనికిపైనా, సమాజ భౌతిక జీవితంపైనా ప్రతిక్రియ కల్గిస్తాయి (రియాక్ట్ అవుతాయి). సమాజ భౌతికజీవిత తక్షణ కర్తవ్యాలను పూర్తిగా నెరవేర్చుటకూ, సమాజాభివృద్ధి యింకా కొనసాగుట సాధ్యమయేట్లు చేయుటకు అవసరమైన పరిస్థితులు సృష్టిస్తాయి.

ఈ సందర్భంలో మార్క్సు ఇలా అన్నాడు:

"సిద్ధాంతం, ప్రజాసామాన్యంలో పట్టు సంపాదించిన వెంటనే అది ఒక భౌతికశక్తి అవుతుంది."

అందువలన సమాజ భౌతికజీవిత పరిస్థితులపై ప్రభావం కలుగ చెయ్యడానికీ, సమాజ అభివృద్ధిని, బాగును త్వరపరచడానికీ, శ్రామికవర్గపార్టీ ఎలాంటి సామాజిక సిద్ధాంతంపై, భావంపై ఆధారపడాలి? అంటే ఆ సామాజిక సిద్ధాంతం, ఆసామాజికభావం సమాజ భౌతికజీవితాభివృద్ధికి కావలసిన అవసరాలను సరిగా ప్రతిబింబించేవై యుండాలి. తద్వారా అభివృద్ధి నిరోధక శక్తులను నాశనంచేసి, సమాజంలోని అభ్యుదయ శక్తులకు మార్గం సుగమంచేయడానికి సమర్థమైన శ్రామికవర్గపార్టీ మహాసైన్యంగా ప్రజాసామాన్య బాహుళ్యాన్ని, సమీకరించి, సంఘటితపరచి, కార్యరంగంలోకి దుమికించేదిగా అది వుండాలి.

"ఏకనమిస్టుల", "మెన్షివిక్కుల" పతనానికి కారణం (యితర కారణాలతో బాటు) ఇది: వారు అభ్యుదయ సిద్ధాంతం

యొక్క భావాలయొక్క సమీకరణా, సంఘటనా పరివర్తనా పాత్రను గుర్తించలేదు. పైగా మలిన భౌతికవాదపు వూబిలో మునిగిపోయారు. పైనచెప్పిన అంశాలపాత్రను వారు పూర్తిగా నిర్జీవంచేశారు. ఆవిధంగా పార్టీని చలన రహితంగాను, పనికి మాలిన దానిగాను చేశారు.

సమాజ భౌతికజీవితాభివృద్ధికి కావలసిన అవసరాలను సరిగ్గా ప్రతిబింబించే అభ్యుదయ సిద్ధాంతంపైననే, మార్క్సిజం-లెనినిజం, ఆధారపడుతుంది. ఆసిద్ధాంతాన్ని సరియైన స్థాయికి తీసుకుపోతుంది. ఈ సిద్ధాంతంలోవున్న సమీకరణా సంఘటనా. పరివర్తనా శక్తిని తుదిదాకా ఉపయోగించుకొనుట తమ కర్తవ్యమని మార్క్సిజం - లెనినిజం భావించుతుంది. ఇలా చేయుటలోనే మార్క్సిజం - లెనినిజంయొక్క బలమూ పటిమా ఇమిడి ఉన్నాయి. సామాజిక ఉనికికి, సామాజిక చైతన్యానికి మధ్యగల సంబంధమేమిటి? సమాజభావ (Spiritual) జీవితాభివృద్ధికి మధ్యగల సంబంధం ఏమిటి? ఈ ప్రశ్నకు చారిత్రక భౌతికవాదం యిచ్చే సమాధానం పైన చెప్పినదే.

# 3

## చారిత్రక భౌతికవాదం

ఈక్రింది ప్రశ్నను విశదీకరించవలసిన అవుసరముంది: సమాజ ఆకృతిని అనగా దాని భావాల, దృక్పథాల, రాజకీయ వ్యవస్థలను నిర్ణయించేటటువంటి "సమాజ భౌతిక పరిస్థితులు" అంటే చారిత్రక భౌతికవాద దృక్పథంలో, ఏమిటి?

అసలు యీ "సమాజ భౌతిక పరిస్థితులు" అంటే ఏమిటి? వాటి విశిష్ట లక్షణా లేమిటి?

"సమాజ భౌతిక జీవిత పరిస్థితులు" అన్న భావంలో అన్నిటికన్నా మొదటిది సమాజాన్ని చుట్టుకొనివున్న ప్రకృతి ఒకటి అనేదానిలో సందేహ మేమీలేదు. సమాజ భౌతిక జీవితానికి అత్యావసరమైన నిరంతర పరిస్థితి, భౌగోళిక పరిసరం. ఈ భౌగోళిక పరిసరం సమాజ అభివృద్ధిపై ప్రభావాన్ని కల్గి వుంటుంది. సమాజ అభివృద్ధిలో భౌగోళిక పరిసరం ఎలాంటి పాత్రను వహించుతుంది? ఒక విధానంనుండి మరొక విధానానికి పరివర్తనను, మానవ సామాజిక విధాన స్వభావాన్ని, సమాజ ఆకృతిని నిర్ణయించే ముఖ్యశక్తి భౌగోళిక పరిసరమేనా?

కాదు — అని చారిత్రక భౌతికవాదం యీ ప్రశ్నకు సమాధానం చెపుతుంది.

కాని భౌగోళిక పరిసరం సమాజాభివృద్ధికి అత్యావసరమైన నిరంతర పరిస్థితులలో ఒకటి అని నిస్సందేహంగా చెప్పవచ్చు. సమాజాభివృద్ధిపై భౌగోళిక పరిసరప్రభావం వుంటుంది. సమాజాభివృద్ధిని అది వేగిరపరచుతుంది, లేక వెనక్కు నెడుతుంది. కాని దాని ప్రభావం <u>నిర్ణయించే</u> ప్రభావం కాదు. భౌగోళికపరిసరాలలోనిఅభివృద్ధీ మార్పులకంటె,సమాజాభివృద్ధీ మార్పులు పోల్చరానంత త్వరితగతిని జరుగుతాయి. మూడు వేల సంవత్సరాల కాలంలో, యూరప్‌లో, మూడు వేర్వేరు సామాజిక పద్ధతులు ఒకదానితర్వాత నొకటి రద్దుగావింపబడ్డాయి. ఈమూడూ, ఆదిమసమాజ విధానం (Primitive

Communal System), బానిసవిధానం, భూస్వామ్యవిధానం (Feudal System). యూరప్‌లోని తూర్పు భాగంలో, అనగా సోవియట్‌రష్యాలో, నాలుగు సామాజిక పద్ధతులు ఒకదాని వెనుక ఒకటి రద్దుగావింపబడ్డాయి. అయినప్పటికీ యీ మధ్య కాలంలో యూరపులో భూగోళపరిస్థితులు అసలు మారనేలేదు. ఒకవేళ స్వల్పంగా మారినా భూగోళశాస్త్రం గమనించదగినంత మార్పులు జరగలేదు. అది పూర్తిగా సహజం కూడా. భౌగోళిక పరిసరంలో ఏమైనా ప్రాముఖ్యమైన మార్పులు రావాలంటే, లక్షలాది సంవత్సరాలు అవసరం. కాని మానవ సామాజికపద్ధతిలో ముఖ్యమైనమార్పులు రావాలంటే, ఏ రెండు వేల సంవత్సరాలో లేక ఏ కొద్దివందల సంవత్సరాలో చాలు.

దీనిని బట్టి సమాజాభివృద్ధిని నిర్ణయించే కారణం ముఖ్య కారణం భౌగోళిక పరిసరం కాజాలదని తేలుతుంది. ఎందువల్లనంటే అనేకవేల సంవత్సరాలవరకు దాదాపు ఎట్టి మార్పు లేనటువంటిది (భౌగోళిక పరిసరం), కొన్ని వందల సంవత్సరాల్లోనే ప్రధానమగు మార్పులకు లోనగుసటువంటి దాని యొక్క (సమాజం యొక్క) అభివృద్ధికి ప్రధానకారణం కాజాలదు.

ఇంతేగాక, "సమాజ భౌతిక జీవిత పరిస్థితులు" అన్న భావంలో, జనాభా పెరుగుదలా, తరతమ భేదాలతో గూడిన జనాభా ఒత్తిడి (Density) కూడా యిమిడివున్నది. ఎందుచేతనంటే సమాజభౌతిక జీవితపరిస్థితులలో ప్రజకూడా ఒక అవసరమైన మూలవస్తువు. ఒక నిశ్చిత కనీస ప్రజాసంఖ్య లేనిదే సమాజభౌతిక జీవితమంటూ ఒకటి లేనేలేదు. మాన

వుని సామాజిక విధాన స్వభావాన్ని నిర్ణయించే ప్రధానశక్తి జనాభా పెరుగుదలయే కాదా?

కాదనే ఈ ప్రశ్నకుకూడా చారిత్రక భౌతికవాదం సమాధాన మిస్తుంది.

సమాజాభివృద్ధిపై, జనాభా పెరుగుదల ప్రభావం కలిగి యుండుట నిజమే. అది సమాజాభివృద్ధిని వేగిరపర్చుతుంది, లేదా వెనక్కు నెడుతుంది అనుట నిజమే. కాని సమాజాభివృద్ధికి అది ముఖ్యమైనశక్తి కాజాలదు - సమాజాభివృద్ధిపై దాని ప్రభావం, నిర్ణయించే ప్రభావంకాదు. ఎందువల్లనంటే: ఒక ప్రత్యేక సామాజికవిధానం స్థానే ఫలానా ఫలానా కొత్త విధానమే ఎందుకురావాలి? ఇంకోవిధానమెందుకు రాకూడదు? ఆదిమ సమాజవిధానంస్థానే ఖచ్చితంగా బానిసవిధానమే ఎందుకురావాలి? బానిసవిధానం స్థానే భూస్వామ్య విధానమే ఎందుకురావాలి? భూస్వామ్యవిధానం స్థానే బూర్జువా విధానమే ఎందుకు రావాలి? మరొకటి ఎందుకు రాకూడదు? పై ప్రశ్నలకు జనాభా పెరుగుదల ఒక్కటే తాను సమాధానం ఈయజాలదు.

సామాజికాభివృద్ధిని నిర్ణయించే శక్తి జనాభా పెంపుదలయే అయినట్లైయితే, జనాభా ఎక్కువ వత్తిడిగానున్న చోట్ల, తదనుగుణ్యంగా ఉన్నతమైన సామాజిక విధానాన్ని సృష్టించి వుండవలసింది. కాని యిలా ఎక్కడా జరగడంలేదు. చైనాలోని జనాభావత్తిడి అమెరికా కంటె నాలుగు రెట్లు. కాని సామాజికాభివృద్ధిలో చైనాకంటె అమెరికాయే మిన్నగా వుంది. ఎందుచేతనంటే చైనాలో అర్ధభూస్వామ్యవిధానం ఇంకా

వుంది. అమెరికాలో చాలాకాలం క్రిందటనే పెట్టుబడిదారీ విధానం అత్యున్నతదశకు అభివృద్ధిచెందింది. బెల్జియంలోని జనాభావత్తిడి అమెరికాకంటే 19 రెట్లు ఎక్కువ. రష్యాకంటే 26 రెట్లు ఎక్కువ. అయినప్పటికీ బెల్జియంకంటె సామాజికాభివృద్ధిలో అమెరికాయే ఉన్నతంగా వుంది. ఇంక సోవియట్ యూనియన్‌తో పోలిస్తే, బెల్జియం ఒక చారిత్రక దశయే వెనుకబడివుంది. ఎందువల్లనంటే సోవియట్ యూనియన్, పెట్టుబడిదారీవిధానాన్ని వదలించుకొని, సోషలిజాన్ని నెలకొల్పింది. కాని బెల్జియంలో పెట్టుబడిదారీవిధానంయింకావున్నది.

దీనినిబట్టి సమాజాభివృద్ధికి ముఖ్యమైనశక్తి జనాభా పెంపుదలకాదు. కాజాలదు. సమాజ ఆకృతిని, సమాజవిధాన స్వభావాన్ని నిర్ణయించే ముఖ్యశక్తి, జనాభా పెరుగుదల కాజాలదు.

(ఎ) క్లిష్టమైన సమాజభౌతిక జీవిత పరిస్థితులలో - సమాజ ఆకృతిని, సమాజవిధాన స్వభావాన్ని, ఒక విధానం నుండి మరొక విధానానికి మారే సామాజికాభివృద్ధిని, నిర్ణయించే టటువంటి ప్రధానశక్తి ఏది?

ఈ విషయంపై చారిత్రక భౌతికవాద అభిప్రాయం యిది: మానవునిఉనికికి అనవసరమైన జీవితావసరాలను సంపాదించే విధానమే, జీవితానికి, సమాజ అభివృద్ధికి అత్యంత అవసరమైన - ఆహారం, బట్టలు, చెప్పులు, ఇండ్లు, వంటచెఱకు, ఉత్పత్తి సాధనాలు మొదలైన భౌతికవస్తువులను ఉత్పత్తిచేసే విధానమే - ఆ ప్రధానశక్తి.

జీవించాలంటే ప్రజలకు ఆహారం, బట్టలు, చెప్పులు, తలదాచుకునే స్థలం, వంటచెఱకు మొదలైనవి కావాలి. ఈ భౌతికవస్తువులు కావాలంటే ప్రజలు వీటిని ఉత్పత్తిచేయాలి. వీటి నుత్పత్తి చెయ్యాలంటే ప్రజలు ఉత్పత్తిసాధనాలు - ఆహారం, బట్ట, చెప్పులు, వంటచెఱకు, తలదాచుకునే స్థలం మొదలైనవాటిని తయారుచేసే ఉత్పత్తిసాధనాలు - కలిగి యుండాలి. వారీ సాధనాలను ఉత్పత్తిచేసి, ఉపయోగించ గలిగి యుండాలి.

సామాజిక ఉత్పత్తిశక్తులంటే ఏమిటి? ఒకటి భౌతిక వస్తువులను తయారుచేసే ఉత్పత్తిసాధనాలు. ఉత్పత్తిసాధనాల నుపయోగించి తమకు గల ఉత్పత్తి అనుభవంవల్ల, పని నేర్పరితనంవల్ల భౌతిక - వస్తు ఉత్పత్తిని కొనసాగించేటటు వంటి ప్రజలు రెండవవారు. ఇవి రెండూకలసి సమాజంయొక్క ఉత్పత్తిశక్తులవుతారు.

కాని ఉత్పత్తిశక్తులు, ఉత్పత్తిలో, ఉత్పత్తివిధానంలో, ఒక భాగం మాత్రమే. ప్రకృతిశక్తులతోను, వస్తువుల తోను మానవుల సంబంధాన్ని తెలియజేసే ఒక భాగం. మాత్రమే. (ఈ ప్రకృతిశక్తులను, వస్తువులను, మానవులు భౌతికవస్తువుల ఉత్పత్తికోసం వినియోగించుకుంటారు.) ఉత్పత్తి యొక్క, ఉత్పత్తివిధానంయొక్క మరోభాగం ఏమంటే మానవుల ఉత్పత్తి సంబంధాలు. అనగా ఉత్పత్తిక్రమంలో మనుష్యులకు పరస్పరం ఏర్పడే సంబంధాలు. భౌతికవస్తువుల ఉత్పత్తికి, ప్రకృతితో పోరాటంసాగించి, ప్రకృతిని మానవు లుపయోగించుకుంటారు. ఈ పోరాటం ఒకరితో ఒకరి సంబంధం

లేకుండా జరగదు. ప్రత్యేకంగా వ్యక్తులుసాగించే పోరాటం కాదిది. సమిష్టిగా, ముఠాలుగా, సమాజాలుగా యీ పోరాటాన్ని సాగిస్తారు. అందుచేత సర్వకాల సర్వావస్థలలోను, ఉత్పత్తి, సామాజిక ఉత్పత్తి అవుతుంది. భౌతికవస్తువులను ఉత్పత్తి చేస్తున్నపుడు మనుష్యులు ఉత్పత్తికిలోబడి పరస్పర సంబంధం ఏర్పరచుకుంటారు. ఏదోఒక రకపు ఉత్పత్తి సంబంధాలను ఏర్పరచుకుంటారు. ఈ సంబంధాలు దోపిడికి గురికానటువంటి స్వేచ్ఛాయుతప్రజల పరస్పర సహాయ సహకారాలు కావచ్చు; లేక పెత్తనమూ అణగిపడియుండుట అనే సంబంధాలైనా కావచ్చు; ఒక రకపు ఉత్పత్తి సంబంధాల నుండి, మరోరకపు ఉత్పత్తిసాధనాలకు పరివర్తనం చెందుటా కావచ్చు. ఉత్పత్తి సంబంధాల స్వభావం ఏదైనప్పటికీ, ఎల్లప్పుడూ, ప్రతి (సామాజిక) విధానంలోను, సమాజ ఉత్పత్తి శక్తులవలనే ఈ ఉత్పత్తి సంబంధాలుకూడా అత్యవసరమైన ఉత్పత్తి అంశాలుగా ఏర్పడుతాయి.

మార్క్స్ యిలా అన్నాడు:

"ఉత్పత్తిలో మనుష్యులు ప్రకృతితో ప్రవర్తించుటే గాక (Act), ఒకరితో ఒకరుగూడా ప్రవర్తించుతారు. ఒకానొకవిధంగా సహకారం చేసుకుంటూ, పరస్పరం తమ కార్యకలాపాలను అందజేసుకుంటూ వారు ఉత్పత్తిచేస్తారు. ఉత్పత్తి చేయటానికిగాను ఒకరితో ఒకరు నిర్ణిత సంబంధ బాంధవ్యాల లోకి ప్రవేశించుతారు. ఈ సామాజికసంబంధ బాంధవ్యాల లోనే వారు ప్రకృతితో ప్రవర్తించుట, ఉత్పత్తిచేయుట, సంభ

వించుతుంది." (కారల్ మార్క్స్ : సెలెక్టెడ్ వర్క్స్ : ఇంగ్లీషు ఎడిషన్ మాస్కో - 1946. 1వ వాల్యూమ్ 211వ పేజీ)

కాబట్టి ఉత్పత్తివిధానం, సామాజిక ఉత్పత్తిశక్తులను ఉత్పత్తిలో మనుష్యుల సంబంధాలను ఆవరించుతుంది. ఆ విధంగా భౌతికవస్తువుల ఉత్పత్తిక్రమంలో వాటి ఐక్యతను, అది చిహ్నంగా కూడా తయారవుతుంది.

(బి) ఉత్పత్తి స్వరూపాలేమిటి?

మొదటిది: ఉత్పత్తి ఒకేచోట చాలకాలం నిలబడదు. నిరంతరం మార్పు, అభివృద్ధి పొందుతూ వుంటుంది. ఇంతేగాక ఉత్పత్తి విధానంలోని మార్పులు, తప్పని సరిగా, యావత్ సామాజిక విధానంలోను, సామాజిక అభిప్రాయాలలోను, రాజకీయ దృక్పథాలలోను, రాజకీయ వ్యవస్థలలోను మార్పును నిర్మింపకోరుతాయి. యావత్ సామాజిక రాజకీయ విధానంలో పునర్నిర్మాణాన్ని నిర్మింపకోరుతాయి. పరిణామంలోని వివిధ దశలలో ప్రజలు వివిధమైన ఉత్పత్తి విధానాలను ఉపయోగించుకుంటారు. దానినింకానగ్నంగాచెప్పాలంటే, వారు వివిధ జీవితవిధానాలను అవలంబించుతారు. ఆదిమ సమాజంలో ఉత్పత్తి ఒకరకంగా వుండేది. బానిసవిధానంక్రింద మరోరకపు ఉత్పత్తి విధానం వుండేది. భూస్వామ్యవిధానంలో మరోరకపు ఉత్పత్తివిధానం వుండేది. ఇలాగే తక్కినదశల్లో కూడా, తదనుగుణ్యంగానే మానవుల సామాజికవిధానం, వారి ఆధ్యాత్మిక జీవితం (Spiritual life) వారి దృక్పథాలు, రాజకీయ వ్యవస్థలు మారుతూ వుండేవి.

సామాజిక ఉత్పత్తి విధానం ఎలాంటిదో సమాజం కూడా ప్రధానంగా అలాగే వుంటుంది. సామాజికాభిప్రాయాలూ, సిద్ధాంతాలూ, రాజకీయ దృక్పథాలూ రాజకీయ వ్యవస్థలూ కూడా అలాగే వుంటాయి.

ఇంకా నగ్నంగా చెప్పాలంటే మానవుని జీవిత ప్రవృత్తి ఎలాంటిదో, అతని ఆలోచనా ప్రవృత్తి కూడా అలాగే వుంటుంది.

దీని అర్థం సమాజాభివృద్ధి చరిత్ర, శతాబ్దాల క్రమంలో ఒకదానిస్థానే మరొకటి ప్రవేశించిన ఉత్పత్తి విధానాల చరిత్ర, ఉత్పత్తిశక్తుల అభివృద్ధి చరిత్ర ఉత్పత్తిలో ప్రజల సంబంధాల చరిత్ర.

కాబట్టి సమాజాభివృద్ధి చరిత్ర, భౌతిక వస్తువులను ఉత్పత్తి చేసేవారి చరిత్ర అనగా ఉత్పత్తి క్రమంలో ముఖ్య శక్తి అయినటువంటివిన్నీ, సమాజం మనుగడకు అవసరమైన భౌతిక వస్తువుల ఉత్పత్తిని కొనసాగించేటటువంటివిన్నీ, కష్టజీవులయిన ప్రజాసామాన్యం యొక్క చరిత్రయే.

కాగా చరిత్ర విజ్ఞానశాస్త్రం (Historical Science) నిజమైన విజ్ఞాన శాస్త్రమైనట్లయితే, సమాజాభివృద్ధి చరిత్ర రాజుల, సైన్యాధిపతుల రాజ్యాలను "జయించి పాదాక్రాంతం చేసుకొనేవారల" కార్యకలాపాల చరిత్ర కాజాలదు. పైగా ఆ విజ్ఞాన శాస్త్రం, భౌతిక వస్తువులను ఉత్పత్తి చేసేవారల చరిత్రను, కష్టపడే ప్రజాసామాన్యం యొక్క చరిత్రను, ప్రజలచరిత్రను గురించి అన్నిటికన్నా ముఖ్యంగా నిమగ్నం కావాలి.

అందుచేత సామాజిక చరిత్ర సూత్రాలను అధ్యయనం చేసేందుకు అవసరమైన కీలకాన్ని, మానవుల మనస్సులలో, సమాజ అభిప్రాయాల్లో, దృక్పథాల్లో వెదకరాదు. కాని ఆయా ప్రత్యేక చారిత్రక కాలంలోని సమాజం అనుసరించిన ఉత్పత్తి విధానంలో, సమాజ ఆర్థికజీవితంలో వెదకాలి.

కాబట్టి చరిత్ర విజ్ఞానశాస్త్రంయొక్క ప్రధాన కర్తవ్య మేమిటంటే, సూత్రాలను ఉత్పత్తిశక్తుల అభివృద్ధి సూత్రాలను, ఉత్పత్తి సంబంధాలను, సమాజ ఆర్థికాభివృద్ధి సూత్రాలను అధ్యయనంచేసి బహిర్గతం చేయుట.

అందుచేత శ్రామికవర్గ పార్టీ నిజమైనపార్టీ కాగోరితే అన్నిటికన్నా ముఖ్యంగా ఉత్పత్తి అభివృద్ధి సూత్రాలను గురించిన జ్ఞానాన్ని, సమాజ ఆర్థికాభివృద్ధి సూత్రాలను గురించిన జ్ఞానాన్ని సంపాదించాలి.

కనుక పాలసీలో పొరబడకుండా వుండాలంటే, శ్రామిక వర్గ పార్టీ తన కార్యక్రమాన్ని నిర్ణయించుటలోను, ప్రత్యక్ష కార్యకలాపాలను కొనసాగించుటలోను, ముఖ్యంగా ఉత్పత్తి అభివృద్ధి సూత్రాలను అనుసరించి, సమాజార్థికాభివృద్ధి సూత్రాలను అనుసరించి ముందుకు సాగాలి.

(సి) ఉత్పత్తియొక్క రెండవ స్వరూపం ఏమంటే: ఉత్పత్తి మార్పులూ - అభివృద్ధీ ఎప్పుడూకూడా ఉత్పత్తి శక్తుల మార్పూ, అభివృద్ధుల ననుసరించి, మొట్టమొదటగా ఉత్పత్తి సాధనాలలోని మార్పూ అభివృద్ధుల ననుసరించి ప్రారంభమౌతాయి. అందుచే ఉత్పాదకశక్తులు ఉత్పత్తిలో చాలా సులభంగా మారే విప్లవకరభావాలు. మొట్టమొదట

సమాజం యొక్క ఉత్పాదకశక్తులు మారి, అభివృద్ధి చెందు తాయి. తర్వాత యీ మార్పులపై ఆధారపడి వాటికి అనుగుణ్యంగా, మానవుల ఉత్పత్తి సంబంధాలు వారి ఆర్థిక సంబంధాలు కూడా మార్తాయి. అయినప్పటికీ, ఉత్పత్తి సంబంధాలు, ఉత్పాదక శక్తుల అభివృద్ధిపై ప్రభావం కల్గి యుండవని కాదు. ఉత్పాదకశక్తులు, ఉత్పత్తిసంబంధాలపై ఆధారపడి యుండవనికాదు. ఉత్పత్తిసంబంధాల అభివృద్ధి, ఉత్పాదకశక్తుల అభివృద్ధిపై ఆధారపడి ఉంటుంది. అయినప్పటికీ ఈఉత్పత్తిసంబంధాలు తాముకూడాఉత్పాదకశక్తుల అభివృద్ధిపై ఆ అభివృద్ధిని హెచ్చించుతోనో అడ్డుపడుతోనో ప్రతిక్రియ (React) కల్గివుంటాయి.ఈ సందర్భంలో ఈ క్రింది విషయాన్ని గమనించాలి. ఉత్పత్తిసంబంధాలు ఉత్పాదకశక్తుల పెరుగు దలకు వెనుకబడి వాటి, వాటికీ విరుద్ధతాస్థితిలో ఎంతోదీర్ఘ కాలం ఉండజాలవు. ఇంతేగాక ఉత్పత్తి సంబంధాలు, ఉత్పా దక శక్తుల స్వభావానికి స్థితికి అనుగుణ్యంగా ఉండి, వాటి అభివృద్ధికి పూర్తిఅవకాశాన్ని యిచ్చినప్పుడే ఉత్పాదకశక్తులు పూర్తిగా అభివృద్ధి కాజాలవు. అందుచేత ఉత్పత్తి సంబం ధాలు, ఉత్పాదక శక్తుల అభివృద్ధికి ఎంత వెనుకబడియున్నప్ప టికీ – యీనాడు గాకపోతే మరొకనాడు – ఉత్పాదకశక్తులు స్వభావానికి వాటి అభివృద్ధిస్థాయికి సరిపోయేటట్లు రావాలి – వచ్చితీరుతాయి. అలాకాకపోయినట్లయితే, ఉత్పత్తి విధానం లోనే ఉత్పత్తి సంబంధాలకు, ఉత్పాదక శక్తులకు గల ఐక్య తకు ప్రధానమైన అతిక్రమణ కలుగుతుంది. మొత్తం ఉత్పత్తికే విచ్ఛిన్నత ప్రారంభ మవుతుంది. ఉత్పత్తిలో సంక్షోభం.

ఉత్పాదక శక్తుల వినాశం సంభవిస్తుంది. ఒక ఉదాహరణ చూద్దాం:

ఉత్పత్తి సంబంధాలు ఉత్పాదకశక్తుల స్వభావంతో సరిపోక వాటితో ఘర్షణపడుస్థితిని చూద్దాం. ఉదాహరణకు పెట్టుబడిదారీ దేశాల్లోని ఆర్థిక సంక్షోభాలు. ఈ పెట్టుబడిదారీ దేశాల్లో ఉత్పత్తి సాధనాల యాజమాన్యం ప్రైవేటు పెట్టుబడి దారుల చేతుల్లో వుంటుంది. అలా ఉండుటచే ఉత్పత్తిక్రమం యొక్క సామాజిక స్వభావంతో, ఉత్పాదకశక్తుల స్వభావంతో ఉత్పత్తిసాధనాలు అనుగుణ్యంగావుండక, పూర్తిగా, అసంబద్ధంగా వుంటాయి. దీని ఫలితంగా ఆర్థిక సంక్షోభం సంభవిస్తుంది. ఆ ఆర్థిక సంక్షోభాలు ఉత్పాదకశక్తుల నాశనానికి దారితీస్తాయి. ఇంతేగాకుండా యీ అసంబద్ధమే, సామాజిక విప్లవానికి ఆర్థిక పునాదిని సమకూర్చుతుంది. ఈ విప్లవం యొక్క పని ఏమంటే యిప్పుడు అమల్లోనున్న ఉత్పత్తిసంబంధాలను నాశనంచేసి, ఉత్పాదకశక్తుల స్వభావంతో తులతూగే ఉత్పత్తిసంబంధాలను సృష్టించడమే.

పైదానికి విరుద్ధమైన మరొక ఉదాహరణ చూద్దాం. ఉత్పాదక శక్తుల స్వభావంతో పూర్తిగా తులతూగే ఉత్పత్తి సంబంధాలనుగురించి, ఒక ఉదాహరణ చూద్దాం. అది సోవియట్ యూనియన్‌లోని సోషలిష్టు ఆర్థికవిధానం. ఈ దేశంలో ఉత్పత్తిసాధనాల యాజమాన్యం సామాజికం. ఇది ఉత్పత్తి క్రమంయొక్క సామాజిక స్వభావముతో సరిపోతుంది. ఇందు మూలంగా యిక్కడ ఆర్థిక సంక్షోభాలు, ఉత్పాదకశక్తులను నాశనంచేయడం ఎరుగనే ఎరుగరు.

కాబట్టి, ఉత్పాదకశక్తులు, ఉత్పత్తిలో ఎక్కువ చలనశక్తిగల విప్లవకరమైన భాగాలేకాదు. ఉత్పత్తి అభివృద్ధిని నిర్ణయించేటటువంటి భావాలుకూడా.

ఉత్పాదకశక్తులు ఎలాంటివో ఉత్పత్తి సంబంధాలు కూడా అలాంటివే అయివుండి తీరాలి.

తమకు కావలసిన వస్తువులను తయారుచేయుటలో ఎలాంటి ఉత్పత్తి సాధనాలను మనుష్యులు ఉపయోగించుతారు? ఈ ప్రశ్నలకు ఉత్పాదకశక్తుల స్థితి జవాబిస్తుంది. కాగా ఉత్పత్తి సాధనాలకు (భూమి, అడవులు, నదీ తటాకాలు, ఖనిజలోహాలు, ముడిసరుకులు, ఉత్పత్తి పరికరాలు, ఉత్పత్తి చేసేస్థలాలు, ఎగుమతి సాధనాలు, రవాణా సాధనాలు వగైరా) యాజమాన్యం ఎవరిది? ఈ ఉత్పత్తి సాధనాలపై పెత్తనం ఎవరిది? మొత్తం సమాజమంతటిదీనా? లేక ప్రత్యేకవ్యక్తులదా? ముఠాలదా? లేక ఇతర వర్గాలను, ముఠాలను, వ్యక్తులను దోపిడీచేసేందుకు వాటి నుపయోగించుకొనే వర్గాలదా? ఈ రెండవ ప్రశ్నకు ఉత్పత్తి సంబంధాలస్థితి జవాబు చెబుతుంది.

ప్రాచీనకాలంనుండి యీనాటివరకు ఉత్పాదకశక్తుల అభివృద్ధియొక్క చిత్రాన్ని, కొంచె మించుమించుగా ఇక్కడ ఉదహరిస్తాం. మోటురాతి పరికరాలు పోయి విల్లు, అంబు ఉపయోగించడం వచ్చింది. దానితోబాటు మృగాలను వేటాడే జీవితంపోయి జంతువులను మచ్చికజేయడం ఆదిమ పసుపోషణ (Primitive Pasturage) వచ్చింది. రాతిపని ముట్లు పోయి, లోహపు పనిముట్లు వచ్చాయి (ఇనుప

గొడ్డలి, ఇనుపకర్ర (ఇనుపకర్రు వేసిన కొయ్యనాగలి) వాటితోపాటు దున్నుట, వ్యవసాయమూ వచ్చాయి. వస్తువులను తయారు జేయుటలోను, లోహ పరికరాలలోను యింకా అభివృద్ధి హెచ్చింది. కొలిమితిత్తులు కంసాలి ఉపయోగించడం, కుమ్మరి కుండలు చేయడం ప్రారంభమైంది. వీటితోపాటు చేతిపనులు అభివృద్ధి కాజొచ్చాయి. వ్యవసాయం నుండి చేతిపరిశ్రమలు విడిపోయి, అవి వేరే ఒక స్వతంత్ర పరిశ్రమగా తయారయి తత్ఫలితంగా కాలక్రమేణా కార్ఖానాలు ప్రారంభమయ్యాయి. చేతి పరిశ్రమల సాధనాలు పోయి యంత్రాలు వచ్చాయి. చేతి పరిశ్రమలూ, కార్ఖానా పరిశ్రమలూ పోయి, యంత్ర పరిశ్రమ విధానంవచ్చింది. పెద్దపెట్టున ఉత్పత్తిజేసే ఆధునిక యంత్ర పరిశ్రమ తలయెత్తింది. ఇదీ మానవచరిత్రలో సమాజఉత్పాదక శక్తుల–అసమగ్రమయినా–సాధారణ చిత్రం. ఉత్పత్తి సాధనాల అభివృద్ధీ, పెరుగుదలా ఉత్పత్తితో సంబంధంగల మనుష్యులచేతనే జరిగింది; కాని మనుష్యులతో సంబంధం లేకుండా కాదు— అనిసుస్పష్టమే. తత్ఫలితంగాఉత్పత్తి సాధనాల అభివృద్ధీ–మార్పు లతోపాటు, ఉత్పాదక శక్తులలో అత్యంత ప్రధాన భాగమైన మానవులలో అభివృద్ధీ - మార్పూ కూడా జరిగాయి. వారి ఉత్పత్తి అనుభవంలో వారి పని నేర్పరితనంలో ఉత్పత్తి పరికరాలను ఉపయోగించే సామర్థ్యంలోనూ అభివృద్ధీ - మార్పూ వచ్చాయి. చరిత్ర క్రమంలో సమాజ ఉత్పాదకశక్తుల మార్పు - అభివృద్ధులతోపాటు, మానవ ఉత్పత్తిసంబంధాలూ వారి ఆర్థిక సంబంధాలూ కూడా మారి వృద్ధిచెందాయి. చరిత్రలో తెలిసిన ఉత్పత్తి సంబంధాలు ముఖ్యమైనవి అయిదు

రకాలు: ఆదిమ కమ్యూనిస్టు విధానం, బానిస విధానం, భూస్వామ్య విధానం, పెట్టుబడిదారీ విధానం, సోషలిస్టు విధానం.

ఆదిమ కమ్యూనిస్టు విధానంలో ఉత్పత్తి సాధనాలు సామాజిక యాజమాన్యంక్రింద ఉండటమే ఉత్పత్తి సంబంధాలకు ప్రాతిపదిక. ఆ కాలంలోని ఉత్పాదకశక్తుల స్వభావానికిది మొత్తంమీద సరిపోతుంది. రాతి పనిముట్లు, తర్వాత విల్లులు, అంబులు, ప్రకృతి శక్తులతోనూ, క్రూర జంతువులతోనూ మానవులు వ్యక్తిగతంగా పోరాడే అవకాశాన్ని అసంభవం చేశాయి. అడవి పళ్ళను పోగుచేయాలంటే, చేపలు పట్టాలంటే, ఏదోరకపు కొంప ఒకటి నిర్మించుకోవాలంటే, తాము ఆకలితో చావదలచుకోకపోతే, క్రూరజంతువులకు బలికాకుండా వుండాలంటే, ఇరుగు పొరుగు సమాజాల దాడికి గురికాకుండా వుండాలంటే, వారు ఉమ్మడిగా పనిచేయక తప్పలేదు. ఉమ్మడిగా పనిచేయడం, ఉత్పత్తి సాధనాలకూ, ఉత్పత్తి ఫలితాలకూ ఉమ్మడి యాజమాన్యాన్ని తెచ్చిపెట్టింది. ఇక్కడ ఉత్పత్తి సాధనాలను స్వంత యాజమాన్యం క్రిందను తెచ్చుకోవాలనే భావం యింకా కలగలేదు. కొన్ని ఉత్పత్తి పరికరాలు వ్యక్తిగత యాజమాన్యం క్రింద వున్నా, అవి కూడా క్రూర జంతువుల నుండి ఆత్మరక్షణను మాత్రమే ఉపయోగపడేవి. ఇక్కడ దోపిడీలేదు. వర్గాలూ లేవు.

బానిస విధానం కింద ఉత్పత్తిసంబంధాలను ప్రాతిపదిక ఏమిటో చూద్దాం: బానిసయజమాని చేతిలో ఉత్పత్తి సాధనాలుంటాయి. ఉత్పత్తిచేసే పనివానికి అంటే బానిసకు

కూడా అతడే యజమాని. అతడా బానిసను అమ్మవచ్చు, కొనవచ్చు, జంతువులాగా చంపవచ్చుకూడా. అట్టి ఉత్పత్తి సంబంధాలు ఆ కాలపు ఉత్పాదకశక్తుల పరిస్థితికి మొత్తం మీద అనుగుణ్యంగా వుంటాయి. రాతి పనిముట్లకు బదులుగా యిపుడు లోహపు పనిముట్లు వారి చేతిలోకి వచ్చాయి. ఆదిమ కమ్యూనిస్టు సమాజంలో భూమి దున్నటంకాని, పశువులను మేపడంకాని తెలియనటువంటి వేటకాదు, జంతువులను మచ్చిక చేయుటలో పనికిమాలిన అనాగరిక పద్ధతులను అవలంబించే వాడు. ఇప్పుడు వాటి స్థానే పశుపోషణ, దున్నుట, చేతి పరిశ్రమలు ఏర్పడి, ఈ ఉత్పత్తిశాఖలలో శ్రమవిభజన తల యెత్తింది. వ్యక్తులమధ్య, సమాజాలమధ్య, వస్తువుల మారకం జరిగే అవకాశం ఏర్పడింది. కొద్దిమంది చేతులలో సంపద ప్రోగుపడటం, మైనారిటీ చేతులలో ఉత్పత్తిసాధనాలు వాస్తవంగా ప్రోగుపడటం, మైనారిటీ మెజారిటీని లొంగదీసి, వారిని బానిసలుగా చేసుకొనే అవకాశం ఏర్పడింది. ఇక్కడ ఉత్పత్తిక్రమంలో సమాజ సభ్యులందరూ ఉమ్మడిగానూ, ఉచితంగానూ పనిచేయడం ఇక కనపడదు. ఒళ్లువంచని బానిస యజమానులచే దోపిడిచేయబడుచున్న బానిసలు నిర్బంధంగా పనిచేయడం అనేది ఇక్కడ వచ్చింది. కాబట్టి ఉత్పత్తి సాధనాలకూ, ఉత్పత్తి ఫలితాలకూ ఉమ్మడి యాజమాన్యం కన్పించదు. దాని స్థానే ప్రైవేటు యాజమాన్యం వచ్చింది. ఆస్తిదారుడు అనే పదానికి పూర్తి అయిన అర్థంలో చెప్పాలంటే ఇక్కడ బానిసయజమానే ముఖ్యమైన, ప్రధానమైనఆస్తిదారుడు.

ధనికులు, బీదలు, దోపిడిచేసేవారు, దోపిడికి గురి అయ్యేవారు, పూర్తి హక్కులుగల ప్రజలు, అసలుహక్కులు లేని ప్రజలు - వీరి మధ్య భయంకర వర్గపోరాటం - ఇదే బానిసవిధానంయొక్క స్వరూపం.

భూస్వామ్యవిధానంలో ఉత్పత్తి సంబంధాల ప్రాతిపదిక ఇది : భూస్వామ్య ప్రభువు ఉత్పత్తిసాధనాలకు యజమానియే కాని, ఉత్పత్తిచేసే కార్మికుని (అర్ధబానిస) పై పూర్తి యాజమాన్యం అతనికిలేదు. అయితే ఇదివరలోవలె అర్ధ - బానిసను, భూస్వామి చంపేందుకు వీలులేదు. కాని కొనవచ్చు; అమ్మనూ వచ్చు. భూస్వామ్య యాజమాన్యంతోపాటు, రైతు వ్యక్తిగత యాజమాన్యంకూడా వుండేది. చేతిపనివానికి తన ఉత్పత్తి పరికరాలపైన యాజమాన్యం వుండేది. తన స్వయంకృషి మీాద అతని పరిశ్రమ ఆధారపడియుండేది. అలాంటి ఉత్పత్తి సంబంధాలు ఆ కాలపు ఉత్పాదకశక్తుల పరిస్థితికి ప్రధాన విషయాలలో మొత్తం తులతూగుతాయి. ఇనుమును కరిగించటం, ఇనుపపనిముట్లు చేయటం, ఇనుపనాగలీ, మగ్గమూ వ్యాప్తిచెందటం, వ్యవసాయం, తోటలపెంపకం, మధురసాల (కల్లు) నిచ్చే చెట్లపెంపకం, పాడి మొదలైనవి ఇంకా అభివృద్ధి చెందటం, చేతిపనుల పరిశ్రమాగారాలతోపాటు కార్ఖానాలు తల యెత్తాయి. ఇవీ ఆ కాలంలో ఉత్పాదకశక్తుల పరిస్థితియొక్క గమనింపదగిన రూపాలు.

పనివాడు ఉత్పత్తిలో ఏదో ఒక రకమైన చొరవను ప్రదర్శించాలనీ, పనిచేయడానికి అభీష్టతను చూపించాలనీ, పనిలో శ్రద్ధకలిగి వుండాలనీ, యీా నూతన ఉత్పాదకశక్తులు

కోర్తాయి. అందుచే పనిలో శ్రద్ధలేనటువంటిన్నీ, ఏరవ ఏమాత్రమూ లేనటువంటిన్నీ పనివానిని అనగా బానిసను, భూస్వామ్య ప్రభువు త్రోసిపారవేస్తాడు. స్వంతసేద్యంకలిగి, ఉత్పత్తి పరికరాలను కలిగి, భూమిని వ్యవసాయం చేయటానికి అవసరమైన పనిలో శ్రద్ధకలిగి, తనపంటలో కొంతభాగాన్ని భూస్వామ్య ప్రభువుకు యిచ్చుటలో శ్రద్ధకలిగిన అర్ధ-బానిసనే ఇప్పుడు భూస్వామ్య ప్రభువు కోర్తాడు.

ఇక్కడ ప్రైవేటు యాజమాన్యం యింకా వృద్ధిచెందింది. దోపిడీ బానిసవిధానంక్రింద వున్నంత తీవ్రంగా దాదాపు ఇది వుంది. స్వల్పంగా మాత్రమే అదితగ్గింది. దోపిడిగాండ్రకూ, దోపిడికి గురిఅయినవారికీ మధ్య వర్గపోరాటమే, భూస్వామ్య విధానంయొక్క ప్రధానరూపం.

పెట్టుబడిదారీ విధానంక్రింద ఉత్పత్తి సంబంధాలకు ప్రాతిపదిక ఇది: ఉత్పత్తి సాధనాలపైన ఉత్పత్తిచేసే కార్మికులు గాక, పెట్టుబడిదారుడు యాజమాన్యం కలిగివుంటాడు. ఈ జీతపు పనివారికి వ్యక్తిగతస్వేచ్ఛ ఉందిగనుక వారిని పెట్టుబడిదారుడు అమ్మలేడు; చంపలేడు. కాని వారికి ఉత్పత్తి సాధనాలు లేకుండా చేయబడ్డాయి. ఆకలితో చావకుండా వుండేందుకుగాను, పెట్టుబడిదారునికి తన శ్రమశక్తిని అమ్ముకొని, దోపిడి భారాన్ని వారు మోయవలసివచ్చింది. ఉత్పత్తి సాధనాలలో పెట్టుబడిదారుని ఆస్తితోపాటు రైతుల, చేతిపనివారల స్వంత ఆస్తికూడా మనము విరివిగా చూస్తాము. ఈ రైతులు, చేతిపనివారలు ఇక ఏమాత్రమూ అర్ధ - బానిసలుకారు. వారి స్వంతఆస్తి వ్యక్తిగత శ్రమపై ఆధారపడియుంది. చేతిపని

వర్క్‌షాపులు, కార్ఖానాలకు బదులుగా యంత్రాలతో గూడిన పెద్దపెద్ద మిల్లులు, ఫ్యాక్టరీలు తలయెత్తాయి. రైతులు తాతల నాటి పరికరాలతో దున్ని ఉత్పత్తిచేసే భూస్వాముల ఎస్టేట్ల స్థానే, వ్యవసాయయంత్రసామగ్రి చేకూడి, శాస్త్రీయపద్ధతిని నడుపబడే పెట్టుబడిదారీ వ్యవసాయక్షేత్రాలు తలెత్తాయి.

ఉత్పత్తిచేసే కార్మికులు పీడిత అమాయక బానిసలుగా వుండకూడదు. విజ్ఞానంకలిగి, తెలివితేటలుకలిగి యుండాలి. యంత్రాలను అర్థంచేసుకొని, వాటినిసరిగా నడపగలిగేశక్తి గలిగి యుండాలి. ఇదీ యీ నూతన ఉత్పాదకశక్తులు కోరేది. అందుచేత అర్ధ - బానిసవిధానపు సంకెళ్ళనుండి విముక్తులైన జీతపు పనివారలనే, యంత్రాలను సరిగా నడపగలిగి నంతవరకు విజ్ఞానం పొందిన జీతపు కార్మికులనే, పెట్టుబడిదారులు కోరుతారు.

పెట్టుబడిదారీ విధానం ఉత్పాదక శక్తులను అత్యద్భుతంగా వృద్ధిచేసి, దాని పరస్పర వైరుధ్యాలలో అది చిక్కుకొని పోయింది. వాటినది పరిష్కరించుకోలేదు. వస్తువులను కొల్లలు కొల్లలుగా తయారుచేసి, వాటిధరలను తగ్గించి, పెట్టుబడిదారీవిధానం పోటీని తీవ్రంచేస్తుంది. చిన్నరకపు, మధ్యరకపు స్వంత ఆస్తిపరుల సమూహాన్ని నాశనంచేస్తుంది. వారిని శ్రామికులుగా మార్చుతుంది. వారి కొనుగోలుశక్తిని తగ్గించివేస్తుంది. తత్ఫలితంగా ఉత్పత్తిచేసిన వస్తువులు విక్రయం లవడం అసాధ్యమవుతుంది. మరొకప్రక్క ఉత్పత్తిని విస్తరింపజేసి, పెద్దపెద్ద ఫ్యాక్టరీలలోను, మిల్లులలోను, లక్షలకొలది కార్మికులను, పెట్టుబడిదారీ విధానం కేంద్రీకరించుతుంది.

ఆవిధంగా అది ఉత్పత్తి క్రమానికి ఒక సామాజిక స్వభావాన్ని కల్గించుతుంది. ఆవిధంగా తన పునాదినే కూలద్రోసుకుంటుంది. ఇంతేగాక ఉత్పత్తి క్రమంలోని సామాజిక స్వభావం, ఉత్పత్తి సాధనాలపై సామాజిక యాజమాన్యాన్ని కోరుతుంది. అయినప్పటికీ ఉత్పత్తిసాధనాలు పెట్టుబడిదారుని స్వంతఆస్తిగానే వుండిపోయాయి. ఉత్పత్తి క్రమంయొక్క సామాజిక స్వభావంతో యిది పొసగదు.

ఉత్పాదకశక్తుల స్వభావానికీ, ఉత్పత్తి సంబంధాలకు గల సమన్వయంగాని వైరుధ్యాలు, అధికోత్పత్తి రూపేణా నిర్ణీతకాలంలో తిరిగి వచ్చే ఆర్థికసంక్షోభాలంలో కనపడతాయి. పెట్టుబడిదారులే ప్రజాసామాన్య బాహుళ్యాన్ని నాశనంఅయే స్థితికి తెచ్చారు. అందుచే తమ వస్తువులకు తగినంత గిరాకీ లేకపోయింది. కనుక పెట్టుబడిదారులు తమ వస్తువులకు తగల బెట్టి, పారిశ్రామిక వస్తువులను నాశనంచేసి, ఉత్పత్తిని ఆపివేయవలసివస్తుంది. లక్షలకొలది ప్రజలు ఆకలి, నిరుద్యోగాలతో బాధపడుతున్న రోజులలోనే ఉత్పాదకశక్తులను నాశనం చేయవలసి వస్తుంది. కార్మికుల యొక్క యీ నిరుద్యోగమూ ఆకలి బాధలకు కారణం తగినన్ని వస్తువులు లేకపోవడం కాదు, వస్తువులెక్కువగా ఉత్పత్తికావడంవల్లనే.

దీని అర్థం పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు, సమాజ ఉత్పాదకశక్తుల స్థితికి తులతూగడం మానివేశాయి. పైగా వాటితో రాజీలేని వైరుధ్యాన్ని పొందాయి.

దీని అర్థం విప్లవం అనే శిశువును, పెట్టుబడిదారీవిధానం కడుపుతోవుంది. ఈ విప్లవం యొక్క కర్తవ్యం, ఉత్పత్తిశక్తు

లపై ప్రస్తుతమున్న పెట్టుబడిదారీ యాజమాన్యాన్ని తొల గించి, సోషలిస్టు యాజమాన్యాన్ని నెలకొల్పడం.

పెట్టుబడిదారీ విధానం యొక్క ముఖ్య స్వరూపం, దోపిడీగాండ్రను - దోపిడికి గురియైనవారికి మధ్య తీవ్రమైన వర్గపోరాటమేనని దాని అర్థం.

సోషలిస్టు విధానం క్రింద ఉత్పత్తి సంబంధాలకు ప్రాతి పదిక ఇది: సోషలిస్టు విధానం ఇంతవరకు ఒక్క సోవియట్ యూనియన్‌లోనే ఏర్పడింది. ఇక్కడ ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం సామాజికం. ఇక్కడ దోపిడీచేసేవారు, దోపిడికి గురియైనవారు అంటూ ఎవరూ లేరు. "పనిచేయనివాడు తిండి బాయవలయు" అనే సూత్రం ననుసరించి, చేసిన శ్రమననుస రించి ఉత్పత్తి చేయబడిన వస్తువులు పంచబడతాయి. ఇక్కడ ఉత్పత్తి క్రమంలో ప్రజల పరస్పర సంబంధాలు ఎలా వుంటాయి? సోదరసహకారం (Comradly Co-operation), దోపిడీనుండి విముక్తిఅయిన కార్మికుల పరస్పర సోషలిస్టు సహాయం ఇక్కడ ప్రదర్శితమౌతాయి. ఇక్కడ ఉత్పత్తి సంబంధాలు, ఉత్పాదకశక్తులస్థితితో, పూర్తిగా అనుగుణ్యంగా వుంటాయి. ఎందుచేతనంటే ఉత్పత్తి క్రమంయొక్క సామాజిక స్వభావం, ఉత్పత్తి సాధనాల సామాజక యాజమాన్యంచే బలపరచబడింది.

ఈ కారణంచేత, అధికోత్పత్తి అనే ఆర్థిక సంక్షోభాలు నిర్ణీతకాలంలో తిరిగి తిరిగి సంభవించుట, వాటితోపాటు వచ్చే అనర్థకాలూ సోషలిస్టు ఉత్పత్తిగల సోవియట్‌యూనియన్‌లో లేవు.

ఈ కారణంచేత ఇక్కడ ఉత్పాదక శక్తులు తీవ్ర గమనంతో అభివృద్ధి చెందుతాయి. ఎందువల్లనంటే, ఉత్పత్తి సంబంధాలు ఉత్పాదక శక్తులతో అనుగుణ్యంగా వుండి, అలాంటి అభివృద్ధికి సంపూర్ణ అవకాశాన్ని కలిగించుతాయి.

ఇదీ మానవచరిత్ర క్రమంలో, మానవుల ఉత్పత్తి సంబంధాల అభివృద్ధిని తెలిపే చిత్రం.

సమాజ ఉత్పాదకశక్తుల అభివృద్ధిపైన, ముఖ్యంగా ఉత్పత్తిసాధనాల అభివృద్ధిపైన, ఉత్పత్తిసంబంధాల అభివృద్ధి అలా ఆధారపడుతుంది. ఈ ఆధారపడడంలోని సుగుణం ఏమంటే, ఉత్పాదకశక్తుల అభివృద్ధి మార్పులు - ఈనాడు గాకపోతే మరోనాడు - తదనుగుణ్యమైన ఉత్పత్తి సంబంధాల అభివృద్ధికీ, మార్పులకూ దారి తీస్తాయి.

మార్క్సు ఇలా అన్నాడు :

"కొన్నిరకాల జంతువులలో శ్రామికసాధనాల ఉపయోగము, సృష్టి బీజరూపంలో వున్నప్పటికీ, మానవశ్రమ క్రమానికే ఈ ఉపయోగమూ సృష్టి ప్రత్యేక విశిష్టత. (శ్రామికసాధనాలు అంటే ఉత్పత్తిసాధనాలు అని మార్క్సు అభిప్రాయం - అను) అందుకనే ఫ్రాంక్లిన్ వస్తువులు చేసే మానవుడు అని నిర్వచించాడు. నశించిపోయిన జంతువుల రకాలు నిర్ణయించడానికి భూమిలోని బొమికెలు ఎంత ప్రాముఖ్యత వహిస్తాయో, పూర్వకాలపు సమాజ ఆర్థిక రూపాలను పరిశోధించడానికి పురాతన శ్రామిక సాధనాల (ఉత్పత్తి సాధనాల) అవశేషాలు కూడా (Relics) అంత ప్రాముఖ్యత వహిస్తాయి. విభిన్నమైన ఆర్థికదశలలోని తారతమ్యాన్ని

తయారుచేయబడిన వస్తువులవల్ల గుర్తించలేము. కాని ఆ వస్తువులెలా చేయబడ్డాయి, ఏ సాధనాలవల్ల చేయబడ్డాయి అనే వాటిద్వారానే గుర్తించగలం. శ్రామిక సాధనాలు (ఉత్పత్తిసాధనాలు) మానవశ్రమ ఎంత అభివృద్ధిస్థాయిని పొందినదో తెలియజేయడమే గాక, ఏ సామాజిక పరిస్థితులక్రింద ఆ శ్రమ కొనసాగించబడినదో, ఆ సామాజిక పరిస్థితులను తెలియజేస్తాయి." (కారల్ మార్క్సు - కాపిటల్ - లండన్, 1908 - 1 వ వాల్యూమ్, 159 వ పేజీ)

మార్క్సు ఇంకా ఇలా అన్నాడు:

—"సామాజిక సంబంధాలు, ఉత్పాదక శక్తులతో సన్నిహితంగా కట్టివేయబడ్డాయి. నూతన ఉత్పాదకశక్తులను సంపాదించుటలో మానవులు తమ ఉత్పత్తివిధానాన్ని మార్చుతారు; తమ ఉత్పత్తి విధానాన్ని మార్చుటలో, తమ జీవితాన్ని పోషించుకొనే విధానాన్ని మార్పుచేసుకోవడంలో, వారు తమ సామాజిక సంబంధాల నన్నిటినీ మార్చుకుంటారు. చేతిమర, భూస్వామ్య ప్రభువున్న సమాజాన్ని తెలియజేస్తుంది. ఆవిరియంత్రం, పారిశ్రామిక పెట్టుబడిదారుడున్న సమాజాన్ని తెలియజేస్తుంది." (కారల్ మార్క్సు - ది పావర్టీ ఆఫ్ ఫిలాసఫీ, ఇంగ్లీషు ఎడిషన్ - మాస్కో, 1935,92 వ పేజీ)

—"ఉత్పాదకశక్తులలో నిరంతర అభివృద్ధి యొక్క గమనం ఉంటుంది. ఉత్పత్తిసంబంధాల విధ్వంసంలో అభిప్రాయాలు ఏర్పడుటలోకూడా నిరంతరగమనం వుంది. మార్పు లేనటువంటి వస్తువు ఏమంటే యీ 'గమనము' అనేదే (Abraction of Movement)" (పై గ్రంథమే - 93వ పేజీ)

కమ్యూనిస్టు ప్రణాళికలో సూత్రీకరించబడిన చారిత్రిక భౌతికవాదంగురించి మాట్లాడుతూ, ఏంగెల్సు యిలా అన్నాడు:

"ప్రతి చారిత్రకదశలోని సమాజనిర్మాణమూ, ఆర్థిక ఉత్పత్తి తప్పనిసరిగా ఆ దశలోని రాజకీయ వైజ్ఞానిక చరిత్రకు **(Political and intellectual history)** పునాదిని ఏర్పరచుతుంది. తత్ఫలితంగా (భూ యాజమాన్యం ఆదిమసమిష్టి భూ యాజమాన్యం రద్దుచేయబడిననాటినుండీ) సామాజిక పరిణామంలో వివిధదశలలో చరిత్రఅంతా వర్గపోరాటాల చరిత్రయే; దోపిడీ చేసేవారికి, దోపిడీ చేయబడేవారికి మధ్య, అధికారం చలాయించే వర్గాలకు, అణచబడిన వర్గాలకు మధ్య జరిగిన పోరాటచరిత్రయే... ఈ పోరాటం ఎంతటి ఉచ్ఛస్థితికి వచ్చిందంటే, దోపిడినుండి, పీడననుండి, వర్గపోరాటాలనుండి సమాజాన్ని యావత్తు శాశ్వతంగా విముక్తి చేయనిదే దోపిడికి గురికాబడిన - అణచబడిన వర్గం (శ్రామికవర్గం) దోపిడీచేసే - పీడించే వర్గంనుండి (బూర్జువావర్గంనుండి) విముక్తి పొందలేదు." (కమ్యూనిస్టు మేనిఫెస్టో - జర్మన్ ఎడిషన్‌కు పీఠిక - కారల్ మార్క్స్ - సెలెక్టెడ్ వర్క్స్ - ఇంగ్లీషు ఎడిషన్ - మాస్కో- **1946** - 1వ వాల్యూమ్ - **100-101** పేజీలు.)

(డి) ఉత్పత్తియొక్క మూడవ రూపం ఏమంటే: ఉత్పాదకశక్తులు, తదనుగుణ్యమైన ఉత్పత్తి సంబంధాలు, పాత విధానం అంతర్ధానమై పోయిన తర్వాత విడిగాతలెత్తవు. పైపెచ్చు పాతవిధానంలోనుండియే అవి తలయెత్తుతాయి. ఉద్దేశపూర్వకంగా చైతన్యంతో చేసిన మానవ కార్యకలాపంవల్ల అవి

తలయెత్తవు. కాని తమంతకవే అనుకోకుండానే, మానవుని అభీష్టానికి సంబంధించకుండానే తమంతట తామే అవి తల యెత్తడానికి రెండు కారణాలున్నాయి.

మొదటిది: మానవులకు ఒక ఉత్పత్తి విధానం లేక మరో ఉత్పత్తి విధానాన్ని ఎన్నుకునేందుకు స్వేచ్ఛలేదు. జీవితంలోకి ఒక కొత్తతరం ప్రవేశించినపుడల్లా, పూర్వతరాల వారి పని ఫలితంగా యిదివరకే అమలులోవున్న ఉత్పత్తి సంబంధాలనూ, ఉత్పాదక శక్తులనూ, అది గమనించుతుంది. దాని ఫలితంగా, భౌతికవస్తువులను తయారుచేయటానికి ఉత్పత్తి రంగంలో అదివరకే సిద్ధంగానున్న ప్రతిదాన్ని మొట్టమొదట అది అంగీకరించి సరిపుచ్చుకోవలసి వుంది.

రెండవది: ఒక ఉత్పత్తి సాధనాన్ని లేక మరొక సాధనాన్ని, ఉత్పాదక శక్తులలో ఒకఅంశాన్ని లేక మరోఅంశాన్ని వృద్ధిచేయనపుడు, ఈ అభివృద్ధులు ఎలాంటి సామాజిక ఫలితాలను దారితీస్తాయనే విషయాన్ని గురించి మానవులు ఆలోచించరు; అర్థంచేసుకోరు; నిలిచియోచించరు. కాని తమ దైనందిన ప్రయోజనాలను గురించిమాత్రమే ఆలోచించుతారు. తమ శ్రమను తేలికచేసుకొని, కొంత ప్రత్యక్ష వాస్తవలాభాలను పొందడానికి మాత్రమే వారు ఆలోచించుతారు.

ఆదిమ కమ్యూనిస్టు సమాజసంఘ సభ్యులు కొందరు, క్రమక్రమంగా తడవులాడుతూ రాతిపనిముట్ల స్థానే ఇనుప పనిముట్లు ఉపయోగించడం నేర్చుకొన్నారు. ఈ కొత్తమార్పు ఎట్టి సామాజిక ఫలితాలను దారితీస్తుందో అపుడు వారికి తెలియదు; వారు నిలిచి యోచించనూలేదు. లోహ వస్తువు

లను ఉపయోగించుట అనే మార్పు ఉత్పత్తిలో విప్లవం అనీ, అది చిట్టచివరకు బానిస సమాజానికి దారితీస్తుందని వారికి తెలియదు; అర్థంచేసుకోనూలేదు. తను శ్రమను తగ్గించుకొని తక్షణ ప్రత్యక్షలాభాన్ని పొందాలని మాత్రమే వారనుకొన్నారు. దైనందిన వ్యక్తిగత ప్రయోజనం అనే సంకుచిత హద్దులోనే వారి చైతన్యపూర్వకమైన కార్యకలాపం వుండిపోయింది.

భూస్వామ్య విధానకాలంలో యూరప్‌లోని యువక బూర్జువా, చిన్న గిల్డువర్క్‌షాపులతోపాటు, పెద్దకార్ఖానాలనుకూడా నెలకొల్పారు. ఆవిధంగా సమాజ ఉత్పాదక శక్తులను ముందుకునెట్టారు. ఈ కొత్తమార్పు,ఎలాంటి సామాజిక పరిస్థితులకు దారితీస్తుందో దానికి తెలియదు; నిలిచి యోచించనూలేదు. సామాజిక శక్తులను పునర్విభజించి, ఏరాజుల అనుగ్రహానికి తాను ఎక్కువగా తాపత్రయపడిందో ఆరాజులను వ్యతిరేకంగాను, తన అతిముఖ్య ప్రతినిధులే ఏ రాచప్రభువుల పదవులలోకి చేరడానికి పలుమార్లు ఉవ్విళ్ళూరారో, ఆరాచ ప్రభువులకు వ్యతిరేకంగాను, ఈ "చిన్న" కొత్తమార్పు విప్లవం తెస్తున్నదని, ఆ యువక పెట్టుబడిదారీవర్గం అర్థంచేసుకోనూలేదు; గుర్తించనూలేదు. అది వూరికే ఉత్పత్తి వస్తువుల ఖరీదును తగ్గించడానికి చూసింది. ఆసియా మార్కెట్లలోనూ, అంతకుపూర్వం కొద్దికాలం క్రితమే కనిపెట్టబడిన అమెరికా మార్కెట్లలోనూ వస్తువులను బహువిస్తారంగా నింపివేసి, పెద్ద పెద్ద లాభాలను సంపాదించాలని మాత్రమే అది కోరింది. ఈ సామాన్యమైన లౌకిక లాభాలనే సంకుచిత పరిధిలోనే

ఆ యువక బూర్జువాయొక్క చైతన్యయుతమైన కార్యకలాపం వుండి పోయింది.

జారు ప్రభుత్వాన్ని యధాతథంగావుంచి, భూస్వాముల దయాదాక్షిణ్యాలకు రైతులనుగురిచేసి, రష్యాపెట్టుబడిదారులు విదేశీపెట్టుబడిదారులతో కలసి విస్తార ప్రమాణంలో ఆధునిక యంత్రపరిశ్రమను రష్యాలో శక్తివంతంగా నెలకొల్పారు, కాని అదిఏసామాజిక ఫలితాలకు దారితీస్తుందో వారికి తెలియనూ తెలియదు; నిలిచి యోచించనూలేదు. సమాజ ఉత్పాదక శక్తుల రంగంలో యీ పెద్దగంతు, సామాజిక శక్తులను పునర్విభజించుతుందనీ, దానివల్ల శ్రామికులు రైతాంగంతో ఐక్యమై, విజయోపేతమైన సోషలిస్టు విప్లవాన్ని - తీసుకవస్తారనీ వారు గ్రహించనూలేదు; అర్థంచేసుకోనూలేదు. వారు పారిశ్రామికోత్పత్తిని అంతులేకుండా వృద్ధిచేయ దలచారు. తమ దేశంలోని పెద్దమార్కెట్లను అంతా స్వాధీన పరచుకోవాలనుకున్నారు. తాము గుత్తవ్యాపారులు కావాలని అనుకున్నారు. జాతీయ ఆర్థిక సంపదనుండి సాధ్యమైనంత లాభాలను గుంజాలనుకున్నారు. మామూలు లౌకిక లాభాల పరిధిని మించి వారి చైతన్యయుతమైన కార్యకలాపం పోలేదు.

అందుచే మార్క్స యిలా అన్నాడు:

"తమ జీవితానికి అవసరమైన సామాజికోత్పత్తిలో (అనగా మానవుల జీవితానికి అవసరమైన భౌతిక వస్తువుల ఉత్పత్తిలో - సంపాదకుడు) తమ యిష్టానికి సంబంధం లేనటువంటిన్నీ, అత్యంత ఆవశ్యకమైనటువంటిన్నీ నిశ్చిత సంబంధాలలోకి మానవులు ప్రవేశించుతారు. ఈ ఉత్పత్తి సంబంధాలు,

వాటి ఉత్పత్తి యొక్క భౌతికశక్తుల అభివృద్ధిలోని ఒక నిశ్చిత దశకు అనుగుణ్యంగా ఉంటాయి. (ప్రాముఖ్యాన్ని సూచించడానికి గీచిన గీతలు మావి — సంపాదకుడు).

(కారల్ మార్క్స్-సెలెక్టెడ్ వర్క్స్- ఇంగ్లీషు ఎడిషన్-మాస్కో - 1946 - 1వ వాల్యూమ్ - 300వ పేజీ)

అయినప్పటికీ దీనిఅర్థం, ఉత్పత్తి సంబంధాల మార్పులూ పాత ఉత్పత్తి సంబంధాల నుండి కొత్త ఉత్పత్తి సంబంధాలకు పరివర్తనా ఘర్షణలు లేకుండా, తిరుగుబాట్లు లేకుండా సాఫీగా సాగిపోతుందని కాదు. తద్వ్యతిరేకంగా పాత ఉత్పత్తి సంబంధాలను విప్లవం ద్వారా కూలద్రోసి, కొత్త ఉత్పత్తి సంబంధాలను నెలకొల్పుట ద్వారానే అలాంటి పరివర్తన సాధారణంగా జరుగుతుంది. మనుష్యుల అభీష్టానికి సంబంధం లేకుండానే, తమంతకు తామే ఉత్పాదకశక్తుల అభివృద్ధీ, ఉత్పత్తి సంబంధాల తాలూకు మార్పులూ ఒకానొక దశవరకు జరుగుతాయి. అయితే అవి ఒకానొక క్షణంవరకు మాత్రమే జరుగుతాయి. అభివృద్ధి చెందుతున్న కొత్త ఉత్పాదకశక్తులు సరియైన పరిపక్వదశకు వచ్చే క్షణంవరకు మాత్రమే జరుగుతాయి. కొత్త ఉత్పాదకశక్తులు పరిపక్వంకాగానే, అమలులోనున్న ఉత్పత్తి సంబంధాలు, "అతిక్రమించ వీలులేని" ప్రతిబంధకాలుగా తయారవుతాయి. నూతన వర్గాల యొక్క చైతన్యయుత పోరాటం వల్లనే, బలప్రయోగంతో కూడిన చర్యల వల్లనే అనగా విప్లవం వల్లనే, ఆ ప్రతిబంధకాన్ని తొలగించ వీలవుతుంది. పాత ఉత్పత్తి సంబంధాలను బలప్రయోగంద్వారా నిర్మూలించే కర్తవ్యం కల్గిన నూతన రాజ

కీయాధికారం యొక్క, నూతన రాజకీయవ్యవస్థల యొక్క, నూతన సామాజిక అభిప్రాయాలయొక్క అత్యద్భుత పాత్ర ఇక్కడ అతి విస్పష్టంగా బహిర్గతమౌతుంది. నూతన ఉత్పాదకశక్తులకూ పాత ఉత్పత్తిసంబంధాలకూ మధ్య జరిగే సంఘర్షణనుండి, సమాజంయొక్క నూతన ఆర్థికఅవసరాలనుండి, నూతన సామాజికాభిప్రాయాలు తలయెత్తుతాయి. ఈనూతన అభిప్రాయాలు, ప్రజలను సమీకరించి సంఘటనపరచుతాయి. ప్రజాసామాన్యం ఒక నూతన రాజకీయసైన్యంగా సంబద్ధమై నూతన విప్లవాధికారాన్ని సృష్టించుతుంది. అధికారాన్నుపయోగించి పాతఉత్పత్తి సంబంధాల విధానాన్ని బలప్రయోగం ద్వారా రద్దుచేస్తుంది. కొత్తవిధానాన్ని దృఢంగా నెలకొల్పుతుంది. అప్రయత్నపూర్వకమైన అభివృద్ధిక్రమం (Spontaneous Process of Development) స్థానే మానవుల చైతన్యయుత కార్యాచరణవస్తుంది. శాంతియుత అభివృద్ధిస్థానే హింసాత్మకమైన తిరుగుబాటు వస్తుంది. పరిణామం స్థానే విప్లవం వస్తుంది.

మార్క్స్ ఇలా అన్నాడు:

"పెట్టుబడిదారీవర్గంతో పోరాడుతున్నపుడు శ్రామిక వర్గం ఆ పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఒక వర్గంగా తాను సంఘటితం కావలసివస్తుంది. విప్లవంద్వారా అది పరిపాలకవర్గం అవుతుంది. అలా అయి, అది పాత ఉత్పత్తిపరిస్థితులను బలప్రయోగం ద్వారా తుడచిపెడుతుంది." (కమ్యూనిస్టు మేనిఫెస్టో, కారల్ మార్క్స్-సెలెక్టెడ్ వర్క్స్-ఇంగ్లీషు ఎడిషన్-మాస్కో-1946 - 1వ వాల్యూమ్ - 131 వ పేజీ)

మార్క్సు ఇంకా ఇలా అన్నాడు:

—"పెట్టుబడిదారుల నుండి పెట్టుబడినంతా క్రమ క్రమంగా గుంజటానికీ, ఉత్పత్తిసాధనాలన్నిటినీ ప్రభుత్వం చేతిలో అనగా పరిపాలకవర్గంగా సంఘటితమైన శ్రామికవర్గం చేతిలో కేంద్రీకరించడానికీ, సాధ్యమైనంత త్వరలో ఉత్పాదక శక్తుల మొత్తాన్ని వృద్ధిచేయడానికీ, శ్రామికవర్గం తన రాజకీయ ఆధిపత్యాన్ని ఉపయోగించుతుంది." (పై గ్రంథమే - 129 వ పేజీ)

—"నూతన సమాజాన్ని గర్భం దాల్చిన ప్రతి పాత సమాజానికీ బలప్రయోగమే (Force) మంత్రసాని." (కారల్ మార్క్సు - కాపిటల్ - 1వ వాల్యూమ్, 776 వ పేజీ)

క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఏకానమీ (అర్థశాస్త్ర విమర్శ) అనే తన ప్రఖ్యాత గ్రంథానికి చరిత్రాత్మకమైన పీఠిక వ్రాస్తూ 1859 లో మార్క్సు చారిత్రక భౌతికవాద సారాన్ని ప్రతిభావంతంగా సూత్రీకరించాడు. ఆ సూత్రీకరణ ఇది:

"తమ సామాజిక ఉత్పత్తిలో మానవులు తమ యిష్టానికి సంబంధం లేనటువంటీ, అత్యంతావశ్యక మైనటువంటీ నిశ్చిత సంబంధాలలోకి ప్రవేశించుతారు. ఈ ఉత్పత్తి సంబంధాలు భౌతిక ఉత్పత్తిశక్తుల అభివృద్ధిలోని ఒక నిర్ణీతదశకు అనుగుణ్యంగా వుంటాయి. ఈ ఉత్పత్తి సంబంధాల మొత్తం, సమాజ ఆర్థిక నిర్మాణంయొక్క నిజమైన పునాదిగా ఏర్పడుతుంది. ఈ పునాదిమీద రాజకీయ, శాసన (Legal) నిర్మాణ కట్టడాలు నిర్మింపబడతాయి. వీనికి అనుగుణ్యంగా సామాజిక చైతన్యంయొక్క నిశ్చిత రూపాలు ఏర్పడతాయి. భౌతికజీవితం

లోని ఉత్పత్తి విధానమే సాధారణంగా సామాజిక, రాజకీయ, వైజ్ఞానిక (Intellectual) జీవితక్రమాన్ని నిర్ణయించుతుంది. మానవుల ఉనికిని నిశ్చయించేది వారిచైతన్యంకాదు. తద్విరుద్ధంగా సామాజిక ఉనికియే వారి చైతన్యాన్ని నిర్ణయించుతుంది. సమాజంలోని భౌతిక ఉత్పాదక శక్తులు తమ అభివృద్ధి యొక్క ఒకానొక దశలో అమలులోనున్న ఉత్పత్తి సంబంధాలతో ఘర్షణ పడతాయి. దీనినే న్యాయశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే, ఇంతకుముందు పనిచేస్తున్న ఆస్తిసంబంధాలతోనే ఘర్షణపడతాయి. ఉత్పాదక శక్తులను అభివృద్ధిచేసే రూపాల నుండి యీ సంబంధాలు వాటి సంకెళ్ళుగా మార్తాయి. అప్పుడు సామాజిక విప్లవదశ ప్రారంభమవుతుంది. ఆర్థిక పునాది మారుటతో విస్తృతమైన యావత్తు బాహ్యనిర్మాణం (Entire immense Super Structure) త్వరగానో నెమ్మదిగానో ఏదోవిధంగా రూపాంతరం చెందుతుంది. అలాంటి రూపాంతరాలను పరిశీలించేటప్పుడు ఈ క్రింది రెండిటికీగల విభేదాన్ని గుర్తించాలి. ప్రకృతి విజ్ఞానశాస్త్రంవలెనే ఉత్పత్తి యొక్క ఆర్థిక పరిస్థితుల భౌతికరూపాంతరాన్ని ఖచ్చితంగా నిర్ణయించగలము; కాని శాసన (Legal) రాజకీయ, మత, లలితకళ రసానుభూతి (Aesthetic)లేక తాత్విక రూపాలను-క్లుప్తంగా చెప్పాలంటే, ఈ పోరాటాన్ని ఏసిద్ధాంత రూపాల్లో మానవులు గుర్తించి పోరాడుతారో ఆరూపాలను అంత ఖచ్చితంగా నిర్ణయించలేము. ఒక వ్యక్తి తననుగురించి తాను భావించిన దానిని ఆధారంగా చేసుకొని, మనం ఒకవ్యక్తిని గురించి అభిప్రాయం ఏర్పరచుకోజాలం. అలాగే అలాంటి

రూపాంతరం పొందిన కాలాన్ని దాని స్వంతచైతన్యాన్ననుస రించి మనం అంచనా వేయం. తద్విరుద్ధంగా, భౌతిక జీవిత పరస్పర వైరుధ్యాలనుండి, అమలులోనున్న సంఘర్షణనుండి, యీ చైతన్యాన్ని మనం విశదపరచాలి. ఉత్పత్తిశక్తులకు స్థాన మున్నటువంటి ఏసామాజికవిధానంకూడా, తనలోని ఉత్పాదక శక్తులన్నీ అభివృద్ధికాకముందే నశించదు. పాత సమాజపు గర్భంలోనే తత్ప్రస్తుత భౌతికపరిస్థితులు పరిపక్వం చెందక మునుపే, ఉన్నతమైన నూతన ఉత్పత్తి సంబంధాలు తల యెత్తవు. అందుచేత మానవజాతి ఎప్పుడూ తాను పరిష్క రించగల కర్తవ్యాలను మాత్రమే చేయబూనుకొంటుంది. ఇంకా యీ విషయాన్ని సూక్ష్మంగా పరిశీలించితే తేలే దేమంటే – ఒక కర్తవ్యాన్ని పరిష్కరించటానికి అవసరమైన భౌతిక పరిస్థితులు ఇదివరకే ఉన్నపుడుగాని, లేక అవి ఒక ఆకృతిని దాల్చేక్రమంలో ఉన్నప్పుడుగాని మాత్రమే ఆ కర్తవ్యం తల యెత్తుతుంది." (కారల్ మార్క్స్ – సెలెక్టెడ్ వర్క్స్ – ఇంగ్లీష్ ఎడిషన్ – మాస్కో 1946– 1వ వాల్యూమ్ 300—301 వ పేజీ)

ఇదీ, సామాజిక జీవితానికి, సామాజిక చరిత్రకు అను వర్తింపబడిన మార్క్సిస్టు భౌతికవాదం.

ఇవీ గతితార్కిక, చారిత్రక భౌతికవాదాల ప్రధాన సూత్రాలు.

కుసంస్కరణవాదుల, నమ్మకద్రోహుల దాడినుండి రక్షించి పార్టీకోసం లెనిన్ ఎంత సిద్ధాంతసంపదను కాపాడాడో, దీనినుండి మనం తెలుసుకోవచ్చు. మనపార్టీ అభివృద్ధికి

"భౌతికవాదము, అనుభవవాద విమర్శ" అనే లెనిన్ గ్రంథం వెలువడటం ఎంత ప్రాముఖ్యమైన విషయమో దీన్నిబట్టి మనం తెలుసుకోవచ్చు.

## 3

### స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక దినాలలో బోల్షివిక్కులూ, మెన్షివిక్కులూ, ఆట్జోవిస్టులతోను, లిక్విడేటర్లతోను బోల్షివిక్కుల పోరాటం

విప్లవాభివృద్ధి కాలంలో కంటే, అభివృద్ధి నిరోధక కాలంలో పార్టీ సంస్థలలో పని ఎక్కువ కష్టతరమైనది. పార్టీ సభ్యత్వం బాగా పడిపోయింది. పార్టీ తోడి ప్రయాణీకులైన మధ్యతరగతిలో చాలమంది, ముఖ్యంగా మేధావులు, జారు ప్రభుత్వ నిర్బంధానికి భయపడి పార్టీని విడిచిపెట్టిపోయారు.

ఇలాంటి సమయాలలో విప్లవపార్టీలు తమ విజ్ఞానాన్ని పరిపూర్ణం జేసుకోవాలని లెనిన్ పేర్కొన్నాడు. విప్లవం ముందుకువెళ్ళే కాలంలో విప్లవపార్టీలు ఎలా ముందుకు వెళ్లాలో నేర్చుకున్నాయి. అభివృద్ధినిరోధక కాలంలో అవి ఎలా తగు రీతిని వెనుదిరిగిపోవాలో, ఎలా రహస్యజీవితం ప్రారంభించాలో (అండర్ గ్రౌండుకు వెళ్ళాలో) రహస్యపార్టీని బలపరచి కాపాడుకోవాలో నేర్చుకోవాలి. ప్రజాబాహుళ్యంతో తమ సంబంధాలను బలీయం చేసుకొనేందుకుగాను,

బహిరంగంగా నున్న సంస్థలను, ముఖ్యంగా ప్రజాసంస్థలను, బహిరంగ అవకాశాలను ఎలా ఉపయోగించుకోవాలో అవి నేర్చుకోవాలి.

మెన్షివిక్కులు విప్లవతరంగం మరొకసారి లేచుట సాధ్యమనే విషయాన్ని నమ్మలేదు. అందుచే వారు గాభరాతో తిరోగమించారు. పార్టీ విప్లవ నినాదాలను, విప్లవ కార్యక్రమ కోర్కెలను సిగ్గులేకుండా పరిత్యజించారు. శ్రామిక వర్గ విప్లవ రహస్యపార్టీని రద్దుచేసి, స్వస్తి (Liquidate) చెప్పదలచారు. అందుకనే యీ రకపు మెన్షివిక్కులకు లిక్విడేటర్లని పేరు వచ్చింది.

మెన్షివిక్కులవలెగాక కొద్ది సంవత్సరాలలోనే విప్లవ వెల్లువ వస్తుందనే విశ్వాసం బోల్షివిక్కులకు దృఢంగా వుంది. ఈ విప్లవతరంగానికి ప్రజాసామాన్యాన్ని తయారు చేయుట పార్టీ విధియని బోల్షివిక్కులు భావించారు. విప్లవ ప్రధాన సమస్యలు పరిష్కరింపబడలేదు. రైతులకు, భూస్వాముల భూమి లభించలేదు. కార్మికులకు దినానికి 8 గంటల పని అను షరతు లభించలేదు. ప్రజలచే అసహ్యించుకోబడిన జారు నిరంకుశ ప్రభుత్వం ఇంకా కూలద్రోయబడలేదు. 1905 లో జారు ప్రభుత్వం నుండి ప్రజలు లాక్కొన్న స్వల్ప రాజకీయ హక్కులను సైతం ప్రభుత్వం మరల లాగివేసింది. ఆ విధంగా 1905 విప్లవం తలయెత్తడానికి మూలమైనకారణాలన్నీ అలాగే నిలిచిపోయాయి. అందుచేతనే బోల్షివిక్కులు విప్లవోద్యమం తిరిగి తలయెత్తుతుందని గట్టిగా విశ్వసించారు. అందుకోసం కార్మికవర్గ శక్తులను సమకూర్చి, సన్నాహాలు చేశారు.

1905 విప్లవం, ప్రజా విప్లవ పోరాటం ద్వారా తన హక్కులకై పోరాడాలని తెలియజేసింది. దీనినిబట్టి కూడా విప్లవతరంగం మరొకసారి తప్పకతలయెత్తి తీరుతుందని బోల్షివిక్‌లునిర్ణయించారు. పెట్టుబడిదారులు దాడిసాగించిన అభివృద్ధినిరోధక కాలంలో, కార్మికులు 1905 నాటి గుణపాఠాలను మరచిపోలేకపోయారు. ఫ్యాక్టరీ యజమానులు, మళ్లా తమను ఎలా పీడించి అవమానించుతున్నారో తెలియజేస్తూ కార్మికులు లెనిన్‌కు ఉత్తరాలు వ్రాశారు. అందులో "ఆగండి మరొక 1905 వస్తుంది" అని వారు అన్న వాక్యాలను, లెనిన్ ఉదహరించాడు.

జారు ప్రభుత్వాన్ని కూలద్రోయుటా, బూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్ని పూర్తిగావించుటా, సోషలిస్టు విప్లవానికి ముందుకు సాగుటా – ఇవీ 1905లో బోల్షివిక్కుల ప్రధాన రాజకీయ ఆశయాలు. ఇవి ఇంకా యిలాగే ఉండిపోయాయి. ఒక్కక్షణంకూడా బోల్షివిక్కులు ఈఆశయాన్ని మరచిపోలేదు. ప్రజాతంత్ర రిపబ్లిక్, భూస్వాముల ఎస్టేట్లను వశపరచుకొనుట, దినానికి 8 గంటల పని, మొదలగు ప్రధాన విప్లవనినాదాలను ప్రజాసామాన్యం ఎదుట బోల్షివిక్కులు పెడుతూనే వచ్చారు.

కాని, 1905 లోని విప్లవ తరంగ ఉధృతపు రోజులలోని పార్టీ ఎత్తుగడలే ఈనాడు కూడా వుండజాలవు. ఉదాహరణకు విప్లవోద్యమం క్షీణదశలో వున్నపుడు, కార్మికవర్గం పూర్తిగా అలసిపోయి వున్నపుడు, అభివృద్ధినిరోధక వర్గాల పరిస్థితి తగినంతగా బలపడి వున్నపుడు, వెన్వెంటనే సర్వవ్యాపిత రాజకీయ సమ్మెకు లేక సాయుధ తిరుగుబాటుకు ప్రజాసామా-

న్యాన్ని ఆదేశించడం తప్పవుతుంది. పార్టీ నూతనపరిస్థితికి అను గుణ్యంగా అంచనా వేసుకోవాలి. దాడి చేసే (అఫెన్సివ్) ఎత్తుగడలు మాని, సంరక్షించుకొనే (డిఫెన్సివ్) ఎత్తుగడలను పూనుకోవాలి. ఈ ఎత్తుగడలేమంటే, సర్వ శక్తులను సమ కూర్చుకొనుట, పార్టీ అనుచరులను (కేడర్‌ను) రహస్య జీవి తానికి (అండర్‌గ్రౌండ్‌కు) తిరోగమింపజేయుట, రహస్యజీవితం నుండి పార్టీ రహస్య కార్యకలాపాలను కొనసాగించుట, బహి రంగంగా వున్న కార్మికవర్గ సంస్థల కార్యకలాపాలతో, రహస్య కార్యకలాపాలను మేళవించుట.

దీనిని తాము నెరవేర్చగలమని బోల్షివిక్కులు నిరూ పించారు.

లెనిన్ ఇలా అన్నాడు :

"విప్లవ పూర్వ దీర్ఘకాలంలో ఎలా పనిచేయాలో మనకు తెలుసు. మనం పర్వతంవలె దృఢంగా వుంటామని వారు (శత్రువులు) పూరికే చెప్పడంలేదు. సోషల్ డెమాక్రట్లు ఒక శ్రామికవర్గ పార్టీగా ఏర్పడ్డారు. మొదటి సాయుధపోరా టం ఓడిపోయినంతమాత్రాన యీ పార్టీకి గుండె జారిపోదు; బుర్ర చెడిపోదు; వెర్రి సాహసకృత్యాలచే కొట్టుకుపోదు."

(లెనిన్ -సెలెక్టెడ్‌వర్కు్స-ఇంగ్లీష్ ఎడిషన్-మాస్కో- 1947 - 1వ వాల్యూమ్ 467 వ పేజీ)

బోల్షివిక్కులు రహస్యపార్టీ సంస్థను బలపరచటానికి, భద్రపరచటానికి కృషిచేశారు. అదే సమయంలో ప్రజా సామాన్యంతోటి సంబంధాలను కొనసాగించడానికీ, కాపాడ టానికీ గాను, ప్రతి బహిరంగ అవకాశాన్నీ ఏమాత్రం సందు

వున్నా ఉపయోగించుకొనుటా, ఆవిధంగా పార్టీని బలపర చుటా, అవసరమని బోల్షివిక్కులు భావించారు.

"జారు ప్రభుత్వానికి వ్యతిరేకంగా బహిరంగ విప్లవ పోరాటానికి బదులు మనపార్టీ డొంకతిరుగుడు పోరాటపద్ధతులను అవలంబించిన సమయమయింది. ఈ సమయంలో ప్రతి ఒక్క బహిరంగ అవకాశాన్నీ ఉపయోగించుకొంది. పరస్పర సహాయ సంఘాలు మొదలుకొని, డ్యూమా వేదికసైతం పార్టీ ఉపయోగించుకొంది. 1905 విప్లవంలో ఓడింపబడిన తర్వాత మనం తిరోగమించుతున్న కాలమిది. మన శక్తులను సమకూర్చుకొని, జారు ప్రభుత్వానికి వ్యతిరేకంగా బహిరంగ విప్లవ పోరాటం తిరిగి సాగించేందుకుగాను, కొత్తపోరాట పద్ధతులను నేర్చుకొనే బాధ్యత ఈ మార్పు మనపై వేసింది."
(స్టాలిన్ 15 వ పార్టీ కాంగ్రెస్ వెర్బాటమ్ రిపోర్టు - రష్యన్ ఎడిషన్ - 366 - 367 పేజీలు - 1935)

ఇంకా మిగిలివున్న బహిరంగ (లీగల్) సంస్థలు, పార్టీ రహస్య సంస్థలకు (అండర్‌గ్రౌండు ఆర్గానిజేషన్స్) తెరగా ఉపయోగించాయి. ప్రజలతో సంబంధాన్ని కొనసాగించే సాధనాలుగా ఉపయోగించాయి. ప్రజాసామాన్యంతో తమ సంబంధాలను కాపాడుకొనేందుకు గాను బోల్షివిక్కులు కార్మిక సంఘాలనూ, ఇతర బహిరంగ పౌర సంస్థలనూ, రోగగ్రస్తులను సహాయంచేసే సంఘాలు (Sick benefit Societies), కార్మిక సహకార సంఘాలూ మొదలైనవాటిని ఉపయోగించుకు న్నారు. జారు ప్రభుత్వ విధానాన్ని బట్టబయలు చేయడానికీ, శాసనబద్ధ ప్రజాతంత్రవాదులను బట్టబయలు చేయడానికీ,

శ్రామికవర్గానికి రైతుల అండను సంపాదించడానికీ, ప్రభుత్వ డ్యూమా వేదికను, బోల్షివిక్కులు ఉపయోగించుకున్నారు. రహస్యపార్టీ సంస్థనుభద్రపరచుకొనుట, దీని ద్వారా యితర రాజకీయ కార్యరూపాలన్నింటినీ నడుపుట, పార్టీ సరియైన పోకడను అవలంబించేటట్లు చేసింది. విప్లవవెల్లువలో రాబోయే నూతన ఉత్తేజానికి తగిన సన్నాహంచేయ పార్టీ శక్తులను ప్రోగుచేయునట్లు చేసింది.

బోల్షివిక్కులు రెండురంగాలలో పోరాడుతూ, తను విప్లవకరమైన పోకడను కొనసాగించారు. పార్టీలోపలనేవున్న రెండురకాల అవకాశవాద ధోరణులమీద పోరాటం సాగించారు. ఒకటి, పార్టీకి బహిరంగ శత్రువులైన లిక్విడేటర్లపైన. రెండవది, మరుగుపడివున్న పార్టీ శత్రువులగు ఆట్జోవిస్టులు అనబడే వారిమీద.

లెనినూ, బోల్షివిక్కులూ అవకాశవాదధోరణి అయిన లిక్విడేషనిజం పుట్టిననాటినుండీ, నిర్దాక్షిణ్యంగా దానితో పోరాటం సాగించారు. లిక్విడేటర్లు పార్టీలోనే వుండీ, లిబరల్ బూర్జువాకు ఏజెంట్లుగా పని చేస్తున్నారని లెనిన్ పేర్కొన్నాడు.

1908 డిసెంబరులో, పారిస్‌లో రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్‌పార్టీ (యావత్ రష్యా) 5వ మహాసభ జరిగింది. లెనిన్ తీర్మానాన్ని అనుసరించి, యీ మహాసభ లిక్విడేషనిజంను ఖండించింది. పార్టీ మేధావులలో ఒక భాగం (మెన్షివిక్కులు) "ప్రస్తుతమున్న రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్‌పార్టీ సంస్థను రద్దుచేయాలని (లిక్విడేట్) ప్రయత్నించుతున్నారు. దానిస్థానే, పార్టీ సాంప్రదాయాలనూ ఎత్తుగడ

లనూ కార్యక్రమాన్ని ఒక్కుమ్మడిగా పరిత్యజించినైనా సరే, ఎంత నష్టమైనాసరే, బహిరంగంగా నడిచే సంఘటనారహిత మైన సంస్థను నెలకొల్పాలని ప్రయత్నించుతున్నారు. ఇదే లిక్విడేషనిజం." (సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టు బోల్షివిక్‌పార్టీ తీర్మానాలు, రష్యన్ ఎడిషన్-1వ భాగం 128వ పేజీ)

లిక్విడేటర్ల ప్రయత్నాలకు వ్యతిరేకంగా నిశ్చిత పోరాటాన్ని సాగించవలసినదిగా పార్టీసంస్థలను అన్నిటినీ ఈ మహాసభ ఆదేశించింది.

కాని, మెన్షివిక్కులు ఈ మహాసభ నిర్ణయాలకు బద్ధులై వుండలేదు. మరింతగా లిక్విడేషనిజం అనే ఊబిలో దిగిపోయారు. విప్లవానికి ద్రోహంచేశారు. శాసనబద్ధ ప్రజాతంత్రవాదులతో చేతులుకలిపారు. ప్రజాతంత్ర రిపబ్లిక్, దినానికి 8 గంటలపని, ఎస్టేట్ల భూమిని వశపరచుకొనుట మొదలగు కోర్కెలను, శ్రామికవర్గ పార్టీ విప్లవ కార్యక్రమాన్ని మెన్షివిక్కులు రానురాను మరింత బహిరంగంగా పరిత్యజించడం మొదలెట్టారు. పార్టీ కార్యక్రమాన్ని, ఎత్తుగడలను పరిత్యజించుటద్వారా, నామమాత్రపు బహిరంగ చట్టబద్ధ "కార్మిక" పార్టీ ఉనికికి జారుప్రభుత్వ సమ్మతిని పొందవచ్చునని వారు ఆశించారు. స్టొలీపిన్ ప్రభుత్వంతో రాజీపడటానికీ దాని కనుగుణ్యంగా ప్రవర్తించడానికీ వీరు తయారయ్యారు. అందుకనే యీ లిక్విడేటర్లను "స్టొలీపిన్ లేబర్‌పార్టీ" అని కూడా పిలచేవారు.

డాన్, ఆక్సిల్‌రాడ్, పొట్రెసోవ్ మొదలగువారి నాయకత్వాన ఉన్నట్టియూ, మార్టోవ్, ట్రాట్స్కీ యింకా

తదితర మెన్షివిక్కుల సహాయం కలిగినట్టి లిక్విడేటర్లతో-పార్టీ బహిరంగ శత్రువులతో - పోరాడుటయేగాక, దాగివున్న లిక్విడేటర్ల పైకూడా బోల్షివిక్కులు నిర్దయాత్మకమైన పోరాటాన్ని సాగించారు. వీరు ఆట్జోవిస్టులు. "అతివాద" పదజాలంతో తమ అవకాశవాదాన్ని కప్పిపుచ్చుకునేవారు. బహిరంగంగా వున్న సంఘాలలోని పనిని పూర్తిగా కట్టిపెట్టాలనీ, ప్రభుత్వ డ్యూమానుండి కార్మిక ప్రతినిధులను పిలిపించివేయాలని కొందరు మాజీ బోల్షివిక్కులు కోరారు. రష్యన్ భాషలో ఆట్జివ్ అనగా పిలిపించివేయుట. అందుచే వీరికి ఆట్జోవిస్టులని పేరువచ్చింది.

1908లో కొందరు బోల్షివిక్కులు ప్రభుత్వ డ్యూమా నుండి సోషల్ డెమాక్రటిక్ ప్రతినిధులను పిలిపించివేయాలని కోరారు. ఆట్జోవిస్టులు తమ స్వంతముఠాను ఏర్పరచుకున్నారు. (బాగ్డనోవ్, లూనా చెర్స్కి, ఎలెగ్జెన్స్కి, పోక్రవిస్కి, బూబ్నావ్ మొదలగువారు) లెనిన్‌కు, లెనిన్ పోకడకు వ్యతిరేకంగా వీరు పోరాటం సాగించారు. ఆట్జోవిస్టులు కార్మిక సంఘాలలోను, ఇంకా బహిరంగంగానున్న ఇతర సంఘాలలోను పనిచేయడానికి మొండిగా తిరస్కరించారు. అలా చేయుటద్వారా కార్మిక ఆశయానికి వారు చాలా హాని చేశారు. ఆట్జోవిస్టులు, పార్టీకి కార్మికవర్గానికి మధ్య ఒక అఘాతాన్ని కల్పించుతున్నారు. పార్టీకిచెందని ప్రజాసామాన్యంతో పార్టీకి సంబంధాలులేకుండా చేయాలని ప్రయత్నించుతున్నారు. తాము రహస్యసంస్థలలో (అండర్‌గ్రౌండ్ ఆర్గానిజేషన్‌లో) గూడుకట్టుకుని కూర్చోవాలనుకున్నారు. కాని చట్ట

బద్ధమైన ముసుగు (లీగల్ కవర్)ను ఉపయోగించుకొనే అవకాశాన్ని నిరాకరించి, వారు, ఈ రహస్యసంస్థలకు సైతం అపాయం తెచ్చిపెట్టారు. ప్రభుత్వ డూ్యమాలోవుండి, ఆ డూ్యమాద్వారానే బోల్షివిక్కులు రైతాంగాన్ని తమ పలుకుబడిలోకి లాక్కోవచ్చునని ఆట్జోవిస్టులు గ్రహించలేదు. రైతాంగాన్ని మోసంచేసి వారి అండను సంపాదింప ప్రయత్నించుతున్న శాసనబద్ధ ప్రజాతంత్రవాదుల పాలసీనీ, జారు ప్రభుత్వాన్నీ డూ్యమాద్వారానే బట్టబయలు చేయవచ్చునని కూడా వీరు గ్రహించలేదు. విప్లవం మరో అడుగు ముందుకు వేయడానికి కావలసిన శక్తులను సమకూర్చడాన్ని ఆట్జోవిస్టులు ఆటంకపరచారు. అందుచేత ఆట్జోవిస్టులు "సంపూర్ణంగా లిక్విడేటర్లే". వీరు బహిరంగంగా ఉండే సంస్థలను ఉపయోగించు అవకాశాన్ని నాశనం చేయడానికి యత్నించారు. పార్టీ సభ్యులుకాని ప్రజా బాహుళ్యానికి శ్రామికవర్గం నాయకత్వం వహించాలనుటను వీరు పరిత్యజించారు. వాస్తవానికి విప్లవ కార్యకలాపాలనే వీరు పరిత్యజించారు.

1909లో ఆట్జోవిస్టుల ప్రవర్తననుచర్చించడానికై బోల్షివిక్ వార్తాపత్రిక "ప్రొలిటరీ" (Proletary) విస్తృత సంపాదకవర్గ సమావేశం జరిగింది. ఆ సమావేశం ఆట్జోవిస్టులను ఖండించింది. బోల్షివిక్కులు ఆట్జోవిస్టులతో తమ కెట్టి సంబంధమూ లేదని ప్రకటించి, బోల్షివిక్ సంస్థలనుండి వారిని వెళ్ళగొట్టారు.

లిక్విడేటర్లు,ఆట్జోవిస్టులు, శ్రామికవర్గంయొక్క శ్రామిక వర్గపార్టీయొక్క పెటీబూర్జువా తోటిప్రయాణీకులుతప్ప

మరేమీగాదు. శ్రామికవర్గానికి కష్టదినాలు సంప్రాప్తించి నపుడు లిక్విడేటర్ల, ఆట్జోవిస్టుల నిజస్వభావం ప్రత్యేకమైన విస్పష్టతతో బయటపడింది.

# 4

## ట్రాట్స్కీ-జానికి వ్యతిరేకంగా బోల్షివిక్కుల పోరాటం - పార్టీవ్యతిరేక ఆగస్టు కూటమి

లిక్విడేటర్లకు, ఆట్జోవిస్టులకు వ్యతిరేకంగా రెండు రంగాలలో నిర్దాక్షిణ్యమైన పోరాటాన్ని బోల్షివిక్కులు సాగించుతున్న సమయంలో, శ్రామికవర్గ పార్టీయొక్క ఖచ్చితమైన పోకడను బోల్షివిక్కులు సమర్థించుతున్న సమయంలో, మెన్షివిక్ లిక్విడేటర్లను ట్రాట్స్కీ సమర్థించాడు. ఈ రోజులలోనే ట్రాట్స్కీని లెనిన్ "జూడాస్ ట్రాట్స్కీ" (క్రీస్తుకు ద్రోహం చేసిన శిష్యుని పేరు జూడాస్. నమ్మకద్రోహి అని అర్థం - అనువాదకుడు) అని పేరుపెట్టాడు. ట్రాట్స్కీ వియన్నాలో (ఆస్ట్రియా) కొందరు రచయితలతో ఒక ముఠాను ఏర్పరచాడు. ఏ చీలికకూ చెందని పత్రిక అని చెప్పుకుంటూ, వాస్తవానికి మెన్షివిక్ వార్తాపత్రికను ఒకదానిని ప్రకటించ సాగాడు. "ట్రాట్స్కీ తుచ్ఛమైనపదవీవ్యామోహాపరుడు. ముఠాతత్వవాది. (ఫాక్షనలిస్టు) .... పార్టీకి నామమాత్రసానుభూతి అతనుప్రకటిస్తాడుగాని, ఏయితర ముఠాతత్వ వాదికంటెకూడా నీచంగా ప్రవర్తించుతాడు" అని ఆ కాలంలో లెనిన్ వ్రాశాడు.

1912 లో ట్రాట్స్కీ ఆగస్టు కూటమిని సంఘటిత పర చాడు. లెనిన్‌కు, బోల్షివిక్ పార్టీకి వ్యతిరేకమైన, అన్ని బోల్షివిక్ వ్యతిరేకముఠాలు, ధోరణులు ఈ ఆగస్టుకూటమిలో ఉన్నాయి. ఈ బోల్షివిక్-వ్యతిరేకకూటమిలో లిక్విడేటర్లు, ఆట్జో విస్టులు ఐక్యమయ్యారు. ఆవిధంగా తమ బంధుత్వాన్ని చాటు కున్నారు. అన్ని ప్రధానవిషయాలలోనూ ట్రాట్స్కీ, ట్రాట్స్కీ అనుచరులు, లిక్విడేషనిస్టుల వైఖరిని అవలంబించారు. కాని ట్రాట్స్కీ తన లిక్విడేషనిజమ్‌ను 'సెంట్రిజమ్' అనే ముసుగు వేశాడు. దీనిఅర్థం సమాధాన విధానమన్నమాట. తాను బోల్షివిక్కులకుగాని, మెన్షివిక్కులకుగాని చెందననీ, వారిద్దరినీ సమాధాన పరచ ప్రయత్నించుతున్నాననీ చెప్పాడు. ఇదే సెంట్రిజం. ఈ సందర్భంలో లెనిన్ ఇలా అన్నాడు. "ట్రాట్స్కీ బహిరంగ లిక్విడేటర్లకంటే తుచ్ఛమైనవాడు. ప్రమాదకారి. ఎందువల్లనంటే తాను 'ఏపక్షానికీ చెందనివాడిననీ' అతడు కార్మికులను మోసగించ ప్రయత్నించు తున్నాడు. కాని వాస్తవంలో మెన్షివిక్ లిక్విడేటర్లను అతడు పూర్తిగా బల పరచుతున్నాడు. సెంట్రిజమ్‌ను పోషించిన ప్రధానముఠా ట్రాట్స్కీయిస్టులే."

కామ్రేడ్ స్టాలిన్ ఇలా వ్రాశాడు:

"సెంట్రిజం ఒక రాజకీయ అభిప్రాయం. <u>అందరికీ ఉమ్మడిమైన పార్టీలో,</u> పెటీబూర్జువా ప్రయోజనాలకు శ్రామికవర్గ ప్రయోజనాలను లోనువచేసి సరిపెట్టుకొనిపోయే సిద్ధాంతమే అది. ఈ సిద్ధాంతం లెనినిజానికి విముఖమైనది,

గర్హింపదగినది." (స్టాలిన్ - ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం IX రష్యన్ ఎడిషన్, 379 వ పేజీ)

ఈ కాలంలో కామెనివ్, జినోవీవ్, రైకావ్‌లు ట్రాట్స్కీకి నిజానికి రహస్య ఏజంట్లు. లెనిన్‌కు వ్యతిరేకంగా వారు తరచు ట్రాట్స్కీకి సహాయపడ్డారు. జినోవీవ్, కామెనివ్ రైకావ్, యింకా ట్రాట్స్కీయొక్క ఇతర రహస్య సహచరులతో, లెనిన్ కోర్కెలకు వ్యతిరేకంగా 1910 జనవరిలో సెంట్రల్‌కమిటీ ప్లీనమ్ (విస్తృత) సమావేశపరచబడింది. ఆకాలంలో అనేకమంది బోల్షివిక్కులు అరెస్టుకావడంవల్ల సెంట్రల్‌కమిటీ అంగనిర్మాణంలో మార్పువచ్చింది. ఊగిసలాడే వ్యక్తులు లెనినిస్టు వ్యతిరేకనిర్ణయాలను చేయించగలిగారు. ఈ ప్లీనంలో బోల్షివిక్ వార్తాపత్రిక 'ప్రొలిటరీ'ని మూసివేయడానికి నిశ్చయించారు. వియన్నాలో ప్రచురింపబడుతున్న ట్రాట్స్కీ పత్రిక 'ప్రవదా'కు ఆర్థికసహాయం చేయాలని నిర్ణయించబడింది. ట్రాట్స్కీ వార్తాపత్రిక సంపాదకవర్గంలో కామెనివ్ చేరాడు. జినోవీవ్‌తోకలసి అతడు దానిని సెంట్రల్ కమిటీ పత్రికగా చేయడానికి కృషిచేశాడు.

సెంట్రల్‌కమిటీ జనవరి ప్లీనంలో లెనిన్ ఒత్తిడివల్ల లిక్విడేషనిజమ్‌ను, ఆట్జోవిజంను ఖండించుతూ ఒక తీర్మానాన్ని చేసింది. కాని ఇక్కడకూడా లిక్విడేటర్లను ఆ పేరున పిలవరాదని ట్రాట్స్కీ చేసిన తీర్మానాన్ని జినోవీవ్, కామెనివ్‌లు బలపరచారు.

లెనిన్ ముందుగా గ్రహించి హెచ్చరిక చేసినట్లుగానే అన్ని జరిగాయి. సెంట్రల్‌కమిటీ ప్లీనం తీర్మానాన్ని బోల్షి

విచ్ఛిన్నకులు మాత్రం అమలుపరచారు. తమ పత్రిక 'ప్రొలిటరీ'ని మూసివేశారు. కాని మెన్షివిక్కులు చీలికలు కలిగించే (ఫాక్షనలిస్టు) తమ లిక్విడేషనిస్టు వార్తాపత్రిక "గోలోస్ సోషల్-డెమొక్రేటా"ను (Voice of social - Democrats సోషల్ డెమొక్రట్ వాణి) ప్రచురించుతూనే వచ్చారు.

"సోషల్ డెమొక్రట్" 11వ సంచికలో కామ్రేడ్ స్టాలిన్ ఒక ప్రత్యేక వ్యాసాన్ని ప్రకటించాడు. అందులో లెనిన్ వాదాన్ని పూర్తిగా సమర్థించాడు. అందులో ట్రాట్స్కీజం యొక్క తోడిదొంగల ప్రవర్తనను ఖండించాడు. కామెనివ్, జినోవీవ్, రైకావ్‌ల ద్రోహ ప్రవర్తన ఫలితంగా బోల్షివిక్ ముఠాలో ఏర్పడిన అసాధారణ పరిస్థితిని తుద ముట్టించవలసిన ఆవశ్యకతను గురించి కామ్రేడ్ స్టాలిన్ వ్రాశాడు. తక్షణ కర్తవ్యాలను గురించికూడా ఆ వ్యాసం తెలియజేసింది. తర్వాత ఈ కర్తవ్యాలను ప్రాగ్ పార్టీసభ (కాన్ఫరెన్సు) ఆచరణలో పెట్టింది. అవి ఏమనగా: పార్టీ సర్వసభ్య సమావేశం జరుపుట, ఒక పార్టీ వార్తాపత్రికను బహిరంగంగా ప్రకటించుట, రష్యాలో రహస్య దైనందిన కార్యాచరణను నడిపే పార్టీ కేంద్రాన్ని ఏర్పరచుట. కామ్రేడ్ స్టాలిన్ వ్యాసం బాకూ కమిటీ తీర్మానాల నాధారం చేసుకొని వ్రాయబడింది. బాకూ కమిటీ లెనిన్‌ను పూర్తిగా సమర్థించింది.

ట్రాట్స్కీ యొక్క పార్టీవ్యతిరేక ఆగస్టు కూటమిలో పార్టీవ్యతిరేక వ్యక్తులే పూర్తిగా వున్నారు. లిక్విడేటర్లు మొదలుకొని, ట్రాట్స్కీయిస్టులు, ఆట్జోవిస్టులు, భగవన్నిర్మాతల వరకు వున్నారు. ఈ కూటమిని ప్రతిఘటించుటకుగాను ఒక

పార్టీ కూటమి ఏర్పడింది. రహస్య శ్రామికవర్గ పార్టీని కాపాడి బలపరచాలనే వారు ఇందులోవున్నారు. ఈ కూటమిలో లెనిన్ నాయకత్వాన బోల్షివిక్కులూ, ప్లెఖనావ్ నాయకత్వాన పార్టీ అనుకూల మెన్షివిక్కులు కొద్దిమందీ వున్నారు. ప్లెఖనావ్, అతనిముఠా అయిన పార్టీ అనుకూల మెన్షివిక్కులూ అనేక సమస్యలపై మెన్షివిక్ వాదననే సాగించారు. కాని ఆగస్టుకూటమితోను, లిక్విడేటర్లతోను పూర్తిగా సంబంధం తెంచుకొని, బోల్షివికులతో ఒడంబడికకు చేయిజాపారు. లెనిన్ ప్లెఖనావ్ సూచనను అంగీకరించి, పార్టీ వ్యతిరేక వ్యక్తులకు ప్రతికూలంగా, తాత్కాలికమైన ఒక కూటమిని ఏర్పరచడానికి అంగీకరించాడు. ఈ కూటమి పార్టీకి లాభకరంగాను, లిక్విడేటర్లకు వినాశకరంగాను ఉంటుందని, లెనిన్ పైసూచనకు అంగీకరించాడు.

కామ్రేడ్ స్టాలిన్ యీ కూటమిని పూర్తిగా సమర్థించాడు. ఆ సమయంలో స్టాలిన్ ప్రవాసంలోవుండి, అక్కడ నుంచి లెనిన్‌కు ఒక ఉత్తరం వ్రాశాడు. అందులో కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"నా అభిప్రాయంలో యీ (లెనిన్, ప్లెఖనావ్‌ల) కూటమియొక్క పోకడ ఒకటే సరియైనది: 1. ఈ పోకడయే, ఇదొక్కటే రష్యాలో నిజమైన కార్య ప్రయోజనాలకు అనుగుణ్యంగావుంటుంది. నిజమైనపార్టీ వ్యక్తు లందరూ ఐక్యమై ఈ కూటమిచుట్టూ చేరాలని ఈ పోకడ కోరుతుంది. 2. లిక్విడేటర్లకు మెక్ (మెన్షివిక్కు) వర్కర్లకు మధ్య అఘాతాన్ని త్రవ్వి, లిక్విడేటర్లను చెదరగొట్టి వదిలించుకొంటుంది. తద్వారా

లిక్విడేటర్ల పెత్తనంనుండి బహిరంగ సంస్థలను విముక్తిచేసే మార్గాన్ని యీ పోకడయే - యీ పోకడ ఒక్కటే, సుకరం చేస్తుంది." (లెనిన్ - స్టాలిన్ - రష్యన్ ఎడిషన్ - 1 వ వాల్యూమ్, 529 - 30 పేజీలు)

కార్యకలాపంతో కార్యకలాపాన్ని చాకచక్యంగా, కలుపుటద్వారా బోల్షివిక్కులు బహిరంగ కార్మికసంస్థలలో ఒక బలమైనశక్తి కాగలిగారు. ఆకాలంలో జరిగిన నాలుగు బహిరంగ కాంగ్రెస్‌లలో - ప్రజా యూనివర్సిటీల కాంగ్రెస్, మహిళా కాంగ్రెస్, ఫ్యాక్టరీవైద్యుల కాంగ్రెస్, మధ్యపాన నిషేధ కాంగ్రెస్‌లలో (Temperance) - బోల్షివిక్కులకు కార్మిక మతాలపైగల పలుకుబడి యాదృచ్ఛితంగా బయట పడింది. ఈ కాంగ్రెస్‌లలో (మహాసభలలో) బోల్షివిక్కుల ఉపన్యాసాలు రాజకీయంగా చాలా విలువైనవి. దేశమంతా ఇవి చైతన్యాన్ని రేకెత్తించాయి. ఉదాహరణకు ప్రజా యూనివర్సిటీల కాంగ్రెస్‌లో, సంస్కృతీ కార్యకలాపాలను అన్నిటినీ గొంతు పిసికివేయుచున్న జారు ప్రభుత్వ వైఖరిని బోల్షివిక్కు కార్మిక ప్రతినిధులు బట్టబయలుచేశారు. జారు ప్రభుత్వాన్ని రద్దుచేసేవరకు నిజమైన సాంస్కృతిక అభివృద్ధి కలుగదని వాదించారు. ఎంతటి అనారోగ్య పరిస్థితులలో జీవించవలసి యుంటున్నదో, పనిచేయాల్సివుంటున్నదో, ఫ్యాక్టరీవైద్యుల కాంగ్రెస్‌లో కార్మిక ప్రతినిధులు తెలియజేశారు. జారు ప్రభుత్వాన్ని కూలద్రోసేంతవరకు ఫ్యాక్టరీపనివారలకు సరియైన ఆరోగ్యం సమకూరదని తేల్చిచెప్పారు.

ఇంకా లీగల్‌గావున్న వివిధసంఘాలనుండి లిక్విడేటర్లను బోల్షివిక్కులు నెమ్మదిగా తుడిచిపెట్టారు. పార్టీ అనుకూలురైన ప్లెఖనావ్ ముఠాతో ఏర్పరచుకున్న విలక్షణమైన సంయుక్త సంఘటన ఎత్తుగడలు, అనేక మెన్షివిక్ కార్మిక సంస్థలను (వైబార్గ్, ఎకాటరీనోస్లావ్ మొదలగు జిల్లాలలో) బోల్షివిక్కులు తమ వైపుకు త్రిప్పుకొనేట్లు చేశాయి.

ఈ కష్టసమయంలో బహిరంగ కార్యకలాపంతో రహస్య కార్యకలాపం ఎలా కల్పాలో బోల్షివిక్కులు ఉదాహరణతో సహా రుజువు చేశారు.

## 5

## 1912 లో ప్రాగ్‌లో పార్టీ కాంగ్రెస్ – బోల్షివిక్కులు స్వతంత్ర మార్క్సిస్టు పార్టీగా ఏర్పడుట

లిక్విడేటర్లతోను, ఆట్జోవిస్టులతోను, ట్రాట్స్కీవాదులతోను సాగించే పోరాటంలో, బోల్షివిక్కుల నందరినీ ఐక్యపరచి స్వతంత్ర బోల్షివిక్ పార్టీని ఏర్పరచే అత్యావసర కర్తవ్యం వారిని ఎదుర్కొంది. కార్మికవర్గాన్ని చీల్చుతున్న, పార్టీలో అవకాశవాద ధోరణులను తుదముట్టించడానికి ఇది అత్యావసరం. ఇంతేగాక, కార్మికవర్గ శక్తులను సమకూర్చుట పూర్తిచేసి, ఆ కార్మికశక్తిని నూతన విప్లవోత్తేజానికి సన్నిద్ధపరచేందుకు కూడా ఇది చాలా అవసరం.

కాని యీ కర్తవ్యాన్ని నెరవేర్చాలంటే ముందు అవకాశ వాదులను, మెన్షివిక్కులను పార్టీ వదిలించుకోవాలి.

మెన్షివిక్కులతో కలసి బోల్షివిక్కులు ఒకే పార్టీలో వుండడాన్ని గురించి ఆలోచించవలసిన పనేలేదు. ఈవిషయంలో ఏ బోల్షివిక్కుకు, ఎట్టి సందేహమూ లేదు. స్టోలీపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో మెన్షివిక్కుల ద్రోహ ప్రవర్తన, శ్రామిక వర్గ పార్టీని రద్దుపరచి ఒక కొత్త సంస్కరణవాద (రిఫార్మిస్టు) పార్టీని ఏర్పరచటానికి వారి ప్రయత్నాలు, వారితో తెగతెంపులు చేసుకొనుటను తప్పనిసరి చేశాయి. మెన్షివిక్కులతో కలసి బోల్షివిక్కులు ఒకే పార్టీలో వుండుటవల్ల మెన్షివిక్కుల ప్రవర్తనకు నైతిక బాధ్యతను, ఏదోవిధంగా బోల్షివిక్కులు అంగీకరించినట్లే అయింది. కాని మెన్షివిక్కుల బహిరంగ ద్రోహానికి బోల్షివిక్కులు నైతిక బాధ్యతను అంగీకరించటం ఊహించరానిది. పార్టీకీ, కార్మికవర్గానికీ తామే ద్రోహులు కాదలిచితే తప్ప అలాంటి నైతిక బాధ్యతను తాము అంగీకరించలేరు. ఒకే పార్టీలో మెన్షివిక్కులతో కలసివుండడమంటే కార్మికవర్గానికీ, పార్టీకీ ద్రోహంచేసే స్వభావాన్ని వహించుటే. అందుచేత మెన్షివిక్కులతో వాస్తవంగా తెగతెంపులు పూర్తి చేయాలంటే, నిర్మాణరీత్యా తెగతెంపులు చేసుకోవాలి. పార్టీనుండి మెన్షివిక్కులను వెళ్ళగొట్టాలి.

ఈ మార్గం ద్వారానే ఒకే కార్యక్రమమూ, ఎత్తుగడలూ కలిగిన వర్గసంస్థగా (Class Organisation) శ్రామిక వర్గ విప్లవ పార్టీని పునరుద్ధరించుట సాధ్యమవుతుంది.

మెన్షివిక్కులు నాశనంగావించిన పార్టీ ఐక్యతను వాస్తవంగా (నామకః కాదు) పునరుద్ధరించాలంటే ఒక్క మార్గం

ద్వారానే సాధ్యం అవుతుంది. ఈ కర్తవ్యాన్ని పార్టీ ఆగవ మహాసభ పూర్తి చేయవలసివుంది. ఈ మహాసభకై బోల్షివిక్కులు సన్నాహాలు గావించుతున్నారు.

కాని కర్తవ్యనిర్వహణలో ఇది ఒక్క భాగంమాత్రమే. మెన్షివిక్కులతో వాస్తవంగా విడిపోవుటా, బోల్షివిక్కులు ప్రత్యేక పార్టీని స్థాపించుటా చాలా ముఖ్యమైన రాజకీయ కర్తవ్యమే. కాని బోల్షివిక్కులను ఇంకా చాలా ముఖ్యమైన మరొక కర్తవ్యం ఎదుర్కొన్నది. మెన్షివిక్కులతో చీలిపోయి వేరే ప్రత్యేక పార్టీని లాంఛనంగా ఏర్పరచుకొనుట మాత్రమే బోల్షివిక్కుల కర్తవ్యంకాదు. మెన్షివిక్కులతో తెగతెంపులు చేసుకున్న తర్వాత, అన్నిటికన్నా ముఖ్యంగా కొత్త పార్టీని, కొత్త రకపు పార్టీని, పశ్చిమదేశాలలో సాధారణంగా వున్న సోషల్ డెమాక్రటిక్ పార్టీలకంటే విభిన్నమైన పార్టీని, అవకాశవాద వ్యక్తులు లేనటువంటి పార్టీని, అధికారంకై వశంకై జరిగే పోరాటంలో శ్రామికవర్గాన్ని నడుప శక్తిగల పార్టీని ఏర్పరచాలి.

బోల్షివిక్కులతో పోరాడుటలో అన్నిరకాల మెన్షివిక్కులూ - ఆక్సెల్‌రాడ్, మార్టినోవ్ మొదలుకొని ట్రాట్‌స్కీలవరకు-పశ్చిమ యూరోపియన్ సోషల్‌డెమాక్రట్ల ఆయుధాగారం నుండి అప్పుతెచ్చుకున్న ఆయుధాలను తు, చ తప్పకుండా ఉపయోగించారు. (అంటే పశ్చిమ యూరోపియన్ సోషలిస్టుల తప్పుడు సిద్ధాంతాలను వల్లించారు-అనువాదకుడు) జర్మన్ లేక ఫ్రెంచి సోషల్ డెమాక్రటిక్ పార్టీవంటి పార్టీ రష్యాలో కూడా వుండాలని వారు కోరారు. ఏదో కొత్తది,

ఏదో అసాధారణమైనది, పశ్చిమ సోషల్ డెమాక్రట్సుకు విభిన్నమైనటువంటిది ఏదో బోల్షివిక్కులలో వున్నదని వారు పసికట్టారు. అందుచేతనే బోల్షివిక్కులతో వారు పోరాడారు. ఆరోజులలో పశ్చిమ సోషల్ డెమాక్రటిక్ పార్టీలు ఎవరికి ప్రాతినిధ్యంవహించేవి? మార్క్సిస్టులూ, అవకాశవాద వ్యక్తులు కలసిన- విప్లవమిత్రులూ శత్రువులూ కలసిన-పార్టీ సిద్ధాంతాలను సమర్థించినవారూ, ప్రతికూలించినవారూ కలసిన కలగూరగంపలే ఆ పార్టీలు. పార్టీసిద్ధాంతాలను సమర్థించినవారు, ఆ సిద్ధాంతాలను ఎదిరించినవారితో సిద్ధాంతరీత్యా క్రమక్రమంగా సమాధానపడి, చిట్టచివరకు వారికి పూర్తిగా లొంగిపోయారు. బోల్షివిక్కులు, పశ్చిమ యూరోపియన్ సోషల్ డెమాక్రట్లను అవకాశవాదులతోనూ, విప్లవద్రోహులతోనూ సమాధానమార్గం దేనికి? అని ప్రశ్నించారు. దీనికి వారిలాజవాబిచ్చారు. "పార్టీలో శాంతి"కోసం. "ఐక్యత" కోసం. ఐక్యత ఎవరితో? అవకాశవాదులతోనా? ఔను! అవకాశవాదులతోనే, అని వారు జవాబుయిచ్చారు. ఇలాంటి పార్టీలు విప్లవపార్టీలు కాజాలవని విస్పష్టమే.

ఏంగెల్సు మరణానంతరం, పశ్చిమ యూరోపియన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీలు, సామాజిక విప్లవపార్టీల స్థాయి నుండి "సంఘ సంస్కరణల" పార్టీలుగా పతనమొందసాగాయి. ఈ పార్టీలన్నీ నిర్మాణరీత్యా, నాయకత్వం వహించే స్థితినుండి తమ పార్లమెంటు ముఠాకు తోకగా తయారయే స్థితికి మారాయి. ఈ విషయాన్ని గ్రహించకుండా బోల్షివిక్కులు కన్ను మూసుకోలేరు.

అలాంటి పార్టీ శ్రామికవర్గానికి ఎలాంటి మంచినీ తెచ్చిపెట్టదనీ, శ్రామికవర్గాన్ని విప్లవానికి నడిపించగల సామర్థ్యం కలిగి వుండదనీ, బోల్షివిక్కులు గ్రహించకుండా వుండలేరు. శ్రామికవర్గానికి కావలసింది అలాంటిపార్టీ కాదు. మరో రకపు పార్టీ. అది నిజమైన మార్క్సిస్టుపార్టీ. కొత్త పార్టీ, అవకాశవాదులపట్ల రాజీ లేనిదీ, బూర్జువా పట్ల విప్లవకరంగాను వుండాలి. బిగువైన ఐక్యత కలిగి, ఏకశిలాఖండం లాంటి దృఢమైన పార్టీగా వుంటుంది. అది సామాజిక విప్లవ పార్టీ. శ్రామికవర్గ నియంతృత్వ పార్టీ. ఇలాంటి పార్టీయే శ్రామికవర్గానికి అవసరమనే విషయాన్ని బోల్షివిక్కులు గ్రహించకుండా వుండలేకపోయారు.

బోల్షివిక్కులు కోరింది ఇలాంటి కొత్తరకపు పార్టీనే. ఇలాంటి పార్టీని నిర్మించడానికి బోల్షివిక్కులు కృషిచేశారు కూడా. "ఎకనమిస్టులు", మెన్షివిక్కులు, ట్రాట్స్కీవాదులు, ఆట్జోవిస్టులతోను అన్నిరకాల భావవాదులు మొదలుకొని అనుభవవాద-విమర్శకులవరకు, వీరందరితో గావించిన పోరాటాల చరిత్ర అంతా అలాంటి పార్టీ నిర్మాణ చరిత్రయే. నిజమైన విప్లవ మార్క్సిస్టుపార్టీని కోరేవారందరికీ నమూనాగా పనికి వచ్చే ఒక కొత్తరకపు బోల్షివిక్ పార్టీని, బోల్షివిక్కులు నిర్మించదలచారు. పాత ఇస్క్రా కాలంనుండీ అలాంటి పార్టీని నిర్మించడానికి బోల్షివిక్కులు పనిచేస్తూనే వున్నారు. ఎన్ని అడ్డంకులు వచ్చినా నిరంతరం దానికోసం పట్టుదలతో పని చేస్తూనే వచ్చారు. "ఏమిచెయ్యాలి?" - "రెండుఎత్తుగడలు" అన్న లెనిన్ గ్రంథాలు ఈ కార్యకలాపంలో ప్రధాన పాత్ర

పాత్రను వహించాయి. అలాంటి పార్టీకి సిద్ధాంత సన్నాహాన్ని (Ideological Preperation) "ఏమి చెయ్యాలి?" అనే గ్రంథం చేసింది. అలాంటి పార్టీ నిర్మాణ సన్నాహాన్ని (Organisational Preparation) "ఒకడుగు ముందుకు, రెండడుగులు వెనక్కు" అనే లెనిన్ గ్రంథం చేసింది. అలాంటి పార్టీకి రాజకీయ సన్నాహాన్ని (Political preparation) "ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమొక్రసీ అవలంబించ వలసిన రెండు ఎత్తుగడలు" అనే లెనిన్ గ్రంథం చేసింది. అలాంటి పార్టీకి తాత్విక సన్నాహాన్ని (Theoritical preparation) "భౌతికవాదము, అనుభవవాద - విమర్శ" అనే లెనిన్ గ్రంథం చేసింది.

చరిత్రలో యిదివరకెన్నడూ ఏ రాజకీయ ముఠాగూడా తానొక పార్టీగా ఏర్పడుటక్కు, బోల్షివిక్ ముఠాలాగ అంత సాకల్యంగా సన్నాహమైన ముఠా ఏదీలేదని నిస్సందేహంగా చెప్పవచ్చు.

అందుచేత బోల్షివిక్కులు తామొక పార్టీగా కట్టుబాటు చేసుకోడానికి పరిస్థితులు పూర్తిగా పరిపక్వమై సిద్ధంగా వున్నాయి.

మెన్షివిక్కులను వెళ్ళగొట్టి కొత్తదైన బోల్షివిక్ పార్టీని వాస్తవంగా ఏర్పరుచుటద్వారా పనిని పూర్తిచేయవలసిన కర్తవ్యం పార్టీ ఆరవ కాన్ఫరెన్సుపై బడింది.

అఖిల రష్యన్ అరవసభ (కాన్ఫరెన్సు) 1912 జనవరిలో ప్రాగ్‌లో (జెకోస్లోవాకియాలో) జరిగింది. 20 పార్టీ సంస్థలను (ఆర్గానిజేషన్స్) పైగా ప్రతినిధులను పంపాయి. అందుచేత యీ సభకు సక్రమమైన పార్టీ మహాసభకున్న (కాంగ్రెస్‌కు) ప్రాముఖ్యతవుంది.

ఈ సభ (కాన్ఫరెన్సు) ఇలా ప్రకటించింది: "కుత్తినియులైన పార్టీ కేంద్రయంత్రం పునరుద్ధరించబడింది. కేంద్రకమిటీ తిరిగి నెలకొల్పబడింది. రష్యన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీ ఒక నిశ్చిత నిర్మాణరూపం పొందిన తర్వాత, దాని అనుభవంలో అభివృద్ధినిరోధక కాలమే దాని చాల గడ్డుకాలమని తెలియజేయబడింది. పార్టీపైన ఎంత నిర్బంధవిధానం కొనసాగించినా, ఎన్ని గట్టిదెబ్బలు కొట్టినా, పార్టీలోపలి అవకాశవాదులు ఎంత ద్రోహంచేసినా, ఎంత ఊగిసలాడినా, శ్రామిక వర్గ పార్టీ తన నిర్మాణాన్ని (ఆర్గానిజేషన్), తన పతాకను యథాతథంగా కాపాడుకోగలిగింది."

ఆసభ (కాన్ఫరెన్సు) ప్రకటన యింకా యిలావుంది: "రష్యన్ సోషల్‌డెమాక్రటిక్‌పార్టీ పతాకమూ, కార్యక్రమమూ, విప్లవ సాంప్రదాయాలూ మాత్రమేగాక, దాని నిర్మాణం (ఆర్గానిజేషన్)కూడ నిలువగల్గాయి. ఆ నిర్మాణాన్ని నిర్బంధవిధానం కుంటుపరచి బలహీనపరచి యుండవచ్చు. కాని పూర్తిగా నాశనంచేయలేక పోయింది."

రష్యాలో కార్మికవర్గ విజయంలో నూతనవెల్లువ ప్రథమచిహ్నాలను ఈ సభ గమనించింది. పార్టీ పనిలో పునరుద్ధరణను గమనించి స్థానికసంస్థలు యిచ్చిన రిపోర్టులమీద

తీర్మానంచేస్తూ, సభ యిలా అన్నది: "స్థానికరహస్య సోషల్ డెమాక్రటిక్ సంస్థలనూ, ముఠాలనూ బలపరచే వుద్దేశ్యంతో సోషల్ డెమాక్రటిక్ వర్కర్లలో ప్రతిచోటా శక్తివంతమైన కృషి జరుగుతోంది."

తిరోగమన కాలాలలో బోల్షివిక్ ఎత్తుగడలలోని అత్యంత ప్రధానమైన నియమాన్ని - అనగా బహిరంగంగా వున్న కార్మికసంఘాలలోను, సొసైటీలలోను బహిరంగ కార్య కలాపంతో రహస్య కార్యకలాపాన్ని మేళవింపజేయుట - అన్నిస్థలాల్లోనూ అమలుపరచ బడుతున్నదని ఈ సభ గుర్తించింది.

ప్రాగ్ మహాసభ బోల్షివిక్ సెంట్రల్ కమిటీని ఎన్నుకుంది. అందులో లెనిన్, స్టాలిన్, ఆర్జోనికిడ్జ్, స్వెర్డలావ్, స్పాండరియాన్ మొదలగు వారున్నారు. కామ్రేడ్ స్టాలిన్, స్వెర్డలావ్, ఆకాలంలో ప్రవాసంలో వుండటంవల్ల వారు సభకు హాజరుకాలేదు. అయినా వారిని సెంట్రల్ కమిటీకి ఎన్నుకున్నారు. సెంట్రల్ కమిటీ ప్రత్యామ్నాయ సభ్యులలో (ఆల్టర్నేటివ్ సభ్యులలో) కామ్రేడ్ కాలినిన్ ఒకడు.

రష్యాలో విప్లవకార్యకలాపాలను నడుపుటకు ఆచరణలో నడిపే కేంద్రాన్ని (ప్రాక్టికల్ సెంటర్ - రష్యన్ సెంట్రల్ కమిటీబ్యూరో) నెలకొల్పారు. దానికి కామ్రేడ్ స్టాలిన్ అధ్యక్షుడు. కామ్రేడ్స్ వై. స్వెర్డలావ్, యస్. స్పాండరియాన్, యస్. ఆర్జోనికిడ్జ్, యమ్. కాలినిన్ మొదలగువారు ఆబ్యూరోలో సభ్యులు.

అవకాశవాదంతో బోల్షివిక్కులు యిదివరలో సాగించిన పోరాటాన్ని ప్రాగ్ సభ సింహావలోకనంచేసి, పార్టీనుండి మెన్షివిక్కులను వెళ్ళగొట్టడానికి నిశ్చయించింది.

పార్టీనుండి మెన్షివిక్కులను వెళ్ళగొట్టుటద్వారా ప్రాగ్ సభ బోల్షివిక్ పార్టీ స్వతంత్ర ఉనికిని వాస్తవంగా ప్రారంభించింది. మెన్షివిక్కులను సిద్ధాంతరీత్యా, నిర్మాణరీత్యా ఓడించిన పిదప, పార్టీనుంచి వారిని వెళ్ళగొట్టిన పిదప, రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ పూర్వప్రతిష్టను బోల్షివిక్కులు కాపాడారు. అందుచేతనే 1918 వరకు బోల్షివిక్ పార్టీ, రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ అని - బ్రాకెట్లలో "బోల్షివిక్స్" అనే పదాన్ని చేర్చి- పిలువబడేది.

1912లో ప్రాగ్ సభ ఫలితాలనుగురించి గోర్కీకి జాబు వ్రాస్తూ, లెనిన్ యిలా అన్నాడు:

"లిక్విడేటర్ల మురికి వదలించుకొని పార్టీని, పార్టీ సెంట్రల్ కమిటీని పునరుద్ధరించుటలో చిట్టచివరకు జయప్రదమయ్యాం. ఈ విషయం విని మీరు మాతోపాటు సంతోషించుతారని ఆశించుతాను." (లెనిన్: కలెక్టెడ్ వర్క్సు - రష్యన్ ఎడిషన్ - వాల్యూమ్ - 29— 9వ పేజీ)

ప్రాగ్ సభ ప్రాముఖ్యతను గురించి మాట్లాడుతూ, కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"ఈ సభ మన పార్టీ చరిత్రలో అత్యంత ప్రాముఖ్యమైనది. ఎందువల్లనంటే, బోల్షివిక్కులకు మెన్షివిక్కులకు మధ్య అది ఒక స్పష్టమైన గీతగీచింది. దేశమంతటా వున్న బోల్షివిక్ సంస్థలను (ఆర్గానిజేషన్స్) ఒక ఐక్య బోల్షివిక్

పార్టీగా సంయుక్త పరచింది." (సో. యూ. క. (బో) పార్టీ యొక్క 15వ కాంగ్రెస్ వెర్బాటిమ్ రిపోర్టునుండి - రష్యన్ ఎడిషన్ - 361 - 62 పేజీలు)

మెన్షివిక్కులను వెళ్ళగొట్టి, బోల్షివిక్కులు ఒక స్వతంత్ర పార్టీని ఏర్పరచినతర్వాత, బోల్షివిక్ పార్టీ మరింత గట్టిపడి బల పడింది. రెండవ ఇంటర్నేషనల్ యొక్క సోషల్ డెమాక్రటిక్ పార్టీలకు పూర్తిగా విభిన్నమైన కొత్తరకపుపార్టీ బోల్షివిక్ పార్టీ. అవకాశవాద వ్యక్తులను తమలో నుండి తరుముటవల్లనే (ప్రక్షాళన చేయుటవల్లనే) పార్టీ బలపడుతుంది - అన్నది ఈ బోల్షివిక్ పార్టీ సూత్రాలలో ఒకటి. రెండవ ఇంటర్నేషనల్ కుచెందిన పార్టీలు, తాము మార్క్సిస్టుపార్టీ లేనని పిలుచుకున్నప్పటికీ, వాస్తవంలో అవి వాటి అనుచరులలో ఉన్న బహిరంగ అవ కాశవాదులను మార్క్సిజానికి శత్రువులను సహించాయి. ఆ విధంగా రెండవ ఇంటర్నేషనల్ ను వారు కల్మషమొనర్చి, నాశనం చేయడానికి అవకాశమిచ్చాయి. బోల్షివిక్కులు దానికి విరుద్ధంగా అవకాశవాదులతో విరామంలేకుండా పోరాటాన్ని సాగించారు. శ్రామికవర్గపార్టీనుండి అవకాశవాదమనే చెత్తను తుడిచివేశారు. కొత్తరకపుపార్టీని - లెనినిస్టుపార్టీని, తర్వాత శ్రామికవర్గ నియంతృత్వాన్ని సాధించగలిగినపార్టీని, నిర్మించు టలో జయప్రదమయ్యారు. శ్రామికవర్గపార్టీ అనుయాయి లలో అవకాశవాదులు మిగిలివుంటే బోల్షివిక్ పార్టీ నడివీధిలోకి వచ్చి, శ్రామికవర్గాన్ని నడపగలిగి వుండేదికాదు. అధికారాన్ని కైవశం చేసుకొని, శ్రామికవర్గ నియంతృత్వాన్ని నెలకొల్ప

గలిగి వుండేదికాదు. అంతర్యుద్ధంనుండి విజయవంతంగా బయట పడి, సోషలిజాన్ని నిర్మించగలిగి వుండేదికాదు.

కనీస కార్యక్రమంలో ఉదహరించిన యీ క్రింది కోర్కెలను - ప్రజాతంత్ర రిపబ్లిక్, దినానికి 8 గంటల పని, ఎస్టేటు భూములన్నిటినీ వశపర్చుకొనుట అనే కోర్కెలను - పార్టీ తక్షణ ముఖ్యరాజకీయ నినాదాలుగా ప్రకటించుటకు ప్రాగ్ సభ నిర్ణయించింది.

ఈ విప్లవ నినాదాలతో, ప్రభుత్వ నాల్గవ డ్యూమా ఎన్నికల సందర్భంలో బోల్షివిక్కులు తమ ప్రచారాన్ని కొన సాగించారు. 1912 _ 14 సంవత్సరాలలో కార్మికవర్గ జన సామాన్య విప్లవోద్యమంలో నూతన ఉత్తేజానికి యీ నినా దాలే దోహదమిచ్చాయి.

## క్లుప్తసారాంశం

1908 _ 12 మధ్యకాలం విప్లవ కార్యకలాపానికి చాలా కష్టమైన కాలం. విప్లవం ఓడిపోయిన తర్వాత, విప్లవోద్యమం క్షీణదశలో వున్నప్పుడు, ప్రజలు అలసిపోయి ఉన్నప్పుడు బోల్షివిక్కులు తమ యెత్తుగడలను మార్చారు. జారు ప్రభుత్వంతో ముఖాముఖి పోరాటంమాని, వంకరటింకర పోరాటం ప్రారంభించారు. స్టోలీపిన్ అభివృద్ధి నిరోధక కాలంలోని కష్టపరిస్థితులలో బోల్షివిక్కులు ఏమాత్రపు బహిరంగఅవకాశం దొరికినా, దానిని ప్రజాసామాన్యంతో తమ సంబంధాలను కొనసాగించేందుకు ఉపయోగించుకున్నారు. (వైద్యసహాయక సంఘాలు, కార్మిక సంఘాలు మొదలుకొని డ్యూమా వేదిక

వరకు ఉపయోగించుకున్నారు). విప్లవోద్యమం తిరిగి తల యెత్తడానికి సర్వశక్తులను సమకూర్చేందుకై బోల్షివిక్కులు విసుగూ విరామం లేకుండా పనిచేశారు.

విప్లవ ఓటమి ఫలితంగా అనేక పరిస్థితులు ఏర్పడ్డాయి. జార్ ప్రతిపక్ష ధోరణులు శిథిలమయ్యాయి విప్లవమంటే ఆశాభంగం కలిగింది. పార్టీని వదలిపెట్టిన మేధావులు (బోగ్డనోవ్, బాజరోవ్ మొదలైనవారు) సిద్ధాంత పునాదులను కుసంస్కరించాలని తిరిగితిరిగి ప్రయత్నించారు. ఈ పరిస్థితులలో పార్టీ పతాకను దించకుండా, పార్టీ కార్యక్రమానికి విశ్వాసంతో కట్టుబడి, మార్క్సిస్టు సిద్ధాంత "విమర్శకుల" దాడులను ఎదుర్కొన్నది పార్టీలోని బోల్షివిక్కులు మాత్రం ఒక్కటే (లెనిన్ "భౌతిక వాదం – అనుభవవాద విమర్శ" అనే గ్రంథం). పార్టీని, పార్టీ విప్లవ సూత్రాలను రక్షించడానికి లెనిన్ చుట్టూ సమీకరించబడిన బోల్షివిక్కుల ముఖ్యనాయకత్వానికి సహాయపడినది ఏమిటి? ఈ ముఖ్య మార్క్సిస్టు–లెనినిస్టు సిద్ధాంతంలో కాకలు తీరి విప్లవ భవితవ్యాలను గ్రహించగలిగారు. ఈ సందర్భంలోనే లెనిన్ బోల్షివిక్కులను గురించి చెబుతూ, "మనం పర్వతం లాగా దృఢంగా వున్నామని వారు పూరికే చెప్పలేదు" అని అన్నాడు.

ఆ కాలంలో విప్లవాన్నుండి మెన్షివిక్కులు అంతకంతకూ దూరమైపోతున్నారు. రహస్య శ్రామికవర్గ విప్లవ పార్టీని రద్దుచేసి, దానికి స్వస్తి చెప్పాలని వీరన్నారు. అందుచే వీరికి లిక్విడేటర్లని పేరు వచ్చింది. వీరు అంతకంతకూ బహిరంగంగా పార్టీ కార్యక్రమాన్ని, విప్లవధ్యేయాలనూ, పార్టీనీ

దాలనూ పరిత్యజించారు. తాము స్వంతంగా ఒక సంస్కరణ వాద పార్టీని సంఘటిత పరచడానికి ప్రయత్నించేశారు. ఈ పార్టీనే కార్మికులు "స్టాలీపిన్ లేబర్ పార్టీ" అని పేరు పెట్టారు. "పార్టీ ఐక్యత" అనే నినాదాన్ని కపటభక్తితో వల్లిస్తూ, దాన్ని ముసుగుగా ఉపయోగించుతూ, ట్రాట్స్కీ, లిక్విడేటర్లను సపోర్టుచేశాడు. వాస్తవంలో పార్టీలో ఐక్యత అంటే అతని ఉద్దేశ్యం లిక్విడేటర్లతో ఐక్యత అనే.

మరొక ప్రక్క జారు ప్రభుత్వంపై పోరాటంలో కొత్త పద్ధతులను, డొంకతిరుగుడు పద్ధతులను అవలంబించవలసిన ఆవశ్యకతను అర్థంచేసుకోలేని కొందరు బోల్షివిక్కులు బహిరంగ అవకాశాలను ఉపయోగించుకోరాదని అన్నారు. ప్రభుత్వ డ్యూమాలోని కార్మిక ప్రతినిధులను ప్రభుత్వ డ్యూమానుండి పిలిపించివేయాలని కోరారు. ఈ ఆట్జోవిస్టులు ప్రజా సామాన్యంతో తెగతెంపులు చేసుకోడానికి పార్టీని ముందుకు నెడుతున్నారు. విప్లవం తిరిగి తలయెత్తడానికై సర్వశక్తులను సమీకరించడాన్ని కుంటుపరుచు తున్నారు. లిక్విడేటర్లులాగానే ఆట్జోవిస్టులుకూడా "అతివాద" పదజాలాన్ని ఉపయోగించుతూ, ఆచరణలో విప్లవ పోరాటాన్ని పరిత్యజించుతున్నారు.

లిక్విడేటర్లు, ఆట్జోవిస్టులు లెనిన్‌కు వ్యతిరేకంగా ఆగస్టు బ్లాక్ అనే పేరుతో ఒక ముఠా నేర్పరచారు. దీనిని ట్రాట్స్కీ సంఘటిత పరచాడు.

లిక్విడేటర్లతో, ఆట్జోవిస్టులతో సాగించినపోరాటంలో, ఆగస్టు బ్లాక్‌తో సాగించిన పోరాటంలో బోల్షివిక్కులదే

పై చేయి అయింది. వారు శ్రామికవర్గ రహస్య పార్టీని రక్షించుటలో జయం పొందారు.

ఈ కాలంలో జరిగిన ప్రముఖమైన ఘటనఏమంటే, రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీ ప్రాగ్ సభ (కాన్ఫరెన్సు 1912, జనవరి.) ఈ సభలో పార్టీనుండి మెన్షివిక్కులు వెళ్ళగొట్టబడ్డారు. ఒకేపార్టీలో మెన్షివిక్కులతో బోల్షివిక్కులకున్న నామమాత్రపు ఐక్యత శాశ్వతంగా అంతమయింది.

ఒక రాజకీయముఠాగా వుంటున్న బోల్షివిక్కులు తామొక స్వతంత్ర పార్టీగా – రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబరుపార్టీ (బోల్షివిక్)గా – వాస్తవంగా ఏర్పడ్డారు. ప్రాగ్ సభ ఒక కొత్తరకపు పార్టీని, లెనినిస్టు పార్టీని, బోల్షివిక్ పార్టీని ప్రారంభించింది.

ప్రాగ్ సభలో శ్రామికవర్గపార్టీ అనుయాయులనుండి అవకాశవాదులను, మెన్షివిక్కులనుతొలగించుట(పర్జ్ చేయుట), ఆతర్వాత పార్టీ అభివృద్ధిపైన, విప్లవాభివృద్ధిపైన ముఖ్యమైన, నిశ్చితమైన ప్రభావాన్ని కల్గించింది. కార్మిక ఆశయానికి ద్రోహులైనవారిని మెన్షివిక్ రాజీబేరగాండ్లను పార్టీనుండి బోల్షివిక్కులు వెళ్ళగొట్టి వుండకపోయినట్లయితే, శ్రామికవర్గ పార్టీ 1917 లో శ్రామికవర్గ నియంతృత్వానికై జరిగే పోరాటానికి ప్రజాసామాన్యాన్ని ఉత్తేజపరచగలిగి వుండేది కాదు.

# అయిదో అధ్యాయం

## ప్రథమ సామ్రాజ్యవాద యుద్ధానికిముందు, కార్మికవర్గ ఉద్యమంతిరిగి తలయెత్తుచున్న సమయంలో బోల్షివిక్ పార్టీ

[1912 – 14]

## 1912 – 14 సంవత్సరాల మధ్యకాలంలో విప్లవోద్యమం తలయెత్తుట

స్టోలీపిన్ అభివృద్ధినిరోధక విజయం ఎక్కువకాలం వుండలేదు. లాఠీదెబ్బలూ, ఉరికంబాలూతప్ప ప్రజలకుపమీా యీాయని ప్రభుత్వం నిలువజాలదు. నిర్బంధ చర్యలు ఎంత అలవాటైపోయినాయంటే, అవి ప్రజలలో భీతిని కలిగించడం మానివేశాయి. విప్లవం ఓడింపబడినతర్వాత మొదటికాలంలో కార్మికులు పొందిన అలసట తొలగిపోసాగింది. కార్మికులు తిరిగి పోరాటాన్ని ప్రారంభించారు. విప్లవ వెల్లువలో నూతన ఉత్తేజం అనివార్యమని బోల్షివిక్కులు చెప్పిన జోస్యం నిజమని నిరూపించబడింది. 1911 లో సమ్మెచేసిన వారిసంఖ్య అప్పటికే లక్షను మించిపోయింది. అంతకుపూర్వం ప్రతియేటా 50 లేక 60 వేలకంటె మించి సమ్మెచేయలేదు. 1912 జనవరిలో సమావేశమైన ప్రాగ్ పార్టీసభ కార్మికోద్యమ పునరుద్ధరణా ప్రారంభాన్ని అప్పటికే గమనించింది. కాని విప్లవోద్యమంలో నిజమైన ఉత్తేజం (Rise) 1912 ఏప్రిల్, మేనెలల్లో ప్రారంభమైంది. లేనా (Lena) బంగారు గనుల్లో కార్మికులను

తుపాకి గుండ్లకు ఎరజేసిన సందర్భంలో ప్రజా రాజకీయ సమ్మెలు ఏప్రిల్, మే నెలలలో ప్రారంభమయ్యాయి.

1912 ఏప్రిల్ 4వ తేదీన సైబీరియాలోని లేనాబంగారు గనులలో సమ్మె జరుగుతున్నప్పుడు జారు ప్రభుత్వ పోలీసు సైనికోద్యోగి ఆజ్ఞ ననుసరించి కాల్పులు జరిగాయి. ఇందులో చనిపోయినవారూ, గాయపడినవారూ అయిదువందలమంది. యజమానులతో సంప్రదించేందుకు శాంతియుతంగా పోతున్న నిరాయుధులైన లేనా గనిపనివారలపై తుపాకులు పేల్చటం యావత్తు దేశాన్ని కదల్చివేసింది. గనిపనివారల ఆర్థికసమ్మెను భగ్నం చేయటానికీ, ఆ విధంగా లేనా బంగారు గని యజమానులైన బ్రిటిష్ పెట్టుబడిదారులను సంతోష పెట్టడానికి గాను, ఈ నూతన రాక్షసకృత్యాన్ని జారు నిరంకుశప్రభుత్వం గావించింది. లేనా బంగారు గనులనుండి బ్రిటిష్ పెట్టుబడిదారులూ, వారి రష్యన్ భాగస్తులూ పెద్ద పెద్ద లాభాలను సంపాదించేవారు. సిగ్గూ ఎగ్గూ లేకుండా కార్మికులను తీవ్రంగా దోపిడిచేస్తూ, సాలీనా డెబ్బైలక్షల రూబుల్స్‌ను సంపాదించేవారు. వారు కార్మికులకు హీనాతిహీనమైన జీతాలిచ్చేవారు. తినడానికి పనికిరాని చెత్తతిండిని సప్లై చేసేవారు. ఈ నిర్బంధాన్నీ, అవమానాన్నీ యిక ఏమాత్రమూ సహించలేక లేనా బంగారు గనులలోని 6 వేల కార్మికులు సమ్మెచేశారు.

లేనా కాల్పులకు జవాబుగా సెంట్‌పీటర్స్‌బర్గ్, మాస్కో తదితర పారిశ్రామిక కేంద్రాల, ప్రాంతాల కార్మికవర్గం మీటింగులు జరిపారు. ప్రదర్శనాలు చేశారు. ప్రజాసమ్మెలు గావించారు.

"మేము ఆశ్చర్యపోయి నిర్ఘాంతపడ్డాం. మా భావాలను మాటలను వెలిబుచ్చలేకపోతున్నాం. మేము ఎంత అసమ్మతి తెల్పినా అది, మా అందరి హృదయాలలోనూ ఉడుకుతున్న క్రోధానికి వెలవెలబోయే ప్రతిబింబమాత్రమే. సంఘటిత ప్రజాపోరాటంతప్ప, కన్నీళ్ళుగానీ, అసమ్మతులుగానీ, ఏవీ మనకు సహాయం చేయలేవు" అంటు ఒక ఫ్యాక్టరీల ముఠాకు చెందిన కార్మికులు తమ తీర్మానంలో తెలియజేశారు.

లేనా హత్యాకాండవిషయమై ప్రభుత్వ డ్యూమాలో సోషల్ డెమాక్రటిక్ ముఠా ప్రశ్నలు వేసినపుడు, జారుమంత్రి మాకరోవ్ పొగరుబోతుతనంగా "ఆ! అలాగే జరిగింది. ఇక ముందుకూడా అలాగే జరుగుతుంది!" అని జవాబిచ్చాడు. దీనితో కార్మికుల క్రోధావేశం మిన్నుముట్టింది. లేనా కార్మికులపై జరిగిన క్రూర హత్యాకాండకు వ్యతిరేకంగా రాజకీయ అసమ్మతి సమ్మెలలో పాల్గొన్నవారి సంఖ్య మూడులక్షలదాక పెరిగింది.

స్టోలీపిన్ రాజ్యం "శాంతి" వాతావరణానికి లేనా ఘటనలు తుపానులా వచ్చిపడ్డాయి.

సెంట్ పీటర్స్‌బర్గ్ బోల్షివిక్ వార్తాపత్రిక "జ్వెజ్డా" (Zvezda -నక్షత్రం) లో, 1912లో యీ విషయాన్ని గురించి ప్రస్తావించుతూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా వ్రాశాడు :

"లేనా కాల్పులు నిశ్శబ్దమనే మంచుగడ్డను బద్దలుగొట్టాయి. ప్రజావుద్యమంఅనే నది ప్రవహించసాగింది. మంచు బద్దలైంది!... ప్రస్తుతరాజ్యంలో వున్న చెడుఅంతా, హానికరమైనదంతా, ఎక్కువ బాధపడుచున్న రష్యాలోని చెడుగులన్నీ

ఒక్క విషయంలో బయటపడ్డాయి. అది లేనా ఉదంతం. అందుచేతనే లేనా కాల్పులకూ, సమ్మెలకూ, ప్రదర్శనాలకూ సిగ్నల్‌గా పని చేశాయి."

విప్లవాన్ని పాతిపెట్టాలన్న లిక్విడేటర్ల, ట్రాట్స్కీవాదుల ప్రయత్నాలు వృధా అయినాయి. విప్లవశక్తులు సజీవంగా వున్నాయనీ, అత్యద్భుతమైన విప్లవశక్తి సంపద కార్మిక వర్గంలో ప్రోగై వున్నదని లేనా సంఘటనలు తెలియజేశాయి. 1912 మేడే సమ్మెలలో 4 లక్షలమంది కార్మికులు పాల్గొన్నారు. ఈ సమ్మెలు స్పష్టమైన రాజకీయ స్వభావాన్ని పొందాయి. ప్రజాతంత్ర రిపబ్లిక్, దినానికి 8 గంటల పని, ఎస్టేటు భూములను వశపరచుకోవడం, మొదలగు బోల్షివిక్ విప్లవ నినాదాలతో ఈ సమ్మెలు జరిగాయి. పై ప్రధాన నినాదాలు కార్మిక జన బాహుళ్యాన్ని ఐక్యపరచుటకేగాక, నిరంకుశ ప్రభుత్వంపై విప్లవదాడిని సాగించుటకు, రైతులను, సైనికులను ఐక్యపరచు వుద్దేశ్యంతో కూడ ఈయబడినాయి.

"రష్యా యావత్ శ్రామికవర్గం మే దినోత్సవాన సాగించిన బ్రహ్మాండమైన సమ్మె, దానితోపాటు జరిపిన వీధి ప్రదర్శనాలు, విప్లవప్రకటనలు, కార్మికుల సభలలో విప్లవ ఉపన్యాసాలు - ఇవన్నీ విప్లవాభివృద్ధిదశలో రష్యా ప్రవేశించినదని స్పష్టంగా తెలియజేశాయి" అంటూ లెనిన్ "విప్లవాభివృద్ధి" అనే ఒక న్యాసంలో వ్రాశాడు. (లెనిన్ - సెలెక్టెడ్ వర్క్స్ - ఇంగ్లీషు ఎడిషన్ - మాస్కో - 1947, 1వ వాల్యూమ్ - 537 వ పేజీ.)

కార్మికుల విప్లవోత్సాహం చూసి, భయపడిన లిక్విడేటర్లు సమ్మె ఉద్యమాన్ని వ్యతిరేకించారు. దానిని "సమ్మె జ్వరం" అంటూ పిలిచారు. శ్రామికవర్గ విప్లవపోరాటం స్థానే "మహాజర్ల ఉద్యమం" సాగించాలని లిక్విడేటర్లూ, వారి మిత్రుడు ట్రాట్స్కీ కోరారు. వారు ఒక మహాజరుపైన - ఒక కాగితం ముక్కపైన - సంతకాలు చేయమని కార్మికులను ఆహ్వానించారు. "హక్కులను" (సమావేశ హక్కులపై గల నిర్బంధాలను రద్దుచేయుటా, సమ్మెచేసే హక్కూ మొదలైనవి) దయచేయించవలసిందని ప్రార్థించుతూ ఆ మహాజరు వుంది. ఆ మహాజరును ప్రభుత్వ డ్యూమాకు పంపించుతారు. కాని లిక్విడేటర్లు 13 వందల సంతకాలను మాత్రమే చేయించ గలిగారు. అదే కాలంలో లక్షలాది కార్మికులు బోల్షివిక్కుల విప్లవ నినాదాలను బలపరచారు.

బోల్షివిక్కులు సూచించిన పంథానే కార్మికవర్గం నడిచింది.

ఆ కాలంలో దేశంలోని ఆర్థికపరిస్థితి ఇలా వుంది:

1910లో పారిశ్రామిక స్తబ్ధతపోయి, తిరిగి పరిశ్రమలు తలయెత్తాయి. పారిశ్రామిక ముఖ్యశాఖలలో ఉత్పత్తి విస్తరించింది. 1910లో ముడి ఇనుము (పిగ్ ఐరన్) 18కోట్ల 60 లక్షల పూడ్లు (పూడ్ =1½ మణుగులు) ఉత్పత్తిఅయితే 1912లో 25కోట్ల 60లక్షల పూడ్లకు పెరిగింది.

1913 లో 28కోట్ల 30లక్షల పూడ్లయింది. 1910లో బొగ్గు ఉత్పత్తి 152కోట్ల 20లక్షల పూడ్లు మాత్రమే. కాని 1913లో 226కోట్ల 40లక్షల పూడ్లకు పెరిగింది.

పెట్టుబడిదారీ పరిశ్రమల విస్తరణతోపాటు శ్రామిక వర్గంకూడా త్వరితంగా అభివృద్ధి చెందింది. ఉత్పత్తి బ్రహ్మాండమైన పరిశ్రమలలో మరింత కేంద్రీకరింపబడటం పరిశ్రమాభివృద్ధిలో గమనింపదగ్గ విశేషం. అయిదువందల కార్మికులకు పైగా పనిచేయు పెద్ద ఫ్యాక్టరీలలో నియమింపబడిన కార్మికుల సంఖ్య, 1901లో మొత్తం కార్మికులలో వెయ్యింటికి 467. 1910లో వెయ్యింటికి 540. అంటే మొత్తం కార్మికులలో సగంపైన అన్నమాట. పరిశ్రమలు అంతపెట్టున కేంద్రీకరింపబడటం ఇదివర కెన్నడూ లేదు. పారిశ్రామికంగా ఎంతో అభివృద్ధిచెందిన అమెరికాలాంటి దేశంలో సైతం, మొత్తం కార్మికులలో మూడవవంతు మాత్రమే పెద్ద పెద్ద పరిశ్రమలలో ఆ కాలంలో పనిచేస్తుండేవారు.

శ్రామికవర్గం పెరుగుటా, పెద్దపెద్ద పరిశ్రమలలో కార్మికుల కేంద్రీకరణా, వీటికితోడు బోల్షివిక్ పార్టీలాంటి విప్లవపార్టీ ఒకటివుండటం, దేశరాజకీయ జీవితంలో రష్యన్ కార్మికవర్గాన్ని అన్నిటికన్న పెద్దశక్తిగా తయారుచేస్తున్నాయి. ఫ్యాక్టరీలలో కార్మికులను దోపిడిచేయుటలో అవలంబించే అమానుష పద్ధతులూ, జారుప్రభుత్వ తొత్తుల సహించరాని పోలీసు రాజ్యమూ, ప్రతి పెద్దసమ్మెకూ రాజకీయ స్వభావాన్ని కలిగించాయి. ఇంతేగాక, ఆర్థిక రాజకీయ పోరాటాలను జోడించటంవల్ల ప్రజాసమ్మెలకు అసాధారణమైన విప్లవశక్తిఅబ్బింది. విప్లవకార్మికవర్గ ఉద్యమ అగ్రశ్రేణిలో, వీరులైన సెంట్‌పీటర్స్‌బర్గ్ కార్మికవర్గం నడిచింది. వారిని బాల్టిక్ రాష్ట్రాలు, మాస్కో, మాస్కో-రాష్ట్రం, వాల్గాప్రాంతం, దక్షిణరష్యా ప్రాంతాల కార్మికులు అనుసరించారు. 1913 లో

ఉద్యమం పశ్చిమ ప్రాంతానికీ, పోలెండ్‌కూ, కాకసస్‌కూ వ్యాపించింది. 1912 లో సమ్మెలలో పాల్గొన్న కార్మికుల సంఖ్య ప్రభుత్వ లెక్కలప్రకారం 7 లక్షల 25 వేలు. కాని పూర్తిలెక్కలనుబట్టి 10 లక్షలకుపైగా కార్మికులు సమ్మెలలో పాల్గొన్నారు. 1913 లో సమ్మెలలో పాల్గొన్న కార్మికుల సంఖ్య ప్రభుత్వ లెక్కలప్రకారం 8 లక్షల 61 వేలు. కాని పూర్తిలెక్కలప్రకారం 12 లక్షల 72 వేలు. 1914 మొదటి అర్ధసంవత్సరంలో సమ్మెచేసినవారిసంఖ్య అప్పుడే 15 లక్షలను మించింది.

ఆ విధంగా 1912_14 సంవత్సరాలలో విప్లవవిజృంభణ సమ్మెఉద్యమ ప్రవాహం, 1905 విప్లవ ప్రారంభంలోని దేశ పరిస్థితిలాంటి దానిని కల్గించింది.

యావత్ ప్రజలు ఎదురుచూస్తున్న అవకాశాన్ని శ్రామికవర్గంయొక్క విప్లవప్రజాసమ్మెలు సృష్టించాయి. ఈ సమ్మెలు నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగాయి. కష్టపడే ప్రజానీకంలోని అత్యధిక సంఖ్యాకులు వీటికి సానుభూతి చూపించారు. పరిశ్రమల యజమానులు లాకౌట్లద్వారా (పరిశ్రమలను మూసివేయుట) కార్మికులకు జవాబిచ్చారు. 1913 లో మాస్కోరాష్ట్రంలో 50 వేల టెక్స్టైల్ (బట్టలపరిశ్రమలు) కార్మికులను వీధులపాలు చేశారు. 1914 మార్చిలో సెంట్‌పీటర్స్‌బర్గ్‌లో ఒక్కరోజున 70 వేల కార్మికులను పని నుండి తీసివేశారు. ఇతర ఫ్యాక్టరీల కార్మికులూ, పరిశ్రమల లోని యితరశాఖలలోని కార్మికులూ, సమ్మెదారులకూ లాకౌట్ చేయబడ్డ పరిశ్రమలలోని కామ్రేడ్స్‌కూ సానుభూతి

సమ్మెలద్వారానూ ప్రజలనుండి చందాలు వసూలుచేయుట ద్వారానూ సహాయపడ్డారు.

తలయెత్తుచున్న కార్మికవర్గ ఉద్యమం, ప్రజాసమ్మెలూ రైతులనుకూడా ఉద్రూతలూగించాయి. వారిని పోరాటాల లోకి లాగాయి. రైతులు తిరిగి భూస్వాములపై తిరుగబడ జొచ్చారు. భూస్వామ్య రాజభవనాలనూ, కులక్ (ధనికరైతు) వ్యవసాయ క్షేత్రాలనూ నాశనంచేశారు. 1910_14 సంవత్స రాలలో రైతుల క్రోధచర్యలు 13 వేలకుపైగా జరిగాయి.

సైనికులలోకూడా విప్లవసంఘటనలు జరిగాయి. తుర్కి-స్థాన్‌లో 1912 లో సైనికులు సాయుధతిరుగుబాటును గావిం చారు. బాల్టిక్ నౌకాదళంలోనూ, సెవాస్తపూల్‌లోనూ తిరుగుబాటు పరిపక్వమౌతోంది.

బోల్షివిక్‌పార్టీ నాయకత్వాన జరుగుతున్న విప్లవసమ్మె ఉద్యమం, ప్రదర్శనాలూ, కార్మికవర్గ పాక్షికకోర్కెలకోసం "సంస్కరణల"కోసం పోరాడుటలేదనీ, జారు ప్రభుత్వంనుండి ప్రజలను విముక్తిచేయడానికి పోరాడుతున్నదనీ తెలియ జేశాయి. దేశం మరో కొత్త విప్లవంవైపుకు పురోగమించు తోంది.

1912 వేసవిలో లెనిన్, రష్యాకు దగ్గరగా వుండేం దుకు పారిస్‌నుండి, గెలీషియాకు (పూర్వం ఆస్ట్రియా) వచ్చాడు. ఇక్కడ సెంట్రల్‌కమిటీ సభ్యులతోను ముఖ్యమైన పార్టీవర్కర్లతోను గూడిన రెండు సభలకు అధ్యక్షత వహిం చాడు. ఈ సభలు ఒకటి 1912 చివరలో క్రాకో (పోలండ్) లోనూ, రెండవది 1913 ఆకురాలుకాలంలో, క్రాకోకు

సమీపంగా వున్న పోరోనినో అనే చిన్నపట్టణంలోనూ జరి గాయి. ఈ సభలు కార్మికవర్గ ఉద్యమ ప్రధానసమస్యల పైన కొన్ని తీర్మానాలు చేశాయి. ఆ ప్రధానసమస్య లేమంటే: విప్లవోద్యమం అభివృద్ధిచెందుటా, సమ్మెల సంద ర్భంలో పార్టీక ర్తవ్యాలూ, రహస్యసంఘాలను బలపరచుటా, డ్యూమాలోని సోషల్ డెమాక్రటిక్ ముఠా, పార్టీ పత్రికలు, కార్మిక భీమా ప్రచారం.

## 2

### బోల్షివిక్ వార్తాపత్రిక "ప్రవదా" – ప్రభుత్వ నాల్గవ డ్యూమాలో బోల్షివిక్ ముఠా

తమ సంఘాలను బలపరచుకోటానికీ, తమ పలుకు బడిని ప్రజాసామాన్యంలో వ్యాపింపచేయడానికీ, సెంట్‌పీటర్స్ బర్గ్‌లో ప్రచురించబడిన బోల్షివిక్ దిన వార్తాపత్రిక ప్రవదా (సత్యం)ను శక్తివంతమైన సాధనంగా బోల్షివిక్‌పార్టీ ఉపయో గించుకుంది. లెనిన్ సూచనల ననుసరించి స్టాలిన్, ఓల్మెన్స్కీ, పోలెటయేవ్, మొదలగువారి చొరవతో యీ పత్రిక స్థాపించబడింది. విప్లవ ఉద్యమం తిరిగి తలయెత్తుటతో పాటు కార్మికవర్గ ప్రజాసామాన్య పత్రికయగు ప్రవదా స్థాపించ బడింది. 1912 ఏప్రిల్ 22 వ తేదీన (మే 5 వ తేదీ) ప్రవదా మొదటిసంచిక వెలువడింది. ప్రవదా వెలువడిననాటి గౌరవార్థం

అప్పటినుండీ మే 5వ తేదీన కార్మిక పత్రికా దినోత్సవంగా పరిగణించుటకు నిశ్చయింపబడింది.

ప్రవదా వెలువడుటకు పూర్వం బోల్షివిక్కులకు 'జ్వెజ్డా' అనే వారపత్రిక వుండేది. అభివృద్ధిచెందిన కార్మికులకోసం ఈ పత్రిక ఉద్దేశింపబడింది. "జ్వెజ్డా", లేనా ఘటనల సమయంలో ప్రముఖపాత్ర వహించింది. కామ్రేడ్ లెనిన్, స్టాలిన్‌లు వ్రాసిన ఘాటైన రాజకీయవ్యాసాలను అనేకం అది ముద్రించింది. ఈ వ్యాసాలు కార్మికవర్గాన్ని పోరాటానికి సమీకరించాయి. తలయెత్తుతున్న విప్లవవెల్లువను దృష్టిలో వుంచుకుంటే బోల్షివిక్‌పార్టీ అవసరాలకు ఒక వారపత్రిక సరిపోదు. కార్మికజన బాహుళ్యానికై ఉద్దేశింపబడిన ప్రజా రాజకీయ దినపత్రిక ఒకటి అవసరం. అలాంటి పత్రికయే ప్రవదా.

ఈ కాలంలో ప్రవదా, ప్రత్యేకంగా ప్రముఖపాత్ర వహించింది. కార్మికవర్గ ప్రజాబాహుళ్యంలో బోల్షివిజానికి అండను సంపాదించింది. సెన్సార్ అధికారులకు యిష్టంకాని ఉత్తరాలను, వ్యాసాలను ప్రకటించుటవల్ల ప్రవదా పత్రికలను స్వాధీనపరచుకొనుట, జరిమానాలు వేయుట, పోలీసుల నిర్బంధవిధానం నిరంతరం సాగుతూవుండేవి. ఇలాంటి పరిస్థితులలో వేలకొలది అభివృద్ధిచెందిన కార్మికుల తీవ్రసహాయంతోనే ప్రవదా బ్రతుకగలిగింది. కార్మికులవద్ద వసూలుచేసిన పెద్ద మొత్తాలవల్లనే పెద్దపెద్ద జరిమానాలను ప్రవదా చెల్లించగలిగింది. బాగా ఉత్సాహవంతులైన కార్మికులు రాత్రిపూట పత్రికాకార్యాలయానికి వచ్చి పత్రికలకట్టలను తీసుకుపోతూం

డటంవల్ల తరచుగా ప్రభుత్వంచే జప్తుచేయబడిన ప్రవదా సంచికలు ముందుగానే పాఠకుల చేతులలోకి చాలాభాగం వెళ్ళేవి.

రెండున్నర సంవత్సరాలలో జారుప్రభుత్వం ప్రవదాను 8 సార్లు అణచివేసింది. కాని ప్రతిసారీ కూడా కార్మికుల సహాయంతో కొత్తపేర్లతో, పూర్వమున్న పేర్లవంటి పేర్లతో, తిరిగి వెలువడుతూండేది. ఉదాహరణకు "జాప్రవదా" (సత్యం కోసం), "పుత్ ప్రవదా" (సత్యమార్గం), "ట్రూడోవయా ప్రవదా" (కార్మిక సత్యం).

ప్రవదా అమ్మకం సగటున దినానికి నలభై వేలు వుండేది. కాని మెన్షివిక్కు దినపత్రిక "లచ్" (కాంతి రేఖ) అమ్మకం 15 వేలు లేక 16 వేలకు మించిపోలేదు.

ప్రవదాను కార్మికులు తమ పత్రికగా భావించేవారు. దానిలో వారికి చాలా విశ్వాసం వుండేది. ఆ పత్రిక ఆదేశాలను నిర్వర్తించేవారు. ప్రతి పత్రికను వందలాది పాఠకులు చదివేవారు. పత్రిక ఒకరిచేతినుండి మరొకరిచేతికి పోతూ వుండేది. అది వర్గచైతన్యాన్ని పోతపోసింది. వారిని సంఘటిత పరచింది. వారికి శిక్షణయిచ్చింది. వారిని పోరాటానికి పిలిచింది.

ప్రవదా దేనిని గురించి వ్రాస్తూవుండేది?

పెట్టుబడిదారుల, యజమానుల, మేస్త్రీల (ఫోర్మన్) చేతులలో తాము ఎలా అవమానింప బడుతున్నదీ, ఎన్ని విధాలుగా అణచబడుతున్నదీ, ఎలాంటి రాక్షస దోపిడికి తమ జీవితం గురిఅవుతున్నదీ వర్ణించుతూ, కార్మికులు వ్రాసిన ఉత్త

రాలను డజన్లకొలది ప్రతిసంచిక ప్రకటించేది. ఇవి పెట్టుబడిదారీ విధానంలోని పరిస్థితులను తీవ్రంగా గర్హించుతూ, నిశితంగా వ్రాసినఉత్తరాలు. ఇంతేగాక, మళ్లా పనిదొరుకుతుందనే ఆశను పోగొట్టుకున్న నిరుద్యోగులూ, మలమల మాడే కార్మికులూ ఆత్మహత్య చేసుకున్న ఘటనలు కొన్నిటిని ప్రవదా తరచు పకటించుతూ వుండేది.

వివిధ ఫ్యాక్టరీలలోని, వివిధ పారిశ్రామిక శాఖలలోని కార్మికుల కోర్కెలను గురించీ, అవసరాలను గురించీ, ప్రవదా వ్రాస్తూవుండేది. కార్మికులు తమహక్కులకోసం ఎలాపోరాడు తున్నదీ తెలియజేస్తూ వుండేది. దాదాపు ప్రతి సంచికలోనూ వివిధ ఫ్యాక్టరీలలో జరుగుతున్న సమ్మెలను గురించినరిపోర్టులు వుండేవి. దీర్ఘ కాలపు పెద్ద సమ్మెలు జరిగినప్పుడు సమ్మె దారుల సహాయంకోసం ఇతర ఫ్యాక్టరీలలోనూ, పారిశ్రామిక శాఖలలోనూ పనిచేయు కార్మికులనుండి సమ్మె నిధిని ప్రోగు చేయుటలో, సంఘటిత పరచుటలో ప్రవదా సహాయపడింది. సమ్మెనిధికి వేలకొలది రూబుల్సు వసూలు చేయబడ్డాయి. అత్యధికసంఖ్యాక కార్మికులకు దినానికి 70 లేక 80 కోపెక్‌ల (100 కోపెక్‌లు = 1 రూబుల్) కంటె ఎక్కువ జీతం రాని దినాలలో ఖర్చుపెట్టుటకుగాను ఈ పెద్ద మొత్తాలు వసూలు చేయబడ్డాయి. ఇది కార్మికులలో శ్రామిక వర్గ సౌభ్రాతృ త్వాన్ని సృష్టించింది. కార్మికులందరియొక్క ప్రయోజనం కోసం ఐక్యత కావాలనే చైతన్యాన్ని కల్గించింది. కార్మికులు ప్రతి రాజకీయ ఘటనకూ, ప్రతి విజయానికీ లేక అపజయా నికీ ప్రభావితులై, ప్రవదాకు ఉత్తరాలూ, అభివందనాలూ

లేక అసమ్మతులూ పంపుతుండేవారు. నిలకడమైన బోల్షివిక్ దృక్పథంతో కార్మికవర్గ ఉద్యమ కర్తవ్యాలను గురించి ప్రవదా వ్రాసింది. చట్టబద్ధంగా ప్రచురితమయ్యే పత్రిక జారు ప్రభుత్వాన్ని కూలద్రోయమని, బహిరంగంగా ఆదేశించ జాలదు. అందుకని అది సూచనలు మాత్రమే అందించేది. వాటిని వర్గచైతన్యం గల కార్మికులు బాగా అర్థం చేసుకొనే వారు. వారు వాటిని ప్రజా సామాన్యానికి విశదపరచేవారు. ఉదాహరణకి ప్రవదా "1905 నాటి సంపూర్ణమైన కోర్కెలు తగ్గించరాదు" అని వ్రాయగానే, కార్మికులు దీని అర్థం బోల్షివిక్కు విప్లవ నినాదాలని - అనగా జారు ప్రభుత్వాన్ని కూలద్రోయుట, ప్రజాతంత్ర రిపబ్లిక్, భూస్వాముల ఎస్టేట్లను వశపరచుకొనుట, దినానికి 8 గంటలపని - అని గ్రహించారు.

నాల్గవ డ్యూమా ఎన్నికలకు ముందు అభివృద్ధి చెందిన కార్మికులను ప్రవదా సంఘటితపరచింది. లిబరల్ బూర్జువాతో ఒడంబడికకు రావాలనే వారియొక్క, స్టోలీపిన్ లేబర్ పార్టీని కావలెనన్న మెన్షివిక్కుల యొక్క, విద్రోహ వైఖరిని అది బయటపెట్టింది. "1905 నాటి సంపూర్ణమైన కోర్కెలుతగ్గించ రాదు" అనేవారికి అనగా బోల్షివిక్కులకు వోటు చేయవలసిం దని కార్మికులను ప్రవదా కోరింది. ఎన్నికలు పరోక్షపు ఎన్నికలు. అనేక దశలలో అవి జరిగాయి. మొదట కార్మికుల సమావేశాలు ప్రతినిధులను ఎన్నుకున్నాయి. ఈ ప్రతి నిధులు వోటర్లను ఎన్నుకున్నారు. ఈ వోటర్లు డ్యూమాకు కార్మిక ప్రతినిధిని పంపే ఎన్నికలలో పాల్గొన్నారు. వోటర్లను

ఎన్నుకునే రోజున బోల్షివిక్ అభ్యర్థుల జాబితాను ప్రవదా ప్రచురించి, ఆ జాబితాకు వోటు చేయవలసిందిగా కార్మికులను కోరింది. ఈ జాబితాను ఇంతకుముందే ప్రచురించుటకు వీలు లేక పోయింది. అలా ప్రచురించిన పక్షంలో ఆ జాబితాలలోని వారు అరెస్టయే ప్రమాదముంది.

ప్రవదా శ్రామికవర్గ ప్రజాపోరాటాలను సంఘటిత పరచుటలో సహాయపడింది. 1914 వసంత కాలంలో సెంట్ పీటర్స్‌బర్గ్‌లో పెద్ద లాకౌటు జరిగినప్పుడు, ప్రజాసమ్మె ప్రకటించుట అదనుకానపుడు, ప్రవదా కార్మికులను మరోరకపు పోరాటాలను అవలంబించమని కోరింది. ఫ్యాక్టరీలలో పెద్ద పెద్ద సభలూ, వీధులలో ప్రదర్శనాలూ గావించమని కోరింది. ఇది పత్రికలో బహిరంగంగా చెప్పడానికి వీలులేదు. కాని, "కార్మికవర్గ ఉద్యమ రూపాలు" అనే నాతితీవ్రమైన శీర్షికతో లెనిన్ వ్రాసిన వ్యాసాన్ని చదవగానే, యీ పిలుపును వర్గచైతన్యంగల కార్మికులు అర్థంచేసుకున్నారు. ఆ సమయంలో సమ్మెలకు బదులుగా కార్మికవర్గ ఉద్యమ ఉన్నతరూపాన్ని సాగించాలని లెనిన్ వ్రాశాడు. ఇది సమావేశాలను ప్రదర్శనాలను సంఘటిత పరచుటకు పిలుపని వారు అర్థం చేసుకున్నారు.

ఈ విధంగా బోల్షివిక్కుల రహస్య విప్లవ చర్యలు కార్మిక జన బాహుళ్యం గావించే బహిరంగ ఘటనా, ఆందోళనా చర్యలతో ప్రవదా ద్వారా జోడింపబడ్డాయి. కార్మికుల జీవితం, వారి సమ్మెలు, ప్రదర్శనాలు మొదలగు వాటినిగురించే

కాక, రైతుల జీవితాన్ని, వారు బాధపడే కరువుల గురించి భూస్వామ్య ప్రభువులు వారిని దోపిడి చేయటాన్ని గురించి కూడా ప్రవదా నిత్యమూ వర్ణించుతుండేది. స్టోలీపిన్ "సంస్కరణ" ఫలితంగా కులక్ రైతులు, రైతుల మంచి భూములన్నీ ఎలా లాగివేసి దోపిడిచేశారో అది వర్ణించింది. గ్రామసీమలో సర్వత్రా వ్యాపించి భుగభుగలాడుతున్న అసంతృప్తిని గురించి వర్గచైతన్యం గల కార్మికుల దృష్టికి ప్రవదా తెచ్చింది. 1905 విప్లవ లక్ష్యాలు ఇంకా సాధించబడలేదనీ, మరొక విప్లవం త్వరలో సమీపించనున్నదనీ, శ్రామికవర్గానికి అది బోధించింది. ఈ రెండవ విప్లవంలో శ్రామికవర్గం ప్రజలను నిజమైన నాయకపాత్ర, మార్గదర్శక పాత్ర వహించాలని చెప్పింది. ఈ విప్లవంలో విప్లవ రైతాంగమనే శక్తివంతమైన మిత్రులు దానికి వుంటారనీ ప్రవదా బోధించింది.

శ్రామికవర్గ విప్లవం అనే అభిప్రాయాన్నే వదలివేసి, ప్రజలను గురించీ, రైతుల ఆకలిబాధను గురించీ, బ్లాక్ హండ్రెడ్ భూస్వామ్య ప్రభువుల పెత్తనాన్ని గురించీ ఆలోచించడం మానివేసేటట్లుగా మెన్షివిక్కులుపనిచేశారు. "సమావేశ స్వాతంత్ర్యం" కొరకు పోరాడాలనీ, ఇందుకుగాను జారు ప్రభుత్వానికి "మహాజర్లు" పెట్టుకుంటే చాలునని, శ్రామిక వర్గం తలచేటట్లుగా మెన్షివిక్కులు పనిచేశారు. విప్లవాన్ని పరిత్యజించడం, రైతాంగంతో మైత్రిని పరిత్యజించడం అనే మెన్షివిక్ బోధ, పెట్టుబడిదారుల ప్రయోజనాలకొరకే ప్రచారం చేయబడుతుందని బోల్షివిక్కులు కార్మికులకు విశదపరచారు. రైతాంగాన్ని తమ మిత్రునిగా ఆకర్షించితే, కార్మికులు తప్పని

సరిగా జారు ప్రభుత్వాన్ని ఓడించగలరు. మెన్షివిక్కులలాంటి అవిశ్వాసనీయులయిన గొర్రెకాపరులను విప్లవ శత్రువులుగా భావించి, తరిమివేయాలని బోల్షివిక్కులు తెలియజేశారు.

రైతుల జీవితం అనే శీర్షికలో ప్రవదా ఏమి వ్రాసింది?

ఉదాహరణకు 1913 వ సంవత్సరానికి సంబంధించిన అనేక ఉత్తరాలను తీసుకుందాం.

"ఒక వ్యవసాయక ఉదంతం" అనే శీర్షిక క్రింద సమారా నుండి వచ్చిన ఒక లేఖ ప్రచురించబడింది. బుగల్మా జిల్లా లోని నోవోఖాస్ బులాత్ అనే గ్రామంలో ఒక ఘటన జరిగింది. కమ్యూన్ నుండి ఉపసంహరించుకొన్న రైతులకు యివ్వవలసిన సమిష్టి సరిహద్దులు గీయుచున్న సర్వేయర్‌తో 45మంది రైతులు తలపడ్డారు. అందులో ఎక్కువ దీర్ఘకాలం శిక్షలు విధించబడ్డాయని ఆ లేఖ తెలియజేసింది.

స్కోవ్ రాష్ట్రాన్నుండి వచ్చిన ఒక చిన్న లేఖ సిట్నా (జవాలియే స్టేషన్ వద్ద) గ్రామరైతులు గ్రామ పోలీసులను సాయుధులై ఎదిరించారని తెలియజేసింది. చాలామంది గాయపడ్డారు. ఈ ఘర్షణకు కారణం వ్యవసాయిక తగాదాయే. గ్రామ పోలీసులు ఆ గ్రామానికి వెళ్ళారు. వైస్ గవర్నరు యింకొక ఉద్యోగి ఆగ్రామానికి వెళ్ళుతున్నారు అని ఆ లేఖ తెలియజేసింది.

యుఫా రాష్ట్రంనుండి వచ్చిన మరొక లేఖ యిలా తెలియజేసింది: రైతులు తమవంతు భూములను (ఎలాట్‌మెంట్సు) ఎక్కువగా అమ్మివేస్తున్నారు. ఊరుమంవల్లా, గ్రామ కమ్యూన్ నుండి రైతులు ఉపసంహరించుకొనడానికి అవకాశ

మిచ్చే చట్టంవల్లా, రైతులు ఎక్కువమంది తమభూమిని పోగొట్టుకుంటున్నారు. ఉదాహరణను బోరిసోవ్కా అనే పల్లెను తీసుకుందాం. ఇక్కడ 27 రైతుకుటుంబాలున్నాయి. వారికి సాగుచేసుకునేభూమి 543 డెసియేటిన్లు (ఒక డెసియేటిన్ 2 ఎకరాల 70 సెంట్లకు సమానం) వుండేది. కరువుకాలంలో 5 గురు రైతులు ఒక్కొక్క డెసియేటిన్ 25 నుండి 33 రూబుల్స్ చొప్పున 31 డెసియేటిన్లను అమ్మివేశారు. వాస్తవానికి యీ భూమి అంతకంటె మూడునాల్గు రెట్లవిలువ చేస్తుంది. ఇదే గ్రామంలో 7 గురు రైతులు 177 డెసియేటిల సాగు భూమిని తనఖాపెట్టారు. ఒక ఎకరానికి 18 నుండి 20 రూబుల్స్ చొప్పున వారు తీసుకున్నారు. సంవత్సరానికి 12 చొప్పున వడ్డీ యిస్తూ, 6 సంవత్సరాలకు యీ తనఖాను పెట్టారు. ప్రజల దారిద్ర్యాన్నీ, దారుణమైన వడ్డీరేటునూ మనస్సులో పెట్టుకుంటే, యీ 177 డెసియేటిన్ల భూమిలోను సగం వడ్డీ వ్యాపారస్తునికి పోతుందని ఖచ్చితంగా చెప్పవచ్చు. ఎందుచేతనంటె యీ అప్పు తీసుకున్నవారిలో సగంమంది అయినా అంత పెద్ద మొత్తాన్ని ఆరేండ్లలో తిరిగి చెల్లించలేరు.

"రష్యాలో భూస్వాముల, చిన్నరైతుల భూయాజమాన్యం" అనే శీర్షికతో ప్రవదాలో లెనిన్ ఒక వ్యాసాన్ని వ్రాశాడు. పరాన్నభుక్కులైన భూస్వాముల చేతులలో ఎంత విస్తారంగా భూమీ ఆస్తీ కేంద్రీకరింపబడి వున్నాయో, రైతులకు, కార్మికులకు, చక్కగా లెనిన్ తెలియజేశాడు. 30 వేల పెద్ద భూస్వాములు 7కోట్ల డెసియేటిన్ల భూమిని తమ చేతులలో పెట్టుకు కూర్చున్నారు. దాదాపు కోటి రైతుకుటుంబాలకు అంతే భూమి వున్నది. సగటున ఒకొక్క పెద్ద

భూస్వామికి 23 వందల డెసియేటిన్‌ల భూమి వుంది. ధనిక రైతులతో సహా రైతుకుటుంబానికి సగటున 7 డెసియేటిన్‌ల భూమి మాత్రమే వుంది. 50 లక్షల చిన్న రైతుకుటుంబాలకు, అంటే రైతాంగంలో సగభాగానికి, ఒక్కొక్కరికి ఒకటి లేక రెండు డెసియేటిన్‌ల భూమి మాత్రమేవుంది. ఈ అంకెలన్నీ రైతుల పేదరికానికి మూలమేమిటో, పదేపదే వచ్చే క్షామాలకు మూలమేమిటో తెలియజేశాయి. వీటికి మూలం భూస్వాముల ఎస్టేట్లు. అర్ధ బానిసవిధానం అవశేషాలే. రైతాంగం కార్మికవర్గ నాయకత్వాన విప్లవంద్వారానే వీటిపీడ వదిలించుకోగలదు.

పల్లెలతో సంబంధంగల కార్మికులద్వారా ప్రవదా గ్రామాలలోకి చొచ్చుకుపోయి, రాజకీయంగా అభివృద్ధిచెందిన రైతులను విప్లవపోరాటానికి ఉత్తేజపరచింది.

ప్రవదాను స్థాపించిన కాలంలో రహస్య సోషల్ డెమాక్రటిక్ సంస్థలు పూర్తిగా బోల్షివిక్కుల సారథ్యంక్రింద వున్నాయి. డ్యూమాముఠా, పత్రికలూ, వైద్యసహాయక సమితులూ, కార్మికసంఘాలూ, మొదలైన చట్టబద్ధ సంఘాలన్నీ ఇంకా పూర్తిగా మెన్షివిక్కుల నుండి లాగివేయబడలేదు. చట్టబద్ధంగా వుంటున్న కార్మికవర్గ సంఘాల నుండి లిక్విడేటర్లను తరిమివేయడానికి బోల్షివిక్కులు నిశ్చిత పోరాటాన్ని సాగించవలసివుంది. ప్రవదా కృషివల్ల యీ పోరాటలో బోల్షివిక్కులకు విజయం లభించింది.

కార్మికవర్గ విప్లవ ప్రజా పార్టీని నిర్మించడంకోసం, పార్టీ ముఖ్య సూత్రం కోసం, ప్రవదా పోరాటం మధ్యలోకి

దూకింది. రహస్య బోల్షివిక్కు పార్టీ కేంద్రాల పక్షాన చట్టబద్ధంగా వుంటున్న సంస్థలను ప్రవదా సమీకరించింది. విప్లవ సన్నాహం అనే ఒక నిశ్చిత లక్ష్యంతో కార్మికవర్గ ఉద్యమాన్ని ప్రవదా నడిపింది.

ప్రవదాకు కార్మిక విలేఖరులు అనేకమంది వుండేవారు. ఒక్క సంవత్సరములోనే కార్మికులనుండి వచ్చిన 11 వేల లేఖలను ప్రవదా ప్రకటించింది. ఒక్క లేఖలద్వారామాత్రమే కార్మికవర్గ జనసామాన్యంతో ప్రవదా సంబంధం పెట్టుకోలేదు. అనేకమంది కార్మికులు ప్రతిరోజూ ఫ్యాక్టరీలనుండి వచ్చి, సంపాదక కార్యాలయాన్ని దర్శించు తుండేవారు. ప్రవదా సంపాదకీయ కార్యాలయంలో పార్టీ నిర్మాణ కార్యంలో చాల భాగం కేంద్రీకరింపబడి వుండేది. పార్టీ కణములనుండి (న్యూక్లియై Nuclei) వచ్చిన ప్రతినిధుల మీటింగులు యిచట ఏర్పాటుచేయబడేవి. (కణములంటే పార్టీలోని ప్రాథమికయూనిట్ - అనువాదకుడు.) మిల్లులలోనూ, ఫ్యాక్టరీలలోనూ చేసిన పార్టీపనిని గురించి రిపోర్టులను యిక్కడ తీసుకొనేవారు. ఇక్కడనుండి సెంట్‌పీటర్స్‌బర్గ్ కమిటీ సూచనలూ, పార్టీ సెంట్రల్‌కమిటీ సూచనలూ పంపబడేవి.

లిక్విడేటర్లకు వ్యతిరేకంగా విప్లవకార్మికవర్గ ప్రజా పార్టీని నిర్మించడానికిగాను, రెండున్నర సంవత్సరాలు నిరంతర పోరాటం సాగించిన ఫలితంగా, 1914 వేసవినాటికి బోల్షివిక్కులు విజయంపొందారు. ప్రవదా ఎత్తుగడలనూ, బోల్షివిక్

పార్టీనీ, రష్యాలోని రాజకీయంగా ఉత్సాహవంతులైన కార్మికులలో నూటికి 80 మంది బలపరచారు. ఈవిషయం ఎలా తేలిందంటే ఉదాహరణకు 1914 లో కార్మిక పత్రికలకు డబ్బు వసూలుచేసిన ఏడువేల కార్మిక గ్రూపులలో, అయిదువేల ఆరువందల గ్రూపులు బోల్షివిక్ పత్రికలకూ, పధ్నాలుగువందల గ్రూపులు మాత్రమే మెన్షివిక్ పత్రికలకూ పనిచేశాయి. ఇందుకు వ్యతిరేకంగా మెన్షివిక్కులకు లిబరల్ బూర్జువాలోనూ, బూర్జువా మేధావులలోనూ అనేకమంది "ధనికస్నేహితులు" న్నారు. మెన్షివిక్ వార్తాపత్రిక కొనసాగడానికి అవసరమైన డబ్బులో సగానికిపైగా వీరేయిచ్చేవారు.

బోల్షివిక్కులు ఆకాలంలో "ప్రావదిస్ట్స్" (ప్రవదా అనుచరులు) అని పిలువబడేవారు. విప్లవ శ్రామికవర్గంయొక్క ఒక తరాన్ని తరాన్నంతా ప్రవదా పోషించింది. ఈ తరంవారే ఆతర్వాత అక్టోబరు సోషలిస్టు విప్లవాన్ని గావించారు. ప్రవదాను వేలకొలది, లక్షలకొలది కార్మికులు బలపర్చారు. విప్లవోద్యమం తలయెత్తుచున్న కాలంలో (1912-14) ప్రజా బోల్షివిక్ పార్టీచే దృఢమైన పునాదివేయబడింది. ఈ పునాదిని సామ్రాజ్యవాద యుద్ధకాలంలో జారుప్రభుత్వ నిర్బంధవిధానం నాశనం చేయలేక పోయింది.

"1912 నాటి ప్రవదా, 1917 లో బోల్షివిక్ విజయానికి పునాదిరాయిని వేసింది." (కామ్రేడ్ స్టాలిన్)

చట్టబద్ధంగా నడుస్తూన్న పార్టీ కేంద్రపు మరోఅంగం ప్రభుత్వ నాల్గవ డ్యూమాలోని బోల్షివిక్ ముఠా.

1912 లో ప్రభుత్వం నాల్గవ డ్యూమాకు ఎన్నికలను ప్రకటించింది. ఈ ఎన్నికలలో పాల్గొనటం చాలా ప్రాముఖ్యమని మనపార్టీ గుర్తించింది. ప్రజలలో బోల్షివిక్‌పార్టీ గావించే విప్లవకార్యకలాపానికి ముఖ్యపునాదులు దేశవ్యాపితంగా బహిరంగంగా పనిచేయుచున్న డ్యూమాలోని సోషల్ డెమాక్రటిక్ ముఠా, ప్రవదాలే.

డ్యూమా ఎన్నికలలో బోల్షివిక్‌పార్టీ తన నినాదాలతో స్వాతంత్రంగా వ్యవహరించింది.

ప్రభుత్వ పార్టీలనూ, లిబరల్ బూర్జువానూ (శాసన బద్ధ ప్రజాతంత్రవాదులను) ఒకేసారి ఎదిరించుతూ వచ్చింది. ఎన్నికల ప్రచారంలో బోల్షివిక్ నినాదాలివి: ప్రజాతంత్ర రిపబ్లిక్, దినానికి 8 గంటలపని, భూస్వాముల ఎస్టేట్లను వశపరచుకొనుట.

1912 ఆకురాలు కాలంలో నాల్గవడ్యూమా ఎన్నికలు జరిగాయి. అక్టోబరు ప్రారంభంలో సెంట్ పీటర్స్‌బర్గ్‌లో జరిగిన ఎన్నికలు చూచి, అసంతృప్తిపడ్డ ప్రభుత్వం అనేక పెద్ద ఫ్యాక్టరీలలోని కార్మికుల ఓటింగు హక్కులను సంకుచిత పరచ ప్రయత్నించింది. దీనికి జవాబుగా కామ్రేడ్ స్టాలిన్ సూచనపైన, మనపార్టీ శాఖయగు సెంట్ పీటర్స్‌బర్గ్ కమిటీ, పెద్ద ఫ్యాక్టరీలలోని కార్మికులను ఒక రోజు సమ్మెచేయవలసిందిగా కోరింది. ప్రభుత్వం చిక్కులోపడి లొంగిపోవలసి వచ్చింది. తమ యిష్టం వచ్చిన వారిని మీటింగులలో కార్మికులు ఎన్నుకోగల్గారు. కామ్రేడ్ స్టాలిన్ ప్రకటించిన ఆదేశానికి (రష్యన్ భాషలో నాకజ్) బద్ధులైన ప్రతినిధులకు

శాసనసభా ప్రతినిధికి అధికసంఖ్యాకులైన కార్మికులు వోటు చేశారు. "తమ కార్మిక ప్రతినిధికి సెంట్ పీటర్స్‌బర్గ్ కార్మికుల ఆదేశం" 1905 లో పూర్తిగావించబడని కర్తవ్యాలను దృష్టికి తెచ్చింది.

ఆ ఆదేశంలో ఇలా ప్రకటించింది: "రష్యా యిపుడు ప్రజాఉద్యమాలు ప్రారంభమయ్యే కాలంలో వుందని మేము భావించుతున్నాం. బహుశా యీ ప్రజాఉద్యమాలు 1905లో కంటె మరింత గాఢంగా వుండవచ్చు......1905 లో వలెనే రష్యన్ సమాజంలో బాగా అభివృద్ధి చెందిన శ్రామికవర్గంగా ప్రజాఉద్యమాల అగ్రశ్రేణిలో వుంటుంది. దాని ఒకే ఒక మిత్రము అధికంగా బాధపడుతున్న రైతాంగం. రష్యాను విముక్తి చేయడంలో దీనికి ప్రబల ప్రయోజనాలున్నాయి".

జారుప్రభుత్వంతోనూ, దానితో రాజీకి ప్రాకులాడుతున్న లిబరల్ బూర్జువాతోనూ వ్యతిరేకంగా రెండు పోరాటాలు సాగించాలి. ప్రజల భావిచర్యలు అలాంటి పోరాట స్వరూపాన్ని పొందాలని ఆ ఆదేశం ప్రకటించింది.

విప్లవ పోరాటాన్ని సాగించాలని కార్మికులను కోరిన యీ ఆదేశానికి లెనిన్ చాలా ప్రాముఖ్యత నిచ్చాడు. ఈ ఆదేశానికి కార్మికులు తమ తీర్మానాల ద్వారా సంసిద్ధతను తెలియజేశారు. బోల్షివిక్కులు ఎన్నికలలో విజయాన్ని పొందారు. కామ్రేడ్ బాడయెవ్, సెంట్ పీటర్స్‌బర్గ్ కార్మికులచే డ్యూమాకు ఎన్నుకోబడ్డాడు.

కార్మికులు ఇతర ప్రజానీకంతో సంబంధం లేకుండా విడిగా ప్రత్యేక నియోజకవర్గంలో డ్యూమా ఎన్నికలలో

వోటు చేశారు [దీనినే కార్మికుల క్యూరియా నియోజక వర్గం అనేవారు]. కార్మికుల క్యూరియా నుండి ఎన్నుకోబడిన తొమ్మండుగురు ప్రతినిధులలో ఆరుగురు బోల్షివిక్ సభ్యులు. వారు బాడయెవ్, పెట్రోవ్‌స్కీ, మురనావ్, శామోయ్ లోవ్, షాగోవ్, మలినోవ్‌స్కీ (ఇతడు తర్వాత గూఢచారిగా తయారయ్యాడు) నూటికి 80 వంతులకు తక్కువ గాకుండా కార్మికవర్గం కేంద్రీకరింపబడిన పెద్ద పారిశ్రామిక కేంద్రాల నుండి బోల్షివిక్ ప్రతినిధులు ఎన్నుకోబడ్డారు. ఇక ఎన్నికలలో జయం పొందిన లిక్విడేటర్ల సంగతి చూద్దాం. వారు కార్మిక క్యూరియా నుండి ఎన్నుకోబడలేదు. దీని అర్థం కార్మికులచే వీరు ఎన్నుకోబడలేదు. దీని ఫలితంగా డ్యూమాలో ఆరుగురు బోల్షివిక్కులు, ఏడుగురు లిక్విడేటర్లు ఉన్నారు. మొట్టమొదట బోల్షివిక్కులు లిక్విడేటర్లు డ్యూమాలో ఒక సంయుక్త సోషల్ డెమోక్రటిక్ ముఠాను ఏర్పరచారు. బోల్షివిక్కుల విప్లవ కార్యకలాపాన్ని కుంటుపడ జేయుచున్న లిక్విడేటర్లతో మొండి పోరాటాన్ని సాగించిన పిమ్మట, బోల్షివిక్ ప్రతినిధులు పార్టీ సెంట్రల్ కమిటీ సూచనల ననుసరించి, 1913 అక్టోబరులో సంయుక్త సోషల్ డెమాక్రటిక్ ముఠానుండి ఉపసంహరించుకొని, వేరే ఒక స్వతంత్ర బోల్షివిక్ ముఠాను ఏర్పరచారు.

డ్యూమాలో బోల్షివిక్ ప్రతినిధులు విప్లవప్రసంగాలు చేశారు. నిరంకుశ ప్రభుత్వవిధానాన్ని బట్టబయలు చేశారు. కార్మికులపై నిర్బంధవిధానం ఉపయోగించిన ఘటనలగురించీ, పెట్టుబడిదారులు కార్మికులను అమానుషంగా దోపిడి చేయుటను గురించీ ప్రభుత్వంపై ప్రశ్నలు కురిపించారు.

డ్యూమాలో, వారు వ్యవసాయిక సమస్యపై కూడా మాట్లాడారు. భూస్వామ్య ప్రభువులతో పోరాడవలసిందని రైతులను ఉద్బోధించారు. ఎస్టేటుభూములను వశపరచుకొని రైతులకు అప్పగించాలనే సూత్రాన్ని యెదిగించుతున్న శాసన బద్ధ ప్రజాతంత్రవాదపార్టీ గుట్టును, వారు బయటబెట్టారు.

దినానికి 8 గంటలు పని వుండాలనే బిల్లును బోల్షివిక్కులు ప్రభుత్వడ్యూమాలో ప్రవేశపెట్టారు. బ్లాక్ హండ్రడ్స్‌తో కూడుకొనివున్న యీ డ్యూమా దానిని అంగీకరించకపోవటం సహజమే. అయితే దీనికి చాలా ప్రచారపువిలువ వుంది.

డ్యూమాలోని బోల్షివిక్ ముఠా, పార్టీ సెంట్రల్ కమిటీతోనూ, లెనిన్‌తోనూ, సన్నిహిత సంబంధాలు పెట్టుకొనేది. వారినుండి సూచనలను పొందుతుండేది. కామ్రేడ్ స్టాలిన్ సెంట్ పీటర్స్‌బర్గ్‌లో వున్న రోజుల్లో ఆయనే స్వయంగా బోల్షివిక్ ముఠాను నడిపేవాడు.

బోల్షివిక్ ప్రతినిధులు ఒక్క డ్యూమా పనితోనే సరి పెట్టుకొని కూర్చోలేదు. డ్యూమా బయటకూడా చాలా వుత్సాహంగా పనిచేశారు. ఫ్యాక్టరీలను, మిల్లులను సందర్శించారు. దేశంలోని కార్మికవర్గ కేంద్రాలకు పర్యటించి ఉపన్యాసాలిచ్చారు. అక్కడ రహస్య సమావేశాలేర్పరచి పార్టీ నిర్ణయాలను విశదపరచారు. పార్టీ సంస్థలను కొత్తవాటిని గూడా ఏర్పరచారు. ఈ ప్రతినిధులు బహిరంగ కార్యకలాపాలను, రహస్య చట్టవ్యతిరేక కార్యకలాపాలతో చాక చక్యంగా మేళవించారు.

# 3

## బహిరంగ సంస్థలలో బోల్షివిక్కుల విజయం - విప్లవోద్యమ నిరంతరాభివృద్ధి - సామ్రాజ్యవాద యుద్ధ సామీప్యం

ఈ కాలంలో శ్రామికవర్గ పోరాటాలలో బోల్షివిక్ పార్టీ ఆదర్శమైన నాయకత్వాన్ని అన్నివిధాలా, అన్నిరూపాలా వహించింది. అది రహస్య (ఇల్లీగల్) సంఘాలను నిర్మించింది. రహస్య కరపత్రాలను ప్రకటించింది. ప్రజాసామాన్యంలో రహస్య విప్లవకార్యాన్ని కొనసాగించింది. అదే సమయంలో క్రమంగా బహిరంగంగా వుంటున్న వివిధ కార్మికవర్గసంస్థలకు నాయకత్వాన్ని సంపాదించింది. కార్మికసంస్థలను తమప్రక్కకు తిప్పుకోడానికి ప్రజాభవనాలు, సాయంతన విశ్వవిద్యాలయాలు, క్లబ్బులు, వైద్యసహాయక సంఘాలు మొదలగువాటిలో పలుకుబడిని సంపాదించుటకు పార్టీ ప్రయత్నించింది. బహిరంగంగా వుంటున్న యీ సంస్థలు చాలాకాలం లిక్విడేటర్లకు స్థావరంగా వుంటూవచ్చాయి. బహిరంగంగావుంటున్న సొసైటీలను మనపార్టీ బలీయస్థానాలుగా మార్చడానికి శక్తివంతమైన పోరాటాన్ని బోల్షివిక్కులు ప్రారంభించారు. రహస్య బహిరంగ కార్యకలాపాలను చాకచక్యంగా మేళవించుటద్వారా, బోల్షివిక్కులు ముఖ్యపట్టణాలైన సెంట్ పీటర్స్‌బర్గ్, మాస్కో లలోరెండింటిలోని కార్మికసంస్థలలో అధికసంఖ్యానుతమవై వుక

తిప్పుకున్నారు. 1913 లో సెంట్ పీటర్స్‌బర్గ్‌లో, లోహకార్మికుల సంఘం కార్యనిర్వాహకవర్గ ఎన్నికలల్లో అద్భుతమైన విజయాన్ని బోల్షివిక్కులు సంపాదించారు. మీటింగుకు హాజరైన మూడువేల లోహకార్మికులలోను 150 మంది మాత్రమే లిక్విడేటర్లకు వోటుచేశారు.

ప్రభుత్వపు నాల్గవ డ్యూమాలోని సోషల్ డెమాక్రటిక్ ముఠాలాంటి ప్రధానమైన బహిరంగ సంస్థనుగురించి కూడా అదే చెప్పవచ్చు. డ్యూమాలో మెన్షివిక్కులకు ఆరే స్థానాలున్నాయి. అయినా మెన్షివిక్కులు కార్మికవర్గేతర జిల్లాలనుండి ముఖ్యంగా ఎన్నుకోబడ్డారు. కార్మికవర్గంలో అయిదవ వంతును మాత్రమే వారు ప్రాతినిధ్యం వహించారు. బోల్షివిక్కులు దేశంలోని ముఖ్య పారిశ్రామిక కేంద్రాలనుండి (సెంట్‌పీటర్స్‌బర్గ్, మాస్కో, ఇవనోవో, వోజీసెన్స్క్, కోస్ట్రోమా, ఎకాటర్నస్లోవ్, ఖార్కోవ్) ఎన్నుకోబడ్డారు. దేశంలోని కార్మికవర్గంలో నూటికి ఎనభైమందికి పైగా ప్రాతినిధ్యం వహించారు. కార్మికులు, ఈ ఏడుగురు మెన్షివిక్కులనుగాక ఆ ఆరుగురి బోల్షివిక్కులనే (బోడయవ్, పెట్రోవ్‌స్కీ మొదలైన వారినే) తమ ప్రతినిధులుగా ఎంచారు.

జారు ప్రభుత్వం రాక్షస నిర్బంధ విధానం కొనసాగించుతున్నప్పటికీ, లిక్విడేటర్లూ, ట్రాట్స్కీవాదులూ తిట్టిపోస్తున్నప్పటికీ, రహస్య పార్టీని బోల్షివిక్కులు కాపాడుకోగల్గారు. తమ అనుయాయిలలో దృఢమైన క్రమశిక్షణను నిలుపుకోగల్గారు. కార్మికవర్గ ప్రయోజనాలను దృఢంగా సంరక్షించారు. ప్రజా సామాన్యంతో వారు సన్నిహిత సంబం

ధాలను కల్గివున్నారు. కార్మికవర్గ ఉద్యమ శత్రువులతో రాజీ లేని పోరాటాన్ని సాగించారు. ఇందుచేతనే బోల్షివిక్కులు బహిరంగంగా వుంటున్న సంస్థలను తమవైపుకు తిప్పుకోను టలో విజయం పొందారు.

ఆ విధంగా బహిరంగంగా వుంటున్న సంస్థలలో బోల్షివిక్కుల విజయం, మెన్షివిక్కుల అపజయం నిరంతరం కొన సాగింది. డ్యూమా వేదికనుండి ఆందోళన చేయు విషయం లోనూ, కార్మిక పత్రికల విషయంలోనూ, బహిరంగంగా వుంటున్న తదితర సంస్థల విషయంలోనూ మెన్షివిక్కులు వెనుకకు నెట్టబడ్డారు. కార్మికవర్గం నిశ్చితంగా బోల్షివిక్కుల పక్షాన ఆయత్తమైంది. కార్మికవర్గంలో విప్లవోద్యమం బాగా బలం సంపాదించుకొంది. మెన్షివిక్కులను పక్కకు నెట్టివేసింది.

వీటన్నిటికి తోడు మెన్షివిక్కులు జాతీయ సమస్యలో కూడా దివాలాకోరుతనం ప్రదర్శించారు. రష్యా సరిహద్దు ప్రాంతాలలో విప్లవోద్యమం జాతీయ సమస్యలపై ఒక స్పష్టమైన కార్యక్రమాన్ని కోరింది. కాని మెన్షివిక్కుల కార్యక్రమంలో 'బండ్' యొక్క కల్చరల్ అటానమీ (సాంస్కృతిక విషయాలలో స్వపరిపాలన) తప్పితే మరొక కార్యక్రమం లేదు. కాని ఇది ఎవరిని సంతృప్తిపరచలేదు. జాతీయ సమస్యపై బోల్షివిక్కులకే మార్క్సిస్టు కార్యక్రమం వుంది. కామ్రేడ్ స్టాలిన్ వ్రాసిన "మార్క్సిజం — జాతీయ సమస్య" అనే వ్యాసంలోనూ, లెనిన్ వ్రాసిన "జాతుల స్వయం నిర్ణయ హక్కు", "జాతీయ సమస్యపై విమర్శనాత్మక వ్యాఖ్యలు" అనే వ్యాసాలలోనూ ఈ కార్యక్రమం వివరింపబడింది.

మెన్షివిక్కులు అలాంటి అపజయాలను పొందినతర్వాత ఆగస్టుకూటమి చీలిపోవ ప్రారంభించుటలో ఆశ్చర్యంలేదు. నానా సంకరమైన వ్యక్తులతో కూడిన అది, బోల్షివిక్కులదాడికి నిలువలేకపోయింది. చిన్నాభిన్నమై పోసాగింది. బోల్షివిజంతో పోరాడే నిమిత్తం ఏర్పడిన యీ ఆగస్టుకూటమి త్వరలోనే బోల్షివిక్కుల దెబ్బలకు ముక్కలు ముక్కలై పోయింది. మొదట ఈ కూటమినుంచి విడిపోయినది వెపర్వ్యాడ్ వాదులు (బోగ్డనోవ్, లూనాచెర్స్కి మొదలైనవారు). తర్వాత "లెట్లు" (లాట్వియా మొదలగు బాల్టిక్ జాతుల వాస్తవ్యులు) దీనిని వదలిపెట్టారు. తక్కినవారు తర్వాత వెళ్ళిపోయారు.

బోల్షివిక్కులపై పోరాటంలో ఓటమి తిన్నతర్వాత, లిక్విడేటర్లు, రెండవ ఇంటర్నేషనల్‌ను తమకు సహాయపడమని వేడుకొన్నారు. రెండవ ఇంటర్నేషనల్ వారి సహాయానికి వచ్చింది. బోల్షివిక్కులకూ, లిక్విడేటర్లకూ మధ్య "పరిష్కార కర్త"లాగ వ్యవహరించుతాననే మిషతో, "పార్టీలో శాంతి" ఏర్పరచుతాననే మిషతో, రెండవ ఇంటర్నేషనల్, లిక్విడేటర్ల రాజీపాలసీని విమర్శించుటను మానుకోవాలని బోల్షివిక్కులను కోరింది. కాని బోల్షివిక్కులు రాజీకి తలయొగ్గలేదు. అవకాశవాద రెండవ ఇంటర్నేషనల్‌ని ర్ణయాలకు కట్టుపడివుండటానికి బోల్షివిక్కులు నిరాకరించారు. ఎట్టి మినహాయింపులకు (కన్‌సెషన్స్) అంగీకరించలేదు.

బహిరంగంగా వుంటున్న సంస్థలలో బోల్షివిక్కుల విజయం యాదృచ్ఛికంకాదు-కాజాలదు. సరియైన మార్క్సిస్టు సిద్ధాంతమూ, స్పష్టమైన కార్యక్రమమూ, యుద్ధాగ్నిలో కాగి

పదునెక్కిన విప్లవ శ్రామికవర్గపార్టీ, బోల్షివిక్కు లొక్కరికే వున్నాయి. ఇంతేగాక తల ఎత్తుచున్న విప్లవవెల్లువను బోల్షివిక్కులు ప్రతిబింబించారు. అందుచేకూడ యీ విజయం యాదృచ్ఛికం కాదు.

కార్మికుల విప్లవోద్యమం నెమ్మదిగా ఒక పట్టణం నుండి మరొక పట్టణానికి, ఒక ప్రాంతంనుండి మరొక ప్రాంతానికి వ్యాప్తిని చెందింది. 1914 ప్రారంభంలో కార్మికుల సమ్మెలు అణగిపోలేదు సరిగదా క్రొత్త ఉరవడిని పొంగాయి. మరింత పంతంతోను అధిక సంఖ్యాకమైన కార్మికులను ఇముడ్చుకుంటూ ఈసమ్మెలు జరిగాయి. జనవరి 9న రెండున్నర లక్షల కార్మికులు సమ్మెజేశారు. అందులో సెంట్ పీటర్స్‌బర్గ్ కార్మికులు లక్షా నలభైవేలమంది. మే ఒకటవతేదీన అయిదు లక్షలకుపైగా కార్మికులు సమ్మెచేశారు. అందులో సెంట్ పీటర్స్‌బర్గ్ కార్మికులు రెండున్నరలక్ష లున్నారు. సమ్మెలలో కార్మికులు అసాధారణమైన స్థైర్యాన్ని ప్రదర్శించారు. సెంట్ పీటర్స్‌బర్గ్‌లో బబుఖావ్ పరిశ్రమలోని సమ్మె రెండు నెలలకు పైగా నిలిచింది. లెస్‌నెర్ పరిశ్రమలలో జరిగిన మరొక సమ్మె దాదాపు మూడునెలలు సాగింది. సెంట్ పీటర్స్‌బర్గ్ ఫ్యాక్టరీలలో అనేక చోట్ల కార్మికులకు మొత్తంగా విషంపెట్టుట సమ్మెకు కారణం. లక్షా పదిహేనువేలమంది సమ్మెచేశారు. దీనితోపాటు ప్రదర్శనాలు గావించారు. ఉద్యమం వ్యాపింప సాగింది. 1914 సంవత్సరం మొదటి ఆరునెలల్లో (జూలై మొదటి భాగంతో సహా) పదునాలుగులక్షల ఇరవైఅయిదు వేలమంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు.

మే నెలలో బాకూలో జరిగిన నూనెపనివారల సర్వ వ్యాపితసమ్మె, రష్యాయావత్ శ్రామికవర్గంయొక్క దృష్టిని ఆకర్షించింది. ఈ సమ్మె ఒక సంఘటితరూపంలో నడుపబడింది. జూన్ 20 వ తేదీన బాకూలో ఇరవై వేల మంది కార్మికులు ప్రదర్శనం గావించారు. బాకూ కార్మికులపైన పోలీసులు క్రూరమైన పద్ధతులు అవలంబించారు. దీని కసమ్మతిగానూ, బాకూకార్మికులతో తమసౌభ్రాతృత్వాన్ని తెలియజేయడానికీ మాస్కోలో సమ్మెప్రారంభమై యితర జిల్లాలకు వ్యాపించింది.

జూలై 3వ తేదీన బాకూసమ్మె సందర్భంలో సెంట్ పీటర్స్‌బర్గ్‌లోని ప్యూటిలావ్ పరిశ్రమల కార్మికులు ఒక మీటింగు జరిపారు. పోలీసులు కార్మికులపై తుపాకులు పేల్చారు. సెంట్ పీటర్స్‌బర్గ్ పార్టీ కమిటీ పిలుపునందుకొని, జూలై 4 వ తేదీన ఆపట్టణ కార్మికులు తొంభై వేలమంది అసమ్మతిగా పనిమానివేశారు. ఈ సంఖ్య జూలై 7 వ తేదీకి లక్షాముప్పై వేలకూ, ఆమర్నాటికి లక్షాయేభై వేలకూ, జూలై 11 వ తేదీకి రెండులక్షలకూ పెరిగింది.

అశాంతి అన్ని ఫ్యాక్టరీలకూ వ్యాపించింది. ప్రతిచోటా మీటింగులూ, ప్రదర్శనాలూ జరిగాయి. కార్మికులు బ్యారికేడ్లనుకూడా నిర్మించసాగారు. బాకూ, లాట్జ్‌లలో బ్యారికేడ్లు నిర్మింపబడ్డాయి. అనేకస్థలాల్లో పోలీసులు కార్మికులపై తుపాకులు పేల్చారు. ప్రభుత్వం యీ వుద్యమాన్ని అణచడానికి "అత్యవసర" చర్యలను అవలంబించింది. రాజధానీ నగరం ఒక సైనిక శిబిరంగా మారిపోయింది. ప్రవదా నిషేధింపబడింది.

కానీ ఆ సమయంలో అంతర్జాతీయ ప్రాముఖ్యం గల ఒక కొత్తవిషయం రంగంలోకి వచ్చింది. ఇది సామ్రాజ్యవాద

యుద్ధం. అది యావత్ చరిత్ర క్రమాన్నే మార్చివేయబో తోంది. జూలైలో విప్లవ ఘటనలు అభివృద్ధిపొందుతున్న కాలంలో ఫ్రెంచి అధ్యక్షుడు పోయింకేర్ సెంట్ పీటర్స్‌బర్గ్‌కు, త్వరలో ప్రారంభంకానున్న యుద్ధాన్ని గురించి జారుతో చర్చించడానికి గాను వచ్చాడు. తర్వాత కొన్ని దినాలకు జర్మనీ రష్యాపై యుద్ధాన్ని ప్రకటించింది. జారు ప్రభుత్వం కార్మికవర్గ ఉద్యమాన్ని అణచుటకూ, బోల్షివిక్ సంస్థలను నాశనంచేయుటానికీ యుద్ధాన్ని అదనుగా తీసుకుంది. విప్లవ పురోగమనానికి ప్రపంచ యుద్ధంవల్ల అంతరాయం కలిగింది. విప్లవ ప్రమాదంనుండి విముక్తి ప్రపంచయుద్ధమేనని జారు ప్రభుత్వం తలచింది.

## క్లుప్తసారాంశం

విప్లవం తిరిగి తలయెత్తిన కాలంలో (1912 - 14) బోల్షివిక్ పార్టీ కార్మికవర్గ ఉద్యమానికి నాయకత్వం వహించి, తమ నినాదాలతో మరో విప్లవానికి దానిని ముందుకు నడిపింది. రహస్య, బహిరంగ కార్యకలాపాలను, పార్టీ శక్తివంతంగా మేళవించింది. లిక్విడేటర్ల, వారి స్నేహితులైన ట్రాట్స్కీవాదుల, ఆట్జోవిస్టుల ప్రతిఘటనను నాశనంచేసి, పార్టీ బహిరంగ ఉద్యమ స్వరూపాలన్నింటికీ నాయకత్వం వహించింది. బహిరంగంగా వుంటున్న సంస్థలను విప్లవ కార్యకలాపానికి వేదికలుగా మార్చింది.

కార్మికవర్గ శత్రువులతోనూ, కార్మికవర్గ ఉద్యమం లోనే వున్న ఆ శత్రు ఏజంట్లతోనూ జరిపిన పోరాటంలో,

పార్టీ, తన అనుయాయులను సుసంఘటిత పరచింది. కార్మిక వర్గంతో తన సంబంధాలను విస్తరింపచేసుకొంది. ద్యూమాను విప్లవ ఆందోళనకు వేదికగా పార్టీ బాగా ఉపయోగించుకొంది. అత్యద్భుత కార్మిక ప్రజా వార్తాపత్రిక అయిన ప్రవదాను స్థాపించింది. తద్వారా విప్లవయోధుల ఒక కొత్తతరాన్ని, ప్రావదిస్టులను తర్ఫీదుచేసింది. సామ్రాజ్యవాద యుద్ధకాలంలో యీ భాగానికి చెందిన వర్కర్లు అంతర్జాతీయ పతాకకూ, శ్రామికవర్గ విప్లవానికీ విశ్వాస పాత్రులుగా నిలిచారు. 1917 అక్టోబరు విప్లవకాలంలో బోల్షివిక్ పార్టీ మూలాధారంగా అది తర్వాత తయారైంది.

సామ్రాజ్యవాద యుద్ధం రేపోమాపో అనగా, కార్మిక వర్గాన్ని విప్లవ పోరాటాలకు పార్టీ నడిపింది. ఇవి అగ్రశ్రేణి గావించిన పోరాటాలు. వీటికి సామ్రాజ్యవాద యుద్ధం అంతరాయం కల్గించింది. కాని మూడేండ్ల తర్వాత తిరిగి ప్రారంభమై జారుప్రభుత్వాన్ని కూలద్రోయగల్గినాయి. శ్రామికవర్గ అంతర్జాతీయత అనే జెండాను ఎగురవేస్తూ, బోల్షివిక్ పార్టీ సామ్రాజ్యవాద యుద్ధం అనే కష్టకాలంలో ప్రవేశించింది.

# ఆరవ అధ్యాయం

## సామ్రాజ్యవాద యుద్ధకాలంలో
## బోల్షివిక్ పార్టీ-రష్యాలో
## రెండవ విప్లవం

[ 1914 మార్చి — 1917 ]

## సామ్రాజ్యవాద యుద్ధారంభం - దానికి కారణాలు

**1914** జూలై 14వ తేదీన (కొత్త క్యాలెండరు ప్రకారం 27వ తేదీన) జారు ప్రభుత్వం సైనిక సమీకరణ ప్రకటించింది. జూలై 19వ తేదీన (ఆగస్టు - 1) జర్మనీ, రష్యాపై యుద్ధం ప్రకటించింది.

రష్యా యుద్ధంలో ప్రవేశించింది.

వాస్తవంగా యుద్ధం ప్రారంభించక ముందే చాలా కాలం క్రితమే, లెనినూ, బోల్షివిక్కులూ యుద్ధం తప్పదని గ్రహించారు. యుద్ధం తటస్థించినపక్షంలో సోషలిస్టుల విప్లవ వైఖరిని నిర్ణయించటానికి లెనిన్ కొన్ని సూచనలను అంతర్జాతీయ సోషలిస్టు కాంగ్రెస్‌లో తెలియజేశాడు.

పెట్టుబడిదారీ విధానాన్ని అనుసరించుకొనే యుద్ధం అనివార్యంగా వుంటుందని లెనిన్ తెలియజేశాడు. విదేశ భూమిని దోచుకోవటం, వలసరాజ్యాలను వశపరచుకొని దోపిడీ చేయడం, కొత్తమార్కెట్లను వశపరచుకొనడం, అనేకసార్లు పెట్టుబడిదారీ ప్రభుత్వాలు చేసే దురాక్రమణా, యుద్ధాలకు కారణాలయ్యాయి. పెట్టుబడిదారీదేశాల దృష్టిలో కార్మిక

వర్గాన్ని దోచుకోవటం ఎంత సహజమైన న్యాయమైన విషయమో, యుద్ధంకూడా అంత సహజమైన న్యాయమైన విషయమే.

19 వ శతాబ్దం చివరలోనూ, 20వ శతాబ్దం ప్రారంభంలోనూ పెట్టుబడిదారీ విధానం, నిశ్చితంగా తనఅభివృద్ధియొక్క ఉన్నతదశలో ప్రవేశించింది. ఇది దాని అంతిమదశ. సామ్రాజ్యవాదదశ. అలాంటప్పుడు ముఖ్యంగా యుద్ధాలు అనివార్యమయ్యాయి. సామ్రాజ్యవాదంక్రింద, శక్తివంతమైన పెట్టుబడిదారీ సంస్థలు (మోనోపలీలు అనగా గుత్తవ్యాపార సంస్థలు), బ్యాంకులు, పెట్టుబడిదారీప్రభుత్వాల జీవితంలో ప్రాబల్యమైన స్థానాన్ని ఆక్రమించాయి. పెట్టుబడిదారీదేశాల్లో ఫైనాన్సు పెట్టుబడి యజమానిఅయింది. ఫైనాన్సు పెట్టుబడికి మార్కెట్లు కావాలి. కొత్త వలసదేశాలను పట్టుకోవాలి. పెట్టుబడిని ఎగుమతి చేయడానికి కొత్తరంగాలు, ముడిపదార్థాలు దొరికే ప్రదేశాలు కావాలి.

19 వ శతాబ్దం ఆఖరికి, ప్రపంచమంతా అప్పటికే పెట్టుబడిదారీ ప్రభుత్వాల మధ్య విభజింపబడివుంది. అయినప్పటికీ సామ్రాజ్యవాద శకంలో పెట్టుబడిదారీ విధానాభివృద్ధి అసమానంగానూ గంతులువేస్తూనూ కొనసాగుతుంది. ఇంతకుపూర్వం అత్యంత అగ్రస్థానంలో వున్న కొన్నిదేశాలు, ఇప్పుడు పూర్వంతో పోల్చిచూసినప్పుడు, చాల నెమ్మదిగా తమ పరిశ్రమలను అభివృద్ధిచేసుకుంటున్నాయి. ఇదివరలో వెనుకబడివున్న మరికొన్ని దేశాలు, పైవాటిని అతిక్రమించి త్వరితగతిని గంతులువేస్తూ, మించిపోయి, తమ పరిశ్రమలను వృద్ధిచేసు

ఖుంటున్నాయి. సామ్రాజ్యవాద ప్రభుత్వాల పరస్పర ఆర్థిక సైనిక బలాలలో మార్పువస్తోంది. ప్రపంచాన్ని తిరిగి విభజించుకోవాలనే ప్రయత్నం ప్రారంభమైంది. ఈ పునర్విభజనకై సాగేపోరాటం సామ్రాజ్యవాదయుద్ధం అనివార్యమౌనట్లు చేసింది. 1914 యుద్ధం, ప్రపంచాన్ని తిరిగి పంచుకోడానికీ, కొన్ని ప్రాంతాలపై పెత్తనాన్ని సంపాదించేందుకు (For Spheres of Influence) జరిగిన యుద్ధమే. సామ్రాజ్యవాద ప్రభుత్వాలన్నీ దానికోసం చాలకాలంనుండి సన్నాహం చేస్తున్నాయి. ఈ యుద్ధానికి అన్నిదేశాల సామ్రాజ్యవాదులూ బాధ్యులే.

కాని, ముఖ్యంగా జర్మనీ - ఆస్ట్రియాలు ఒక ప్రక్కా, ఫ్రాన్సు - గేటుబ్రిటను - ఈ రెండింటిపై ఆధారపడిన రష్యా మరొక ప్రక్కా, యీ యుద్ధానికి సన్నాహాలు చేశాయి. 1907 లో బ్రిటన్, ఫ్రాన్స్, రష్యాలు కలిసి ఒక త్రైరాజ్య కూటమిని (Triple Entente) ఏర్పరచాయి. జర్మనీ, ఆస్ట్రియా - హంగరీ, ఇటలీ - ఇవి మూడూకలిసి మరొక సామ్రాజ్యవాద ముఠాను ఏర్పరచాయి. కాని 1914 యుద్ధం ప్రారంభమయ్యాక ఇటలీ యీ ముఠాను విడిచి, త్రైరాజ్య కూటమిలో చేరింది. జర్మనీ, ఆస్ట్రియా - హంగరీలను, బల్గేరియా టర్కీలు బలపరచాయి.

బ్రిటన్ ఫ్రాన్స్‌లనుండి వలస రాజ్యాలనూ, రష్యానుండి యుక్రెయిన్, పోలండ్, బాల్టిక్ రాష్ట్రాలనూ కాజేయాలనే వుద్దేశ్యంలో (పశ్చిమాసియా ఖండంలో) బ్రిటన్ పెత్తనానికి జర్మని ప్రమాదం తెచ్చిపెట్టింది. జర్మన్ నౌకాబలాలు పెరగడంచూచి బ్రిటన్ భయపడింది.

జారుప్రభుత్వ రష్యా, టర్కీని పంచుకోవాలని కోరింది. కాన్‌స్టాన్‌టినోపిల్‌ను పట్టుకోవాలనీ, నల్లసముద్రంనుండి మధ్యధరా సముద్రానికి పోయే జలసంధిని (డార్డినల్స్) పట్టుకోవాలనీ, జారుప్రభుత్వ రష్యాకలలుకంది. ఆస్ట్రియా - హంగరీల్లో ఒకభాగమైన గెలీషియానుకూడా పట్టుకోవాలని జారు ప్రభుత్వం పథకం వేసింది.

యుద్ధానికి పూర్వం ప్రపంచ మార్కెట్‌నుండి తన వస్తువులను నెమ్మదిగా తరిమివేస్తూ తనతో పోటీచే అపాయకరంగా పరిణమించిన యుద్ధంద్వారా నాశనం చేయాలని బ్రిటన్ ప్రయత్నించింది. దీనికితోడు టర్కీనుండి మెస్‌పొటేమియానూ, పాలస్తీనానూ పట్టుకోవాలనీ, ఈజిప్టులో స్థిరమైన స్థావరాన్ని సంపాదించుకోవాలనీ బ్రిటన్ ఉద్దేశ్యపడింది.

సార్‌బేసిన్‌నూ, 1807 .. 71 యుద్ధంలో ఫ్రాన్సునుండి జర్మనీ పట్టుకొన్న హాల్సాక్‌లొరైన్‌నూ (ఈ రెండూ బొగ్గు, ఇనుము బాగా దొరికే ప్రదేశాలు) ఫ్రెంచి పెట్టుబడిదారులు జర్మనీనుండి తీసుకోడానికి ప్రయత్నించారు.

ఆ విధంగా పెట్టుబడిదారీ ప్రభుత్వాల ముఠాలరెండింటి మధ్యనున్న తీవ్రప్రతిస్పర్ధల ఫలితంగా సామ్రాజ్యవాద యుద్ధం ప్రారంభమైంది. ప్రపంచాన్ని తిరిగి పంచుకోడానికై చేసే ఈ దోపిడీయుద్ధం అన్ని సామ్రాజ్యవాద దేశాల ప్రయోజనాలతోనూ ముడివడియుంది. అందుచేత జపాన్, అమెరికా, తదితర దేశాలూ క్రమంగా ఈ యుద్ధంలోకి ఈడ్వ బడ్డాయి.

ఈ యుద్ధం ప్రపంచయుద్ధంగా మారింది.

సామ్రాజ్యవాద యుద్ధ ప్రయత్నాలను గూర్చి ప్రజలకు ఏమీ తెలియకుండా పెట్టుబడిదారులు అతిరహస్యంగా వుంచారు. యుద్ధం ప్రారంభంకాగానే ప్రతి సామ్రాజ్యవాద ప్రభుత్వమూ, తాను తన పొరుగు దేశాలపై దాడి చేయలేదని, తన పైననే అవి దాడిచేశాయని రుజువుచేయడానికి ప్రయత్నించింది. నిజమైన యుద్ధలక్ష్యాలను కప్పిపుచ్చుతూ, దాని సామ్రాజ్యవాద దురాక్రమణ స్వభావాన్ని కప్పిపుచ్చుతూ, పెట్టుబడిదారులు ప్రజలను మోసగించారు. తన దేశరక్షణకోసమే తాను యుద్ధం చేస్తున్నానని ప్రతి సామ్రాజ్యవాద ప్రభుత్వమూ ప్రకటించింది.

ప్రజలను మోసగించుటలో పెట్టుబడిదారులకు రెండవ ఇంటర్నేషనల్‌కు చెందిన అవకాశవాదులు సహాయపడ్డారు. రెండవ ఇంటర్నేషనల్‌కు చెందిన సోషల్ డెమాక్రట్లు, సోషలిస్టు ఆశయానికీ, శ్రామికవర్గ అంతర్జాతీయ ఐక్యత అనే ఆశయానికీ అతినీచంగా ద్రోహంచేశారు. యుద్ధాన్ని వ్యతిరేకించడానికి బదులు, మాతృదేశరక్షణ అనే సాకుతో యుద్ధం చేస్తున్నదేశాల కార్మిక, కర్షకులను ఒకరిపై నొకరిని రెచ్చగొట్టుటలో పెట్టుబడిదారులకు సహాయపడ్డారు.

మిత్రమండలి (Entente) తరఫున, ఫ్రాన్సు, బ్రిటన్‌ల తరఫున, సామ్రాజ్యవాద యుద్ధంలో రష్యా దిగుట యాదృచ్ఛికంకాదు. **1914** కు పూర్వం రష్యా పరిశ్రమలలోని అత్యంత ముఖ్యమైన శాఖలన్నీ ఫ్రాన్సు, బ్రిటన్, బెల్జియమ్ దేశాల అనగా మిత్రమండలియొక్క పెట్టుబడిదారుల చేతులలో వున్నవని జ్ఞాపకం పెట్టుకోవాలి. అత్యంత ముఖ్యమైన

రష్యా లోహపరిశ్రమలు ఫ్రెంచి పెట్టుబడిదారుల చేతులలో వున్నాయి. మొత్తం లోహ పరిశ్రమలలో సుమారు నాల్గింట మూడు వంతులు (నూటికి 72 పాళ్లు) విదేశీపెట్టుబడిపై ఆధార పడివుండేవి. డానెట్జ్ బేసిన్‌లోని బొగ్గు విషయంకూడా అంతే. దేశంలో ఉత్పత్తి అయ్యే నూనెలో దాదాపు సగం బ్రిటిష్, ఫ్రెంచి పెట్టుబడిదారుల చేతులలోవున్న నూనెగనులనుండే తయారయ్యేది. రష్యన్ పరిశ్రమలలోని లాభాలలో తగు భాగం విదేశీ బ్యాంకులను, ముఖ్యంగా బ్రిటిష్, ఫ్రెంచి బ్యాంకులకు ప్రవహించేది. దీనికితోడు ఫ్రాన్సు, బ్రిటన్‌ల నుండి జార్ కోట్లకొలది అప్పుచేశాడు. పైన చెప్పిన పరిస్థితులవల్ల, జార్ ప్రభుత్వం, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్య వాదుల చెప్పుచేతుల్లో వుండవలసివచ్చింది. రష్యాను పై దేశాలు అర్థవలస దేశంగా, సామంత దేశంగా తయారు చేశాయి.

తన పరిస్థితిని బాగుపరచుకోడానికి అనగా కొత్త మార్కెట్లను పట్టుకోడానికీ, యుద్ధ కంట్రాక్టుల మూలంగా విపరీతమైన లాభాలు సంపాదించడానికీ, ఇదే సమయంలో యుద్ధపరిస్థితిని అదనుగా తీసుకొని విప్లవోద్యమాన్ని నాశనం చేయడానికీ రష్యన్ పెట్టుబడిదారీవర్గం యుద్ధానికి దిగింది.

జారు ప్రభుత్వ రష్యా యుద్ధానికి సిద్ధంగాలేదు. ఇతర పెట్టుబడిదారీ దేశాలకంటె రష్యన్ పరిశ్రమలు చాలా వెనకబడి వున్నాయి. రష్యన్ పరిశ్రమలు ప్రధానంగా తాతలనాటి మిల్లులతోనూ, ఫ్యాక్టరీలతోనూ, అరిగిపోయిన యంత్రాలతోనూ వున్నాయి. అర్ధ-బానిసత్వంపై ఆధారపడిన భూయాజమాన్యం వుండుటవలనా, వారిమూలంగా నాశనమై,

దరిద్రులైన రైతులు బహుళ సంఖ్యాకంగా వుండటం వల్లా, రష్యా వ్యవసాయం దీర్ఘకాల యుద్ధానికి అవసరమైన దృఢ ఆర్థిక పునాదిని సమకూర్చలేక పోయింది.

జారుకు భూస్వామ్య ప్రభువులే ముఖ్యమైన పట్టు గొమ్మలు. పెద్దపెద్ద బ్లాక్ హండ్రడ్ భూస్వాములు పెద్ద పెట్టుబడిదార్లతో కలసి దేశంలోనూ, ప్రభుత్వ మ్యామా లోనూ పెత్తనం చెలాయిస్తున్నారు. వారు జారుప్రభుత్వ స్వదేశ, విదేశ రాజ్యాంగనీతిని పూర్తిగా బలపరచారు. కొత్తమార్కె ట్లనూ, కొత్త ప్రదేశాలనూ వశపరచుకోడానికీ, మరో ప్రక్క రైతుల, కార్మికులవిప్లవోద్యమాన్ని అణచివేయడానికీ, ముష్టి ఘాతం జారుప్రభుత్వమని సామ్రాజ్యవాద పెట్టుబడిదారీవర్గం ఆశపెట్టుకొంది.

లిబరల్ బూర్జువాపార్టీ అయిన శాసనబద్ధ ప్రజాతంత్ర పార్టీ, ప్రభుత్వానికి వ్యతిరేకతను చూపినట్లు నాటకమాడింది. కాని, జారుప్రభుత్వ విదేశాంగ విధానాన్ని ఎట్టి మినహాయిం పులూ లేకుండా బలపరచింది.

సామ్రాజ్యవాద దోపిడీ స్వభావం యుద్ధానికి కలదనే విషయాన్ని మభ్యపెట్టి ప్రజలను మోసగించుచున్న పెట్టుబడి దారులను, యుద్ధం ప్రారంభమైన మర్నాటి నుండి కూడా పెటీబూర్జువా పార్టీలైన సోషలిస్టు - రివల్యూషనరీలూ, మెన్షివిక్కులూ, సోషలిస్టు జెండాను ఒక తెరగా ఉపయో గించుకొని సహాయపడ్డారు. "ప్రష్యన్ (జర్మన్) రాక్షసుల నుండి" పెట్టుబడిదారుల "మాతృభూమి" ని కాపాడిరక్షించ వలసిన ఆవశ్యకతను గురించి వారు బోధించారు. "ప్రజలు

శాంతంగా వుండాలి" (సివిల్ పీస్) అనే విధానాన్ని కూడా వారు బలపరిచారు. "రష్యన్ రాక్షసుల" పైన యుద్ధం చేయడానికి జర్మన్ కెయిజర్ ప్రభుత్వానికి జర్మన్ సోషల్-డెమాక్రట్లు సహాయపడట్టుగానే, రష్యన్ చక్రవర్తి జారుకు యుద్ధం సాగించుటలో పై పార్టీలు ఆ విధంగా సహాయపడ్డాయి.

బోల్షివిక్ పార్టీ ఒక్కటే విప్లవ అంతర్జాతీయత అనే మహా ఆశయానికి విశ్వాసవంతంగా ప్రవర్తించింది. సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా, పెట్టుబడిదారులకూ భూస్వాములకూ వ్యతిరేకంగా, జారు నిరంకుశప్రభుత్వానికి వ్యతిరేకంగా, మొక్కవోని పోరాటాన్ని సాగించాలనే మార్క్సిస్టు సిద్ధాంతానికి బోల్షివిక్ పార్టీ ఒక్కటే దృఢంగా అంటిపెట్టుకొనివుంది. ఈ యుద్ధం తమ దేశాన్ని రక్షించుకోడానికి సాగించిన యుద్ధం కాదు. పెట్టుబడిదారుల, భూస్వాముల ప్రయోజనాలకోసం, విదేశాలను వశంచేసుకోడానికీ, విదేశాలను దోపిడీచేసి పంచుకోడానికీ ఈ యుద్ధం సాగింపబడుతోందని, యుద్ధం ప్రారంభమైన మొదటినుండీ బోల్షివిక్ పార్టీ చెపుతూ వచ్చింది. ఈ యుద్ధంపై దృఢసంకల్పంతో పోరాటాన్ని సాగించాలని బోల్షివిక్ పార్టీ కార్మికులను కోరింది.

కార్మికవర్గం బోల్షివిక్ పార్టీని బలపరచింది. యుద్ధ ప్రారంభదినాల్లో మేధావులూ, రైతాంగంలోని కులక్‌లూ (ధనిక రైతులు) ప్రదర్శించిన పెట్టుబడిదారీ జాతీయ దురహంకార వ్యాధి, కార్మికులలో కొంత భాగానికికూడా సోకింది. కాని వీరు ముఖ్యంగా "రష్యన్ ప్రజాసంఘం" (లీగ్ ఆఫ్ ది రష్యన్ పీపుల్) అనే పేరుతో వున్న రౌడీసంఘంలోని సభ్యులు.

ఇంకా సోషలిస్టు రివల్యూషనరీల, మెన్షివిక్కుల పలుకు బడి క్రిందవున్న కొందరు కార్మికులుకూడా దీనిలో వున్నారు. కాని వీరు సహజంగానే కార్మికవర్గ మనోభావాలను ప్రతిబింబించలేదు. ప్రతి ప్రభుత్వం సృష్టించిన పెట్టుబడిదారీ జాతీయ దురహంకార ప్రదర్శనాలలో యిలాంటి వ్యక్తులు పాల్గొన్నారు.

# 2

రెండవ ఇంటర్నేషనల్ కు చెందిన పార్టీలు తమ తమసామ్రాజ్యవాద ప్రభుత్వాలను బలపరచుట - రెండవ ఇంటర్నేషనల్ సోషల్- చావనిస్ట్ (జాతీయ దురహంకార) పార్టీలుగా విడివడి పతనమగుట

రెండవ ఇంటర్నేషనల్ అవకాశవాదం గురించి, దాని నాయకుల ఊగిసలాట గురించి పదే పదే లెనిన్ హెచ్చరించాడు. రెండవ ఇంటర్నేషనల్ నాయకులు తాము యుద్ధానికి వ్యతిరేకులమని మాట్లాడుతున్నప్పటికీ, వాస్తవంగా యుద్ధమే ప్రారంభమైతే వారు తమ వైఖరిని మార్చుకొని సామ్రాజ్యవాద పెట్టుబడిదారుల పక్షానికి పోతారనీ, యుద్ధాన్ని బలపరుస్తారనీ, లెనిన్ ఎప్పుడూ నొక్కి చెబుతూవుండేవాడు. లెనిన్ ముందుగా చెప్పినది యుద్ధం ప్రారంభమైన మొదటి రోజుల్లోనే రుజువైంది.

కాంగ్రెస్‌లో శాసనసభలలోని సోషలిస్టులు యుద్ధ ఋణాలకు వ్యతిరేకంగా వోటు చేయాలని 1910 లో కోపెన్ హేగన్ (డెన్మార్కు) లో జరిగిన రెండవ ఇంటర్నేషనల్ నిర్ణయించింది. 1912 లో బాల్కన్ యుద్ధం జరుగుతోంది. ఆ సమయంలో రెండవ ఇంటర్నేషనల్ ప్రపంచ కాంగ్రెస్ బాస్లేలో (Basle) జరిగింది. పెట్టుబడిదారుల లాభాలను వృద్ధిచేయడంకోసం, ఒకరిపై ఒకరు తుపాకులు పేల్చి చంపుకొనటం నేరమని, అన్ని దేశాల కార్మికులూ భావిస్తున్నారని ఈ కాంగ్రెస్ ప్రకటించింది. ఇదీ వారు చెప్పినది. ఇదీ వారు తమ తీర్మానాల్లో ప్రకటించినది.

కాని తుఫాను చెలరేగగానే, సామ్రాజ్యవాదయుద్ధం ప్రారంభంకాగానే, యీ నిర్ణయాలను ఆచరణలో పెట్టవలసిన సమయం రాగానే, రెండవ ఇంటర్నేషనల్ నాయకులు విశ్వాసఘాతకులనీ, శ్రామికవర్గానికి ద్రోహం తలపెట్టారనీ, పెట్టుబడిదారులకు సేవకులనీ రుజువుచేసుకున్నారు. వారు యుద్ధాన్ని బలపరచారు.

1914 ఆగష్టు 4వ తేదీన జర్మన్ - డెమాక్రట్సు తమ శాసనసభలో యుద్ధఋణాలకు అనుకూలంగా వోటుచేశారు. సామ్రాజ్యవాద యుద్ధానికి అనుకూలంగా వోటుచేశారు. ఫ్రాన్సు, బ్రిటన్, బెల్జియం మొదలగు దేశాలలోని సోషలిస్టులలో అత్యధిక సంఖ్యాకులు అలాగే వోటుచేశారు. రెండవ ఇంటర్నేషనల్ ఉనికి నశించింది. ఒకరిపై ఒకరు యుద్ధం చేసుకొనే ప్రత్యేక సోషల్ - ఛావనిస్ట్ (జాతీయ దురహంకార) పార్టీలుగా అది చీలిపోయింది.

సోషలిస్టుపార్టీల నాయకులు శ్రామికవర్గానికి ద్రోహం చేశారు. సోషల్ - చావనిజం (జాతీయ దురహంకార) సిద్ధాంతాన్ని అవలంబించారు. సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వర్గాన్ని సంరక్షించేస్థితికి వచ్చారు. జాతీయత అనే విషంతో కార్మికవర్గాన్ని విషపూరితం చేయటానికీ, కార్మికవర్గానికి కండ్లు కప్పడానికీ, సామ్రాజ్యవాదప్రభుత్వాలకు వారుసహాయపడ్డారు. మాతృదేశ సంరక్షణ అనే సాకుతో ఈ సామాజిక ద్రోహులు ఫ్రెంచి కార్మికులకు వ్యతిరేకంగా జర్మన్ కార్మికులనూ, జర్మన్ కార్మికులకు వ్యతిరేకంగా బ్రిటిష్, ఫ్రెంచి కార్మికులనూ రెచ్చగొట్టసాగారు. రెండవ ఇంటర్నేషనల్‌లోని అప్రాముఖ్యమైన మైనారిటీమాత్రం అంతర్జాతీయతా సిద్ధాంతానికి కట్టుబటి ఏటికి ఎదురీదారు. వారు తగినంత ఆత్మవిశ్వాసంతోనూ, తగినంత దృఢనిశ్చయంతోనూ వారలా చేయని మాట నిజమే. కాని వారు ఏటికి ఎదురీదారన్న విషయం గమనించాలి.

బోల్షివిక్‌పార్టీ ఒక్కటియే వెనువెంటనే ఎట్టి సంకోచం లేకుండా సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా నిశ్చిత పోరాటాన్ని సాగించాలనే నినాదం లేవదీసింది. 1914 ఆకురాలు కాలంలో యుద్ధంపైన లెనిన్ వ్రాసిన సిద్ధాంత ప్రతిపాదన (Thesis) లో రెండవ ఇంటర్నేషనల్ పతనం యాదృచ్ఛికంకాదని నిరూపించాడు. రెండవ ఇంటర్నేషనల్ అవకాశవాదులవల్ల నాశనంచేయబడింది. విప్లవ శ్రామికవర్గ ప్రతినిధులు ఎన్నాళ్ళనుండో యీ అవకాశవాదుల గురించి హెచ్చరిస్తూనే వచ్చారు.

యుద్ధానికి పూర్వమే రెండవ ఇంటర్నేషనల్ పార్టీలను అవకాశవాద జాడ్యం అంటుకొంది. అవకాశవాదులు బహిరంగంగా విప్లవపోరాటాన్ని పరిత్యజించాలని బోధించారు. "పెట్టుబడిదారీ విధానం సోషలిజంలోకి శాంతియుతంగా పెంపొందుతుంది" అనే సిద్ధాంతాన్ని వారు బోధించారు. రెండవ ఇంటర్నేషనల్ ఆ అవకాశవాదాన్ని ఎదిరించి పోరాడ దలచలేదు. అవకాశవాదంతో సామరస్యంగా వుండాలని చూసింది. ఆవిధంగా అవకాశవాదానికి దృఢమైన స్థానం లభించేటట్లు చేసింది. అవకాశవాదంతో సమాధాన మార్గాన్ని అవలంబించుతూ రెండవ ఇంటర్నేషనల్ తానే అవకాశవాదియై కూర్చుంది.

సామ్రాజ్యవాద పెట్టుబడిదారీవర్గం, నైపుణ్యంగల కార్మికులలోని పై తరగతికి – ఉన్నత తరగతి కార్మికులనబడే – వారికి (Labour aristocracy)-ఎక్కువ జీతాలద్వారానూ, ఇన్ని ఎంగిలి మెతుకులు పారవేయుటద్వారానూ నిరంతర లంచాలు మేపుతూవుండేది. వెనకబడ్డ దేశాలను, వలసదేశాలను దోపిడిచేయుటవల్ల సంపాదించినలాభాలనుండి, కొంత భాగాన్ని యిందుకు ఉపయోగించేవారు. ఈ రకం కార్మికులు అనేక మంది కార్మికసంఘ, సహకారసంఘ నాయకులనూ, మ్యునిసిపల్ మెంబర్లనూ, పార్లమెంటరీ సంస్థల సభ్యులనూ, పత్రికా విలేఖరులనూ, సోషల్ డెమాక్రటిక్ సంస్థలలో పనిచేసే కార్యకర్తలనూ సృష్టించారు. యుద్ధం ప్రారంభంకాగానే వీరు తమ పదవులు పోతాయనే భయంతో విప్లవానికి శత్రువులయ్యారు తమ పెట్టుబడిదారులనూ, తమ సామ్రాజ్యవాద ప్రభుత్వాలనూ సంపూర్ణంగా సమర్థించేవా రయ్యారు.

అవకాశవాదులు జాతీయ దురహంకారులుగా కూడా (సోషల్ - చావనిస్ట్) అయ్యారు.

జాతీయ దురహంకారులూ, రష్యన్ మెన్షివిక్కులూ సోషలిస్టు - రివల్యూషనరీలూ, స్వదేశంలో కార్మికులకూ, పెట్టుబడిదారులకూ వర్గ శాంతి కావాలనీ, ఇతరదేశాలపైన యుద్ధం చేయాలనీ బోధించారు. యుద్ధానికి నిజంగా ఎవరు బాధ్యులన్న విషయాన్ని గురించి చెప్పకుండా కప్పిపుచ్చి, ప్రజాసామాన్యాన్ని మోసపుచ్చారు. యుద్ధానికి బాధ్యత తమదేశపు పెట్టుబడిదారులదిమాత్రంకాదని ప్రకటించిప్రజలను మోసగించారు. అనేకమంది జాతీయ దురహంకారులు తమ దేశాలలో సామ్రాజ్యవాద ప్రభుత్వాల మంత్రులయ్యారు.

రహస్య జాతీయ దురహంకారులు, సెంట్రిస్టులని పిలవ బడేవారు శ్రామికవర్గ ఆశయానికి ఏమీ తక్కువ ప్రమాద కారులు కాదు. కాట్స్కీ, ట్రాట్స్కీ, మార్టోవ్ మొదలుగా గల సెంట్రిస్టులు బాహాటమైన జాతీయదురహంకారులను సమ ర్థించి, వారి కొమ్ము కాశారు. ఆవిధంగా శ్రామికవర్గానికి ద్రోహంచేయుటలో జాతీయ దురహంకారులతో కలిశారు. యుద్ధాన్ని ఎదిరించే "అతివాద" పదజాలంతో తమ ద్రోహా నికి ముసుగు వేశారు. ఇది కార్మికవర్గాన్ని మోసంచేయడానికి ఉద్దేశింపబడింది. వాస్తవానికి సెంట్రిస్టులు యుద్ధాన్ని బల పర్చారు. ఎందువల్లనంటే, యుద్ధబుణాలను వ్యతిరేకంగా వోటుచేయుటగాక ఆవిషయమై వోటు తీసుకొనే టప్పుడు తటస్థంగా వుండాలని వారి ప్రతిపాదన. దీని అర్థం యుద్ధాన్ని బలపరచడమే. జాతీయ దురహంకారుల లాగానే వీరుకూడా

యుద్ధం చేస్తున్న తమతమ ప్రత్యేక సామ్రాజ్యవాద ప్రభుత్వాలను కుంటుపరచకుండేందుకుగాను యుద్ధకాలంలో వర్గ పోరాటాల్ని పరిత్యజించాలని కోరారు. యుద్ధానికీ, సోషలిజానికీ సంబంధించిన ప్రధాన సమస్యలపైన సెంట్రిస్టు అయిన ట్రాట్స్కీ, లెనిన్‌నూ, బోల్షివిక్ పార్టీని వ్యతిరేకించాడు.

యుద్ధం ప్రారంభం అయిన నాటినుండే లెనిన్ కొత్త ఇంటర్నేషనల్‌ను- మూడో ఇంటర్నేషనల్‌ను ఏర్పరచడానికి సర్వశక్తులను సమకూర్చ ప్రారంభించాడు. 1914 నవంబరులో బోల్షివిక్ పార్టీ సెంట్రల్ కమిటీ యుద్ధవ్యతిరేక ప్రణాళికను ప్రకటించింది. అవమానకరమైన దివాళాకోరుతనం ప్రదర్శించిన రెండవ ఇంటర్నేషనల్ స్థానే మూడవ ఇంటర్నేషనల్‌ను ఏర్పరచాలని అప్పటికే అది పిలుపునిచ్చింది.

మిత్రమండలి (Entente) దేశాల సోషలిస్టులసభ 1915 ఫిబ్రవరిలో లండన్‌లో జరిగింది. ఈసభలో లెనిన్ సూచనల ననుసరించి కామ్రేడ్ లిట్వినావ్ మాట్లాడాడు. బెల్జియం, ఫ్రాన్సు, బూర్జువా ప్రభుత్వాలనుండి సోషలిస్టులు (వాండర్వెల్డీ, శంబాట్, గ్వెస్డే) రాజీనామా పెట్టాలనీ, సామ్రాజ్యవాదులతో పూర్తిగా తెగతెంపులు చేసుకోవాలనీ, వారితో సహకారం చేయరాదనీ లిట్వినావ్ కోరాడు. సోషలిస్టులందరూ తమతమ సామ్రాజ్యవాద ప్రభుత్వాలపై నిశ్చిత పోరాటాన్ని సాగించాలనీ, యుద్ధఋణాలకు వోటు చేయుటను ఖండించాలనీ, లిట్వినావ్ కోరాడు. కాని లిట్వినావ్‌ను బలపరుస్తూ యీసభలో ఒక్క గొంతుకైనా పెగలలేదు.

1915 సెప్టెంబరు ప్రారంభంలో అంతర్జాతీయవాదుల (ఇంటర్నేషనలిస్టుల) మొదటి సభ జిమ్మర్‌వాల్డ్‌లో జరిగింది. యుద్ధానికి వ్యతిరేకంగా అంతర్జాతీయ ఉద్యమాన్ని అభివృద్ధి చేయుటలో ఈ సభ "మొదటి మెట్టని" లెనిన్ అన్నాడు. ఈ సభలో లెనిన్ జిమ్మర్‌వాల్డ్ అతివాద ముఠాను (గ్రూపు) ఏర్పరచాడు. జిమ్మర్‌వాల్డ్ అతివాదముఠాలో లెనిన్ ఆధ్వర్యాన బోల్షివిక్ పార్టీ ఒక్కటే యుద్ధానికి వ్యతిరేకంగా సరియైన, పూర్తిగా సక్రమమైన పంథాను తీసుకొంది. జిమ్మర్‌వాల్డ్ అతివాదముఠా జర్మన్ భాషలో ఒక పత్రికను ప్రకటించింది. దానిపేరు వార్బోట్ (Vorbote - హెరాల్డ్) దీనికి లెనిన్ వ్యాసాలు వ్రాస్తూవుండేవాడు.

1916 స్విట్జర్‌లాండ్‌లోని కీన్‌థాల్ (Kienthal) అనే గ్రామంలో అంతర్జాతీయ వాదులు, రెండవ సభను ఏర్పరచగల్గారు. దీనినే రెండవ జిమ్మర్‌వాల్డ్ సభ అంటారు. ఈ సమయానికి దాదాపు ప్రతి దేశంలోనూ అంతర్జాతీయవాదుల ముఠాలు ఏర్పడ్డాయి.

అంతర్జాతీయ వ్యక్తులకూ, జాతీయ దురహంకారులకూ మధ్య అఘాతం మరింతస్పష్టంగా బయటపడింది. అన్నిటికన్నా ముఖ్యమైన విషయమేమంటే యీా సమయానికి యుద్ధం మూలానా, యుద్ధఫలితంగా కలిగిన దురవస్థలవల్లా, ప్రజా సామాన్యం తనంతకు తానే అతివాదులవైపుకు మొగ్గింది. కీన్‌థాల్ సభ ప్రకటించిన ప్రణాళిక పరస్పర విరుద్ధమైన వివిధ ముఠాలు అంగీకరించిన ప్రణాళిక. జిమ్మర్‌వాల్డ్ ప్రణాళికకంటే ఇది ముందడుగు.

కాని జిమ్మర్ వాల్డ్ సభలాగానే కీన్ థాల్ సభ కూడా బోల్షివిక్ పాలసీయొక్క ప్రధాన సూత్రాలను అనగా - సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చుటా, యుద్ధంలో తమతమ సామ్రాజ్యవాద ప్రభుత్వాలను ఓడించుటా, మూడవ ఇంటర్నేషనల్‌ను ఏర్పరచుటా - మొదలగు ముఖ్యసూత్రాలను అంగీకరించలేదు. అయినప్పటికీ కీన్ థాల్ సభ అంతర్జాతీయ వ్యక్తులను స్పష్టీకరించుటలో సహాయపడింది. తర్వాత వీరితోనే మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏర్పడింది.

అతివాద సోషల్ డెమాక్రట్లలోని నిలకడలేని అంతర్జాతీయవాదులయిన రోజా లగ్జెంబర్గ్, కారల్ లీబ్‌నిక్‌ల తప్పులను లెనిన్ విమర్శించాడు. కాని అదే సమయంలో వారు సరియైన పంథా అవలంబించేటట్లు సహాయపడ్డాడు.

## 3

### యుద్ధమూ - శాంతి - విప్లవం అనే సమస్యలపైన బోల్షివిక్ పార్టీ సిద్ధాంతమూ, ఎత్తుగడలు

శాంతికోసం నిట్టూర్పు విడుస్తూ ప్రచారానికి మాత్రమేకట్టుబడిన వుత్తశాంతివాదులు(పాసిఫిస్ట్స్)కాదు బోల్షివిక్కులు. అతివాద సోషల్ డెమాక్రట్లలో అధికసంఖ్యాకులు శాంతివాదుల లాగానే ప్రచారం చేశారు. శాంతికావాలంటే,

యుద్ధోన్మాదులైన సామ్రాజ్యవాద పెట్టుబడిదారుల పరిపాలనను కూలద్రోసేవరకు ఉత్సాహవంతమైన విప్లవపోరాటాన్ని సాగించాలని బోల్షివిక్కులు బోధించారు. యుద్ధాన్ని అంత మొందించే ఖచ్చితమైన మార్గం, దురాక్రమణలుగానీ, నష్టపరిహారాలుగానీ లేనటువంటి న్యాయమైన శాంతిని పొందటానికి ఖచ్చితమైన మార్గం, సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ పరిపాలనను కూలద్రోయుటే అని బోల్షివిక్కులు తెలియచేశారు. ఈ విధంగా శ్రామికవర్గ విప్లవ విజయఆశయంతో బోల్షివిక్కులు శాంతి ఆశయాన్ని మేళవించారు.

మెన్షివిక్కులూ, సోషలిస్టు - రివల్యూషనరీలూ విప్లవాన్ని పరిత్యజించి, యుద్ధకాలంలో "పౌరశాంతి"ని కాపాడాలని ద్రోహకరమైన నినాదం ఇచ్చారు. దీన్ని వ్యతిరేకించుతూ, బోల్షివిక్కులు "సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చాలి" అనే నినాదాన్ని ఇచ్చారు. ఈ నినాదానికి అర్థం ఇది: సైనిక దుస్తులతోవున్న సాయుధ కార్మికుల, రైతులతో సహా కష్టపడే ప్రజలంతా, తాము యుద్ధాన్ని అంతమొందించి, న్యాయమైన శాంతిని సాధించదలచితే, తమ పెట్టుబడిదారీ వర్గంపై ఆయుధాలను తిప్పాలి. దాని పరిపాలనను కూలద్రోయాలి.

పెట్టుబడిదారీ మాతృభూమిని సంరక్షించాలనే సోషలిస్టు - రివల్యూషనరీల, మెన్షివిక్కుల విధానానికి వ్యతిరేకంగా "సామ్రాజ్యవాద యుద్ధంలో తమ తమ ప్రభుత్వాలను తాము ఓడించాలి" అనే విధానాన్ని బోల్షివిక్కులు ప్రచారంచేశారు. దీని అర్థం: యుద్ధఋణాలకు వ్యతిరేకంగా వోటుచేయడం,

సైన్యాలలో రహస్య విప్లవసంస్థలను ఏర్పరచడం, యుద్ధ రంగంలో సైనికులమధ్య సౌభ్రాతృత్వాన్ని బలపరచడం, యుద్ధ వ్యతిరేకంగా కార్మికకర్షకుల విప్లవపోరాటాలను సంఘటిత పరచడం, ఈ పోరాటాలను తమ తమ సామ్రాజ్యవాద ప్రభుత్వాలపై తిరుగుబాటుగా మార్చడం.

సామ్రాజ్యవాద యుద్ధంలో జారుప్రభుత్వం సైనికంగా గెలవడంకంటె ఓడిపోవడం ప్రజలకు తక్కువహానికరమని బోల్షివిక్కు లన్నారు. ఇది జారుప్రభుత్వంపై ప్రజల విజయాన్ని సులభపరుస్తుంది. సామ్రాజ్యవాద యుద్ధాలనుండి, పెట్టుబడిదారీ బానిసత్వంనుండి విముక్తిపొందడానికి కార్మిక వర్గం చేసే పోరాటంలో విజయాన్ని సులభపరుస్తుంది. తమ తమ సామ్రాజ్యవాద ప్రభుత్వాలను ఓడించడానికి పనిచేసే విధానం ఒక్కరష్యన్ విప్లవకారులేగాక, యుద్ధంచేస్తున్న అన్ని దేశాలలోని కార్మికవర్గ విప్లవపార్టీలూ అవలంబించాలని లెనిన్ భావించాడు.

బోల్షివిక్కులు ప్రతిరకం యుద్ధానికి వ్యతిరేకులు కారు. దురాక్రమణ యుద్ధాలకు, సామ్రాజ్యవాద యుద్ధాలకు మాత్రమే వారు వ్యతిరేకులు. యుద్ధాలలో రెండురకా లున్నాయని బోల్షివిక్ల అభిప్రాయం:

(1) ధర్మయుద్ధాలు-దురాక్రమణకుగాక స్వాతంత్ర్యం కోసం చేసే యుద్ధాలు. విదేశ దురాక్రమణనుండి తమను బానిసలుగాచేసే ప్రయత్నాలనుండి సంరక్షించుకోడానికి చేసే యుద్ధాలు. పెట్టుబడిదారీ బానిసత్వంనుండి ప్రజలను విముక్తి

చేసేయుద్ధాలు. సామ్రాజ్యవాద సంకెళ్ళనుండి వలసదేశాలను, పరాధీన దేశాలను విముక్తిచేసే యుద్ధాలు.

(బి) <u>అధర్మయుద్ధాలు</u> - దురాక్రమణ యుద్ధాలు. విదేశాలను, విదేశీయ జాతులను జయించి బానిసలుగా చేయడానికై ప్రారంభించినయుద్ధాలు.

<u>ధర్మయుద్ధాలను</u> బోల్షివిక్‌లు బలపరచారు. అధర్మయుద్ధాలకు వ్యతిరేకంగా నిశ్చితమైన పోరాటాలను సాగించాలని బోల్షివిక్కు లన్నారు. తమ తమ సామ్రాజ్యవాద ప్రభుత్వాలను కూలద్రోసేవరకూ, విప్లవం విజయవంతం అయే వరకూ ఈ పోరాటాలను సాగించాలని అన్నారు.

యుద్ధకాలంలో లెనిన్ వ్రాసిన సిద్ధాంతగ్రంథం ప్రపంచ కార్మికవర్గానికి చాలా ప్రాముఖ్యమైనది. 1916 వసంతకాలంలో లెనిన్ "పెట్టుబడిదారీ విధానంయొక్క అత్యంత ఉన్నతదశయే సామ్రాజ్యవాదం" అనే గ్రంథాన్ని వ్రాశాడు. సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానంయొక్క అత్యంత ఉన్నతదశ. ఈ దశలో "అభివృద్ధికరమైన" పెట్టుబడిదారీవిధానం, పరాన్నభుక్కుయి, (Parasitic) శిథిలమౌతున్న పెట్టుబడిదారీ విధానంగా రూపాంతరం పొందింది. సామ్రాజ్యవాదం అంటే మృత్యుశయ్యపైవున్న పెట్టుబడిదారీ విధానమే - అని లెనిన్ తన గ్రంథంలో తెలియజేశాడు. దీని అర్థం పెట్టుబడిదారీ విధానం శ్రామికవర్గవిప్లవం లేకుండానే, కుళ్ళిపోయి దానంతట కదే చనిపోతుందని కాదు. శ్రామికవర్గ విప్లవం లేకుండా పెట్టుబడిదారీ విధానాన్ని కూలద్రోయలేమని లెనిన్ నిత్యమూ బోధించుతూ వచ్చాడు. సామ్రాజ్యవాదమంటే మృత్యు

శయ్యపైవున్న పెట్టుబడిదారీవిధానమని నిర్వచించుతూనే లెనిన్ మరొకప్రక్క యిలాఅన్నాడు: "శ్రామికవర్గ సామాజిక విప్లవమనే ప్రభాతానికి ముందలి రాత్రియే సామ్రాజ్యవాదం" (Imperialism is the eve of social revolution of the Proletariat).

లెనిన్ ఇంకా ఇలా తెలియజేశాడు: సామ్రాజ్యవాద శకంలో భారమైన పెట్టుబడిదారీ విధానం అంతకంతకూ నిరంకుశంగా మారుతుంది. సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ విధాన పునాదులకు వ్యతిరేకంగా, శ్రామికవర్గ తిరుగుబాటు పెంపొందుతుంది. పెట్టుబడిదారీ దేశాలలో విప్లవాంశాలు పోగవుతాయి.

సామ్రాజ్యవాద శకంలో వలసదేశాలలోను, పరాధీన దేశాలలోను, విప్లవ సంక్షోభం మరింత నిశితమవుతుంది; సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా విప్లవాంశాలు, సామ్రాజ్యవాదంనుండి విమోచన యుద్ధం చేసే అంశాలు మరింత ప్రోగవుతాయని లెనిన్ తెలియజేశాడు.

లెనిన్ ఇంకా ఇలా తెలియజేశాడు: సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ విధానాభివృద్ధి యొక్క అసమానతా, వైరుధ్యాలూ, ప్రత్యేకంగా తీవ్రమయ్యాయి. మార్కెట్లకోసం, పెట్టుబడిని ఎగుమతి చేయడానికి కావలసిన క్షేత్రాలకోసం పోరాటాలు జరుగుతాయి. ముడివస్తువులకు మూలాధారమయిన వలసదేశాలకోసం పోరాటాలు జరుగుతాయి. ఇందువల్ల పదేపదే ప్రపంచాన్ని తిరిగి పంచుకోవాలని చేసే సామ్రాజ్యవాద యుద్ధాలు అనివార్యమౌతాయి.

పెట్టుబడిదారీ విధానాభివృద్ధియొక్క ఈ అసమానతయే సామ్రాజ్యవాద యుద్ధాలకు దారి తీస్తుంది. ఈ యుద్ధాలు సామ్రాజ్యవాద బలాన్ని కూలద్రోస్తాయి. తద్వారా సామ్రాజ్యవాద రంగాన్ని దాని అత్యంత బలహీన ప్రదేశంలో బద్దలుకొట్టడం సాధ్యమయ్యేటట్లు ఈ యుద్ధాలు చేస్తాయి - అని లెనిన్ తెలియజేశాడు.

వీటన్నింటినుండి లెనిన్ తేల్చిన పర్యవసానం ఇది: సామ్రాజ్యవాద రంగాన్ని ఒకచోట లేక అనేకచోట్ల శ్రామిక వర్గం బద్దలుచేయడం సాధ్యమౌతుంది. మొదట అనేక దేశాలలో, లేక విడిగా ఒక దేశంలోనైనా, సోషలిజం విజయం పొందడం సాధ్యమౌతుంది. పెట్టుబడిదారీ విధానాభివృద్ధిలో అసమానతమూలంగా అన్ని దేశాల్లోనూ ఒకేసారి విజయం పొందడం అసాధ్యమౌతుంది. మొట్టమొదట ఒకదేశంలోగానీ లేక అనేక దేశాలలోగానీ సోషలిజం జయం పొందుతుంది. తక్కిన దేశాలు ఇంకా కొన్నాళ్లు పెట్టుబడిదారీ దేశాలు గానే వుండిపోతాయి.

సామ్రాజ్యవాద యుద్ధకాలంలో వ్రాసిన రెండువ్యాసాలలో లెనిన్ ఈ క్రింది విధంగా సూత్రీకరించాడు. ఇందులో తేల్చిన పర్యవసానం అతని అద్భుతమేధాశక్తిని తెలియజేస్తుంది.

(1) "ఆర్థిక రాజకీయాభివృద్ధిలో అసమానత పెట్టుబడిదారీ విధానంయొక్క ముఖ్యమైన సూత్రం. కాబట్టి మొట్టమొదట అనేక పెట్టుబడిదారీ దేశాలలోగానీ, విడిగా ఒక పెట్టుబడిదారీ దేశంలోగానీ సోషలిజం విజయంపొందడం సాధ్యమౌతుంది. విజయవంతమైన శ్రామికవర్గం ఆ దేశంలో పెట్టుబడి

దార్ల ఆస్తిని స్వాధీనపరచుకొని సొంతంగా సోషలిస్టు ఉత్పత్తిని సంఘటితపరుస్తుంది. తక్కిన ప్రపంచానికి, పెట్టుబడిదారీ ప్రపంచానికి వ్యతిరేకంగా నిలబడి ఇతర దేశాలలోని పీడిత వర్గాలను తన ఆశయంకోసం ఆకర్షించుతుంది...." (1915 ఆగస్టులో వ్రాసిన "యూరప్ సంయుక్త రాష్ట్రాల నినాదం" అనే వ్యాసంనుండి - లెనిన్ - సెలెక్టెడ్ వర్క్సు, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947, 1వ వాల్యూమ్ 619 వ పేజీ.)

(2) "వివిధ దేశాలలో పెట్టుబడిదారీ విధానాభివృద్ధి ఎంతో అసమానంగా కొనసాగుతుంది. సరుకుల ఉత్పత్తి విధానంక్రింద (Commodity Production System) అది మరో విధంగా ఉండజాలదు. ఒకే సారి అన్ని దేశాలలో సోషలిజం సాధించలేమన్న విషయం ఇందువల్ల నిర్వివాదమని తేలింది. ఒకటి లేక అనేక దేశాలలో మొట్టమొదట సోషలిజం విజయం సాధించుతుంది. తక్కిన దేశాలు పెట్టుబడిదారీ దేశాలుగా గానీ, లేక దాని పూర్వపు విధానంగల దేశాలుగాగానీ కొంతకాలం వుండిపోతాయి. ఇది సంఘర్షణను తెచ్చిపెడుతుంది. అంతేగాదు. ఇతరదేశాలలోని పెట్టుబడిదారీ వర్గాలు, విజయంపొందిన సోషలిస్టు ప్రభుత్వశ్రామికవర్గాన్ని అణచివేయడానికి ప్రత్యక్షంగా ప్రయత్నిస్తాయి. అలాంటి సమయాల్లో మనంచేసే యుద్ధం న్యాయమైన ధర్మయుద్ధం. పెట్టుబడిదారీ వర్గంనుండి ఇతరదేశాలను విమోచనంచేసే యుద్ధం. సోషలిజం కోసం పోరాడేయుద్ధం." (1916 ఆకురాలుకాలంలో వ్రాసిన "శ్రామికవర్గ విప్లవ యుద్ధకార్యక్రమం" అనే వ్యాసంనుండి. లెనిన్ కలెక్టెడ్‌వర్క్సు, రష్యన్ ఎడిషన్, 19వ వాల్యూమ్. 325 వ పేజీ)

ఇది సోషలిస్టు విప్లవాన్ని గురించి సమగ్రమైన కొత్త సిద్ధాంతం. వివిధదేశాలలో వేర్వేరుగా సోషలిజం విజయం పొందడం సాధ్యమని నొక్కిచెప్పే సిద్ధాంతం. ఈ విజయాని కవసరమైన పరిస్థితులను, దీని భవిష్యదవకాశాలను తెలియ జేసేటటువంటి సిద్ధాంతం ఇది. "ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమాక్రసీ అవలంబించవలసిన రెండు ఎత్తుగడలు" (Two Tactics) అనే కరపత్రంలో, ఎన్నడో 1905 లోనే, లెనిన్ ఈ సిద్ధాంతపు ప్రాథమిక సూత్రాలను చూచాయగా వ్రాశాడు. పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద దశకు రాకపూర్వం మార్క్సిస్టులలో వ్యాప్తిచెందివున్న దృక్పథానికీ, ఈ సిద్ధాంతానికీ ప్రధానంగా భేదంవుంది. విడిగా ఒకదేశంలో సోషలిజం విజయంపొందుట అసాధ్యమనీ, అన్ని నాగరిక దేశాలలో ఒకేసారి సోషలిజం వస్తుందనీ, ఆకాలపు మార్క్సిస్టుల అభిప్రాయం. "పెట్టుబడిదారీ విధానంయొక్క అత్యంత ఉన్నతదశయే సామ్రాజ్యవాదం" అనే తన ప్రఖ్యాత గ్రంథంలో, సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ విధానానికి సంబంధించిన సమాచారాన్ని ఆధారంచేసుకొని, లెనిన్ పైనచెప్పిన దృక్పథం బూజుపట్టినదని త్రోసిపారవేశాడు. దానిస్థానే మరొక కొత్త సిద్ధాంతాన్ని నెలకొల్పాడు. దీని ననుసరించి అన్ని పెట్టుబడిదారీ దేశాలలోనూ ఒకేసారి సోషలిజం విజయం పొందడం అసాధ్యం. విడిగా ఒక్కొక పెట్టుబడిదారీ దేశంలో సోషలిజం జయించడం సాధ్యం.

సోషలిస్టు విప్లవాన్ని గురించి లెనిన్ సిద్ధాంతం అమూల్య ప్రాముఖ్యత ఈ క్రింది విషయాలలో గోచరిస్తుంది.

లెనిన్ సిద్ధాంతం మార్క్సిజాన్ని ఒక క్రొత్త సిద్ధాంతంతో సంపన్నం చేసింది. మార్క్సిజాన్ని పురోగమింప జేసింది. ఇంతే గాక అది వివిధదేశాల శ్రామికులకు విప్లవ భవిష్యదవకాశా లను కన్నులయెదుట పెట్టింది. తమతమ దేశాల జాతీయ పెట్టు బడిదారులపై చేసే దోపిడిలో వారి చౌరవను సంకెళ్ళనుండి విడిపించుతుంది. యుద్ధపరిస్థితిని అదనుగా తీసుకొని, పెట్టుబడి దారులపై దాడిని సంఘటితపరచమని వారికి బోధించుతుంది. శ్రామికవర్గ విప్లవ విజయంలో వారికి విశ్వాసాన్ని బల పరుస్తుంది.

యుద్ధమూ – శాంతి – విప్లవమూ – అనే సమస్యల పైన బోల్షివిక్కుల సిద్ధాంతం ఎత్తుగడలూ అవి.

ఈ దృక్పథాన్ని ఆధారంగా తీసుకొని బోల్షివిక్కులు రష్యాలో తమ ప్రత్యక్ష కార్యకలాపాలను కొనసాగించారు.

యుద్ధప్రారంభంలో పోలీసు నిర్బంధ విధానం తీవ్రంగా ఉన్నప్పటికీ డ్యూమాలోని బోల్షివిక్ సభ్యులు బాడయవ్, పెట్రొవ్‌స్కీ, మొరనావ్, శామొయిలావ్, షాగోవ్‌లు అనేక సంస్థలను సందర్శించారు. యుద్ధ-విప్లవాలపట్ల బోల్షివిక్ విధానాన్ని విశదపరుస్తూ ఉపన్యసించారు. 1914 నవంబరులో ప్రభుత్వ డ్యూమాలోని బోల్షివిక్‌ముఠా యుద్ధంపట్ల అవలం బించవలసిన విధానాన్నిగురించి చర్చించడానికి ఒక సమా వేశాన్ని జరిపింది. ఈ సమావేశం జరిగిన మూడవరోజున హాజరైన వారందరూ అరెస్టుచేయబడ్డారు. ప్రభుత్వ డ్యూమా లోని బోల్షివిక్ సభ్యులను కోర్టుశిక్షించింది. వారి పౌరహక్కు

లను తీసివేసి తూర్పుసైబీరియాకు ప్రవాసం పంపింది. జారు ప్రభుత్వం "రాజద్రోహ" నేరం వారిపై మోపింది.

కోర్టులో డ్యూమాసభ్యుల చర్యలు మనపార్టీకి ప్రతిష్టను తెచ్చాయి. బోల్షివిక్ ప్రతినిధులు జార్ప్రభుత్వ కోర్టును ఉపన్యాసవేదికగామార్చి దాని దురాక్రమణ విధానాన్ని బట్టబయలుచేసి ధీరులుగా ప్రవర్తించారు.

కాని ఇదే కేసులో విచారించబడిన కామెనివ్ ప్రవర్తన పూర్తిగా వేరుగావుంది. పిరికితనంవల్ల అతడు అపాయం కంటికి కనపడగానే బోల్షివిక్పార్టీ విధానాన్ని ప్రమాణపూర్వకంగా విసర్జించాడు. బోల్షివిక్కులతో యుద్ధసమస్యపై తాను ఏకీభవించడంలేదని కామెనివ్ కోర్టులో తెలియజేశాడు. ఇది రుజువు పరచడానికి మెన్షివిక్ బోర్డన్స్కీని సాక్షిగా పిలిపించమని కోరాడు.

యుద్ధావసరాలను తీర్చడానికి నియమించబడిన "యుద్ధపరిశ్రమ కమిటీల"కు వ్యతిరేకంగా బోల్షివిక్లు చాల చక్కగా పనిచేశారు. సామ్రాజ్యవాద పెట్టుబడిదారీవర్గ పలుకుబడిలోకి కార్మికులను తీసుకురావాలని మెన్షివిక్లు చేసిన ప్రయత్నాలను వ్యతిరేకంగా వారు చక్కగా పనిచేశారు. సామ్రాజ్యవాదయుద్ధం ప్రజాయుద్ధమని ప్రతివ్యక్తినీ నమ్మించడం పెట్టుబడిదారీ వర్గానికి అత్యంత ప్రయోజనకరం. యుద్ధకాలంలో ప్రభుత్వ వ్యవహారాలలో తగినంత పలుకుబడిని పెట్టుబడిదారీవర్గం సంపాదించింది. "జమ్స్ట్వోస్ సంఘాలు, పట్టణసంఘాలు" అనే పేరుతో దేశవ్యాపితసంస్థ నొకదానిని నెలకొల్పారు. (జమ్స్ట్వోస్ అంటే మనస్థానిక సంస్థలలాంటివి — అను) తన

నాయకత్వంకిందకు, తన పలుకుబడికిందకు కార్మికులను తీసుకరావడంకూడా పెట్టుబడిదారీ వర్గానికి అవసరం. ఇందుకు యుద్ధ పరిశ్రమ కమిటీల్లో "కార్మిక ముఠాలు" అంటూ కొన్నిటిని ఏర్పరిచింది. మెన్షివిక్‌లు దీనికి ఎగిరి గంతువేశారు. యుద్ధ పరిశ్రమ కమిటీల్లో కార్మికుల ప్రతినిధులు ఉండటం పెట్టుబడిదారీ వర్గానికే లాభకరం. ఎందుచేతనంటే ఫిరంగిగుండ్లు, తుపాకులు, రైఫిల్స్, తూటాలు మొదలగు యుద్ధసామగ్రిని ఉత్పత్తి చేస్తున్న ఫ్యాక్టరీలల్లో ఎక్కువ శ్రమచేసి, ఉత్పత్తిని హెచ్చు చేయవలసిందని కార్మికప్రజలను కోరడానికి ఈ ప్రతినిధులు పెట్టుబడిదారీవర్గానికి ఉపయోగపడతారు. "ప్రతీదీ, సమస్తం యుద్ధానికే" అన్నది పెట్టుబడిదారీవర్గ నినాదం. వాస్తవంలో "యుద్ధకంట్రాక్టులద్వారా, విదేశభూమిని ఆక్రమించుకొనుట ద్వారా వీలయినంత లాభాలు కొడదాం" అని ఈ నినాదానికి అర్థం. మెన్షివిక్‌లు బూర్జువావర్గంయొక్క ఈ కపటదేశభక్తి ప్రణాళికలో ఉత్సాహంగా పాల్గొన్నారు. యుద్ధపరిశ్రమ కమిటీలో "కార్మికముఠా" ఎన్నికలలో పాల్గొనవలసిందని కార్మికులలో తీవ్రమైన ప్రచారంచేశారు. తద్వారా వారు పెట్టుబడిదారులకు సహాయపడ్డారు. బోల్షివిక్కులు ఈ పథానికి వ్యతిరేకులు. యుద్ధపరిశ్రమ కమిటీలను బహిష్కరించవలసిందని వారు ప్రచారం చేశారు. అలా బహిష్కరించుటలో జయప్రదం కాగలిగారు. కాని ప్రముఖ మెన్షివిక్ అయిన గ్వోజ్‌డవ్ గూఢచారి అయిన ఎబ్రోసిమోవ్‌ల నాయకత్వాన కొందరు కార్మికులు యుద్ధపరిశ్రమ కమిటీల కార్యకలాపాలల్లో పాల్గొన్నారు. కాని 1915 సెప్టెంబరులో యుద్ధ పరిశ్రమ కమిటీలలోని "కార్మిక ముఠాల" తుది ఎన్నికలు జరుపుకో

టానికి కార్మిక ప్రతినిధులు సమావేశమయ్యారు. అపుడు అధికసంఖ్యాకులు యుద్ధపరిశ్రమ కమిటీలలో పాల్గొనడానికి వ్యతిరేకించుతూ నిశితమైనఒక తీర్మానం చేశారు. జార్ ప్రభుత్వాన్నికూలదోయడం, శాంతికై పోరాడడం తమ ఆశయంగా కార్మికులు చేసుకున్నారని యీ ప్రతినిధులు ప్రకటించారు.

బోల్షివిక్‌లు సైన్యంలోను, నావికులలోను తీవ్రంగా పనిచేయ ప్రారంభించారు. యుద్ధంవల్ల కలిగిన సాటిలేని మహాఘోరాలకు, ప్రజల బాధలకు కారకులెవరో సైనికులకు నావికులకు వారు విశదీకరించారు. కసాయి సామ్రాజ్యవాదం నుండి ప్రజలు బయటపడే మార్గం ఒకటేనని, అది విప్లవమని వారు వివరించారు. సైనికులలోను, నావికులలోను, యుద్ధరంగంలోను, యుద్ధరంగ వెనుభాగంలోను, (rear) బోల్షివిక్కులు కణాలను (Nuclie - ప్రాథమిక సంఘాలు) ఏర్పరచారు. యుద్ధ వ్యతిరేకంగా పోరాడవలసిందని ప్రబోధించే కరపత్రాలను పంచిపెట్టారు.

క్రాన్‌స్టాట్‌లో బోల్షివిక్కులు "క్రాన్‌స్టాట్ సమిష్టి సైనిక కేంద్ర సంఘాన్ని" (Central collective of the Kronstadt Military organisation) ఏర్పరచారు. దీనికి పెట్రోగ్రాడ్ పార్టీ కమిటీతో సన్నిహిత సంబంధాలుండేవి. శిబిరంలోని సైన్యంలో ప్రచారం చేయడానికి పెట్రోగ్రాడ్ పార్టీ కమిటీ సైనికసంఘం ఒకటి ఏర్పరచింది. 1916 ఆగస్టులో పెట్రోగ్రాడ్ గూఢచారి సంఘం (Okhrana) అధ్యక్షుడు ఇలా రిపోర్టు చేశాడు : "క్రాన్‌స్టాట్ సైనిక సమిష్టి కేంద్ర సంఘ కార్యక్రమం, రహస్య కార్యాచరణ దృష్ట్యా చాలా నిర్మాణ

యుక్తంగా వుంది. దాని సభ్యులందరూ అప్రమత్తులై పల్లెత్తు మాటాడకుండా పనిచేస్తారు. ఈ సైనిక సమిష్టి కేంద్రానికి, సముద్రతీరంమీద కూడ ప్రతినిధులున్నారు."

ప్రపంచ పెట్టుబడిదారీ వర్గమే శత్రువు. సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చి తమ ఆయుధాలను తమ తమ ప్రభుత్వాల మీద, పెట్టుబడిదారీ వర్గాలపైనా త్రిప్పడంవల్లనే యుద్ధాన్ని అంతమొందించవచ్చు. ఈ పై విషయాలను నొక్కిచెపుతూ యుద్ధరంగంలో యుద్ధం జేస్తున్న ఇరుకక్షుల సైనికుల మధ్య సౌభ్రాతృత్వం పెంపొందజేయడానికి పార్టీ ఆందోళన చేయసాగింది. దాడిచేయకుండా సైనికదళాలు తిరస్కరించిన సందర్భాలు మరింత ఎక్కువ కాజొచ్చాయి. 1915 నాటికే అలాంటి ఘటనలు జరిగాయి. 1916 లో మరీ ఎక్కువయ్యాయి.

ముఖ్యంగా ఉత్తర రంగంలో అనగా బాల్టిక్ రాష్ట్రాలలో సైనికుల మధ్య బోల్షివిక్కుల కార్యకలాపాలు విస్తరించాయి. 1917 ప్రారంభంలో ఉత్తరరంగ సైన్యాధిపతియైన జనరల్ రుజిస్కీ తమ ప్రధాన కార్యాలయానికి, ఆ రంగంలో బోల్షివిక్కులు తీవ్ర విప్లవ చర్యలను పెంపొందించారని తెలియజేశాడు.

యుద్ధం వివిధ ప్రజల జీవితంలో, ప్రపంచ కార్మికవర్గ జీవితంలోగాఢమైనమార్పునుతీసుకువచ్చింది. దేశాలభవిష్యత్తు, జాతుల భవిష్యత్తు, సోషలిస్టు ఉద్యమంయొక్క భవిష్యత్తు అంతా ప్రమాదంలో వుంది. అందుచే యుద్ధం, సోషలిస్టులమని చెప్పుకొనే అన్నిపార్టీలకు ధోరణులకు రక్ష - ఒక గీటు

రాయి. ఈ పార్టీలు, ధోరణులు సోషలిస్టు ఆశయానికి, అంతర్జాతీయతా ఆశయానికి విశ్వాసవంతంగా నిలబడతాయా లేక కార్మికవర్గానికి ద్రోహం చేయడానికి తలపడతాయా? తమజండాను ముడిచి, తమజాతీయ పెట్టుబడిదారీవర్గం పాదాల ముందు దానిని పడవేస్తాయా? ఈ ప్రశ్న అనా డందరినీ ఎదుర్కొంది.

ఈ పరీక్షకు రెండవ ఇంటర్నేషనల్ పార్టీలు నిలబడ లేకపోయాయనీ, అవి కార్మికవర్గానికి ద్రోహంచేసి, తనుతమ దేశాల సామ్రాజ్యవాద పెట్టుబడిదారీవర్గాలకు తమ జెండాలను వంచి లొంగిపోయాయనీ యుద్ధం తెలియజేసింది.

తమలో అవకాశవాదాన్ని పెంపొందనిచ్చిన ఈ పార్టీలు అవకాశవాదులతోనూ, (సంకుచిత) జాతీయవాదులతోనూ, రాజీపడి లొంగిపోయే తత్వంతో పెరిగిన యీపార్టీలు మరొక విధంగా ప్రవర్తించలేవు.

బోల్షివిక్‌పార్టీ ఒక్కటే ఈ పరీక్షలో జయప్రదంగా నెగ్గింది. సోషలిస్టు ఆశయానికి, శ్రామికవర్గ అంతర్జాతీయతఅనే ఆశయానికి బోల్షివిక్‌పార్టీ ఒక్కటే నిరంతరం విశ్వాసవంతంగా నిలబడింది.

అలా జరుగుతుందని మనం భావించినదే. కొత్తరకపు పార్టీ ఒక్కటే, అవకాశవాదంతో రాజీలేని పోరాటాన్ని సాగించాలనే భావంతో పెరిగిన పార్టీ ఒక్కటే (సంకుచిత) జాతీయత, అవకాశవాదం లేనిపార్టీ ఒక్కటే - ఈ మహా పరీక్షకు నిలబడగలదు. కార్మికవర్గ ఆశయానికి, సోషలిజం, అంతర్జాతీయతా అనే ఆశయానికి విశ్వాసవంతంగా నిలబడగలదు. బోల్షివిక్ పార్టీయే అలాంటి పార్టీ.

## 4

### జార్ సైన్యాల ఓటమి - ఆర్థిక విధ్వంసం - జార్ ప్రభుత్వ సంక్షోభం

యుద్ధం ప్రారంభమై అప్పుడే మూడేండ్లయింది. లక్షలాది ప్రజలు యుద్ధంవల్ల, దానిలో తగిలిన గాయాలవల్ల, తత్ఫలితంగా కలిగిన అంటువ్యాధులవల్ల చనిపోయారు. పెట్టుబడిదారులు, భూస్వాముల యుద్ధంమూలంగా లాభాలు గడించుతున్నారు. కాని కార్మికులు, రైతులు రోజురోజుకూ పెరుగుతున్న కష్టమూ, దరిద్రమూవల్ల బాధపడుతున్నారు. యుద్ధం రష్యా ఆర్థిక జీవితాన్ని విచ్ఛిన్నం చేస్తోంది. ఒక కోటి నలభై లక్షలమంది దృఢకాయులను ఆర్థికవృత్తులనుండి వేరుమరలించి సైన్యంలో చేర్చారు. మిల్లులు, ఫ్యాక్టరీలు నిలిచిపోతున్నాయి. కూలీల కొరత వలన పంటభూమి తగ్గిపోయింది. ఇటు ప్రజలు అటు యుద్ధరంగంలోని సైనికులు ఆకలితో బాధపడుతున్నారు. కాళ్ళకు బూట్లులేవు. యుద్ధం దేశంలోని సాధన సంపత్తినంతా (Resources) మింగివేస్తోంది.

జార్ సైన్యం, ఓటమి తర్వాత ఓటమి పొందుతూ వచ్చింది. జర్మన్ శతఘ్నిదళం ( Artillery ) జార్ సైన్యాలను ఫిరంగి గుండ్లతో ముంచివేసింది. జార్ సైన్యానికి గన్స్, ఫిరంగి గుండ్లు, కనీసం రైఫిల్సుకూడా లేవు. ఒక్కొక్కప్పుడు ముగ్గురు సైనికులకు కలిపి ఒక రైఫిల్ వుండేది. యుద్ధం కొన

సాగుతున్న కాలంలో జార్ యుద్ధమంత్రి సుఖోమ్లినోవ్ దేశద్రోహి అని, జర్మన్ గూఢచారులతో సంబంధాలు కలిగి వున్నాడని బయట పడ్డది. ఇతడు జర్మన్ గూఢచారిశాఖ సూచనల ననుసరించి యుద్ధరంగానికి ఆయుధ సరఫరాను విధ్వంసం చేశాడు. గన్స్, రైఫిల్స్ రణరంగానికి లేకుండా చేశాడు. జార్ మంత్రులు, సైనికాధికారులు జర్మన్ సైనిక విజయానికి దొంగతనంగా సహాయం చేశారు. జార్ భార్యకు కూడ జర్మన్లతో బాంధవ్యంవుంది. ఆమెతో కలిసి వీరు సైనిక రహస్యాలను జర్మన్‌లకు తెలియజేశారు. జార్ సైన్యం అప జయాలు పొంది తిరోగమింపవలసి వచ్చిందంటే ఆశ్చర్య పడ నవసరంలేదు. 1916 నాటికి అప్పుడే జర్మన్‌లు పోలెండును, బాల్టిక్ రాష్ట్రాలలో కొంతభాగాన్ని ఆక్రమించారు.

ఇదంతా కార్మికులలో, రైతులలో, సైనికులలో, మేధావులలో ద్వేషాన్ని, క్రోధాన్ని రెచ్చగొట్టింది; జార్ ప్రభుత్వానికి, యుద్ధానికి వ్యతిరేకంగా యుద్ధరంగంలోను, యుద్ధ శ్రేణికి వెనుభాగంలోను (Rear) మధ్యప్రాంతాలలోను, సరి హద్దు ప్రాంతాలలోను ప్రజావిప్లవోద్యమాన్ని వృద్ధిచేసి తీవ్ర పరచింది.

రష్యన్ సామ్రాజ్యవాద పెట్టుబడిదారీవర్గంలో కూడ అసంతృప్తి వ్యాపించసాగింది. జర్మనీతో ప్రత్యేక సంధికోసం పనిచేయుచున్న రాస్‌పుటిన్‌లాంటి నీచులదే (రాస్కెల్స్) జారుప్రభుత్వ ఆస్థానంలో పెత్తనం అవడంవల్ల ఈ అసంతృప్తి మరింత హెచ్చింది. జార్ ప్రభుత్వం యుద్ధాన్ని జయప్రదంగా కొనసాగించలేదని పెట్టుబడిదారీవర్గం రోజురోజుకూ గ్రహింప

సాగింది. జార్ ప్రభుత్వం తన పరిస్థితిని కాపాడుకోటానికి జర్మన్‌లతో విడిగా సంధిచేసుకోవచ్చునని అది భయపడింది. అందుచే రష్యన్ పెట్టుబడిదారీవర్గం రాజభవనంలో తిరుగు బాటుకు (Coup) కుట్ర పన్ని జార్ చక్రవర్తి రెండవ నికొలస్‌ను తొలగించదలచింది. అతని స్థానే పెట్టుబడిదారీవర్గంతో సంబంధాలున్న అతని సోదరుడు మైకేల్ రోమనోవ్‌ను సింహాసన మెక్కించాలని నిశ్చయించింది. ఈ విధంగా ఒక్క దెబ్బకు రెండుపిట్టలను కొట్టాలని ప్రయత్నించింది.

(1) తామే అధికారంలోకి వచ్చి, సామ్రాజ్యవాద యుద్ధాన్ని కొనసాగించేటట్లు చూడడం. (2) చిన్న రాజ భవన తిరుగుబాటుద్వారా అప్పటికే అభివృద్ధిచెందుతున్న పెద్ద ప్రజావిప్లవ వెల్లువ పొంగి పొరలకుండా ఆపివేయడం.

యుద్ధాన్ని కొనసాగించుటలో జారు అసమర్థుడని గ్రహించిన బ్రిటిష్, ఫ్రెంచిప్రభుత్వాలు రష్యన్ పెట్టుబడిదారీ వర్గానికి మద్దత్తు నిచ్చాయి. జార్ చక్రవర్తి జర్మన్లతో ప్రత్యేకసంధిని చేసుకోవచ్చునని వారు భయపడ్డారు. జారు ప్రభుత్వంగనుక ప్రత్యేక సంధి చేసుకొన్నట్లయితే బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు ఒక ముఖ్య మిత్రమైన రష్యాను కోల్పో తాయి. రష్యా తన దేశ యుద్ధరంగాలకు జర్మన్ సైన్యాలను మరల్చడమేగాక, ఫ్రాన్స్‌కు వేలాది మంచి రష్యన్ సైనికులను సప్లైచేసింది. అందుచే బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు రష్యన్ పెట్టుబడిదారీవర్గం సంకల్పించిన రాజభవన తిరుగుబాటు ప్రయత్నాలను బలపరచాయి.

జారు ఆ విధంగా వేరుపడిపోయాడు.

రణరంగంలో ఓటమితర్వాత ఓటమి సంభవించుతుంటే ఆర్థికవిధ్వంసం మరింత తీవ్రమైంది. 1917 జనవరి-ఫిబ్రవరులలో ఆహారం, ముడిపదార్థాలు, వంటచెఱకుల సప్లైలలో అరాచకత్వం విస్తరించి తీవ్రతరమైన ఉన్నతస్థాయికి పోయింది. పెట్రోగ్రాడ్, మాస్కోలకు ఆహారపదార్థాల సప్లై దాదాపు ఆగిపోయింది. ఒక ఫ్యాక్టరీతర్వాత మరొక ఫ్యాక్టరీ మూసివేయబడింది. దీనివల్ల నిరుద్యోగం ప్రబలింది. కార్మికుల స్థితి ముఖ్యంగా దుర్భరమైంది. ఈ దుస్సహమైన స్థితినుండి బయటపడే మార్గం జారు నిరంకుశ ప్రభుత్వాన్ని కూలద్రోయుటే అని ప్రజలలో అధికసంఖ్యాకులు నిర్ధారణకు రా జొచ్చారు.

జారుప్రభుత్వం స్పష్టంగా మరణ సంక్షోభవేదనలో పడింది.

ఈ సంక్షోభాన్ని రాజభవన తిరుగుబాటు (కూప్) ద్వారా పరిష్కరించాలని పెట్టుబడిదారీవర్గం తలచింది.

కాని ప్రజలు తమస్వంతమార్గాన దానిని పరిష్కరించారు.

## 5

### ఫిబ్రవరి విప్లవం - జారుప్రభుత్వ పతనం - కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్లు ఏర్పడుట - తాత్కాలికప్రభుత్వ నిర్మాణం - ద్వంద్వాధికారం

1917వ సంవత్సరం సమ్మెలతో ప్రారంభమైంది. జనవరి 9 సమ్మె ఈ సంవత్సరంలో మొదటి సమ్మె. ఈ సమ్మె

కాలంలో పెట్రోగ్రాడ్, మాస్కో, బాకూ, నిజ్నీ- నవోగ్‌ రాడ్‌లలో సమ్మె ప్రదర్శనాలు జరిగాయి. జనవరి 9 సమ్మెలో మాస్కోలో మొత్తం కార్మికులలో మూడవవంతు పాల్గొన్నారు. ట్వెర్‌స్కోయీ_బుల్‌వార్డ్ (Tverskoi Boulevard) వద్ద రెండువేలమంది చేసిన ప్రదర్శనను ఆశ్విక పోలీసుదళం చెదరగొట్టింది. పెట్రోగ్రాడ్‌లోని వైబార్గ్-చాసీ (Vyborg Chaussee) వద్ద జరిగిన ప్రదర్శనలో సైనికులు కూడా చేరారు.

పెట్రోగ్రాడ్ పోలీసులు ఇలా రిపోర్టు చేశారు: "సర్వవ్యాపిత సమ్మె (జనరల్ స్ట్రైక్) చెయ్యాలనే భావం రోజు రోజూ వ్యాపించి కొత్తవారిలోకి ప్రాకుతోంది."

మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు ఆరంభదశలోవున్న ఈ విప్లవోద్యమాన్ని లిబరల్ - బూర్జువాకు అవసరమైన మార్గాలకు తిప్పాలని ప్రయత్నించారు. ప్రభుత్వ డ్యూమా ప్రారంభమయ్యేరోజున, అనగా ఫిబ్రవరి 14వ తేదీన, డ్యూమావద్దకు కార్మికులు ఊరేగింపును తీసుకవెళ్లాలని మెన్షివిక్కులు సూచించారు. కాని కార్మికప్రజలు బోల్షివిక్కులను అనుసరించారు. డ్యూమాకు వెళ్ళకబోల్షివిక్కుల ప్రదర్శనాలలో పాల్గొన్నారు.

1917 ఫిబ్రవరి 18 వ తేదీన పెట్రోగ్రాడ్‌లోని ప్యూటిలావ్ పరిశ్రమలలో సమ్మె జరిగింది. ఫిబ్రవరి 22 వ తేదీన పెద్ద ఫ్యాక్టరీలన్నిటిలోనూ కార్మికులు సమ్మెచేశారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవసందర్భంలో ఫిబ్రవరి 23 వ తేదీన (మార్చి 8వ తేదీన) పెట్రోగ్రాడ్ బోల్షివిక్ కమిటీ పిలుపు

ననుసరించి, కార్మిక స్త్రీలు యుద్ధానికి, జారుప్రభుత్వానికి వ్యతిరేకంగా తిండికోసం వీధులలో ప్రదర్శనం గావించారు. ఈ కార్మిక స్త్రీల ప్రదర్శనాన్ని, పట్టణవ్యాపితసమ్మె ఉద్యమం ద్వారా పెట్రోగ్రాడ్ కార్మికులు బలపరచారు. ఈ రాజకీయ సమ్మె జారుప్రభుత్వ వ్యతిరేక సర్వవ్యాపిత రాజకీయ ప్రదర్శనంగా పెంపొందసాగింది.

ఫిబ్రవరి 24 వ తేదీన (మార్చి 9) ప్రదర్శనం మరల మరింత పట్టుదలతో సాగింది. దాదాపు రెండు లక్షలమంది కార్మికులు అప్పుడే సమ్మెలో పాల్గొన్నారు.

ఫిబ్రవరి 25 వ తేదీన (మార్చి 10) పెట్రోగ్రాడ్ కార్మికవర్గం యావత్తూ విప్లవోద్యమంలో చేరింది. జిల్లాలలోని (పేటలలోని - అనువాదకుడు) రాజకీయసమ్మెలు యావత్ పట్టణ సర్వవ్యాపిత రాజకీయసమ్మెగా రూపొందాయి. ప్రతిచోటా ప్రదర్శనాలూ, పోలీసులతో ఘర్షణలూ చెలరేగాయి. "జారుప్రభుత్వం నశించుగాక !" "యుద్ధం నశించుగాక !" "మాకు తిండికావాలి !" అనే నినాదాలు వ్రాసిన ఎర్రజండాలు (Banners) కార్మిక ప్రజాసామాన్య శిరస్సులపై తేలి ఆడాయి.

ఫిబ్రవరి 26 (మార్చి 11) ఉదయాన రాజకీయసమ్మె, ప్రదరన్శమూ తిరుగుబాటు స్వభావాన్ని పొందనారంభించింది. సైనికులను, పోలీసులను నిరాయుధులను జేసి, కార్మికులు తాము సాయుధులు కాజొచ్చారు. అయినప్పటికీ మెన్‌స్కయా చౌకులో (Znamenskaya Square) ప్రదర్శనంపై పోలీసులు తుపాకులు పేల్చుటవల్ల వారితోటి సాయుధఘర్షణ జరిగి అంతమయింది.

పెట్రోగ్రాడ్ సైనికప్రాంత కమాండరు జనరల్ కాబలోవ్, ఫిబ్రవరి 28 వ తేదీకి (మార్చి 13) కార్మికులు పనిలోకి తిరిగి రావాలనీ, లేనిపక్షంలో యుద్ధరంగానికి పంపుతామనీ ప్రకటించాడు. ఫిబ్రవరి 25 న (మార్చి 10) జనరల్ కాబలోవ్‌కు జార్ చక్రవర్తి ఇలా ఆజ్ఞాపించాడు: "రేపటిలోగా రాజధానీ నగరంలోని అల్లరులను ఆపివేయవలసిందిగా నేను నిన్ను ఆజ్ఞాపించుతున్నాను."

కాని విప్లవాన్ని "ఆపుచేయడం" ఇక ఏమాత్రమూ సాధ్యంకానిపని.

ఫిబ్రవరి 26 న (మార్చి 11) పావ్‌లోవ్‌స్కీ రెజిమెంటుకు చెందిన రిజర్వు బెటాలియన్‌లోని నాల్గవ కంపెనీ తుపాకులు పేల్చింది. ఎవ్వరిమీద? కార్మికులపైనకాదు. కార్మికులతో దెబ్బలాడుతున్న అశ్వికపోలీసుదళాల(Mounted Police) పైన కాల్పులు సాగించింది. సైనికులను తిప్పుకోడానికి తీవ్రంగా ఎడతెగని కృషిజరిగింది. ముఖ్యంగా కార్మిక స్త్రీలు తిన్నగా సైనికులను ఉద్బోధించారు. వారితో సౌభ్రాతృత్వం ఏర్పరచుకున్నారు. అందరిచే ద్వేషించబడిన జార్ నిరంకుశ ప్రభుత్వాన్ని కూలద్రోయుటలో ప్రజలను సహాయపడవలసిందని కోరారు. ఆ రోజుల్లో బోల్షివిక్‌పార్టీ దైనందిన కార్యక్రమాన్ని, మనపార్టీ సెంట్రల్‌కమిటీ బ్యూరో నడుపుతూ వుండేది. దాని కార్యాలయం పెట్రోగ్రాడ్‌లో వుండేది. కామ్రేడ్ మాలొటోవ్ దీని కధ్యక్షుడుగా వుండేవాడు. ఫిబ్రవరి 26 వ తేదీన (మార్చి 11) సెంట్రల్‌కమిటీ బ్యూరో జార్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరా

టాన్ని కొనసాగించుతుండవలసిందనీ, తాత్కాలిక విప్లవ ప్రభుత్వాన్ని ఏర్పరచవలసిందనీ తెలియజేస్తూ ఒక ప్రణాళిక ప్రకటించింది.

ఫిబ్రవరి 27వ తేదీన (మార్చి 12) పెట్రోగ్రాడ్‌లోని సైన్యాలు కార్మికులపై తుపాకులు పేల్చనిరాకరించాయి. తిరుగుబాటుచేసిన ప్రజలపక్షాన నిలువసాగాయి. ఫిబ్రవరి 27వ తేదీ ఉదయం తిరుగుబాటులో చేరిన సైనికులసంఖ్య పదివేల కంటే ఎక్కువలేదు. కాని సాయంకాలంకల్లా 60 వేలు దాటి పోయింది.

తిరుగుబాటుకు పూనుకున్న కార్మికులు, సైనికులు జార్ మంత్రులను, సైనికాధిపతులను అరెస్టుచేయ ప్రారంభించారు. జైళ్ళనుండి విప్లవకారులను విడుదలచేయ ప్రారంభించారు. విడుదలైన రాజకీయ ఖైదీలు విప్లవపోరాటంలో కలిశారు.

ఇండ్లకప్పులనుండి మెషిన్‌గన్‌లతో కాల్చుతున్న పోలీసులతోను, సైనికులతోను వీధులలో పోరాటం జరుగుతూనే వుంది. తుపాకిగుండ్లు ఒకరిపై ఒకరు పేల్చుతూనే వున్నారు. కాని త్వరలోనే సైనికులు కార్మికుల పక్షాన చేరిపోయారు. ఇది జార్ నిరంకుశప్రభుత్వ పతనాన్ని నిర్ణయించింది. పెట్రోగ్రాడ్‌లో విప్లవవిజయవార్త ఇతర పట్టణాలకు, యుద్ధరంగానికి వ్యాపించగానే ప్రతిచోటా కార్మికులు, సైనికులు జార్ ఉద్యోగస్తులను పదవులనుండి క్రిందికిలాగ ప్రారంభించారు.

ఫిబ్రవరి బూర్జువా ప్రజాతంత్ర విప్లవం విజయం పొందింది.

"శాంతి, తిండి, స్వాతంత్ర్యం" అని కోరుతూవున్న సైనిక దుస్తులలోవున్న లక్షలాది రైతుల ఉద్యమానికి నాయకత్వం వహించిన కార్మికవర్గం, విప్లవానికి అగ్రగామియగుట వల్లనే విప్లవం జయంపొందింది. శ్రామికవర్గ నాయకపాత్రయే (Hegemony) విప్లవవిజయాన్ని నిర్ణయించింది.

విప్లవప్రారంభ దినాల్లో లెనిన్ ఇలా వ్రాశాడు: "శ్రామికవర్గమే విప్లవాన్ని గావించింది. శ్రామికవర్గం వీరత్వాన్ని ప్రదర్శించింది. అది తన రక్తాన్ని ధారపోసింది. కష్టపడే పేదప్రజానీక బాహుళ్యాన్ని తనతోపాటు తీసుకువెళ్లింది." (లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్ 20వ వాల్యూం. 23-24 పేజీలు)

1905 నాటి మొదటి విప్లవం 1917 నాటి రెండవవిప్లవ శీఘ్రవిజయానికి మార్గాన్ని సుగమం చేసింది.

లెనిన్ ఇలా వ్రాశాడు: "1905-07 కాలం మూడేండ్లలోనూ జరిగిన అత్యద్భుతమైన వర్గపోరాటాలు లేనిదే, రష్యన్ శ్రామికవర్గం ప్రదర్శించిన విప్లవోత్సాహశక్తి లేనిదే, రెండవ విప్లవం అంత త్వరితంగా జరిగివుండేదికాదు. అంటే రెండవ విప్లవ ప్రాథమికదశ కొద్దిరోజుల్లోనే అలా పూర్తిఅయివుండేదికాదు." (లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్ - ఇంగ్లీషుఎడిషన్- మాస్కో- 1947. 1వ వాల్యూం-735వ పేజీ)

విప్లవ ప్రారంభదినాల్లోనే సోవియట్లు తలయెత్తాయి. కార్మికసైనిక ప్రతినిధుల సోవియట్ల అండమీదనే విజయవంతమైన విప్లవం ఆధారపడివుంది. తిరుగుబాటు కావించిన కార్మికులు, సైనికులు కార్మిక సైనిక ప్రతినిధుల సోవియట్లను నిర్మిం

చారు. సోవియట్లు సాయుధ తిరుగుబాటుయొక్క అంగాలేగాక నూతన విప్లవశక్తియొక్క బీజాలనీ 1905 విప్లవం తెలియజేసింది. కార్మికవర్గ ప్రజాసామాన్యం మనస్సులలో సోవియట్లు అనే భావం ఉండిపోయింది. జార్ ప్రభుత్వాన్ని కూలద్రోయగానే వారు దాన్ని అమలులో పెట్టసాగారు. కాని 1905 కు ఇప్పటికీ ఒకభేదంవుంది. అప్పుడు, కార్మిక ప్రతినిధుల సోవియట్లను మాత్రమే నిర్మించారు. కాని 1917 ఫిబ్రవరిలో బోల్షివిక్కుల చొరవవల్ల, కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్లు ఏర్పడ్డాయి.

వీధులలో తిన్నగా ప్రజాసామాన్య పోరాటాన్ని బోల్షివిక్కులు నడుపుతూవుంటే, రాజీ బేరగాళ్ళయిన మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు సోవియట్లలోని పదవులను ఆక్రమించుకొని, మెజారిటీని సంపాదించుకోసాగారు. బోల్షివిక్ పార్టీ నాయకులలో ఎక్కువమంది జైళ్ళలోనో, ప్రవాసంలోనో ఉన్నారు. (లెనిన్ ఆ కాలంలో విదేశాలలో ప్రవాసిగా వుంటున్నాడు. స్టాలిన్, స్వెర్డ్లావ్‌లు సైబీరియాలో ప్రవాస శిక్ష అనుభవిస్తున్నారు) మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు పెట్రోగ్రాడ్ వీధులలో స్వేచ్ఛగా విహరించుతూ వున్నారు. ఇది ఇందుకు కొంతవరకు కారణం. తత్ఫలితంగా పెట్రోగ్రాడ్ సోవియట్‌కు, దాని కార్యనిర్వాహకవర్గానికి రాజీ బేరగాళ్ళయిన మెన్షివిక్కుల, సోషలిస్టు - రివల్యూషనరీల ప్రతినిధులు నాయకత్వం వహించారు. మాస్కో ఇంకా అనేక పట్టణాల విషయంలో కూడా ఇలాగే జరిగింది. ఇవనోవో - వాజ్నిసెన్స్క్, క్రాస్నొయార్స్క, ఇంకా

మరికొద్ది ప్రదేశాలలో మాత్రమే సోవియట్లలో మొదటనుండీ బోల్షివిక్కులకు మెజారిటీ లభించింది.

సాయుధ ప్రజలు - కార్మికులు, సైనికులు - ప్రజల అధికార సాధనమయిన సోవియట్‌కు తమ ప్రతినిధులను పంపారు. కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్, విప్లవ ప్రజానీకంయొక్క కోర్కెలన్నింటినీ నెరవేరుస్తుందని, ప్రప్రథమంగా యుద్ధవిరామం జరుగుతుందని వారనుకొన్నారు - నమ్మారు.

కాని కార్మికులు, సైనికులు అనవసరంగా దీనిలో నమ్మకం పెట్టుకున్నారు. అందువల్ల వారికి కీడు కల్గింది. సోషలిస్టు - రివల్యూషనరీలకు, మెన్షివిక్కులకు యుద్ధాన్ని అంత మొందించాలనిగాని, శాంతిని సాధించాలనిగాని ఉద్దేశం యిసుమంతైనా లేదు. యుద్ధాన్ని కొనసాగించడానికి విప్లవాన్ని అవకాశంగా తీసుకోవాలని వారు ప్లాను వేశారు. ఇక విప్లవాన్ని గురించి, ప్రజల విప్లవకోర్కెలగురించి సోషలిస్టు-రివల్యూషనరీల, మెన్షివిక్కుల అభిప్రాయాలు చూద్దాం: విప్లవం అప్పుడే అయిపోయింది. ఇక దానికి స్వస్తిచెప్పి పెట్టుబడిదారులతో ప్రక్క-ప్రక్కనే "మామూలు" శాసనబద్ధ రాజకీయ ఉనికిని కొనసాగించాలి. ఇదీ వారి ధోరణి. అందుచేత పెట్రోగ్రాడ్ సోవియట్ యొక్క సోషలిస్టు - రివల్యూషనరీ నాయకులు మెన్షివిక్ నాయకులు యుద్ధాన్ని ముగించివేయాలనే సమస్యను శాంతి సమస్యను వెనుకకుపెట్టి అధికారాన్ని పెట్టుబడిదారీ వర్గానికి అప్పగించడానికి శాయశక్తులా పనిచేశారు.

1917 ఫిబ్రవరి 27వ తేదీన (మార్చి 12) నాల్గవ డ్యూమాలోని లిబరల్ సభ్యులు సోషలిస్టు - రివల్యూషనరీల, మెన్షివిక్కుల నాయకులతో చాటుమాటు ఒడంబడిక చేసుకొని, డ్యూమా తాత్కాలిక కమిటీని ఏర్పరచారు. భూస్వామీ, రాచరికవాదీ అయిన రోడ్జయాంకో ఈ తాత్కాలిక కమిటీకి అధ్యక్షుడు. తర్వాత కొన్నాళ్ళకు డ్యూమా యొక్క ఈ తాత్కాలిక కమిటీ కార్మిక సైనిక ప్రతినిధుల కార్యనిర్వాహక సభ్యులైన సోషలిస్టు- రివల్యూషనరీ నాయకులతోను, మెన్షివిక్ నాయకులతోను కలసి బోల్షివిక్కులకు తెలియకుండా రహస్యంగా ఒక ఒడంబడిక చేసుకొన్నారు. రష్యాలో ఒక కొత్త తాత్కాలిక పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని, ల్వోవ్ రాకుమారుని ఆధ్వర్యాన ఏర్పరచాలని నిశ్చయించారు.

ఫిబ్రవరి విప్లవానికి పూర్వమే తన ప్రభుత్వంలో ఇతనిని ప్రధానిగా చెయ్యడానికి రెండవ నికలస్ చక్రవర్తియే సిద్ధమయ్యాడు. ఈ తాత్కాలిక ప్రభుత్వంలో, శాసనబద్ధ ప్రజాతంత్రవాదుల నాయకుడు మిల్యుకోవ్, అక్టోబరిస్టుల నాయకుడు గుచ్‌కోవ్, ఇంకా పెట్టుబడిదారీవర్గపు ఇతర ముఖ్యప్రతినిధులు, "ప్రజాతంత్ర" ప్రతినిధి అనబడే సోషలిస్టు - రివల్యూషనరీ అయిన కెరెన్స్కీ ఉన్నారు.

పెట్టుబడిదారీ వర్గానికి అధికారాన్ని అప్పగించినది సోవియట్ కార్యనిర్వాహక వర్గంలోని సోషలిస్టు - రివల్యూషనరీ నాయకులూ, మెన్షివిక్ నాయకులూ. కార్మిక సైనికప్రతినిధుల సోవియట్‌కు ఇది తెలియగానే, బోల్షివిక్కులు అసమ్మతిని తెలియ

జేశారు. అయినా లెక్క చేయకుండా దానిలోని అధిక సంఖ్యా కులు, సోషలిస్టు- రివల్యూషనరీ నాయకుల, మెన్షివిక్ నాయ కులచర్యను మామూలుగా ఆమోదించారు.

ఆవిధంగా రష్యాలో నూతన ప్రభుత్వాధికారం ఉదయిం చింది. లెనిన్ చెప్పినట్లు ఇందులో "పెట్టుబడిదారుల, పెట్టుబడి దారులుగా మారిన భూస్వాముల" ప్రతినిధులుఉన్నారు.

పెట్టుబడిదారీ ప్రభుత్వంతో పాటు కార్మిక సైనిక ప్రతినిధుల సోవియట్ యొక్క మరో అధికారం కూడా ఏర్ప డింది. సోవియట్‌లోని సైనిక ప్రతినిధులు చాలాభాగం యుద్ధానికి సమీకరించబడిన రైతులే. కార్మిక సైనిక ప్రతినిధుల సోవియట్ అంటే జార్ ప్రభుత్వ వ్యతిరేకంగా ఏర్పడిన కార్మికుల, రైతుల సమ్మేళనాసాధనం. ఇంతేగాక వారి అధికార సాధనం, కార్మికవర్గ రైతాంగాల నియంతృత్వ సాధనం.

దీని ఫలితం రెండు అధికారాల విచిత్రబంధనం. రెండు నియంతృత్వాల విచిత్రబంధనం. ఒకటి తాత్కాలిక ప్రభుత్వ ప్రాతినిధ్యం వహించిన పెట్టుబడిదారీ నియంతృత్వం. రెండవది కార్మిక సైనిక ప్రతినిధుల సోవియట్ ప్రాతినిధ్యం వహించిన శ్రామికవర్గ, రైతాంగాల నియంతృత్వం.

దీని ఫలితం ద్వంద్వాధికారం.

---

సోవియట్లలో మెన్షివిక్కులకు, సోషలిస్టు-రివల్యూషనరీ లకు మొదట ఎలా మెజారిటీ వచ్చింది? దానికి కారణాలేమిటి?

విజయాన్ని సాధించిన కార్మికులు, రైతులూ తమకుతామే బూర్జువా ప్రతినిధులకు అధికారాన్ని ఎలా అప్పగించారు? దానికి కారణాలేమిటి?

దీనికి జవాబును లెనిన్ ఈవిధంగా వివరించాడు. రాజకీయాలలో అనుభవంలేని లక్షలాది ప్రజలు చైతన్యవంతులై రాజకీయ కార్యాచరణలోకి ముందుకు దూకారు. ఇందులో చాలభాగం చిన్న స్వంత ఆస్తిదారులు, రైతులు, ఇటీవలివరకు రైతులుగావుండి, ఇపుడు కార్మికులుగా మారినవారు. పెట్టుబడిదారీ వర్గానికి, శ్రామికవర్గానికి మధ్యగావున్న ప్రజలు. ఆ కాలంలో యూరప్‌లోని పెద్దదేశాల అన్నిటిలోకి రష్యా చాలా మధ్యతరగతిదేశం (పెటీ బూర్జువాదేశం). ఈ దేశంలో "బ్రహ్మాండమైన పెటీబూర్జువా (మధ్యతరగతి) వెల్లువ ప్రతిదానిని తుడిచిపెట్టివేసింది. వర్గచైతన్యంగల శ్రామికులను సంఖ్యారీత్యానే గాక సిద్ధాంతరీత్యాకూడా ముంచెత్తింది. అంటే కార్మికులలో అత్యధిక భాగానికి పెటీబూర్జువా రాజకీయ దృక్పథం అనే వ్యాధిని సంక్రమింపజేసి జీర్ణింపజేసింది."(లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్ - ఇంగ్లీషు ఎడిషన్ - మాస్కో. 1947-రెండవ వాల్యూం - 29 వ పేజీ)

ఈ మధ్యతరగతి (పెటీబూర్జువా)యొక్క అస్పష్ట ప్రాథమిక వెల్లువయే, మధ్యతరగతి పార్టీలైన మెన్షివిక్, సోషలిస్టు-రివల్యూషనరీ పార్టీలను ముందుకు నెట్టాయి.

లెనిన్ మరొక కారణాన్నికూడా చూపించాడు. యుద్ధకాలంలో శ్రామికవర్గ నిర్మాణంలో మార్పువచ్చింది. విప్లవ ప్రారంభంలో శ్రామికవర్గంలో నిర్మాణమూ, తగినంత వర్గ చైతన్యమూలేవు. అసలు కార్మికుల వర్గంలోనే పెద్దమార్పులు వచ్చాయి. కార్మికులలో నూటికి 40 మంది సైన్యంలోచేరారు. చిన్నచిన్న స్వంత ఆస్తిదారులు, చేతిపారిశ్రామికులు, దుకాణ

దారులు సైనిక సమీకరణనుండి తప్పించుకోడానికిగాను ఫ్యాక్టరీలలో చేరారు. వీరికీ శ్రామికవర్గ మన స్తత్వానికీ చాలాదూరం.

కార్మికులలోని ఈ రకపు మధ్యతరగతి భాగాలే, మధ్యతరగతి రాజకీయవేత్తలకు అనగా మెన్షివిక్కులకు, సోషలిస్టు-రివల్యూషనరీలకు అనుకూల క్షేత్రాలయ్యాయి. వీటినుండే వారు వృద్ధిచెందారు.

అందుచేతనే అనేకమంది ప్రజలు, రాజకీయాలలో అనుభవంలేనివారు, ఈ అస్పష్ట ప్రాథమిక మధ్యతరగతి సుడిగుండంలో కొట్టుకుపోయారు. విప్లవప్రథమ విజయాలతో మత్తెక్కిపోయి, మొదటి రోజులలో రాజీపడే పార్టీల పలుకుబడిలోకి తాము కొట్టుకుపోయారు. బూర్జువా అధికారం సోవియట్ల కార్యకలాపాలను కూలద్రోయదని అమాయకంగా నమ్మి ప్రభుత్వాధికారాన్ని పెట్టుబడిదారీవర్గానికి అప్పగించడానికి అంగీకరించారు.

బోల్షివిక్ పార్టీ కర్తవ్యం ఇది: ఓపికగా విశదీకరించుట ద్వారా తాత్కాలిక ప్రభుత్వంయొక్క సామ్రాజ్యవాద స్వభావాన్ని తెలియజేసి ప్రజాసామాన్యం కండ్లు తెరవడం; సోషలిస్టు - రివల్యూషనరీల, మెన్షివిక్కుల ద్రోహాన్ని బట్టబయలు చేయడం; తాత్కాలిక ప్రభుత్వంస్థానే సోవియట్ల ప్రభుత్వాన్ని స్థాపించితేతప్ప శాంతిని సాధించలేమని నిరూపించడం.

ఇందుకుగాను బోల్షివిక్ పార్టీ ఉన్న శక్తినంతా ఉపయోగించి పనిచేసింది.

బోల్షివిక్ పార్టీ తిరిగి బహిరంగ పత్రికలను ప్రకటించసాగింది. ఫిబ్రవరి విప్లవం జరిగిన 5 రోజులలోనే ప్రవదా

పత్రిక పెట్రోగ్రాడ్ నుండి వెలువడింది. తర్వాత కొన్ని రోజు లకు మాస్కోనుండి సోషల్ - డెమాక్రట్ (Sotsial-domo-krat) వెలువడింది. లిబరల్ బూర్జువాలోను, మెన్షివిక్కుల లోను, సోషలిస్టు - రివల్యూషనరీలలోను విశ్వాసాన్ని కోలు పోవుచున్న ప్రజలకు అది నాయకత్వం వహించసాగింది. కార్మికవర్గంతో సంయుక్తంగా పనిచేయవలసిన ఆవశ్యకతను రైతులకు, సైనికులకు అది ఓపికతో వివరించింది. విప్లవాన్ని పెంపొందించితే తప్ప, తాత్కాలిక ప్రభుత్వం స్థానే సోవియట్ల ప్రభుత్వాన్ని స్థాపించితే తప్ప, రైతులకు శాంతిగాని, భూమి గాని లభించదని వారికి బోల్షివిక్ పార్టీ వివరించింది.

## క్లుప్తసారాంశం

పెట్టుబడిదారీ దేశాలు అసమానంగా వృద్ధిచెంది ముఖ్య రాజ్యాల మధ్య సమస్థాయి (Equilibrium) చెడిపోవడం వల్లను, ప్రపంచాన్ని యుద్ధంద్వారా తిరిగి పంచుకొని క్రొత్త సమస్థాయిని ఏర్పరచుకొనవలసిన ఆవశ్యకత సామ్రాజ్యవాదు లకు అవసరం అనడంవల్లను, సామ్రాజ్యవాదయుద్ధం ప్రారంభ మయింది.

రెండవ ఇంటర్నేషనల్ పార్టీలుగనుక కార్మికవర్గ ఆశ యానికి ద్రోహంచేసి వుండకపోయినట్లయితే రెండవ ఇంట ర్నేషనల్ కాంగ్రెస్ యొక్క యుద్ధ వ్యతిరేక తీర్మానాలను వారు ఉల్లంఘించక పోయినట్లయితే, తమ తమ సామ్రాజ్యవాద ప్రభుత్వాలకు, యుద్ధోన్మాదులకు వ్యతిరేకంగా కార్మికవర్గాన్ని రేకెత్తించుటకూ, పోరాడుటకు వారు ధైర్యంచేసినట్లయితే,

యుద్ధం అంత వినాశకరమైనదిగా మారివుండేది కాదు. అంతటి విస్తృతంకూడ అయివుండేదికాదు.

సోషలిస్టు ఆశయానికి, అంతర్జాతీయతా ఆశయానికి విశ్వాసవంతంగానిలబడిన శ్రామికవర్గ పార్టీ ఒక్క బోల్షివిక్ పార్టీయే. అదొక్కటే తన సామ్రాజ్యవాద ప్రభుత్వానికి వ్యతిరేకంగా అంతర్యుద్ధాన్ని సంఘటిత పరచింది. తమ నాయకుల ద్వారా పెట్టుబడిదారీవర్గానికి కట్టివేయబడిన ఇతర పార్టీలన్నీ రెండవ ఇంటర్నేషనల్ పార్టీలన్నీ సామ్రాజ్యవాద పలుకుబడి కిందకు వచ్చాయి. సామ్రాజ్యవాదుల పక్షాన చేరిపోయి ద్రోహం చేశాయి.

పెట్టుబడిదారీ విధానపు సాధారణ సంక్షోభాన్ని ఈ యుద్ధం ప్రతిబింబించింది. ఇంతే గాదు. ఈ సంక్షోభాన్ని మరింత తీవ్రపరచి ప్రపంచ పెట్టుబడిదారీ విధానాన్ని బలహీన పరచింది. పెట్టుబడిదారీ విధాన బలహీనతను అవకాశంగా తీసుకొని విజయంపొందినవారు ప్రపంచంలోకల్లా మొట్టమొదట రష్యన్ కార్మికులూ, బోల్షివిక్ పార్టీ. వీరు సామ్రాజ్యవాద శ్రేణిలో గండికొట్టి జారును కూలద్రోసి కార్మిక సైనిక ప్రతినిధుల సోవియట్లను నెలకొల్పారు.

విప్లవ ప్రథమ విజయాలతో మత్తెక్కిపోయి ఇకనుంచి అంతా చక్కగా ప్రతిదీ సాగిపోతుందని మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు చేసిన వాగ్దానాలకు సమ్మోహితులై మధ్యతరగతిజనం, సైనికులు, కార్మికులు తాత్కాలిక ప్రభుత్వంలో నమ్మకం పెట్టుకొని దానిని బలపరచారు.

ప్రథమ విజయాలతో మత్తెక్కిన సైనికులకు, కార్మిక ప్రజలకూ ఈకింది విషయాలను వివరించవలసిన కర్తవ్యం బోల్షివిక్ పార్టీపై పడింది. ఆవిషయాలివి: విప్లవ సంపూర్ణ విజయం ఇంకా చాలాదూరానవుంది. పెట్టుబడిదారీ తాత్కాలిక ప్రభుత్వంచేతిలో అధికారం ఉన్నన్నాళ్లూ, రాజీబేరగాళ్ళయిన మెన్షివిక్కుల, సోషలిస్టు-రివల్యూషనరీల ప్రాబల్యం సోవియట్లలో ఉన్నన్నాళ్ళూ, ప్రజలు శాంతినిగాని భూమినిగాని తిండినిగాని సంపాదించలేరు. సంపూర్ణ విజయం పొందాలంటే మరొకఅడుగు ముందుకు వేయాలి. అధికారాన్ని సోవియట్లహస్తగతం చేయాలి.

# ఏడవ అధ్యాయం

## అక్టోబరు సోషలిస్టు విప్లవాన్ని సన్నాహపరచి సాధించినకాలంలో బోల్షివిక్ పార్టీ

## [ 1917 ఏప్రిల్ - 1918 ]

ఫిబ్రవరి విప్లవానంతరం దేశంలోని పరిస్థితి – రహస్య జీవనంనుండి బయటపడి బహిరంగ రాజకీయ కార్యకలాపానికి పార్టీ పూనుకొనుట– పెట్రోగ్రాడ్‌కు లెనిన్ రాక – లెనిన్ ఏప్రిల్ ప్రతిపాదన – సోషలిస్టు విప్లవంలోకి పరివర్తనం జెందుటను గురించి పార్టీ విధానం

రోజురోజూ జరుగుతున్న ఘటనలు, తాత్కాలిక ప్రభుత్వం యొక్క పరివర్తన – ఇవన్నీ బోల్షివిక్కు పోకడయే సరియైనదని ప్రతిదినమూ కొత్త నిదర్శనాలను చూపి రుజువు చేస్తూవచ్చాయి. తాత్కాలిక ప్రభుత్వం ప్రజలకోసం గాక ప్రజలకు వ్యతిరేకంగానూ, శాంతికోసంగాక యుద్ధం కోసమూ పనిచేస్తుందని రోజురోజుకూ మరింత స్పష్టపడ నారంభించింది. అది ప్రజలకు శాంతిని, భూమిని, తిండిని ఇవ్వడానికి ఇష్టపడుటలేదనీ, ఆ పని దానికి చేతగాదనీ రోజు రోజూ స్పష్టమౌతోంది. బోల్షివిక్కులు పరిస్థితులను వివరించుతూ చేసే ప్రచారం ఫలప్రదమవుతోంది.

కార్మికులు, సైనికులు జారుప్రభుత్వాన్ని కూలద్రోసి రాచరికాన్ని (Monarchy) కూకటివేళ్ళతో పెరికి నాశనం

చేస్తోంటే, తాత్కాలిక ప్రభుత్వం అరాచకాన్ని నిశ్చితంగా కాపాడదలచింది. 1917 మార్చి 2వ తేదీన అది గుష్కోవ్, షల్గిన్ అనువారిని జారు చక్రవర్తిని సందర్శించడానికి రహస్యంగా నియమించింది. నికోలస్ రోమనావ్ సోదరుడు మైకేల్‌కు అధికారాన్ని అప్పగించాలని పెట్టుబడిదారీవర్గం కోరుతోంది. కాని రైల్వేకార్మికుల సభలో తన ఉపన్యాసాన్ని "చక్రవర్తి మైకేల్ చిరంజీవి యగుగాక!" అని గుష్కోవ్ ముగించేసరికి కార్మికులు గుష్కోవ్‌ను అరెస్టుచేసి సోదాచేయాలని కోరారు. "బీరకాయ కంటె నేతిబీరకాయ ఏమంత శ్రేష్టమైనది కాదులే" అని వారు క్రోధావేశంతో కేకలువేశారు.

రాచరికాన్ని పునరుద్ధరించడానికి కార్మికు లంగీకరించరనేది స్పష్టమైంది.

తమ రక్తాన్ని ధారవోసి విప్లవం గావించుతున్న కార్మికులు, రైతులు యుద్ధం అంతమొందించబడుతుందని ఆశించుతున్నారు. భూమికోసం, తిండికోసం పోరాడుతూ వారు ఆర్థిక అరాచకాన్ని అంతమొందించడానికి తీవ్రమైన చర్యలు తీసుకోవలసిందని కోరుతున్నారు. అయితే తాత్కాలిక ప్రభుత్వం ప్రజల ఈ ముఖ్య కోర్కెలను పెడచెవిని పెట్టింది. ప్రముఖులయిన పెట్టుబడిదారుల, భూస్వాముల ప్రతినిధులతో కూడియున్న ఆ ప్రభుత్వానికి భూమిని తమకు ఈయాలని అడిగే రైతుల కోర్కెను తీర్చే ఉద్దేశ్యం లేదు. కార్మిక ప్రజలకు తిండి పెట్టడానికికూడా యీ ప్రభుత్వానికి చేతకాలేదు. ఎందుచేతనంటే, అలా చేస్తే పెద్ద పెద్ద ధాన్యపు వర్తకుల ప్రయోజనాలకు నష్టం గల్గించవలసి వస్తుంది. భూస్వాముల నుండి,

కులకల నుండి వీలైన అన్ని పద్ధతుల ద్వారా ధాన్యాన్ని లాక్కోవలసి వస్తుంది. ఈ వర్గాల ప్రయోజనాలతో ప్రభుత్వమే కట్టుబడి వుండుటవలన యీ పనికి ప్రభుత్వం సాహసించ లేకపోయింది. పోనీ, ప్రజలకు శాంతిని సమకూర్చుతుందా అంటే అదీ చేయలేదు. బ్రిటిష్ ఫ్రెంచి సామ్రాజ్యవాదులతో బంధింపబడుటవల్ల తాత్కాలిక ప్రభుత్వం యుద్ధాన్ని అంత మొందించడానికి ఇష్టపడుటలేదు. తద్విరుద్ధంగా అది విప్లవాన్ని అవకాశంగా తీసుకొని సామ్రాజ్యవాద యుద్ధంలో రష్యా మరింత ఎక్కువగా పాల్గొనేటట్లు చేయాలని ప్రయత్నించింది. తద్వారా కాన్‌స్టాంటినోపిల్ నగరాన్ని, డార్డినెల్సు జలసంధిని, గేలీషియా రాష్ట్రాన్ని వశపరచుకొని తన సామ్రాజ్య కాంక్షలను తీర్చుకోవాలని ప్రయత్నించింది.

తాత్కాలిక ప్రభుత్వ విధానంలో ప్రజల విశ్వాసం త్వరలోనే సమసిపోతుందని స్పష్టమైంది.

ఫిబ్రవరి విప్లవానంతరం ఏర్పడిన ద్వంద్వాధికారం, ఎంతోకాలం కొనసాగదని స్పష్టమౌతూంది. ఎందువల్లనంటే అధికారం ఏదో ఒక ప్రభుత్వం చేతిలోనే కేంద్రీకరింపబడి వుండాలని ఘటనాక్రమం కోరింది. తాత్కాలిక ప్రభుత్వం చేతిలోనైనా లేక సోవియట్ల చేతిలోనైనా అధికారం కేంద్రీకరింపబడాలి.

మెన్షివిక్కుల, సోషలిస్టు - రివల్యూషనరీల రాజీవిధానానికి ఇంకా ప్రజాసామాన్యంలో అండ ఉన్నమాట నిజమే. "ప్రజాపరిషత్తు (Constituent Assembly) త్వరలో ఏర్పడుతుందనీ అలాఏర్పడి అంతా శాంతియుతంగా చక్కబరుస్తుందనీ"

నమ్మిన కార్మికులు అనేకమంది వున్నారు. ఇలా నమ్మినవారిలో వీరికన్న ఎక్కువసంఖ్యలో సైనికులు, రైతులు వున్నారు. యుద్ధం దురాక్రమణకు గాక అవసరాన్నిబట్టి తమ ప్రభుత్వాన్ని సంరక్షించుకొనేందుకు మాత్రమే కొనసాగింప బడుతూందని వీరు నమ్మారు. ఇలాంటివారిని "కల్లా కపటం లేకుండా నిజంగానే పొరపాటుపడిన దేశరక్షణవాదులు" (Honestly mistakan defencists) అని లెనిన్ పిలిచాడు. ఇలాంటి ప్రజలు వాగ్దానాలతోను, తియ్యతియ్యని మాటలతోను కూడుకొనివున్న సోషలిస్టు - రివల్యూషనరీల, మెన్షివిక్కుల విధానం సరియైనదేనని ఇంకా అనుకుంటున్నారు. కాని ఈ వాగ్దానాలు, తియ్యతియ్యని మాటలు ఎంతోకాలం నిలవలేవని స్పష్టమవుతోంది. సోషలిస్టు - రివల్యూషనరీల, మెన్షివిక్కుల రాజీవిధానం అమాయకులను మోసగించి కాలవిలంబనం చేసే విధానమని పరిస్థితులూ, తాత్కాలిక ప్రభుత్వ ప్రవర్తనా రోజురోజుకూ బట్టబయలు చేస్తునాయి.

తాత్కాలిక ప్రభుత్వం ప్రజాసామాన్య విప్లవోద్యమానికి వ్యతిరేకంగా రహస్యపోరాటానికే, చాటుమాటు పన్నాగాలకే అంటిపెట్టుకు కూర్చోలేదు. అది ఒక్కొక్కప్పుడు బహిరంగంగా ప్రజాతంత్ర హక్కులపై దాడికూడా సాగించింది. "క్రమశిక్షణ తిరిగి నెలకొల్పడానికి" ముఖ్యంగా సైనికులలో "క్రమపద్ధతిని స్థాపించడానికి" అంటే పెట్టుబడిదారీవర్గ అవసరాలకు తగిన మార్గాలలో విప్లవాన్ని నడపడానికి అది ప్రయత్నించింది. కాని ఈ ప్రయత్నాలు ఫలించలేదు. ప్రజలు తమ ప్రజాతంత్ర హక్కులను అనగా వాక్,

సభా, సంఘ, పత్రిక, ప్రదర్శనా స్వాతంత్ర్యాలను ఉత్సాహంతో నిలబెట్టుకున్నారు. రాజకీయ జీవితంలో ముఖ్య పాత్రను వహించడానికీ, పరిస్థితులను తెలివితేటలతో అర్థం చేసుకొని, ముందు చేయవలసినదేమిటో నిర్ణయించుకోడానికీ, కార్మికులు, సైనికులు తాము కొత్తగా సంపాదించుకొన్న ప్రజాతంత్ర హక్కులను పూర్తిగా వినియోగించ ప్రయత్నించారు.

జార్ పరిపాలనలో అత్యంత కష్టపరిస్థితులలో రహస్యంగా పనిచేస్తున్న బోల్షివిక్ పార్టీ సంస్థలు ఫిబవరి విప్లవానంతరం రహస్యజీవితం నుండి బయటకువచ్చి రాజకీయ, సంఘటనా కార్యకలాపాలను బహిరంగంగా అభివృద్ధిచేయ ప్రారంభించాయి. ఆ రోజుల్లో బోల్షివిక సంస్థల సభ్యత్వం 40 వేలు లేక 45 వేలకు మించి వుండలేదు. కాని వీరంతా పోరాటంలో రాటుతేలిన గట్టి విప్లవకారులు. పార్టీకమిటీలన్నీ 'డెమాక్రటిక్ సెంట్రలిజం' (కేంద్రీకృత ప్రజాస్వామ్యం) సూత్రంపై పునర్నిర్మించబడ్డాయి. పైనుండి కిందివరకూ పార్టీ సంఘాలన్నీ ఎన్నికపద్ధతిపై పునర్నిర్మించబడ్డాయి.

పార్టీ బహిరంగ జీవనాన్ని ప్రారంభించగానే, దాని అనుచరులలో వున్న విభేదాలు బయటపడ్డాయి. కామెనివ్, మాస్కో సంస్థకు చెందిన అనేక కార్మికులు - ఉదాహరణకు రైకోవ్, బబ్నోవ్, నోగిన్ మొదలైనవారు- దాదాపు మెన్షివిక్ (Semi-Menshivik) పద్ధతినే అవలంబించారు. తాత్కాలిక ప్రభుత్వాన్ని, దేశరక్షణవాదుల (Defencists) విధానాన్ని, కొన్నిషరతులపై బలపరచాలని వీరన్నారు.

ప్రవాసమునుండి అప్పుడే తిరిగివచ్చిన స్టాలిన్, అతనితోపాటు మాలటోవ్ మొదలగువారు పార్టీలోని అధిక సంఖ్యాకులతో కలసి తాత్కాలిక ప్రభుత్వంలో విశ్వాస రాహిత్య విధానాన్ని బలపరచారు. దేశరక్షణ వాదాన్ని (Defencism) వ్యతిరేకించారు. శాంతికోసం, సామ్రాజ్యవాద యుద్ధానికి వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటాన్ని సాగించాలని ఆదేశించారు. కొంతమంది పార్టీ వర్కర్లు ఊగిసలాడారు. దీనికి కారణం వారు రాజకీయంగా వెనుకబడివుండటం. దీర్ఘకాలం జైళ్ళలోనో, ప్రవాసంలోనో జీవితాన్ని గడిపి ఉండటం.

పార్టీకి నాయకుడు – లెనిన్ – లేని కొరత కనపడింది.

1917 ఏప్రిల్ మూడో తేదీన (16వ తేదీన) చాలాకాలం ప్రవాసంలో వుండిన లెనిన్ రష్యాకు తిరిగివచ్చాడు.

లెనిన్ రాక పార్టీ దృష్ట్యా, విప్లవ దృష్ట్యా అత్యద్భుతమైన ప్రాముఖ్యత కల్గివుంది.

స్విట్జర్‌లాండ్‌లో వుండగా లెనిన్ విప్లవాన్ని గురించిన మొదటివార్త వినగానే, పార్టీని, కార్మికవర్గాన్ని ఉద్దేశించి లేఖలు ("దూరదేశాలనుండి లేఖలు") వ్రాశాడు. వాటిలో ఇలా అన్నాడు:

"కార్మికులారా! జారుప్రభుత్వ వ్యతిరేక అంతర్యుద్ధంలో మీరు అత్యద్భుతంగా శ్రామికవర్గ శౌర్యాన్ని, ప్రజా శౌర్యాన్ని ప్రదర్శించారు. ఇప్పుడు మీరు అద్భుతమైన నిర్మాణ కౌశల్యాన్ని, శ్రామికవర్గ నిర్మాణ కౌశల్యాన్ని, ప్రజానిర్మాణ కౌశల్యాన్ని ప్రదర్శించి విప్లవ రెండవదశలో

మీ విజయానికి మార్గాన్ని సుగమం చేసుకోవాలి." (లెనిన్, సెలెక్టెడ్ వర్క్స్, ఇంగ్లీష్ ఎడిషన్ - మాస్కో 1947, 1 వ వాల్యూం. 741 వ పేజీ)

ఏప్రిల్ మూడవ తేదీ రాత్రి పెట్రోగ్రాడ్ నగరంలో లెనిన్ ప్రవేశించాడు. ఫిన్లండ్ రైల్వే స్టేషన్ వద్ద స్టేషన్ చౌకులో ఆయనకు స్వాగత మివ్వడానికి వేలాది కార్మికులు, సైనికులు, నావికులు సమావేశమయ్యారు. లెనిన్ రైలులో నుండి దిగినప్పుడు వారి ఉత్సాహం వర్ణనాతీతం. తమనాయకుడైన లెనిన్‌ను భుజాలపై కెత్తుకొని స్టేషన్‌లోని ముఖ్యమైన వెయిటింగ్ రూములోకి తీసుకపోయారు. అక్కడ మెన్షివిక్కులగు కీడ్జ్ (Chkheidze), స్కోబిలేవ్ లు, పెట్రోగ్రాడ్ సోవియట్ తరఫున "స్వాగత" ఉపన్యాసాలు ప్రారంభించారు. అందులో వారు తామూ, లెనినూ "ఒకే భాష" మాట్లాడగల అవకాశం లభించుతుందనే "ఆశను వెలిబుచ్చారు." కాని లెనిన్ వారిని వింటూ కూర్చోలేదు. వారిని ప్రక్కకునెట్టి కార్మిక సైనిక ప్రజలవద్దకు వెళ్లాడు. ఒక సాయుధ మోటారు పై కెక్కి ప్రఖ్యాతమైన ఉపన్యాసాన్ని ఇచ్చాడు. సోషలిస్టు విప్లవ విజయంకోసం పోరాడవలసిందిగా ప్రజానీకాన్ని కోరాడు. అనేక సంవత్సరాలు ప్రవాసం తర్వాత ఇచ్చిన మొదటి ఉపన్యాసాన్ని, "సోషలిస్టు విప్లవం చిరస్థాయి యగుగాక !" అనే మాటలతో లెనిన్ ముగించాడు.

లెనిన్ రష్యాకు తిరిగివచ్చిన నాటనుండి విప్లవ కార్యక్రమంలో దుమికి నిమగ్నుడై పోయాడు. తాను వచ్చిన మరుసటిదినం బోల్షివిక్కుల మీటింగులో యుద్ధమూ- విప్లవం అనే

విషయంపై ఒకరిపోర్టు ఇచ్చాడు. ఆ తర్వాత బోల్షివిక్కులు, మెన్షివిక్కులు ఇద్దరూ హాజరైన ఒక మీటింగులో ఈ రిపోర్టులోని ప్రతిపాదనలనే తిరిగి చెప్పాడు.

ఇవే లెనిన్ యొక్క సుప్రసిద్ధమైన ఏప్రిల్ ప్రతిపాదనలు. బూర్జువా విప్లవంనుండి సోషలిస్టు విప్లవానికి పరివర్తన చెందటానికి స్పష్టమైన విప్లవపోకడను పార్టీకి, శ్రామికవర్గానికి ఈ ప్రతిపాదనలు చూపాయి.

విప్లవానికి, ఆతర్వాత పార్టీ పనికి లెనిన్ ప్రతిపాదనలు అత్యంత ప్రాముఖ్యత వహించాయి. విప్లవం దేశజీవితంలో అతి ముఖ్యమైన మార్పును తీసుకువచ్చింది. జార్ ప్రభుత్వం కూలద్రోయ బడిన పిదప నూతన పోరాట పరిస్థితులు ఏర్పడ్డాయి. ఇప్పుడు నూతన పంధాగుండా ఆత్మవిశ్వాసంతోను ధైర్యంతోను పురోగమించవలసిన ఒక కొత్త కార్య విధానం పార్టీకి అవసరమైంది. లెనిన్ ప్రతిపాదనలు పార్టీకి ఈ నూతన దృక్పధాన్ని కల్గించాయి.

బూర్జువా ప్రజాతంత్ర విప్లవంనుండి సోషలిస్టు విప్లవ పరివర్తనకు, విప్లవప్రధమ దశనుండి రెండవదశకు అనగా సోషలిస్టు విప్లవదశకు, అత్యద్భుతమైన పోరాట కార్యక్రమాన్ని లెనిన్ ఏప్రిల్ ప్రతిపాదనలు ఇచ్చాయి. ఈ మహాకర్తవ్యాన్ని నిర్వహించేందుకు తగిన సామర్ధ్యాన్ని పార్టీకి దాసియూవత్ చరిత్రాసమకూర్చింది. ఎన్నడో 1905 లోనే "ప్రజాతంత్ర విప్లవంలో సోషల్ డెమాక్రసీ అవలంబింపవలసిన రెండు ఎత్తుగడలు" అనే కరపత్రంలో లెనిన్ ఇలావ్రాశాడు: జార్ ప్రభుత్వాన్ని కూలద్రోసినపిదప సోషలిస్టు విప్లవాన్ని తీసుకు

రావడానికి శ్రామికవర్గం ముందుకుపోతుంది. ప్రతిపాదనలలో కొత్తవిషయం ఏమంటే, సోషలిస్టు విప్లవ పరివర్తన ప్రాథమిక దశకు కావలసిన సిద్ధాంత స్పష్టమైన, నిర్దిష్టమైన కార్యక్రమాన్ని ఈయడం.

ఆర్థికరంగంలో సోషలిస్టు విప్లవపరివర్తనకు అవలంబించవలసిన పద్ధతులివి: భూమిని అంతా జాతీయపరం చేయటం, ఎస్టేటు భూములను వశపరచుకోడం, బ్యాంకుల నన్నిటిని ఒకే జాతీయబ్యాంకుగా కలిపివేసి కార్మిక ప్రతినిధుల సోవియట్ పెత్తనంక్రింద ఉంచడం, సామాజిక ఉత్పత్తి పంపకాలపై ఆ సోవియట్ పెత్తనాన్ని ఏర్పరచడం.

రాజకీయరంగంలో పార్లమెంటరీ రిపబ్లిక్కునుండి సోవియట్ల రిపబ్లిక్కు పరివర్తనం చెందాలని లెనిన్ సూచించాడు. ఇది మార్క్సిస్టు సిద్ధాంతంలోనూ, ఆచరణలోనూ ఒక ముఖ్యమైన ముందడుగు. ఇంతవరకు మార్క్సిస్టు సిద్ధాంత కర్తలు పార్లమెంటరీ రిపబ్లిక్, సోషలిజాన్ని సాధించటానికి చాలా మంచి రాజకీయ సాధనం అని తలుస్తూ వచ్చారు. పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి మారిపోయే కాలంలోని సమాజంయొక్క రాజకీయ నిర్మాణానికి, పార్లమెంటరీ రిపబ్లిక్ స్థానే సోవియట్ రిపబ్లిక్‌ను ఏర్పరచుటే చాలా అనువైన సాధనమని ఇప్పుడు లెనిన్ సూచించాడు.

లెనిన్ ప్రతిపాదనలు ఈ విధంగా తెలియజేసాయి: "రష్యాలో ప్రస్తుత పరిస్థితియొక్క ప్రత్యేక స్వభావం, విప్లవ ప్రథమదశనుండి రెండవదశకు పరివర్తన చెందుట. శ్రామిక వర్గంలో తగినంత వర్గచైతన్యమూ, నిర్మాణమూ లేకపోవడం

వల్ల మొదటి దశలో అధికారాన్ని పెట్టుబడిదారీవర్గం చేతుల్లో పెట్టారు. ఈ రెండవదశలో శ్రామికవర్గం చేతుల్లోనూ, రైతాంగంలోని అత్యంత బీదవర్గాల చేతుల్లోనూ అధికారాన్ని పెట్టాలి." (పై గ్రంథమే - 2వ వాల్యూం, 18 వ పేజీ)

లెనిన్ ఇంకా ఇలా అన్నాడు: "పార్లమెంటరీ రిపబ్లిక్ కాదు నేడు కావలసింది. నేడున్న కార్మిక ప్రతినిధుల సోవియట్ల నుండి పార్లమెంటరీ రిపబ్లిక్‌కు వెళ్ళడం అంటే అది వెనుకంజ వేయడమే. కార్మిక, వ్యవసాయకూలీ, రైతు ప్రతినిధుల సోవియట్ల రిపబ్లిక్‌ను దేశమంతటా పై నుంచి కిందివరకు స్థాపించాలి." (పై గ్రంథమే - 18వ పేజీ)

ఈ నూతన తాత్కాలిక ప్రభుత్వంకింద యుద్ధం, కొల్లగొట్టే సామ్రాజ్యవాద యుద్ధంగానే కొనసాగింపబడుతుం దని లెనిన్ అన్నాడు. ఈ విషయాన్ని ప్రజాసామాన్యానికి వివరించవలసిన కర్తవ్యం పార్టీపై వుంది. పెట్టుబడిదారీవర్గాన్ని కూలద్రోస్తే తప్ప యుద్ధాన్ని అంతమొందించలేము. నష్ట పరిహారాల పేరిట కొల్లగొట్టే దురాశాపూరిత శాంతికాక నిజ మైనప్రజాతంత్ర శాంతిని ఏర్పరచలేమని విశదపరచుటకర్తవ్యం.

తాత్కాలిక ప్రభుత్వాన్నిగురించి లెనిన్ ఈ నినాదం ఇచ్చాడు : "తాత్కాలిక ప్రభుత్వాన్ని ఎవరూ బలపరచ గూడదు."

ఇంకా, సోవియట్లలో మన పార్టీ ఇంకా మైనారిటీగానే వుందనీ, మెన్షివిక్కులు సోషలిస్టు-రివల్యూషనరీలు కలసివున్న ముఠా (Block - బ్లాక్) ప్రాబల్యంకిందనే సోవియట్లు వున్నా యనీ, శ్రామికవర్గంమీద పెట్టుబడిదారీవర్గ పలుకుబడికి ఈ

ముతా ఒక సాధనమని లెనిన్ పేర్కొన్నాడు. అందుచే పార్టీ కర్తవ్యం ఈ క్రింది విధమైనదని లెనిన్ తన ప్రతిపాదనలో తెలియజేశాడు.

"కార్మిక ప్రతినిధుల సోవియట్లు ఒక్కటే విప్లవప్రభుత్వ స్వరూపం అని ప్రజాసామాన్యానికి విశదపరచాలి. అందుచే ఈ ప్రభుత్వం పెట్టుబడిదారీ పలుకుబడికి లొంగిఉండినన్నాళ్లూ, వారి ఎత్తుగడలలోని తప్పులను ఓపికతో, క్రమపద్ధతితో వదలి పెట్టకుండా తెలియజెప్పవలసిన కర్తవ్యంమనది. ఈ విశదీకరణ ప్రజలదైనందిన అవసరాలకు అనుగుణ్యంగా ఉండాలి. మనం మైనారిటీగా వున్నంతకాలం ఈ ప్రభుత్వంయొక్క తప్పులను బయటపెట్టి విమర్శిస్తూ వుండాలి. ఇదే సమయంలో యావత్తు రాజ్యాధికారాన్ని కార్మిక ప్రతినిధుల సోవియట్లకు అప్పజెప్ప వలసిన ఆవశ్యకతనుగురించి మనం బోధించాలి..." (లెనిన్, కలెక్టెడ్‌వర్క్స్, రష్యన్ ఎడిషన్ 20వ వాల్యూం - 88వ పేజీ)

దీని అర్థం తాత్కాలిక ప్రభుత్వంపై తిరుగుబాటు తీసుకురమ్మని లెనిన్ చెప్పలేదు ఆ సమయంలో సోవియట్ల విశ్వాసాన్ని తాత్కాలిక ప్రభుత్వం చూరగొంది. అందుచే లెనిన్ దాన్ని కూలద్రోయాలని కోరలేదు. లెనిన్ కోరిందల్లా ఓపికతో వివరించుటద్వారా, అనుచరులను చేర్చుకొనుట ద్వారా, సోవియట్లలో మెజారిటీ సంపాదించాలనీ, సోవియట్ల విధానం మార్చాలనీ, సోవియట్లద్వారా ప్రభుత్వ అంగనిర్మాణాన్ని, విధానాన్ని మార్చాలనీ లెనిన్ తెలియజేశాడు.

అనగా విప్లవం శాంతియుతంగా అభివృద్ధి చెందు పోకడను ఇది తెలియజేస్తుంది.

"మాసిపోయిన చొక్కాను" తీసివేయాలనికూడా లెనిన్ కోరాడు. అనగా పార్టీని ఇకనుండి సోషల్ డెమాక్రటిక్ పార్టీ అనిపిలువరాదన్నాడు. రెండవ ఇంటర్నేషనల్ పార్టీలు, రష్యన్ మెన్షివిక్కులు తాము సోషల్ డెమాక్రట్లమని పిలుచుకునేవారు. అవకాశవాదులు, సోషలిజానికి ద్రోహం చేసినవారు ఈ పేరును కళంకం చేసి అవమానం చేశారు. కనుక బోల్షివిక్కుల పార్టీని కమ్యూనిస్టుపార్టీ అని పిలవాలని అన్నాడు. మార్క్స్ - ఏంగెల్సులు తమ పార్టీకి ఇదే పేరు పెట్టారు. ఈ పేరు శాస్త్రీయ దృష్ట్యాకూడ సరియైనదే. ఎందుచేతనంటే కమ్యూనిజాన్ని సాధించడమే బోల్షివిక్ పార్టీ అంతిమలక్ష్యం. మానవజాతి, పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి మాత్రమే తిన్నగా పోగలదు. సోషలిజంలో ఉత్పత్తి - పంపక సాధనాలన్నీ సమిష్టి యాజమాన్యం కింద వుంటాయి. ప్రతివారికీ వారు చేసిన పనిని బట్టి ఉత్పత్తి అయిన వస్తువులు పంచిపెట్టబడతాయి. మన పార్టీ ఇంకా ముందుకు చూసింది. సోషలిజం క్రమక్రమంగా కమ్యూనిజంలోకి తప్పనిసరిగా పోక తప్పదు. కమ్యూనిస్టు పతాకపైన ఈ కింది నీతి సూత్రం వ్రాసి వుంటుంది. "ప్రతివాడూ అతని శక్తి సామర్థ్యాలనుబట్టి పనిచేయాలి. అతని అవసరాలనుబట్టి వస్తు పంపకం జరగాలి."

తుదకు లెనిన్ ఒక కొత్త ఇంటర్నేషనల్‌ను అనగా మూడవ ఇంటర్నేషనల్‌ను స్థాపించాలని తన ప్రతిపాదనలో కోరాడు. ఈ మూడవ ఇంటర్నేషనల్‌లో అవకాశవాదానికీ, జాతీయ దురహంకారానికీ తావు వుండదు.

లెనిన్ ఈ ప్రతిపాదనలపట్ల పెట్టుబడిదారీవర్గం, మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు గగ్గోలు పెట్టారు.

మెన్షివిక్కులు "విప్లవం ప్రమాదస్థితిలో వుంది" అని హెచ్చరిస్తూ కార్మికులకు ఒక ప్రకటన చేశారు. కార్మిక సైనిక ప్రతినిధుల సోవియట్లకు అధికారాన్ని అప్పగించాలని బోల్షివిక్కులుకోరిన కోరికలోనే ఈ అపాయం వుందని మెన్షివిక్కుల అభిప్రాయం.

ప్లెఖనావ్ "ఎడిన్‌స్ట్వోవ్" (ఐక్యత) అనే తన పత్రికలో ఒక వ్యాసంవ్రాస్తూ లెనిన్ ఉపన్యాసాన్ని "క్రోధోన్మత్తమైన వెర్రివాగుడు" అని పేరుబెట్టాడు. కీడ్జీ అనే మెన్షివిక్ వ్రాసిన ఈ క్రింది వాక్యాలను అతడు ఉల్లేఖించాడు. "లెనిన్ ఒక్కడే విప్లవానికి బయటవుండి పోయాడు. మనం మాత్రం మన తోవను వెళ్ళిపోదాం."

ఏప్రిల్ 14వ తేదీన పెట్రోగ్రాడ్ పట్టణ బోల్షివిక్కుల సభజరిగింది. ఇది లెనిన్ ప్రతిపాదనను ఆమోదించి దానిని తమ కార్యక్రమానికి ప్రాతిపదికగా పెట్టుకొంది.

కొద్దికాలంలోనే పార్టీ స్థానిక సంస్థలుకూడా లెనిన్ ప్రతిపాదనను ఆమోదించాయి.

కామెనివ్, రైకోవ్, ప్యాటకోవ్ లాంటి కొద్దిమంది వ్యక్తులు తప్ప పార్టీయావత్తూ లెనిన్ ప్రతిపాదనలను అత్యంత సంతృప్తితో ఆమోదించింది.

# 2

## తాత్కాలిక ప్రభుత్వ సంక్షోభం ప్రారంభం-
## బోల్షివిక్ పార్టీ ఏప్రిల్ సమావేశం

**బో**ల్షివిక్కులు ఒకవైపున విప్లవాన్ని ఇంకా పెంపొందించడానికి సన్నాహాలు చేస్తూవుంటే రెండోవైపున తాత్కాలిక ప్రభుత్వం ప్రజలకు వ్యతిరేకంగా పనిచేయటం సాగిస్తూనేవుంది. ఏప్రిల్ 18వ తేదీన తాత్కాలిక ప్రభుత్వ విదేశాంగమంత్రి మిల్యుకోవ్ మిత్రరాజ్యాలకు ఈ విధంగా తెలియజేశాడు. "సంపూర్ణవిజయం లభించేవరకు ప్రపంచయుద్ధాన్ని కొనసాగించవలసిందేనని మాప్రజలు యావన్మందీ కోరుతున్నారు. మిత్రరాజ్యాలకు మాదేశం ఇచ్చిన హామీలన్నిటినీ (Obligations) తాత్కాలిక ప్రభుత్వం పూర్తిగా నెరవేర్చగోరుతోంది."

ఆ విధంగా తాత్కాలిక ప్రభుత్వం జార్‌ప్రభుత్వం చేసుకొన్న సంధిపత్రాలన్నిటికీ కట్టుబడివుండటానికి ప్రతిన చేసింది. యుద్ధం "విజయవంతంగా ముగిసేందుకు" సామ్రాజ్యవాదులకు అవసరమైన ప్రజలరక్తాన్ని ఎంత కావలిస్తే అంత ధారపోయడానికి తాత్కాలిక ప్రభుత్వం హామీని యిచ్చింది.

ఈ ప్రకటన ("మిల్యుకోవ్‌నోట్") ఏప్రిల్ 19వ తేదీన కార్మికులకు సైనికులకు తెలిసింది. బోల్షివిక్‌పార్టీ సెంట్రల్ కమిటీ, ఏప్రిల్ 20 వ తేదీన తాత్కాలిక ప్రభుత్వ సామ్రాజ్య

వాద పాలసీకి వ్యతిరేకంగా అసమ్మతి తెలియజేయవలసిందని ప్రజానీకాన్ని కోరింది. 1917 ఏప్రిల్ 20-21 తేదీలలో (మే 3.4 తేదీలలో) లక్షమందికి తక్కువ గాకుండా కార్మికులు సైనికులు "మిల్యుకోవ్ నోటు"తో క్రోధావేశపరులై ప్రదర్శనం చేశారు. "రహస్యసంధులను వెల్లడిచేయాలి!" "యుద్ధం నశించాలి!", "సోవియట్లకే అధికారం అంతా!" అనే నినాదాలు వ్రాసిన జెండాలతో ఊరేగారు. నగర పొలిమేరనుండి కార్మికులు తాత్కాలిక ప్రభుత్వ కేంద్రస్థానమైన నగర మధ్య భాగానికి ఊరేగింపుతో వచ్చారు. నెవస్కీ ప్రోస్పెక్ట్‌లోను యింకా యితర ప్రదేశాలలోను పెట్టుబడిదారీ ముఠాలతో ఘర్షణలు జరిగాయి.

జనరల్ కోర్నిలావ్ లాంటి పచ్చి విప్లవ ప్రతీఘాతకులు ప్రదర్శనం జరిపేవారిపై తుపాకులు పేల్చవలసిందని కోరారు. అలా కాల్చడానికి ఆజ్ఞాపించారుకూడా. కాని సైనికులు ఈ ఉత్తరువులను అమలుజరుప నిరాకరించారు.

ఈ ప్రదర్శనం జరిగే సమయంలో పెట్రోగ్రాడ్ పార్టీ కమిటీలోని సభ్యులలోని ఒక చిన్నముఠా (బాగ్దాటెవ్ ఇంకా తదితరులు) తాత్కాలిక ప్రభుత్వాన్ని వెంటనే కూలద్రోయాలని కోరుతూ ఒక నినాదాన్ని ఇచ్చారు. బోల్షివిక్ పార్టీ సెంట్రల్ కమిటీ ఈ "అతివాద" దుందుడుకు వ్యక్తుల ('Left' Adventurists) ప్రవర్తనను నిశితంగాఖండించింది. ఈనినాదం తప్పుడు నినాదం. కాలానుగుణ్యమైనదికాదు. ఈ నినాదం సోవియట్లలో మెజారిటీని సంపాదించడానికి ప్రయత్నాలు చేస్తున్న పార్టీ కృషిని ఆటంకపరచింది. విప్లవం శాంతియుతంగా

అభివృద్ధిచేయాలనే పార్టీ పోకడను వ్యతిరేకంగా ఇది నడిచింది—అని సెంట్రల్ కమిటీ ఖండించింది.

ఏప్రిల్ 20 - 21 వ తేదీల ఘటనలు తాత్కాలిక ప్రభుత్వ సంక్షోభ ప్రారంభాన్ని తెలియజేశాయి. మెన్షివిక్కులు, సోషలిస్టు-రివల్యూషనరీల రాజీవిధానంలో తీవ్రమైన మొట్టమొదటి చీలిక ఇది. 1917 మే 2 వ తేదీన ప్రజానీకం వత్తిడివల్ల, మిల్యుకోవ్, బుచ్కోవ్‌లను తాత్కాలిక ప్రభుత్వం నుండి తీసివేశారు.

మొదటిమిశ్రమ (coalition) తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. దానిలో పెట్టుబడిదారీ ప్రతినిధులు కాక మెన్షివిక్కులు (స్కోబెలివ్, స్టెరెలీ), సోషలిస్టు-రివల్యూషనరీలు (చెర్నోవ్, కెరన్స్కి ఇంకా ఇతరులు) ఉన్నారు.

విప్లవ తాత్కాలిక ప్రభుత్వంలో సోషల్ డెమాక్రటిక్ పార్టీ ప్రతినిధులు పాల్గొనకూడదని 1905 లో మెన్షివిక్కులు ప్రకటించారు. అలాంటివారు ఇప్పుడు విప్లవ ప్రతీఘాత తాత్కాలిక ప్రభుత్వంలో తమ ప్రతినిధులు పాల్గొనుట తప్పులేదని అన్నారు.

మెన్షివిక్కులు, సోషలిస్టు-రివల్యూషనరీలు ఆవిధంగా విప్లవ ప్రతీఘాత పెట్టుబడిదారీ శిబిరంలో చేరిపోయారు.

1917 ఏప్రిల్ 24 వ తేదీన బోల్షివిక్కుపార్టీ సప్తను సమావేశం (ఏప్రిల్ సమావేశం) జరిగింది. పార్టీ చరిత్రలో మొట్టమొదట సారిగా బోల్షివిక్కుపార్టీ సమావేశం బహిరంగంగా జరిగింది. పార్టీ చరిత్రలో ఈ సమావేశం (కాన్ఫరెన్సు)

పార్టీ కాంగ్రెస్ (మహాసభకు) సమానమైన ప్రాముఖ్యతను కలిగివుంది.

ఈ అఖిల రష్యా సమావేశం, పార్టీ ఉరకలు వేస్తూ వేగంగా పెరుగుతున్నదని తెలియజేసింది. ఈ సమావేశానికి వోటింగు హక్కు కలిగిన ప్రతినిధులు 133 గురు హాజరయ్యారు. చర్చించే హక్కు కలిగి వోటింగు హక్కు లేని ప్రతినిధులు 18 మంది హాజరయ్యారు. ఈ ప్రతినిధులంతా 80 వేల సంఘటిత పార్టీ సభ్యుల ప్రతినిధులు. యుద్ధమూ, విప్లవమూ అనే ప్రధాన సమస్యలపైన అనగా ప్రస్తుతస్థితి, యుద్ధం, తాత్కాలిక ప్రభుత్వం, సోవియట్లు, వ్యవసాయక సమస్య, జాతుల సమస్య మొదలగువాటిని గురించి పార్టీ పంథా ఎలా వుండాలో ఈ సమావేశం చర్చించి నిర్ణయించింది.

లెనిన్ తన రిపోర్టులో ఏప్రిల్ ప్రతిపాదనల (థీసిస్)లో ఇదివరకే తెలియజేసిన సూత్రాలను ఇపుడు వివరించాడు. "అధికారాన్ని పెట్టుబడిదారీ వర్గం చేతుల్లో పెట్టిన మొదటిదశ నుండి, శ్రామికవర్గం చేతులలోను రైతాంగంలోని అత్యంత బీదజనులచేతులలోను అధికారాన్ని ఉంచవలసిన రెండవదశకు" (లెనిన్) పరివర్తన కలుగజేయుటయే పార్టీ కర్తవ్యమని అన్నాడు. సోషలిస్టు విప్లవానికి సన్నాహం చేయడమే పార్టీ మార్గమన్నాడు. "సోవియట్లకే అధికారమంతా హస్తగతం చేయాలి" అనే నినాదంలో పార్టీ తక్షణ కర్తవ్యాన్ని లెనిన్ నిర్దేశించాడు.

"సోవియట్లకే అధికారమంతా" అనే నినాదం యొక్క అర్థం ఏమిటి? ద్వంద్వాధికారాన్ని అనగా తాత్కాలిక

ప్రభుత్వంచేతిలోను, సోవియట్లచేతిలోను ఇప్పుడు విభజింపబడిన అధికారాన్ని అంతమొందించి యావత్తు అధికారాన్ని సోవియట్లకే అప్పగించుట అవసరం. భూస్వాముల, పెట్టుబడిదారుల ప్రతినిధులను ప్రభుత్వ యంత్రాంగం నుండి తరిమివేయాలి.

కాబట్టి "తాత్కాలిక ప్రభుత్వం దాని స్వభావసిద్ధంగానే పెట్టుబడిదారుల, భూస్వాముల పరిపాలన యొక్క సాధనం" అన్న సత్యాన్ని ప్రజాసామాన్యానికి విధివిరామం లేకుండా వివరించడమే పార్టీ ముఖ్య కర్తవ్యాలలో ఒకటి అని ఈ సమావేశం తీర్మానించింది. ఇంతేగాక తప్పుడు వాగ్దానాలతో ప్రజల్ని మోసంచేస్తున్న – సామ్రాజ్యవాదులయొక్క, విప్లవ ప్రతీఘాతంయొక్క దెబ్బలకు ప్రజలను గురిచేస్తున్న – సోషలిస్టు – రివల్యూషనరీల, మెన్షివిక్‌ల రాజీవిధానం ఎంత వినాశకరమైనదో తెలియజేయుట పార్టీ కర్తవ్యమని కూడా ఈ సమావేశం నిశ్చయించింది.

ఈ సమావేశంలో కామెనివ్, రైకోవ్‌లు లెనిన్‌ను వ్యతిరేకించారు. మెన్షివిక్కుల వంత పాడుతూ వీరు సోషలిస్టు విప్లవానికి రష్యా పరిపక్వం కాలేదనీ, రష్యాలో బూర్జువా రిపబ్లిక్‌మాత్రమే సాధ్యమనీ అన్నారు. తాత్కాలిక ప్రభుత్వాన్ని "అదుపులో పెట్టడం" వరకే పార్టీ, కార్మికవర్గాల కర్తవ్యంగా వుండాలని వారు సూచించారు. వాస్తవంలో మెన్షివిక్‌లవలెనే వారుకూడా పెట్టుబడిదారీ విధానాన్ని, పెట్టుబడిదారీవర్గ అధికారాన్ని కాపాడటానికి కంకణం కట్టుకున్నారు.

ఈ సమావేశంలో లెనిన్‌ను జినోవీవ్ కూడా వ్యతిరేకించాడు. జిమ్మర్‌వాల్డ్ సమ్మేళనం (రెండవ ఇంటర్నేషనల్

పార్టీల సమ్మేళనం) లోనే బోల్షివిక్ పార్టీ ఉండాలా? లేక దానినుండి విడిపోయి మరొక కొత్త ఇంటర్నేషనల్‌ను ఏర్పర చాలా? అన్న సమస్యపై జినోవీవ్ లెనిన్‌ను వ్యతిరే కించాడు. యుద్ధకాలంలో క్రమేణా రుజువైనదేమంటే ఈ సమ్మేళనం శాంతి ప్రచారాన్ని కొనసాగించినా యుద్ధంలో పాల్గొంటున్న పెట్టుబడిదారులతో వాస్తవంగా తెగతెంపులు చేసుకోలేదు. కాబట్టి వెంటనే ఈ సమ్మేళనంనుండి ఉపసంహ రించుకొని మరొక కొత్త కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను ఏర్పరచాలని లెనిన్ పట్టుబట్టాడు. జిమ్మర్ వాల్డ్ సమ్మేళనం లోనే పార్టీ వుండాలని జినోవీవ్ సూచించాడు. అతని సూచ నను లెనిన్ తీవ్రంగా ఖండించాడు. అతని ఎత్తుగడలు "పచ్చి అవకాశవాదాన్ని తెలియజేస్తున్నాయి" అని లెనిన్ అన్నాడు.

ఏప్రిల్ సమావేశం వ్యవసాయక సమస్యను, జాతుల సమస్యనుకూడా చర్చించింది.

రైతు సమస్యపై లెనిన్ ఇచ్చిన రిపోర్టును ఆధారం చేసుకుని ఈ సమావేశం ఒక తీర్మానం చేసింది. ఎస్టేటు భూములను వశపరచుకోవాలి, వాటిని రైతుకమిటీల స్వాధీనం చేయాలి, భూమినంతనూ జాతీయపరం చేయాలి - అని ఆ తీర్మానంలో చెప్పబడింది. బోల్షివిక్కులు భూమికోసం పోరాడ వలసిందిగా రైతులను హెచ్చరించారు. తద్వారా బోల్షివిక్కు పార్టీ ఒక్కటే విప్లవపార్టీ యని, అదొక్కటే భూస్వాములను కూలద్రోయుటలో రైతులకు సహాయపడు తున్నదనీ వారికి నిరూపించారు

జాతుల సమస్యపై కామ్రేడ్ స్టాలిన్ రిపోర్టు చాలా ప్రాముఖ్యమైనది. విప్లవానికి పూర్వమే, సామ్రాజ్యవాద యుద్ధానికి పూర్వమే, జాతుల సమస్యపై బోల్షివిక్పార్టీ విధానంలోని ప్రధాన సూత్రాలను లెనిన్, స్టాలిన్‌లు విపులీకరించారు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పీడితప్రజలు సాగించే జాతీయ విమోచనా ఉద్యమాన్ని శ్రామికవర్గ పార్టీ బలపరచాలని లెనిన్, స్టాలిన్‌లు ప్రకటించారు. తత్ఫలితంగా జాతులకు స్వయంనిర్ణయ హక్కు ఉండాలని, అవి విడిపోయి వేరేస్వతంత్ర రాజ్యాలుగా ఏర్పడేంతవరకు కూడా హక్కును కలిగివుండాలని, బోల్షివిక్‌పార్టీ ప్రచారం చేసింది. సమావేశంలో సెంట్రల్‌కమిటీ తరఫున కామ్రేడ్ స్టాలిన్ తన రిపోర్టులో పై దృక్పథాన్ని సమర్థించాడు.

యుద్ధకాలంలో అపుడే జాతుల సమస్యపై జాతీయ దురహంకార దృక్పథాన్ని తీసుకొన్న ప్యాటకోవ్, బుఖారిన్‌తో కలిసి, లెనిన్, స్టాలిన్‌లను వ్యతిరేకించాడు. జాతుల స్వయంనిర్ణయహక్కును ప్యాటకోవ్, బుఖారిన్‌లు వ్యతిరేకించారు.

జాతుల సమస్యపై పార్టీ అవలంబించిన ఖచ్చితమైన నిలకడయైనపంథా, పీడితజాతుల సానుభూతి, సహకారాలను సంపాదించింది. ఎందుచేతనంటే అన్ని జాతులకు సమాన హోదా వుండాలనీ, ఒకజాతిని మరొకజాతి పీడించే రూపాలన్నీ రద్దుచేయాలనీ, జాతులమధ్య అసమానతను పోగొట్టాలనీ ఈ పంథా తెలియచేసింది.

జాతులసమస్యపై ఏప్రిల్ సమావేశం ఆమోదించిన తీర్మాన పూర్తిపాఠం ఇలావుంది:

"ఒకజాతిని మరొకజాతి పీడించుట అనే విధానం నిరంకుశ పరిపాలనా - రాచరికములనుండి పారంపర్యంగా వచ్చింది. తమ వర్గసౌకర్యాలను కాపాడుకోడానికీ, వివిధజాతుల కార్మికులమధ్య అనైక్యతను కల్పించడానికీ పైవిధానాన్ని భూస్వాములు, పెట్టుబడిదారులు, మధ్యతరగతివారు బలపరచారు. బలహీన జాతులను అణచివేసే ప్రయత్నాన్ని ఆధునిక సామ్రాజ్యవాదం హెచ్చిస్తుంది. జాతులపీడనను మరింత తీవ్రం చేయటంలో ఇదొక కొత్తవిషయం.

"పెట్టుబడిదారీ సమాజంలో ఒకజాతిని వేరొకజాతి అణచిపెట్టేవిధానం కొంతవరకైనా తొలగింపబడాలంటే, అది నిలకడమైన ప్రజాతంత్ర రిపబ్లికన్ విధానంక్రిందనే, అన్ని జాతులకు, భాషలకు సంపూర్ణ సమానహోదా గ్యారంటీచేసిన ప్రభుత్వ పరిపాలనక్రిందనే సాధ్యం అవుతుంది.

"రష్యాలో ఉన్న వేరువేరు జాతులు స్వేచ్ఛగా తాము విడిపోయి స్వతంత్ర ప్రభుత్వాల నేర్పరచుకొనే హక్కును గుర్తించాలి. వారికీ హక్కును నిరాకరించడం, లేక ఆచరణలో అది సఫలంచెందే గ్యారంటీ ఇవ్వకపోవడం అంటే, ఇతర జాతులను వశపరచుకొని దురాక్రమణచేసే విధానాన్ని బలపరచుటతో సమానమే అవుతుంది. వివిధ జాతులకు విడిపోయే హక్కును శ్రామికవర్గం గుర్తించుటవల్లనే వివిధ జాతుల కార్మికులమధ్య సంపూర్ణమైన ఐక్యభావం (Solidarity) లభిస్తుంది. అప్పుడే నిజమైన ప్రజాతంత్ర పద్ధతులపైన వివిధ జాతులను సన్నిహితంగా చేయడానికి సహాయ పడుతుంది...

"స్వేచ్ఛగా జాతులు విడిపోయే హక్కును ఆయాసను యంలో ఆయాజాతులు విడిపోవుట ఉపయోగకరమా కాదా అనే సమస్యతో కలిపి గందరగోళ పరచదలచరాదు. పై విష యాన్ని ఆయా జాతుల పరిస్థితినిబట్టి స్వతంత్రంగా శ్రామిక వర్గ పార్టీయే నిర్ణయించాలి. మొత్తం సామాజికాభివృద్ధి ప్రయోజనాలనూ, సోషలిజంకోసం కార్మికవర్గం సాగించే పోరాటప్రయోజనాలనూ దృష్టిలోవుంచుకొని ఆపనిచేయాలి.

"పార్టీ ఈ క్రింది హక్కులను కోరుతుంది: విశాలమైన ప్రాంతీయ స్వపరిపాలన. (Regional autonomy) పై నుండి తనిఖీచేసే పద్ధతిని రద్దుచేయుట. నిర్బంధ రాజభాష (State language) ను రద్దుచేయుట. ఆర్థిక సామాజిక పరిస్థితుల ననుసరించీ, ఒక జాతిలో జనాభా ఉన్న పరిస్థితినిబట్టీ తమను తామే పరిపాలించుకొనే స్వపరిపాలక ప్రాంతాల (Self-Governing and autonomous Regions) సరిహద్దులను స్థానిక ప్రజలే నిర్ణయించాలి.

"జాతీయ సాంస్కృతికీ స్వపరిపాలన (Cultural-National Autonomy) అను పేరుతో విద్యా మొదలైన శాఖలు (కేంద్ర - అనువాదకుడు) ప్రభుత్వ అధీనం క్రింద లేకుండా చేసి ఏవో కొన్ని (ప్రాంతీయ) జాతీయ సభల (National Diets) కింద వుంచేపద్ధతిని శ్రామికవర్గ పార్టీ పూర్తిగా వ్యతిరేకిస్తుంది. జాతీయ సాంస్కృతిక స్వపరిపాలన ఒక ప్రదేశంలో వుండే కార్మికులనూ, ఒకే పారిశ్రామిక కేంద్రంలో పనిచేసేకార్మికులనూ వారివారి "జాతీయ సంస్కృతులు" అనే పేరుతో కృత్రిమంగా విభజించుతుంది. అనగా

కార్మికులకు, అదేజాతికి చెందిన పెట్టుబడిదారీవర్గ సంస్కృతికీ మధ్యవున్న సంబంధాలను అది బలపరుస్తుంది. కాని సోషల్-డెమాక్రట్ల లక్ష్యం అదికాదు. ప్రపంచ శ్రామికవర్గంయొక్క అంతర్జాతీయ సంస్కృతిని పెంపొందించుటయే సోషల్ - డెమాక్రట్ల లక్ష్యం.

"ఇతరులకు లేకుండా సౌకర్యాలను అనుభవించడం ఏ జాతికైనా రద్దుచేయాలి. మైనారిటీ జాతుల హక్కులను అతిక్రమించుటను రద్దుచేయాలి. ఈ విషయాలను రాజ్యాంగ చట్టంలో ప్రధానమైన చట్టరూపంగా చేర్చాలని పార్టీ కోరుతోంది.

"కార్మికవర్గ ప్రయోజనాల దృష్ట్యా రష్యాలోని వివిధ జాతుల కార్మికులు ఉమ్మడి శ్రామికవర్గ సంస్థలను నిర్మించుట అవసరం. అవి: రాజకీయ - ట్రేడ్‌యూనియన్ - విద్యా సంస్థలు, సహకార సంఘాలు మొదలైనవి. వివిధ జాతుల కార్మికుల యొక్క అలాంటి ఉమ్మడిసంస్థలే, అంతర్జాతీయ పెట్టుబడిమీద, పెట్టుబడిదారీ జాతీయ విధానం మీద శ్రామికవర్గం విజయవంతమైన పోరాటాన్ని సాగించడానికి అవకాశాన్ని కలిగిస్తాయి." (సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు (బోల్షివిక్) పార్టీ తీర్మానాలు, రష్యన్ ఎడిషన్ - 1వ భాగం. 239 - 240 పేజీలు)

ఈ విధంగా ఏప్రిల్ సమావేశం కామెనీవ్, జినోవీవ్, ప్యాటకోవ్, బుఖారిన్, రైకోవ్ మొదలగు వారి యొక్క, కొద్దిమంది అనుచరులయొక్క అవకాశవాద లెనినిస్టు వ్యతిరేక వైఖరిని బట్టబయలు చేసింది.

ఈ సమావేశం అన్ని ప్రధాన సమస్యలపైనా స్పష్టమైన వైఖరిని తీసుకొంది. సోషలిస్టు విప్లవ విజయానికి దారితీసే మార్గాన్ని అవలంబించింది. లెనిన్‌ను ఏకగ్రీవంగా బలపరచింది.

## 3

### రాజధానీ నగరంలో (పెట్రోగ్రాడ్) బోల్షివిక్-పార్టీ విజయం- తాత్కాలిక ప్రభుత్వ సైన్యాల విజృంభణ విఫలత - కార్మికులు సైనికులు జులైలో గావించిన ప్రదర్శనాన్ని అణచుట

ఏప్రిల్ సమావేశ నిర్ణయాల నాధారం చేసుకొని ప్రజలను తనవైపు తిప్పుకోడానికీ, పోరాటానికి వారిని తరిఫీదునిచ్చి సంఘటిత పరచటానికీ, పార్టీ తన కార్యకలాపాలను విస్తరించి పెంపొందించింది. ఆ కాలంలో పార్టీ పంధా ఏమంటే, బోల్షివిక్ విధానాన్ని ఓపికగా విశదీకరించడం. మెన్షివిక్కుల, సోషలిస్టు - రివల్యూషనరీల రాజీ విధానాన్ని బట్టబయలు చేసి వారి పార్టీలను ప్రజా సామాన్యంనుండి వేరు చేయుట. సోవియట్లలో మెజారిటీని సంపాదించుట.

సోవియట్లలోని పనికిత్తోడు కార్మిక సంఘాలలోను, ఫ్యాక్టరీ కమిటీలలోను బోల్షివిక్కులు తమ కార్యకలాపాలను విస్తరింపజేశారు.

ముఖ్యంగా సైన్యంలో బోల్షివిక్కులు తమ కార్య క్రమాన్ని విస్తృతం చేశారు. ప్రతిచోటా సైనిక సంస్థలు తలయెత్త ప్రారంభించాయి. సైనికులను, నావికులను సంఘటితం చేయడానికి బోల్షివిక్కులు యుద్ధరంగంలోనూ, యుద్ధ శ్రేణి వెనుభాగంలోనూ అలసటలేకుండా పనిచేశారు. యుద్ధరంగంలో సైనికులను కార్యోత్సాహులైన విప్లవకారులుగా తయారు చేయుటలో ప్రధానమైన పాత్రను ముఖ్యంగా బోల్షివిక్కు వార్తా పత్రిక "ఒకోప్నయా ప్రవదా" (యుద్ధసత్యం) ప్రదర్శించింది.

బోల్షివిక్కుల ప్రచార ఆందోళనల ఫలితంగా, విప్లవం ప్రారంభ మాసాలలోనే అనేక పట్టణాలలోని కార్మికులు, సోవియట్లకు కొత్త యెన్నికలను జరిపారు. ముఖ్యంగా జిల్లా సోవియట్ల ఎన్నికలను జరిపారు. ఈ ఎన్నికలలో మెన్షివిక్కులనూ, సోషలిస్టు - రివల్యూషనరీలను తరిమివేసి వారిస్థానే బోల్షివిక్కు పార్టీ అనుచరులను ఎన్నుకున్నారు.

బోల్షివిక్కు-పార్టీ కృషికి ముఖ్యంగా పెట్రోగ్రాడ్ నగరంలో అత్యద్భుతమైన ఫలితాలు లభించాయి.

1917 మే 30 నుండి జూన్ 3 వరకు పెట్రోగ్రాడ్‌లో ఫ్యాక్టరీ కమిటీల సమావేశం జరిగింది. ఈ సమావేశంనాటికే బోల్షివిక్కులను నూటికి 75 మంది ప్రతినిధులు బలపరిచారు. "అధికారమంతా సోవియట్లకే" అన్న బోల్షివిక్కు నినాదాన్ని దాదాపు పెట్రోగ్రాడ్ శ్రామిక వర్గమంతా బలపరచింది.

1917 జూన్ 3 వ తేదీన (16 వ తేదీన) అఖిలరష్యన్ సోవియట్ల ప్రథమ కాంగ్రెస్ జరిగింది. బోల్షివిక్కులు సోవి-

యట్లలో ఇంకా మైనారిటీగానే వున్నారు. ఈ కాంగ్రెస్‌లో వారి ప్రతినిధులు ఒక వందమందికి కొంచెం పైగా వుంటే, మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు తదితరులు కలిపి 7 వందలు లేక 8 వందల మంది వున్నారు.

సోవియట్ల ప్రథమ కాంగ్రెస్‌లో బోల్షివిక్కులు, పెట్టుబడిదారీ వర్గంతో రాజీవల్ల కలిగే వినాశకరమైన దుష్ఫలితాలను గురించి నొక్కిచెప్పారు. యుద్ధంయొక్క సామ్రాజ్యవాద వైఖరిని బట్టబయలుచేశారు. బోల్షివిక్కు పంథా ఏలా సరియైనదో తెలియజేస్తూ ఈ కాంగ్రెస్‌లో లెనిన్ ఉపన్యసించాడు. కష్టపడే ప్రజలకు తిండి, రైతులకు భూమి, ప్రజలకు శాంతి సోవియట్ల ప్రభుత్వం ఒక్కటే లభింపజేయగలదనీ, దేశాన్ని అరాచకత్వం నుండి బయట పడవేయగలదనీ లెనిన్ చెప్పాడు.

ఒక ప్రదర్శనం లేవదీసి సోవియట్ల కాంగ్రెస్‌కు తమ కోర్కెలను నివేదించాలని, పెట్రోగ్రాడ్‌లోని కార్మికవర్గ జిల్లాలలో (పేటలలో) అదే సమయాన ఒక ప్రజావుద్యమం సాగించబడుతోంది. తమ అనుమతిలేకుండా కార్మికులు ప్రదర్శనం చేయరాదనే ఆదుర్దాతో, ప్రజల విప్లవ మనోభావాలను తమ స్వప్రయోజనాలకోసం ఉపయోగించుకోగలమనే ఆశతో, పెట్రోగ్రాడ్ సోవియట్ కార్యనిర్వాహకవర్గం జూన్ 18 వ (జూలై 1 వ) ప్రదర్శనం జరగాలని నిర్ణయించింది. మెన్షివిక్‌లు, సోషలిస్టు - రివల్యూషనరీలు ఆప్రదర్శనం బోల్షివిక్ వ్యతిరేక నినాదాలతో కొనసాగుతుందని ఆశించారు. కాని బోల్షివిక్‌పార్టీ ఈ ప్రదర్శనానికి ఉత్సాహావంతంగా

సన్నాహాలు చేయసాగింది. ప్రవదా పత్రికలో కామ్రేడ్ స్టాలిన్ ఇలా వ్రాశాడు: "...జూన్ 18 వ తేదీన పెట్రోగ్రాడ్‌లో జరిగే ప్రదర్శనం మన విప్లవ నినాదాలతోనే జరిగేటట్లు తప్పకుండా చూడాలి."

1917 జూన్ 18 వ తేదీన జరిగిన ప్రదర్శనం విప్లవంలో ఆత్మబలిదానం చేసిన వీరయోధుల సమాధులవద్ద జరిగింది. నిజానికి ఈ ప్రదర్శనం బోల్షివిక్ పార్టీ శక్తుల సమీక్షకు ఒక దాఖలా. పెంపొందుతున్న ప్రజల విప్లవభావాన్ని, బోల్షివిక్ పార్టీలో పెంపొందుతున్న వారి విశ్వాసాన్ని ఇది బయట పెట్టింది. తాత్కాలిక ప్రభుత్వంలో విశ్వాసం ఉంచవలసిందని, యుద్ధాన్ని కొనసాగించవలసిందని కోరుతూ మెన్షివిక్‌లు, సోషలిస్టు-రివల్యూషనరీలు (జండాలపై) ప్రదర్శించిన నినాదాలు బోల్షివిక్ నినాదాల సముద్రంలో మునిగిపోయాయి. "యుద్ధం నశించాలి", "(ఇప్పుడున్న)-10 మంది పెట్టుబడిదారీ మంత్రులు నశించాలి", "అధికారమంతా సోవియట్లకే" అనేనినాదాలున్న జెండాలతో నాలుగు లక్షలమంది కార్మికులు ఊరేగింపు చేశారు.

మెన్షివిక్‌లకు, సోషలిస్టు - రివల్యూషనరీలకు ఇది పూర్తిగా అపజయం. రాజధానినగరం (పెట్రోగ్రాడ్) లోనే తాత్కాలిక ప్రభుత్వానికి ఇది అపజయం.

అయినప్పటికీ తాత్కాలిక ప్రభుత్వం, సోవియట్ల ప్రథమకాంగ్రెస్ అండను సంపాదించింది. సామ్రాజ్యవాద విధానాన్ని కొనసాగింప నిశ్చయించింది. అదేరోజున అనగా జూన్ 18 వ తేదీన తాత్కాలికప్రభుత్వం బ్రిటిష్, ఫ్రెంచ్

సామ్రాజ్యవాదుల కోర్కెలకు తలయొగ్గి యుద్ధరంగంలోని తన సైనికులను దాడిచేయడానికి ముందుకు తరిమింది. విప్లవాన్ని అంతమొందించడానికి ఇదొక్కటే సాధనమని పెట్టుబడిదారీ వర్గం భావించింది. ఈదాడిలో గనుక విజయంపొందిన పక్షంలో అధికారాన్నంతా తమ చేతుల్లోకి తీసుకొని, సోవియట్లను రంగంలోనుంచి నెట్టివేసి, బోల్షివిక్‌లను అణచవచ్చు; ఒకవేళ అపజయమే సంభవిస్తే తప్పంతా బోల్షివిక్కులపై రుద్దివేసి సైన్యం శిథిలమవడానికి వారే కారకులని నిందించవచ్చు - అని పెట్టుబడిదారీవర్గం ఆశించింది.

ఈ దాడి విఫలం చెందుతుందనుటలో యెట్టి సందేహముూ లేదు. అలాగే ఓడిపోయింది కూడా. సైనికులు పూర్తిగా అలిసిపోయివున్నారు. వారికీదాడియొక్క వుద్దేశమేమిటో అర్థంకాలేదు. దూరస్థులైన తమ ఆఫీసర్లపై వారికి నమ్మకంలేదు. ఫిరంగులు, షెల్సు (ఫిరంగిగుండ్లు) చాలినన్ని లేవు. ఈ పరిస్థితులన్నిటివల్ల దాడి ఓడిపోక తప్పదని ముందుగానే స్థిరమయింది.

యుద్ధరంగంలో దాడి, ఆ తర్వాత దాని ఓటమి రాజధానీ నగరాన్ని ఉద్రిక్తపరచింది. కార్మికుల, సైనికుల క్రోధావేశానికి హద్దులు లేకపోయాయి. తాత్కాలిక ప్రభుత్వం శాంతి విధానాన్ని ప్రకటించినప్పుడు అది ప్రజలను మోసగించు తున్నదనీ, తాత్కాలిక ప్రభుత్వం సామ్రాజ్యవాద యుద్ధాన్ని కొనసాగించ కోరుతున్నదనీ స్పష్టమయింది. అఖిల రష్యన్ సోవియట్ల కేంద్రకార్యనిర్వాహక కమిటీకి, పెట్రోగ్రాడ్ సోవియట్‌కూ, తాత్కాలిక ప్రభుత్వంయొక్క ఘోర

కృత్యాలను అడ్డుపెట్టడానికి ఇష్టమూలేదు, సామర్థ్యమూలేదు. పైగా అవి ప్రభుత్వం తోక వెంట నడిచాయని స్పష్టమైంది.

ప్రెట్రోగ్రాడ్ కార్మికుల సైనికుల విప్లవక్రోధావేశం పొంగిపొరలింది. జూలై 3వ తేదీన (16వ తేదీన) పెట్రోగ్రాడ్‌లోని వైబార్గ్ జిల్లాలో వాటంతటవే ప్రదర్శనాలు ప్రారంభమయ్యాయి. అవి ఆ రోజంతా సాగాయి. విడివిడిగా బయలుదేరిన ప్రదర్శనాలన్నీ కలిసి బ్రహ్మాండమైన సాయుధ ప్రదర్శనంగా మారింది. అధికారాన్ని సోవియట్లకు అప్పగించాలని ఈ ప్రదర్శనం కోరింది. బోల్షివిక్కు పార్టీ ఆ సమయంలో సాయుధ పోరాటానికి వ్యతిరేకం. ఎందువల్లనంటే, విప్లవసంక్షోభం (Revolutionary crisis) ఇంకా పరిపక్వం కాలేదని అది భావించింది. రాజధానీనగరంలోని తిరుగుబాటును బలపరచడానికి సైన్యమూ, ఇతర రాష్ట్రాల ప్రజలూ ఇంకా సిద్ధంగా లేరు. ఒంటరిగా పరిపక్వంకాకుండా తిరుగుబాటును గనుక తీసుకొనివస్తే, విప్లవ అగ్రశ్రేణిని అణచివేయటానికి విప్లవ ప్రతీఘాతకులకు మరింత సులభం అవుతుందని బోల్షివిక్కు పార్టీ భావించింది. కాని ప్రజలను ప్రదర్శనం చేయకుండా వుంచడం అసాధ్యమని స్పష్టంకాగానే, ఆ ప్రదర్శనలో పాల్గొని దాన్ని శాంతియుతంగా సంఘటితరూపాన నడపడానికి పార్టీ నిశ్చయించింది. ఇందులో బోల్షివిక్కు పార్టీ విజయం పొందింది. లక్షలాది స్త్రీలు, పురుషులు పెట్రోగ్రాడ్ సోవియట్ యొక్క ప్రధాన కార్యాలయానికి అఖిల రష్యన్ సోవియట్ల కార్యనిర్వాహక కార్యాలయానికి ఊరేగింపుతో వెళ్ళారు. సోవియట్లు అధికారాన్ని తమ హస్తగతం చేసుకోవాలనీ, సామ్రాజ్యవాద

పెట్టుబడిదారీ వర్గంతో తెగతెంపులు చేసుకోవాలనీ, కార్య కారియైన శాంతివిధానాన్ని అవలంబించాలనీ వారుకోరారు.//

ప్రదర్శనం శాంతియుత స్వభావం కలిగివున్నప్పటికీ ప్రభుత్వం, విప్లవ ప్రతీఘాత యూనిట్లను - అనగా సైనికాధి కారులు, నావికాధికారులు (Cadets) కలిగిన దళాలను ప్రదర్శ నాన్ని అణచడానికి పంపారు. పెట్రోగ్రాడ్ వీథులు కార్మికుల, సైనికుల రక్తంతో ప్రవహించాయి. సైన్యంలోని విప్లవ ప్రతీ ఘాత యూనిట్లను ఏమీ తెలియని అజ్ఞానులైన సైనిక యూని ట్లను అణచడానికి యుద్ధరంగంనుండి ప్రభుత్వం తెప్పించింది.

కార్మికుల సైనికుల ప్రదర్శనాన్ని అణచిన తర్వాత పెట్టుబడిదారీవర్గంతో కలిసిన, మెన్షివికీలు, సోషలిస్టు - రివ ల్యూషనరీలు, విద్రోహ సేనానులు(White guard generals) బోల్షివిక్కు-పార్టీపై పడ్డారు. ప్రవదా కార్యాలయాన్ని నాశనం చేశారు. ప్రవదా, సోల్దాట్స్కయా ప్రవదా (Soldatskaya Pravada - సైనిక సత్యం) ఇంకా తదితర బోల్షివిక్కు పత్రిక లనేకం అణచివేయబడ్డాయి. లిస్టోక్ ప్రవదీ(Listok-Pravady- ప్రవదా బులెటిన్) అమ్మిన నేరానికే వాయ్‌నావ్ అనే కార్మి కుడు వీథులలో కేడెట్లచే (నావికుల) చంపబడ్డాడు. రెడ్ గార్డ్సను(బోల్షివిక్ వాలంటీర్లను) నిరాధాయులు చేయమొదలు పెట్టారు. పెట్రోగ్రాడ్ సైనిక శిబిరంలో ఉన్న విప్లవసైనిక యూనిట్లను ఆ పట్టణంనుండి ఉపసంహరించి యుద్ధరంగంలోకి పంపారు. యుద్ధశ్రేణిలోను, యుద్ధశ్రేణి వెనుభాగంలోను అరెస్టులుసాగాయి. జూలై 7వ తేదీన లెనిన్‌అరెస్టుకు వారంటు పుట్టింది. బోల్షివిక్కు-పార్టీ ప్రముఖసభ్యు లనేకమందిఅరెస్టు

చేయబడ్డారు. బోల్షివిక్కు ప్రచురణలు అచ్చుఅయ్యే ట్రూడ్ ముద్రణాశాలను ధ్వంసం చేశారు. లెనినూ, ఇంకా తదితర బోల్షివిక్కు లనేకమంది "రాజద్రోహ" నేరానికీ, సాయుధ తిరుగుబాటును సంఘటితపరచినందుకూ విచారింపబడనున్నా రని పెట్రోగ్రాడ్‌లోని సెషన్స్ కోర్టులో అధికారి తెలియ జేశాడు. జనరల్ డెనికిన్ ప్రధాన కార్యాలయంలో లెనిన్‌పై నేరం సృష్టించబడింది. పోలీసుల గూఢచారుల సాక్ష్యాలపై ఇది ఆధారపడి వుంది.

ఆ విధంగా మెన్షివిక్‌ల, సోషలిస్ట్ - రివల్యూషనరీల ముఖ్యప్రతినిధులైన సెరిటెలీ, స్కొబెలేవ్, కెరెన్స్కి, చెర్నావ్ మొదలగువారితో కూడిన ఈ మిశ్రమ తాత్కాలిక ప్రభుత్వం సరాసరి సామ్రాజ్యవాద స్థితికి, విప్లవ ప్రతీఘాత స్థితికి దిగ జారింది. శాంతికి బదులుగా యుద్ధాన్ని కొనసాగించాలనే విధానాన్ని అది అవలంబించింది. ప్రజల ప్రజాతంత్ర హక్కు లను రక్షించుటకు బదులుగా యీ హక్కులను కాలరుద్ద నారంభించింది. సైనికులను, కార్మికులను ఆయుధబలంతో అణచివేయ ప్రారంభించింది.

బూర్జువా ప్రతినిధులైన బుచ్‌కోవ్, మిల్యుకోవ్‌లు చేయడానికి జంకిన పనిని "సోషలిస్టు" లనబడే కెరెన్స్కి, సెరిటెలీ, చెర్నావ్, స్కొబ్‌లేవ్‌లు చేశారు.

ద్వంద్వాధికారం అంతమయింది.

ద్వంద్వాధికారం పెట్టుబడిదారీవర్గానికి అనుకూలంగా అంతమయింది. ఎందువల్లనంటే అధికారం తాత్కాలిక ప్రభు త్వం చేతిలోకి పోయింది. పోతే సోషలిస్టు - రివల్యూషనరీ,

మెన్షివిక్ నాయకుల ఆధ్వర్యాన ఉన్న సోవియట్లు తాత్కాలిక ప్రభుత్వానికి తోకగా తయారయ్యాయి.

విప్లవ శాంతిదశ అంతమయింది. ఇప్పుడు తుపాకీదే ప్రధమాంశం.

మారిపోయిన పరిస్థితిని దృష్టిలోవుంచుకొని బోల్షివిక్ పార్టీ తన ఎత్తుగడలను మార్చుకొన నిశ్చయించింది. బోల్షివిక్ పార్టీ అండర్ గ్రౌండ్‌కు వెళ్లింది. (రహస్య కార్యకలాపాలను పూనుకుంది). తమ పార్టీ నాయకుడగు లెనిన్‌కు సురక్షితమైన ప్రదేశం ఏర్పాటు చేసింది. సాయుధ బలంతో బూర్జువా అధికారాన్ని కూలద్రోసి సోవియట్ల అధికారాన్ని నెలకొల్పే ఉద్దేశ్యంతో తిరుగుబాటుకు బోల్షివిక్‌పార్టీ సన్నాహం చేయసాగింది.

# 4

## సాయుధ తిరుగుబాటుకు బోల్షివిక్కు-పార్టీ సన్నాహం-పార్టీ ఆరవ కాంగ్రెస్

**బూ**ర్జువా పత్రికలలోను, పెటీ బూర్జువా పత్రికలలోను బోల్షివిక్కులపై తీవ్ర విషప్రచారం జరిగే సమయంలో పెట్రోగ్రాడ్‌లో బోల్షివిక్కు-పార్టీ ఆరవ కాంగ్రెస్ జరిగింది. 5 వ కాంగ్రెస్ (లండన్) జరిగిన పదేళ్ళకు ప్రాగ్‌లో జరిగిన బోల్షివిక్కు సమావేశానికి (కాన్ఫరెన్సుకు) 5 ఏండ్లపిమ్మట

ఈ కాంగ్రెస్ సమావేశమయింది. ఇది 1917 జూలై 26 నుండి ఆగస్టు 3 వరకు రహస్యంగా సమావేశమైంది. సమావేశం జరుగుతుందని మాత్రం పత్రికలలో ప్రకటించబడింది. కాని ప్రదేశం మాత్రం బట్టబయలు చేయలేదు. మొదట వైబోర్గ్ జిల్లాలోను (పేట), తర్వాత నార్వాగేట్‌వద్ద ఒక స్కూలులోను ఈ సమావేశం జరిగింది. ఈ స్కూలులో ఇప్పుడు ఒక సాంస్కృతిక భవనం నిర్మించబడింది. ప్రతినిధులను అరెస్టు చేయాలని బూర్జువా పత్రికలు కోరాయి. గూఢచారులు కాంగ్రెస్ సమావేశమయ్యే స్థలం తెలుసుకోడానికి నగరమంతా వెర్రిగా గాలించారు. కాని లాభం లేకపోయింది.

ఆ విధంగా జార్ ప్రభుత్వాన్ని కూలద్రోసిన 5 నెలలకే బోల్షివిక్కులు రహస్యంగా సమావేశం కావలసివచ్చింది. శ్రామికవర్గ పార్టీ నాయకుడు లెనిన్ రజ్లీవ్ స్టేషన్‌వద్ద ఒక గుడిసెలో రహస్యజీవితం గడపవలసి వచ్చింది.

తాత్కాలిక ప్రభుత్వ వేటకుక్కలు (గూఢచారులు) లెనిన్‌ను అంతటా వెంటాడుతున్నాయి. అందుచే కాంగ్రెస్‌కు ఆయన హాజరు కాలేకపోయాడు. తాను దాగివున్న స్థలం నుంచే పెట్రోగ్రాడ్‌లోని తన సన్నిహిత సహచరులూ, శిష్యులూ అయిన స్టాలిన్, స్వెర్డ్లావ్, మాలటోవ్, ఆర్జోనికిడ్జ్ మొదలగువారి ద్వారా కాంగ్రెస్ కార్య కలాపాలను నడిపాడు.

కాంగ్రెస్‌కు వోటింగుహక్కు వున్న ప్రతినిధులు 157 మంది హాజరయ్యారు. వోటు లేకుండా చర్చించే హక్కుగల

ప్రతినిధులు 128 మంది హాజరయ్యారు. ఆకాలంలో పార్టీ సభ్యత్వం 2 లక్షల 40 వేలు వుంది. జూలై 3 వ తేదీన అనగా కార్మికుల ప్రదర్శనం భగ్నం చేయకముందు బోల్షివిక్కులు బహిరంగంగానే పనిచేస్తున్నారు. పార్టీ పత్రికలు 41 వుండేవి. అందులో 29 రష్యన్ భాషలోను 12 ఇతర భాషల్లోను వుండేవి.

బోల్షివిక్‌లూ కార్మికవర్గమూ జూలై దినాలలో ఎన్నో నిర్బంధాలకు గురి అయ్యారు. కాని ఈ నిర్బంధవిధానంవల్ల పార్టీ పలుకుబడి తగ్గిపోలేదు సరికదా మరింత హెచ్చింది. కార్మికులు, సైనికులు, మెన్షివిక్‌లను, సోషలిస్టు-రివల్యూషనరీలను ఒక్కుమ్మడిగా విడిచిపెట్టేస్తున్నారని వివిధరాష్ట్రాలనుండి వచ్చిన ప్రతినిధులు అనేక ఉదాహరణలు ఇచ్చారు. అసహ్యాభావంతో "సోషల్ జైలర్లు" ని (సోషలిస్టు యమకింకర్లు) పైపార్టీలను ప్రజలు పిలువసాగారు. మెన్షివిక్, సోషలిస్టు- రివల్యూషనరీ పార్టీలకు చెందినకార్మికులు తమ సభ్యత్వపు రికార్డులను కోపంతోను, ఏహ్యాభావంతోను చించివేసి బోల్షివిక్కు పార్టీలో సభ్యత్వానికై దరఖాస్తులు పెట్టసాగారు.

ఈ కాంగ్రెస్‌లో చర్చించిన ముఖ్యాంశాలు : సెంట్రల్ కమిటీయొక్క రాజకీయ రిపోర్టు, రాజకీయపరిస్థితి. ఈ రెండు సమస్యలపైన కామ్రేడ్ స్టాలిన్ రిపోర్టు ఇచ్చాడు. విప్లవాన్ని అణచడానికి పెట్టుబడిదారీవర్గం ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నప్పటికీ విప్లవం వృద్ధిచెందుతూనే వుందని కామ్రేడ్ స్టాలిన్ అతి విస్పష్టంగా నిరూపించాడు. వస్తువుల ఉత్పత్తి పంపకాలపై కార్మికులపెత్తనాన్ని ఏర్పరచుట, భూమిని రైతులకు స్వాధీనం

చేయుట, అధికారాన్ని పెట్టుబడిదారీవర్గంనుండికార్మికవర్గానికి, పేద రైతాంగానికి అప్పజెప్పుట అను ఈ కర్తవ్యాలను విప్లవం తనముందు వుంచిందని కామ్రేడ్ స్టాలిన్ పేర్కొన్నారు. విప్లవం సోషలిస్టు విప్లవస్వభావాన్ని తాల్చుతున్నదని ఆయన అన్నాడు.

జూలై దినాలతర్వాత దేశంలో రాజకీయ పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ద్వంద్వాధికారం నశించింది. సోషలిస్టు - రివల్యూషనరీల, మెన్షివిక్‌ల నాయకత్వానవున్న సోవియట్లు, సంపూర్ణ అధికారాన్ని తీసుకో నిరాకరించి నందున ఉన్న అధికారాన్నంతా పోగొట్టుకున్నాయి. ఇప్పు డధికారమంతా బూర్జువా తాత్కాలిక ప్రభుత్వం చేతిలో కేంద్రీకరింపబడివుంది. తాత్కాలిక ప్రభుత్వం విప్లవాన్ని నిరాయుధం చేయుటకు, విప్లవసంస్థలను ధ్వంసంచేయుటకు, బోల్షివిక్ పార్టీని నాశనంచేయుటకు ప్రారంభించింది. విప్లవం శాంతియుతంగా అభివృద్ధిచెందే అవకాశం మటుమాయమైంది. కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు ఇంక ఒకేవిషయం మిగిలివుంది. అది తాత్కాలిక ప్రభుత్వాన్ని కూలద్రోసి బలప్రయోగం ద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకోడం. పేదరైతాంగంతో కలసి శ్రామికవర్గ మొక్కటే బలప్రయోగంద్వారా అధికారాన్ని హస్తగతం చేసుకోగలదు.

మెన్షివిక్‌ల, సోషలిస్టు-రివల్యూషనరీల పెత్తనంక్రిందనే ఇంకావున్న సోవియట్లు బూర్జువా శిబిరంలో అడుగుపెట్టాయి. ప్రస్తుత పరిస్థితులలో అవి తాత్కాలిక ప్రభుత్వానికి అనుబంధాలుగా మాత్రమే పనిచేస్తాయని ఆశించాలి. ఇపుడు,

జూలై దినాల తర్వాత, "అధికారమంతా సోవియట్లకే" అన్న నినాదాన్ని ఉపసంహరించుకోవడం అంటే అర్థం సోవియట్ల అధికారానికై చేసేపోరాటాన్ని పరిత్యజించడమని కాదు. విప్లవపోరాట సాధనాలైన అన్ని సోవియట్లను గురించికాక, మెన్షివిక్ల, సోషలిస్టు - రివల్యూషనరీల పెత్తనంలోవున్న సోవియట్లను గురించే, ఇప్పుడమలులోవున్న సోవియట్లను గురించే ఈ ప్రశ్న ఉద్భవించింది.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు: "విప్లవంయొక్క శాంతియుతదశ అంతమొందింది. అశాంతియుతమైనదశ - ఘర్షణల, ప్రేలుడుల (తిరుగుబాట్ల) దశ ప్రారంభమైంది."

(రష్యన్ సోషల్ డెమాక్రటిక్ లేబర్ పార్టీయొక్క ఆరవ కాంగ్రెస్, వెర్బాటమ్ రిపోర్టు-రష్యన్ ఎడిషన్ - 111వ పేజీ.)

సాయుధ తిరుగుబాటుకు పార్టీ సన్నద్ధమయింది.

సోషలిస్టు విప్లవమార్గావలంబనను వ్యతిరేకించేవారు, బూర్జువా పలుకుబడిని ప్రతిబింబించేవారు కాంగ్రెస్లో కొంతరున్నారు.

ట్రాట్స్కీ అనుచరుడైన ప్రియోబ్రజెన్స్కీ అధికారాన్ని హస్తగతం చేసుకొనే విషయమై ఒక తీర్మానం ప్రవేశపెట్టాడు. అందులో 'పశ్చిమదేశాలలో శ్రామికవర్గ విప్లవం జరిగితేనే మనదేశాన్ని సోషలిజంవైపుకు నడపాలని సూచించాడు.

ఈ ట్రాట్స్కీవాద తీర్మానాన్ని కామ్రేడ్ స్టాలిన్ వ్యతిరేకించాడు. కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"సోషలిజానికి మార్గం వేసేదేశం, రష్యాయే కాగల అవకాశం లేకపోలేదు...యూరప్ ఒక్కటే మనకు దారి చూపించగలదని అనుకునే బూజుపట్టిన అభిప్రాయాన్ని మనం త్రోసిపుచ్చాలి. మార్క్సిజం రెండురకాలు. ఛాందసపు మార్క్సిజం (Dogmatic Marxism). రెండవది సృజనాత్మకమైన మార్క్సిజం (Creative Marxism). నేను రెండవ దానినే అవలంబిస్తాను." (పైగ్రంథమే 233-34 పేజీ)

ట్రాట్స్కీ సిద్ధాంతాన్నే అవలంబించిన బుఖారిన్ కూడా ఇలా అన్నాడు: రైతులు యుద్ధాన్ని బలపరుస్తున్నారు. పెట్టుబడిదారీ వర్గంతో ఒక కూటమిగా వారు కలిశారు. కార్మిక వర్గాన్ని వారు అనుసరించరు.

బుఖారిన్‌కు తగు జవాబు చెపుతూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా నిరూపించాడు: రైతులలో అనేకరకాల వారున్నారు. సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వర్గాన్ని బలపరచే ధనికరైతులున్నారు. కార్మికవర్గంతో మైత్రినికోరి, విప్లవ విజయానికి సాగించే పోరాటాన్ని బలపరచే బీదరైతులున్నారు.

ప్రియోబ్రజెన్స్కీ, బుఖారిన్‌ల సవరణలను కాంగ్రెస్ తిరస్కరించింది. కామ్రేడ్ స్టాలిన్ తీర్మానాన్ని ఆమోదించింది.

బోల్షివిక్‌ల ఆర్థిక కార్యక్రమాన్నిగూడా చర్చించి కాంగ్రెస్ ఆమోదించింది. దానిలోని ముఖ్యాంశాలివి: ఎస్టేటు భూములను వశపరచుకోడం, భూములను బ్యాంకులను భారీ పరిశ్రమలను జాతీయపరం చేయటం, ఉత్పత్తి పంపకాలపై కార్మికుల పెత్తనాన్ని స్థాపించటం.

ఉత్పత్తిమీద కార్మికుల పెత్తనం స్థాపించటానికి సాగించవలసిన పోరాటంయొక్క ప్రాముఖ్యతను కాంగ్రెస్ నొక్కిచెప్పింది. దరిమిలా పెద్ద పెద్ద పారిశ్రామిక సంస్థలను ప్రభుత్వం జాతీయపరం చేసినప్పుడు, ఈ పెత్తనం ఎంత ప్రధానపాత్ర వహించవలసి వుంటుందో కాంగ్రెస్ తెలియ జేసింది.

సోషలిస్టు విప్లవం జయించాలంటే శ్రామికవర్గము, బీదరైతాంగాల మధ్య సమ్మేళనం అవసరం అనే లెనిన్ సూత్రాన్ని నిర్ణయాలన్నిటిలోను కాంగ్రెస్ ముఖ్యంగా నొక్కి చెప్పింది.

కార్మిక సంఘాలు తటస్థంగా వుండాలనే మెన్షివిక్ సిద్ధాంతాన్ని కాంగ్రెసు ఖండించింది. కార్మిక సంఘాలు పోరాట స్వభావం గలిగిన (మిలిటెంట్) వర్గ సంస్థలుగా ఉండి బోల్షివిక్ పార్టీ రాజకీయ నాయకత్వాన్ని గుర్తించినపుడే రష్యన్ కార్మికవర్గాన్ని ఎదుర్కొనుచున్న చరిత్రాత్మక కర్తవ్యాన్ని అవి నెరవేర్చగలవని కాంగ్రెస్ తెలియజేసింది.

ఆ కాలంలో తరచుగా అప్రయత్నంగా తమంతకవే ఉద్భవిల్లిన యువజనసంఘాలనుగురించికూడా కాంగ్రెస్ ఒక తీర్మానం చేసింది. దరిమిలా పార్టీ చేసిన కృషిఫలితంగా ఈ యువజన సంస్థలు తనకు అంటిపెట్టుకునేటట్లు నిశ్చిత విజయాన్ని పార్టీ సంపాదించింది. తర్వాత ఇవి పార్టీకి రిజర్వుగా (అదనపు బలాలుగా) ఉపయోగపడ్డాయి.

లెనిన్ విచారణకు కోర్టులో హాజరుకావాలా, లేదా అన్న విషయంకూడా కాంగ్రెస్ చర్చించింది. కామెనివ్,

రైకోవ్, ట్రాట్స్కీ ఇంకా తదితరులు విప్లవ ప్రతీఘాతకులు కోర్టులో లెనిన్ హాజరుకావాలని కాంగ్రెస్‌ను పూర్వమే అంటూవుండేవారు. లెనిన్ కోర్టులో హాజరవాలనే విషయాన్ని కామ్రేడ్ స్టాలిన్ తీవ్రంగా వ్యతిరేకించాడు. ఆరవ కాంగ్రెస్ కూడా ఈ దృక్పధాన్నే బలపరచింది. ఎందుచేతనంటే లెనిన్ హాజరైన పక్షంలో అది విచారణగాక, చిత్రవధ (Lynching) అవుతుందని అది భావించింది. పెట్టుబడిదారీ వర్గానికి అత్యంత ప్రమాదకర శత్రువగు లెనిన్‌ను భౌతికంగా నాశనం చేయడం ఒక్కటే (చంపడమే), పెట్టుబడిదారీవర్గం కోరుతున్నదన్న విషయంలో కాంగ్రెసు కెట్టి సందేహమూలేదు. విప్లవ శ్రామిక నాయకులపై పెట్టుబడిదారీవర్గం సాగించుతున్న పోలీసు నిర్బంధ విధానానికి కాంగ్రెస్ అసమ్మతి తెలియజేసింది. లెనిన్‌కు అభివందన సందేశం పంపింది.

ఆరవ కాంగ్రెస్ కొత్తపార్టీ నిబంధలను పర్చరచింది. కేంద్రీకృత ప్రజాతంత్రం (డెమాక్రటిక్ సెంట్రలిజం) అనే సూత్రంపై పార్టీ సంస్థలన్నీ నిర్మింపబడాలని ఈ నిబంధనలు తెలియజేశాయి.

దీని అర్థం :

(1) నాయకత్వం వహించే పార్టీ సంఘాలన్నీ (పార్టీ బాడీస్) పైనుండి కిందవరకు ఎన్నుకోబడాలి.

(2) పార్టీసంఘాలు తమ తమ పార్టీ సంస్థలకు తాము చేసే కార్యకలాపాలనుగురించి నిర్ణీతకాలంలో (Periodically) తెలియజేస్తూ వుండాలి.

(3) కఠినమైన పార్టీ క్రమశిక్షణ వుండాలి. మెజారిటీకి మైనారిటీ లోబడి వుండాలి.

(4) పై సంఘాల నిర్ణయాలన్నిటికీ కింది సంఘాలు, పార్టీ సభ్యులందరూ పూర్తిగా కట్టుబడి వుండాలి.

పార్టీలో కొత్త సభ్యులను చేర్చుకోవాలంటే స్థానిక పార్టీ సంస్థలద్వారా ఇద్దరు పార్టీసభ్యుల రికమెండేషన్‌తో చేర్చుకోవాలి. స్థానికపార్టీ సంస్థ సర్వసభ్య సమావేశం దీనిని ఆమోదించాలి. మెఝ్రయూన్ట్సీ (Mezhrayoutsi) అనే ముఠాను, వారి నాయకుడైన ట్రాట్స్కీని పార్టీలోకి ఆరవ కాంగ్రెస్ చేర్చుకొంది. వీరొక చిన్నముఠా. 1913 నుండి పెట్రోగ్రాడ్‌లో వుంటున్నారు. ఈముఠాలో ట్రాట్స్కీవాద మెన్షివిక్కులు, పార్టీనుంచి చీలి వెళ్ళిపోయిన మాజీ బోల్షివిక్కులు చాలమంది వున్నారు. యుద్ధకాలంలో మెఝ్రయూన్ట్సీ మధ్యస్త సంస్థగావుంది (Centrist organisation). వారు బోల్షివిక్కులతో పోరాడుతూ వుండేవారు. కాని అనేకవిషయాలలో మెన్షివిక్కులతో విభేదించుతూ వచ్చారు. వారలా అటూ ఇటూ గాకుండా మధ్యస్తంగా వూగిసలాడే స్థితిలోనుండేవారు. పార్టీ ఆరవ కాంగ్రెస్‌లో మెఝ్రయూన్ట్సీముఠా అన్ని విషయాలలో తాము బోల్షివిక్కులతో ఏకీభవించుతున్నామని ప్రకటించి పార్టీలో చేర్చుకోవలసిందని కోరారు. వారు కొంత కాలంలో నిజమైన బోల్షివిక్కులు కాగలరనే ఆశతో కాంగ్రెస్ ఈ కోరికను అంగీకరించింది. వాస్తవంగానే ఈ ముఠాలో కొందరు, ఉదాహరణకు ఓలోడార్స్కీ, ఇర్‌ట్స్కీలు బోల్షివిక్కులయ్యారు. ఇక ట్రాట్స్కీ, అతని సన్నిహిత మిత్రులూ పార్టీ

శ్రేయస్సుకై పనిచేయటానికి గాదు చేరింది; పార్టీలోపలనుండి విచ్ఛిన్నంచేసి నాశనం చేయడానికే వారు చేరారు. ఈ విష యం తర్వాత స్పష్టమయింది.

సాయుధ తిరుగుబాటుకు శ్రామికవర్గాన్ని, నిరుపేద రైతాంగాన్ని సన్నాహం చేయడానికే ఆరవ కాంగ్రెస్ తీర్మా నాలన్నీ ఉద్దేశింపబడ్డాయి. సాయుధ తిరుగుబాటుకూ, సోష లిస్టు విప్లవానికీ, ఆరవ కాంగ్రెస్ పార్టీని సిద్ధపరచింది.

పెట్టుబడిదారీ వర్గంతో నిశ్చిత పోరాటాలను సాగించేం దుకుగాను తమ శక్తులన్నిటినీ సమకూర్చుకో వలసిందిగా కార్మికులకు, సైనికులకు, రైతులకు విజ్ఞప్తిచేస్తూన్న పార్టీ ప్రణాళిక నొకదానిని కాంగ్రెసు ప్రకటించింది. ఆ ప్రణాళిక ఈ క్రింది వాక్యాలతో ముగిసింది:

“కాబట్టి సైనిక కామ్రేడ్స్! కొత్త పోరాటాలకు సిద్ధం కండి! పట్టుదలతోను ధైర్యంతోను ప్రశాంతంగాను రెచ్చ గొట్టినా రెచ్చిపోకుండా మీ సర్వశక్తులను సమకూర్చు కోండి! పోరాటదళాలను నిర్మించండి! శ్రామికులారా! సైనికులారా! పార్టీ పతాకక్రింద ఐక్యంకండి! పల్లెలలోని పీడిత తాడిత ప్రజలారా! మన పతాకక్రింద ఐక్యంకండి!”

## 5

విప్లవాన్ని అణచడానికి జనరల్ కోర్నిలావ కుట్ర–అది అణిచివేయబడుట – పెట్రోగ్రాడ్, మాస్కో సోవియట్లు బోల్షివిక్కుల పక్షాన చేరుట

అధికారాన్నంతా స్వాధీనంచేసుకొన్న పెట్టుబడిదారీ వర్గం ఇపుడు బలహీనంగావున్న సోవియట్లను నాశనంచేసి బహిరంగ విప్లవ ప్రతీఘాత నియంతృత్వాన్ని స్థాపించడానికి సన్నాహాలు చేస్తోంది.

కోటీశ్వరుడైన రెబుషిన్స్కీ పొగరుబోతుతనంతో ఇలా ప్రకటించాడు: "క్షామదేవత, మృత్యుహస్తము ప్రజల దారిద్ర్య బాధా, ప్రజల కృత్రిమ స్నేహితులను అనగా ప్రజాతంత్ర సోవియట్లను, కమిటీలను గొంతు పిసికివేయాలి. తద్వారా ప్రస్తుతపరిస్థితినుండి మనం బయటపడగలం". యుద్ధరంగంలో కోర్టుమార్షల్ శిక్షలు విధించి సైనికులపై రాక్షస ప్రతీకార చర్యలు జరుపబడ్డాయి. ఒక్కుమ్మడిగా మరణశిక్షలు విధించబడ్డాయి. 1917 ఆగస్టు 3వ తేదీన సర్వసేనానియైన జనరల్ కోర్నిలావ్ యుద్ధశ్రేణి వెనుభాగంలో కూడా (పౌర రంగంలో కూడా) మరణశిక్ష ప్రవేశపెట్టాలని కోరాడు.

ఆగస్టు 12వ తేదీన భూస్వాముల, పెట్టుబడిదారుల శక్తులను సమీకరించడానికి తాత్కాలిక ప్రభుత్వం మాస్కోలో గ్రాండ్ థియేటర్‌లో స్టేట్‌కౌన్సిలును సమావేశ పరచింది. ఈ కౌన్సిల్‌లో ముఖ్యంగా భూస్వాముల, పెట్టుబడిదారుల, సేనానుల, ఉద్యోగుల, కోసక్కుల ప్రతినిధులు హాజరయ్యారు. సోవియట్ల తరఫున మెన్షివిక్‌లు, సోషలిస్టు - రివల్యూషనరీలు హాజరయ్యారు.

స్టేట్‌కౌన్సిల్ సమావేశపరచడానికి అసమ్మతిగా, సమావేశ ప్రారంభదినాన మాస్కోలో సర్వవ్యాపిత సమ్మె సాగించా

లని కార్మికులను బోల్షివిక్కులు కోరారు. అధిక సంఖ్యాక కార్మికులు యీ సమ్మెలో పాల్గొన్నారు. ఇంకా అనేక ఇతర పట్టణాలలో కూడా ఇదే సమయాన సమ్మెలు జరిగాయి.

సోషలిస్టు - రివల్యూషనరీ కెరెన్స్కీ ఈ కౌన్సిల్‌లో ప్రగల్భాలు పలుకుతూ విప్లవోద్యమం యొక్క ప్రతి ప్రయత్నాన్ని "తుపాకులతో రక్తపాతంతో ముంచి" అణచివేస్తానని బెదిరించాడు. భూస్వాముల భూములను లాక్కోడానికి రైతులు అనధికారయుతంగా చేసే ప్రయత్నాలను కూడా రక్తపాతంతో ముంచివేస్తానని బెదిరించాడు.

విప్లవ ప్రతీఘాతకుడైన జనరల్ కోర్నిలావ్ "కమిటీలను సోవియట్లను రద్దుపరచాలి" అని కుండ బద్దలుకొట్టినట్లు కఠినంగా కోరాడు.

బ్యాంకర్లు, వర్తకులు, పారిశ్రామిక వేత్తలు సైనిక ప్రధాన కార్యాలయంవద్ద కోర్నిలావ్ చుట్టూ మూగారు. కావలసినంత డబ్బు యిస్తామని, అతన్ని బలపరుస్తామని వాగ్దానం చేసారు.

"మిత్రమండలి" దేశాలైన బ్రిటన్, ఫ్రాన్స్ ప్రతినిధులు కూడా జనరల్ కోర్నిలావ్ వద్దకు వచ్చారు. విప్లవాన్ని అణచడానికి ఏమాత్రం ఆలస్యంచేయకుండా చర్యలు తీసుకోవాలని కోరారు.

విప్లవాన్ని నాశనం చేయడానికి జనరల్ కోర్నిలావ్ చేసే కుట్ర పరిపక్వానికి వచ్చింది.

కోర్నిలావ్ తన సన్నాహాలను బహిరంగంగానేచేశాడు. దృష్టిని మరల్చటానికి గాను ఈ కుట్రదారులు ఒక వదంతిని

వ్యాపింపచేశారు. విప్లవం జరిగిన మొదటి ఆరుమాసాల అంతంలో, అనగా ఆగస్టు 27 వ తేదీన, పెట్రోగ్రాడ్‌లో తిరుగుబాటును లేవదీయడానికి బోల్షివిక్‌లు సిద్ధమవుతున్నారని ఆ వదంతి. కెరెన్స్కీ నాయకత్వాన తాత్కాలిక ప్రభుత్వం బోల్షివిక్కులపై అతిక్రూరమైన దాడిని సాగించింది. శ్రామిక వర్గపార్టీపైన దారుణ నిర్బంధవిధానాన్ని తీవ్రతరం చేసింది. ఇదే సమయంలో పెట్రోగ్రాడ్‌పై నడపడానికి సైన్యాలను జనరల్ కోర్నిలావ్ కేంద్రీకరించాడు. ఆ పట్టణంపై తన సైన్యాలను నడిపి సోవియట్లను రద్దుచేసి సైనిక నియంతృత్వాన్ని నెలకొల్పాలని అతడు తలచాడు.

కోర్నిలావ్ తన విప్లవ ప్రతీఘాతచర్య విషయమై కెరెన్స్కీతో ముందుగానే ఒక ఒడంబడిక చేసుకున్నాడు. కాని కోర్నిలావ్ తన దాడిని ప్రారంభించగానే, కెరెన్స్కీ హఠాత్తుగా ప్లేటుమార్చి తన మిత్రుడైన కోర్నిలావ్‌తోటి తన సంబంధాలను తెగద్రెంచుకున్నాడు. కోర్నిలావ్ పక్షంవారికి వ్యతిరేకంగా ప్రజాసామాన్యం లేచి వారిని అణచివేస్తుందనీ, కోర్నిలావ్ గొడవతో తాను గనుక తెగతెంపులు చేసుకోని పక్షంలో దానితోపాటు తన పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని కూడా తుడిచిపారవేస్తుందనీ కెరెన్స్కీ భయపడ్డాడు.

ఆగస్టు 25 వ తేదీన కోర్నిలావ్ పెట్రోగ్రాడ్ పైకి మూడవ ఆశ్వికదళాన్ని (Third Mounted corps) జనరల్ క్రిమోవ్ ఆధిపత్యాన పంపాడు. తాను "మాతృభూమిని రక్షించదలిచానని" ప్రకటించాడు. కోర్నిలావ్ తిరుగుబాటుకు జవాబుగా, బోల్షివిక్‌పార్టీ సెంట్రల్ కమిటీ విప్లవప్రతీఘాతాన్ని

సాయుధ పోరాటంతో ఎదుర్కొనవలసిందని కార్మికులను, సైనికులను కోరింది. కార్మికులు హడావిడిగా సాయుధులై ప్రతిఘటనకు తలపడ్డారు. ఈ రోజులలో రెడ్ గార్డుదళాలు (బోల్షివిక్ వలంటీర్ దళాలు) విపరీతంగా పెరిగాయి. కార్మిక సంఘాలు తమ సభ్యులను సమీకరించాయి. పెట్రోగ్రాడ్ లోని విప్లవసైనిక యూనిట్లు పోరాటానికి సంసిద్ధంగావున్నాయి. పెట్రోగ్రాడ్ చుట్టూ కందకాలు తవ్వారు. ముండ్లతీగల కంచెలు వేశారు. పట్టణానికి పోయే రైలుమార్గాలు పీకివేశారు. అనేకవేల సాయుధనావికులు పట్టణాన్ని రక్షించడానికి క్రాన్ స్టాట్ నుండి వచ్చారు. పెట్రోగ్రాడ్ పైకి పురోగమించుతున్న "రాక్షసడివిజన్" వద్దకు కార్మిక ప్రతినిధులను పంపారు. కాకేషియన్ పర్వతశ్రేణి వాసులతో కూడిన ఈ "రాక్షస డివిజన్"కు ఈ ప్రతినిధులు కోర్నిలావ్ చర్యలోని ఉద్దేశ్యాన్ని విశదపరచగానే, వారు ముందుకువెళ్ళ నిరాకరించారు. కోర్నిలావ్ ఇతరసైన్యాల వద్దకు కూడా ప్రచారకులను పంపారు. ప్రమాదంవున్న ప్రతిచోటా కోర్నిలావ్ తో పోరాడటానికి విప్లవ కమిటీలు వాటి ప్రధాన కార్యాలయాలు నెలకొల్పబడ్డాయి.

ఆ రోజుల్లో సోషలిస్టు - రివల్యూషనరీ నాయకులు, మెన్షివిక్కు నాయకులు చచ్చేటంత పిరికిబడ్డారు. వారిలో కెరెన్స్కి ఒకడు. వారు తమను రక్షించమని బోల్షివిక్ లను శరణుజొచ్చారు. రాజధానీనగరంలో కోర్నిలావ్ ను ఓడించ గల శక్తి ఒక్క బోల్షివిక్ లకే కలదని వారు గుర్తించారు.

కోర్నిలావ్ తిరుగుబాటును అణచివేయుటకు ప్రజా సామాన్యాన్ని సమీకరించుతున్నప్పటికీ, బోల్షివిక్ లు కెరెన్స్కి

ప్రభుత్వానికి వ్యతిరేకంగా తమ పోరాటాన్ని వదలిపెట్టలేదు. వారు కెరెన్స్కీ ప్రభుత్వాన్నీ, మెన్షివిక్కులనూ, సోషలిస్టు - రివల్యూషనరీలనూ బట్టబయలుచేశారు. వారి విధానమే ఆచరణలో కోర్నిలావ్ యొక్క విప్లవ ప్రతీఘాత కుట్రకు సహాయపడుతున్నదని ప్రజలకు తెలియజేశారు.

ఈ చర్యల ఫలితంగా కోర్నిలావ్ తిరుగుబాటు అణచి వేయబడింది. జనరల్ క్రిమోవ్ ఆత్మహత్య చేసుకున్నాడు. కోర్నిలావ్, అతనితోపాటు కుట్రచేసిన డెనికిన్, లుకోన్‌స్కీ లను అరెస్టుచేశారు. (అయినా త్వరలోనే కెరెన్స్కీ వారిని విడుదల చేశాడు.)

కోర్నిలావ్ తిరుగుబాటు పరాజయం విప్లవశక్తుల, విప్లవ ప్రతీఘాతశక్తుల బలాబలాలను మెరుపులా బయట పెట్టింది. సేనానులు, శాసనబద్ధ ప్రజాతంత్ర పక్షవాదులు మొదలుకొని మెన్షివిక్కుల, సోషలిస్టు - రివల్యూషనరీల వరకు విప్లవ ప్రతీఘాత శిబిరంయావత్తూ పెట్టుబడిదారీ వలలో చిక్కు బడిపోయారనీ, దానికి వినాశనం తప్పదనీ అది తెలియజేసింది. దుర్భరమైన యుద్ధభారాన్ని ఇంకా కొనసాగించే విధానం వల్లనూ, దీర్ఘకాలయుద్ధంవల్ల కలిగిన ఆర్థిక సంక్షోభం వల్లనూ, మెన్షివిక్కుల సోషలిస్టు - రివల్యూషనరీల పలుకుబడి ప్రజా సామాన్యంలో పూర్తిగా పడిపోయిందని స్పష్టమయింది.

బోల్షివిక్కుపార్టీ విప్లవ నిర్ణీతశక్తిగా పెంపొందినదనీ, ఏ విప్లవ ప్రతీఘాత ప్రయత్నాన్నైనా సరే ఓడించగల సామర్థ్యం గలదనీ, కోర్నిలావ్ తిరుగుబాటు పరాజయం తెలియజేసింది. మనపార్టీ ఇంకా అధికారంలోకి రాలేదు.

కాని కోర్నిలావ్ రోజులలో నిజమైన అధికార ప్రభుత్వంలాగా అది పనిచేసింది. కార్మికులు, సైనికులు దాని సూచనలను ఎట్టి సంకోచం లేకుండా పాటించారు.

కోర్నిలావ్ తిరుగుబాటు ఓటమి చూపించిన ఆఖరి విషయం ఇది: పైకి చచ్చినట్లు కనబడుతున్న సోవియట్లు వాస్తవంగా అత్యద్భుతమైన నిగూఢ విప్లవ ప్రతిఘటనాశక్తిని కలిగివున్నాయి. కోర్నిలావ్ యొక్క సైనికుల మార్గానికి అడ్డుపడి వాటిబలాన్ని ఛేదించినది, సోవియట్లూ, వాటి విప్లవ కమిటీలే. ఈ విషయంలో సందేహం ఏమీలేదు.

కోర్నిలావ్‌కు వ్యతిరేకంగా సాగించిన పోరాటం క్షీణించుచున్న కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్లలో కొత్త జీవాన్ని పోసింది. వాటిని రాజీవిధాన ప్రభావంనుండి విముక్తి చేసింది. విప్లవ పోరాటమనే బహిరంగ పంథాలోకి వాటిని నడిపి బోల్షివిక్కు పార్టీవైపుకు వాటిని త్రిప్పింది.

సోవియట్లలో బోల్షివిక్కుల పలుకుబడి ఇదివరకెన్నడూ లేనంతగా వ్యాపించింది.

భూస్వాములూ సేనానులూ బోల్షివిక్‌లనూ, సోవియట్లనూ అణచుటలో విజయం పొందినట్లయితే, ఆ తర్వాత రైతాంగంపై దాడిచేసి వుండేవారని రైతాంగ ప్రజాబాహుళ్యానికి కోర్నిలావ్ తిరుగుబాటు స్పష్టంచేసింది. అందుచే పేద రైతు ప్రజాసామాన్యం బోల్షివిక్కులను మరింత సన్నిహితంగా రాసాగింది. 1917 ఏప్రిల్ నుండి ఆగస్టువరకు విప్లవాభివృద్ధిని మధ్యతరగతి రైతుల వూగిసలాటలు ఆటంకపర్చాయి. కోర్నిలావ్ ఓటమి తర్వాత వారు బీదరైతులతో కలసి బోల్షివిక్

పార్టీవైపుకు నిశ్చితంగా మ్రొగ్గసాగారు. బోల్షివిక్ పార్టీ ఒక్కటే వారిని యుద్ధంనుండి విముక్తి చేయగలదనీ, ఈ పార్టీ ఒక్కటే భూస్వాములను అణచివేసి భూమిని రైతాంగానికి అప్పజెప్ప సంసిద్ధంగా వున్నదనీ, రైతు జన బాహుళ్యం నెమ్మదిగా గ్రహించసాగింది. 1917 సెప్టెంబరు - అక్టోబరులలో ఎస్టేటు భూములను రైతులు వశపరచుకొన్న ఘటనలు విశేషంగా పెరిగిపోయాయి. భూస్వాముల పొలాలలో చట్ట విరుద్ధంగా వ్యవసాయం చేయడం విరివిగా వ్యాపించింది. రైతులు విప్లవ మార్గం పట్టారు. ప్రతీకారదాడులు (Punitive Expeditions) గాని తీయతీయని మాటలతో బుజ్జగింపులుగాని వారిని ఇక ఏమాత్రమూ ఆపలేవు.

విప్లవవెల్లువ అంతకంతకూ పెల్లుబుకుతోంది.

సోవియట్లను పునరుద్ధరించిన సమయం ప్రారంభమయింది. వాటి నిర్మాణంలో మార్పు వచ్చింది. అవి బోల్షివిక్ తత్వంతో నిండిపోయాయి. ఫ్యాక్టరీలు, మిల్లులు, సైనిక యూనిట్లు కొత్తగా ఎన్నికలు జరిపి, మెన్షివిక్‌ల, సోషలిస్టు-రివల్యూషనరీలస్థానే బోల్షివిక్‌పార్టీ ప్రతినిధులను సోవియట్లకు ఎన్నుకున్నాయి. ఆగస్టు 31వ తేదీన, అనగా కోర్నిలావ్‌పై విజయం సాధించిన మర్నాడు, పెట్రోగ్రాడ్ సోవియట్ సమావేశమై బోల్షివిక్కు-విధానాన్ని ఆమోదించింది. పెట్రోగ్రాడ్ సోవియట్ యొక్క అధ్యక్షవర్గం (Presidium) లోని పాత సభ్యులంతా, మెన్షివిక్‌లు, సోషలిస్టు-రివల్యూషనరీలంతా రాజీనామా నిచ్చారు. దాని అధ్యక్షుడు కీడ్జికూడా రాజీనామా నిచ్చాడు. బోల్షివిక్కులకు మార్గాన్ని సుకరం

చేశారు. సెప్టెంబర్ 5వ తేదీన మాస్కోలోని కార్మిక ప్రతినిధుల సోవియట్, బోల్షివిక్కుల పక్షాన చేరింది. మాస్కో సోవియట్ యొక్క సోషలిస్టు-రివల్యూషనరీల, మెన్షివిక్‌లతో కూడిన అధ్యక్షవర్గం రాజీనామా నిచ్చింది. బోల్షివిక్కులకు మార్గాన్ని సుకరం చేసింది.

జయప్రదమైన తిరుగుబాటుకు ముఖ్య పరిస్థితులు పరిపక్వ మయ్యాయని దీనివల్ల స్పష్టమైంది.

తిరిగి "అధికారమంతా సోవియట్లకే" అనే నినాదం ప్రతిధ్వనించింది.

కాని, ఇదిమెన్షివిక్కుల, సోషలిస్టు-రివల్యూషనరీల సోవియట్లకు అధికారం హస్తగతం చేయమనే పాత నినాదం ఇక ఏమాత్రమూ కాదు. ఈసారి ఈనినాదం తాత్కాలిక ప్రభుత్వంపై సోవియట్లు తిరుగుబాటు చేయాలని కోరుతోంది. దీని లక్ష్యం ఇప్పుడు బోల్షివిక్కులచే నడుపబడుచున్న సోవియట్లకు అధికారాన్నంతా అప్పగించాలని.

రాజీవిధానం అవలంబించేపార్టీలు శిథిలంకాజొచ్చాయి.

విప్లవ రైతాంగంయొక్క ఒత్తిడివల్ల సోషలిస్టు - రివల్యూషనరీపార్టీలో తీవ్రవాద పక్షం ఒకటి ఏర్పడింది. దానిని "తీవ్రవాద" సోషలిస్టు-రివల్యూషనరీల పక్షం అనేవారు. వీరు పెట్టుబడిదారీవర్గంతో రాజీపడే విధానానికి తమ అసమ్మతిని తెలియజేశారు.

మెన్షివిక్కులలో కూడా ఇంకొక "తీవ్రవాద" ముఠా ఏర్పడింది. వీరు "ఇంటర్నేషనలిస్ట్సు" (అంతర్జాతీయవాదులు) అనబడేవారు. వీరు బోల్షివిక్కుల వైపుకు మొగ్గసాగారు.

ఇక అరాచకవాదుల (Anarchists) సంగతి. ఈ ముఠాను పలుకుబడి ప్రారంభంనుండీ చాలా తక్కువ. ఇప్పుడు ఇది మరీ చిన్న చిన్న ముఠాలుగా చీలిపోయింది. వీరిలో కొందరు దొంగలు, నేరస్థులు మొదలైనవారితో కలసిపోయారు. సమాజంలో అధములైన గూఢచారులతో మరికొందరు కలసి పోయారు. మరికొందరు రైతులను పట్టణవాసులైన చిన్న చిన్న ఆస్తిపరులను దోపిడిచేస్తూ, కార్మిక క్లబ్బుల స్థలాలను నిధులను స్వాధీనపరుచుకో సాగారు. తాము "చిత్తశుద్ధిగా" ఆస్తిదారుల ఆస్తిని వూడగొట్టేవారిగా (Expropriétors) మారిపోయామని చెప్పుకొనేవారు. ఇంకా మరికొందరు బహి రంగంగా విప్లవ ప్రతీఘాత శిబిరంలో చేరిపోయారు. వీరు పెట్టుబడిదారీవర్గంయొక్క సేవకులై తమ స్వంతలాభాలకు ప్రాకులాడారు. వీరు అన్నికరాల ప్రభుత్వాధికారానికీ వ్యతి రేకులు. కార్మికుల రైతుల విప్లవాధికారానికి వీరు ప్రత్యేకంగా, ముఖ్యంగా వ్యతిరేకులు. ఏమంటే, విప్లవ ప్రభుత్వం ప్రజలను దోచుకోటంగానీ, ప్రజలఆస్తిని దొంగిలించడాన్నిగానీ అనుమ తించదని వీరికి తెలుసు.

కోర్నిలావ్ ఓటమితర్వాత మెన్షివిక్కులు, సోషలిస్టు-రివల్యూషనరీలు, పెంపొందుతున్న విప్లవ వెల్లువను అరికట్ట డానికి మరొక ప్రయత్నం చేశారు. ఇది దృష్టిలో పెట్టుకొని వీరు 1917 సెప్టెంబరు 12 వ తేదీన అఖిల రష్యన్ ప్రజాతంత్ర సమావేశాన్ని ఏర్పాటుచేశారు. దీనికి సోషలిస్టుపార్టీలు, రాజీవాదులతో కూడిన సోవియట్లు, కార్మిక సంఘాలు, జెమ్స్ట్వోలు (స్థానికసంస్థలు), వాణిజ్య పారిశ్రామిక సమి తులు, సైనిక యూనిట్లు ప్రతినిధులను పంపారు. ఈ సమా

వేశం రిపబ్లిక్‌యొక్క తాత్కాలిక సంఘం (Provisional Council) ఒకదానిని ఏర్పరచింది. దీనిని తొలి పార్లమెంటు (Pre - Parliament) అని అనేవారు. ఈ తొలి పార్లమెంటు సహాయంతో విప్లవాన్ని అడ్డగించి, సోవియట్ విప్లవమార్గాన్నుండి దేశాన్ని పెడతోవపట్టించి, బూర్జువా రాజ్యాంగ అభివృద్ధిమార్గం వైపుకు, బూర్జువా పార్లమెంటు విధాన మార్గం వైపుకు మరల్చాలని రాజీబేరగాళ్లు ఆశించారు. కాని విప్లవచక్రాన్ని వెనుదిప్పడానికి రాజకీయంగా దివాళా తీసిన వీరి ప్రయత్నం నిరర్థకమయింది. అది విఫలంచెందక మానదు. అలాగే విఫలంచెందింది కూడా. ఈ రాజీబేరగాండ్ల శాసనబద్ధ ప్రయత్నాలు అపహాస్యం చేస్తూ కార్మికులు ఈ తొలి పార్లమెంటును (రష్యన్ భాషలో 'ప్రెడ్ పార్లమెంట్ (Pred parliament) "ప్రెడ్ బానిక్" (Pred Bannik',) అనగా "తొలి స్నానాలగది" అని ఎగతాళిచేసేవారు.

బోల్షివిక్‌పార్టీ సెంట్రల్‌కమిటీ, ఈ "తొలి పార్లమెంటు"ను బహిష్కరించాలని నిశ్చయించింది. "తొలి పార్లమెంటు" లోని కామెనీవ్, టియోడోరోవిచ్ వంటివారితో కూడిన బోల్షివిక్ ముఠా దానిని విడిచిపెట్టడానికి ఇష్టపడని మాట నిజమే. కాని పార్టీ సెంట్రల్‌కమిటీ వారు దానిని విడిచి పెట్టేటట్లు వత్తిడిచేసింది.

కామెనివ్, జినోవీవ్‌లు, తొలిపార్లమెంటులో పాల్గొనాలని మొండిగా పట్టుబట్టారు. తిరుగుబాటుకు పార్టీ చేస్తున్న సన్నాహాలనుండి దానిని మరల్చడానికి ఆవిధంగా వారు ప్రయత్నించారు. అఖిలరష్యన్ ప్రజాతంత్ర సమావేశంలోని బోల్షివిక్

ప్రతినిధుల సభలో మాట్లాడుతూ కామ్రేడ్ స్టాలిన్ "తొలి పార్లమెంటు"లో పాల్గొనటాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. ఈ 'తొలిపార్లమెంటు'ను "కోర్నిలావ్ గర్భస్రావం" అని కామ్రేడ్ స్టాలిన్ పిలిచాడు.

"తొలిపార్లమెంటు"లో కొద్దికాలంకూడా పాల్గొనటం గొప్పతప్పు అవుతుందని లెనిన్ స్టాలిన్‌లు అభిప్రాయ పడ్డారు. అలా పాల్గొనుటవల్ల ఈ "తొలిపార్లమెంటు" కార్మిక ప్రజలకు నిజంగా ఏదోకొంత సహాయం చేయగలదనే తప్పుడు ఆశ ప్రజానీకంలో కల్గించవచ్చు.

దీనితోపాటు బోల్షివిక్‌లు సోవియట్ల రెండవ కాంగ్రెసును సమావేశపరచడానికి తీవ్రప్రయత్నాలు సాగించారు. దీనిలో తమకు మెజారిటీ లభిస్తుందని ఆశించారు. అఖిలరష్యన్ సోవియట్ల కేంద్రకార్యనిర్వాహక వర్గంలో ప్రాబల్యంగావున్న మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు అఖిలరష్యన్ సోవియట్ల రెండవ కాంగ్రెస్ జరపకుండా ఎన్నో తంత్రాలుపన్నారు. ఐనప్పటికీ, బోల్షివిక్ సోవియట్ల వొత్తిడివలన అఖిల రష్యన్ సోవియట్ల రెండవ కాంగ్రెస్‌ను, 1917 అక్టోబరు రెండవ పక్షంలో సమావేశపరచాలని కేంద్రకార్య నిర్వాహకవర్గం నిర్ణయించింది.

# 6

పెట్రోగ్రాడ్‌లో అక్టోబరు తిరుగుబాటు – తాత్కాలిక ప్రభుత్వం అరెస్టు – సోవియట్ల రెండవ కాంగ్రెస్ – సోవియట్ ప్రభుత్వ స్థాపన – శాంతి సమస్యపై, భూమిసమస్యపై సోవియట్ల రెండవ కాంగ్రెస్ గావించిన అధికారప్రకటనలు – సోషలిస్టు విప్లవవిజయం – అందుకు కారణాలు

తిరుగుబాటుకు బోల్షివిక్కులు తీవ్రంగా సన్నాహాలు చేయ నారంభించారు. మాస్కో, పెట్రోగ్రాడ్ రెండు ముఖ్య నగరాలలోను కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్లలో బోల్షివిక్కులు మెజారిటీ సంపాదించారు. అలా బలంచేకూర్చుకొన్న బోల్షివిక్కులు అధికారాన్ని తాము హస్తగతం చేసుకోగలరు– చేసుకోవాలి అని లెనిన్ ప్రకటించాడు. గతంలో అధిగమించిన మార్గాన్ని సమీక్షచేస్తూ లెనిన్ "అధికసంఖ్యాక ప్రజలు మన పక్షాన వున్నారు" అన్నవిషయాన్ని నొక్కిచెప్పాడు. సెంట్రల్ కమిటీకి బోల్షివిక్ సంస్థలకు తానువ్రాసిన వ్యాసాల లోను, ఉత్తరాలలోను, లెనిన్ తిరుగుబాటుకు వివరాలతో కూడిన ఒక ప్లానును తెలియజేశాడు. అందులో తిరుగుబాటు విజయం పొందాలంటే సైనిక యూనిట్లను, నావికులను, రెడ్ గార్డులను (కార్మికదళంటిర్లు) ఎలా ఉపయోగించాలో, పెట్రోగ్రాడ్‌లో ఏకీలక ప్రదేశాలను పట్టుకోవాలో తెలియజేశాడు.

అక్టోబరు 7 వ తేదీన ఫిన్లండ్ నుండి రహస్యంగా లెనిన్ పెట్రోగ్రాడ్‌కు వచ్చాడు. 1917 అక్టోబరు 10 వ తేదీన చరిత్రాత్మకమైన పార్టీ సెంట్రల్ కమిటీ సమావేశం జరిగింది. తర్వాత కొద్దిరోజుల్లోనే సాయుధతిరుగుబాటును లేవదీయాలని ఆ సమావేశంలో నిశ్చయింపబడింది. పార్టీ సెంట్రల్ కమిటీ యొక్క చారిత్రక తీర్మానం లెనిన్ చే వ్రాయబడింది. ఆ తీర్మానం ఇలా వుంది :

"రష్యన్ విప్లవానికి అంతర్జాతీయ పరిస్థితి (జర్మన్ నావికులలోని తిరుగుబాటు, యూరప్ అంతటా ప్రపంచ సోషలిస్టు విప్లవంయొక్క అభివృద్ధిని సూచిస్తుంది; రష్యన్ విప్లవాన్ని పీకపిసికే ఉద్దేశ్యంతో సామ్రాజ్యవాదుల బెదిరింపులు), సైనిక పరిస్థితి (రష్యన్ పెట్టుబడిదారీవర్గమూ, కెరెన్స్కీ అండ్ కంపెనీ పెట్రోగ్రాడ్‌ను జర్మన్లకు అప్పగించాలని చేసుకొన్న నిస్సందేహమైన నిర్ణయం) సోవియట్లలో శ్రామికవర్గ పార్టీ మెజారిటీని సంపాదించిందన్న విషయమూ - వీటన్నిటితో పాటు రైతుల తిరుగుబాటూ, మన పార్టీ పట్ల ప్రజలవిశ్వాసం మొగ్గుట (మాస్కోలో ఎన్నికలు), మరొక కోర్నిలావ్ ఘటనకు సన్నాహాలు చేస్తున్నారని స్పష్టపడడమూ (పెట్రోగ్రాడ్ నుండి సైన్యాలను ఉపసంహరించడం, అక్కడికి వారి స్థానే కోసక్‌లను పంపడం, మెన్స్కు నగరాన్ని కోసక్‌లు చుట్టుముట్టడం) - ఈ కారణా లన్నిటివల్లా సాయుధ తిరుగుబాటు తక్షణ కర్తవ్యంగా సెంట్రల్ కమిటీ గుర్తిస్తోంది.

"అందుచే సాయుధ తిరుగుబాటు తప్పనిసరి అని, అందుకు కాలం పరిపక్వమైనదనీ భావించి, పార్టీ సంస్థల నన్ని

టినీ అందుకు అనుగుణ్యాంగానే నడపాలని సెంట్రల్ కమిటీ సూచించుతోంది. ఈ దృక్పథం అనుసరించి అన్ని ప్రత్యక్ష సమస్యలను (ఉత్తరప్రాంత సోవియట్ల కాంగ్రెస్, పెట్రోగ్రాడ్ నుండి సైనికుల తరలింపు, మాస్కో మిన్స్కులలో మన ప్రజలు తీసుకోవలసిన చర్య) చర్చించి నిర్ణయించాలి." (లెనిన్, సెలెక్టెడ్ వర్క్స - ఇంగ్లీషు ఎడిషన్ - మాస్కో 1947, 2వ వాల్యూం 135వ పేజీ.)

ఈ చారిత్రక నిర్ణయానికి వ్యతిరేకంగా సెంట్రల్ కమిటీలోని ఇద్దరు సభ్యులు కామెనివ్, జినోవీవ్‌లు వాదించి వోటు చేశారు. మెన్షివిక్కులు లాగానే వారుకూడా బూర్జువా పార్లమెంటుతో కూడిన రిపబ్లిక్‌ను గురించి కలలుగన్నారు. సోషలిస్టు విప్లవాన్ని కొనసాగించేటంత బలంగా కార్మికవర్గం లేదనీ, అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి తగినంత పరిపక్వం పొందలేదనీ వారు నిందించసాగారు.

ఈ మీటింగులో ట్రాట్స్కీ తీర్మానానికి వ్యతిరేకంగా ప్రత్యక్షంగా వోటుచేయలేదు. అయినప్పటికీ అతడొక సవరణను ప్రవేశపెట్టాడు. ఆ సవరణను అంగీకరించిన పక్షంలో తిరుగుబాటు లేవదీయటానికి అవకాశాలువుండవు. తిరుగుబాటు విఫలం కాకనూ తప్పదు. సోవియట్ల రెండవ కాంగ్రెస్ సమావేశం కాకముందుగా తిరుగుబాటును ప్రారంభించరాదని అతడి సూచన. ఈ సూచనను అంగీకరించితే తిరుగుబాటు ఆలస్యమవుతుంది. అది ప్రారంభించేరోజు బయటపడుతుంది. అది తాత్కాలిక ప్రభుత్వాన్ని ముందుగానే హెచ్చరించడం అవుతుంది.

డొనెట్జ్ బేసిన్, యూరల్స్, హెల్సింగ్ ఫర్స్, క్రాన్ స్టాట్, నైరుతి రంగాలకు, ఇంకా ఇతర ప్రదేశాలకు తిరుగు బాటును సంఘటితం చేయడానికి బోల్షివిక్ పార్టీ సెంట్రల్ కమిటీ తన ప్రతినిధులను పంపింది. కామ్రేడ్స్ వొరోషిలోవ్, మాలటోవ్, జెర్జిన్స్కీ, ఆర్జోనికిడ్జ్, కిరావ్, కాగనోవిచ్, క్యుబిషెవ్, ఫ్రంజ్, యరోస్లావ్‌స్కీ మొదలైనవారు రాష్ట్రాలలో తిరుగుబాట్లను నడపడానికి ప్రత్యేకంగా నియమింపబడ్డారు. యూరల్స్‌లోని సాడ్రిన్స్కీలో వున్న సాయుధసైన్యాలలో కామ్రేడ్ జదనోవ్ పనిచేశాడు. సెంట్రల్ కమిటీ ప్రతినిధులు వివిధరాష్ట్రాలలోని బోల్షివిక్ సంస్థల ముఖ్య సభ్యులతో తిరుగుబాటు పథకాన్ని చర్చించారు. వారిని పెట్రోగ్రాడ్‌లో జరిగే తిరుగుబాటుకు సహాయంగా సంసిద్ధమయ్యేట్లు సమీకరించారు.

పార్టీ సెంట్రల్ కమిటీ ఉత్తరువుల ననుసరించి పెట్రోగ్రాడ్ సోవియట్‌యొక్క "విప్లవ సైనిక కమిటీ" ఏర్పరచబడింది. ఈ సంఘం తిరుగుబాటుకై పనిచేసే బహిరంగ ప్రధాన కార్యాలయం.

ఈలోగా విప్లవ ప్రతీఘాతకులు తమశక్తులను త్వరత్వరగా సమీకరించ ప్రారంభించారు. సైనికోద్యోగులు ఉద్యోగుల సమితి (Officers league) అనే పేరుతో ఒక విప్లవ ప్రతీఘాతక సంస్థను నెలకొల్పారు. మెరపుదళాలను (Shock Battalions) నిర్మించడానికి ప్రతిచోటా విప్లవ ప్రతీఘాతకులు తమ ప్రధాన కార్యాలయాలను నెలకొల్పారు. అక్టోబరు నెలాఖరుకు విప్లవ ప్రతీఘాతకుల ఆధిపత్యంలో 43 మెరపు

దళాలు (బెటాలియన్స్) ఉన్నాయి. ఇంకా సెంట్‌జార్జి క్రాస్ కంపానియన్సు అనేపేరుతో ప్రత్యేక దళాలను (బెటాలియన్స్) నిర్మించారు.

కెరెన్స్కి ప్రభుత్వం తన కార్యాలయాన్ని పెట్రోగ్రాడ్ నుండి మాస్కోకు మార్చాలని ఆలోచించింది. పెట్రోగ్రాడ్ నగరంలోని తిరుగుబాటు రాకుండా ఆపుచేసేందుకు, అది ఆ నగరాన్ని జర్మన్లకు కైంకర్యం జేయాలని ప్రయత్నించుచున్నట్లు దీనివల్ల స్పష్టమయింది. పెట్రోగ్రాడ్ సైనికుల, కార్మికుల అసమ్మతి ఫలితంగా తాత్కాలిక ప్రభుత్వం పెట్రోగ్రాడ్ లోనే వుండిపోయింది.

అక్టోబరు 16 వ తేదీన పార్టీ సెంట్రల్ కమిటీ విస్తృత సమావేశం జరిగింది. ఈ సమావేశం తిరుగుబాటును నడపడానికి కామ్రేడ్ స్టాలిన్ నాయకత్వాన ఒక పార్టీ కేంద్రాన్ని ఎన్నుకుంది. ఈ పార్టీ కేంద్రం, పెట్రోగ్రాడ్ సోవియట్‌యొక్క విప్లవసైనిక కమిటీకి గుండెకాయ వంటిది. మొత్తం తిరుగుబాటును ప్రత్యక్షంగా నడిపించవలసిన బాధ్యత ఈ పార్టీ కేంద్రానిది.

సెంట్రల్ కమిటీ మీటింగులో లొంగుబాటుదారులైన జినోవీవ్, కామెనివ్‌లు తిరుగుబాటును తిరిగీ వ్యతిరేకించారు. కాని ఈ మీటింగులో గట్టి మొట్టికాయలు తినడంవల్ల తిరుగుబాటును వ్యతిరేకించుతూ, పార్టీని వ్యతిరేకించుతూ బహిరంగంగా పత్రికలలో ప్రకటన చేశారు. అక్టోబరు 18 వ తేదీన మెన్షివిక్కు వార్తా పత్రిక 'నొవాయా జిఝిన్'లో కామెనివ్ జినోవీవ్‌లు ఒక ప్రకటనచేశారు. అందులో బోల్షివిక్కులు

తిరుగుబాటుకు సన్నాహాలు చేస్తున్నారనీ, తాముమాత్రం (కామెనిప్, జినోవీవ్‌లు) ఇది దుస్సాహసంతో కూడిన జూద మని భావించుతున్నట్లు తెలియజేశారు. ఆ విధంగా కామె నిప్, జినోవీవ్‌లు తిరుగుబాటుకు సంబంధించిన సెంట్రల్ కమిటీ నిర్ణయాన్ని శత్రువుకు బహిరంగపరచారు. కొద్దిరోజు ల్లోనే ఈ తిరుగుబాటు జరగబోతుందని వీరు బయటపెట్టారు. ఇది కేవలం ద్రోహం. ఈ సందర్భంలో లెనిన్ ఇలా వ్రాశాడు: "కామెనివ్, జినోవీవ్‌లు సాయుధ తిరుగుబాటును గురించి పార్టీ సెంట్రల్ కమిటీ చేసిన నిర్ణయాన్ని రోడ్జంకో, కరన్స్కీ లకు వెల్లడిచేసి ద్రోహంచేశారు." కామెనివ్, జినోవీవ్‌లను పార్టీనుండి తొలగించవలసిందిగా లెనిన్ సెంట్రల్ కమిటీకి సూచించాడు.

ద్రోహులచే ముందుగానే హెచ్చరించబడ్డ విప్లవ శత్రువులు వెంటనే తిరుగుబాటును అడ్డగించి, విప్లవాన్నినడిపే కార్యకర్తలను - అనగా బోల్షివిక్కు-పార్టీని - నాశనం చేయ టానికి చర్యలు తీసుకొన నారంభించారు. తాత్కాలిక ప్రభుత్వం రహస్య సమావేశంజరిపి బోల్షివిక్కులను ఎదుర్కో డానికి అవసరమైన చర్యలనుగురించి నిర్ణయించింది. అక్టోబరు 19 వ తేదీన తాత్కాలిక ప్రభుత్వం త్వరత్వరగా యుద్ధరంగం నుండి సైన్యాలను పెట్రోగ్రాడ్‌కు పిలిపించింది. వీధులనిండా పూర్తిగా సైనికుల కాపలాపెట్టింది. విప్లవ ప్రతీఘాతకులు మాస్కోలో పెద్ద సైన్యాలను సమకూర్చుటలో జయ మొందారు. సోవియట్ల రెండవ కాంగ్రెస్ రేపో మాపో అనగా బోల్షివిక్కు సెంట్రల్ కమిటీ ప్రధానకార్యాలయం

స్మోల్నీపై (Smolny) దాడిచేసి ఆక్రమించుకొని, బోల్షివిక్కు నాయకత్వ కేంద్రాన్ని నాశనం చేయాలని తాత్కాలిక ప్రభుత్వం ఒక పథకం వేసింది. ఇందుకు ప్రభుత్వం పెట్రోగ్రాడ్‌కు సైన్యాలను పిలిపించింది. వారు విశ్వాసపంతంగా వుంటారని అది నమ్మింది.

కాని తాత్కాలిక ప్రభుత్వరోజులు - కాదు ఘడియలు దగ్గరపడ్డాయి. సోషలిస్టు విప్లవ జైత్రయాత్రను ఆపగలశక్తి దీనికి లేదు.

అక్టోబరు 21 వ తేదీన విప్లవసైనిక కమిటీ కమిసార్లను విప్లవసైనికదళాలలోకి (యూనిట్లలోకి) బోల్షివిక్కులు పంపారు. తిరుగుబాటు జరిగేముందుగా మిగిలిన కొద్దిరోజుల్లో సైనిక దళాలలోను, మిల్లులలోను, ఫ్యాక్టరీలలోను పోరాటానికి ఉత్సాహవంతమైన సన్నాహాలు చేయబడ్డాయి. అరోరా, జార్యాసోబడి అనే యుద్ధనౌకలకు కూడా స్పష్టమైన సూచనలు పంపబడ్డాయి.

పెట్రోగ్రాడ్ సోవియట్ సమావేశంలో మాటాడుతూ ట్రాట్స్కీ, తన బడాయికోరుతనాన్ని పట్టలేక సాయుధ తిరుగుబాటు ప్రారంభించడానికి బోల్షివిక్కులు పథకం వేసుకొన్న తేదీని శత్రువుకు తెలిసేటట్లు వాగాడు. తిరుగుబాటును కెరెన్స్కీ ప్రభుత్వం అణచివేయకుండా వుండేందుకుగాను, పార్టీ సెంట్రల్ కమిటీ మొదట అనుకున్న కాలానికి ముందే లేవదీసి కొనసాగించడానికి నిశ్చయించింది. సోవియట్ల రెండవ కాంగ్రెస్ ప్రారంభమయ్యే దినానికి ఒకరోజు ముందుగా ఈ తిరుగుబాటు జరిగేటట్లు నిర్ణయించింది.

అక్టోబరు 24 వ తేదీ (నవంబరు 6వ తేదీ) తెల్లవారు ఝామున కెరెన్స్కీ తన దాడిని ప్రారంభించాడు. బోల్షివిక్ పార్టీ కేంద్రపత్రిక రబోచీపుత్ (Rabochy Put-workers' Path - కార్మికపంథా)ను అణచివేయమని ఆజ్ఞాపించాడు. దాని సంపాదక కార్యాలయానికి, బోల్షివిక్కుల ముద్రణా కార్యాలయానికి సాయుధశకటాలను పంపాడు. కాని ఉదయం 10 గంటలకల్లా కామ్రేడ్ స్టాలిన్ ఉత్తరువుల ననుసరించి రెడ్ గార్డ్సు, విప్లవసైనికులు సాయుధ శకటాలను వెనక్కి నెట్టివేశారు. ముద్రణా కార్యాలయంమీద 'రబోచీపుత్' సంపాదక కార్యాలయంమీద అదనపు కాపలాదళాలను నియమించారు. తాత్కాలిక ప్రభుత్వాన్ని కూలద్రోయవలసిందని ఆదేశమిస్తూ వ్రాసిన వ్రాతలతో 'రబోచీపుత్' 11 గంటలకు వెలువడింది. అదేసమయంలో తిరుగుబాటు యొక్క పార్టీ కేంద్రం ఉత్తరువుల ననుసరించి విప్లవ సైనికదళాలు రెడ్ గార్డ్సు స్మోల్నీకి హుటాహుటిగా వెళ్లారు.

తిరుగుబాటు ప్రారంభమయింది.

అక్టోబరు 24 వ రాత్రి లెనిన్ స్మోల్నీ ప్రవేశించి తిరుగుబాటుకు స్వయంగా నాయకత్వం వహించాడు. ఆ రాత్రంతా సైనిక విప్లవదళాలు, రెడ్ గార్డుదళాలు స్మోల్నీకి వస్తూనేవున్నాయి. బోల్షివిక్కులు వారిని రాజధానీనగరం మధ్య భాగంలోకి తాత్కాలిక ప్రభుత్వం తిష్టవేసుకు కూర్చున్న వింటర్ భవనాన్ని ముట్టడించడానికి పంపించారు.

అక్టోబరు 25వ తేదీన (నవంబరు 7న) రెడ్ గార్డ్సులు, విప్లవ సైనికులు, రైల్వేస్టేషన్లను, పోస్టాఫీసును, టెలిగ్రాఫ్

ఆఫీసును, మంత్రివర్గ కార్యాలయాలను, ప్రభుత్వ బ్యాంకును స్వాధీనపరచుకొన్నారు.

తొలిపార్లమెంటు రద్దుచేయబడింది.

పెట్రోగ్రాడ్ సోవియట్ యొక్క బోల్షివిక్ సెంట్రల్ కమిటీ యొక్క ప్రధాన కార్యాలయమైన స్మోల్నీ, విప్లవ ప్రధాన కార్యాలయమైంది. అక్కడనుంచే పోరాటానికి ఉత్తరువులు జారీచేయబడేవి.

బోల్షివిక్‌పార్టీ నాయకత్వాన పెట్రోగ్రాడ్ కార్మికులు పొందిన అద్భుతమైన తర్ఫీదును ఆ రోజుల్లో వారు ప్రదర్శించారు. బోల్షివికుల కృషిచే తిరుగుబాటును సన్నద్ధపరచబడిన విప్లవ సైనికదళాలు పోరాట ఉత్తర్వులను తూచా తప్పకుండా పాటించారు. రెడ్‌గార్డులతో భుజం భుజం కలిపి వారు పోరాడారు. సైన్యానికి నావికులు ఏమాత్రమూ తీసిపోలేదు. బోల్షివిక్‌పార్టీకి క్రాన్‌స్టాట్ మంచి బలమైన కేంద్రం. అది చాలాకాలం నుండే తాత్కాలిక ప్రభుత్వ అధికారాన్ని గుర్తించ నిరాకరించింది. అరోరా యుద్ధనౌక (క్రూయిజర్) వింటర్ భవనంపై తన ఫిరంగులను సంసిద్ధపరచింది. అక్టోబరు 25 వ తేదీన (నవంబరు 7న) అరోరా యుద్ధనౌక ఫిరంగి గర్జనతో ఒక నూతనశకం, సోషలిస్టు విప్లవశకం ప్రారంభమయింది.

అక్టోబరు 25వ తేదీన (నవంబరు 7) బోల్షివిక్కులు "రష్యన్‌పౌరులను విజ్ఞప్తి" నొకదానిని ప్రకటించారు. అందులో బూర్జువా తాత్కాలిక ప్రభుత్వం కూలద్రోయబడిందనీ, రాజ్యాంగఅధికారం సోవియట్ల హస్తగతమయిందనీ తెలియజేశారు.

తాత్కాలిక ప్రభుత్వం వింటర్ భవనంలో కేడెట్ల మెరుపు దళాల రక్షణ క్రింద తలదాచుకొంది. అక్టోబరు 25వ తేదీ (నవంబరు 7) రాత్రి కార్మికులు, సైనికులు, నావికులు, వింటర్ భవనాన్ని చుట్టుముట్టి ఆక్రమించి తాత్కాలిక ప్రభుత్వాన్ని అరెస్టు చేశారు.

పెట్రోగ్రాడ్‌లోని సాయుధ తిరుగుబాటు విజయం పొందింది.

1917 అక్టోబరు 25 (నవంబరు 7) రాత్రి 10 గంటల 45 నిముషాలకు స్మోల్నీలో అఖిలరష్యన్ సోవియట్ల రెండవ కాంగ్రెస్ ప్రారంభమయింది. అప్పటికే పెట్రోగ్రాడ్ తిరుగుబాటు విజయవాహినితో ముంచెత్తిపోయింది. రాజధానీ నగరంలోని అధికారం పెట్రోగ్రాడ్ సోవియట్ చేతిలోకి వచ్చింది.

కాంగ్రెస్‌లో బోల్షివిక్కులకు అత్యధికమైన మెజారిటీ వచ్చింది. మెన్షివిక్కులు, 'బండ్' అనుచరులు, మితవాద సోషలిస్టు-రివల్యూషనరీలు తమకు ఆఖరిఘడియలువచ్చాయని తెలుసుకున్నారు. కాంగ్రెస్‌లో తాము ఏవిధంగానూ పాల్గొనక నిరాకరించుతున్నామని ప్రకటించుతూ దానినుండి లేచి పోయారు. సోవియట్ల కాంగ్రెస్‌లో వారు చదివిన ప్రకటనలలో అక్టోబరు విప్లవాన్ని ఒక "సైనికకుట్ర"గా పేర్కొన్నారు. మెన్షివిక్కులను, సోషలిస్టు-రివల్యూషనరీలను కాంగ్రెస్ ఖండించింది. వారు వెళ్లిపోయినందుకు విచారించలేదు సరిగదా పైగా సంతోషించింది. ఈ ద్రోహులు వెళ్ళిపోయిన ఫలితంగా కాంగ్రెస్ నిజమైన కార్మిక సైనిక ప్రతినిధుల విప్లవ కాంగ్రెస్‌గా మారిందని అది ప్రకటించింది.

కాంగ్రెస్, అధికారమంతా సోవియట్ల చేతులలోకి వచ్చిందని ఒక ప్రకటనచేసింది. ఆ ప్రకటన ఇలావుంది:

"కార్మికుల, సైనికుల, రైతులలో అత్యధికసంఖ్యాకులు బలపరచుటవల్ల, పెట్రోగ్రాడ్‌లో సంభవించిన కార్మికుల సైనికుల విజయవంతమైన తిరుగుబాటువల్ల, కాంగ్రెస్ అధికారాన్ని తన హస్తగతం చేసుకొంది."

1917 అక్టోబరు 26 వ తేదీ (నవంబరు 8) రాత్రి సోవియట్ల రెండవకాంగ్రెస్ శాంతికి సంబంధించిన ఒక చట్టం (Decree on peace) ఆమోదించింది. శాంతికై రాయబారాలు కొనసాగించేందుకుగాను, తక్షణం కనీసం మూడు మాసాలకు తక్కువలేకుండా యుద్ధవిరామ సంధిచేసుకోవాలని యుద్ధంచేస్తున్న దేశాలను కాంగ్రెస్ కోరింది. యుద్ధంచేస్తున్న ప్రభుత్వాలన్నింటికీ అదేసమయంలో విజ్ఞప్తిచేసింది. ఆ విజ్ఞప్తి "మానవజాతిలో ఎంతో అభివృద్ధిచెందిన మూడుదేశాల వర్గచైతన్యంగల కార్మికులకు_అనగా ప్రస్తుతయుద్ధంలో పాల్గొంటున్న దేశాలన్నిటిలోకి పెద్దవైన బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీల యొక్క వర్గచైతన్యం గల కార్మికులకు" - ఉద్దేశింపబడింది. "విజయవంతంగా శాంతిని నెలకొల్పాలని అదేసమయంలో పీడిత ప్రజాసామాన్యాన్ని అన్నిరకాల బానిసత్వంనుండి దోపిడినుండి విముక్తిచేయాలని" ఈ కార్మికులకు కాంగ్రెస్ విజ్ఞప్తిచేసింది.

అదేరాత్రి సోవియట్ల రెండవకాంగ్రెస్ భూమిహక్కుపై ఒక చట్టాన్ని (Decree on Land) ఆమోదించింది. "ఈక్షణం నుండి ఎట్టి నష్టపరిహారం ఈయకుండానే భూస్వాములకు గల

భూమిహక్కు రద్దుచేయబడింది" అని ఈ చట్టం ప్రకటించింది. ఈ వ్యవసాయక శాసనానికి ఆధారం రైతుల మేండేటే (Nakaz - అధికారపత్రం). వివిధ ప్రదేశాలలోని రైతులు 242 మేండేట్లు తయారుచేశారు. వాటి సారాంశమే మేండేట్. దీనిననుసరించి భూమిపై ప్రైవేటు యాజమాన్యం శాశ్వతంగా రద్దుచేయబడింది. భూస్వాములయొక్క జార్ కుటుంబంయొక్క మఠాల (Monstries) యొక్క భూములు కష్టపడే ప్రజలకు ఉచితంగా అనుభవించేనిమిత్తం యిచ్చివేయాలి.

అక్టోబరు సోషలిస్టు విప్లవఫలితంగా ఈ చట్టంవల్ల రైతాంగానికి 15 కోట్ల డెసియేటిన్ల (అనగా 40 కోట్ల ఎకరాలు) భూమి వచ్చింది. ఇదివరకు ఈ భూమి భూస్వాములకు, పెట్టుబడిదారులకు, జార్ కుటుంబానికి, మఠాలకు, చర్చిలకు (క్రీస్తు దేవాలయాలకు) చెందివుండేది.

ఇంతేగాక భూస్వాములకు సాలీనా రైతులీయవలసిన 50 కోట్ల బంగారు రూబుల్సు విలువచేసే మగతా మొత్తం రద్దుచేయబడింది.

నూనె, బొగ్గు, ముడిలోహం మొదలైన ఖనిజసంపదలన్నీ అడవులు, నదులూ మొదలైన జలసంపదలన్నీ ప్రజల ఆస్తిగా మారాయి.

అఖిలరష్యన్ సోవియట్ల రెండవకాంగ్రెస్ సోవియట్ ప్రభుత్వాన్ని ఏర్పరచింది. పూర్తిగా బోల్షివిక్‌లతో కూడిన ప్రజాకమీసార్ల (మంత్రుల) సమితిని ఏర్పరచింది. ప్రజాకమీసార్ల మొదటిసమితికి లెనిన్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు.

దీనితో సోవియట్ల రెండవకాంగ్రెస్ చారిత్రక సమావేశ కార్యక్రమం పూర్తిఅయింది.

పెట్రోగ్రాడ్‌లోని సోవియట్ల విజయవార్తను వ్యాపింపచేయడానికీ, సోవియట్ల అధికారాన్ని దేశమంతటా విస్తృతం చేయడానికీ కాంగ్రెస్ ప్రతినిధులు తమతమ ప్రదేశాలకు వెళ్ళిపోయారు.

కాని ప్రతిచోటా అధికారం వెనువెంటనే సోవియట్ల హస్తగతం కాలేదు. పెట్రోగ్రాడ్‌లో సోవియట్ ప్రభుత్వం అప్పటికే ఏర్పడి పనిచేస్తూంది. కాని మాస్కో వీధులలో భయంకరమైన మొండి పోరాటం అనేక రోజులవరకు కొనసాగుతూనే వుంది. మాస్కో సోవియట్ చేతులలోకి అధికారం పోకుండా ఆపివేసేందుకు, విప్లవ ప్రతీఘాతక మెన్షివిక్, సోషలిస్టు-రివల్యూషనరీలు వైట్‌గార్డులతోను, కేడట్లతోను కలిసి కార్మికులపైనా, సైనికులపైనా సాయుధ పోరాటాన్ని సాగించారు. దేశద్రోహులను ఓడించి మాస్కోలో సోవియట్ అధికారాన్ని స్థాపించడానికి చాలారోజులు పట్టింది.

విప్లవం విజయంపొందిన ప్రథమ దినాలలో, పెట్రోగ్రాడ్‌లో సైతం దాని అనేక జిల్లాలలో (పేటలలో) సోవియట్ అధికారాన్ని కూలదోయడానికి, విప్లవ ప్రతీఘాతకులు ప్రయత్నం చేశారు. 1917 నవంబరు 10వ తేదీన తిరుగుబాటు సమయంలో పెట్రోగ్రాడ్‌నుండి ఉత్తర రంగానికి పారిపోయిన కెరెన్స్కీ, అనేక కోసక్‌దళాలను సమీకరించి జనరల్ క్రాస్నోవ్ ఆధిపత్యాన పెట్రోగ్రాడ్ పైకి పంపాడు. 1917 నవంబరు 11వ తేదీన "మాతృభూమినీ విప్లవాన్నీ రక్షించే సమితి" (Committee for the salvation of the Fatherland and the Revolution) అనే పేరుతో సోషలిస్టు-రివ

ల్యూషనరీల ఆధిపత్యాన విప్లవ ప్రతీఘాత సంస్థ ఒకటి ఏర్ప డింది. అది పెట్రోగ్రాడ్‌లోని కేడెట్లలో తిరుగుబాటును లేవ దీసింది. కాని ఈ తిరుగుబాటును ఆ సాయంత్రానికే, నావికులు రెడ్‌గార్డులు ఏమంత కష్టం లేకుండానే అణచివేశారు. నవంబరు 13వ తేదీకి పూల్కోవో కొండలవద్ద జనరల్ క్రాస్నోవ్‌ను ఓడిం చారు. అక్టోబరు తిరుగుబాటును తాను స్వయంగా నడిపినట్లు గానే, లెనిన్, సోవియట్ వ్యతిరేక తిరుగుబాటును అణచి వేయుటలో కూడా స్వయంగా నాయకత్వం వహించాడు. అతని అచంచలమైన దృఢత్వం, విజయంపట్ల గభీర విశ్వాసం ప్రజలను ఉత్సాహపరచి ఐక్యం చేశాయి. శత్రువును సర్వ నాశనం చేశారు. క్రాస్నోవ్ ఖైదీగా పట్టుబడ్డాడు. సోవి యట్ అధికార వ్యతిరేక పోరాటాన్ని ఆపుచేస్తున్నానని "మాట" ఇస్తూ ఒట్టుపెట్టుకున్నాడు. అతని "మాట"పై అతనిని విడుదలచేశారు. కాని తర్వాత జనరల్ క్రాస్నోవ్ తన మాటను ఉల్లంఘించాడని స్పష్టమయింది. ఇక కెరెన్స్కీ ఆడ వేషం వేసుకొని "ఎటువైపుకో మాయమై" పోగలిగాడు.

సైనిక ప్రధాన కార్యాలయం అయిన మోగిలేవ్ వద్ద సర్వసేనాని జనరల్ దుఖోనిన్ కూడా తిరుగుబాటుకు ప్రయ త్నించాడు. సోవియట్ ప్రభుత్వం జర్మన్ సైనిక అధికారులతో యుద్ధవిరామసంధికి తక్షణం సంప్రదింపులు సాగించమని అతనికి ఉత్తరువులిచ్చింది. కాని అతడు వాటిని శిరసావహించ నిరాక రించాడు. అటుపై దుఖోనిన్‌ను డిస్మిస్ చేస్తూ సోవియట్ ప్రభుత్వం ఉత్తరువు జారీచేసింది. విప్లవ ప్రతీఘాతకుల ప్రధాన కార్యాలయం ఛిన్నాభిన్నం చేయబడింది. దుఖోనిన్‌పై కొందరు సైనికులు తిరగబడి అతనిని చంపివేశారు.

పార్టీలోని కొందరు సుప్రసిద్ధ అవకాశవాదులు కామెనివ్, జినోవీవ్, రైకోవ్, షి.యాప్నికోవ్ మొదలగువారు కూడా సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆకస్మిక దాడి చేశారు. వారు మెన్షివిక్కుల, సోషలిస్టు-రివల్యూషనరీలతో కూడిన "సంపూర్ణ సోషలిస్టు ప్రభుత్వాన్ని" స్థాపించాలని కోరారు. ఇదివరకే అక్టోబరు విప్లవం ఈ మెన్షివిక్కులను, సోషలిస్టు-రివల్యూషనరీలను కూలద్రోసింది. 1917 నవంబరు 15న బోల్షివిక్ పార్టీ సెంట్రల్ కమిటీ ఈ విప్లవ ద్రోహపూరిత పార్టీలతో ఒడంబడికను తిరస్కరించుతూ ఒక తీర్మానం చేసింది. కామెనివ్, జినోవీవ్‌లను విప్లవ ద్రోహులుగా (సమ్మె భగ్నకారకులుగా) ప్రకటించింది. నవంబరు 17 వ తేదీన కామెనివ్, జినోవీవ్, రైకోవ్, మిల్యూటిన్ పార్టీ పాలసీతో విభేదించి సెంట్రల్ కమిటీనుండి రాజీనామా నిచ్చారు. అదే రోజున, అనగా నవంబరు 17న ప్రజాకమీసార్ల సమితి సభ్యులైన రైకోవ్, మిల్యూటిన్, టియోడరోవిచ్, ఏ. షిల్యాప్నికోవ్, డి. రియాజనోవ్, యురినేవ్, లారిన్ మొదలగువారి తరఫున సెంట్రల్ కమిటీ పాలసీతో విభేదించుచున్నట్లు నోగిన్ ఒక ప్రకటన చేశాడు. ప్రజాకమీసార్ల సమితినుండి తమ రాజీనామానుకూడా ప్రకటించాడు. వేళ్ళమీద లెక్కింపదగిన ఈకొద్దిపాటి పిరికిపందల పలాయనం అక్టోబరు విప్లవ శత్రువులలో ఉత్సాహాన్ని రేకెత్తించింది. పెట్టుబడిదారీవర్గమూ, దాని తొత్తులూ బోల్షివిజం పడిపోతున్నదని, బోల్షివిక్ పార్టీ త్వరలోనే అంతమవుతుందని జోస్యం చెపుతూ సంబరపడి తమ దుర్బుద్ధిని వెలిబుచ్చారు. కాని ఈ కొద్దిమంది విద్రోహులవల్ల ఒక్కక్షణం కూడా పార్టీ చలించలేదు. పార్టీ సెంట్రల్ కమిటీ

వీరిని విప్లవద్రోహులనీ, నీచులనీ, దుష్టులైన బూర్జువావర్గపు సహచరులనీ పేర్కొని తన పనిని మామూలుగా కొనసాగించు కుంటూ పోయింది.

ఇక "తీవ్రవాద" సోషలిస్టు-రివల్యూషనరీల సంగతి. బోల్షివిక్కులపట్ల నిశ్చితంగా సానుభూతిచూపుతున్న రైతుజన సామాన్యంపై తమ పలుకుబడిని వీరు నిలబెట్టుకోవాలని చూస్తున్నారు. అందుచే ప్రస్తుతానికి బోల్షివిక్కులతో తగాదా పడక వారితో సంయుక్త సంఘటనను కొనసాగించాలని నిర్ణయించుకొన్నారు. 1917 నవంబరులో సమావేశమైన రైతు సోవియట్ల కాంగ్రెస్ అక్టోబరు సోషలిస్టు విప్లవం వలన లాభాలను గుర్తించింది. సోవియట్ ప్రభుత్వ శాసనాలను (Decrees) ఆమోదించింది. "తీవ్రవాద" సోషలిస్టు - రివల్యూషనరీలతో బోల్షివిక్కులు ఒక ఒడంబడిక చేసుకున్నారు. వారిలో చాల మందికి ప్రజా కమీసార్ల సమితిలో ఉద్యోగాలనిచ్చారు (కొలిగేవ్, స్పిరిడోనోవా, ప్రోష్యాన్, స్టేన్‌బెర్గ్ మొదలైనవారు). కాని ఈ ఒడంబడిక బ్రెస్ట్‌లిటోవ్‌స్క్ సంధివరకు మాత్రమే, బీదరైతాంగకమిటీలు ఏర్పడేటంతవరకు మాత్రమే నిల్చింది. ఈ కమిటీ లేర్పడినపుడు రైతాంగంలో పెద్దచీలిక వచ్చింది. కులక్‌ల ప్రయోజనాలను "తీవ్రవాద" సోషలిస్టు - రివల్యూషనరీలు రోజురోజుకూ ప్రతిబింబించసాగారు. బోల్షివిక్కులపై తిరుగుబాటు చేయ నారంభించారు. సోవియట్‌ప్రభుత్వం వీరిని ఓడించి వేసింది. 1917 అక్టోబరునుండి 1918 ఫిబ్రవరిలోగా సోవియట్ విప్లవం దేశమంతటా వ్యాపించింది. అది ఎంత వేగంగా వ్యాపిం

చిందంటే సోవియట్ ప్రభుత్వ "జైత్రయాత్ర" అని దానిని లెనిన్ పేర్కొన్నాడు.

ఈవిధంగా అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం విజయం పొందింది.

రష్యాలో సోషలిస్టు విప్లవం ఇతరదేశాలతో పోల్చి చూస్తే చాలా సులభంగా విజయం పొందింది. ఇందుకు చాలా కారణాలున్నాయి. ఈ క్రింది ముఖ్యకారణాలను గుర్తించు కోవాలి :

1. అక్టోబరు విప్లవానికిశత్రువైన రష్యన్ బూర్జువావర్గం విప్లవంతో పోల్చిచూస్తే చాలా బలహీనమైనది. బలహీనంగా సంఘటితమయింది. రాజకీయంగా అనుభవశూన్యమైనది. ఆర్థికంగా ఇంకా బలహీనంగావున్న ప్రభుత్వ కంట్రాక్టులపై పూర్తిగా ఆధారపడియున్న రష్యన్ బూర్జువావర్గానికి పరిస్థితులనుండి బయటపడటానికి తగినంత రాజకీయ స్వయంశక్తి, చొరవాలేవు. ఉదాహరణకు ఫ్రెంచి బూర్జువావర్గం మాదిరిగా రాజకీయ ముఠాలు కట్టడంలోను, పెద్దపెట్టున రాజకీయ కుయుక్తులు పన్నటంలోను దానికి ఎక్కువ అనుభవంలేదు; లేక బ్రిటిష్ బూర్జువావర్గంవలె బాగా ఆలోచించి వంచనతో కూడిన రాజీచేసుకోడమూ చేతకాదు. అది ఈమధ్యనే జార్ ప్రభుత్వంతో ఒక ఒడంబడిక చేసుకోవాలని ప్రయత్నంచేసింది. కాని ఫిబ్రవరి విప్లవం జార్‌ను కూలద్రోసింది. బూర్జువావర్గమే స్వయంగా అధికారానికి వచ్చింది. కాని అది ప్రధానవిషయా లన్నింటిలోనూ ప్రజలచే ద్వేషించబడిన జార్‌విధానాన్ని కొనసాగించుటకన్నా మించి మరొక పనినేమీ ఆలోచించలేక

పోయింది. యుద్ధభారం దేశం తాహతుకు మించి, యుద్ధంవల్ల ప్రజలూ, సైన్యమూ పూర్తిగా డస్సిపోయారు. అయినా జార్ లాగానే బూర్జువావర్గంకూడా "విజయం లభించేదాకా యుద్ధం కొనసాగించవలసిందే" అని నిశ్చయించింది. భూస్వాముల దాస్యభారంవల్లా, భూమిలేకపోవడంవల్లా రైతాంగం ఒక పక్క నశించిపోతున్నది. అయినప్పటికీ జార్ ప్రభుత్వం లాగానే బూర్జువావర్గంకూడా పెద్ద భూస్వాముల ఆస్తిని ఆలాగే కాపాడ పూనుకుంది. ఇక కార్మికుల విషయంలో రష్యన్ బూర్జువావర్గ విధానం జార్‌ను తలదన్నింది. కార్మిక వర్గాన్ని ద్వేషించడంలో అది జార్‌ను మించిపోయింది. ఫ్యాక్టరీ యజమానుల దోపిడీ భారాన్ని బలపరచి కాపాడుటకు ప్రయత్నించడమేగాక, ఒక్కుమ్మడి అంతటా లాకౌట్లు ప్రకటించి, కార్మికుల పరిస్థితిని దుర్భరం చేసింది.

కాబట్టి జార్ ప్రభుత్వ విధానానికి, బూర్జువా ప్రభుత్వ విధానానికి ఏమంత ప్రధానమైన భేదం ప్రజలు గుర్తించ లేదంటే అందులో ఆశ్చర్యమేమీలేదు. జార్ ప్రభుత్వంపట్ల తమకుగల ద్వేషాన్ని, బూర్జువా తాత్కాలిక ప్రభుత్వం వైపుకు ప్రజలు మరలించడంలో కూడా ఆశ్చర్యంలేదు.

రాజీపడే సోషలిస్టు-రివల్యూషనరీ, మెన్షివిక్కు పార్టీలకు ప్రజలలో కొంత పలుకుబడి వున్నంతకాలం బూర్జువావర్గం వారిని తెరగా ఉపయోగించుకొని తన అధికారాన్ని నిలుపుకో గలిగింది. కాని మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు, సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ వర్గపు ఏజంట్లుగా బట్టబయలయ్యారు. ప్రజలలో తమ పలుకుబడిని పోగొట్టుకొన్నారు.

దీనివల్ల బూర్జువావర్గానికి, దాని తాత్కాలిక ప్రభుత్వానికి ప్రజలలో ఏమాత్రం అండ లేకపోయింది.

(2) రష్యన్ కార్మికవర్గం యుద్ధరంగంలో కాకలు తీరింది. కొద్ది కాలంలో రెండు విప్లవాలను చవిజూచింది. మూడో విప్లవం వచ్చేసరికి శాంతి, భూమి, స్వాతంత్ర్యం, సోషలిజాలకై జరిపే పోరాటంలో ప్రజా నాయకురాలుగా గుర్తింపబడింది. అట్టి విప్లవవర్గం అక్టోబరు విప్లవానికి నాయకత్వం వహించింది. ప్రజా విశ్వాసాన్ని చూరగొన్న రష్యన్ కార్మికవర్గంవంటి నాయకురాలు విప్లవానికి లేకపోయినట్లైతే కార్మికుల రైతుల మధ్య మైత్రి సాధ్యమయ్యేదికాదు. అట్టి మైత్రి లేకుండా అక్టోబరు విప్లవ విజయం అసాధ్యం.

(3) రష్యన్ కార్మికవర్గానికి రైతుజనాభాలో అత్యధిక సంఖ్యాకులయిన బీద రైతాంగం విప్లవంలో ముఖ్యమైన మిత్రము. "మామూలు" రోజుల్లో అనేక శతాబ్దాలుగా పొందిన అనుభవముతో, విప్లవపు ఎనిమిది నెలల అనుభవాన్ని నిస్సంకోచంగా పోల్చవచ్చు.

కష్టపడే రైతు ప్రజాసామాన్యానికి సంబంధించినంత వరకు ఈ అనుభవం వృథాకాలేదు. ఈ ఎనిమిది నెలలలో రైతాంగ ప్రజలకు రష్యన్ పార్టీ లన్నింటినీ ఆచరణలో పరీక్షించడానికి అవకాశం లభించింది. శాసనబద్ధ ప్రజాతంత్ర వాదులుగానీ, సోషలిస్టు-రివల్యూషనరీలుగానీ, మెన్షివిక్కులు గానీ భూస్వాములతో పట్టుదలతో పోరాడరని, రైతుల ప్రయోజనాలకోసం వారు ఆత్మబలిదానం గావించరని ఆచరణలో తెలుసుకున్నారు. బోల్షివిక్కు పార్టీ ఒక్కటే భూస్వాము

లతో ఎట్టి సంబంధాలను కలిగియుండలేదని, రైతుల అవసరాలను నెరవేర్చేందుకై వారిని అణచివేయటానికై సిద్ధంగా వున్నదనీ వారు ఆచరణలో తెలుసుకున్నారు. ఇది శ్రామిక వర్గం, బీద రైతాంగాలమధ్య సఖ్యతకు దృఢమైన పునాదిగా పనిచేసింది. కార్మికవర్గ బీద రైతాంగాలమధ్య మైత్రి చాలా కాలంనుండి వూగిసలాడుచున్న మధ్యతరగతి రైతుల ప్రవర్తనను కూడా నిర్ణయించింది. ఈమధ్యతరగతి రైతులు అక్టోబరు తిరుగుబాటు సమీపించగానే హృదయపూర్వకంగా విప్లవం వైపుకు మొగ్గి బీద రైతాంగంతో కలిశారు.

ఈ మైత్రిలేనిదే అక్టోబరు విప్లవం విజయవంతమయ్యేది కాదని వేరే చెప్పనక్కరలేదు.

(4) రాజకీయ పోరాటాలలో పరీక్షకు నిలబడి కాకలు తీరిన బోల్షివిక్కు-పార్టీ వంటి పార్టీ కార్మికవర్గానికి నాయకత్వం వహించింది. ప్రజలను నిశ్చితమైన దాడిలో నడపగలధైర్యం బోల్షివిక్కు-పార్టీ వంటి పార్టీకేవుంది. శాంతికై జరిగే సర్వసాధారణ ప్రజాతంత్ర ఉద్యమమూ, ఎస్టేటు భూములను వశపరచుకోడానికై రైతులు సాగించే ప్రజాతంత్ర ఉద్యమమూ, జాతుల స్వాతంత్ర్యానికి, సమానతకు పీడిత జాతులు సాగించే ఉద్యమమూ, బూర్జువా వర్గాన్ని కూలదోసి శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించడానికి శ్రామికవర్గం సాగించే సోషలిస్టు ఉద్యమమూ - ఇలాంటి విభిన్న విప్లవోద్యమాలన్నింటినీ ఒకే విప్లవ ప్రవాహంగా చాతుర్యంతో బోల్షివిక్కు-పార్టీ సమన్వయ పరచగలిగింది. తన ఆశయసిద్ధికై వెళ్లే మార్గ ప్రవాహంలో మునిగియున్న కొండలను తాకకుండా జాగ్రత్తగా

పడవను నడపగల సామర్థ్యం ఒక్క బోల్షివిక్కు-పార్టీకే వుంది.

నిస్సందేహంగా ఈ విభిన్న విప్లవ ఉపనదుల నన్నింటిని ఒకే శక్తివంతమైన విప్లవ మహాప్రవాహంగా మేళవించుటయే రష్యాలోని పెట్టుబడిదారీ విధానగతిని నిశ్చయించింది.

(5) సామ్రాజ్యవాద యుద్ధం ఇంకా ఉచ్ఛస్థాయిలో వున్నప్పుడే, బూర్జువా ప్రభుత్వాలు రెండు శత్రుశిబిరాలుగా చీలివున్నపుడే అక్టోబరు విప్లవం ప్రారంభమైంది. పరస్పర యుద్ధంలో మునిగిపోయి ఒకరి బలాన్ని ఒకరు క్షీణింపజేసు కుంటున్న సమయంలో ఆ దేశాలు "రష్యన్ వ్యవహారం"లో తగినట్లు జోక్యం కలుగజేసుకో లేకపోయాయి. అక్టోబరు విప్లవాన్ని తీవ్రంగా వ్యతిరేకించ లేకపోయాయి.

అక్టోబరు సోషలిస్టు విప్లవ విజయానికి ఇది నిస్సందేహంగా ఎంతో సహాయ పడింది.

# 7

## సోవియట్ అధికారాన్ని సుస్థిర పరచుకోడానికి బోల్షివిక్కు-పార్టీ సల్పిన పోరాటం-బ్రెస్ట్-లిటోవ్‌స్క్ సంధి - పార్టీ ఏడవ కాంగ్రెస్

సోవియట్ అధికారాన్ని సుస్థిరపరచుకోడానికి పాత బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని తుత్తునియలు జేసి వినాశం చేసి, దానిస్థానే నూతన సోవియట్ రాజ్యాంగ యంత్రాన్ని

నెలకొల్పాలి. ఇంతేగాక, ఇదివరకు సమాజం * ఎస్టేట్లుగా (ప్రభుత్వ ఉపాంగాలు) విభజింపబడివుండేది. ఒక జాతిపై మరొకజాతి పీడించే పరిపాలన వుండేది. ఆ అవశేషాలను ఇప్పుడు నాశనంచేయుట, చర్చియొక్క ప్రత్యేక హక్కులను రద్దుచేయుట, బహిరంగంగాను రహస్యంగానువున్న అన్ని రకాల విప్లవ ప్రతిఘాత సంస్థలను, పత్రికలను అణచివేయుట, బూర్జువా ప్రజాపరిషత్తును రద్దుచేయుట అవసరం. భూమిని జాతిపరం చేయుటతోపాటు భారీ పరిశ్రమలను కూడా (లార్జ్ స్కేల్ ఇండస్ట్రీస్) జాతిపరం చేయాలి. అన్నిటికన్నా యుద్ధం సోవియట్ అధికారాన్ని సుస్థిరపరచుకోకుండా ఆటంకం కల్గిస్తోంది. కాబట్టి యుద్ధాన్ని అంతమొందించాలి.

ఈ చర్యలన్నీ కొద్దినెలలలోనే అనగా 1917 సంవత్స రాంతంనుండి 1918 వ సంవత్సరం మధ్యభాగం నాటికి అమలు జరిగాయి.

పాత మంత్రివర్గాలకు చెందిన ఉద్యోగస్తులు, సోష లిస్టు- రివల్యూషనరీల మెన్షివిక్కులచే ప్రోత్సహించబడి చేసిన విధ్వంసక చర్యలను అణచివేసి, ప్రభుత్వం నిలద్రొక్కుకొంది. మంత్రివర్గాలను రద్దుచేసి వాటిస్థానే సోవియట్ పరిపాలనా యంత్రాన్ని తగిన ప్రజామంత్రి మండలులను (కమిసారేట్సు) ఏర్పరిచింది. దేశంలోని పరిశ్రమలను నడుపుటకు జాతీయ ఆర్థిక విధాన ఉన్నత సమితి (The Supreme Council of National Economy) అంటూ ఒకటి ఏర్పడింది. విప్లవ

---

* ఎస్టేట్సు= ప్రభుత్వ ఉపాంగాలు; అనగా చర్చి, పత్రికలు, రాజకీయసంస్థలు, ప్రజాపరిషత్తు - అనువాదకుడు.

ప్రతీఘాతాన్ని, విధ్వంసక చర్యలనూ ఎదుర్కోటానికి అఖిల రష్యన్ అత్యవసరసమితి (The All-Russian Extra-ordinary Commission- Vecheka)ఏర్పరిచింది. దీనికియఫ్. జెర్ ఝిన్స్కీ అధ్యక్షుడుగా నియమించింది. రెడ్ ఆర్మీని, రెడ్ నౌకాదళాన్ని ఏర్పరచడానికి చట్టం చేసింది. అక్టోబరు విప్లవానికి పూర్వమే చాలావరకు ప్రజాపరిషత్తు ఎన్నికలు జరిగాయి. శాంతి, భూమిఅధికారాన్ని సోవియట్లకు హస్తగతం చేయుట మొదలగు సమస్యలపై సోవియట్ల రెండవకాంగ్రెస్ గావించిన చట్టాలను పై ప్రజాపరిషత్తు గుర్తించ నిరాకరించింది. అందుచే ఆ ప్రజాపరిషత్తును ఇప్పుడు ప్రభుత్వం రద్దుచేసింది.

భూస్వామ్యయుగపు అవశేషాలైన ఎస్టేట్ల పద్ధతినీ, సామాజిక జీవితరంగాలలో అసమానతనూ నిర్మూలిస్తూ ప్రభుత్వం కొన్ని చట్టాలు చేసింది. జాతినిబట్టి లేక మతాన్ని బట్టి ఏర్పడ్డ నిర్బంధాలను ఈ చట్టాలు రద్దుచేశాయి. ఈ చట్టాలవల్ల రాజ్యాంగయంత్రంనుండి చర్చి విడదీయబడింది. చర్చినుండి విద్యాలయాలను వేరుచేసింది. స్త్రీలకు సమాన స్వాతంత్ర్యం, రష్యాలోని వివిధజాతులకు సమాన స్వాతంత్ర్యం ఇచ్చింది.

"రష్యన్ ప్రజలహక్కులను గురించిన 'ప్రకటన" అనే పేరుతో సోవియట్ ప్రభుత్వం ఒక ప్రత్యేక ప్రకటన చట్టంగా ప్రకటించింది. దీనిప్రకారం రష్యాలోని ప్రజలంతా నిర్నిరోధమైన అభివృద్ధిపొందటానికి సంపూర్ణమైన సమానత కలిగియుండటానికి హక్కువుంది.

బూర్జువా ఆర్థిక అధికారాన్ని కూలద్రోసి నూతన సోవియట్ జాతీయ ఆర్థికవిధానాన్ని నిర్మించే నిమిత్తం, అన్నిటి కంటే ముందు నూతన సోవియట్ పరిశ్రమలను నిర్మించే నిమిత్తం, బ్యాంకులు, రైల్వేలు, విదేశవర్తకం, వర్తకనౌకలు, అన్నిరకాల పెద్ద పరిశ్రమలను అనగా బొగ్గు, లోహము, నూనె, రసాయన పదార్థాలు, యంత్ర నిర్మాణం, బట్టలు, పంచదార మొదలైనవన్నీ జాతిపరం చేయాలి.

విదేశీ పెట్టుబడిదారులపై మనదేశం ఆర్థికంగా ఆధార పడకుండా, విదేశీ పెట్టుబడిదారుల దోపిడికి గురికాకుండా స్వతంత్రంగా వుండేందుకు రష్యన్ జార్ ప్రభుత్వం, తాత్కా లిక ప్రభుత్వం విదేశాలనుండి తీసుకున్న అప్పులను సోవియట్ ప్రభుత్వం రద్దుచేసింది. మనదేశాన్ని విదేశీ పెట్టుబడిదారుల కింద బానిసత్వంలో వుంచిన దురాక్రమణ యుద్ధాన్ని కొన సాగించుటలో అయిన అప్పులను మనదేశ ప్రజలు చెల్లించ నిరాకరించారు.

ఇవీ, ఇలాంటి ఇతర చర్యలు పెట్టుబడిదారుల, భూస్వా ముల, అభివృద్ధి నిరోధక ఉద్యోగుల, విప్లవ ప్రతీఘాతక పార్టీల అధికారాన్ని, పునాదిని కూలదోశాయి. దేశంలో సోవియట్ ప్రభుత్వ స్థానాన్ని చాలావరకు బలపరచాయి.

కాని జర్మనీ, ఆస్ట్రియాలతో రష్యాయుద్ధం చేస్తున్న న్నాళ్లూ సోవియట్ ప్రభుత్వం యొక్క పరిస్థితి పూర్తిగా సుర క్షితమని భావించడానికి వీలులేదు. సోవియట్ అధికారాన్ని సుస్థిరం చేసుకోవాలంటే యుద్ధాన్ని అంత మొందించాలి.

అందుచే అక్టోబరు విప్లవం విజయంపొందిన మరుక్షణంనుంచీ పార్టీ శాంతిస్థాపనకు పోరాటాన్ని సాగించింది.

సోవియట్ ప్రభుత్వం "యుద్ధంలో పాల్గొనే వివిధ దేశప్రజలకు, ప్రభుత్వాలకు న్యాయమైన ప్రజాతంత్ర శాంతికై తక్షణం రాయబారాలు సాగించవలసిందని" విజ్ఞప్తి చేసింది.

కాని "మిత్రమండలి" అనగా బ్రిటన్, ఫ్రాన్సులు, సోవియట్ ప్రభుత్వ సూచనను అంగీకరించ నిరాకరించాయి. ఈ తిరస్కారాన్ని దృష్టిలో పెట్టుకొని సోవియట్ ప్రభుత్వం సోవియట్ల కోర్కెల ననుసరించి జర్మనీ ఆస్ట్రియాలతో సంప్రదింపులు సాగించడానికి నిశ్చయించింది.

డిసెంబరు 3వ తేదీన బ్రెస్ట్ - లిటోవోస్క్‌లో రాయబారాలు ప్రారంభమయ్యాయి. డిసెంబరు 5 వ తేదీన యుద్ధ విరామ సంధి జరిగింది.

దేశం ఆర్థికంగా విధ్వంసమైవుంది. యుద్ధంయెడల దేశమంతా విసుగుచెంది వుంది. మనసైన్యాలు యుద్ధశ్రేణులను వదలిపోతున్నాయి. యుద్ధశ్రేణులు కూలిపోతున్నాయి. ఇట్టి పరిస్థితులలో సంప్రదింపులు ప్రారంభమయ్యాయి. ఈ సంప్రదింపులలో జర్మన్ సామ్రాజ్యవాదులు వెనుకటి జారు సామ్రాజ్యంలో వున్న పెద్దపెద్ద భూభాగాలను కాజేయడానికి ప్రయత్నించు తున్నారనీ, పోలండ్, యుక్రెయిన్, బాల్టిక్ దేశాలను జర్మనీక్రింద పరాధీన దేశాలుగా ఉంచుకో ప్రయత్నించుచున్నారనీ స్పష్టమయింది.

అలాంటి పరిస్థితులలో యుద్ధాన్ని కొనసాగించడమంటే కొత్తగా ఏర్పడిన సోవియట్ రిపబ్లిక్ ఉనికికే అసలుప్రమాదం

కల్గించడ మవుతుంది. కార్మికవర్గమూ రైతాంగమ్మూ నష్ట దాయకమైన షరతులతో సంధి ఒడంబడికను అంగీకరించవలసి వచ్చింది. ఆరోజుల్లో అత్యంత ప్రమాదకరమైన దోపిడిదొంగ అయిన జర్మన్ సామ్రాజ్యవాదం ముందు తాత్కాలికంగా వెనుదిరగవలసి వచ్చింది. కొంత ఊపిరిపీల్చుకొనే వ్యవధిని సంపాదించవలసి వచ్చింది. దేశాన్ని శత్రుదాడినుండి రక్షించేందుకు శక్తిగల ఒక కొత్త సైన్యాన్ని - రెడ్ ఆర్మీని - సృష్టించడానికి, సోవియట్ అధికారాన్ని బలపర్చడానికి అలాంటి వ్యవధి అవసరం.

విప్లవ ప్రతీఘాతకులందరూ మెన్షివిక్కులు, సోషలిస్టు-రివల్యూషనరీలు మొదలుకొని అతినీచులైన వైట్‌గార్డుల వరకు ఈ సంధిని వ్యతిరేకిస్తూ విపరీత దురావేశంతో దుష్ప్రచారాన్ని కొనసాగించారు. వారి విధానం సుస్పష్టం. వారు సంధి సంప్రదింపులను భగ్నంచేసి జర్మన్‌లు దాడిచేసేటట్లు రెచ్చగొట్ట దలచారు. ఆ విధంగా అప్పటికింకా బలహీనంగా వున్న సోవియట్ ప్రభుత్వానికీ, కార్మికులు రైతులు సంపాదించుకొన్న విజయాలకూ ప్రమాదం కల్గించాలని వారి అభిప్రాయం.

ఈ దుష్టపన్నాగంలో వారికి మిత్రులు ట్రాట్స్కీ, అతని సహచరుడు బుఖారిన్. రాడెక్, ప్యాటకోవ్‌లతో బుఖారిన్ బోల్షివిక్ పార్టీకి వ్యతిరేకమైన ఒక ముఠాకు నాయకత్వం వహించాడు. ఆ ముఠాకు "తీవ్రవాద కమ్యూనిస్టులు" అని ముసుగువేశాడు. ట్రాట్స్కీ, "తీవ్రవాద కమ్యూనిస్టుల" ముఠా రెండూకలసి యుద్ధాన్ని కొనసాగించాలని కోరుతూ పార్టీలో

లెనిన్‌కు వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటం ప్రారంభించారు. వీరు జర్మన్ సామ్రాజ్యవాదుల, దేశంలోని విప్లవ ప్రతీఘాతకుల వలలో పడుతున్నారన్నది స్పష్టం. ఎందుచేతనంటే ఇంకా ఎట్టి సైన్యమూ లేని తరుణ సోవియట్ రిపబ్లిక్‌ను జర్మన్ సామ్రాజ్యవాదపు దెబ్బలకు గురిచేయడానికి వీరు పని చేస్తున్నారు.

ఇది నిజానికి తీవ్రవాద పదజాలంతో చాకచక్యంగా ముసుగు వేసుకున్న గూఢచారుల విధానం అని చెప్పవలసి వస్తుంది

1918 ఫిబ్రవరి 10వ తేదీన బ్రెస్ట్ - లిటోవ్‌స్క్‌లో సంధి సంప్రదింపులు భగ్నమయ్యాయి. లెనినూ, స్టాలినూ పార్టీ సెంట్రల్ కమిటీ తరఫున సంధి పత్రంపై సంతకం పెట్టవలసిందని గట్టిగా చెప్పినప్పటికీ, బ్రెస్ట్ - లిటోవ్‌స్క్‌లో సోవియట్ ప్రతినిధివర్గం అధ్యక్షుడు ట్రాట్‌స్కీ, బోల్షివిక్ పార్టీ ప్రత్యక్షసూచనలను ఉల్లంఘించి ద్రోహంచేశాడు. జర్మనీ సూచించిన షరతులపై సోవియట్ రిపబ్లిక్ సంధిచేసుకోడానికి అంగీకరించదని అతడు ప్రకటించాడు. దీనితోపాటు సోవియట్ రిపబ్లిక్ యుద్ధం చేయదనీ, సైన్యాన్ని డిమోబలైజ్ చేస్తుందనీ (రద్దుపరుస్తుందనీ) కూడా జర్మన్లకు భోగట్టా ఇచ్చాడు.

ఇది ఘోరాతిఘోరమైన చర్య. సోవియట్ దేశ ప్రయోజనాలకు ద్రోహమొనర్చిన ఈ ట్రాట్‌స్కీనుండి జర్మన్ సామ్రాజ్యవాదులకు ఇంతకన్నా కావలసింది వేరే ఏమీలేదు.

జర్మన్ ప్రభుత్వం యుద్ధ విరామసంధిని ఉల్లంఘించి దాడిని కొనసాగించింది. మిగిలిపోయిన మన పాతసైన్యాలు

జర్మన్ సైన్యాల ఈదాడి ముందుకుపోయి చెల్లాచెదురయ్యాయి. జర్మనులు చాలా త్వరితంగా పురోగమించారు. విశాల భూభాగాన్ని ఆక్రమించారు. పెట్రోగ్రాడ్‌ను ప్రమాదాన్ని కల్గించారు. సోవియట్ అధికారాన్ని కూలద్రోసి మనదేశాన్ని వలసరాజ్యంగా మార్చే ఉద్దేశ్యంతో జర్మన్ సామ్రాజ్యవాదం సోవియట్ భూమిపై దాడిచేసింది. పాత జార్ ప్రభుత్వ సైన్య అవశేషాలు జర్మన్ సామ్రాజ్యవాద సాయుధసైన్యాల గుంపులముందు నిలబడలేకపోయాయి. అందుచే వారి దెబ్బలకు ఆగలేక క్రమంగా తిరోగమించాయి.

కాని జర్మన్ సామ్రాజ్యవాదుల ఈ సాయుధదాడి దేశంలోని బలవత్తరమైన విప్లవ వెల్లువకు సూచన అయింది. పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ "సోషలిస్టు మాతృభూమి అపాయంలో వున్నది" అనే నినాదాన్ని ఇచ్చాయి. దీనికి జవాబుగా కార్మికవర్గం ఉత్సాహంతో రెడ్ ఆర్మీ దళాలుగా (రెజిమెంట్సు) ఏర్పడ నారంభించింది. ఈ కొత్త విప్లవప్రజా సైన్యంయొక్క యువకదళాలు ఆపాదమస్తకం సాయుధులైన జర్మన్ దోపిడిగాండ్రను వీరోచితంగా ప్రతిఘటించాయి. నార్వా, ప్స్కావ్‌లవద్ద దండయాత్రచేసిన జర్మన్‌లను కృతనిశ్చయంతో తిరుగగొట్టాయి. పెట్రోగ్రాడ్‌పై జర్మన్‌ల పురోగమనం ఆపివేశాయి. జర్మన్ సామ్రాజ్యవాద సైన్యాలను ఓడించిన రోజు అనగా ఫిబ్రవరి **23**వ తేదీ రెడ్ఆర్మీ జన్మదినోత్సవంగా పరిగణింపబడుతూంది.

తక్షణం సంధిచేసుకోడానికి సిద్ధంగావున్నామని తెలియజేస్తూ జర్మన్ ప్రభుత్వానికి ఒక టెలిగ్రాం పంపాలని లెనిన్

సూచించాడు. ఆ సూచనను పార్టీ సెంట్రల్ కమిటీ 1918 ఫిబ్రవరి 18వ తేదీన ఆమోదించింది. కాని తమకు ఎక్కువ అనుకూలమైన షరతులతో సంధి చేసుకోవాలనే ఉద్దేశ్యంతో జర్మన్‌లు పురోగమించసాగారు. ఫిబ్రవరి 22వ తేదీనాటికిగాని జర్మన్ ప్రభుత్వం సంధిచేసుకోడానికి తమ యిష్టాన్ని తెలియ జేయలేదు. మొదట సూచించిన వాటికంటె ఇప్పటి షరతులు మరీ భారంగా వున్నాయి.

శాంతి ఒడంబడిక చేసుకోవాలనే నిర్ణయం ఆమోదింప బడడానికిముందు ట్రాట్స్కీ, బుఖారిన్, ఇంకా తదితర ట్రాట్స్కీ వాదులతో లెనిన్, స్టాలిన్, స్వెర్డ్‌లావ్‌లు సెంట్రల్ కమిటీలో గట్టిగా పోరాడవలసి వచ్చింది. లెనిన్ ఇలా అన్నాడు : "బుఖారిన్, ట్రాట్స్కీలు వాస్తవంగా జర్మన్ సామ్రాజ్యవాదు లకు సహాయపడ్డారు. జర్మనీలో విప్లవ జననానికీ, అభివృద్ధికీ నిరోధం కల్గించారు". (లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్ - ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947 రెండవ వాల్యూం, 287వ పేజీ)

ఫిబ్రవరి 23వ తేదీన జర్మన్ సైనికాధికారులు పెట్టిన షరతుల నంగీకరించి సంధి ఒడంబడికపై సంతకం చేయ డానికి సెంట్రల్ కమిటీ నిశ్చయించింది. ట్రాట్స్కీ, బుఖారిన్‌ల ద్రోహంవల్ల సోవియట్ రిపబ్లిక్‌కు చాలా నష్టం వాటిల్లింది. పోలెండేగాక లాట్వియా, ఇస్తోనియాలు కూడ జర్మన్ల చేతు ల్లోకి పోయాయి. యుక్రెయిన్, సోవియట్ రిపబ్లిక్ నుండి వేరుచేయబడి జర్మన్ ప్రభుత్వం కింద ఒక సామంత దేశంగా తయారయింది. సోవియట్ రిపబ్లిక్ జర్మనులకు నష్టపరిహారం చెల్లించడానికి అంగీకరించింది.

ఈలోగా "తీవ్రవాద కమ్యూనిస్టులు" లెనిన్‌పై పోరాటాన్ని సాగించుతూనే వున్నారు. రోజురోజుకూ వీరు ద్రోహమనే ఊబిలోకి లోతుగా దిగజారి పోతున్నారు.

మాస్కో ప్రాంతీయ పార్టీ బ్యూరో (Regional Bureau of the Party) లో తాత్కాలికంగా ఈ "తీవ్రవాద కమ్యూనిస్టులు" (బుఖారిన్, ఓసిన్స్కి, యాకోవ్ లెవా, స్టుకోవ్, మాంత్సెవ్) పెత్తనాన్ని సంపాదించారు. పార్టీని విచ్ఛిన్నం చేసే ఉద్దేశ్యంతో ఈ బ్యూరో సెంట్రల్ కమిటీపై ఒక విశ్వాసరాహిత్య తీర్మానాన్ని ప్యాసు చేసింది. "అతి త్వరలోనే పార్టీలో చీలిక తప్పనిసరి అవుతుంది" అని తాము భావించుతున్నట్లు యీ బ్యూరో ప్రకటించింది. ఈ "తీవ్రవాద కమ్యూనిస్టులు" తమ తీర్మానంలో సోవియట్ వ్యతిరేక వైఖరిని తీసుకొనేదాక పోయారు. వారిలా ప్రకటించారు: "అంతర్జాతీయ విప్లవంయొక్క ప్రయోజనాల దృష్ట్యా ఇపుడు కేవలం నామమాత్రంగావున్న సోవియట్ అధికారాన్ని ఒకవేళ అవసరమైతే వదలివేసుకోడానికి అంగీకరించుట యుక్తమని మేము భావించుతున్నాం."

ఈ నిర్ణయం ఎంతో "విచిత్రంగాను వికృతంగాను" ఉందని లెనిన్ అన్నాడు.

ఆ కాలంలో ట్రాట్స్కీ యొక్క, "తీవ్రవాద కమ్యూనిస్టుల" యొక్క పార్టీ వ్యతిరేక ప్రవర్తనకు నిజమైన కారణమేమిటో పార్టీకి ఇంకా తెలియలేదు. బుఖారిన్, అతని నాయకత్వం కిందవున్న "తీవ్రవాద కమ్యూనిస్టుల"ముఠా, ట్రాట్స్కీతోను, "తీవ్రవాద" సోషలిస్టు - రివల్యూషనరీలతోను కలిసి,

ఆ కాలంలో సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా రహస్యమైన కుట్రచేస్తున్నారు. (1938లో ప్రారంభమైన) సోవియట్ వ్యతిరేక "ట్రాట్స్కీ-మైట్ల మితవాదుల (Rights) కూటమి" ని విచారణ సందర్భంలో ఈ విషయం బయటపడింది. బుఖారిన్, ట్రాట్స్కీ వారితోడి కుట్రదారులు బ్రెస్ట్-లిటోవ్‌స్క్ సంధిని భగ్నంచేయడానికీ, వి. ఐ. లెనిన్, జె. వి. స్టాలిన్, వై. యమ్. స్వెర్డ్‌లావ్‌లను అరెస్టుచేసి హత్యచేయడానికీ, బుఖారిన్ వాదులు, ట్రాట్స్కీ-వాదులు తీవ్రసోషలిస్టు-రివల్యూషనరీలతో కూడిన ఒక నూతన ప్రభుత్వాన్ని ఏర్పరచడానికీ నిశ్చయించుకున్నారని ఇప్పుడు తెలిసింది.

ఈ రహస్య విప్లవ ప్రతీఘాత కుట్రను ఒకప్రక్క చేస్తూ తీవ్రవాద కమ్యూనిస్టుల ముఠా, ట్రాట్స్కీ మద్దత్తుతో బోల్షివిక్‌పార్టీపై బహిరంగంగా దాడిచేసింది. పార్టీని చీల్చడానికి, అనుచరవర్గాన్ని విడదీయడానికి ప్రయత్నించింది. కాని ఈ ప్రమాద పరిస్థితులలో లెనిన్, స్టాలిన్, స్వెర్డ్‌లావ్‌ల పక్షాన పార్టీ నిలచింది. సంధి ఒడంబడిక సమస్యపైన, ఇతర సమస్య లన్నింటిపైన సెంట్రల్ కమిటీని బలపరిచింది.

"తీవ్రవాద కమ్యూనిస్టు" ముఠా వేరుచేయబడి ఓడింపబడింది.

సంధి ఒడంబడిక సమస్యపై పార్టీ తన అంతిమ నిర్ణయాన్ని తెలియజేయడానికి, ఏడవ కాంగ్రెస్‌ను సమావేశపరచింది.

**1918** మార్చి **6** వ తేదీన కాంగ్రెస్ ప్రారంభమయింది. మనపార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత జరిగిన కాంగ్రెస్

ఇదే మొదటిది. దీనికి ఓటింగు హక్కు కలిగిన ప్రతినిధులు 46 మంది వచ్చారు. వోటింగుహక్కు లేకుండా చర్చించే హక్కుగల ప్రతినిధులు 58 మంది వచ్చారు. వీరంతా లక్షా నలభైనైదు వేలమంది పార్టీ సభ్యులకు ప్రాతినిధ్యం వహించారు. వాస్తవంగా ఆ సమయంలో పార్టీ సభ్యత్వం 2 లక్షల 70 వేలకు తక్కువలేదు. కాంగ్రెస్ చాలా అత్యవసరంగా సమావేశ మవడంవల్ల ఈ తేడా వచ్చింది. అనేక సంస్థలు సకాలంలో తమ ప్రతినిధులను పంపలేకపోయాయి. అప్పుడు జర్మన్‌లు ఆక్రమించివున్న ప్రాంతాలలోని సంస్థలుకూడా తమ ప్రతినిధులను అసలు పంపించనే లేకపోయాయి.

ఈ కాంగ్రెస్‌లో బ్రెస్ట్ - లిటోవ్‌స్క్ సంధిపై రిపోర్టు నిస్తూ లెనిన్ ఇలా అన్నాడు: "పార్టీలోనే తీవ్రవాదులంటూ ఒక ప్రతిపక్షం ఏర్పడటంవల్ల పార్టీలో తీవ్రమైన సంక్షోభం నేడు ఏర్పడింది. ఇది రష్యన్ విప్లవం అనుభవించుతున్న మహా ప్రమాదకరమైన సంక్షోభాలలో ఒకటి." (లెనిన్, సెలెక్టెడ్ వర్క్స్, ఇంగ్లీష్ ఎడిషన్, మాస్కో-1947, రెండవవాల్యూం, 299 వ పేజీ.)

బ్రెస్ట్ - లిటోవ్‌స్క్ సంధిపై లెనిన్ ప్రతిపాదించిన తీర్మానం ఆమోదించబడింది. దాని కనుకూలంగా 30 వోట్లు, ప్రతికూలంగా 12 వోట్లు వచ్చాయి. నల్గురు వోటు చేయ లేదు.

ఈ తీర్మానం ఆమోదించబడిన మరుసటిరోజున "బాధాకరమైన శాంతి ఒడంబడిక" అనే పేరుతో తాను వ్రాసిన వ్యాసంలో లెనిన్ ఇలా తెలియజేశాడు:

"సంధి షరతులు భరింపరానంత కఠినంగా వున్నాయి. అయినప్పటికీ చరిత్రయే తగు గుణపాఠం నేర్పుతుంది...మనం సంఘటితమవుదాం. సంఘటితమవుదాం. ఇంకా సంఘటిత మవుదాం. పరీక్షలకు గురిఅయినా భవిష్యత్ మనదే." (లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్, 12వ వాల్యూం, 288 వ పేజీ).

కాంగ్రెస్ తన తీర్మానంలో ఇలా హెచ్చరించింది: సోవియట్ రిపబ్లిక్‌పై సామ్రాజ్యవాద ప్రభుత్వాలు తప్పనిసరిగా ఇంకా సైనికదాడులు జరుపుతాయి. అందుచే కార్మికుల రైతుల క్రమశిక్షణ, ఆత్మశిక్షణ బలపరచడానికి తీవ్రమైన నిశ్చిత చర్యలను తీసుకొనుట పార్టీయొక్క ప్రధాన కర్తవ్యమని కాంగ్రెస్ భావించింది. సోషలిస్టు దేశాన్ని సంరక్షించడానికి స్వార్థత్యాగానికి సిద్ధంగా వుండవలసిందని ప్రజా సామాన్యాన్ని హెచ్చరించింది. రెడ్ ఆర్మీని సంఘటిత పరచాలని అందరికీ సైనిక తర్ఫీదునివ్వాలనీ తీర్మానించింది.

బ్రెస్ట్ - లిటోవ్స్క్ సంధిని గురించి లెనిన్ అవలంబించిన విధానాన్ని బలపరుస్తూ కాంగ్రెస్, ట్రాట్స్కీ బుఖారిన్‌ల వైఖరిని ఖండించింది. ఓడిపోయిన "తీవ్రవాద కమ్యూనిస్టులు" కాంగ్రెస్‌లో చీలికలు తెచ్చే చర్యలను కొనసాగించ ప్రయత్నించారు. కాంగ్రెస్ వారి ప్రయత్నాలను కఠినంగా విమర్శించింది.

బ్రెస్ట్ - లిటోవ్స్క్ సంధి, సోవియట్ అధికారాన్ని స్థిరపరచుకొని దేశ ఆర్థిక జీవితాన్ని సంఘటిత పరచుకోడానికి పార్టీకి కొంత విశ్రాంతి నిచ్చింది.

ఈ సంధివల్ల సామ్రాజ్యవాద శిబిరంలోనే వున్న వైరుధ్యాలను అవకాశంగా తీసుకొని (మిత్రరాజ్యాలతో ఆస్ట్రియా జర్మనీల యుద్ధం ఇంకా కొనసాగుతూనే వుంది.) శత్రుశక్తులను శిధిలపరచడానికి, సోవియట్ ఆర్థిక విధానాన్ని సంఘటితం చేయడానికి, రెడ్ ఆర్మీని నిర్మించడానికి సాధ్యమయింది.

రైతాంగంయొక్క అండను శ్రామికవర్గం నిలబెట్టుకోడానికి, అంతర్యుద్ధంలో వైట్‌గార్డ్ సేనానులను ఓడించడానికి అవసరమైన బలాన్ని ప్రోగుచేయుట ఈ సంధివల్ల సాధ్యమయింది.

పురోగమించడానికి పరిస్థితులు అనుకూలంగా వున్నప్పుడు నిర్భయంగా నిశ్చింతగా ఎలా పురోగమించాలో బోల్షివిక్ పార్టీకి అక్టోబరు విప్లవకాలంలో లెనిన్ బోధించాడు. శత్రుశక్తులు మన శక్తులకంటె స్పష్టంగా మిన్నగా వున్నప్పుడు కొత్తదాడికి తన యావచ్ఛక్తినీ వినియోగించి సన్నాహమయ్యేందుకు క్రమపద్ధతితో ఎలా తిరోగమించాలో బ్రెస్ట్-లిటోవ్‌స్క్ సంధికాలంలో లెనిన్ పార్టీకి నేర్పాడు.

లెనిన్ మార్గమే సరియైనదని చరిత్ర పూర్తిగా రుజువు చేసింది.

ఏడవ కాంగ్రెస్‌లో పార్టీ పేరును, పార్టీ కార్యక్రమాన్ని మార్చడానికి నిర్ణయించబడింది. పార్టీ పేరు రష్యన్ కమ్యూనిస్టు (బోల్షివిక్) పార్టీ - ఆర్. సి. పి. (బి) అని మార్చారు. ఈ పేరు ఖచ్చితంగా మన పార్టీ ఆదర్శాన్ని అనగా కమ్యూనిజాన్ని సాధించడాన్ని వ్యక్తపరుస్తుంది గనుక లెనిన్ మన పార్టీని కమ్యూనిస్టుపార్టీ అనాలని సూచించాడు.

పార్టీ కొత్త కార్యక్రమాన్ని తయారుచేయుటకు ఒక ప్రత్యేక ఉపసంఘం ఏర్పరచబడింది. అందులో లెనిన్-స్టాలిన్‌లు వున్నారు. ఈకార్యక్రమానికి లెనిన్ తయారుచేసిన కార్యక్రమ ముసాయిదా (డ్రాఫ్ట్‌ప్రోగ్రామ్) పునాదిగా అంగీకరింపబడింది.

ఆవిధంగా పార్టీ ఏడవ కాంగ్రెస్ అత్యంతచారిత్రక ప్రాముఖ్యత కలిగిన కర్తవ్యాన్ని నిర్వర్తించింది: పార్టీలోపలనే దాగివున్న శత్రువులను అనగా "తీవ్రవాద కమ్యూనిస్టుల"ను, ట్రాట్స్కీ వాదులను కాంగ్రెస్ ఓడించింది; సామ్రాజ్యవాద యుద్ధంనుండి దేశాన్ని తప్పించుటలో విజయం పొందింది; శాంతిని, వ్యవధినిసంపాదించగల్గింది; రెడ్ ఆర్మీని సంఘటితపరచ డానికి పార్టీకి కొంత వ్యవధిని సంపాదించగల్గింది; జాతీయ ఆర్థిక విధానంలో సోషలిస్టు పద్ధతిని ప్రవేశపెట్టే కర్తవ్యాన్ని పార్టీముందు పెట్టింది.

## 8

సోషలిస్టు నిర్మాణంలో ప్రాథమిక చర్యలను లెనిన్ పథకం - బీదరైతుల కమిటీలస్థాపన - కులక్‌లను అణచడం - "తీవ్రవాద" సోషలిస్టు - రివల్యూషనరీల తిరుగుబాటు, దానిని అణచుట - సోవియట్ల 5 వ కాంగ్రెసు - రష్యన్ సోవియట్ ఫెడరేటివ్ సోషలిస్టు రిపబ్లిక్ (R. S. F. S. R.) యొక్క రాజ్యాంగ చట్టం

సంధి చేసుకొనుటద్వారా సోవియట్ ప్రభుత్వం ఆ విధంగా కొంత వ్యవధిని సంపాదించి సోషలిస్టు నిర్మాణ కార్య

క్రమానికి పూనుకుంది. 1917 నవంబరునుండి 1918 ఫిబ్రవరి వరకు గల దశను "పెట్టుబడిదారీ విధానంపై రెడ్‌గార్డ్‌లు సాగించిన దాడి" అని లెనిన్ పిలిచాడు. 1918 మొదటి ఆరు నెలలలో పెట్టుబడిదారీ ఆర్థిక బలాన్ని విచ్ఛినం చేయటంలో సోవియట్ ప్రభుత్వం జయప్రదమైంది. జాతీయ ఆర్థిక సంపదకు కీలకమైనవాటిని (మిల్లులు, ఫ్యాక్టరీలు, బ్యాంకులు, రైల్వేలు, విదేశవర్తకం, వర్తక నౌకాదళం) తనచేతులలో కేంద్రీకరించింది. ప్రభుత్వాధికారంలోని బూర్జువా యంత్రాంగాన్ని నాశనం చేసింది. సోవియట్ అధికారాన్ని కూలద్రోయుటకు చేసిన విప్లవ ప్రతీఘాత ప్రథమ ప్రయత్నాలను విజయవంతంగా అణచివేయ గల్గింది.

కాని ఇంతమాత్రానే సరిపోదు. అభివృద్ధి కావాలంటే, పాత వ్యవస్థను నాశనంచేయుటే చాలదు; దాని స్థానే కొత్త వ్యవస్థను నిర్మించుట ప్రారంభించాలి. తదనుగుణ్యంగానే 1918 వసంతకాలంలో "దోపిడి చేసుకొనేవారిని దోచుకొనే" దశనుండి, సోషలిస్టు నిర్మాణ నూతనదశకు అనగా సాధించిన విజయాలను నిర్మాణాత్మకంగా సుస్థిరపరచుకోడానికి, సోవియట్ జాతీయ ఆర్థిక విధానం నిర్మించడానికి, పరివర్తన దశ ప్రారంభ మయింది. సోషలిస్టు ఆర్థిక పద్ధతికి పునాదిని వేయడానికి ఇప్పుడున్న వ్యవధిని పూర్తిగా ఉపయోగించుకోవాలి అని లెనిన్ అభిప్రాయ పడ్డాడు.

ఉత్పత్తిని కొత్తమార్గంలో సంఘటితపరచి నిర్వహించుట బోల్షివిక్కులు నేర్చుకోవాలి. లెనిన్ ఇలా అన్నాడు: "బోల్షివిక్ పార్టీ రష్యాను ఒప్పించగల్గింది. భాగ్య

వంతులనుండి బీదలను దేశాన్ని అప్పజెప్పింది. ఇపుడు రష్యాను పరిపాలించుట అది నేర్చుకోవాలి".

ప్రస్తుత దశలో దేశం ఉత్పత్తిజేసిన ప్రతివస్తువుకూ లెక్కజూపడం, ఉత్పత్తి వస్తువులను పంపకం చేయడంలో కంట్రోల్ విధించుట తక్షణ కర్తవ్యమని లెనిన్ అభిప్రాయ పడ్డాడు. దేశ ఆర్థికవిధానంలో పెటీ బూర్జువావ్యక్తులు ప్రాబల్యం వహించారు. పట్టణాలలోను, పల్లెలలోను వున్న లక్షలాది చిన్న స్వంత ఆస్తిపరులు పెట్టుబడిదారీ విధానం పెంపొందటానికి మూలాధారం. ఈ చిన్న స్వంత ఆస్తిపరులు కార్మిక క్రమశిక్షణనుగాని, పౌరక్రమశిక్షణనుగాని గుర్తించరు. ప్రభుత్వం లెక్కలుచూడడం, కంట్రోల్ చేయడం అనే పద్ధతికి వారు లొంగరు. ఈ కష్ట సందిగ్ధసమయంలో ముఖ్యంగా ప్రమాదకరమైనవి ఈ క్రింది విషయాలు: దళారీవ్యాపారం (స్పెక్యులేషన్) లోను, అధిక లాభాలు గుంజటంలోను పెటీ బూర్జువా పూర్తిగా నిమగ్నమవడం. చిన్న స్వంతఆస్తిదారులు, వర్తకులు ప్రజల కొరతను అవకాశంగా తీసుకొని లాభాలు పొందటం.

పనిలో సోమరితనానికి వ్యతిరేకంగా, పరిశ్రమలలో కార్మిక క్రమశిక్షణా రాహిత్యానికి వ్యతిరేకంగాను తీవ్రమైన యుద్ధాన్ని పార్టీ ప్రారంభించింది. ప్రజలు కొత్తపనిఅల వాట్లను నేర్చుకోడం నెమ్మదిగా జరిగింది. తత్ఫలితంగా ఆ కాలంలో కార్మిక క్రమశిక్షణకై పోరాటం ప్రధాన కర్తవ్యం అయింది.

పరిశ్రమలలో సోషలిస్టు పోటీని పెంపొందించుట; పీస్ రేట్ పద్ధతిని (అంటే చేసిన పని మొత్తానికి తగిన వేతనం) ప్రవేశపెట్టుట, ఒకేరకపు జీతం వుండాలనే పద్ధతిని ఎదుర్కొనుట, ప్రభుత్వంనుండి ఎంత వీలైతే అంత దోపిడిచేయాలనే సోమరిపోతులను, అధికలాభాపేక్షాపరులను నచ్చజెప్పి బోధించే పద్ధతులే గాకుండా వారిపై నిర్బంధ చర్యలనుకూడా ప్రవేశపెట్టుట అవసరమని లెనిన్ పేర్కొన్నాడు. ఈ కొత్త క్రమశిక్షణ – కార్మిక క్రమశిక్షణ, సోవియట్ క్రమశిక్షణ – లక్షలాది కష్టజీవులు తమ దైనందిన ప్రత్యక్ష కార్యకలాపాల క్రమంలో అలవరచుకొనే క్రమశిక్షణయనీ, "ఈ కర్తవ్యం పూర్తికావడానికి ఒక యావత్ చారిత్రక దశ అవసరమనీ" లెనిన్ అన్నాడు. (లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్, 15 వ వాల్యూం, 41 వ పేజీ)

సోషలిస్టు నిర్మాణానికి సంబంధించిన ఈ సమస్యలన్నింటినీ, నూతన సోషలిస్టు ఉత్పత్తి సంబంధాలకు చెందిన ఈ సమస్యలన్నింటినీ, లెనిన్, "సోవియట్ ప్రభుత్వ తక్షణ కర్తవ్యాలు" అనే తన ప్రఖ్యాత గ్రంథంలో చర్చించాడు.

ఈ సమస్యలపై కూడా "తీవ్రవాద కమ్యూనిస్టులు" సోషలిస్టు-రివల్యూషనరీలతోను, మెన్షివిక్కులతోను కలిసి పని చేస్తూ లెనిన్‌తో పోరాడారు. బుఖారిన్, ఓసిన్స్కి, ఇంకా తదితరులు క్రమశిక్షణను ప్రవేశపెట్టడాన్ని వ్యతిరేకించారు.

పరిశ్రమలలో ఒకే వ్యక్తి నిర్వహణను వాటిలో బూర్జువా ప్రవీణులను నియమించడాన్ని, సామర్థ్యంతో కూడిన వ్యవహార పద్ధతులను (Business methods) ప్రవేశపెట్ట

డాన్ని ఎదిరించారు. ఈ విధానం తిరిగి బూర్జువా పరిస్థితులను సృష్టించుతుందని వారు లెనిన్‌ను నిందించారు. దీనితోపాటు ఈ "తీవ్రవాద కమ్యూనిస్టులు" రష్యాలో సోషలిస్టు విజయమూ, సోషలిస్టు నిర్మాణమూ అసాధ్యమనే ట్రాట్స్కీ-వాద దృక్పథాన్ని ప్రచారం చేశారు.

కులక్‌లు, సోమరిపోతులు, అధికలాభాపేక్షాపరులు క్రమశిక్షణను వ్యతిరేకులు. ఆర్థిక జీవితంపై ప్రభుత్వ అజమాయిషీకి వ్యతిరేకులు. ప్రభుత్వమే లెక్క-చూడటమూ, కంట్రోలు చేయడమూ అనేది వీరికి గిట్టదు. "తీవ్రవాద కమ్యూనిస్టుల" "తీవ్ర" పదజాలమంతా పై వారిని సమర్థించడానికి ఒక బురఖాగా ఉపయోగపడింది. నూతన సోవియట్ పరిశ్రమల నిర్మాణ సూత్రాలను పరిష్కరించిన తర్వాత పార్టీ, గ్రామ సమస్యలను పరిష్కరించడానికి పూనుకొన్నది. ఆ సమయంలో గ్రామాలలో బీదరైతులకు, కులక్‌లకు మధ్య పోరాటం అతి తీవ్రంగా వుంది. కులక్‌లు బలపడి భూస్వాములనుండి రైతులులాక్కొన్న భూములను తాము తిరిగి వశపరచుకొనసాగారు. బీదరైతులకు సహాయం అవసరమయింది. కులక్‌లు శ్రామికవర్గ ప్రభుత్వంపై తిరగబడి నిర్ణీతధరలకు ధాన్యాన్ని అమ్మ నిరాకరించారు. సోవియట్ ప్రభుత్వం ఆకలికిగురియై సోషలిస్టు పద్ధతులను అది పరిత్యజించేటట్లు చేయాలని వారు కోరారు. విప్లవ ప్రతీఘాత కులక్‌లను నాశనంచేసే కర్తవ్యాన్ని పార్టీ తీసుకొన్నది. బీద రైతులను సంఘటితపరచటానికీ, తమ మిగులు ధాన్యాన్ని దాచివేస్తున్న కులక్‌లపై సాగించే పోరాటంలో విజయాన్ని తప్పక లభించేటట్లు చేయడానికీ, పారిశ్రామిక కార్మికదళాలను గ్రామసీమలకు పంపింది.

లెనిన్ ఇలా వ్రాశాడు: "కామ్రేడ్స్! కార్మికులారా! విప్లవం క్లిష్టపరిస్థితిలో వున్నదని గుర్తుపెట్టుకోండి. విప్లవాన్ని మీరొక్కరే రక్షించగలరనీ, ఇంకెవరివల్లా కాదనీ గుర్తుపెట్టుకోండి. ఈనాడు రాజకీయంగా అభివృద్ధిని పొందినట్టియూ, సోషలిస్టు ఆశయానికి విశ్వాసపాత్రులయిన గట్టి కార్మికులు వేలకొలది అవసరం. మీరు లంచగొండితనానికి లోబడకూడదు. దొంగతనాలకు ఆకర్షింపబడకూడదు. కులక్‌ల, అధిక లాభాపేక్షాపరుల, దోపిడిగాండ్ర, రాజకీయ అవినీతిపరుల, విచ్ఛిన్నకారులకు వ్యతిరేకంగా ఒక ఉక్కుగోడను సృష్టించగలిగివుండాలి." (లెనిన్, కలెక్టెడ్‌వర్క్స్, రష్యన్ ఎడిషన్ 23 వ వాల్యూం, 25వ పేజీ)

"తిండికోసం జరిపే పోరాటం సోషలిజంకోసం చేసే పోరాటమే" అని లెనిన్ అన్నాడు. ఈ నినాదంక్రిందనే గ్రామసీమలకు కార్మికదళాలను సంఘటితపరచి పంపారు. ఆహారవిషయంలో నియంతృత్వాన్ని స్థాపించుతూ అనేక శాసనాలు కావింపబడ్డాయి. ఆహారశాఖ ప్రజామంత్రులకు (కమిసార్లకు) అత్యవసర అధికారాలు ఇయ్యబడ్డాయి. నిర్ణీత ధరలకు ధాన్యాన్నికొనే అధికారం వీరికి, ఈ శాఖ సంస్థలకు ఈయబడింది.

1918 జూన్ 11వ తేదీన బీదరైతుల కమిటీలు ఏర్పరచుకోడానికి అవకాశం ఇస్తూ ఒక చట్టం ప్యాసయింది. కులక్‌లపై పోరాటంలో లాక్కోబడిన భూమిని తిరిగి పంచడంలో, వ్యవసాయపరికరాల పంపకంలో, కులక్‌నుండి మిగులుధాన్యాన్ని వసూలు చేయటంలో, కార్మికవర్గ కేంద్రాలను రెడ్ఆర్మీకి

ఆహారపదార్థాలను సప్లైచేయుటలో, ఈ కమిటీలు ప్రముఖ మైన పాత్ర వహించాయి. కులక్‌లకు చెందిన 5కోట్ల హెక్టార్ల భూమి బీదరైతులకు, మధ్యతరగతి రైతులకు పంచ బడింది. కులక్‌ల ఉత్పత్తి సాధనాలలో ఎక్కువభాగం స్వాధీన పరచుకొని బీదరైతులకు ఈయబడింది.

బీదరైతుల కమిటీలను ఏర్పరచటం, గ్రామసీమలో సోషలిస్టు విప్లవాభివృద్ధిలో మరొక దశ అన్నమాట. గ్రామా లలో ఈ కమిటీలు శ్రామికవర్గ నియంతృత్వం యొక్క బలీయకేంద్రాలు. ఎక్కువగా ఈ కమిటీల ద్వారానే రైతులను రెడ్ ఆర్మీలోకి సైనికులగా చేర్చుకోడం సంభవించింది.

గ్రామాలలో శ్రామికవర్గ ప్రచారోద్యమమూ, బీద రైతుల కమిటీల నిర్మాణమూ గ్రామసీమలో సోవియట్ అధికారాన్ని స్థిరపరచింది. సోవియట్ అధికారపక్షానికి మధ్య తరగతి రైతులను ఆకర్షించుటలో అత్యద్భుత రాజకీయ ప్రాముఖ్యతను ఈ కమిటీలు వహించాయి.

1918 సంవత్సరాంతంలో వాటిపని పూర్తికాగానే బీదరైతు కమిటీలు గ్రామ సోవియట్లలో కలసిపోయాయి. ఆవిధంగా వాటి ఉనికి అంతమయింది.

1918 జూలై 4వ తేదీన సోవియట్ల 5 వ కాంగ్రెస్ ప్రారంభమైంది. దీనిలో తీవ్రవాద సోషలిస్టు - రివల్యూషనరీలు కులక్‌లను సమర్థించుతూ లెనిన్‌పై తీవ్రమైన దాడి సాగించారు. కులక్‌లపై పోరాటాన్ని ఆపివేయాలనీ, గ్రామాల లోకి కార్మికుల ఆహారదళాలను పంపుట మానివేయాలని వారు కోరారు. కాంగ్రెస్‌లో అధిక సంఖ్యాకులు తమవిధా

నానికి తీవ్రంగా వ్యతిరేకులని. "తీవ్రవాద" సోషలిస్టు- రివల్యూ షనరీలు తెలుసుకోగానే మాస్కోలో తిరుగుబాటు లేవదీశారు. "త్రియోక్సీయాటి టెలిస్కీ" (Tryokhsiyatitelskyalley) వీధిని పట్టుకున్నారు అక్కడనుండి క్రెమ్లిన్‌పై తుపాకిగుండ్లు కురిపించసాగారు. ఈ తెలివితక్కువ దుందుడుకు తిరుగుబాటును బోల్షివిక్కులు కొన్ని గంటలలోనే అణచివేశారు: దేశంలో ఇతర భాగాలలో కూడా "తీవ్రవాద" సోషలిస్టు - రివల్యూష నరీలు తిరుగుబాటు చేయడానికి ప్రయత్నాలు చేశారు.

కాని ప్రతిచోటా ఈ తిరుగుబాట్లు త్వరగా అణచి వేయబడ్డాయి.

సోవియట్ వ్యతిరేక "ట్రాట్స్కీ-వాద, మితవాదముఠా" (Block of Rights and Trotskyites) విచారణలో ఈ క్రింది విషయం బయటపడింది. "తీవ్రవాద" సోషలిస్టు - రివ ల్యూషనరీల తిరుగుబాటు బుఖారిన్ ట్రాట్స్కీలను తెలుసునని, వారి అనుమతితోనే అది జరిగిందని, అది సోవియట్ ప్రభు త్వానికి వ్యతిరేకంగా బుఖారిన్‌వాదులు, ట్రాట్స్కీ-వాదులు, "తీవ్రవాద" సోషలిస్టు - రివల్యూషనరీలు చేసిన విప్లవ ప్రతీ ఘాతక కుట్రలో ఒక భాగమేనని బయటపడింది.

ఈ క్లిష్ట సమయంలోనే "తీవ్రవాద" సోషలిస్టు - రివ ల్యూషనరీ అయిన బ్లుమ్‌కిన్ జర్మన్ రాయబార కార్యాలయం లోకి వెళ్ళి, మాస్కోలోని జర్మన్ రాయబారి:మిర్‌బాహ్‌ను హత్యచేశాడు. ఈ బ్లుమ్‌కిన్ తర్వాత ట్రాట్స్కీ ఏజంటుగా తయారయ్యాడు. జర్మనీతో యుద్ధాన్ని రెచ్చగొట్టాలనే ఉద్దే శ్యంతో ఈ హత్యచేశాడు. కాని సోవియట్ ప్రభుత్వం

యుద్ధాన్ని తప్పించగల్గింది. విప్లవ ప్రతిఘాతకులు రెచ్చగొట్టే పన్నాగాలను భగ్నం చేయగల్గింది.

సోవియట్ల 5వ కాంగ్రెస్, మొదటిసోవియట్ రాజ్యాంగ చట్టాన్ని అనగా రష్యన్ సోవియట్ ఫెడరేటివ్ సోషలిస్టు రిపబ్లిక్ రాజ్యాంగ చట్టాన్ని ఆమోదించింది.

## క్లుప్తసారాంశం

1917 ఫిబ్రవరి నుండి అక్టోబరు వరకు 8 నెలలలోపల బోల్షివిక్‌పార్టీ చాలకష్టమైన కర్తవ్యాలను నెరవేర్చింది. కార్మికవర్గంలోను, సోవియట్లలోను అధికసంఖ్యాకులను తమ పక్షానికి తిప్పుకోగల్గింది. సోషలిస్టు విప్లవానికి లక్షలాది రైతుల అండను సంపాదించింది. పెటీబూర్జువా పార్టీల (సోషలిస్టు - రివల్యూషనరీలు, మెన్షివిక్కులు, అరాచకవాదులు) విధానం కష్టపడే ప్రజల ప్రయోజనాలకు విరుద్ధమని అను గడుగునా నిరూపించింది. ప్రజాసామాన్యాన్ని వీరి పలుకుబడి నుండి బోల్షివిక్‌పార్టీ తప్పించివేసింది. యుద్ధరంగంలోను, వెలుపలను బోల్షివిక్‌పార్టీ తీవ్రమైన రాజకీయ కార్యకలాపాలను కొనసాగించి, అక్టోబరు సోషలిస్టు విప్లవానికి ప్రజాసామాన్యాన్ని తయారుచేసింది.

ఈకాలంలో పార్టీచరిత్రలో నిశ్చిత ప్రాముఖ్యఘటన లేమంటే ప్రవాసంనుండి లెనిన్ తిరిగిరావడం, లెనిన్ యొక్క ఏప్రిల్ ప్రతిపాదనా, ఏప్రిల్ పార్టీసమావేశమూ, ఆరవపార్టీ కాంగ్రెసూ, పార్టీనిర్ణయాలు కార్మికవర్గ బలానికి మూలాలు. అవి విజయం తప్పదనే ఆత్మవిశ్వాసాన్ని వారికి కలిగించి

ఉత్సాహపరిచాయి. విప్లవ ముఖ్యసమస్యలకు పరిష్కారాలు ఈ తీర్మానాలలోనే వున్నవని కార్మికులు తెలుసుకొన్నారు. బూర్జువా ప్రజాతంత్ర విప్లవాన్ని సోషలిస్టు విప్లవంగా మార్చడానికి సాగించే పోరాటంలో పార్టీ ప్రయత్నాలు ఏప్రిల్ సమావేశ (కాన్ఫరెన్సు) నాయకత్వాన జరిగాయి. పెట్టుబడిదారీ వర్గానికి, దాని తాత్కాలిక ప్రభుత్వానికి వ్యతిరేకంగా లేచిన సాయుధ తిరుగుబాటుకు, 'ఆరవ కాంగ్రెస్' పార్టీని సన్నద్ధం చేసింది.

రాజీబేరగాళ్ళయిన సోషలిస్టు - రివల్యూషనరీ పార్టీ, మెన్షివిక్కు-పార్టీ, అరాచకవాదుల ముఠా, కమ్యూనిస్టేతర పార్టీలు తమ ఆశ్వాసాన్ని ముగించుకొన్నాయి (బండారాన్ని బయటపెట్టాయి). అక్టోబరు విప్లవానికి ముందే అవన్నీ కూడా బూర్జువాపార్టీలయాయి. పెట్టుబడిదారీ విధానాన్ని కూలదోసి సోవియట్ల అధికారాన్ని స్థాపించడానికి ప్రజాసామాన్యం సాగించిన పోరాటాన్ని నడిపినపార్టీ, బోల్షివిక్ పార్టీ ఒక్కటే.

ఇదే సమయంలో పార్టీలోనే వున్న లొంగుబాటుదారుల ప్రయత్నాలను బోల్షివిక్కులు ఓడించారు. లొంగుబాటు దారులైన జినోవీవ్, కామెనివ్, రైకోవ్, బుఖారిన్, ట్రాట్స్కీ, ప్యాటకోవ్ మొదలగువారు సోషలిస్టు విప్లవ పంథానుండి పార్టీని పెడత్రోవను మరలించాలన్న ప్రయత్నాలను బోల్షివిక్కులు ఓడించారు.

బోల్షివిక్కు-పార్టీ నాయకత్వాన కార్మికవర్గం బీదరైతులతో సమ్మేళనమై, సైనికుల నావికుల అండతో పెట్టుబడిదారీ వర్గ అధికారాన్ని కూలదోసింది. సోవియట్ల అధికారాన్ని నెల

కొల్పింది. కొత్తరకపు ప్రభుత్వాన్ని అనగా సోషలిస్టు సోవియట్ ప్రభుత్వాన్ని నెలకొల్పింది. భూస్వాములకు భూమిపై గల యాజమాన్యాన్ని రద్దుచేసింది. రైతులు ఉపయోగించు కోడానికి వారి కాభూమినిచ్చింది. దేశంలోని భూమినంతా జాతి పరంచేసింది. పెట్టుబడిదారుల ఆస్తిని స్వాధీనపరచుకుంది. రష్యాను యుద్ధంనుండి తప్పించి శాంతిని సాధించింది. అంటే అత్యంతావసరమైన వ్యవధిని సంపాదించింది. ఆ విధంగా సోషలిస్టు నిర్మాణాభివృద్ధికి అవసరమైన పరిస్థితులను కల్పించింది.

అక్టోబరు సోషలిస్టు విప్లవం పెట్టుబడిదారీ విధానాన్ని నాశనంచేసింది. పెట్టుబడిదారులకు ఉత్పత్తిసాధనాలులేకుండా చేసింది. మిల్లులను, ఫ్యాక్టరీలను, భూమిని, రైల్వేలను, బ్యాంకులను యావత్ ప్రజల ఆస్తిగా, సమిష్టి ఆస్తిగా (పబ్లిక్ ప్రోపర్టీ) మార్చివేసింది.

అది శ్రామికవర్గ నియంతృత్వాన్ని స్థాపించింది. విశాలమైన ఈ దేశ ప్రభుత్వాన్ని కార్మిక వర్గానికి అప్పజెప్పింది. ఆ విధంగా కార్మికవర్గాన్ని పరిపాలక వర్గంగా మార్చింది.

అక్టోబరు సోషలిస్టు విప్లవం మానవజాతి చరిత్రలో ఒక నూతన శకాన్ని- శ్రామికవర్గ విప్లవాలశకాన్ని ప్రారంభించింది.

# ఎనిమిదవ అధ్యాయం

## విదేశ సైనిక దురాక్రమణ కాలంలో, అంతర్యుద్ధ కాలంలో బోల్షివిక్ పార్టీ

## [ 1918 — 1920 ]

## విదేశ సైనిక దురాక్రమణ ప్రారంభం -
## అంతర్యుద్ధ ప్రథమ దశ

పశ్చిమదేశాలలో యుద్ధం ఇంకా ముమ్మరంగా సాగుతున్న రోజుల్లోనే బ్రెస్ట్ - లిటోవ్స్క్ సంధి జరగటం అనేక విప్లవ ఆర్థిక చర్యలను సోవియట్ ప్రభుత్వం అవలంబించిన ఫలితంగా సోవియట్ అధికారం స్థిరపడటం - ఇవన్నీ పశ్చిమ సామ్రాజ్యవాదులలో ముఖ్యంగా మిత్రమండలి దేశాలలో అత్యంత భీతిని కల్గించాయి.

జర్మనీ రష్యాల మధ్య సంధి ఒడంబడిక జరిగితే యుద్ధంలో జర్మనీ పరిస్థితి బాగుపడుతుందనీ, తమ సైన్యాల పరిస్థితి బలహీనపడుతుందనీ మిత్రమండలి సామ్రాజ్యవాదులు భయపడ్డారు. రష్యాజర్మనీల మధ్య సంధి అన్నిదేశాలలోను అన్నిరంగాలలోను శాంతికాంక్షను ప్రోత్సాహపరచి,ఆవిధంగా యుద్ధనిర్వహణకు అడ్డుతగిలి, సామ్రాజ్యవాద ఆశయాలకు నష్టం కలిగించుతుందని వారు భయపడ్డారు. ఇంతేగాక రష్యాలాంటి విశాలదేశ భూభాగంలో సోవియట్ల అధికారం నెలకొల్పబడటం, పెట్టుబడిదారీవర్గ అధికారాన్ని కూలద్రోసిన తర్వాత అది తన దేశంలో సాధించిన విజయాలూ, పశ్చిమ దేశాల

లోని కార్మికులను, సైనికులకు ఆదర్శప్రాయమై అంటు వ్యాధిలా సోకుతుందని వారుభయపడ్డారు. దీర్ఘ కాలయుద్ధంతో గాఢంగా అసంతృప్తి చెందియున్న కార్మికులు, సైనికులు రష్యన్‌ల అడుగుజాడలను అనుసరించవచ్చుననీ, తమ యజమానుల పైన, దోపిడిగాండ్రపైన తమ ఆయుధాలను తిప్పవచ్చుననీ వారు భయపడ్డారు. అందుచేత మిత్రమండలి ప్రభుత్వాలు రష్యాలో సాయుధ సేనలతో జోక్యం కలుగజేసుకోవాలని నిశ్చయించాయి. సోవియట్ ప్రభుత్వాన్ని కూలదోసి దేశంలో పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించే, జర్మన్‌లతో చేసుకొన్న సంధి ఒడంబడికను రద్దుచేసే జర్మనీ, ఆస్ట్రియాలపై సైనికరంగాన్ని తిరిగి నెలకొల్పే బూర్జువా ప్రభుత్వాన్ని ఏర్పరచాలని వాటి ఉద్దేశ్యం.

సోవియట్ ప్రభుత్వం గట్టిపునాదిగలదికాదని నమ్మటం వల్లనే యీ ఘాతుకచర్యను వెంటనే మిత్రమండలి సామ్రాజ్యవాదులు ప్రారంభించారు. కొద్ది ప్రయత్నంతో సోవియట్ ప్రభుత్వం త్వరలోనే కూలిపోక తప్పదని దాని శత్రువులు అంచనా వేశారు.

సోవియట్ ప్రభుత్వంయొక్క విజయాలూ, అది స్థిరపడుటా, అధికారం నుండి తొలగించబడ్డ వర్గాలలో అనగా భూస్వాములలో, పెట్టుబడిదారులలో ఇంకా శాసనబద్ధ ప్రజాతంత్రవాదులు, మెన్షివిక్‌లు, సోషలిస్టు - రివల్యూషనరీలు, అరాచకవాదులు నానా గోత్రీభ్యులైన బూర్జువా జాతీయ మొదలుగాగల ఓడిపోయిన రాజకీయ పార్టీలలో, వైట్‌గార్డ్ సేనానులలో, కోసక్ ఆఫీసర్లు మొదలగువారిలో మరింత భయం కల్గించింది.

అక్టోబరు విప్లవం విజయం పొందిన మొదటిరోజుల నుండే ఈ ప్రతికూల వ్యక్తులంతా గొంతుచించుకొని ఇలా వాదించేవారు: సోవియట్ అధికారానికి రష్యాలో తావులేదు. అది విఫలం చెందుతుంది. ఒకటిరెండు వారాలలో లేక ఒకటి, రెండు- మహాఅయితే-మూడునెలలలో అదితప్పకుండా పడితీరుతుంది. కాని దాని శత్రువులు ఎన్ని శాపనార్థాలు పెడుతూవున్నా సోవియట్ ప్రభుత్వం నిలదొక్కుకొని బలపడుతూనే వచ్చింది. తాము ఊహించుకొన్నదానికంటె అది చాలా బలమైనదని రష్యా ఆంతరంగిక శత్రువులు అంగీకరించక తప్పింది కాదు. దానిని కూలద్రోయడానికి విప్లవ ప్రతీఘాత శక్తులు తాము తీవ్రమైన ప్రయత్నాలు చేయవలసి వస్తుందనీ, భయంకరమైన పోరాటం సాగించవలసి వస్తుందనీ అంగీకరించారు. అందుచే పెద్దపెటున విప్లవ ప్రతీఘాతపు తిరుగుబాటు కార్యకలాపాలను కొనసాగించడానికి నిశ్చయించుకొన్నారు. విప్లవ ప్రతీఘాతశక్తులను సమీకరించుటకు, సైనిక అనుచరులను పోగుచేయుటకు, తిరుగుబాట్లను ముఖ్యంగా కోసక్‌లు, కులక్‌లు ప్రాబల్యంగావున్న జిల్లాలలో సంఘటితపరచడానికి వారు నిశ్చయించుకున్నారు.

ఆవిధంగా 1918 వ సంవత్సరం మొదటి ఆరునెలలలోనే సోవియట్ అధికారాన్ని కూలద్రోయడానికి రెండు నిశ్చిత శక్తులు సిద్ధపడ్డాయి: ఒకటి మిత్రమండలికి చెందిన విదేశ సామ్రాజ్యవాదులు, రెండు దేశంలోని విప్లవప్రతీఘాత శక్తులు.

సోవియట్ అధికారాన్ని ఒంటరిగా కూలదోయడానికి ఈశక్తులలో దేనికీకూడా తగినశక్తిసామర్థ్యాలు లేవు. సోవియట్

అధికారానికి వ్యతిరేకంగా తిరుగుబాటును ప్రారంభించే వరకు రష్యాలోని విప్లవ ప్రతిఘాతకులకు కొంతమంది సైనిక అనుచరులు, మనుష్యబలగమూ వున్నారు. వీరంతా కోసక్‌ల లోని ఉన్నతివర్గాలనుండి, కులక్‌లనుండి వచ్చారు. కాని వారికి ఆయుధాలుగాని డబ్బుగాని లేవు. ఇక విదేశ సామ్రాజ్యవాదు లకు డబ్బు, ఆయుధాలు ఉన్నవిగాని, రష్యాలో జోక్యం కలుగజేసుకోడానికి అవసరమైన సైన్యాలు తగినంతగా లేవు. ఇందువు వారు తమ సైన్యాలను "ఉపయోగించ" జాలరు. ఎందుచేతనంటే ఈ సైన్యాలు జర్మనీ, ఆస్ట్రియాలతో యుద్ధం చేయవలసి వచ్చుటేగాక, సోవియట్ ప్రభుత్వంపై చేసే యుద్ధంలో వారు పూర్తిగా నమ్మదగినవారు కాకపోవచ్చు.

సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేక పోరాట పరిస్థితుల వల్ల, సోవియట్ ప్రతికూలమైన విదేశ స్వదేశశత్రువులు ఏకం కావలసి వచ్చింది. 1918 మొదటి అర్ధసంవత్సరంలో ఈ ఐక్యత ఏర్పడింది.

ఈవిధంగా సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విదేశీ సైనికులు సాగించిన దురాక్రమణను, సోవియట్ ఆంతరంగిక శత్రువులు విప్లవ ప్రతిఘాత తిరుగుబాట్లతో బలపరచారు.

దీనితో రష్యాలో విశ్రాంతి కాలం అంతమయింది. అంతర్యుద్ధం ప్రారంభమయింది. సోవియట్ ప్రభుత్వ విదేశ స్వదేశ శత్రువులతో, రష్యాలోని వివిధజాతుల కార్మికులు, రైతులు సాగించిన యుద్ధం ప్రారంభమయింది.

ఎట్టి యుద్ధం ప్రకటించకుండానే బ్రిటన్, ఫ్రాన్సు, జపాన్, అమెరికాల సామ్రాజ్యవాదులు రష్యాలో సైనిక

దురాక్రమణ ప్రారంభించారు. ఈ దురాక్రమణ ఒక యుద్ధమే. రష్యా వ్యతిరేక యుద్ధమే. అందులోను అతి క్రూరమైన యుద్ధం. ఈ "నాగరిక" దోపిడిగాండ్రు రహస్యంగాను, దొంగతనంగాను రష్యా తీరాలను చేరి రష్యన్ భూభాగంలో తమ సేనలను దింపారు.

బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు తమ సైన్యాలను ఉత్తరాన దింపారు. ఆర్చాంగెల్, ముర్మాన్స్కులను ఆక్రమించారు. స్థానిక వైట్‌గార్డ్ తిరుగుబాటును బలపరచారు. సోవియట్లను కూలదోశారు. వైట్‌గార్డ్‌ల "ఉత్తరరష్యా ప్రభుత్వాన్ని" నెలకొల్పారు.

జపానువాళ్లు వ్లాడివాస్టక్‌లో సేనలనుదింపి, కోస్తా రాష్ట్రాన్ని స్వాధీనంచేసుకొన్నారు. సోవియట్లను చెదరగొట్టి వైట్‌గార్డ్ విద్రోహులను బలపరచారు. ఈ వైట్‌గార్డ్‌లు ఆతర్వాత పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించారు.

ఉత్తర కాకాసస్‌లో, కోర్నిలావ్, అలెగ్జియెవ్, డెనికిన్ అను సేనానులు, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల అండతో వైట్‌గార్డ్‌ల "వలంటీరు సైన్యాన్ని" ఏర్పరచారు. కోసక్‌లలోని పైతరగతులవారి తిరుగుబాటును లేవదీశారు. సోవియట్లపై యుద్ధచర్యలను ప్రారంభించారు.

డాన్ నదీతీరాన క్రోస్నావ్, మెమంటోవ్ అనే సేనానులు జర్మన్ సామ్రాజ్యవాదుల రహస్య ప్రోద్బలంతో (జర్మనీ రష్యాల మధ్య సంధిఒడంబడిక ఉండుటచే జర్మనులు బహిరంగంగా దీనిని బలపరచడానికి జంకారు) డాన్ కోసక్‌లలో

తిరుగుబాటును లేవగొట్టారు. డాన్ ప్రాంతాన్ని ఆక్రమించి సోవియట్లపై యుద్ధాన్ని ప్రారంభించారు.

వాల్గా మధ్య ప్రాంతంలోను, సైబీరియాలోను బ్రిటిష్ ఫ్రెంచి సామ్రాజ్యవాదులు జెకోస్లవేకియా సైన్యాన్ని తిరుగుబాటుచేయ ప్రోత్సహించారు. ఈ సైన్యం యుద్ధఖైదీలతో నిండివుంది. సైబీరియా గుండాను, దూర ప్రాచ్యాలగుండాను తమ యిండ్లకు వెళ్ళిపోవడానికి సోవియట్ ప్రభుత్వం అనుమతి నిచ్చింది. కాని తోవలో సోషలిస్టు - రివల్యూషనరీలు, బ్రిటిష్, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు, వీరిని సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటును లేవదీయడానికి ఉపయోగించారు. ఈ సైనిక తిరుగుబాటు వాల్గా ప్రాంతంలోను, సైబీరియాలోను కులక్ తిరుగుబాటుకు సోషలిస్టు - రివల్యూషనరీల పలుకుబడిలోనున్న ఓటిన్స్క్, ఇఝెవిస్క్ పరిశ్రమల లోని కార్మికుల తిరుగుబాటుకు నాందిగా పనిచేసింది. వాల్గా ప్రాంతంలోను, సమారాలోను వైట్‌గార్డ్ - సోషలిస్టు- రివల్యూషనరీ ప్రభుత్వమూ, సైబీరియాలోని ఓమ్స్క్‌లో వైట్ గార్డ్ ప్రభుత్వమూ నెలకొల్పబడ్డాయి.

బ్రిటన్, ఫ్రాన్సు, జపాన్, అమెరికాల కూటమియొక్క దురాక్రమణలో జర్మనీ పాల్గొనలేదు. అలా పాల్గొనలేదు కూడాను. ఇతరకారణా లెలావున్నా ఈ కూటమితో జర్మనీ యుద్ధం చేస్తూండిగనుక అలా పాల్గొనలేదు. అయినప్పటికీ, రష్యా, జర్మనీలమధ్య సంధి ఒడంబడిక వున్నప్పటికీ, బ్రిటన్, ఫ్రాన్స్, జపాన్, అమెరికా దురాక్రమణదారులు సోవియట్ రష్యాకు ఎంత బద్ధశత్రువులో కైజర్ జర్మనీ ప్రభుత్వంకూడా

అంతే బధశతుృవు అనుటలో ఏ బొల్షివిక్కుకూ సందేహం లేదు. అలాగే వాస్తవంగా జర్మన్ సామ్రాజ్యవాదులుకూడా సోవియట్ రష్యాను వేరుపరచి బలహీన మొనర్చి నాశనం చేయడానికి తమ యావచ్ఛక్తినీ ఉపయోగించారు. సోవియట్ రష్యానుండి వారు యుక్రెయిన్ లాక్కొన్నారు. ఐతే వైట్ గార్డ్ యుక్రేనియన్ రాడా ప్రభుత్వంతో చేసుకొన్న "సంధి" ద్వారానే యుక్రెయిన్‌ను లాక్కొన్నమాట నిజమే. (రాడా అనగా విప్లవ ప్రతీఘాత యుక్రెయిన్ జాతీయ పెట్టుబడిదారీ వర్గ ప్రభుత్వం. విప్లవాన్ని గొంతునులిమే వుద్దేశ్యంతో యుక్రెయిన్‌లోకి ఆస్ట్రో - జర్మన్ సామ్రాజ్యవాదుల సైన్యాలను పిలిపించింది). రాడా కోరికపైననే తమ సైన్యాలను తెచ్చి యుక్రెయిన్ ప్రజలను నిర్దాక్షిణ్యంగా దోపిడి చేసి పీడించసాగారు. సోవియట్ రష్యాతో ఎట్టిసంబంధాలు పెట్టుకో రాదని యుక్రెయిన్ ప్రజలను నిర్బంధించారు. వారు సోవియట్ రష్యానుండి ట్రాన్స్ కాకేషియాను విడగొట్టారు. జార్జియన్, అజర్ బైజాన్ సంకుచిత జాతీయవాదుల కోరికపైన, జర్మన్ - టర్కిష్ సైన్యాలు అక్కడికివెళ్ళి టిఫ్లిస్ బాకూలలో తామే యజమానులలాగ ప్రవర్తించారు. సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా డాన్ నదీతీరంలో తిరుగుబాటు సాగించిన జనరల్ క్రాస్నోవ్‌కు వారు సమృద్ధిగా ఆయుధాలను, వస్తుసామగ్రిని సప్లయిచేశారు. అయితే బహిరంగంగా గాక రహస్యంగా చేసినమాట నిజమే.

ఆవిధంగా ఆహారము, ముడిపదార్థాలు, వంటచెరుకు మొదిలైనవాటికి ముఖ్యకేంద్రాలైన ప్రదేశాలనుండి, సోవియట్ రష్యా తెగట్టబొబడింది.

ఆకాలంలో సోవియట్ రష్యాలో పరిస్థితులు ఎంతో కఠినంగా వున్నాయి. ఆహార మాంసాలలో కొరత ఏర్పడింది. కార్మికులు పస్తులు పరుండసాగారు. మాస్కోలోను, పెట్రోగ్రాడ్‌లోను రొట్టె రేషన్ తగ్గించబడింది. రెండురోజులకొకసారి 5 తులాల రొట్టెమాత్రం యిచ్చేవారు. ఒక్కొక్కసారి రొట్టె అసలేయివ్వని రోజులుకూడావున్నాయి. ముడిపదార్థాలు, బొగ్గు లేకపోవటంవలన ఫ్యాక్టరీలు మూసివేయడమో లేక దాదాపు మూసివేయటమో జరిగింది. కాని కార్మికవర్గం గుండెజారిపో లేదు. బోల్షివిక్కు పార్టీగూడ ధైర్యం కోల్పోలేదు. ఆ కాలంలోని ఊహించరాని కష్టాలను అతిక్రమించటానికి సాగించిన అత్యంత సాహసపోరాటం, కార్మికవర్గంలో ఎంత అపరిమిత శక్తి యిమిడియున్నదో, బోల్షివిక్కుపార్టీ పలుకుబడి ఎంత గాఢమైనదో రుజువుచేసింది.

దేశమంతా ఒక యుద్ధశిబిరమని పార్టీ ప్రకటించింది. దేశంయొక్క ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయ జీవితాన్ని యుద్ధ ప్రాతిపదికపైన నిల్పింది. "సోషలిస్టు మాతృభూమి ప్రమాదంలో వున్నది" అని సోవియట్ ప్రభుత్వం ప్రకటించింది. మాతృదేశ సంరక్షణకు ప్రజలంతా నడుంకట్టాలని అది పిలుపు ఇచ్చింది. "అందరూ యుద్ధరంగానికే!" అనే నినాదం లెనిన్ ఇచ్చాడు. లక్షలాది కార్మికులు, రైతులు ఇచ్ఛాపూర్వకంగా రెడార్మీలో చేరి యుద్ధరంగానికి పయనమయ్యారు. పార్టీసభ్యులలో సగంమంది, కమ్యూనిస్టుయువజన సమితి సభ్యులలో సగంమంది యుద్ధరంగానికి వెళ్లారు. విదేశీ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా, విప్లవంలో ఓడిపోయిన దోపిడివర్గాలు

తిరిగి లేవనెత్తిన తిరుగుబాట్లను వ్యతిరేకంగా, మాతృదేశ సంరక్షణ యుద్ధానికై ప్రజలను పార్టీ ఉత్తేజపరచింది. కార్మిక కర్షక సంరక్షణ సమితి నొకదానిని లెనిన్ సంఘటితపరచాడు. ఇది యుద్ధరంగానికి అవుసరమైన అదనపు సైన్యాలను, ఆహార పదార్థాలను, బట్టలను, ఆయుధాలను సప్లయిచేస్తూ వుండేది. ఇచ్ఛాపూర్వక పద్ధతికి బదులు నిర్బంధసైనిక పద్ధతి ప్రవేశ పెట్టుటవల్ల లక్షలాది కొత్తసైనికులు రెడార్మీలో చేరారు. రెడార్మీ సంఖ్య 10 లక్షలను మించిపోయింది.

దేశం క్లిష్టపరిస్థితిలో వున్నప్పటికీ, యువ రెడార్మీ యింకా సుస్థిరబడకపోయినప్పటికీ, సంరక్షణకు తీసుకున్న చర్యలు ప్రప్రథమంగా కొన్ని సత్ఫలితాలనే ఇచ్చాయి. జారిట్సియన్ పట్టణాన్ని పట్టుకోవటం తథ్యమని జనరల్ క్రాస్నోవ్ భావించాడు. కాని అతన్ని అక్కడనుండి వెనక్కినెట్టి డాన్‌నది అవతలివరకు తరిమివేశారు. ఉత్తర కాకసస్‌లో ఒక చిన్న ప్రదేశంలో జనరల్ డెనికిన్ సైనిక చర్యలు పరిమితం చేయబడ్డాయి. రెడార్మీ పై యుద్ధంలో జనరల్ కోర్నిలోవ్‌ను చంపివేసింది. కజాన్, సింబర్‌స్క్ సమరాలనుండి జకోస్లావాక్ దేశస్థులను, వైట్‌గార్డ్ సోషలిస్టు-రివల్యూషనరీ విద్రోహ ముఠాలను, యురల్ కొండలలోకి తరిమివేశారు. మాస్కోలోని బ్రిటిష్‌ముఖ్యరాయబారిలోఖార్ట్, యరోస్లావల్ లో ఒక తిరుగుబాటును సంఘటిత పరచాడు. దానికి వైట్‌గార్డు సావిన్‌కోవ్ నాయకత్వం వహించాడు. ఈతిరుగుబాటు అణచివేయబడింది. లోఖార్ట్‌ను అరెస్టు చేశారు. బోల్షివిక్‌లపైన విద్రోహులు గావించిన క్రూరాతిక్రూరమైన హింసాకాండ జరిగింది.

కా(మేడ్స్ యురిట్స్కీ, వొలోడార్స్కీలను హత్యచేసి, లెనిన్‌ను హత్యచేయటానికి ఘాతుకప్రయత్నం చేసిన సోషలిస్టు-రివల్యూషనరీలపై ప్రతీకార హింసాకాండ కొనసాగింది. మధ్య రష్యాలోని ప్రతి ముఖ్యనగరంలోను సోషలిస్టు-రివల్యూషనరీలను పూర్తిగా ఓడించారు.

బాల్యావస్థలోనున్న రెడార్మీ పరిపక్వమంది యుద్ధ రంగంలో కాకలుతీరింది.

రెడార్మీని రాజకీయంగా తరిఫీదు చేయటానికి, రెడార్మీ క్రమశిక్షణను, పోరాటశక్తిని పెంపొందించి, సుస్థిరపరచడానికి కమ్యూనిస్టు కమీసార్ల (మంత్రులు) కార్యాచరణ ప్రముఖ పాత్ర వహించింది.

ఈ విజయాలు ప్రాథమిక విజయాలేగాని, రెడార్మీ యొక్క నిశ్చిత విజయాలుకావని బోల్షివిక్కు పార్టీకి తెలుసు. ఇంతకంటే చాల తీవ్రమైన కొత్తపోరాటాలు రానున్నాయని, తాము పోగొట్టుకొన్న ప్రదేశాలను అనగా ఆహారపదార్థాలు, ముడిపదార్థాలు, బొగ్గు లభ్యమయ్యే ప్రదేశాలను తిరిగి వశపరచుకోవాలంటే, శత్రువుతో మొండిగా దీర్ఘకాలం పోరాడవలసియుంటుందని పార్టీకి తెలుసు. అందుచే బోల్షివిక్కులు దీర్ఘకాల యుద్ధానికి తీవ్ర సన్నాహాలు ప్రారంభించారు. యుద్ధానికి సహాయపడేందుకు దేశాన్ని సంసిద్ధపరచాలని నిశ్చయించారు. సోవియట్‌ప్రభుత్వం, "యుద్ధకాల కమ్యూనిజాన్ని" (War Communism) ప్రవేశపెట్టింది. వ్యవసాయదార్లకు, సైన్యానికి వస్తువులు సరఫరా చేసేందుకై సరుకులను నిల్వచేసేందుకు, సోవియట్ ప్రభుత్వం భారీ పరిశ్రమలనేగాక,

మధ్యరకం పరిశ్రమలను, చిన్న పరిశ్రమలనుగూడ తన అధీనం లోకి తీసుకొంది. ధాన్యం వర్తకంలో ప్రభుత్వమే గుత్త తీసుకుంది. ప్రయివేటు ధాన్య వ్యాపారాన్ని నిషేధించింది. మిగులుధాన్యాన్ని వశపరచుకొనే పద్ధతిని ప్రవేశపెట్టింది. ఈ పద్ధతి ప్రకారం రైతులు తమ మిగులు ధాన్యానికి లెక్కలు చూపించాలి. ప్రభుత్వం నిర్ణీత ధరలకు ఈ ధాన్యాన్ని కొని నిల్వచేస్తుంది. సైనికులకు, కార్మికులకు సప్లయి చేస్తుంది. తుదకు అన్నివర్గాలు నిర్బంధంగా ఏదో ఒక పనిచెయ్యాలని శాసించింది. పెట్టుబడిదారీవర్గం నిర్బంధంగా కాయకష్టం చేసే టట్లు శాసించటంవల్ల, కార్మికులకు ఇంతకన్న ముఖ్యమైన విధులలోకి అనగా యుద్ధరంగానికి వెళ్ళడానికి అవకాశం లభిం చింది. ఇలా చేయటంవల్ల "పనిచేయనివాడు తిండిబాయ వలయు" అనే సూత్రాన్ని పార్టీ ఆచరణలో పెట్టింది.

ప్రత్యేక కష్టపరిస్థితులలో దేశరక్షణ కవసరమైన ఈ చర్యలన్నీ తాత్కాలిక స్వభావాన్ని కలిగియున్నాయి. వీటి నన్నిటినీ మొత్తంగా "యుద్ధకమ్యూనిజం" అనిపిలుస్తారు.

సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకులైన విదేశ, స్వదేశ శత్రువులపై దీర్ఘకాల కష్టభూయిష్టమైన అంతర్యుద్ధానికి, దేశం సిద్ధమైంది. 1918 సంవత్సరాంతానికి సైనికబలం మూడురెట్లు పెంచవలసివచ్చింది. ఆ సైన్యానికి తగిన సప్లయిలను కూడబెట్ట వలసి వచ్చింది.

ఆ కాలంలో లెనిన్ ఇలా అన్నాడు:

"వసంతకాలంనాటికి 10 లక్షలమంది సైనికులు మనకు కావాలని నిశ్చయించుకున్నాం! కాని మనకిప్పుడు 30 లక్షల

సైనికులు కావాలి. మనం వీరిని సమకూర్చుకోగలం. సమకూర్చుకొని తీరుతాం."



## 2

### యుద్ధంలో జర్మనీ ఓటమి— జర్మనీలో విప్లవం— మూడవ ఇంటర్నేషనల్ స్థాపన — పార్టీ ఎనిమిదవ కాంగ్రెస్

ఒకప్రక్క విదేశీ దురాక్రమణశక్తులకు వ్యతిరేకంగా నూతనయుద్ధాలకు సోవియట్ దేశం సన్నాహమవుతుంటే, యుద్ధంలో పాల్గొంటున్న పశ్చిమదేశాలలోను, వాటి యుద్ధరంగాలలోను, అతి ముఖ్యమైన ఘటనలు జరిగాయి. యుద్ధం వల్ల, ఆహారసంక్షోభంవల్ల జర్మనీ, ఆస్ట్రియాలు ఉక్కిరిబిక్కిరి అవుతున్నాయి. బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికాలు నిరంతరం కొత్త ద్రవ్యసాధనాలను సంపాదించుకొంటూ వుంటే జర్మనీ, ఆస్ట్రియాలు తమకు మిగిలియున్న కొద్ది నిల్వలను గూడ ఖర్చుపెట్టివేస్తున్నాయి. జర్మనీ, ఆస్ట్రియాలు పూర్తిగా డస్సిపోయి ఓటమి తప్పదనేస్థితిలో వున్నాయి.

ఇదేసమయంలో, సర్వనాశనానికి కారణమైన అంతూ పంతూలేని యుద్ధంపట్లనూ, తమను వస్తులకూ, డస్సిపోయిన స్థితికీ తీసుకొనివచ్చిన తమ సామ్రాజ్యవాద ప్రభుత్వాలపట్లనూ, జర్మనీ, ఆస్ట్రియాల ప్రజలు క్రోధావేశంతో ఉడికిపోతున్నారు. అక్టోబరు విప్లవం అత్యద్భుతమైన ప్రభావం

వారిపై కలిగించింది. బ్రెస్ట్-లిటోవ్స్క్ సంధికి పూర్వమే-సోవియట్‌తో యుద్ధం అంతమయి సంధి ఒడంబడిక జరగక పూర్వమే, యుద్ధరంగంలో ఆస్ట్రియన్ - జర్మన్ సైనికులతో సోవియట్ సైనికులు సౌభ్రాతృత్వాన్ని పెంపొందజేశారు. రష్యన్ ప్రజలు తాము ద్వేషించిన యుద్ధాన్ని, తమసామ్రాజ్య వాద ప్రభుత్వాన్ని కూలద్రోయుటద్వారా అంతమొందించారు. ఇది ఆస్ట్రియన్, జర్మన్ కార్మికులకు ఒకగుణపాఠంగా పనిచేయక తప్పిందికాదు. తూర్పురంగంలో ఇదివరకు పని చేసిన జర్మన్ సైనికులు బ్రెస్ట్ - లిటోవ్స్క్ సంధితరువాత పశ్చిమరంగానికి మార్చబడ్డారు. తమకు, సోవియట్ సైనికులకు తూర్పురంగంలో ఎలాంటి సౌభ్రాతృత్వ భావమేర్పడిందీ, సోవియట్ సైనికులు యుద్ధపీడను ఎలా వదిలించుకున్నదీ అక్కడ వర్ణించసాగారు. ఆ విధంగా పశ్చిమరంగంలోని జర్మన్ సైన్యంలో మనోనిబ్బరాన్ని కుంటువడ చేయసాగారు. ఇదే కారణాలవల్ల యింతకంటే ముందే, ఆస్ట్రియన్ సైన్యంలో విచ్ఛిన్నత ప్రారంభమైంది.

ఇదంతా జర్మన్ సైనికులలోని శాంతికాంక్షను వృద్ధి చేసింది. ఇదివరలో వారికున్న పోరాటసామర్థ్యం నశించింది. అందుచే మిత్రరాజ్యసైన్యాల దెబ్బలకు ఆగలేక తిరోగమించ సాగాయి. 1918 నవంబరులో జర్మనీలో విప్లవం వచ్చింది. విల్‌హెల్మ్ చక్రవర్తిని (కెయిజర్), అతని ప్రభుత్వాన్ని కూలదోశారు.

జర్మనీ తన ఓటమిని అంగీకరించి సంధికి చేయిజాపవలసి వచ్చింది.

ఆ విధంగా ఒక దెబ్బతో జర్మనీ ప్రథమస్థానం నుండి రెండవస్థానానికి దిగజారవలసివచ్చింది.

ఇక సోవియట్ ప్రభుత్వానికి సంబంధించినంతవరకు దీని ఫలితంగా కొన్ని చిక్కులు ఏర్పడ్డాయి. సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ దురాక్రమణ సాగించిన మిత్ర మండలిరాజ్యాలు యూరప్‌లోను, ఆసియాలోను శక్తివంత దేశాలుగా యీ పరిస్థితులు మార్చాయి. దీని ఫలితంగా సోవియట్‌ను దిగ్బంధంచేసి, దాని గొంతు చుట్టూ ఉచ్చును మరింత బిగువుగా బిగించటానికి అవకాశంఏర్పడింది. యదార్థానికి ఇంతే జరిగిందని మనం తర్వాత తెలుసుకుంటాం. జర్మనీ ఓటమివల్ల సోవియట్‌కు మరొకప్రక్క లాభాలు కూడా లేక పోలేదు. ఈ లాభాలు నష్టాలను మించిపోయి సోవియట్ రష్యా పరిస్థితిని ప్రధానంగా చక్కబెట్టాయి. మొదటిది: సోవియట్ ప్రభుత్వం గొంతు పిడితో కూడిన బ్రెస్ట్ - లిటోవ్‌స్క్ సంధిని రద్దుచేసి నష్టపరిహారాలను చెల్లించుట మానివేయ గలిగింది. జర్మన్ సామ్రాజ్యవాద బానిసత్వంనుండి ఇస్తోనియా, లాట్వియా, బైలోరష్యా, లిథూనియా, యుక్రెయిన్, ట్రాన్స్ కాకేషియాలను విముక్తి చేయటానికి బహిరంగ సైనిక, రాజకీయ పోరాటాన్ని ప్రారంభించ గలిగింది. రెండవదీ, ముఖ్యమైనది: యూరపుకు కేంద్రమైన జర్మనీలో, ప్రజాతంత్ర ప్రభుత్వమూ, కార్మిక, సైనిక ప్రతినిధుల సోవియట్లూ ఏర్పడటం యూరప్ దేశాలలో విప్లవకర మార్పులు రాక తప్పదు. వాస్తవంగా అలా జరిగింది కూడా. ఈ పరిస్థితి రష్యాలోని సోవియట్ అధికారాన్ని తప్పనిసరిగా బలపరిచింది. నిజమే. జర్మనీ విప్లవం సోషలిస్టు విప్లవం కాదు, బూర్జువా విప్లవమే.

అక్కడ ఏర్పడిన సోవియట్లు బూర్జువా శాసనసభకు లొంగి యుండే సాధనాలనుట నిజమే. రష్యన్ మెన్షివిక్కులలాంటి రాజీబేరగాండ్రైన సోషల్ డెమాక్రట్లు ఆ సోవియట్లలో పెత్తనం వహించారన్నది కూడా సత్యమే. జర్మన్ విప్లవ బలహీనతను పై విషయాలన్నీ తెలియజేస్తాయి. జర్మన్ విప్లవం ఎంత బలహీనమైనదో యీ క్రింది విషయాన్నిబట్టి తెలుస్తుంది. రోజాలగ్జెంబర్గు, కారల్ లీబ్‌నెక్ వంటి ముఖ్యమైన విప్లవకారులను జర్మన్ వైట్‌గార్డులు నిర్భయంగా హత్యచేయటానికి అవకాశమిచ్చింది. అయినప్పటికి అది విప్లవమే. విల్‌హెల్మ్ చక్రవర్తిని కూలద్రోశారు. కార్మికులు తమ సంకెళ్లను ఛేదించుకొన్నారు. ఈ విషయ మొక్కటే పశ్చిమ రాజ్యాలలో విప్లవాన్ని రేకెత్తించి యూరోపియన్ దేశాలలో విప్లవ జ్వాల వ్యాపింపజేయటానికి దారితీస్తుంది.

యూరప్‌లో విప్లవ వెల్లువ పెంపొంద సాగింది. ఆస్ట్రియాలో విప్లవోద్యమం ప్రారంభమైంది. హంగరీలో సోవియట్ రిపబ్లిక్కు ఉదయించింది. విప్లవ వెల్లువ పెల్లుబుకుటతో కమ్యూనిస్టుపార్టీలు బహిరంగంగా పనిచేయ నారంభించాయి.

కమ్యూనిస్టు పార్టీలను ఐక్యపరచడానికీ, మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను ఏర్పరచటానికీనిజమైన ప్రాతిపదిక యిపుడు ఏర్పడింది.

1919 మార్చిలో, లెనిన్ నాయకత్వాన బోల్షివిక్కుల చొరవతో, మాస్కోలో వివిధ దేశాల కమ్యూనిస్టుపార్టీల ప్రథమ కాంగ్రెసు జరిగింది. ఇది కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను

స్థాపించింది. సామ్రాజ్యవాదుల దిగ్బంధంవల్ల, నిర్బంధవిధానం వల్ల అనేకమంది ప్రతినిధులు యీ సమావేశానికి రాలేక పోయారు. అయినప్పటికీ యూరప్ అమెరికాలలోని ప్రముఖ దేశాల నుండి ప్రతినిధులు ప్రథమకాంగ్రెస్‌కు హాజరయ్యారు. కాంగ్రెస్‌లోని కార్యకలాపాలను లెనిన్ నడిపాడు.

బూర్జువా ప్రజాతంత్రం, శ్రామికవర్గ నియంతృత్వం అనే విషయంపైన లెనిన్ రిపోర్టుయిచ్చాడు. సోవియట్ విధానంయొక్క ప్రాముఖ్యతను తెలియజేస్తూ అది కష్టజీవులకు ఎలా నిజమైన ప్రజాతంత్రమో తెలియజేశాడు. శ్రామికవర్గ నియంతృత్వంకోసం, దృఢమైన పోరాటాన్ని కొనసాగించవల సిందని ప్రబోధించుతూ సమస్తదేశాల శ్రామికవర్గానికి ఒక ప్రణాళికను కాంగ్రెస్ ప్రకటించింది.

మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యనిర్వాహక వర్గాన్ని (E. C. C. I – ఇ. సి. సి. ఐ) కాంగ్రెస్ ఏర్పరచింది.

ఆ విధంగా ఒక కొత్తరకపు అంతర్జాతీయ విప్లవ శ్రామికవర్గ సంస్థ - కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ - మార్క్సిస్టు-లెనినిస్టు ఇంటర్నేషనల్ స్థాపించబడింది.

1919 మార్చిలో మనపార్టీ 8 వ కాంగ్రెస్ సమావేశ మయింది. పరస్పర విరుద్ధమైన ఘటనల సంఘర్షణా కాలంలో అది సమావేశమైంది. ఒకప్రక్క సోవియట్ ప్రభుత్వ ప్రతికూల అభివృద్ధి నిరోధక మిత్రమండలి దేశాల కూటమి బలపడింది. మరొకప్రక్క యూరప్‌లో ముఖ్యంగా ఓడిపోయిన దేశాలలో అభివృద్ధి చెందుతున్న విప్లవ వెల్లువవల్ల సోవియట్‌దేశ పరిస్థితి చెప్పుకోదగినంతగా బాగుపడింది.

ఈ కాంగ్రెస్‌కు 3 లక్షల 13 వేల 766 మంది సభ్యులకు ప్రాతినిధ్యం వహించిన ప్రతినిధులు వచ్చారు. ఓటుచేసే హక్కుగల ప్రతినిధులు 301 మంది, చర్చించే హక్కుగలి వోటింగు హక్కులేని ప్రతినిధులు 102 మంది కాంగ్రెస్‌కు హాజరయ్యారు.

లెనిన్ తన ప్రారంభోపన్యాసంలో వై. యం. స్వెర్డ్లావ్‌కు జోహారు లర్పించాడు. ఇతడు బోల్షివిక్ పార్టీని సంఘటితం జేయటంలో అత్యద్భుత ప్రతిభకలవారలలో ఒకడు. కాంగ్రెస్, రేపో, మాపో సమావేశ మవుతుందనగా ఈయన చనిపోయాడు.

పార్టీ కొత్త కార్యక్రమాన్ని కాంగ్రెస్ ఆమోదించింది. ఈ కార్యక్రమం పెట్టుబడిదారీ విధానాన్ని, దాని ఉన్నతస్వరూపమైన సామ్రాజ్యవాదాన్ని వివరించింది. అది బూర్జువా ప్రజాతంత్ర విధానాన్ని, సోవియట్ విధానాన్ని రెండు ప్రభుత్వ విధానాలను పోల్చి చూచింది. సోషలిజంకై సాగించే పోరాటంలో పార్టీ నిశ్చిత కర్తవ్యాలను ఈ కింది విధంగా వివరించింది: పెట్టుబడిదారుల ఆస్తిని స్వాధీనపర్చుకొనే పనిని పూర్తిచేయుట, ఏకైక సోషలిస్టు పథకాన్ని అనుసరించి దేశ ఆర్థిక జీవితాన్ని నిర్వహించుట, జాతీయ ఆర్థిక నిర్మాణంలో కార్మిక సంఘాలు పాల్గొనుట, సోషలిస్టు కార్మిక క్రమశిక్షణ, సోవియట్ సంఘాల యాజమాన్యాన బూర్జువా ప్రవీణులను ఆర్థికరంగంలో వుపయోగించుకొనుట, సోషలిస్టు నిర్మాణ కార్యంలో మధ్యతరగతి రైతులను క్రమ క్రమంగా ఒక పద్ధతి ప్రకారం పాల్గొన జేయుట.

పెట్టుబడిదారీ విధానంయొక్క ఉన్నతదశయే సామ్రాజ్య వాదమని నిర్వచించింది. దీనితోపాటు, ఇదివరకు పార్టీ రెండవ కాంగ్రెస్‌లో ఆమోదించబడిన పాత కార్యక్రమంలోని ఈ క్రింది విషయాన్నికూడా లెనిన్ సూచనపై ఆమోదించింది: పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానం - వర్తకసరుకుల సాధారణ ఉత్పత్తి (Simple Commodity Production), వీటిని గురించి చేసిన వివరణను కూడా కార్యక్రమంలో చేర్చాలి అనేది ఈ సూచన.

మన కార్యక్రమం మన ఆర్థిక విధానం జటిలమైనదని గుర్తించాలి. మధ్యతరగతి రైతులు పాల్గొనే చిన్నతరహా సరకుల ఉత్పత్తి విధానంతోసహా వివిధ భిన్న ఆర్థికస్వరూపాలు దేశంలో వున్నాయని మన కార్యక్రమం గుర్తించుట అవసరమని లెనిన్ భావించాడు. పెట్టుబడిదారీ విధానం, చిన్నతరహా సరకుల ఉత్పత్తి, మధ్యతరగతి రైతుల ఆర్థిక విధానం, మొదలగువాటికి సంబంధించిన అంశాలను కార్యక్రమంలోనుంచి తీసివెయ్యాలని బుఖారిన్ వాదించాడు. ఇతని ఈ బోల్షివిక్ వ్యతిరేక అభిప్రాయాలను కార్యక్రమ చర్చసందర్భంలో లెనిన్ తీవ్రంగా ఖండించాడు. సోవియట్ రాజ్యాంగ అభివృద్ధిలో మధ్యతరగతి రైతుల పాత్ర నిరాకరించే మెన్షివిక్ ట్రాట్స్కీ-వాదుల భావాలను బుఖారిన్ వెల్లడించాడు. ఇంతేగాక రైతుల చిన్నతరహా సరుకుల ఉత్పత్తి, కులక్‌లను పుట్టించి పోషించుతుందన్న విషయాన్ని బుఖారిన్ మరుగుపరచాడు.

జాతుల సమస్యపై బుఖారిన్, ప్యాటకోవ్‌ల బోల్షివిక్ వ్యతిరేక భావాలనుకూడా లెనిన్ ఖండించాడు. జాతులను

స్వయంనిర్ణయహక్కును ఇచ్చే క్లాజును కార్యక్రమంలో చేర్చ రాదని వారన్నారు. జాతుల సమాన స్వాతంత్ర్యానికి కూడా వారు వ్యతిరేకులే. ఈ నినాదం శ్రామికవర్గ విప్లవ విజయాన్ని కుంటుపరచుతుందని, వివిధజాతుల శ్రామికులలో ఐక్యతను భంగం కలుగజేస్తుందని వారు వాదించారు. బుఖారిన్, ప్యాటకోవ్‌లు వెల్లడించిన వినాశకరమైన ఈ సామ్రాజ్యవాద జాతీయ దురహంకార భావాలను లెనిన్ ఖండించి ఓడించాడు.

8 వ కాంగ్రెస్ చర్చలు ఎక్కువభాగం మధ్యతరగతి రైతుల ఎడల అవలంబించవలసిన వైఖరిని గురించి జరిగాయి. భూమివిషయమై ప్రభుత్వంచేసినచట్టంవల్ల మధ్యతరగతి రైతుల సంఖ్య క్రమంగా పెరిగింది. ఇపుడు రైతు జనాభాలో మెజారిటీ వారిదే. పెట్టుబడిదారీ వర్గానికీ శ్రామికవర్గానికీ మధ్య ఊగిసలాడే మధ్యతరగతి రైతుల ప్రవర్తనా, వైఖరి, అంతర్యుద్ధగతిని సోషలిస్టు నిర్మాణ భవిష్యత్‌ను నిర్ణయించుటలో అత్యంత ప్రాముఖ్యత వహించాయి. మధ్యతరగతి రైతు ఏటువైపుకు ఊగుతాడు అనే విషయంపైన ఎక్కువగా అంతర్యుద్ధ ఫలితం ఆధారపడియుంది. శ్రామికవర్గమూ లేక పెట్టుబడిదారీవర్గమూ ఏ వర్గం అతని సహకారాన్ని పొందుతుంది అన్న విషయంపైన ఇది ఆధారపడివుంది. 1918 వేసవిలో వాల్గా ప్రాంతంలో సోవియట్ అధికారాన్ని జెకోస్లావాక్‌లు, వైట్‌గార్డులు, కులక్‌లు, సోషలిస్టు - రివల్యూషనరీలు, మెన్షివిక్కులు కూలద్రోయగలిగారు. దీనికి కారణం మధ్యతరగతి రైతుల్లో ఎక్కువభాగం వారిని బలపరచడమే. మధ్యరష్యాలో కులక్‌లు లేవదీసిన తిరుగుబాట్ల విషయంలోగూడ ఇదే జరిగింది. కాని 1918 ఆకురాలుకాలంలో మధ్యతరగతి రైతుల్లో అధిక

భాగం సోవియట్ ప్రభుత్వంవైపుకు మొగ్గ నారంభించారు. విప్లవ విద్రోహుల (Whites) విజయాల వెనువెంటనే భూస్వాముల అధికారం పునరుద్ధరింపబడుతూంది. రైతుల భూమిని లాగివేస్తున్నారు. రైతులను దోపిడిచేసి చిత్రవధ, కొరడా దెబ్బలకు గురిచేస్తున్నారు. ఈ విషయాలను రైతులు గుర్తించారు. కులక్‌లను అణచివేసిన బీదరైతుల కమిటీల కార్యకలాపాలు కూడా రైతులవైఖరి మారడానికి సహాయ పడ్డాయి. ఇందుచేతనే 1918 నవంబరులో లెనిన్ ఈ క్రింది నినాదాన్నిచ్చాడు:

"కులక్‌లతో మనం సాగించే పోరాటాన్ని ఒక్క-క్షణం కూడా పరిత్యజించవద్దు. బీదరైతుపైననే గట్టిగా ఆధారపడండి. మనం మధ్యతరగతి రైతుతో ఒడంబడిక చేసుకోనటం నేర్చు కోండి." (లెనిన్, కలెక్టెడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్, 23 వ వాల్యూమ్, 294 వ పేజీ).

మధ్యతరగతి రైతులు ఊగిసలాడటం పూర్తిగా మాని వేయని మాట నిజమే. కాని వారు సోవియట్ ప్రభుత్వానికి సన్నిహితులై, దాన్ని ఇదివరకుకన్నా నిశ్చితంగా బలపరచ సాగారు. మధ్యతరగతి రైతులఎడ అవలంబించ వలసిన విధా నాలగురించి పార్టీ ఎనిమిదవ కాంగ్రెస్ చేసిన నిర్ణయాలు ఇందుకు చాల తోడ్పడ్డాయి.

మధ్యతరగతి రైతులయెడ పార్టీ అవలంబించుతున్న విధానంలో నూతనఘట్టాన్ని ఈ కాంగ్రెస్ ప్రవేశపెట్టింది. లెనిన్ రిపోర్టూ, కాంగ్రెస్ నిర్ణయాలు ఈ సమస్యపై పార్టీ ఒకకొత్త పోకడను అవలంబించేటట్లు చేశాయి. మధ్యతరగతి రైతులకు, కులక్‌లకు గల విభిన్నతను, తేడాను ఖచ్చింగా

గుర్తించాలని కాంగ్రెస్ కోరింది. అలా గుర్తించి వారి అవస రాలపట్ల ఎక్కువశ్రద్ధ వహించుటద్వారా మధ్యతరగతి రైతు లను కార్మికవర్గంవైపు ఆకర్షించుటకు ప్రయత్నించాలని, పార్టీ సంస్థలను, కమ్యూనిస్టు లందరిని కాంగ్రెస్ కోరింది. మధ్యతరగతి రైతుల వెనుకబడ్డ స్వభావాన్ని నిర్బంధం, బలాత్కారము ద్వారాకాక నచ్చచెప్పుటద్వారా పోగొట్టాలి. గ్రామ సీమల్లో సోషలిస్టు చర్యలను అమలుపరచినపుడు నిర్బంధాన్ని ఉపయోగించ కూడదని కాంగ్రెస్ సూచించింది. (కమ్యూన్లను స్థాపించుట, వ్యవసాయ సంఘాలనుస్థాపించుట మొదలగు విషయాలలో) మధ్యతరగతి రైతుయొక్క ప్రధాన ప్రయోజనాలకు సంబంధించిన అన్ని విషయాలలోను, అతనితో ఒక ఆచరణయోగ్యమైన ఒడంబడికకు రావాలి. సోషలిస్టు మార్పులను అమలు పరచుటకు అవలంబించవలసిన పద్ధతుల విషయంలో వారికి కొన్ని సౌకర్యాలు ఈయాలి. మధ్యతరగతి రైతాంగంతో స్థిరమైన ఐక్యతా విధానాన్ని కాంగ్రెస్ నిర్ణయించింది. ఈ ఐక్యతలో నాయకపాత్ర శ్రామిక వర్గానికే వుంటుంది.

ఎనిమిదవ కాంగ్రెస్‌లో మధ్యతరగతి రైతుఎడ అవలంబింప వలసిన కొత్త విధానాన్ని గురించి లెనిన్ ఇలా చెప్పాడు: శ్రామికవర్గం బీదరైతుపై ఆధారపడాలి. మధ్యతరగతి రైతుతో నిలకడగల మైత్రిని కొనసాగించాలి. కులకులతో పోరాడాలి. ఎనిమిదవ కాంగ్రెస్‌కు ముందు పార్టీ సాధారణవిధానం మధ్యతరగతి రైతులను తటస్థపరచటం. దీని అర్థం మామూలుగా కులక్‌తోను, పెట్టుబడిదారుతోను మధ్యతరగతి

రైతు చేరకుండా అడ్డుపెట్టటానికి పార్టీ ప్రయత్నించడం. కాని ఇప్పుడు అదిచాలదు. మధ్యతరగతిరైతును తటస్థపరచే విధానంమాని, వైట్ గార్డులను, విదేశదురాక్రమణను వ్యతిరేకంగా పోరాడే నిమిత్తం, సోషలిజాన్ని విజయవంతంగా నిర్మించే నిమిత్తం, మధ్యతరగతిరైతుతో స్థిరమైన ఐక్యతను ఏర్పరచుకొనే విధానాన్ని ఎనిమిదవ కాంగ్రెస్ అవలంబించింది.

రైతాంగంలో అధిక సంఖ్యాకులైన మధ్యతరగతి రైతులయెడ కాంగ్రెస్ అవలంబించిన విధానం: విదేశ దురాక్రమణదారులు, వారితోత్తులైన వైట్‌గార్డులు సాగించిన అంతర్యుద్ధంలో విజయం పొందటానికి నిశ్చితపాత్ర వహించింది. 1919 ఆకురాలుకాలంలో సోవియట్‌ప్రభుత్వాన్నా? డెనికిన్‌నా? ఎవరిని బలపర్చాలనే సమస్య వచ్చింది. అపుడు రైతులు సోవియట్లనే బలపర్చారు. తత్ఫలితంగా శ్రామికవర్గనియంతృత్వం అత్యంత ప్రమాదకరమైన శత్రువును నాశనం చేయ గలిగింది.

కాంగ్రెస్‌చర్యలలో రెడార్మీ నిర్మాణానికి సంబంధించిన సమస్యలకు ప్రత్యేకస్థానం లభించింది. "సైనికప్రతిపక్షం" అనేది ఒకటి రంగంలోకి వచ్చింది. "తీవ్రవాద కమ్యూనిస్టుల" ముఠా చిందరవందరైపోగా, దానిలోని పూర్వపుసభ్యులే ఇప్పుడీ"సైనికపక్షం"లో చేరారు. అయితే దీనిలో ఇదివరకెన్నడూ పార్టీని ఎదిరించని పార్టీ వర్కర్లుకూడా చేరారు. దీనికికారణం సైనికవ్యవహారాలను నిర్వహించుటలో ట్రాట్స్కీ అవలంబించిన మార్గంపట్ల వీరు అసంతృప్తులై వుండటం. సైన్యంలోనుండి వచ్చిన ప్రతినిధులలో అధికసంఖ్యాకులు

ట్రాట్స్కీపట్ల స్పష్టమైన వ్యతిరేకతను చూపారు. పూర్వపు జారుసైన్యంలో నిపుణులైనవారిని అతడు పూజించడం వారసహ్యించుకొన్నారు. ఆ నిపుణులలో కొందరు అంతర్యుద్ధంలో మనకు పూర్తిగా ద్రోహంచేస్తున్నారుకూడ. సైన్యంలో వయోవృద్ధులైన బోల్షివిక్కు సభ్యులపట్ల అతను పొగరుబోతుతనంగా ప్రతికూలవైఖరిని చూపించటం ఈ ప్రతినిధులు అసహ్యించుకొన్నారు. ట్రాట్స్కీ చేసిన "పనుల"కు అనేక ఉదాహరణలను కాంగ్రెస్‌లో తెలియపర్చారు. ఉదాహరణకు అతనికి కోపం తెప్పించిన నేరానికిగాను యుద్ధరంగంలో పని చేస్తున్న ముఖ్యమైన సైనిక కమ్యూనిస్టులను అనేకమందిని కాల్చివేయటానికి ప్రయత్నించాడు. ఇది శత్రువువలలో తిన్నగా పడిపోవటమే. సెంట్రల్ కమిటీ జోక్యం కలుగజేసుకోవడం వల్లా, సైనికులు అసమ్మతి తెలియజేయటంవల్లా, ఈకామ్రేడ్ల ప్రాణాలు రక్షించబడ్డాయి.

పార్టీయొక్క సైనిక విధానానికి ట్రాట్స్కీ గావించిన వక్రభాష్యాన్ని ఎదిరించినప్పటికీ అనేక సైనిక నిర్మాణ విషయాలలో "సైనిక ప్రతిపక్షాని"కి తప్పుడు అభిప్రాయాలు ఉన్నాయి. వీరు గెరిల్లా పోరాట అవశేషాలనే యింకా పట్టుకొని వేలాడుతూ వచ్చారు. ఒక క్రమబద్ధమైన రెడ్‌ఆర్మీని నిర్మించడాన్ని వీరు వ్యతిరేకించారు. పాత సైన్యంలోని సైనిక నిపుణులను ఉపయోగించుకో వీలులేదన్నారు. ఏ ఉక్కు క్రమశిక్షణ లేకుండా సైన్యం నిజమైన సైన్యమని పిలిపించుకోదో, ఆ క్రమశిక్షణ అవసరంలేదని వీరన్నారు. లెనిన్, స్టాలిన్‌లు వీరిని తీవ్రంగా ఎదిరించారు. కామ్రేడ్ స్టాలిన్ "సైనిక ప్రతి

పక్షాన్ని" గట్టిగా ఖండించి ఒక కఠినమైన క్రమశిక్షణతో కూడిన నిజమైన సైన్యాన్ని నిర్మించాలని కోరాడు.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"మనం ఖచ్చితమైన క్రమశిక్షణతో గూడిన సైన్యాన్ని, నిజమైన కార్మిక కర్షక సైన్యాన్ని - ప్రధానంగా రైతాంగ సైన్యాన్ని నిర్మించుకొని సోవియట్ రిపబ్లిక్‌ను రక్షించుకో నైనా రక్షించుకోవాలి, లేదా నాశనమైనా కావాలి". "సైనిక ప్రతిపక్షం" చేసిన అనేక సూచనలను తిరస్కరించుతూనే, కాంగ్రెస్ ట్రాట్స్కీపై దెబ్బకొట్టింది. కేంద్ర సైనిక సంస్థల పనిలో అభివృద్ధిని తీసుకురావాలని, సైన్యంలో కమ్యూనిస్టుల పాత్రను వృద్ధిచేయాలని కాంగ్రెస్ కోరింది.

కాంగ్రెసులో ఒక సైనిక ఉపసంఘం నియమింప బడింది. దాని కృషి ఫలితంగా సైనిక సమస్యపైన తీర్మానం ఏకగ్రీవంగా అంగీకరించబడింది.

ఈ నిర్ణయ ఫలితంగా రెడార్మీ బలపడింది. అది పార్టీక మరింత సన్నిహితమయింది.

కాంగ్రెస్ ఇంకా పార్టీ సమస్యలను, సోవియట్ వ్యవ హారాలను, సోవియట్లలో పార్టీ నాయకపాత్రను చర్చించింది. ఈ చివరి సమస్యపై చర్చ జరుగుతున్నప్పుడు సోవియట్ల పనిని పార్టీ నడపగూడదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చిన సాప్రోనావ్-ఓసిన్‌స్కీ ముఠా అవకాశవాద భావాలను కాంగ్రెస్ ఖండించింది.

పార్టీలో కొత్త సభ్యులు గుంపులు గుంపు లుగా చేరుతున్నారు. అందుచే పార్టీ అంగనిర్మాణాన్ని

Social composition) అభివృద్ధిచేయుటకు కొన్ని చర్యలను కాంగ్రెస్ సూచించింది. పార్టీసభ్యులు తిరిగి తమ సభ్యత్వాన్ని నమోదు చేయించుకోవాలని నిర్ణయించింది.

ఈ విధంగా పార్టీలో మొట్టమొదటిసారి వడపోత (Purge) ప్రారంభమైంది.

# 3

విదేశ దురాక్రమణ విస్తరించుట- సోవియట్ దేశంపై దిగ్బంధనం- కోల్‌చాక్ దండయాత్ర - దాని ఓటమి - డెనికిన్ దండయాత్ర- దాని ఓటమి-మూడు నెలల విశ్రాంతి-పార్టీ తొమ్మిదవ కాంగ్రెస్

మిత్రమండలి రాజ్యాలు జర్మనీ, ఆస్ట్రియాలను ఓడించిన తరువాత సోవియట్‌పైన బ్రహ్మాండమైన సైనికశక్తులను దుమికించటానికి నిశ్చయించాయి. జర్మనీ ఓడిపోయి యుక్రెయిన్, ట్రాన్స్ కాకేషియాల నుండి తన సైన్యాలను ఉపసంహరించుకొన్నపిదప, దాని స్థానాన్ని బ్రిటిష్, ఫ్రెంచి సైన్యాలు ఆక్రమించాయి. బ్రిటన్, ఫ్రాన్సులు తమ నౌకాదళాలను నల్లసముద్రానికి పంపాయి. ఒడెస్సా, ట్రాన్స్ కాకేషియాలలో తమ సైన్యాలను దింపాయి. ఆక్రమిత ప్రాంతాలలో కార్మికులను, రైతులను మొత్తం, గుంపులు గుంపులుగానే కాల్చివేయటంలో వారు వెనుకంజవేయలేదు. దురా

క్రమణచేసే మిత్రమండలి సైన్యాల పసుత్వం అంత తీవ్రంగా వుంది. వారి క్రూరత్వాలు చివరకు ఎంతస్థితికి పోయాయంటే, టర్కీస్థాన్ను ఆక్రమించుకొన్న తరువాత, బాకూలోని బోల్షివిక్కు ప్రముఖులను 2 ంగురిని ట్రాన్స్ కాస్పియన్ ప్రాంతానికి తీసుకొనివెళ్ళి సోషలిస్టు - రివల్యూషనరీల సహాయంతో క్రూరంగా కాల్చివేశారు. కాల్చబడినవారిలో కామ్రేడ్సు షౌమ్యాను, ఫియోలిటావ్, జపారిడ్జి, మాలిజన్, అజీజ్ బెకావ్, కోర్గనావ్ మొదలైనవారున్నారు.

త్వరలోనే విదేశ దురాక్రమణ దారులు రష్యాపై దిగ్బంధనం ప్రకటించారు. బయటిప్రపంచంతో సముద్ర మార్గాలు, ఇతర రవాణా మార్గాలు తెగగొట్టివేశారు.

సోవియట్ దేశం దాదాపు అన్ని ప్రక్కలా చుట్టుముట్టివేయబడింది.

సైబీరియాలోని ఓమ్స్క్లో తమ తొత్తులయిన అడ్మిరల్ కోల్చాక్పై మిత్రమండలిదేశాలు తమ ఆశలు పెట్టుకొన్నాయి. "రష్యా సర్వం సహాధికారిగా" అతనిని పేర్కొని దేశంలోని అభివృద్ధి నిరోధక శక్తులన్నీ అతని నాయకత్వాన్ని తమంతను తామే అంగీకరించాయి.

ఆ విధంగా తూర్పురంగం ముఖ్యయుద్ధ రంగంగా మారింది.

1919 వసంతకాలంలో కోల్చాక్ పెద్ద సైన్యాన్ని సమీకరించుకొని దాదాపు వాల్గా నదీ తీరానికి చేరాడు. అప్పుడు తను బోల్షివిక్కు సైన్యాలను అతన్ని ఎదిరించటానికి పంపారు. కమ్యూనిస్టు యువజనసమితి సభ్యులు, కార్మికులు

సమీకరించబడ్డారు. 1919 ఏప్రిల్‌లో కోల్‌చాక్ సైన్యం రెడ్‌ఆర్మీ చేతిలో తీవ్రపరాజయాన్ని పొందింది. తూర్పు రంగంలోను త్వరలోనే తిరోగమించ ప్రారంభించింది.

"తూర్పురంగంలో రెడ్‌ఆర్మీ పురోగమనం బాగా ముమ్మరంగా వున్నపుడు, ట్రాట్స్కీ అనుమానాస్పదమైన ఒక పథకాన్ని సూచించాడు. యురల్స్‌వరకు పోకముందే రెడ్‌ఆర్మీ పురోగమనాన్ని మానివేయాలని, కోల్‌చాక్ సైన్యాన్ని తరిమికొట్టటాన్ని ఆపివేయాలని, తూర్పురంగంనుండి దక్షిణ రంగానికి సైన్యాలను మార్చాలని, అతను సూచించాడు. కాని కోల్‌చాక్ చేతులలో యురల్స్‌ను, సైబీరియాను విడిచి పెట్టరాదని పార్టీ సెంట్రల్ కమిటీ పూర్తిగా గ్రహించింది. ఎందుచేతనంటే అక్కడ బ్రిటిష్, జపాన్ సామ్రాజ్యవాదుల సహాయంతో అతను తిరిగి కోలుకొని తన పూర్వస్థానాన్ని మరల సంపాదించుకోవచ్చు. ఇందుచే పార్టీ ట్రాట్స్కీ పథకాన్ని తిరస్కరించి పురోగమనాన్ని కొనసాగించవలసినదిగా వుత్తరువు లిచ్చింది. దీనితో ట్రాట్స్కీ విభేదించి రాజీనామా నిచ్చాడు. కాని సెంట్రల్ కమిటీ రాజీనామాను అంగీకరించలేదు. దీనితోపాటు తూర్పురంగ యుద్ధనిర్వహణలో అతడు పాల్గొనరాదని వెంటనే ఆజ్ఞాపించింది. ఇదివరకెన్నడూ లేని అత్యంత ఉత్సాహంతో కోల్‌చాక్‌పై రెడ్‌ఆర్మీ దాడి సాగించి తరిమి వేసింది. కోల్‌చాక్ అనేక నూతన అపజయాలను పొందేటట్లు చేసింది. వైట్ల (విప్లవ ద్రోహుల) ఆధిపత్యంక్రింద వున్న యురల్స్‌ను, సైబీరియాను విముక్తి చేసింది. ఈ తిరుగుదాడిలో రెడ్‌ఆర్మీకి బలోపేతమైన గెరిల్లా ఉద్యమం, వైట్ల వెనుక భాగంలో సహాయం చేసింది.

1919 వేసవిలో వాయువ్య దిశలో (బాల్టిక్ దేశాలలో పెట్రోగ్రాడ్ సమీపంలో) విప్లవ ప్రతీఘాతకుల నాయకుడైన జనరల్ యూడెనిక్‌ను సామ్రాజ్యవాదులు పెట్రోగ్రాడ్ పై దాడిసల్పడానికి వినియోగించారు. తూర్పురంగంనుండి రెడార్మీ దృష్టిని మరలించే వుద్దేశ్యంతో ఈ పనిచేశారు. విప్లవ ప్రతీఘాతకులైన మాజీఉద్యోగుల ప్రచారానికిలోనై, పెట్రోగ్రాడ్ సమీపంలోని రెండు కోటలలోని సైన్యాలు సోవియట్ ప్రభుత్వంపై తిరుగుబాటు చేశాయి. ఇదేకాలంలో యుద్ధరంగ ప్రధాన కార్యాలయంలో విప్లవ ప్రతీఘాతక కుట్రఒకటి బయట పడింది. శత్రువు పెట్రోగ్రాడ్‌కు ప్రమాదం తెచ్చి పెట్టాడు. కాని సోవియట్ ప్రభుత్వం తీసుకొన్న చర్యల ఫలితంగా కార్మికుల, నావికుల సహాయంతో, తిరుగబడిన కోటల నుండి వైట్సును (విద్రోహులను) తుడిచిపెట్టి వేసింది. యూడెనిక్ సైన్యాలను ఓడించి ఇస్తోనియాలోకి తరిమివేసింది.

పెట్రోగ్రాడ్‌వద్ద యూడెనిక్‌ను ఓడించటంవల్ల కోల్‌చాక్‌తో తలపడటం సులభమైంది. 1919 సంవత్సరాంతానికి కోల్‌చాక్ సైన్యం పూర్తిగా ఓడిపోయింది. కోల్‌చాక్‌ను ఖైదీగా పట్టుకొన్నారు. ఇర్కుట్స్క్‌లోని విప్లవకమిటీ విధించిన శిక్ష ప్రకారం అతన్ని కాల్చివేశారు.

కోల్‌చాక్ కథ ఆ విధంగా అంతమయింది.

ఆ కాలంలో కోల్‌చాక్‌ను గురించి సైబీరియనులు వ్రాసిన ఒక పాట చాలా ప్రచారంలో వుండేది:

కోటు హాటు బూటుట
బ్రిటిష్ నాడివేసట
తళుకు తళుకు బిరుదట

ఫ్రెంచివాడి బిరుదట
రమ్యమైన చుట్టట
రంగు జపానుచుట్టట
కోల్చాకు ఆటట
కోల్చాకు గుండెట
రమ్యమైన పాటట టా...టా...టా,
కోటు హాటు బూటు
ఎగిరిపోయే సూటు
తళుకు తళుకు బిరుదులు
పనికిరాని బిరుదులు
రమ్యమైన చుట్ట
కాలిపోయె నంట
~~ఆడిపోయె నంతట~~
ఆగిపోయె నంతట టా...టా...టా.

సామ్రాజ్యవాదులఆశలనుకోల్ చాక్ నిరాశలుచేయటం వల్ల, సోవియట్ రిపబ్లిక్కుపై వారి దండయాత్రా పథకాన్ని మార్చుకొన్నారు. ఒడెస్సాలో దిగిన సేనలను ఉపసంహరించారు. సోవియట్ రిపబ్లిక్కు సైన్యంతో ఈ సేనలకు సంబంధ మేర్పడి వారి ద్వారా విప్లవ తత్వం వీరికి కూడ అంటుకొంది. తమ యజమానులైన సామ్రాజ్యవాదులపై ఈ సేనలు తిరుగబడసాగాయి. ఉదాహరణకు ఒడెస్సాలో యాంద్రీమార్టీ నాయకత్వాన ఫ్రెంచి నావికులు తిరుగబడ్డారు. కోల్ చాక్ ఓడిపోవటంవల్ల మిత్రమండలి తనదృష్టిని జనరల్ డెనికిన్ పై కేంద్రీకరించింది. ఇతడు కోర్నిలావ్ సహచరుడు. "వలంటీరు సైన్యాన్ని" సంఘటిత పర్చాడు.

ఆ సమయంలో డెనికిన్ సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా దక్షిణాన క్యూబాన్ ప్రాంతంలో యుద్ధం చేస్తున్నాడు. మిత్ర మండలి అతని సైన్యానికి విస్తారంగా మందుగుండు సామగ్రిని, ఆయుధాలను ఇచ్చి ఉత్తర దిశగా పంపింది.

ఇప్పుడు దక్షిణ రంగం ముఖ్యరంగంగా మారింది.

డెనికిన్ 1919 వేసవిలో సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తనముఖ్య దండయాత్రను ప్రారంభించాడు. ట్రాట్స్కీ దక్షిణరంగాన్ని విధ్వంసం చేశాడు. మన సైన్యాలు ఓటమి తరువాత ఓటమినిపొందాయి. అక్టోబరు నెలమధ్యలో శ్వేతులు(విద్రోహులు) యుక్రెయిన్‌ను అంతా పట్టుకున్నారు. ఓరెల్‌ను వశపర్చుకొన్నారు. మనసైన్యానికి మెషన్‌గన్‌లను, రైఫిళ్ళను, తుపాకిగుండ్లను సప్లయిచేస్తున్న 'తులా' నగరాన్ని సమీపించుతున్నారు. మరొకప్రక్క శ్వేతులు మాస్కోను సమీపించుతున్నారు. సోవియట్ రిపబ్లిక్ పరిస్థితి అత్యంత ప్రమాదకరంగా పరిణమించింది. ఈ ప్రమాదాన్ని తెలియపరచి ప్రతిఘటనకు పూనుకోవలసిందిగా పార్టీ ప్రజలను హెచ్చరించింది. "డెనికిన్‌పై పోరాటానికి సర్వస్వమూ ధారవోయాలి" అనే నినాదాన్ని లెనిన్ ఇచ్చాడు. బోల్షివిక్కులచే ఉత్సాహపూరితులైన కార్మికులు, రైతులు, శత్రువును నాశనం చేయటానికి తమ సర్వశక్తులను సమీకరించారు.

కామ్రేడ్సు స్టాలిన్, వరోషిలోవ్, ఆర్జోనికిడ్జె, బుడిన్నీలను డెనికిన్‌ను ఓడించే సన్నాహాలు చేయటానికి దక్షిణ రంగానికి సెంట్రల్‌కమిటీ పంపింది. దక్షిణరంగంలో రెడార్మీ సైనికచర్యలను నడపడానికి ఇదివరకు నియమితుడైన ట్రాట్స్కీ

ఆ పదవినుండి తొలగింపబడ్డాడు. కామ్రేడ్ స్టాలిన్ ఇక్కడకు రాకపూర్వం దక్షిణరంగ సైనికాధిపతులు ట్రాట్స్కీతో కలసి ఒక పథకం వేసుకొన్నారు. జారిట్సియన్ నుండి నోవోరోసిస్క్ దిక్కుగా డెనికిన్‌పై ప్రధానమైన దెబ్బకొట్టాలని వారి పథకం. ఇందుకు డాన్ మైదానంగుండా వెళ్ళాలసియుంటుంది. కాని యిక్కడ రోడ్లులేవు.

అంతేగాక ఆకాలంలో వైట్‌గార్డుల పలుకుబడికింద ఎక్కువగావున్న కోసక్‌లు ఈ ప్రాంతంలో నివసించేవారు. కామ్రేడ్ స్టాలిన్ ఈ పథకాన్ని తీవ్రంగా విమర్శించాడు. డెనికిన్‌ను ఓడించటానికి తాను మరొక పథకాన్ని సెంట్రల్ కమిటీకి సూచించాడు. దీనిప్రకారం ఖార్‌ఖోవ్-డానిడ్జిబేసిన్-రాస్తోవ్‌లగుండా ముఖ్యమైన దాడిని సాగించాలి. డెనికిన్‌పై మన సైన్యాలు త్వరితంగా పురోగమించటానికి ఈ పథకం సహాయపడుతుంది. ఎందుచేతనంటే మన సైన్యాలు కార్మిక వర్గమూ, రైతాంగమూ నివసించే ప్రదేశాలగుండా వెళ్తుంది. ప్రజలు బహిరంగంగా సానుభూతి చూపించుతారు. ఇంతేగాక ఈ ప్రాంతంలో రైల్వేరహదారులు దట్టంగా అల్లుకొని వున్నాయి. సైన్యాలకు కావలసిన వస్తువులన్నిటిని సక్రమంగా అందజేయటానికి ఇవి ఉపయోగిస్తాయి. ఇంతేగాక యీపథకం వల్ల డానిడ్జ్ బొగ్గుప్రాంతానికి విముక్తిగలిగి మన దేశానికి కావలసిన బొగ్గును సప్లయి చేయగలుగుతుంది.

పార్టీ సెంట్రల్‌కమిటీ కామ్రేడ్ స్టాలిన్ పథకాన్ని అంగీకరించింది. 1919 అక్టోబరు రెండవపక్షంలో భయంకరమైన ప్రతిఘటన సాగించినపిదప, ఓరెల్, వారోనెజ్‌లలో

జరిగిన నిర్ణయాత్మక యుద్ధాలలో రెడార్మీ చేతిలో డెనికిన్ ఓడిపోయాడు. అతను త్వరత్వరగా తిరోగమించసాగాడు. మన సేనలు వెన్నాడి తరుమగా దక్షిణానికి పారిపోయాడు. 1920 ప్రారంభంనాటికి యుక్రెయిను అంతా, ఉత్తరకాకసస్ అంతా వైట్లనుండి విముక్తి అయింది.

దక్షిణరంగంలో నిశ్చితపోరాటాలు సాగుతున్న సమయంలో సామ్రాజ్యవాదులు యుడెనిక్ సైన్యాలను పెట్రోగ్రాడ్ పైకి మరలించారు. ఇందులో వారి ఉద్దేశం, దక్షిణ రంగంలోని మనసేనల దృష్టిని మరల్చి, డెనికిన్ సైన్యపరిస్థితిని బాగుపర్చాలని వైట్‌లు పెట్రోగ్రాడ్ గుమ్మంలోకి సమీపించారు. విప్లవ ప్రధాననగరమైన పెట్రోగ్రాడ్ వీర శ్రామికులు తమ పట్టణరక్షణకు ఒక కోటగోడలా నిలబడ్డారు. ఎప్పటిలాగానే, కమ్యూనిస్టులు అగ్రశ్రేణిలో నిలిచారు. భయంకరయుద్ధం జరిగాక, వైట్‌లను ఓడించి మనదేశపు పొలిమేరల అవతలకు, ఇస్తోనియాలోకి తరిమారు.

అదీ డెనికిన్ అంతమొందిన విధానం.

కోల్‌చాక్, డెనికిన్‌ల ఓటమితరువాత కొద్దిపాటి వ్యవధి దొరికింది.

వైట్‌గార్డు సైన్యాలు ఓడిపోయాయి. సామ్రాజ్యవాదుల సాయుధ దురాక్రమణ విఫలంచెందింది. దేశమంతటా సోవియట్ల ప్రభుత్వం తన పరిస్థితిని స్థిరపరచుకొంటున్నది. సోవియట్ రిపబ్లిక్‌పై సాయుధ దురాక్రమణకు వ్యతిరేకంగా, పశ్చిమ యూరప్‌లో కార్మికుల క్రోధాగ్ని పెంపొందుతూవుంది. ఇవన్నీ చూచి సామ్రాజ్యవాదులు సోవియట్‌ప్రభుత్వం

పట్ల తమ వైఖరిని మార్చుకోసాగారు. 1920 జనవరిలో బ్రిటన్, ఫ్రాన్స్, ఇటలీలు సోవియట్‌పై దిగ్బంధాన్ని సడలింప నిశ్చయించాయి.

దురాక్రమణ యుద్ధంద్వారా జరిగిన దిగ్బంధంలో ఇది చాల ముఖ్యమైన బీట.

దీని అర్థం, సోవియట్ ప్రభుత్వంపై దురాక్రమణ, అంతర్యుద్ధమూ ముగిసిందనికాదు. సామ్రాజ్యవాద పోలెండు దాడి సల్పే ప్రమాదం ఇంకా వుండనేవుంది. దురాక్రమణ శక్తులను ఇంకా నిశ్శేషంగా దూర ప్రాచ్యంనుండి, ట్రాన్స్ కాకేషియానుండి, క్రిమియానుండి పారద్రోలలేదు. కాని సోవియట్ రష్యాకు తాత్కాలికంగా ఊపిరి పీల్చుకొనేందుకు అవకాశం లభించి ఆర్థికాభివృద్ధికి తన శక్తులను మరల్చుకోడానికి వీలుకలిగింది. పార్టీ యిప్పుడు ఆర్థిక సమస్యలవైపు దృష్టిని మరల్చ గలిగింది.

అంతర్యుద్ధ కాలంలో మిల్లులు, ఫ్యాక్టరీలు మూసి వేయటం ఫలితంగా అనేకమంది నిపుణులైన కార్మికులు పరిశ్రమలను వదలివేశారు. వారిని తిరిగి పరిశ్రమలకు రప్పించి, తమతమ వృత్తులలో కార్మికులు పనిచేసేటట్లు పార్టీ కృషి చేసింది. రైలుమార్గాలు చాల విషమపరిస్థితిలో వున్నాయి. అనేక వేలమంది కమ్యూనిస్టులు రైల్వేమార్గాలను పునరుద్ధరించటానికి నియమించబడ్డారు. ఇది జరగని పక్షంలో, ముఖ్యమైన పరిశ్రమల పునరుద్ధరణా కార్యక్రమం నామమాత్రంగానే జరుగుతుంది. ఆహారపదార్థాల సరఫరా నిర్మాణయుతంగా అభివృద్ధిచేయబడి విస్తరించబడింది. రష్యాలోని విద్యుచ్ఛక్తి

వ్యాప్తికి ఒక పథకం తయారైంది. దాదాపు యాభై లక్షల మంది రెడార్మీసైనికులు సైన్యంలో వున్నారు. యుద్ధప్రమాదం వల్ల వారిని యిండ్లకు పంపడం సాధ్యంకాలేదు. అందుచేత రెడార్మీలో కొంతభాగాన్ని కార్మిక సేనలుగా మార్చి ఆర్థిక రంగంలో ఉపయోగించారు. కార్మిక కర్షక సంరక్షణ సమితిని (Council of Workers and Peasents defence ఉత్పత్తి రక్షణాల సమితిగా (Council of Labour and defence) మార్చారు. దీనికి సహాయపడుటకు ప్రభుత్వ ప్లానింగుకమిషను ఒకటి (గోస్ప్లాన్-Gosplan) ఏర్పడింది.

పార్టీ 9వ కాంగ్రెసు సమావేశమయ్యేసరికి పరిస్థితిఅది.

1920 మార్చి నెలాఖరులో కాంగ్రెస్ సమావేశమైంది. దీనికి 6 లక్షల 11 వేల 978 పార్టీ సభ్యులకు ప్రాతినిధ్యం వహించిన ప్రతినిధులువచ్చారు. వోటింగుహక్కు గలిగిన ప్రతినిధులు 554 మంది, చర్చించే హక్కుగలిగి వోటు లేకుండావున్న ప్రతినిధులు 162 మంది వచ్చారు.

రవాణా సౌకర్యాలు, పరిశ్రమల విషయంలో దేశం నిర్వహించవలసిన తక్షణకర్తవ్యాలను కాంగ్రెస్ నిర్వచించింది. ముఖ్యంగా కార్మికసంఘాలు ఆర్థికజీవిత నిర్మాణంలో పాల్గొనవలసిన ఆవశ్యకతను కాంగ్రెస్ నొక్కి చెప్పింది.

రైల్వేలు, బొగ్గు, ఇనుము, ఉక్కు-పరిశ్రమలు పునరుద్ధరించవలసిన ఏకైక ఆర్థిక ప్రణాళికకు కాంగ్రెస్ ప్రధానస్థానమిచ్చి ప్రత్యేకశ్రద్ధ వహించింది. ఈప్రణాళికలో ప్రధానాంశం, దేశాన్ని విద్యుచ్ఛక్తిమయంచేయటం. "వచ్చే పది లేక ఇరవై సంవత్సరాల వరకు ఇది గొప్ప కార్యక్రమం" అని లెనిన్

అన్నాడు. రష్యాను విద్యుచ్ఛక్తిమయం చేసే ప్రభుత్వ ఉప సంఘంయొక్క ప్రఖ్యాత పథకానికి (G. O. E. L. R. O) ఇది ప్రాతిపదిక అయింది. దీనిలో చేసిన అంచనాలు ఇప్పు డెన్నోరెట్లు మించిపోయాయి.

"డెమాక్రటిక్ సెంట్రలిజం గ్రూపు" అంటూ ఒక పార్టీ వ్యతిరేక ముఠా బయలుదేరింది. వారు ఒకే వ్యక్తితో కూడిన పారిశ్రామిక నిర్వహణను ఎదిరించారు. పారిశ్రామిక డైరెక్టరుకు సంపూర్ణ బాధ్యతను యీయడాన్ని ఎదిరించారు. పరిశ్రమలలో "అనేక వ్యక్తుల నిర్వహణ" (Group management) ఎట్టి నిర్బంధాలు లేకుండా కావాలని కోరారు. ఈ పద్ధతిప్రకారం పరిశ్రమల నిర్వహణకు ఏ వ్యక్తి స్వయంగా బాధ్యుడు కాడు. కాంగ్రెస్ వీరి అభిప్రాయాలను తోసి వేసింది. పైనచెప్పిన పార్టీవ్యతిరేక ముఠాలో, శాప్రనోవ్, ఓసిన్‌స్కీ, వి. స్మిర్‌నోవ్ అనువారలు ముఖ్యులు. వారిని కాంగ్రెస్‌లో రైకోవ్, టామ్‌స్కీలు బలపర్చారు.

# 4

## సోవియట్ రష్యాపై పోలిష్‌భూస్వాములదాడి- జనరల్ రాంగెల్ దండయాత్ర-పోలిష్ పథకం విఫల మగుట-రాంగెల్ పలాయనం-దురాక్రమణ అంతమగుట

**కో**ల్‌చాక్, డెనికిన్‌ల దండయాత్ర ఓడిపోయింది. ఉత్తరప్రాంతం, టర్కీస్థాన్, సైబీరియా, డాన్‌ప్రాంతం,

యుక్రేయిన్ మొదలగు ప్రదేశాలనుండి దురాక్రమణ సైన్యాలను, వైట్లను తుడిచిపెట్టి నెమ్మదిగా తన ప్రదేశాన్ని తిరిగి సోవియట్ రిపబ్లిక్కు కైవశం చేసుకుంటూంది. రష్యాపై దిగ్బంధనాన్ని మిత్రమండలి ప్రభుత్వాలు తొలగింప వలసి వచ్చింది. అయినప్పటికీ సోవియట్ ప్రభుత్వం అభేద్యమనీ, సోవియట్ విజయం పొందిందనీ వారు అంగీకరించటానికి యిష్టపడలేదు. అందుచే సోవియట్ రష్యాపై మరొక దురాక్రమణ ప్రయత్నం చేయనిశ్చయించుకొన్నారు. ఈసారి విప్లవ ప్రతీఘాతక బూర్జువా జాతీయ వాదియూ, పోలిష్ ప్రభుత్వానికి ఏకైకఅధిపతియూ అయిన పిల్సూడ్స్కీనూ,జనరల్ రాంగెల్ నూ ఉపయోగించుకో దలచారు. జనరల్ రాంగెల్, క్రిమియాలో డెనికిన్ సైన్యంలోని అవశేషాలను ప్రోగుచేసి అక్కడనుండి డొనెజ్జిబేసిన్‌ను, యుక్రేయిన్‌ను ఆక్రమించ ప్రయత్నిస్తున్నాడు.

లెనిన్ చెప్పినట్లు, అంతర్జాతీయ సామ్రాజ్యవాద కబంధుని రెండుహస్తాలు- అనగా పోలిష్ భూస్వాములముఠా, రాంగెల్ - సోవియట్‌రష్యా గొంతును నులుమ ప్రయత్నించాయి.

నీపర్‌కు పశ్చిమంగా సోవియట్‌యుక్రేయిన్‌ను పట్టుకొని, సోవియట్ బైలోరష్యాను ఆక్రమించుకొని, ఈప్రాంతాలలో పోలిష్ పారిశ్రామిక యజమానుల అధికారాన్ని పునరుద్ధరించడం పోలిష్‌వారి పథకం. "సముద్రంనుండి సముద్రంవరకు" అనగా డాన్జిగ్‌నుండి ఒడెస్సావరకు పోలిష్ రాజ్యసరిహద్దులను విస్తరింపజేయాలని వారు ఆశించారు. రాంగెల్ తమకుచేసిన

సహాయానికి బదులుగా, రెడార్మీని ఓడించుటలో తాము అతనికి సహాయపడ దలచారు. సోవియట్ రష్యాలో భూస్వాములు, పెట్టుబడిదారుల అధికారాన్ని పునరుద్ధరింప దలచారు.

ఈ పథకాన్ని మిత్రమండలి ప్రభుత్వాలు ఆమోదించాయి.

యుద్ధాన్ని తప్పించి శాంతిని కాపాడే ఉద్దేశ్యంతో పోలెండుతో రాయబారాలు జరపటానికి సోవియట్ ప్రభుత్వం చేసిన ప్రయత్నాలు విఫల మయ్యాయి.

పిల్సూడ్‌స్కీ, సంధిని గురించి చర్చించనిరాకరించాడు. అతడు యుద్ధాన్ని కోరాడు. కోల్‌చాక్ డెనికిన్‌లతోసాగించిన పోరాటాలలో అలసిపోయిన రెడార్మీకి, పోలిష్ సైన్యాల దాడిని తట్టుకొనే సామర్థ్యం లేదని అతడు అంచనా వేశాడు.

ఊపిరి పీల్చుకొనే కాలావ్యవధికూడ అంతమైపోయింది.

1920 ఏప్రిల్‌లో పోలిష్ సైన్యాలు సోవియట్ యుక్రెయిన్‌పై దాడిచేసి కీవ్‌ను ఆక్రమించాయి. అదే సమయంలో రాంగెల్, తీవ్రమైన దాడిని (Offensive) ప్రారంభించి డానెడ్జ్ బేసిన్‌కు ప్రమాదం కలిగించాడు.

దీనికి జవాబుగా పోలిష్ సైన్యాలపై యుద్ధరంగమంతటా రెడార్మీ తిరుగుదాడిని ప్రారంభించింది. కీవ్‌ను తిరిగి వశపర్చుకొంది. యుక్రెయిన్, బైలో రష్యాలనుండి పోలిష్ యుద్ధ ప్రభువులను తరిమివేసింది. రెడార్మీ మహోగ్ర పురోగమనంద్వారా, దక్షిణరంగంలో, గెలిషియాలోని లోవ్ నగర గుమ్మంలోకి వచ్చేసింది. పశ్చిమరంగంలో రెడార్మీ సైనికులు

వార్సా సమీపిస్తున్నారు. పోలిష్ సైన్యాలు పూర్తి పరాజయం చెందే పరిస్థితిలో వున్నాయి.

కాని ట్రాట్స్కీయొక్క, రెడార్మీ ప్రధానకార్యాలయంలోని అతని అనుచరులయొక్క సందేహాస్పదమైన చర్యలవల్ల ఈ విజయం భంగపడింది. ట్రాట్స్కీ, తుఖాచవస్కీల తప్పువల్ల పశ్చిమరంగంలో వార్సావైపుకు సాగుతున్న రెడార్మీ పురోగమనం, కేవలం నిర్మాణ రాహిత్య పద్ధతిని కొనసాగింది. తాము జయించిన స్థానాలను స్థిరపరచుకొనే అవకాశం సైన్యాలను ఈయలేదు. పురోగమించుతున్న దళాలు చాల ముందుకు నడుపబడ్డాయి. అదనపుసేనలు, వారికి కావలసిన మందుగుండు సామగ్రీ, వెనుభాగంలో చాలదూరాన వుండిపోయాయి. దీని ఫలితంగా పురోగమించుతున్నదళాలకు మందుగుండు సామగ్రీ, అదనపు సేనల సహాయమూ లేకుండాపోయింది. యుద్ధరంగం పరిమితిలేకుండా విస్తరించింది. ఇందువల్ల శత్రువులు యుద్ధరంగంలో గండికొట్టటం సులభం చేసింది. పశ్చిమరంగంలో ఒక ప్రదేశంలో కొద్దిమంది పోలిష్ సైనికులు గండికొట్టగానే, మనసైన్యాలు మందుగుండు సామగ్రి లేకపోవటంచే తిరోగమింపవలసి వచ్చింది. దక్షిణరంగంలో లోవ్‌నగర గుమ్మంచేరి పోలిష్‌వారిపై రెడార్మీ తీవ్రమైన వత్తిడిచేస్తూంది. అలాంటి సమయంలో "విప్లవసమితి అధ్యక్షుని" హోదాకే అపఖ్యాతి తెచ్చిన ట్రాట్స్కీ లోవ్ నగరాన్ని పట్టుకొనడాన్ని నిషేధించాడు. దక్షిణరంగంలో ముఖ్య సైనిక భాగమైన ఆశ్విక దళాన్ని చాలా దూరానవున్న ఈశాన్యరంగానికి బదిలీచేశాడు. ఇది పశ్చిమరంగానికి సహాయమనే సాకుతో చేశాడు. కాని, నిజానికి పశ్చిమరంగానికి సహాయం చేసే సాధ్యమైన సరియైన

ఒకేఒక మార్గం, లోవ్ నగరాన్ని పట్టుకొనుటయే అని గ్రహించుట ఏమంత కష్టమైన పనిగాదు. దక్షిణరంగంనుంచి మన సాయుధ సైన్యాలను వెనక్కు పిలవడం, లోవ్ నగరాన్ని వదలివేయడం, ఈ రెండింటివల్లా దక్షిణరంగంలోని మన సైన్యాలు పూర్తిగా తిరోగమించినట్లే అయింది. ట్రాట్స్కీ జారీచేసిన విధ్వంసకరమైన, ఉత్తరువు ఫలితంగా దక్షిణరంగం లోని మనసైన్యాలు అగ్రహితమైన కేవలం అసమర్ధనీయమైన తిరోగమనానికి పాల్పడవలసి వచ్చింది. పోలిష్ భూస్వాములు ఇందు కెంతో సంతోషించారు.

ఇది పశ్చిమరంగానికి సహాయం చేయకపోయినా, వాస్తవికంగా పోలిష్ భూస్వాములకూ, మిత్రమండలికీ ప్రత్యక్ష సహాయాన్ని చేసింది.

కొద్దిరోజులలోనే పోలిష్ సైన్యాల పురోగమనం ఆపివేయబడింది. మనసైన్యాలు కొత్తగా తిరుగుదాడి చేయ టానికి సన్నాహాలు చేయ నారంభించాయి. కాని యుద్ధాన్ని కొనసాగించే సామర్థ్యంలేక, రెడార్మీ తిరుగుదాడి చేసేసూచన లను బేజారెత్తిపోయి, పోలెండ్, నీపర్ నదికి పశ్చిమానవున్న యుక్రెయిన్ ప్రాంతంపైనా, బైలోరష్యాపైనా తన కోర్కెలను వదులుకొని సంధిచేసుకోడానికి ఇష్టపడింది. 1920 అక్టోబరు 20 వ తేదీన రీగా ఒడంబడిక జరిగింది. ఈ ఒడంబడిక ప్రకారం పోలెండ్, గెలీషియాను, బైలోరష్యాలో కొంతభాగాన్ని తన కింద వుంచుకొంది.

పోలెండుతో సంధిచేసుకున్న పిదప సోవియట్ రిప బ్లిక్ రాంగెల్‌ను హతమార్చ పూనుకొంది. బ్రిటిష్, ఫ్రెంచి

సామ్రాజ్యవాదులు అతనికి తుపాకులు, రైఫిళ్ళు, కవచ శక టాలు, టాంకులు, విమానాలు, ఆధునిక ఆయుధసామగ్రి సప్లైచేశారు. అతనికింద వైట్‌గార్డు ఉన్నత-రెజిమెంట్లున్నాయి. ఈ రెజిమెంట్లలో అందరూ ముఖ్యంగా ఉద్యోగులే. కాని తన సేనలను దింపిన క్యూబాన్, డాన్ ప్రాంతాలలో రాంగెల్‌కు రైతుల, కోసక్‌ల సహాయం తగినంతగా రాలేదు. అయినప్ప టికి డానెడ్జ్‌బేసిన్ గుమ్మంలోకి చొచ్చుకొనివచ్చి మన బొగ్గు గనుల ప్రదేశానికి రాంగెల్ ప్రమాదం కల్గించాడు. అప్పుడు రెడార్మీ ఎక్కువగా డస్సిపోయివున్నందున సోవియట్ ప్రభుత్వ పరిస్థితి మరింత క్లిష్టమైంది. అత్యంత కష్టపరిస్థితులలో మన సైన్యాలు పురోగమించవలసివచ్చింది. రాంగెల్‌పై దాడి సాగించుతూనే అతనికి సహాయపడుతున్న మాఖోవ్ యొక్క అరాచకవాద గుంపులను కూడ నాశనంచేయవలసివచ్చింది. సాంకేతిక సామగ్రిలో రాంగెల్‌కు ఆధిక్యత వున్నప్పటికీ, రెడార్మీకి టాంకులు లేకపోయినప్పటికీ, అది రాంగెల్‌ను క్రిమియన్ ద్వీపకల్పంలోకి తరిమి అక్కడ చక్రబంధంచేసింది. 1920 నవంబరులో ఎర్రసైనికులు పెరికోప్ కోటను పట్టుకొని క్రిమియాలోకి జైత్రయాత్ర సాగించారు. రాంగెల్ సైనికులను ఓడించి ఆ ద్వీపకల్పంలోని వైట్‌గార్డులను, దురాక్రమణ సైన్యాలను తుడిచిపెట్టివేశారు. క్రిమియా తిరిగి సోవియట్ భూభాగంలో చేరింది.

పోలిష్ సామ్రాజ్యవాదుల పథకాలు విఫలంచెందడం, రాంగెల్ ఓడిపోవడంతో విదేశదురాక్రమణ దశ అంతమైంది.

1920 సంవత్సరాంతంలో ట్రాన్స్‌కాకేషియావిమోచన ప్రారంభమైంది. బూర్జువా జాతీయవాదులగు ముసావటిస్టుల

జాతీయవాదులనుండి జార్జియా, డాష్నక్‌ల నుండి ఆర్మీనియా విముక్తి చెందాయి. అజర్‌బైజాన్, ఆర్మీనియా, జార్జియాలలో సోవియట్ ప్రభుత్వం విజయం పొందింది.

దీని అర్థం విదేశ దురాక్రమణ పూర్తిగా అంతమైందని కాదు. దూరప్రాచ్యంలో జపానీయుల దురాక్రమణ 1922వరకు ఉండనే వుంది. ఇంతేగాక దురాక్రమణకు కొత్త ప్రయత్నాలు జరిగాయి. (తూర్పున అటమాన్ సెమ్యోనావ్, బారన్ అంజరన్ అనువారలూ, 1921లో కరేలియాలో ఫిన్నిష్ వైట్లు దురాక్రమణకు ప్రయత్నాలు చేశారు)కాని సోవియట్ దేశ ముఖ్య శత్రువులు, దురాక్రమణకు పూనుకొన్న ముఖ్య శక్తులు 1920 సంవత్సరాంతానికి ఓడింపబడ్డాయి.

సోవియట్లకు వ్యతిరేకంగా రష్యన్ వైట్‌గార్డులు, విదేశ దురాక్రమణదారులు సాగించిన యుద్ధంలో సోవియట్లు విజయం పొందాయి.

సోవియట్ రిపబ్లిక్ తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నిలబెట్టుకొంది. విదేశీ సైనిక దురాక్రమణా, అంతర్యుద్ధమూ ముగిశాయి.

సోవియట్ ప్రభుత్వానికి యిది చరిత్రాత్మక విజయం.

# 5

బ్రిటిష్ - ఫ్రెంచి - జపానీస్ - పోలిష్ ప్రభుత్వాల సమిష్టి సైన్యాల దురాక్రమణను, రష్యాలో పెట్టుబడిదార్ల, భూస్వాముల, వైట్‌గార్డుల విప్లవప్రతీఘాతాన్ని సోవియట్ రిపబ్లిక్ ఎలా, ఎందుకు ఓడించగలిగింది ?

దురాక్రమణ కాలంలో యూరప్‌లోను, అమెరికాలోను వెలువడిన ముఖ్యదినపత్రికలను, ఇతర పత్రికలను మనం పరిశీలించి నట్లయితే, ఒక్క విషయం కన్పడుతుంది. సోవియట్ ప్రభుత్వం విజయం పొందుతుందని నమ్మిన సైనిక నిపుణులుగాని, సైనిక లేక పౌరప్రముఖ రచయితలుగాని ఒక్కరుకూడా లేరని తెలుస్తుంది. పైగా అన్నిదేశాల, అన్నిజాతుల విప్లవ చరిత్రకారులు, సైనిక నిపుణులు, ప్రముఖ రచయితలు, మహా పండితులమను కొనేవారు, సోవియట్ల రోజులు దగ్గరపడ్డాయనీ, వాటి ఓటమి తప్పనిసరి అని ఏకగ్రీవంగా ప్రకటించారు.

సోవియట్ రష్యాకు సంఘటిత సైన్యంలేదు. యుద్ధాగ్ని జ్వాలలమధ్య రెడార్మీని సృష్టించుకోవాలి. దురాక్రమణ దారులకు, వైట్‌గార్డులకు దాదాపు సన్నద్ధమైన సైన్యం చేతిలోవుంది. ఈ విషయాలను జూచి వారు దురాక్రమణ శక్తుల విజయం తథ్యమని భావించారు.

ఇంతేకాక వారి అంచనాకు యీక్రింది విషయాలు కూడ తోడ్పడ్డాయి. రెడార్మీకి అనుభవజ్ఞులైన సైనిక నాయకులు లేరు. అలాంటి అనుభవంగలవారిలో అధికసంఖ్యాకులు విప్లవ ప్రతీఘాతకుల పక్షం చేరారు. దురాక్రమణదారులకు, వైట్‌గార్డులకు అలాంటి వాళ్లున్నారు.

ఇంతేగాదు. రష్యా యుద్ధ పరిశ్రమలు చాల వెనుకబడి వున్నాయి. తగినన్ని ఆయుధాలు, మందుగుండు సామగ్రిలేక రెడార్మీ బాధపడుతూ వుంది. ఉన్న ఆయుధాలు, సామగ్రి చూద్దామా అంటే అవి చాల నాసిరకం. పోనీ విదేశాలనుండి తెప్పించుకొందామా అంటే గాలికూడ చొరనీయకుండా రష్యాను అన్నివైపులా దిగ్బంధనం చేశారు. ఇక దురాక్రమణదారులకు, వైట్‌గార్డులకు జోలెడంత సప్లయి లుండేవి. మొదటిరకం ఆయుధాలు, మందుగుండు సామగ్రి, యితర పరికరాలు నిరంతరం సప్లయి అవుతూ వుండేవి.

మరొక విషయం కూడా వుంది. రష్యాలో అన్నిటి కన్నా సారవంతమైన ఆహారపదార్థాలు పండే ప్రాంతాలను వైట్‌గార్డుల, దురాక్రమణదారుల సైన్యం ఆక్రమించింది. రెడార్మీకి అలాంటి ప్రదేశాలు లేవు. ఆహారపదార్థాల కొరతతో అది బాధపడుతూ వుంది.

రెడార్మీకి ఈ యిబ్బందులు, కొరతలు వున్నమాట నిజమే.

ఈ విషయంలో - ఈ ఒక్క విషయంలో మాత్రమే - దురాక్రమణదారులైన పెద్దమనుష్యుల అంచనా పూర్తిగా సరియైనదే.

అలాంటి తీవ్రమైన బలహీనత లున్నప్పటికీ, ఇవిలేని దురాక్రమణదారుల, వైట్‌గార్డుల సైన్యాన్ని రెడార్మీ ఎలా ఓడించగలిగింది? ఈ విషయం ఎలా వివరించవచ్చు? ఇందుకు జవాబు చూద్దాం.

(1) దేనికోసం రెడార్మీ పోరాడుతూ వుందో ఆ సోవియట్ ప్రభుత్వ విధానం సరియైన విధానం. అది ప్రజల ప్రయోజనాలకు అనుగుణ్యంగా వుంది. అది సరియైన విధానమని, తమ స్వంత విధానమే యని ప్రజలు అర్థంచేసుకొని గ్రహించి నిర్నిబంధంగా బలపరచారు. అందుచే రెడార్మీ విజయం పొందింది.

తప్పుడు విధానంకై, ప్రజలు బలపర్చని విధానంకై పోరాడే సైన్యం విజయం పొందజాలదని బోల్షివిక్కులకు తెలుసు. దురాక్రమణదారుల, వైట్‌గార్డుల సైన్యం అలాంటి సైన్యం. అనుభవంగల కమాండరులు, మొదటి రకం ఆయుధాలు, మందుగుండు సామగ్రి, ఇతర పరికరాలు, ఆహార పదార్థాలు — ఒకటేమిటి అన్నీ – ఆ సైన్యానికున్నాయి. కాని దానికి లేనిదల్లా ఒకటే. రష్యా ప్రజల సహాయ సానుభూతులు. ప్రజలకు విరుద్ధమైన విధానం కాబట్టి దురాక్రమణదారుల, వైట్‌గార్డు "పరిపాలకుల" విధానాన్ని రష్యన్ ప్రజలు బలపరచలేకపోయారు. బలపరచరు కూడాను. అందుచే దురాక్రమణదారుల, వైట్‌గార్డుల సైన్యం ఓడిపోయింది.

(2) రెడార్మీ, ప్రజలపట్ల పూర్తి భక్తివిశ్వాసాలతో వుంది. అందుచే ప్రజలు దానిని ప్రేమించి బలపరిచారు. దానిని తమస్వంత సైన్యంగా భావించారు. అందుచేత రెడార్మీ విజయం

పొందింది. రెడార్మీ ప్రజల బిడ్డ. నిజమైనపుత్రుడు తనతల్లి పట్ల ఎలా విశ్వాసవంతంగావుంటాడో అలాగే అదిప్రజలపట్లవిశ్వాస వంతంగావుంది. అలాంటిసైన్యానికి ప్రజల అండ వుంటుంది. అది విజయం పొందక తప్పదు. తన ప్రజలకు వ్యతిరేకంగా పోయే సైన్యం ఓడిపోక తప్పదు.

(3) యుద్ధరంగ అవుసరాలను తీర్చటానికి యుద్ధశ్రేణి వెలుపలనున్న ప్రదేశాన్నంతా, దేశాన్నంతా సోవియట్ ప్రభుత్వం సమీకరించగలిగింది. కాబట్టి రెడార్మీవిజయం పొందింది. యుద్ధశ్రేణిని బలపర్చే పౌరభాగం లేనట్లయితే సైన్యం అన్ని విధాల ఓడిపోకతప్పదు. బోల్షివిక్కులకిది తెలుసు. అందుచేతనే వారు సైన్యానికి ఆయుధాలను, మందుగుండు సామగ్రిని, యితర పరికరాలను, ఆహారపదార్థాలను, అదనపు బలాలను సప్లయిచేయుటకుగాను దేశాన్ని ఒక సాయుధ శిబిరంగా మార్చారు.

(4) రెడార్మీ జయించటానికి కారణాలు : (ఎ) యుద్ధ లక్ష్యాలను ఉద్దేశాలను రెడార్మీ సైనికులు అర్థం చేసుకొన్నారు. ఆ యుద్ధ లక్ష్యాలూ, ఉద్దేశాలు న్యాయమైనవని గుర్తించారు. (బి) యుద్ధ లక్ష్యాలు, ఉద్దేశాలు న్యాయమైనవని వారు గుర్తించటంవల్ల వారి క్రమశిక్షణా, పోరాట సామర్థ్యమూ బలపడ్డాయి. (సి) తత్ఫలితంగా శత్రువుపై సాగించిన యుద్ధంలో కనీ వినీ ఎరుగని ఆత్మత్యాగం, ఇదివర కెన్నడూ చూడని ప్రజా శౌర్యమూ రెడార్మీ చివరికంటా ప్రదర్శించింది.

(5) యుద్ధరంగంలోను, వెనుభాగంలోను రెడార్మీకి నాయకత్వం బోల్షివిక్కు పార్టీది. అది ఐక్యతతోను, క్రమ శిక్షణతోను బాగా దిట్టపడింది. విప్లవ భావంలోను, సమిష్టి ఆశయానికి ఎట్టి త్యాగాలనైనా చేయటానికి సంసిద్ధతచూపుట లోను అది చాలా బలంగా వుంది. లక్షలాది ప్రజలను సంఘటితపరచి, క్లిష్టపరిస్థితులలో వారిని సరిగా నడుపుటలో ఇతరు లెవరికీ లేని సామర్థ్యం దానికి వుంది. అందుచేతనే రెడార్మీ విజయవంతమైంది.

లెనిన్ ఇలా అన్నాడు :

"పార్టీకి మెలకువ, కఠినమైన క్రమశిక్షణా వున్నాయి. పార్టీ నాయకత్వం అన్ని ప్రభుత్వ శాఖలను, వ్యవస్థలను ఐక్య పరచింది; సెంట్రల్ కమిటీఇచ్చిన నినాదాలను పదుల, వందల, వేల, తుదకు లక్షల ప్రజలు ఒక్కమనిషిలాగా అనుసరించారు. ప్రజలు నమ్మశక్యంగాని, అపారత్యాగాలను చేశారు. ఈ అన్నికారణాల వలనా ఈ అద్భుత సంఘటన (విజయం) సాధ్య మయింది. వాస్తవంగా జరిగింది కూడా. మిత్రమండలి సామ్రాజ్య దేశాలూ, యావత్తు ప్రపంచమూ ఒకటికి రెండు సార్లు, మూడుసార్లు చివరకు నాలుసార్లు కూడా తిరిగి తిరిగి దండయాత్రలు సాగించినప్పటికీ మనం జయించ గలిగాం." (లెనిన్, సెలెక్టెడ్ వర్క్స్, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో, 1947, 2వ వాల్యూం, 556 వ పేజీ)

(6) రెడార్మీ విజయం పొందటానికి కారణమేమంటే : (ఎ) రెడార్మీ తన సామాన్య సైనికులనుండి, ఫ్రుంజ్, వారో షిలోవ్, బుడిన్నీ మొదలగు కొత్తరకపు సేనాధిపతులను

సృష్టించ గలిగింది. (బి) ప్రజలలోనుండి కొటొవ్‌స్కీ, చాపయెవ్, లాజో, షోర్స్, పార్ఖోమెంకో మొదలుగాగల చాకచక్యంగల వీరులు రెడార్మీలో పోరాడారు. (సి) రెడార్మీని రాజకీయంగా తయారుచేసే బాధ్యత లెనిన్, స్టాలిన్, మోలటొవ్, కాలినిన్, స్వెర్డ్‌లొవ్, కగనోవిచ్, ఆర్జోనికిడ్జె, కిరోవ్, క్వైబిషెవ్, మికోయాన్, జదనోవ్, యాండ్రియాచ్, పెట్రోవ్‌స్కీ, యరోస్లావ్‌స్కీ, జర్ఝున్స్కీ, షాడెంకో, మెఖ్లిస్, క్రుష్‌చేవ్, ష్వెర్నిక్, షిర్యటొవ్ మొదలగువారి చేతుల్లో వుంది. (డి) రెడార్మీలో ప్రముఖమైన ప్రచారకులు, నిర్మాతలు సైనిక కమిసార్లుగా (అధిపతులు) వున్నారు. వీరు రెడార్మీని దృఢంగా ఐక్యపరచారు. వారిలో క్రమశిక్షణా భావాన్ని, సైనిక సాహస తత్వాన్ని నూరిపోశారు. కొంతమంది సైనికాధిపతుల విద్రోహ చర్యలను శక్తివంతంగా త్వరగా అప్రమత్తతతో మొగ్గలోనే త్రుంచివేశారు. మరొకప్రక్క సోవియట్ అధికారంపట్ల తమ విశ్వాసాన్ని ప్రదర్శించి రుజువు చేసుకొన్న ప్రసిద్ధ సేనాధిపతులను, రెడార్మీ దళాలను దృఢహస్తంతో నడుప సామర్థ్యంగలవారినే - వారు పార్టీకి చెందినా చెందకపోయినా - రెడార్మీ బలపరచింది. ధైర్యంగాను. నిశ్చింతగాను - వారిపేరు ప్రతిష్ఠలను బలపరచింది.

"సైనిక కమీసార్లు లేకుండా మనకు రెడార్మీ ఏర్పడేది కాదు." అని లెనిన్ అన్నాడు.

(7) వైట్ గార్డుల సైన్యాలవెనుక, కోల్‌చాక్, డెనికిన్, క్రాస్‌నోవ్, రాంగెల్ మొదలగువారి యుద్ధశ్రేణుల వెనుక, రహస్యంగా అనేకమంది పార్టీ సభ్యులూ ఇతరులూ, బోల్షి

విస్తృతంగా అత్యద్భుతంగా పనిచేశారు. దురాక్రమణదారుల పైనా, వైట్‌గార్డులపైనా కార్మికులను, రైతులను తిరుగుబాటు చేయించారు. సోవియట్ ప్రభుత్వ శత్రువుల వెనుభాగాన్ని కుంటుపడజేశారు. ఆ విధంగా రెడార్మీ పురోగమనాన్ని సులభంచేశారు. యుక్రెయిన్, సైబీరియా, దూర ప్రాచ్యం, యురల్సు, బైలోరష్యా, వాల్గా ప్రాంతాలలో గెరిల్లాలు దురాక్రమణదారుల, వైట్‌గార్డుల వెనుభాగాన్ని కూలద్రోసి రెడార్మీకి అమూల్యమైన సేవను చేశారని ప్రతి వారికీ తెలుసును. ఈ కారణాలన్నింటివల్లా రెడార్మీ విజయం పొందింది.

(8) విప్లవ ప్రతీఘాతక వైట్‌గార్డులకు విదేశీ దురాక్రమణ దారులకు వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో సోవియట్ రిపబ్లిక్ ఒంటరిగాలేదు. సోవియట్‌చేసే పోరాటానికి, దాని విజయాలకు యావత్ ప్రపంచ శ్రామికుల సానుభూతి సహాయాలున్నాయి. అందుచేతనే రెడార్మీ విజయవంతం కాగలిగింది. సోవియట్ రిపబ్లిక్కుపై దాడిచేసి దిగ్బంధనం గావించి దాని గొంతు నులుమటానికి సామ్రాజ్యవాదులు ప్రయత్నించారు. అదే సమయంలో సామ్రాజ్యవాద దేశాలలోని కార్మికులు సోవియట్ల పక్షమునుండి వాటికి సహాయం చేశారు. సోవియట్ రిపబ్లిక్‌యొక్క శత్రుదేశాలలోని పెట్టుబడిదార్లకు వ్యతిరేకంగా వారు సాగించిన పోరాటం సోవియట్‌కు సహాయపడింది. తుదకు సామ్రాజ్యవాదులు తమ దాడిని ఉపసంహరించుకోవలసి వచ్చింది. బ్రిటన్, ఫ్రాన్సు మొదలుగాగల దురాక్రమణ దేశాలలోని కార్మికులు సమ్మెలూ

చేశారు. దురాక్రమణ దారులకు, వైట్‌గార్డు సేనానులకు ఉద్దేశించబడిన ఆయుధాలను ఓడలకు, రైళ్ళకు ఎక్కించ నిరాకరించారు. "రష్యానుండి వైదొలగండి," అన్న నినాదంతో పనిచేసే పోరాట సమితులను ఏర్పరచారు.

లెనిన్ ఇలా వ్రాశాడు:

"అంతర్జాతీయ పెట్టుబడిదారీవర్గం మనపై చేయి ఎత్తింది. కాని ఆయా దేశాల కార్మికులే ఆ చేయిని పట్టుకొని దించివేశారు." (లెనిన్ కలెక్టెడ్ వర్క్సు, రష్యన్ ఎడిషన్, 25 వ వాల్యూమ్, 405 వ పేజీ.)

## క్లుప్త సారాంశం

అక్టోబరు విప్లవంచే పరాజితులైన భూస్వాములు, పెట్టుబడిదార్లు, వైట్‌గార్డ్ సేనానులతోను, మిత్రమండలి విదేశాల ప్రభుత్వాలతోను కలసి తమ దేశానికి వ్యతిరేకంగా కుట్రజేశారు. తమ మాతృదేశ ప్రయోజనాలకు వ్యతిరేకంగా సోవియట్ భూమిపై సాయుధ దాడి చేయించి, సోవియట్ అధికారాన్ని కూలద్రోయాలని ప్రయత్నించారు. మిత్ర రాజ్యాలు సైనిక దురాక్రమణ చేయుటకూ, రష్యా సరిహద్దు ప్రాంతంలో తిరుగుబాట్లు రావడానికి యిదే ప్రాతిపదికయింది. దీని ఫలితంగా ఆహార పదార్థాలకు, ముడిపదార్థాలకు కేంద్రాలయిన ప్రదేశాలనుండి రష్యా వేరుచేయబడింది.

జర్మనీ సైనికంగా ఓడిపోవటం, యూరప్‌లో రెండు సామ్రాజ్యవాద కూటాలమధ్య యుద్ధం అంతమొందటం,

మిత్రమండలి బలపడటానికి కారణమైంది. మిత్రమండలి సోవియట్‌పై తన దురాక్రమణను మరింత తీవ్రం జేసింది. సోవియట్ రష్యాకు మరికొన్ని చిక్కులు కల్పింపబడ్డాయి.

మరోకప్రక్క జర్మనీలో విప్లవమూ, యూరప్ దేశాలలో ప్రారంభమౌతున్న విప్లవోద్యమమూ, సోవియట్ ప్రభుత్వానికి అంతర్జాతీయ పరిస్థితులు అనుకూలంగా వుండేటట్లు చేశాయి. సోవియట్ రిపబ్లిక్ పరిస్థితి కొంత సులువైంది.

విదేశ దురాక్రమణదారులకు వ్యతిరేకంగా, పెట్టుబడిదారీ భూస్వామ్య వైట్‌గార్డులకు వ్యతిరేకంగా, మాతృదేశ సంరక్షణా యుద్ధానికి కార్మికులను, రైతులను బోల్షివిక్కు పార్టీ ఉత్తేజపరచింది. మిత్రమండలి కీలుబొమ్మలైన కోల్‌చాక్, యూడెనిక్, డెనికిన్, క్రాస్‌నోవ్, రాంగెల్‌లను ఒకరితరువాత ఒకరిని సోవియట్ రిపబ్లికూ, దాని రెడార్మీ ఓడించాయి. యుక్రెయిన్, బైలోరష్యాలనుండి మిత్రమండలి మరొక కీలుబొమ్మయిన పిలూడ్‌స్కీని తరిమివేశాయి. ఆ విధంగా విదేశ దురాక్రమణ శక్తులను ఓడించి దేశంనుండి బయటికి తరిమివేశాయి.

అంతర్జాతీయ పెట్టుబడిదారీవర్గం సోషలిస్టు దేశంపై సాగించిన మొట్టమొదటి సాయుధదాడి ఆ విధంగా పూర్తిగా విఫలమయింది.

దురాక్రమణ యుద్ధకాలంలో విప్లవంచే ఇదివరకు ఓడింపబడిన పార్టీలు-సోషలిస్టు రివల్యూషనరీలు, మెన్షివిక్కులు అరాచకవాదులు, జాతీయవాదులు (సంకుచిత) - వైట్‌గార్డు సేనానులను, దురాక్రమణదారులను బలపరచారు. సోవియట్

రిపబ్లిక్‌కు వ్యతిరేకంగా విప్లవ ప్రతీఘాతుక కుట్రలు సాగించారు. సోవియట్ నాయకులపై హత్యాకాండకు పూను కొన్నారు. అక్టోబరు విప్లవానికి పూర్వం కార్మికవర్గంలో కొంతవరకు పలుకుబడి కలిగిన యీ పార్టీలు, అంతర్యుద్ధ కాలంలో, విప్లవ ప్రతీఘాత పార్టీలుగా ప్రజాసామాన్యం కళ్ళముందు పూర్తిగా బట్టబయలయ్యాయి. అంతర్యుద్ధ కాలం లోను, దురాక్రమణ యుద్ధకాలంలోను ఈ పార్టీలు రాజకీయంగా పతనం చెందాయి. సోవియట్ రష్యాలో కమ్యూనిస్టుపార్టీ అంతిమవిజయం పొందింది.

# తొమ్మిదవ అధ్యాయం

## శాంతియుత ఆర్థిక పునరుద్ధరణ కార్యకలాపానికి పరివర్తన చెందే దశలో బోల్షివిక్ పార్టీ

[ 1921—25 ]

## దురాక్రమణ యుద్ధం ఓడిపోయిన పిదప, అంతర్యుద్ధం ముగిసిన పిదప సోవియట్ రిపబ్లిక్ పునరుద్ధరణా కాలంలోని చిక్కులు

యుద్ధాన్ని అంతమొందించినపిదప సోవియట్ రిపబ్లిక్ శాంతియుత ఆర్థికాభివృద్ధి కార్యక్రమానికి మరలింది. యుద్ధపు గాయాలను నయంచేసుకోవలసియుంది. విచ్ఛిన్నమైన దేశ ఆర్థిక జీవితాన్ని పునర్నిర్మించుకోవలసియుంది. పరిశ్రమలను, రైల్వేలను, వ్యవసాయాన్ని పునరుద్ధరించవలసియుంది. కాని యీ శాంతియుత అభివృద్ధి కార్యకలాపాలను చాల కష్టమైన పరిస్థితులలో చేయవలసి వచ్చింది. అంతర్యుద్ధంలో విజయం సులభంగావచ్చిందికాదు. నాలుగేండ్ల సామ్రాజ్యవాద యుద్ధం వల్లనూ, విదేశీ దురాక్రమణకు వ్యతిరేకంగా జరిపిన మూడేండ్ల యుద్ధంవల్లనూ దేశం శిధిలావస్థను వచ్చింది.

1920 లో మొత్తం వ్యవసాయ ఉత్పత్తి, యుద్ధానికి పూర్వం ఉత్పత్తిలో దాదాపు సగం మాత్రమే వుంది. దరిద్ర పీడిత గ్రామసీమలు గల్గిన జార్ కాలంలోని ఉత్పత్తిలో సగం మాత్రమే ఉంది. పరిస్థితులు మరీ అధ్వాన్నమయేందుకు

మరొక విషయం తోడ్పడింది. 1920 లో అనేక రాష్ట్రాలలో పంటలు పండలేదు. వ్యవసాయం మహాదుస్థితిలో వుంది.

ఇక పరిశ్రమలస్థితి యింకా అధ్వాన్నంగావుంది. పరిశ్రమలు పూర్తిగా ఛిన్నాభిన్నమైపోయాయి. 1920 లో పెద్ద పెద్ద పరిశ్రమలలోని ఉత్పత్తి, యుద్ధానికి పూర్వపు ఉత్పత్తిలో 7వ వంతుకు కొంచెం పైగావుంది. చాలవరకు మిల్లులు, ఫ్యాక్టరీలు మూతబడివున్నాయి. విధ్వంసకులు గనులను, బొగ్గు గనులనుధ్వంసంచేసి వాటిలోకి నీరు ప్రవహింపజేశారు. అన్నిటికన్నా ఇనుము, ఉక్కు పరిశ్రమల పరిస్థితి చాల అధ్వాన్నంగా వుంది. 1921 లో ముడి యినుము (Pig Iron) లక్షా 16 వేల మూడువందల టన్నులుమాత్రమే ఉత్పత్తిఅయింది. అంటే ఇది యుద్ధానికి పూర్వం ఉత్పత్తి అయిన దానిలో నూటికి మూడు పాళ్ళు మాత్రమే. బొగ్గు, వంట చెరుకు కూడా కొరతగానే వుంది. రవాణా విధ్వంసం చేయబడింది. దేశంలో లోహాల, బట్టల నిల్వ దాదాపు ఖర్చయిపోయింది. ముఖ్యావసరాలైన రొట్టె, క్రొవ్వు పదార్థాలు, మాంసము, చెప్పులు, బట్టలు, అగ్గిపెట్టెలు, ఉప్పు, కిరోసిన్, సబ్బు మొదలైన వస్తువులకు కూడా చాలాతీవ్రమైన కొరత ఏర్పడింది.

యుద్ధం జరుగుతున్న కాలంలో ప్రజలు ఈ కొరతను, కరువును, ఎలాగో సహించారు. ఒకొక్కప్పుడు మర్చిపోయారు కూడా. కాని యిప్పుడు యుద్ధం అయిపోయిన తోడనే హఠాత్తుగా యీ కొరత, కరువూ సహింపరానివని భావించసాగారు. వెంటనే యీ విషయంలో తగిన పరిష్కార మార్గాలను చూడాలని ఒత్తిడి చేశారు.

రైతులలో అసంతృప్తి తలయెత్తింది. అంతర్యుద్ధ జ్వాలలో కార్మికవర్గ, రైతాంగాల, సైనిక, రాజకీయ మైత్రి శాకలు తీరి పదునెక్కి ఐక్యమైంది. ఈ మైత్రి ఒక నిశ్చిత పునాదిపైన నిలబడింది. రైతులు సోవియట్ ప్రభుత్వం నుండి భూమిని పొందారు. భూస్వాములకు కులక్‌లకు వ్యతిరేకంగా రక్షణ పొందారు. మిగులు ధాన్యాన్ని వశపర్చుకొనే పద్ధతి క్రింద రైతులనుండి ఆహారపదార్థాలను కార్మికులు పొందారు. ఇదే ఆ పునాది.

ఇప్పుడు ఇక ఏ మాత్రం ఆ ప్రాతిపదిక సరిపోదు.

దేశరక్షణ అవసరాలకుగాను అదనపు ఉత్పత్తిని రైతుల నుండి అంతా సోవియట్ ప్రభుత్వం వశపరచుకొనక తప్పింది కాదు. ఈ పద్ధతి లేనిపక్షంలో, యుద్ధ కమ్యూనిజం అనే విధానం లేనిపక్షంలో, అంతర్యుద్ధంలో విజయం సాధ్యమయ్యేది కాదు. యుద్ధము, విదేశ దురాక్రమణవల్ల యీ విధానం అవలంబింపవలసి వచ్చింది. యుద్ధం కొనసాగుతున్నంత కాలం రైతాంగం అదనపు ఉత్పత్తిని ప్రభుత్వాధీనంచేసే పద్ధతికి సమ్మతించింది. వస్తువుల కొరతకు ఏమీ లెక్క చేయలేదు. కాని యుద్ధం ముగియగానే, భూస్వాములు తిరిగి వచ్చే ప్రమాదం ఇక ఏమాత్రం లేదని తెలియగానే, రైతులు అసమ్మతి తెలియజేయ ప్రారంభించారు. తమ అదనపు ధాన్యాలను ఇవ్వాలన్నా, అదనపు ఉత్పత్తిని ప్రభుత్వాధీనం చేసే పద్ధతి అన్నా, తమ అసమ్మతిని తెలియజేయ సాగారు. తమకు వస్తువులను తగినంతగా సప్లయిచేయాలని ఒత్తిడిచేయ సాగారు.

లెనిన్ పేర్కొన్నట్లు యుద్ధ కమ్యూనిస్టు విధానమంతా రైతుల ప్రయోజనాలతో ఢీకొంది.

అసంతృప్తి మన సత్వాం కార్మికవర్గానికికూడా వ్యాపించింది. శ్రామికవర్గం అంతర్యుద్ధంలో ముఖ్య భారాన్నంతా భరించింది. వైట్‌గార్డులలోను, విదేశమూకలతోను వీరోచితంగా స్వార్థత్యాగబుద్ధితో పోరాడింది. ఆర్థిక విధ్వంసం, కరువు రాక్షసి మొదలగువాటివల్ల కలిగిన వినాశకర పరిస్థితులనుకూడా ఎదుర్కొంది. అత్యంత వర్గ చైతన్యంతో స్వార్థత్యాగంతో క్రమశిక్షణతో నిగ్గుదేరిన కార్మికులు, సోషలిస్టు ఉత్సాహంతో నిండిపోయారు. కాని తీవ్రమైన ఆర్థిక విధ్వంసం కార్మికవర్గంలో గూడ తన ప్రభావాన్ని వ్యాపింపజేసింది. ఇంకా పనిచేస్తున్న కొద్ది ఫ్యాక్టరీలు, పరిశ్రమలు మధ్య మధ్య ఆగిపోతూ పని చేస్తున్నాయి. జీవితాధారంకోసం కార్మికులు చిల్లరపనులు చేసుకోవలసి వచ్చింది. సిగరెట్ లైటర్లు తయారుచేయటం గ్రామాలలో ఆహారపదార్థాలకోసం వస్తుమారక వ్యాపారం మొదలైనవి వారు చేయవలసివచ్చింది ("మూటలవ్యాపారం"). శ్రామికవర్గ నియంతృత్వంయొక్క వర్గపునాది బలహీనపడ జొచ్చింది. కార్మికులు చెల్లాచెదురు కాజొచ్చారు. గ్రామాలకు వెళ్ళి నివసింపసాగారు. వారు కార్మికులుగా ఉండక కార్మికవర్గ లక్షణాలను పోగొట్టుకొన ప్రారంభించారు. ఆకలివల్ల, అలసటవల్ల కార్మికుల్లో కొందరు అసంతృప్తి చిహ్నలను చూపించసాగారు.

దేశ ఆర్థిక జీవితానికి సంబంధించిన అన్ని సమస్యలపైన ఒక కొత్త విధానాన్ని, నూతన పరిస్థితులకు అనుగుణ్యమైన విధానాన్ని సూచించవలసిన అవసరం పార్టీని ఎదుర్కొంది.

ఆర్థికాభివృద్ధికి సంబంధించిన సమస్యలపై అలాంటి విధానాన్ని తయారుచేయడానికి పార్టీ పూనుకొంది.

కాని వర్గశత్రువు నిద్రపోవడంలేదు. ఆర్థిక దుస్థితిని, రైతుల అసంతృప్తిని తన స్వంత ప్రయోజనాలు సాధించుకొనేందుకు ఉపయోగించుకొన ప్రయత్నించాడు. వైట్ గార్డులు, సోషలిస్టు రివల్యూషనరీలు కుట్రపన్ని లేవనెత్తిన కులక్కుల తిరుగుబాట్లు, సైబీరియా, యుక్రెయిన్, టాంబోవ్ (యాంటనోవ్ తిరుగుబాటు) రాష్ట్రాలలో తలయెత్తాయి. అన్నిరకాల విప్లవ ప్రతీఘాత వ్యక్తులు - మెన్షివిక్కులు, సోషలిస్టు - రివల్యూషనరీలు, అరాచకవాదులు, వైట్‌గార్డులు, బూర్జువా జాతీయవాదులు - తిరిగి ఉత్సాహంతో పనిచేయ ప్రారంభించారు. సోవియట్ అధికారానికి వ్యతిరేకంగా జరిపే పోరాటంలో శత్రువు కొత్త ఎత్తుగడలను అవలంబించాడు. పూర్వంలాగా వ్యర్థమైపోయిన "సోవియట్లు నశించాలి!" అన్న నినాదం కాకుండా మరొక కొత్త నినాదాన్ని ప్రారంభించాడు. అది: "సోవియట్లను బలపర్చవలసిందే, కాని కమ్యూనిస్టు లందులో వుండరాదు" అని.

వర్గశత్రువు ఉపయోగించిన కొత్త ఎత్తుగడలకు స్పష్టమైన ఉదాహరణ ఒకటి, క్రాన్‌స్టాట్‌లో విప్లవ ప్రతీఘాతక సైనిక తిరుగుబాటు. 1921 మార్చిలో పార్టీ 10 వ కాంగ్రెస్ జరిగే సమయానికి ఒక వారం ముందు ఇది ప్రారంభమైంది. సోషలిస్టు - రివల్యూషనరీలతోను, మెన్షివిక్కులతోను, విదేశ ప్రభుత్వాల ప్రతినిధులతోను కూడి వైట్‌గార్డులు తిరుగుబాటుకు నాయకత్వం వహించారు. భూస్వాముల, పెట్టుబడి

దారుల ఆస్తిని, అధికారాన్ని పునరుద్ధరించే తమ ఉద్దేశ్యాన్ని కప్పిపుచ్చేందుకు "సోవియట్" నినాదం తిరుగుబాటుదారులు మొదట ఉపయోగించారు. "కమ్యూనిస్టులు లేని సోవియట్లు కావాలి" అనే నినాదాన్ని లేవనెత్తారు. మధ్యతరగతి ప్రజా సామాన్యంలో ఉన్న అసంతృప్తిని విప్లవ ప్రతిఘాతకులు కుహనా సోవియట్ నినాదంతో సోవియట్ల అధికారాన్ని కూలద్రోయటానికి ఉపయోగించుకోవాలని ప్రయత్నించారు.

క్రాన్‌స్టాట్ తిరుగుబాటు తలయెత్తటానికి రెండు పరిస్థితులు సహాయపడ్డాయి. నావికుల నిర్మాణంలో పరిస్థితి అధ్వాన్నమగుట, క్రాన్‌స్టాట్‌లో బోల్షివిక్కు నిర్మాణంయొక్క బలహీనత. అక్టోబరు విప్లవంలో పాల్గొన్న పూర్వపు నావికులంతా యుద్ధరంగంలో వున్నారు. రెడార్మీలో వుండి వారు వీరోచితంగా పోరాడుతున్నారు. వారి స్థానంలో కొత్తగా వచ్చిన ఈ నావికులు విప్లవంలో తరిఫీదును పొందలేదు. వీరంతా రైతులనుండి అప్పుడే వచ్చారు. అదనపు ఉత్పత్తి ప్రభుత్వాధీనం చేయాలనే పద్ధతి అంటే రైతాంగానికి గల అసంతృప్తినే వీరు తెలియజేశారు. క్రాన్‌స్టాట్‌లోని బోల్షివిక్కు నిర్మాణం బలహీనపడటానికి కారణం అక్కడనుండి యుద్ధరంగానికి అనేకసార్లు బోల్షివిక్కులను సమీకరించి పంపడమే. క్రాన్‌స్టాట్‌లో సోషలిస్టు - రివల్యూషనరీలు, మెన్షివిక్కులు, వైట్‌గార్డులు జొరబడటానికి, దానిని కైవశం చేసుకోటానికి యిందువల్ల వీలైంది.

తిరుగుబాటుదార్లు ఒకటోరకం కోటను, నౌకాదళాన్ని అనేక ఆయుధాలను, మందుగుండు సామగ్రిని వశపరచు

కొన్నారు. అంతర్జాతీయ విప్లవ ప్రతీఘాతకులు విజయాం పొందారు. కాని వారి ఆనందోత్సాహం తాత్కాలికమైనదే. సోవియట్ సైన్యాలు తిరుగుబాటును త్వరగా అణచివేశాయి. క్రాన్‌స్టాట్ తిరుగుబాటుదార్లను అణచటానికి, పార్టీ తన ఉత్తమోత్తమ పుత్రులను, 10 వ కాంగ్రెస్‌కు వచ్చిన ప్రతినిధులను కామ్రేడ్ వొరోషిలోవ్ నాయకత్వాన పంపింది. రెడార్మీ సైనికులు క్రాన్‌స్టాట్‌పైకి పల్చటి మంచుగడ్డతో నిండిన భూమిమీదుగా పురోగమించారు. మంచుగడ్డ కరిగి అనేకచోట్ల చాలమంది మునిగిపోయారు. దాదాపు అభేద్యమైన క్రాన్‌స్టాట్ కోటలను ముట్టడించి వశపరచుకొన్నారు. విప్లవంపట్ల విశ్వాసం, ధైర్యం, సోవియట్లకోసం ప్రాణాలర్పించటానికి సంసిద్ధత, ఇవే ఆనాడు విజయం పొందటానికి కారణాలు. ఎర్రసేనల దెబ్బకు క్రాన్‌స్టాట్‌కోట పడిపోయింది. క్రాన్‌స్టాట్ తిరుగుబాటు అణచివేయబడింది.

## 2

కార్మికసంఘాలను గురించి పార్టీ చర్చ - పార్టీ పదవ కాంగ్రెస్ - ప్రతిపక్షుల ఓటమి - నూతన ఆర్థిక విధానాన్ని ఆమోదించుట

పార్టీ సెంట్రల్ కమిటీ, దానిలో అధికసంఖ్యాకులైన లెనినిస్టులు యుద్ధం ముగిసిందనీ, దేశం శాంతియుత ఆర్థికాభివృద్ధి కార్యక్రమానికి మరలిందని స్పష్టంగా గ్రహించారు.

యుద్ధ ఫలితంగాను, దిగ్బంధన ఫలితంగాను పుట్టిన యుద్ధ కమ్యూనిజంయొక్క కఠిన ప్రభుత్వాన్ని యింకా నిలబెట్టవలసిన అవసరం ఏమాత్రం లేదని వారు గ్రహించారు.

అదనపు ఉత్పత్తి ప్రభుత్వ అధీనంచేసే పద్ధతియొక్క అవసరం చెల్లిపోయిందని సెంట్రల్ కమిటీ గ్రహించింది. దానిస్థానే వస్తురూపమైన పన్నును విధించాలనీ, తమ అదనపు ఉత్పత్తిలో ఎక్కువ భాగాన్ని తమ యిచ్ఛవచ్చినట్లు ఉపయోగించుకొనే అవకాశం రైతులకీయాలనీ, సెంట్రల్ కమిటీ గ్రహించింది. ఈ చర్యల ఫలితంగా వ్యవసాయం పునరుద్ధరించ వీలవుతుంది. ధాన్యపు పంట విస్తరించుతుంది. వ్యాపార పంటలను ఎక్కువ చేయవచ్చు. సరుకుల పంపిణి తిరిగి నెలకొల్పవచ్చు. పట్టణాలకు సప్లయిలను అభివృద్ధి చేయవచ్చు. కార్మిక, కర్షకుల మైత్రికి కారణభూతమైన ఒక కొత్త ఆర్థిక పునాదిని సృష్టించవచ్చు. సెంట్రల్ కమిటీ పైవిషయాలన్నిటినీ గుర్తించింది.

తమ ప్రధాన కర్తవ్యం పరిశ్రమలను పునరుద్ధరించడమని సెంట్రల్ కమిటీ గ్రహించింది. కాని కార్మికవర్గంయొక్క, కార్మిక సంఘాలయొక్క అండను సంపాదించనిదే అది సాధ్యంకాదు. విదేశ దురాక్రమణ, దిగ్బంధనం ప్రజలకు ఎంత ప్రమాదకరమైనశత్రువో, ఆర్థికవిచ్ఛిన్నతకూడా అంతప్రమాదకరశత్రువేనని కార్మికులకు చూపించుట ద్వారా ఈపనిలో కార్మికులను వినియోగించవచ్చు. యుద్ధరంగంలో ఉత్తరువులు గావించటం నిజంగా అవసరమే. కానిఅలాంటి సైనికఉత్తరువుల ద్వారా గాక, పార్టీ, కార్మిక సంఘాలూ కార్మికులను

నచ్చజెప్పే పద్ధతులవల్లను, ఒప్పించుటద్వారాను కార్మికవర్గం తమ పలుకుబడి వినియోగించాలి. అప్పుడే తప్పకుండా జయం పొందుతారు.

కాని సెంట్రల్ కమిటీతో పార్టీలోని సభ్యులు కొందరు ఏకీభవించుటలేదు. కొన్ని చిన్నచిన్న ప్రతిపక్ష ముఠాలు - ట్రాట్స్కీవాదులు, "కార్మిక ప్రతిపక్షం", "తీవ్రవాద కమ్యూనిస్టులు", "డెమాక్రటిక్ సెంట్రలిస్టులు" మొదలైనముఠాలు పార్టీతో విభేదించి తగవులాడుతుండేవి. శాంతియుత ఆర్థిక నిర్మాణ పరివర్తన దశలో కలిగేకష్టాలు ఎదుర్కొనవ్వాను వ్యాగిసలాడి కంపించి పోతున్నారు. పార్టీలో మెన్షివిక్కు, సోషలిస్టు - రివల్యూషనరీ, బండ్, బొరోట్‌బిస్ట్ పక్షాల మాజీ సభ్యులూ, రష్యా సరిహద్దు ప్రాంతాలలోని అన్నిరకాల అర్ధ-జాతీయవాదులూ (సెమీ - నేషనలిస్టులు)వున్నారు. (బొరోట్ బిస్టులు అనగా యుక్రేనియన్ సోషలిస్టు - రివల్యూషనరీలలో తీవ్ర దురహంకార జాతీయవాదులు. వారి కేంద్రపక్షం తరఫున 1918 వరకు బొరోట్‌బా అనేపత్రికను ప్రకటించారు. అందు చేతనే వీరికి బొరోట్ బిస్ట్‌లని పేరు వచ్చింది - అనువాదకుడు) వీరిలో చాలమంది ఏదో ఒక ప్రతికూల ముఠాలో కలుస్తూ ఉండేవారు. వీరు నిజమైన మార్క్సిస్టులు కారు. ఆర్థిక అభివృద్ధి సూత్రాలు వీరికి తెలియవు. లెనినిస్టుపార్టీ తరిఫీదు వీరికి లేదు. ప్రతికూల ముఠాల వ్యాగిసలాటలను గందరగోళాన్ని మరింత హెచ్చుచేయటానికే వీరు సహాయపడ్డారు. అందులో కొందరు యుద్ధ కమ్యూనిజం యొక్క కఠిన పరిపాలనను సడలించరాదని భావించారు. పైగా "మరమేకులు మరింత బిగించాలి" అని

వీరన్నారు! పార్టీ, ప్రభుత్వమూ, ఆర్థిక పునరుద్ధరణకు దూరంగా నిలబడాలనీ ఆపనంతా కార్మిక సంఘాల చేతుల్లో పూర్తిగా వదలివేయాలనీ మరికొందరన్నారు.

పార్టీలో కొన్ని ముఠాలలో అలాంటి గందరగోళం తాండవమాడుతున్నపుడు, వివాదప్రియులూ, ఒక విధంగా కాకపోతే మరొకవిధమైన ప్రతికూలత చూపే "నాయకులూ" పార్టీపై చర్చను అనివార్యంగా పుద్ధుతారనేది స్పష్టం.

సరిగ్గా అదే సంభవించింది.

కార్మిక సంఘాల పాత్ర ఏమిటి అన్న విషయంపై చర్చలు ప్రారంభమయ్యాయి. నిజానికి ఆ కాలంలో పార్టీ విధానం యొక్క ముఖ్యసమస్య కార్మిక సంఘాలు కానేకాదు. అయినప్పటికీ ఈ చర్చ ప్రారంభమైంది.

ఈ చర్చనూ, లెనిన్‌కూ సెంట్రల్ కమిటీలో మెజారిటీ సభ్యులైన లెనినిస్టులకూ వ్యతిరేకంగా పోరాటాన్నీ, ట్రాట్స్కీ ప్రారంభించాడు. పరిస్థితిని మరింత క్లిష్టంచేసే ఉద్దేశ్యంతో 1920 నవంబరు ప్రారంభంలో అఖిల రష్యన్ ట్రేడ్ యూనియన్ అయిదవ సమావేశం జరిగింది. దాని కమ్యూనిస్టు ప్రతినిధుల ప్రత్యేక సమావేశంలో ట్రాట్స్కీ అనుమానాస్పదమైన యీ కింది నినాదాలను యిచ్చాడు. "మరమేకులు మరింత బిగించాలి," "కార్మిక సంఘాలను ప్రభుత్వ వశం చేయాలి," అని ట్రాట్స్కీ కోరాడు. కార్మిక వర్గానికి నచ్చచెప్పే పద్ధతులుగాక, వాటిలో సైనిక పద్ధతులను అవలంబించాలని అతడు కోరాడు. ట్రాట్స్కీ కార్మిక సంఘా

లలో ప్రజాతంత్రాన్ని విస్తరింప చేయటానికి, కార్మిక సంఘాలను ఎన్నుకొనే సూత్రానికీ వ్యతిరేకి.

కార్మికవర్గ సంస్థల కార్యకలాపాలు నచ్చజెప్పే పద్ధతులు లేకుండా అసాధ్యమని తెలిసినప్పటికీ, ట్రాట్స్కీవాదులు పైనుంచి నిర్బంధంగా డిక్టేట్ చేసే పద్ధతులను సూచించారు. కార్మిక సంఘాలలో తాము ముఖ్య స్థానాలను ఆక్రమించిన ప్రతిచోటా ఈ విధానాన్ని అవలంబించి, ట్రాట్స్కీవాదులు సంఘాలలో తగాదాలు అనైక్యత తీసుకొచ్చారు. మనోనిబ్బరం పోగొట్టారు. తమ విధానం ద్వారా ట్రాట్స్కీవాదులు పార్టీకిచెందని కార్మికులనీ, పార్టీ కార్మికులనీ వేరు చేసి, కార్మిక వర్గంలో చీలికలు తే ప్రారంభించారు.

వాస్తవానికి కార్మిక సంఘ సమస్యకంటే, కార్మిక సంఘాలపై జరిగిన చర్చ చాలా అర్థవంతమైంది. 1925 జనవరి 17 న రష్యన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్కు) సెంట్రల్ కమిటీ ప్లీనం తన తీర్మానంలో ఈ విధంగా తెలియజేసింది: అసలు విషయాలు యీ కిందివి: "యుద్ధ కమ్యూనిజానికి వ్యతిరేకంగా తిరుగబడుచున్న రైతాంగంయెడల అవలంబించవలసిన విధానం పార్టీ సభ్యులుకాని, కార్మిక జన బాహుళ్యం పట్ల అవలంబింపవలసిన విధానం మొత్తంమీద అంతర్యుద్ధం అంతం కానున్న సమయంలో, ప్రజలపట్ల పార్టీ ఎలాంటివైఖరి అవలంబించాలి అన్నవిషయం." (సో. యూ. క. (బో) పార్టీ తీర్మానాలు, రష్యన్ ఎడిషన్, మొదటిభాగం, 651 పేజీ.)

ట్రాట్స్కీ నాయకత్వాన్ని ఈ క్రింది ఇతర పార్టీ వ్యతిరేక ముఠాలు కూడా అనుసరించాయి. "కార్మిక ప్రతిపక్షం,"

(ష్ల్యాప్నికోవ్, మెద్విడ్యేవ్, కొలాంటాయ్ మొదలైనవారు) "డెమాక్రటిక్ సెంట్రలిస్టులు", (శాప్రానోవ్, ప్రోబ్నిస్, బోగస్లావిస్కీ, ఓసిన్‌స్కీ, వి. స్మిర్నోవ్ మొదలగువారు) "తీవ్రవాద కమ్యూనిస్టులు" (బుఖారిన్, ప్రియో. బ్రాఝెన్‌స్కీ).

"కార్మిక ప్రతిపక్షం" జాతీయ ఆర్థికవిధాన నిర్వహణ మంతా "అఖిల రష్యన్ ఉత్పత్తిదార్ల కాంగ్రెస్"కు అప్ప జెప్పాలని ఒక నినాదం ఇచ్చింది. వీరు పార్టీ పాత్రను పూర్తిగా శూన్యం చేయదలచారు. అధికాభివృద్ధికి శ్రామికవర్గ నియం తృత్వ ప్రాముఖ్యతను నిరాకరించారు. కార్మిక సంఘాల ప్రయోజనాలు సోవియట్ ప్రభుత్వ, కమ్యూనిస్టు పార్టీల ప్రయోజనాలకు వ్యతిరేకమని "కార్మిక ప్రతిపక్షం" వాదిం చింది. కార్మికవర్గ నిర్మాణంలో ఉన్నత సంస్థ పార్టీ కాదనీ, కార్మిక సంఘాలేననీ వారన్నారు. "కార్మిక ప్రతిపక్షం" ముఖ్యంగా అరాచక సిండికలిస్టుపార్టీ వ్యతిరేక ముఠాయే.

"డెమాక్రటిక్ సెంట్రలిస్టులు" (డెసిస్టులు) ముఠాలకు, చీలికదార్లకు పూర్తి స్వాతంత్ర్య మీయాలని కోరారు. ట్రాట్స్కీ-వాదులలాగానే "డెమాక్రటిక్ సెంట్రలిస్టులు"కూడ కార్మిక సంఘాలలోను, సోవియట్లలోను పార్టీనాయకత్వాన్ని కూలద్రోయటానికి ప్రయత్నించారు. వీరిని "వాగడంలో మొనగాళ్ళు" ముఠాయనీ, వారి వేదిక సోషలిస్టు-రివల్యూషనరీ-మెన్షివిక్ వేదికయనీ లెనిన్ అన్నాడు.

లెనిన్‌పైన, పార్టీపైన సాగించిన పోరాటంలో ట్రాట్స్కీకి బుఖారిన్ సహాయపడ్డాడు. ప్రియోబ్రాఝెన్‌స్కీ,

సెర్రెబ్రియకోవ్, సొకొల్నికోవ్‌లతో బుఖారిన్ ఒక "బఫర్ గ్రూపు"ను (రెంటికి మధ్యఉండే పక్షం) ఏర్పరచాడు. ఈముఠా చీలికదార్లలో అత్యంత విషపూరితులైన ట్రాట్స్కీ-వాదులను సమర్థించుటేగాక కవచంలా రక్షించింది. బుఖారిన్ ప్రవర్తనను గురించి లెనిన్ ఇలా అన్నాడు: "సిద్ధాంత పరిజ్ఞాన పతనంలో పాతాళాన్ని అందుకొన్నాడు." త్వరలోనే లెనిన్‌కు వ్యతిరేకంగా ట్రాట్స్కీ-వాదులతో బుఖారిన్ వాదులు బహిరంగంగా కలసిపోయారు.

పార్టీ వ్యతిరేక ముఠాలకు ట్రాట్స్కీ-వాదులే వెన్నెముక యని లెనినూ, లెనినిస్టులూ వారిని తీవ్రంగా ఖండించారు. కార్మిక సంఘాలకూ, సైనిక సంఘాలకూ తేడాను లెక్క-చేయనందుకు ట్రాట్స్కీ-వాదులను వారు ఖండించారు. కార్మిక సంఘాలకు సైనిక పద్ధతులు అనువర్తింప వీలులేదని హెచ్చరించారు. లెనినూ, లెనినిస్టులూ వేరే ప్రత్యేక రాజకీయ వేదికను ఏర్పరచుకొన్నారు. అయితే ఇది వ్యతిరేక ముఠాల వేదికకు పూర్తిగా విభిన్నమైన భావంతో ఏర్పరచారు. పరిపాలనా నిర్వహణకు, కార్యనిర్వహణకు, కమ్యూనిజానికి స్కూళ్ళుగా కార్మిక సంఘాలను వీరు నిర్వచించారు. కార్మికసంఘాలు నచ్చజెప్పే పద్ధతులలో తమ కార్యకలాపాలను కొనసాగించాలి. అప్పుడే ఆర్థిక విచ్ఛిన్నతను ఎదుర్కో-టానికి కార్మికుల నందరిని కార్మికసంఘాలు ఉత్తేజపరచి సోషలిస్టు నిర్మాణ కార్యక్రమంలో వారిని చేర్చుకొనగల్గుతాయి.

ప్రతికూల ముఠాలతో జరిగిన పోరాటంలో పార్టీ సంస్థలు లెనిన్ పక్షాన నిలిచాయి. మాస్కో-లో ఈపోరాటం

ప్రత్యేకంగా తీవ్రరూపం దాల్చింది. రాజధానీ నగరంలోని పార్టీ సంస్థలను పట్టుకొనే ఉద్దేశ్యంతో ప్రతికూలపక్షం తన శక్తుల నన్నిటినీ కేంద్రీకరించింది. కాని మితవాతత్వవాదుల కుట్రలు మాస్కో బోల్షివిక్కుల తీవ్రప్రతిఘటనతో అపజయం పొందాయి. యుక్రేనియన్ పార్టీ సంస్థలలో సహితం తీవ్రమైన పోరాటం ప్రారంభమైంది. ఆ రోజుల్లో యుక్రెయిన్ కమ్యూనిస్టుపార్టీ సెంట్రల్ కమిటీకార్యదర్శియగు కామ్రేడ్ మాలటోవ్ నాయకత్వాన యుక్రేనియన్ బోల్షివిక్కులు, ట్రాట్స్కీవాదులను, ష్లాప్నికోవ్ అనుచరులనుఓడించారు. యుక్రెయిన్ కమ్యూనిస్టుపార్టీ, లెనిన్ పార్టీని విశ్వాసవంతంగా బలపరచుతూ నిలబడింది. బాకూలో ప్రతిపక్షులను కామ్రేడ్ ఆర్జోనికిడ్జె నాయకత్వాన ఓడించారు. మధ్యఆశియాలో పార్టీ వ్యతిరేక ముఠాలతో సాగించిన పోరాటం కామ్రేడ్ యల్. కాగనవిచ్ నాయకత్వాన జరిగింది.

ప్రధానమైన అన్ని స్థానిక పార్టీ సంస్థలు లెనిన్ వేదికను బలపరచాయి.

1921 మార్చి 8వ తేదీన పార్టీ పదవకాంగ్రెస్ ప్రారంభమైంది. కాంగ్రెస్‌కు 7 లక్షల 32 వేల 521 మంది పార్టీ సభ్యులకు ప్రాతినిధ్యం వహించే ప్రతినిధులు హాజరయ్యారు. ఇందులో 694 మంది ప్రతినిధులకు వోటింగు హక్కుంది. మరి 694 మంది ప్రతినిధులకు చర్చించే హక్కుందిగాని వోటుచేసే హక్కులేదు.

కార్మిక సంఘాలపైన చర్చ సారాంశాన్ని తేలుస్తూ, లెనిన్ రాజకీయ వేదికను కాంగ్రెస్‌లో అత్యధిక సంఖ్యాకులు బలపరచారు.

కాంగ్రెస్‌లో ప్రారంభోపన్యాసం చేస్తూ ఈ చర్చ క్షమింపరాని కాలవ్యయం (లగ్జరీ) అని లెనిన్ అన్నాడు. శత్రువులు పార్టీ ఆంతరంగిక కలహాంపై అంచనాలు వేసు కొన్నారనీ, కమ్యూనిస్టుపార్టీ అనుచరులలో చీలిక కలుగు తుందని ఆశించారనీ లెనిన్ ప్రకటించాడు.

ముఠాతత్వాలు వుండటం శ్రామికవర్గ నియంతృత్వానికీ బోల్షివిక్ పార్టీకీ ఎంత తీవ్రమైన ప్రమాదమో గ్రహించి, పార్టీ పదవ కాంగ్రెస్, పార్టీ ఐక్యత పైన ప్రత్యేక దృష్టిని ప్రసారించింది. ఈ సమస్యపై లెనిన్ రిపోర్టిచ్చాడు. అన్ని ప్రతికూల పక్షాలను ఖండించుతూ కాంగ్రెస్ తీర్మానించింది. "శ్రామిక విప్లవవర్గ శత్రువులకు వాస్తవంలో సహాయపడు తున్నార"ని వారిని కాంగ్రెస్ ఖండించింది.

ముఠాతత్వాలన్నిటిని వెంటనే రద్దుచేయాలని కాంగ్రెస్ ఆజ్ఞాపించింది. ముఠా తత్వం తలయెత్తుటను ఆపివేయటానికి పార్టీ సంస్థలు ఖచ్చితమైన నిఘావుంచాలనీ, కాంగ్రెస్ తీర్మా నాలను అమలుపర్చని పక్షంలో వెనువెంటనే బేషరతుగా వారిని పార్టీనుంచి వెళ్ళగొట్టాలనీ కాంగ్రెస్ ఆజ్ఞాపించింది. సంఘ సభ్యులు క్రమశిక్షణను ఉల్లంఘించిన పక్షంలోనూ, ముఠాతత్వాన్ని సహించలేక పునరుద్ధరించిన పక్షంలోనూ, వారిపైన పార్టీ శిక్షలన్నిటినీ అమలుపరచాలి. అనగా సెంట్రల్ కమిటీనుండి, పార్టీనుండి వెళ్ళగొట్టేవరకూ చర్యలు తీసుకోవా లనీ సెంట్రల్ కమిటీకి కాంగ్రెస్ అధికారమిచ్చింది.

"పార్టీ ఐక్యత" అనే ప్రత్యేక తీర్మానంలో యీ నిర్ణయాలు ఇమడ్చబడ్డాయి. ఈ తీర్మానాన్ని లెనిన్ ప్రతిపాదించగా కాంగ్రెస్ ఆమోదించింది.

10వ కాంగ్రెస్ కాలంలో దేశంలోని పెటీ-బూర్జువా వూగిసలాటను హెచ్చుచేయటానికి అనేక పరిస్థితులు తోడ్పడ్డాయి. ఇలాంటి సమయంలో శ్రామికవర్గ అగ్రగామియగు పార్టీలో ఐక్యభావము, పార్టీ అనుచరులలో ఐక్యత, సౌభ్రాతృత్వం ఉండుట ఎంత అవసరమో యీ తీర్మానం పార్టీసభ్యులందరినీ హెచ్చరించింది.

తీర్మానం ఇలా తెలియజేసింది: "కార్మిక సంఘాలను గురించి పార్టీ సర్వసాధారణ చర్చ జరుగకముందే పార్టీలో ముఠాతత్వ లక్షణాలు కొన్ని కన్పించాయి. ప్రత్యేక వేదికలతో వేరే ముఠాలు ఏర్పరచుకొని వేరే ఒక క్రమశిక్షణను కూడ ఏర్పరచుకోడానికి కొంతవరకు ప్రయత్నించారు. వర్గ చైతన్యంగల కార్మికులంతా ఏవిధమైన ముఠా తత్వాన్ని సహించరాదనీ, అది వినాశకరమైనదనీ స్పష్టంగా గుర్తించాలి. ఎందువల్లనంటే ఆచరణలో ముఠాతత్వం కలిసి కట్టుగా చేసే పనిని (టీమ్ వర్కు) బలహీనపరుస్తుంది. పార్టీ ప్రస్తుతం అధికారంలో వుంది గాబట్టి శత్రువులు గూడా కొందరు దానిలో దూరారు. చీలికను (పార్టీలో) మరింత ఎక్కువజేసి దానిని విప్లవ ప్రతీఘాత ప్రయోజనాలకు ఉపయోగించుకోవాలని ఈ శత్రువులు తిరిగి తిరిగి తీవ్ర ప్రయత్నాలు చేస్తారు."

అదే తీర్మానంలో కాంగ్రెస్ ఇంకా ఇలా తెలియ జేసింది :

"పూర్తిగా నిలకడమైన కమ్యూనిస్టు పోరాటనుండి తప్పిపోయిన ప్రతి పెడమార్గాన్ని (డీవియేషన్) శ్రామికవర్గ శత్రువులు ఎలా ఉపయోగించుకొంటూ రనేదానికి క్రాన్‌స్టాట్ తిరుగుబాటు మంచి నిదర్శనం. ఆ తిరుగుబాటు జరిగిన సమయంలో అన్ని దేశాల బూర్జువా విప్లవ ప్రతీఘాతకులు, వైట్ గార్డులు సోవియట్ విధాన నినాదాలను కూడ అంగీకరించటానికి తమ సంసిద్ధతను వెంటనే తెలియపరచారు. అవిధంగా రష్యాలో శ్రామికవర్గ నియంతృత్వాన్ని కూలద్రోసే అవకాశ ముంటుందని భావించారు. సోషలిస్టు - రివల్యూషనరీలు, బూర్జువా విప్లవ ప్రతీఘాతకులు, సోవియట్ అధికార ప్రయోజనాలకోసం అనే మిషతోనే రష్యాలోని సోవియట్ ప్రభుత్వంపై తిరుగుబాటు చేయండని క్రాన్‌స్టాట్‌లో నినాదాలిచ్చారు. రష్యాలో శ్రామికవర్గ విప్లవ కోటను బలహీనపరచి కూలద్రోయటానికి వైట్ గార్డులు ప్రయత్నించుచున్నారనీ, ఆ ఉద్దేశ్యంతోనే తాముగూడ కమ్యూనిస్టుల మనే ముసుగు వేసుకొన్నారనీ, కమ్యూనిస్టులకంటేగూడా "ఎక్కువ తీవ్రవాద" వ్యక్తులుగా ప్రదర్శించుకోటానికి ప్రయత్నించేశారని ఈ విషయాలు పూర్తిగా రుజువుచేశాయి. సోషలిస్టు - రివల్యూషనరీలు, వైట్‌గార్డులు తిరుగుబాటును ప్రతీఘాతుక మనే చెప్పుకొంటూ, కొద్ది చిన్నచిన్న మినహాయింపులతో సోవియట్ అధికారాన్ని బలపరచే వారమని చెప్పుకొంటూ, క్రాన్‌స్టాట్ తిరుగుబాటుదారులను బలపరచి పోత్సహించారు. ఇందుకు రష్యన్ కమ్యూనిస్టుపార్టీలోని విభేదాలను మొన్ని

విక్కు లుపయోగించు కొన్నారని క్రాన్‌స్టాట్ తిరుగుబాటుకు ముందు పెట్రోగ్రాడ్‌లో పంచిన వారి కరపత్రాల వల్లనే తెలుస్తుంది."

శ్రామికవర్గ నియంతృత్వ విజయానికి ప్రధానమైన షరతు పార్టీ ఐక్యత - శ్రామికవర్గ అగ్రగామిలో సంకల్ప ఐక్యత. మఠా తత్వంవల్ల ఈ పార్టీ ఐక్యతకు, సంకల్ప ఐక్యతకు ఎటువంటి హానీ, ఆపదా కలుగుతాయో వివరంగా ప్రచారంలో తెలియచేయాలని పార్టీ తీర్మానం స్పష్టపరచింది.

సోవియట్ ప్రభుత్వ శత్రువులు ఉపయోగించిన ఆధునిక ఎత్తుగడ పద్ధతుల ప్రత్యేకతను, పార్టీ తన ప్రచారంలో వివరించ వలసిందిగా మరొకప్రక్క కాంగ్రెస్ తన తీర్మానంలో తెలియ జేసింది.

తీర్మానం ఇలా తెలియజేసింది: "ఈ శత్రువులు వైట్ గార్డు జెండాక్రింద బహిరంగంగా విప్లవ ప్రతీఘాతానికి పూనుకోవటం నిరుపయోగమైనదని గ్రహించారు. రష్యన్ కమ్యూనిస్టుపార్టీలోని విభేదాలను ఉపయోగించుకోవడానికి తమ శాయశక్తుల కృషి చేస్తున్నారు. సోవియట్ అధికారాన్ని గుర్తించుటలో ఎంతో సన్నిహితంగా వున్నట్లు పైకి కన్పడుతున్న రాజకీయ మఠాలకు అధికారాన్ని ఏదో ఒక విధంగా బదిలీ చేయుటద్వారా విప్లవ ప్రతీఘాతాన్ని పెంపొందించాలని వారు ప్రయత్నించు తున్నారు." (లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో, 1947, రెండవ వాల్యూమ్, 680 వ పేజీ)

పార్టీ తన ప్రచారంలో యీక్రింది విషయాలనుకూడా తెలియజేయాలని తీర్మానం కోరిదిం: "ఇదివరకటి విప్లవాల గుణపాఠాలనుకూడా పార్టీ బోధించాలి. ఆ విప్లవాలంలో విప్లవ ప్రతీఘాతకులు, అతివిప్లవకరమైనపార్టీ కి సన్నిహితులుగా నిల్చిన పెటీబూర్జువా ముఠాలను మామూలుగా బలపరచే వారు. ఇలా బలపరచుటలో వారి ఉద్దేశ్యం విప్లవ నియంతృత్వాన్ని కుంటువడజేసి, కూలద్రోసి మరల 'పెట్టుబడిదారుల, భూస్వాముల విప్లవప్రతీఘాత విజయానికి దారితీయటానికే."

"పార్టీ ఐక్యత" అనే తీర్మానానికి సన్నిహితంగా ఉండే "మనపార్టీలో సిండికలిస్టు - అనార్కిస్టు పెడద్రోవ" (The Syndicalist and Anarchist deviati( n in our Farty) అనే మరొక తీర్మానాన్ని లెనిన్ ప్రతిపాదించగా కాంగ్రెస్ఆమోదించింది. ఈతీర్మానంలో "కార్మిక ప్రతిపక్షం" అనిపిలుచుకొనే వారిని 10వ కాంగ్రెస్ ఖండించింది. అనార్కో- సిండికలిస్ట్ పెడ త్రోవకుచెందిన భావాలను ప్రచారం చేయటానికీ, కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వానికీ పొసగదు. అందుచే పార్టీ యీ పెడ త్రోవను తీవ్రంగా ఎదుర్కో-వాలని తీర్మానం హెచ్చరించింది.

అదనపు ఉత్పత్తి ప్రభుత్వాధీనం చేసే పద్ధతికి బదులుగా వస్తురూపమైన పన్ను చెల్లించే విధానాన్ని నూతన ఆర్థిక విధానాన్ని (N. E. P) అంగీకరించి 10 వ కాంగ్రెస్ చాలా ప్రాముఖ్యమైన నిర్ణయాన్ని తీసుకొంది.

యుద్ధ కమ్యూనిజంనుండి నూతన ఆర్థిక విధానానికి మరలటం లెనిన్ పాలసీలోని దూరదృష్టికీ, వివేచనా శక్తికీ చక్కని ఉదాహరణలు.

అదనపు ఉత్పత్తి ప్రభుత్వ అధీనం చేసే విధానానికి బదులుగా వస్తురూపేణా పన్ను యివ్వాలనే పద్ధతిని గురించి కాంగ్రెస్ తీర్మానం చర్చించింది. అదనపు ఉత్పత్తి ప్రభుత్వాధీనం చేసే పద్ధతిలో ఇచ్చే పన్నుకంటె వస్తురూపేణా యిచ్చు పన్ను తక్కువగా ఉండాలి. వసంతకాలంలో విత్తులు చల్లే ముందు, ప్రతిఏట్యా, చెల్లించవలసిన పన్ను మొత్తాన్ని ప్రకటించాలి. ఈ పన్ను చెల్లించవలసిన తేదీలను ఖచ్చితంగా నిర్ధారణచేయాలి. పన్ను ఈయగా మిగిలిన మొత్తంఉత్పత్తి పూర్తిగా రైతు స్వాధీనంలో వుండాలి. ఈ అదనపు పంటను తన యిష్టం వచ్చినట్లు అమ్ముకోడానికి అతనికి అధికార ముంటుంది. వర్తక స్వేచ్ఛ మొదట్లో దేశంలో పెట్టుబడిదారీ విధానాన్ని కొంతవరకు పునరుద్ధరించుతుందని, లెనిన్ తన ఉపన్యాసంలో అన్నాడు. ప్రయివేటు వర్తకాన్ని, ప్రయివేటు ఉత్పత్తిదారులు చిన్న చిన్న వ్యాపారాలను సాగించటాన్ని అనుమతించడం అవసరం. కాని యిందుకు భయపడనవసరం లేదు. వర్తక స్వేచ్ఛ రైతుకు ఆర్థిక ప్రేరణను ఇస్తుంది. అది అధికోత్పత్తికి అతనిని ప్రోత్సహిస్తుంది. వ్యవసాయంలో త్వరగా అభివృద్ధి జరగటానికి దారితీస్తుంది. ఈ ప్రాతిపదికపైన ప్రభుత్వాధీన పరిశ్రమలు పునరుద్ధరింపబడతాయి. ప్రయివేటు పెట్టుబడి రద్దుచేయబడుతుంది. మన బలాన్ని, సాధనసంపత్తిని కూడగట్టుకొని సోషలిజానికి ఆర్థిక పునాదిగా శక్తివంతమైన పరిశ్రమలను నెలకొల్పవచ్చు. అప్పుడు దేశంలో పెట్టుబడిదారీ అవశేషాలను నాశనం చేయటానికి నిశ్చితమైన దాడిని కొనసాగించవచ్చు.

పట్టణాలలోని, పల్లెలలోని పెట్టుబడిదారీ అంశాల కోటను ఒక్కుమ్మడి వశపరచుకొనే ప్రయత్నమే యుద్ధ కమ్యూనిజం. ఈ దాడిలో పార్టీ చాలా ముందుకుపోయి తన కేంద్రానికి (Base) దూరమయ్యే ప్రమాదం ఘటిల్లింది. ఇప్పుడు కొంత విశ్రాంతి తీసుకోవాలని, కొంతకాలం కేంద్రం దగ్గరకు తిరోగమించాలని, కోటపై చేసే ముఖాముఖి దాడిని మాని నెమ్మదిగా ముట్టడి చేసే పద్ధతికి మారాలని లెనిన్ సూచించాడు. బలాన్ని తిరిగి సమకూర్చుకొని దాడిని తర్వాత సాగించాలని లెనిన్ అన్నాడు.

ట్రాట్స్కీ వాదులు, ఇతర వ్యతిరేక మతాలవారు నూతన ఆర్థిక విధానం తిరోగమనం తప్ప మరేమీ కాదని భావించారు. ఈ భాష్యం వారి ఉద్దేశ్యానికి సరిపోయింది. ఎందుచేతనంటే పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించుటయే వారిపోకడ. నూతన ఆర్థిక విధానానికి యీ లెనినిస్టు వ్యతిరేక భాష్యం చాల హానికరమైంది. వాస్తవవిషయమేమంటే నూతన ఆర్థికవిధానం ప్రవేశపెట్టిన ఒక సంవత్సరంలోపలే పార్టీ 11వ కాంగ్రెస్‌లో "తిరోగమనం" అంతమైంది, అంటూ లెనిన్ యీ క్రింది నినాదాన్ని యిచ్చాడు: "ప్రయివేటు పెట్టుబడిపై దాడికి సిద్ధంకండి." (లెనిన్, కలెక్టెడ్‌వర్క్స్, రష్యన్ ఎడిషన్, 27 వ వాల్యూమ్, 213 వ పేజీ.)

ప్రతికూల పక్షంవారు, బోల్షివిక్కు విధానానికి సంబంధించిన సమస్యలో మార్క్సిస్టు పరిజ్ఞాన శూన్యులు, ఉత్త దద్దమ్మలు. నూతన ఆర్థికవిధానం యొక్క అర్థాన్నిగాని, అది ప్రారంభంలో వేసిన వెనకడుగు స్వభావాన్ని గాని వారు

గ్రహించలేదు. నూతన ఆర్ధికవిధానం యొక్క అర్ధాన్ని గురించి పైన చర్చించాం. ఇక తిరోగమన స్వభావాన్ని గురించి చెప్పా లంటే దానిలో రెండు రకాలున్నాయి. ఓడిపోయినప్పుడు ఒక పార్టీగాని లేక ఒక సైన్యంగాని తిరోగమించవలసిన సమయా లుంటాయి. అలాంటి సమయాలలో పార్టీ లేక సైన్యం తనను, తన అనుచరులను కొత్త యుద్ధాలకోసం రక్షించుకో డానికి గాను తిరోగమించుతుంది. కాని లెనిన్ ప్రవేశపెట్టిన నూతన ఆర్ధికవిధానం అలాంటి తిరోగమనం కాదు. ఓటమిని గాని, భంగపాటును గాని పార్టీ పొందలేదు. పైగా అదే దురా క్రమణదారులను, వైట్ గార్డులను అంతర్యుద్ధంలో ఓడించింది. మరికొన్ని సమయాలలో విజయవంతమైన పార్టీ లేక సైన్యం తన వెనుక భాగంలో తగిన కేంద్రాన్ని (Base) కల్పించుకో కుండా చాలా ముందుకుపోయే సమయాలున్నాయి. ఇది చాలా తీవ్రమైన ప్రమాదాన్ని కలుగచేస్తుంది. అందుచేత తన కేంద్రానికి సంబంధాలను తెగగొట్టుకొనకుండా వుండాలంటే అనుభవంగల పార్టీ లేక సైన్యం, సాధారణంగా అలాంటి సమయాలలో కొద్దిగా వెనక్కి తగ్గటం అవసరమని భావించు తుంది. తన కేంద్రానికి సమీపంగావుండి, దానితోమంచి సం బంధం ఏర్పరచుకొని, తనకు కావలసిన అవసరాలనన్నీ సమ కూర్చుకొంటుంది. ఆతర్వాత ఎక్కువ ఆత్మవిశ్వాసంతో విజయం పొందగలమనే దృఢనమ్మకంతో దాడిని కొనసాగించు తుంది. ఈ విధమైన తాత్కాలికపు వెనుకంజనే నూతన ఆర్ధిక విధానం ద్వారా లెనిన్ సూచించాడు. కమ్యూనిస్టు ఇంటర్నే షనల్ 4 వ కాంగ్రెస్‌లో నూతన ఆర్ధికవిధానం ప్రవేశపెట్ట వలసిన అవసరాలను గురించి తెలియజేస్తూ లెనిన్ స్పష్టంగా

యిలా చెప్పాడు: "మన ఆర్థికదాడిలో మనం చాలా ముందుకు పరుగెత్తాం. మనం తగిన కేంద్రాన్ని ఏర్పరచుకోలేదు." అందుచే తాత్కాలికంగా భద్రమైన వెనుభాగానికి తిరోగమించాలిసి వచ్చింది.

ప్రతికూల పక్షంవారి దురదృష్ట మేమంటే, వారు తమ అజ్ఞానంవల్ల నూతన ఆర్థికవిధానంక్రింద జరిగిన యీ తిరోగ మన స్వభావాన్ని అర్థం చేసుకోలేదు; తమ కాలం ఆసన్న మయిన రాజుల్లో కూడ ఎన్నడూ అర్థం చేసుకోలేదు.

నూతన ఆర్థికవిధానంపైన 10 వ కాంగ్రెస్ చేసిన తీర్మానం సోషలిస్టు నిర్మాణానికి అవసరమైన కార్మిక, కర్షకుల స్థిరమైన ఆర్థిక మైత్రిని సమకూర్చింది.

కాంగ్రెస్ జాతుల సమస్యపైన చేసిన మరొక తీర్మానం వల్ల కూడా యీ ప్రధాన ఆశయం నెరవేరింది. జాతుల సమస్యపై రిపోర్టును కామ్రేడ్ స్టాలిన్ ఇచ్చాడు. మనం ఒక జాతిని మరొక జాతి పీడించటం రద్దుపరచాం. కాని యింత మాత్రాన సరిపోదు. పూర్వం పీడింపబడిన జాతులు ఆర్థికంగా రాజకీయంగా, సాంస్కృతికంగా వెనుకపడివున్నాయి. గత కాలపు ఈ చెడు వారసత్వాన్ని తుడిచిపెట్టవలసిన కర్తవ్యం మనది. మధ్య రష్యా స్థాయిని అవి అందుకొనేటట్లు మనం సహాయపడాలి — అని కామ్రేడ్ స్టాలిన్ చెప్పాడు.

జాతుల సమస్యపై పార్టీ వ్యతిరేకమైన రెండు పెడ త్రోవలను కామ్రేడ్ స్టాలిన్ పేర్కొన్నాడు. అధికార జాతుల దురహంకారం, (మహా రష్యన్‌జాతి అనే దురహంకారం) స్థానిక జాతీయ తత్వం. ఈ రెండు తప్పుడుదారులు శ్రామిక

వర్గ అంతర్జాతీయకు, కమ్యూనిజానికి అపాయకరమనీ, హానికరమని కాంగ్రెస్ ఖండించింది. దీనితోపాటు ఎక్కువ అపాయకరమైన అధికారజాతుల దురహంకారంపై కాంగ్రెస్ ప్రధానమైన దెబ్బకొట్టింది. అనగా జారు దురహంకారులు ప్రదర్శించిన వైఖరియొక్క అవశేషాలను, పాత వాసనలను కాంగ్రెస్ సునిశితంగా ఖండించింది.

## 3

నూతన ఆర్థిక విధానం యొక్క ప్రాథమిక ఫలితాలు – పార్టీ 11 వ కాంగ్రెస్ – సోవియట్ సోషలిస్టు రిపబ్లికుల యూనియన్ స్థాపన – లెనిన్ వ్యాధిగ్రస్తుడగుట. లెనిన్ సహకార పథకం – పార్టీ 12 వ కాంగ్రెస్

పార్టీలో నిలకడలేని వ్యక్తులు నూతన ఆర్థికవిధానాన్ని ప్రతిఘటించారు. ఈ ప్రతిఘటన రెండుచోట్లనుంచి వచ్చింది. "తీవ్రవాద" వాచాలురు లోమినాడ్జి, షాట్స్కిను మొదలైన రాజకీయ చపలచిత్తులు మొదటి రకం. వీరు నూతన ఆర్థిక విధానమంటే అక్టోబరు విప్లవ విజయాలను పరిత్యజించటమనీ, పెట్టుబడిదారీవిధానం పునరుద్ధరించటమనీ, సోవియట్ అధికార పతనమేనని "రుజువులు" చూపసాగారు. వారి రాజకీయ విద్యా శూన్యతవల్లా, ఆర్థిక విధాన అభివృద్ధి సూత్రాలను గురించిన అజ్ఞానంవల్లా, వీరు పార్టీపాలసీని అర్థంచేసుకోలేదు.

గాభరాపడి నిరుత్సాహ నిరాశ బీజాలు నాటారు. ఇక రెండవ రకం: ట్రాట్స్కీ, రాడెక్, జినోవీవ్, సొకొల్నికోవ్, కామెనీవ్, స్లాప్నికోవ్, బుఖారిన్, రైకోవ్ మొదలైనవారు. వీరు పెట్టుబడిదార్లకు పూర్తిగాలొంగిపోయేరకం. మనదేశంలో సోషలిస్టు అభివృద్ధి సాధ్యమవుతుందని వీరు నమ్మలేరు. పెట్టుబడిదారీ విధానంయొక్క "అనంతశక్తి"ముందు తలయొగ్గారు. సోవియట్ దేశంలో పెట్టుబడిదారీ విధానస్థితిని బలపరచ ప్రయత్నించారు. దేశంలోనీ, విదేశాలలోనీ ప్రయివేటు పెట్టుబడికి ఎక్కువసౌకర్యాలియ్యాలనికోరారు. ఆర్థికరంగంలో సోవియట్ ప్రభుత్వం యొక్క అనేక కీలకస్థానాలను ప్రయివేటు పెట్టుబడిదార్లకు అప్పజెప్పాలని కూడా వీరు కోరారు. ఈ ప్రైవేటు పెట్టుబడిదార్లు, మిశ్రమ జాయింటు స్టాకు కంపెనీలలో ప్రభుత్వంతోబాటు భాగస్వాములుగానూ, అది యిచ్చిన సౌకర్యాలను అనుభవించేవారుగాను (Concessionaries) ఉంటారని వీరభిప్రాయం.

ఈ రెండు ముఠాలుకూడా మార్క్సిజానికి, లెనినిజానికి వ్యతిరేకులే.

ఈ రెండు ముఠాలను పార్టీ బట్టబయలుచేసి దూరం చేసింది. గాభరాగాళ్ళను, లొంగుబాటుదార్లను తీవ్రంగా ఖండించుతూ పార్టీ తీర్మానించింది.

పార్టీలో నిలకడలేని వ్యక్తులను వడపోత (పర్జి) పోయుట అవసరమని, పార్టీవిధానాన్ని ఎదుర్కొన్న ఈ ప్రతిఘటన మరొకసారి జ్ఞాపకంచేసింది. ఆవిధంగానే 1921 లో సెంట్రల్ కమిటీ పార్టీలో వడపోత ప్రారంభించింది. ఇది పార్టీ చాలా

వరకు బలపడటానికి సహాయపడింది. బహిరంగ సభలలో పార్టీకి చెందని ప్రజల సమక్షాన, వారు పాల్గొన్న మీటింగుల లోను ఈ వడపోత జరిగింది. పార్టీనుండి "రాస్కెల్సును (దుర్మార్గులను), నిరంకుశులను, చిత్తశుద్ధిలేని వారిని, ఊగిస లాడు తున్నవారిని, తమ ముఖాలకు కొత్తరంగులు వేసు కొన్నా హృదయంలో ఇంకా మెన్షివిక్కులుగానే వున్నవారిని" శుద్ధిచేయాలని లెనిన్ సలహాయిచ్చాడు. (లెనిన్, సెలెక్టెడ్ వర్క్సు, ఇంగ్లీష్ ఎడిషన్, మాస్కో, 1947, రెండవవాల్యూమ్ 746 వ పేజీ)

ఈ వడపోత ఫలితంగా షుమారు లక్షా 70 వేలమంది అంటే మొత్తం సభ్యత్వంలో 4వ వంతు పార్టీనుండి వెళ్ళగొట్ట బడ్డారు.

ఈ వడపోత పార్టీని ఎక్కువగా బలపరచి దాని అంగ నిర్మాణాన్ని అభివృద్ధి పరచింది. ప్రజలలో పార్టీ అంటే విశ్వాసం హెచ్చింది. పార్టీ ప్రతిష్ఠ ఉచ్ఛస్థాయికి పోయింది. పార్టీ అతి దృఢంగా ఐక్యపడింది. క్రమశిక్షణ హెచ్చింది.

నూతన ఆర్థికవిధానం సరియైనదని ఆ మొదటి సంవత్స రంలోనే రుజువైంది. నూతన ఆర్థికవిధానాన్ని ప్రవేశపెట్టుట రైతులు, కార్మికులు ఒక కొత్త ప్రాతిపదికపై ఐక్యమై బల పడడానికి సహాయపడింది. కులక్ల దోపిడి దాదాపు పూర్తిగా రద్దుచేయబడింది. అదనపు ఉత్పత్తిని ప్రభుత్వాధీనం చేసేపద్ధతి రద్దవటంవల్ల, మధ్యతరగతి రైతులు కులక్ మూకలపై సోవి యట్ ప్రభుత్వం సాగించిన పోరాటంలో సహాయం చేశారు. ఆర్థికరంగంలోని అన్ని కీలకస్థానాలను అనగా పెద్దపెద్ద పరి

శ్రమలు, రవాణామార్గాలు, బ్యాంకులు, భూమి, స్వదేశ విదేశ వర్తకం మొదలైన వాటినన్నిటిని సోవియట్ ప్రభుత్వం తన చేతిలోవుంచుకొంది. ఆర్థికరంగంలో నిశ్చితమైన మంచి మార్పును పార్టీ సాధించింది. ఆ వ్యవసాయం త్వరలోనే అభివృద్ధిపొంది ముందుకు పోసాగింది. పరిశ్రమలు, రైల్వేలు తమ ప్రప్రథమ విజయాలను చూపగలిగాయి. నెమ్మదిగా అయినప్పటికీ నిస్సందేహంగా ఆర్థిక పునరుద్ధరణ ప్రారంభమైంది. పార్టీ సరియైన గాడిలో నడుస్తోందని కార్మికులు, రైతులు గ్రహించి అర్థంచేసుకోసాగారు.

1922 మార్చిలో పార్టీ 11 వ కాంగ్రెస్‌ను జరిపింది. దీనికి 5 లక్షల 32 వేలమంది పార్టీసభ్యులకు ప్రాతినిధ్యం వహించిన ప్రతినిధులు వచ్చారు. ఇదివరకటి కాంగ్రెస్‌కంటె యీసంఖ్య తక్కువే. ఓటింగు హక్కు గలిగిన ప్రతినిధులు 522 మందీ, ఓటులేకపోయినా చర్చించే హక్కు గలిగిన ప్రతినిధులు 165 మంది వచ్చారు. ఇప్పటికే ప్రారంభమైన పార్టీ వడపోత ఫలితంగా సభ్యత్వంలో తగ్గుదల చూపింది.

నూతన ఆర్థిక విధానంయొక్క మొదటి ఏడాది ఫలితాలను కాంగ్రెస్‌లో పార్టీ సమీక్షించింది. ఈ ఫలితాలను కాంగ్రెస్‌లో లెనిన్ యిలా ప్రకటించాడు:

"ఒక సంవత్సరంగా మనం తిరోగమించుతున్నాం. ఇక దానిని ఆపాలని మనం పార్టీ పేరట ఇప్పుడు పిలుపు నివ్వాలి. తిరోగమన ఉద్దేశ్యం నెరవేరింది. ఈకాలం అంతమవుతోంది. లేక అంతమయిందని చెప్పాలి. దీనికి భిన్నంగా మన శక్తులను

తిరిగి సమకూర్చుకోడం మన ఉద్దేశం." (పై గ్రంథమే 782, 783 పేజీలు)

నూతన ఆర్థిక విధానమంటే పెట్టుబడిదారీ విధానానికీ, సోషలిజానికీ మధ్య జీవన్మరణ సంగ్రామమని లెనిన్ అన్నాడు. "ఎవరు జయిస్తారు?" - అన్నది సమస్య. మనం జయించాలంటే కార్మికవర్గానికి, రైతాంగానికి మధ్య సంబంధం, సోషలిస్టు పరిశ్రమకూ, రైతు వ్యవసాయానికీ మధ్య సంబంధం దృఢంగా వుండాలి. గ్రామాలకూ, పట్టణాలకూ మధ్య వస్తు మారకం కొనవరకూ అభివృద్ధి చెయ్యాలి. ఇందుకుగాను వర్తకం చేయడంలో చాకచక్యం, పరిశ్రమల నిర్వహణలో నైపుణ్యమూ అలవరచుకోవాలి.

ఆ రోజుల్లో పార్టీని ఎదుర్కొన్న సమస్యలన్నిటిలోకి కీలకమైనది వర్తక సమస్యయే. దానిని పరిష్కరిస్తేగాని గ్రామాలకు, పట్టణాలకు మధ్య వస్తువుల మార్పిడిని అభివృద్ధి చేయుట సాధ్యంకాదు. వ్యవసాయాన్ని అభివృద్ధిచేయుట లేక విచ్ఛిన్న పరిస్థితులనుండి పరిశ్రమలను పునరుద్ధరించుట సాధ్యం కాదు.

ఆ రోజుల్లో సోవియట్ వర్తకం ఇంకా చాలా వెనుకబడ్డ స్థితిలోనే వుంది. వర్తకానికి అవసరమైన యంత్రాంగం చాలా తక్కువగా వుంది. కమ్యూనిస్టులు వర్తక కళను ఇంకా నేర్చుకోలేదు. వారింకా తమ శత్రువును అనగా నెప్‌మాన్ (Nepman - నూతన ఆర్థిక విధానం ప్రారంభ దశలోని పారిశ్రామిక యజమాని, వర్తకుడు, అధికలాభాపేక్షాపరుడు) గుట్టును గ్రహించలేదు. అతన్ని ఎలా ఎదుర్కో-

వాలో నేర్చుకోలేదు. ప్రయివేటు వర్తకులు లేక నెప్‌మామన్ సోవియట్ వర్తకం వెనుకబడిన స్థితిని అవకాశంగా తీసుకొన్నారు. ప్రజలకు ఎక్కువగా అవసరమైన వస్తువుల, బట్టల వ్యాపారాన్ని వారు వశపరచుకొన్నారు. ప్రభుత్వ, సహకార వర్తకాలను సంఘటితపరచుట అత్యంత ప్రాముఖ్యమైన విషయమైంది.

11 వ కాంగ్రెస్ తర్వాత ఆర్థికరంగంలో పని ద్విగుణీకృతోత్సాహంతో ప్రారంభించబడింది. ఇటీవల పంటలు పండక పోవడం వల్ల గల్గిన నష్టాలను విజయవంతంగా ఇప్పుడు ప్రభుత్వం పూడ్చుకో గలిగింది. రైతు వ్యవసాయం త్వరగా కోలుకొంది. రైళ్లు బాగా పనిచేయ నారంభించాయి. అనేక ఫ్యాక్టరీలు, పరిశ్రమలు తిరిగి పనిని ప్రారంభించాయి.

1922 అక్టోబరులో సోవియట్ రిపబ్లిక్ మరొక మహా విజయాన్ని సాధించి పండుగ జేసుకొంది. దురాక్రమణదారుల చేతిలో మిగిలియున్న చివరి సోవియట్ భూభాగం - వ్లాడివోస్టాక్‌ను జపానువాళ్ళనుండి రెడార్మీ, దూరప్రాచ్య గెరిల్లాలు కలసి లాక్కొన్నారు.

విదేశ దురాక్రమణ దారులనుండి సోవియట్ రిపబ్లికంతా విముక్తి పొందింది. శత్రువులు పూర్తిగా తుడిచిపెట్టబడ్డారు. సోషలిస్టు నిర్మాణమూ, జాతీయ రక్షణా యిప్పుడవసరం. ఇందుకు సోవియట్ ప్రజల ఐక్యతను మరింత స్థిరపరచుట అవసరం. సోవియట్ రిపబ్లిక్కులను ఒక ఫెడరల్ ప్రభుత్వంగా సన్నిహితంగా మేళవించవలసిన అవుసరం ఇప్పుడు ఏర్పడింది. సోషలిస్టు నిర్మాణానికి ప్రజాశక్తు లన్నిటినీ కలప

వలసిన ఆవశ్యకత ఏర్పడింది. దేశాన్ని దుర్భేద్యం చేయాలిసిన అవసరముంది. మనదేశంలోని ప్రతి జాతిని సర్వతోముఖంగా అభివృద్ధి చేయుటకు అనువయిన పరిస్థితులను సృష్టించాలి. ఇందుకు సోవియట్ జాతులన్నిటినీ మరింత సన్నిహిత సంబంధాలు కల్గిన యూనియన్‌లోకి తీసుకరావలసి యుంటుంది.

1922 డిశంబరులో అఖిల సోవియట్ల యూనియన్ ప్రథమ కాంగ్రెస్ జరిగింది. దీనిలో లెనిన్, స్టాలిన్‌ల సూచనలపైన సోవియట్ జాతుల యిచ్ఛాపూర్వక ప్రభుత్వ యూనియన్ ఏర్పడింది. సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ (యు. యస్. యస్. ఆర్.) ఏర్పర్చబడింది. మొదట యు. యస్. యస్. ఆర్‌లో రష్యన్ సోవియట్ ఫెడరేటివ్ సోషలిస్టు రిపబ్లిక్ (ఆర్. యస్. యఫ్. యస్. ఆర్) ట్రాన్స్ కాకేషియన్ సోవియట్ ఫెడరేటివ్ సోషలిస్టు రిపబ్లిక్ (టి. యస్. యఫ్. యస్. ఆర్.), యుక్రేనియన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ (యుక్రే. యస్. యస్. ఆర్), బైలో రష్యన్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్ (బి. యస్. యస్. ఆర్) మాత్రమే వుండేవి. తర్వాత కొంత కాలానికి మూడు స్వతంత్ర సోవియట్ రిపబ్లిక్ యూనియన్లు - యుజ్‌బెక్, టర్కుమెన్, తాజిక్ - అనునవి మధ్య ఆసియాలో ఏర్పడ్డాయి. ఈ రిపబ్లిక్కులన్నీ కలసి సోవియట్ ప్రభుత్వాల ఏకైక యూనియన్‌లో అనగా యు. యస్. యస్. ఆర్. లో యిచ్ఛాపూర్వకంగా సమాన ప్రాతిపదికపైన ఐక్యమయ్యాయి. అయితే వీటిలో ప్రతి యూనియన్‌కు సోవియట్ యూనియన్‌నుండి స్వేచ్ఛగా విడిపోయేహక్కు వుంది.

సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ స్థాపించడమంటే సోవియట్ అధికారాన్ని సుస్థిరపరచుకోవడమన్నమాట. జాతుల సమస్యలపైన బోల్షివిక్ పార్టీ యొక్క లెనినిస్టు, స్టాలినిస్టు విధానం ఘనవిజయం పొందిందన్నమాట.

1922 నవంబరులో మాస్కో సోవియట్ సంపూర్ణ సమావేశం (ప్లీనం)లో మాట్లాడుతూ లెనిన్ గత అయిదేండ్ల సోవియట్ పరిపాలనను సమీక్ష చేశాడు. "నూతన ఆర్థిక విధానపు రష్యా, సోషలిస్టు రష్యాగా మారుతుంద"ని దృఢమైన నమ్మకాన్ని వెలిబుచ్చాడు. ఇదే లెనిన్ దేశానికి ఒసంగిన చివరి ఉపన్యాసం. అదే సంవత్సరం ఆకురాలు కాలంలో పార్టీకి గొప్ప దురదృష్టం సంభవించింది. లెనిన్ తీవ్రంగా జబ్బు పడ్డాడు. అయన జబ్బుపడటం పార్టీ అంతటికీ, శ్రామిక ప్రజలందరికీ గాఢమైన, వ్యక్తిగతమైన తీరని దెబ్బ. తమకు ప్రేమపాత్రుడైన లెనిన్ జీవితం కోసమై అందరూ భయకంపితులయ్యారు. కాని జబ్బులో కూడా లెనిన్ తన పనిని మానివెయ్యలేదు. అత్యంత వ్యాధిగ్రస్తుడై వుండి కూడా ఆయన అనేక అతి ముఖ్యమైన వ్యాసాలను వ్రాశాడు. ఈ చివరి వ్రాతలలో ఆయన పార్టీ యిదివరకు చేసిన పనిని సమీక్షించాడు. సోషలిస్టు నిర్మాణఆశయసిద్ధికి రైతాంగాన్ని సమీకరించుట ద్వారా మనదేశంలో సోషలిజాన్ని నిర్మించేందుకు ఒక పథకాన్ని సూచించాడు. సోషలిజం నిర్మించే పనిలో రైతాంగం పాల్గొనేందుకు ఆయన తయారుచేసిన సహకార పథకం కూడ (కోపరేటివ్ ప్లాను) ఇందులో వుంది.

చిన్న చిన్న వ్యక్తిగత వ్యవసాయ భూములను విస్తార ప్రమాణ ఉత్పత్తి సంఘాలుగా లేక సమిష్టి క్షేత్రాలుగా పరివర్తన చేయాలి. ఇందుకు లక్షలాది రైతులకు అందు బాటులోవుండే, అర్థమయ్యే సాధనాలు సాధారణంగా సహకార సంఘాలనీ, ప్రత్యేకంగా వ్యవసాయ సహకార సంఘాలనీ లెనిన్ భావించాడు. మనదేశంలో వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడానికి అవలంబింపవలసిన పంథా ఇది: సహకార సంఘాల ద్వారా సోషలిస్టు నిర్మాణ కార్యంలోకి రైతులను ఆకర్షించాలి. క్రమంగా అనగా మొదట అమ్మకంలోను, తర్వాత వ్యవసాయ ఉత్పత్తిలోను సమిష్టి సూత్రాన్ని ప్రవేశ పెట్టుట అని లెనిన్ పేర్కొన్నాడు. శ్రామికవర్గ నియంతృత్వం, కార్మికవర్గ రైతాంగాల సమ్మేళనం ఏర్పడింది. రైతాంగంపై శ్రామికవర్గ నాయకత్వం దృఢతరమైంది. సోషలిస్టు పరిశ్రమ అమలులోకి వచ్చింది - వీటన్నిటివల్లా - లక్షలాది రైతులను యిముడ్చుకొనే ఉత్పత్తి సహకార సంఘ విధానాన్ని సరిగా నిర్మించవచ్చుననీ, అలా నిర్మించిన పక్షంలో మనదేశంలో సంపూర్ణ సోషలిస్టు సమాజాన్ని నెలకొల్పవచ్చునని లెనిన్ భావించాడు.

**1923** ఏప్రిల్‌లో పార్టీ **12** వ కాంగ్రెస్ జరిగింది. బోల్షివిక్కులు అధికారాన్ని స్వీకరించిన తరువాత లెనిన్ హాజరుకాలేకపోయిన కాంగ్రెస్ ఇదే మొదటిది. **3** లక్షల **86** వేల పార్టీసభ్యులకు ప్రాతినిధ్యం వహిస్తూ వోటింగు హక్కు గలిగిన **408** మంది ప్రతినిధులు హాజరయ్యారు. ఈ సంఖ్య గత కాంగ్రెస్‌లో కంటే తక్కువే. ఇందుకు కారణం ఈ మధ్యకాలంలో పార్టీ వడపోత ఫలితంగా పార్టీ

సభ్యులలో కొంతమందిని వెళ్ళగొట్టుట సంభవించింది. 12 వ కాంగ్రెస్‌కు వోటింగు హక్కు లేకుండా చర్చించే హక్కుగల ప్రతినిధులు 417 మంది హాజరయ్యారు.

లెనిన్ ఇటీవల వ్రాసిన వ్యాసాలలోని, లేఖలోని సలహాలను పార్టీ 12 వ కాంగ్రెస్ తన నిర్ణయాలలో ఇమిడ్చింది.

నూతన ఆర్ధిక విధానమంటే సోషలిస్టు స్థితినుండి తిరిగి పోవటమనీ, పెట్టుబడిదారీ విధానానికి లొంగిపోవటమనీ చెప్పేవారిని, పెట్టుబడిదారీ దాస్యానికి తిరిగిపోవాలని ప్రబోధించే వారిని కాంగ్రెస్ తీవ్రంగా ఖండించింది. ఇలాంటి సూచనలు కాంగ్రెస్‌లో ట్రాట్స్కీ అనుచరులైన రాడెక్, క్రాసిన్‌లు చేశారు. మనం విదేశ పెట్టుబడిదారుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడాలనీ, సోవియట్ ప్రభుత్వానికి ముఖ్యావసరమైన కొన్ని పరిశ్రమలను సౌకర్యాల (కన్సెషన్సు) రూపేణా వారికి ఇచ్చివేయాలనీ వీరు సూచించారు. అక్టోబరువిప్లవం రద్దుచేసిన జారుప్రభుత్వ ఋణాలను మనం చెల్లించాలని కూడా సూచించారు. ఈ లొంగుబాటు సూచనలు ద్రోహకరమయినవని పార్టీ వర్ణించింది. విదేశపెట్టుబడిదార్లకు కొన్ని సౌకర్యాలను కలుగజేసే విధానాన్ని కాంగ్రెస్ తిరస్కరించలేదు. కాని అలాంటి సౌకర్యాలను సోవియట్ ప్రభుత్వానికి లాభదాయకంగావుండే పరిశ్రమలలోనే, లాభదాయకంగావుండే మేరకే ఈయాలని అది అంగీకరించింది.

కాంగ్రెస్ జరగకపూర్వ మేబుఖారిన్, సొకోల్నికావ్‌లు విదేశవర్తకంపై ప్రభుత్వపు గుత్తను రద్దుచేయవలసిందని సూచించారు. నూతన ఆర్థికవిధానం, పెట్టుబడిదారీ విధానానికి

లాంగుబాటు అనే భావనపై ఆధారపడే యీ సూచన చేయ బడింది. లాభాలను గుంజేవాళ్ళు, నెప్‌మాన్, కులక్‌లు మొద లగు వారి తరఫున వాదించే మొనగాడు బుఖారిన్ అని లెనిన్ విమర్శించాడు. విదేశవర్తకంపై గుత్తనుకూలద్రోసే ప్రయ త్నాలను 12 వ కాంగ్రెస్ గట్టిగా తిరస్కరించింది.

రైతులయెడ అవలంబించవలసిన వైఖరిని గురించి ట్రాట్స్కీ పార్టీపై ఒకవిధానాన్ని రుద్దడానికి ప్రయత్నించాడు. దీనినికూడా కాంగ్రెస్ తిరస్కరించింది. ఆవిదానాన్ని అవలం బించినట్లయితే సర్వనాశనం సంభవించేది. దేశంలో చిన్నచిన్న రైతుల వ్యవసాయం ప్రాబల్యంగా వుందన్న విషయాన్ని మరచి పోగూడదని కాంగ్రెస్ ప్రకటించింది. భారీ పరిశ్రమలతోసహా అన్ని పరిశ్రమల అభివృద్ధికూడ రైతాంగ ప్రజల ప్రయోజ నాలకు వ్యతిరేకంగా నడవకూడదనీ, రైతులతో సన్నిహిత సఖ్యంపై ఆధారపడి కష్టజీవులైన ప్రజలందరి ప్రయోజనాల కోసం ఆ పరిశ్రమాభివృద్ధి జరగాలనీ, కాంగ్రెస్ గట్టిగా నొక్కిచెప్పింది. రైతులను దోపిడిచేయుటద్వారా మనం పరి శ్రమలను నిర్మించాలని సూచించిన ట్రాట్స్కీకి, శ్రామికవర్గ, రైతాంగాల సమ్మేళనా విధానాన్ని వాస్తవంగా అంగీకరించని ట్రాట్స్కీకి యీ నిర్ణయాలు తగిన జవాబిచ్చాయి.

ఇదే సమయంలో ట్రాట్స్కీ మరొక సూచన చేశాడు లాభకరంగా లేవనే మిషతో దేశరక్షణకు చాలా ప్రాముఖ్య మైన పుట్యాటిలోవ్, బ్రియాన్స్కీ మొదలగు పెద్దపెద్ద పరి శ్రమాగారాలను మూసివేయాలన్నాడు. ఈ సూచనలను కాంగ్రెస్ ఆగ్రహంతో త్రోసిపుచ్చింది.

12 వ కాంగ్రెస్‌కు లెనిన్ ఒక సూచనను వ్రాసి పంపాడు! ఆ సూచన ననుసరించి పార్టీ యొక్క కేంద్రకంట్రోల్ కమిషన్ను, కార్మికుల, రైతుల అజమాయిషీ సంఘాన్ని (Workers and peasents Inspection) ఒకే సంఘంగా 12 వ కాంగ్రెస్ కలిపివేసింది. పార్టీ ఐక్యతను కాపాడుట, పార్టీని బలపరచుట, పౌరక్రమశిక్షణను బలపరచుట, సోవియట్ రాజ్యాంగ యంత్రాన్ని అన్నివిధాలా అభివృద్ధిచేయుట, మొదలైన ముఖ్యవిధులను ఈ ఐక్య సంఘానికి అప్పగించింది.

కాంగ్రెస్ చర్చనీయాంశాలలో ముఖ్యమైన ఒక్క అంశం జాతుల సమస్య. దీనిపై కామ్రేడ్ స్టాలిన్ రిపోర్టు ఇచ్చాడు. జాతుల సమస్యపై మనం అవలంబించిన విధానం యొక్క అంతర్జాతీయ ప్రాముఖ్యతను కామ్రేడ్ స్టాలిన్ నొక్కి చెప్పాడు. జాతుల సమస్యా పరిష్కారానికీ, ఒక జాతిని మరొకజాతి పీడించే విధానం రద్దుకావడానికీ, ప్రాక్ పశ్చిమ దేశాలలోని పీడితప్రజలకు సోవియట్ యూనియన్ ఒక ఆదర్శంగా వుంది. సోవియట్ యూనియన్ ప్రజలలో ఆర్థిక, సాంస్కృతిక అసమానతను అంతంచేయటానికి తీవ్రమైన చర్యలు అవసరమని కామ్రేడ్ స్టాలిన్ తెలియజేశాడు. జాతుల సమస్యలో మహారష్యా అనే జాతీయ దురహంకారం స్థానిక బూర్జువా జాతీయవాదం అనే పెడత్రోవలకు వ్యతిరేకంగా, నిశ్చితపోరాటం సాగించవలసిందని పార్టీని స్టాలిన్ కోరాడు.

జాతీయ సమస్య విషయంలో పెడత్రోవను పట్టినవారినీ (డీవియేటర్సు), మైనారిటీ జాతులపైన పెత్తనం చేసే పైవారి విధానాన్ని, కాంగ్రెస్ బట్టబయలు చేసింది. ఆ రోజుల్లో

జాతుల సమస్యలో పెడ్రోవలుపట్టిన జార్జియన్ జాతికిచెందిన మిడివానీ మొదలగువారు పార్టీని వ్యతిరేకించుతున్నారు. వారు ట్రాన్స్‌కాకేషియన్ ఫెడరేషన్ ఏర్పరచటానికి వ్యతిరేకులు. ట్రాన్స్‌కాకేషియా ప్రజలమధ్య స్నేహాన్ని అభివృద్ధిచేయటానికి వారువ్యతిరేకులు.జార్జియాలోని యితరజాతులపట్ల పెత్తనంచేసే పూర్తిజాతి దురహంకారుల వలెనే వీరు ప్రవర్తించసాగారు. వారుటిఫ్లిస్‌నుండి జార్జియన్లుకానివారిని ముఖ్యంగా ఆర్మీనియన్లను వెళ్ళగొట్ట ప్రారంభించారు. జార్జియన్ స్త్రీలు అన్యజాతీయులను వివాహమాడితే, జార్జియన్ పౌరసత్వం పోతుందని ఒక చట్టం చేశారు. పెడ్రోవపట్టిన ఈ జార్జియన్ జాతీయవాదులను ట్రాట్స్కీ, రాడెక్, బుఖారిన్, స్క్రిప్‌నిక్, రాకోవస్కీ మొదలగువారు బలపరచారు.

కాంగ్రెస్ జరిగిన తరువాత వివిధ జాతీయ రిపబ్లిక్‌ల నుండి వచ్చిన పార్టీ వర్కర్ల ప్రత్యేక సమావేశం ఒకటి జరిగింది. ఇది జాతుల సమస్యను చర్చించటానికి ఏర్పరచబడింది. ఇక్కడ తాతార్ బూర్జువా జాతీయవాదులైన సుల్తాన్‌గాలీవ్ మొదలగు వారినీ, పెడ్రోవ పట్టిన ఉజ్బెక్ జాతీయవాదుల ముఠాను, అనగా ఫైజుల్లా ఖోడ్జియెవ్ మొదలగువారినీ ఈ సందర్భములో బట్టబయలు చేశారు.

గత రెండు సంవత్సరాలలోను నూతన ఆర్థికవిధానం సాధించిన ఫలితాలను పార్టీ 12 వ కాంగ్రెస్ సమీక్షించింది. అవి చాలా ప్రోత్సాహకరమైన ఫలితాలు. అంతిమ విజయంలో విశ్వాసాన్ని అవి మరింత ఇనుమడింప జేశాయి.

"మనపార్టీ ఐక్యంగానూ, దృఢంగానూ నిలిచింది. అది తీవ్ర ఫలితాలను దారితీయగల పరీక్షకు నిలబడగలిగింది. విజయోత్సాహంతో ముందుకు నడుస్తోంది" అని కాంగ్రెస్‌లో కామ్రేడ్ స్టాలిన్ ప్రకటించాడు.

# 4

ఆర్థిక పునరుద్ధరణా కాలంలోని కష్టాలను ఎదుర్కొంటూ చేసిన పోరాటం-లెనిన్ వ్యాధిగ్రస్తుడవటం అవకాశంగా తీసుకొని ట్రాట్స్కీ-వాదులు తమ కార్యకలాపాలను వృద్ధిచేయుట - నూతన పార్టీ చర్చ - ట్రాట్స్కీ-వాదుల ఓటమి - లెనిన్ మరణం - లెనిన్ స్మారకంగా పార్టీ సభ్యత్వం వృద్ధిచేయుట - పార్టీ 13 వ కాంగ్రెస్

జాతీయ ఆర్థిక సంపదను పునరుద్ధరించడానికి సాగించిన పోరాటం మొదటి సంవత్సరాలలోనే చెప్పుకోదగ్గ ఫలితాలను సమకూర్చింది. 1924 నాటికి అన్నిరంగాలలోను అభివృద్ధి కనిపించింది. 1921 నుండి పంటపండే భూమి విస్తీర్ణం తగినంతగా హెచ్చింది. రైతుల వ్యవసాయం క్రమంగా అభివృద్ధి చెందుతూంది. సోషలిస్టు పరిశ్రమ పెంపొంది విస్తరించుతూంది. కార్మికవర్గం సంఖ్యలో చాలా హెచ్చింది.

జీతాలు పెరిగాయి. 1920_21 లతో పోల్చిచూస్తే కార్మికుల్, రైతుల జీవితం చాల బాగుపడి సుఖప్రదమైంది.

కాని ఆర్థిక విచ్ఛిత్తియొక్క ఫలితాలు ఇంకా కన్పడు తూనే యున్నాయి. పరిశ్రమలు ఇంకా యుద్ధానికి పూర్వపు స్థాయికంటే తక్కువగానే ఉన్నాయి. ఇంకా పారిశ్రామికాభి వృద్ధి దేశ అవసరాలను తగినంతగాలేక ఎంతో వెనుకబడిఉంది. 1923 సంవత్సరాంతంలో దాదాపు 10 లక్షలమంది నిరుద్యోగు లున్నారు. నిరుద్యోగులను పనిలో ఇముడ్చుకోగలిగినంతగా జాతీయ ఆర్థికవిధానం పెంపొందడంలేదు. వర్తక అభివృద్ధి పారిశ్రామిక వస్తువుల విపరీతధరల వలన కుంటుబడింది. నెప్‌మెన్, మన వర్తక సంస్థలలోవున్న అలాంటి వ్యక్తులూ దేశంపై ఈ అధికధరలను రుద్దనాగారు. ఇందువల్ల సోవియట్ రూబుల్ నిలకడలేకుండా పోయింది. దాని విలువ పడిపో సాగింది. ఇవన్నీ కార్మికుల, రైతుల పరిస్థితి అభివృద్ధికాకుండా ఆటంకపరచాయి.

1923 ఆకురాలు కాలంలో మన పారిశ్రామిక వాణిజ్య సంస్థలు సోవియట్ ధరల విధానాన్ని ఉల్లంఘించడంవల్ల ఆర్థిక కష్టాలు కొంతవరకు హెచ్చాయి. పారిశ్రామిక వస్తువుల ధరలకు, వ్యవసాయ ఉత్పత్తి ధరలకు మధ్య వ్యత్యాసం చాలా వుంది. ధాన్యపు ధరలు చాల తక్కువగా వున్నాయి. పారిశ్రామిక వస్తువుల ధరలు అసాధారణంగా హెచ్చాయి. పరిశ్రమలు తలకుమించిన వ్యయంతో భారమైపోయాయి. అందుచే పారిశ్రామిక వస్తువుల ధరలు పెరిగాయి. రైతులు తమ ధాన్యాన్ని అమ్మటద్వారా పొందిన డబ్బుకు విలువ

త్వరగా తగ్గిపోసాగింది. పరిస్థితులను మరింత అధ్వాన్నం చేయటానికి ట్రాట్స్కీ-వాది కేటకావ్ పనిచేశాడు. అతడు ఆరోజుల్లో జాతీయ ఆర్థిక విధాన ఉన్నత సమితిలో (సుప్రీమ్ కౌన్సిల్ ఆఫ్ నేషనల్ ఎకానమీ) ఉండేవాడు. మేనేజర్లకు, డైరెక్టర్లకు యిచ్చిన వినాశకరమైన సూచనలలో, పారిశ్రామిక వస్తువుల అమ్మకంలో ఎంత వీలైతే అంతలాభాన్ని పిండాలనీ, వీలైనంత హెచ్చుస్థాయికి ధరలను పెంచాలనీ అతడు ఉత్తరువు లిచ్చాడు. ఇదంతా పరిశ్రమల అభివృద్ధిచేయటానికట. కాని వాస్తవంలో యీ నెపమాన్ విధానం పరిశ్రమల పునాదినే సంకుచితపరచి కూలద్రోస్తుంది. పారిశ్రామిక వస్తువులను కొనటం రైతాంగానికి నష్టకరంగావుంది. అందుచేత వారు కొనటం మానివేశారు: దీని ఫలితంగా అమ్మకంలో సంక్షోభం బయలుదేరింది. దానివల్ల పరిశ్రమలు దెబ్బతిన్నాయి. కార్మికులకు వేతనాలు చెల్లించటంలో కష్టాలువచ్చాయి. ఇది కార్మికులలో అసంతృప్తిని రెచ్చగొట్టింది. కొన్ని ఫ్యాక్టరీలలో చాలా వెనుకబడ్డ కార్మికులు పనిచేయటం మానివేశారు.

ఈ కష్టాలను, విపరీతాలను తొలగించటానికి అవసరమైన చర్యలను పార్టీ సెంట్రల్ కమిటీ తీసుకొంది. అమ్మకపు సంక్షోభాన్ని తొలగించటానికి కొన్నిచర్యలను తీసుకొన్నారు. నోట్ల చలామణిలో (కరెన్సీ) మార్పుచేసి, వినిమయ వస్తువుల ధరలు తగ్గించారు. నిలకడయైన, దృఢమైన 'చర్వోనెట్జ్' అనే కరెన్సీ యూనిట్‌ను ఏర్పరచటానికి నిర్ణయించబడింది. వేతనాలు మామూలుగా చెల్లించడం ప్రారంభించారు. ప్రభుత్వం ద్వారా, సహకార మార్గాల ద్వారా వర్తకాన్ని అభివృద్ధిచేసి

ప్రయివేటు వర్తకులను, అధికలాభాపేక్షాపరులను తొలగించ టానికి కొన్ని చర్యలను సూచించారు.

ఈసమయంలో కావలసింది, ప్రతివారు సమిష్టికృషిలో పాల్గొనటం, నడుములు బిగించి ఉత్సాహంతో పనికి పూను కోవటం. పార్టీ యెడల విశ్వాసమున్నవారందరూ ఇలాగే భావించి పనిచేశారు. కాని ట్రాట్స్కీవాదు లలాకాదు. తీవ్ర మైన జబ్బువల్ల లెనిన్ కదలలేకుండా వుండటం చూచి, పార్టీపైనా, పార్టీ నాయకత్వంపైనా మరొక కొత్త దాడిని ప్రారంభించారు. పార్టీని నాశనంచేసి, దాని నాయకత్వాన్ని కూలద్రోయుటకు ఇది చాల అనుకూలమైన సమయమని వారు నిర్ణయించుకొన్నారు. 1923 ఆకురాలు కాలంలో బల్గేరియా, జర్మనీల విప్లవాల ఓటమినీ, దేశంలోని ఆర్థిక కష్టాలనూ, లెనిన్ జబ్బుపడటాన్నీ ఇలా ప్రతిదానినీ పార్టీకి వ్యతిరేక ఆయుధంగా వారు ఉపయోగించుకొన్నారు. పార్టీ నాయకుడు జబ్బుతో లెనిన్ బాధపడుతున్న సమయంలో, బోల్షివిక్ పార్టీపై ట్రాట్స్కీ తన దాడిని ప్రారంభించాడు. పార్టీలో లెనినిస్టు వ్యతిరేకులైన వ్యక్తులనందరిని ప్రోగుచేసి, పార్టీకీ, పార్టీ నాయ కత్వానికీ పార్టీ విధానానికి వ్యతిరేకంగా ప్రతిపక్ష వేదిక నొకదానిని సృష్టించాడు. ప్రతిపక్షులైన 46 గురి ప్రకటన అంటూ దీనికిపేరు. ప్రతిపక్ష ముఠాలన్నీ - ట్రాట్స్కీవాదులు, డెమాక్రటిక్ సెంట్రలిస్టులు, "తీవ్రవాద కమ్యూనిస్టుల"లోను "కార్మిక ప్రతిపక్ష" ముఠాలలోను మిగిలిన వ్యక్తులు- లెనినిస్టు పార్టీపై పోరాడటానికి ఐక్యమయ్యారు. ఈ ప్రకటనలో తీవ్ర మైన ఆర్థిక సంక్షోభం రానున్నదనీ, సోవియట్ ప్రభుత్వం పడిపోనున్నదని జోస్యం చెప్పారు. ఈ పరిస్థితి నుండి బయటు

పడటానికి మార్గం చీలికలకు ముఠాలకు స్వాతంత్ర్యం ఇవ్వట మేననీ, అలాంటిస్వాతంత్ర్యాన్ని యీయవలసిందిగా కోరారు.

పార్టీ 10వ కాంగ్రెస్‌లో లెనిన్ సూచనపైన ముఠా తత్వాన్ని నిషేధించారు. దానినే తిరిగి పునరుద్ధరించడానికి సాగించిన పోరాటమే ఇది.

ట్రాట్స్కీ-వాదులు వ్యవసాయాన్ని, లేకపరిశ్రమలను అభివృద్ధి చేయటానికిగానీ, వస్తువులపంపిణీని అభివృద్ధి చేయడానికిగానీ, కష్టపడే ప్రజల పరిస్థితిని అభివృద్ధిపరచడానికిగానీ నిశ్చితమైన సూచనను ఒక్క-దానినీ చేసిన పాపానపోలేదు. ఇది వారికి పట్టనేలేదు. వారికి పట్టినదల్లా లెనిన్ జబ్బు నాధారంగా తీసుకొని పార్టీలో చీలికలు పునరుద్ధరించడం, పార్టీ పునాదులనూ పార్టీ సెంట్రల్ కమిటీని కూలద్రోయటానికి కృషి చేయడం.

ఈ 46 గురివేదిక (ముఠా) ఏర్పరచడంతో పాటు ట్రాట్స్కీ ఒక లేఖను ప్రకటించాడు. దానిలో పార్టీ అనుయాయులను దూషించాడు. పార్టీపై కొత్త నిందాగర్భితమైన ఆరోపణలను చేశాడు. ఈ ఉత్తరంలో ట్రాట్స్కీ పాత మెన్షివిక్కు పురాణాలనే వల్లించాడు. పార్టీ అనేకసార్లు వీటిని ఇంతకు పూర్వమే అతను చెప్పగా విన్నది.

మొట్టమొదట ట్రాట్స్కీ-వాదులు పార్టీ యంత్రాంగంపై దాడిచేశారు. బలోపేతమైన యంత్రాంగం లేనిదే పార్టీ జీవించి పనిచేయలేదని వారికి తెలుసు. అందుచే ఈ ప్రతిపక్షం పార్టీ యంత్రాంగాన్ని నాశనంచేసి కూలద్రోయాలని తలచింది. పార్టీ సభ్యులను దానిపైకి ఉసికొల్పాలని ప్రయత్నించింది. పార్టీలోని రాటుదేలిన వయోవృద్ధులైన యోధులపై యువక సభ్య

లను ఉసిగొల్ప ప్రయత్నించారు. ట్రాట్స్కీ-వాదానికి వ్యతిరేకంగా పార్టీ సాగించిన, పార్టీ చరిత్ర తెలియని యువకపార్టీ సభ్యులను, విద్యార్థులను రెచ్చగొట్టడానికి యీ ఉత్తరంలో ట్రాట్స్కీ పూనుకొన్నాడు. విద్యార్థుల అండను సంపాదించడానికి ట్రాట్స్కీ వారిని పొగడాడు. "పార్టీకి ఖచ్చితమైన కొలతబద్ద (బరామీటర్) మీరేన"ని పొగిడాడు. దీనితోబాటు లెనినిస్టు వయోవృద్ధ యోధులంతా (ఓల్డ్ గార్డు) పతనం చెందారని ప్రకటించాడు. రెండవ ఇంటర్నేషనల్ నాయకుల పతనాన్ని ఉదహరించి అదేవిధంగా బోల్షివిక్కు వృద్ధనాయకులుకూడా పోతున్నారని సూచించుతూ ట్రాట్స్కీ తుచ్ఛమైన అభాండం వేశాడు. పార్టీ పతనాన్ని గురించి వేసిన యీ పొలికేకతో ట్రాట్స్కీ తన పతనాన్ని, తన పార్టీ వ్యతిరేక కుట్రబుద్ధిని దాచుకోవాలని ప్రయత్నించాడు.

ట్రాట్స్కీ వాదులు, ప్రతిపక్షంవారి పత్రాలను రెంటినీ అనగా '46గురి వేదిక'ను, 'ట్రాట్స్కీ ఉత్తరాన్ని'జిల్లాలలోను, పార్టీ కణాల (Nuclei) లోను పంచిపెట్టారు. పార్టీసభ్యులు వాటిని చర్చించాలని కోరారు.

వీటిని చర్చించాలని పార్టీని వారు సవాలు చేశారు.

పార్టీ 10 వ కాంగ్రెస్‌లో కార్మిక సంఘసమస్యపైన చర్చను రుద్దినట్లుగానే, ఇప్పుడుకూడ ట్రాట్స్కీ-వాదులు పార్టీపైన సాధారణ చర్చజరపాలని ఒత్తిడిచేశారు.

ఇంతకన్నా చాలా ప్రాముఖ్యమైన దేశ ఆర్థిక జీవితానికి సంబంధించిన సమస్యలపైన నిమగ్నమై యున్నప్పటికీ, ఈ సవాలును అంగీకరించి పార్టీ చర్చను ప్రారంభించింది.

ఈ చర్చలో పార్టీ అంతా నిమగ్నమైంది. పోరాటం అతి తీవ్రరూపం దాల్చింది. మాస్కోలో అది అత్యంతభయం కరరూపం దాల్చింది. రాజధానీ నగరంలోని పార్టీ సంస్థను వశపరచుకోవాలని ట్రాట్స్కీ-వాదులు ప్రయత్నించారు. కాని యీ చర్చ ట్రాట్స్కీ-వాదులకు ఏమీ సహాయపడలేదు. వారిని మరింత అపఖ్యాతిపాలు చేసింది. మాస్కోలోను, సోవియట్ యూనియను ఇతర భాగాలలోను వారు పూర్తిగా అపజయం పాలయ్యారు. విశ్వవిద్యాలయాలలోనూ, ఆఫీసుల లోను కొద్దికణాలు మాత్రమే (ప్రాథమికపార్టీ సంఘాలు మాత్రమే) ట్రాట్స్కీ-వాదులకు వోటు చేశాయి.

1924 జనవరిలో 13 వ సమావేశాన్ని (కాన్ఫరెన్సు) జరిపింది. దీనిలో కామ్రేడ్ స్టాలిన్ చర్చఫలితాలను క్రోడీక రించుతూ ఒకరిపోర్టు యిచ్చాడు. ఈ సమావేశం ట్రాట్స్కీ-వాదుల ప్రతికూలతను ఖండించింది. అది మార్క్సిజంనుండి పెడత్రోవపట్టిన మధ్యతరగతి వాదమని (పెటీబూర్జువా డివి యేషన్ ఫ్రమ్ మార్క్సిజం) యీసమావేశం ఖండించింది ఈసమావేశ తీర్మానాలను ఆతరువాత పార్టీ 13వ కాంగ్రెసూ, కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ 5వ కాంగ్రెసూ ఆమోదించాయి. ట్రాట్స్కీ-వాదానికి వ్యతిరేకంగా బోల్షివిక్‌పార్టీ చేసిన పోరా టాన్ని అంతర్జాతీయ కమ్యూనిస్టు కార్మికవర్గం బలపరచింది.

కాని ట్రాట్స్కీ- వాదులు తమ విద్రోహ చర్యలను మానలేదు. 1924 అకురాలు కాలంలో ట్రాట్స్కీ "అక్టోబరు గుణపాఠాలు" అనే పేరుతో ఒక వ్యాసాన్ని ప్రకటించాడు. అందులో లెనినిజం స్థానే ట్రాట్స్కీ-జంను పెట్టటానికి ప్రయ

త్నించాడు. అది మన పార్టీ మీద, పార్టీ నాయకుడను లెనిన్ మీద కేవలం నింద తప్ప మరేమీ కాదు. ఈ నిందా గర్భిత పత్రాన్ని సోవియట్ ప్రభుత్వానికీ కమ్యూనిజానికీ శత్రువు లయిన వారందరూ ఉపయోగించుకొన్నారు. బోల్షివిజం యొక్క వీరోచిత చరిత్రను సిగ్గు బిడియం లేకుండా ట్రాట్స్కీ మార్చి చేసిన ఈ వక్ర భాష్యానికి పార్టీ క్రోధంతో ఉడికిపోయింది. లెనినిజం స్థానే ట్రాట్స్కీజంను ప్రవేశపెట్టాలనే ట్రాట్స్కీ ప్రయత్నాన్ని కామ్రేడ్ స్టాలిన్ ఖండించాడు. "ట్రాట్స్కీజం ఒక సిద్ధాంత ధోరణిగా లేకుండా పూడ్చిపెట్టవలసిన విధి పార్టీద"ని కామ్రేడ్ స్టాలిన్ ప్రకటించాడు.

ట్రాట్స్కీవాదం సిద్ధాంత రీత్యా ఓడిపోవటానికీ, లెనినిజాన్ని సంరక్షించటానికీ కామ్రేడ్ స్టాలిన్ వ్రాసిన సిద్ధాంత గ్రంథం తగిన సహాయం చేసింది. ఆ గ్రంథంపేరు లెనినిజం యొక్క పునాదులు (ఫౌండేషన్సు ఆఫ్ లెనినిజం). ఇది 1924 లో ప్రకటించబడింది. ఈ గ్రంథం లెనినిజాన్ని విశదీకరించే సిద్ధాంతగ్రంథం. ఇది లెనినిజాన్ని చక్కగా నిరూపించే సిద్ధాంత గ్రంథం. అప్పటికీ ఇప్పటికీ ప్రపంచమంతటా బోల్షివిక్కుల చేతుల్లో మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతమనే నిశిత ఆయుధంగా ఈ గ్రంథం ఉపయోగించుతూంది.

ట్రాట్స్కీ వాదానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాలలో సెంట్రల్ కమిటీ చుట్టూ పార్టీ నిలబడేటట్లు కామ్రేడ్ స్టాలిన్ చేశాడు. మనదేశంలో సోషలిస్టు విజయంకై సాగించవలసిన పోరాటాన్ని కొనసాగించుటకై పార్టీని సమీకరించాడు. సోషలిజం విజయవంతంగా పురోగమించడం తథ్య

మయ్యేటట్లు చెయ్యాలంటే, ట్రాట్స్కీ-జాన్ని సిద్ధాంతరీత్యా సర్వనాశనం చెయ్యాలని కామ్రేడ్ స్టాలిన్ నిరూపించాడు.

ట్రాట్స్కీ-జానికి వ్యతిరేకంగా జరిగిన పోరాట కాలాన్ని సమీక్షిస్తూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"ట్రాట్స్కీ-జంను ఓడించితే తప్ప నూతన ఆర్థికవిధాన పరిస్థితులలో విజయాన్ని సాధించడం అసాధ్యం. ఈనాటి రష్యాను సోషలిస్టు రష్యాగా మార్చడం అసాధ్యం."

కాని పార్టీ యొక్క లెనినిస్టు విధానం పొందిన విజయాలను, కార్మికవర్గానికీ, పార్టీకీ సంభవించిన ఒకమహాప్రమాదం మేఘంలాగా కమ్మివేసింది. 1924 జనవరి 21 వ తేదీన మన నాయకుడూ, మన గురువూ, బోల్షివిక్ పార్టీ నిర్మాతా అయిన లెనిన్ మాస్కో-వద్ద గోర్కీ అనే గ్రామంలో మరణించాడు. లెనిన్ మరణంతో యావత్ ప్రపంచ కార్మికవర్గం తమకు అతి తీవ్రమైన నష్టం జరిగిందని గుర్తించింది. లెనిన్ అంత్యక్రియల రోజున అంతర్జాతీయ శ్రామికవర్గం అయిదునిమిషాల పాటు కార్మికులంతా పని మానివెయ్యాలని ప్రకటించింది. రైల్వేలు, మిల్లులు, ఫ్యాక్టరీలు అన్నీ ఆగిపోయాయి. లెనిన్‌ను సమాధి చేస్తున్నపుడు యావత్ ప్రపంచ కార్మికవర్గమూ పొంగి పొరలుతున్న దుఃఖాన్ని ఆపుకొంటూ 'లెనిన్ తమకు పితృతుల్యుడనీ, గురువనీ, అత్యుత్తమ స్నేహితుడనీ, సంరక్షకుడనీ ప్రసంసించారు.

లెనిన్ మరణంతో సోవియట్ యూనియన్‌లోని కార్మికవర్గం లెనినిస్టుపార్టీ పక్షాన మరింత ఐక్యతతో నిలిచింది.

ఆ సంతాప దినాలలో ప్రతి వర్గ చైతన్యంగల కార్మికుడు లెనిన్ ఆజ్ఞలను ఆచరణలో పెట్టే కమ్యూనిస్టు పార్టీ యెడల తన వైఖరి యేమిటో తెలియపరచాడు. పార్టీలో చేర్చుకో వలసిం దిగా కోరుతూ కార్మికులు పంపిన దరఖాస్తులు వేలకువేలు పార్టీ సెంట్రల్ కమిటీకి వచ్చిపడ్డాయి. అభివృద్ధిచెందిన కార్మి కుల ఈ ఉద్యమానికి సెంట్రల్ కమిటీ ఆమోదాన్ని తెలిపింది. లెనిన్ స్మారక సభ్యత్వమంటూ ప్రకటించింది. పార్టీలోనికి అభివృద్ధిచెందిన కార్మికులను చేర్చుకొనటానికి అంగీకరించింది. వేలకొలది కార్మికులు పార్టీలోకి గుంపులుగా చేరారు. పార్టీ ఆశయంకోసం, లెనిన్ ఆశయంకోసం తమప్రాణాలను అర్పించ టానికి సిద్ధమైన ప్రజలువారు. కొద్దికాలంలోనే 2 లక్షల 40వేల మంది కార్మికులు బోల్షివిక్‌పార్టీలో చేరారు. వారు కార్మిక వర్గంలో అందరికన్నా ముందు నడచేభాగం. ఎక్కువ వర్గ చైతన్యం గలవారు. విప్లవకారులు. మంచి క్రమశిక్షణ గల వారు. అతి నిర్భయులు. <u>లెనిన్ స్మారక సభ్యత్వ ఉద్యమం ఇది.</u>

లెనిన్ మరణం తర్వాత వ్యక్తమయిన పై విషయాలు మనపార్టీ ప్రజాసామాన్యంలో ఎంత సన్నిహితంగా సంబం ధాలు కల్గియున్నదో ప్రదర్శించాయి. కార్మికుల హృదయాలలో లెనినిస్టుపార్టీ ఎంత ఉన్నత స్థానాన్ని ఆక్రమించుకుందో తెలియ జేశాయి.

లెనిన్‌కై పరితపించుచున్న దినాలలో సోవియట్ యూనియన్ యొక్క సోవియట్ల రెండవ కాంగ్రెస్ జరిగింది. అందులో పార్టీపేరిట కామ్రేడ్ స్టాలిన్ పవిత్రమైన ఈ క్రింది ప్రతిజ్ఞను గావించాడు :

"కమ్యూనిస్టులమగు మనం ప్రత్యేకపదార్థంతో మూస పోయబడిన ఒక ప్రత్యేక తరహా ప్రజలం. శ్రామికవర్గ మహా వ్యూహ నిర్మాతయైన కామ్రేడ్ లెనిన్ సైన్యానికి చెందినవారం. ఈ సైన్యానికి చెందియుండటం కన్న ఉన్నతమైన గౌరవం మరొకటిలేదు. కామ్రేడ్ లెనిన్ స్థాపించి నాయకత్వం వహించిన పార్టీ యొక్క సభ్యత్వం అనే అర్హతకన్నా ఉన్నతమైనది మరేదీలేదు...

"కామ్రేడ్ లెనిన్ మనలను వీడిపోతూ పార్టీ సభ్యత్వ మనే గొప్ప అర్హత యొక్క పవిత్రతను కాపాడాలనీ, దాని ఔన్నత్యాన్ని నిలపాలనీ ప్రతినచేయించాడు. కామ్రేడ్ లెనిన్! మీ ఆజ్ఞను గౌరవ ప్రదంగా పూర్తి చేస్తామని ప్రతిజ్ఞ చేస్తున్నాం!...

"మనలను వీడిపోతూ కామ్రేడ్ లెనిన్ మన పార్టీ ఐక్యతను కంటిపాపవలె కాపాడమని ప్రతిజ్ఞ చేయించాడు. కామ్రేడ్ లెనిన్ ! ఈ ఆజ్ఞను కూడా గౌరవప్రదంగా పూర్తి చేస్తామని మేము ప్రతిన చేస్తున్నాం.

"కామ్రేడ్ లెనిన్ మనలను వీడిపోతూ శ్రామికవర్గ నియంతృత్వాన్ని కాపాడి బలపరచాలని ప్రతిన చేయించాడు. కామ్రేడ్ లెనిన్ ! ఈ మీ ఆజ్ఞను కూడా గౌరవప్రదంగా నెరవేర్చుటకు అన్నివిధాలా ప్రయత్నించుతామని మేము మీకు మాట యిస్తున్నాం !

"కామ్రేడ్ లెనిన్ మనలను వీడిపోతూ మన శక్తి నంతా ఉపయోగించి కార్మికుల, రైతుల మైత్రిని బలపరచ వలసిందని ప్రతిజ్ఞ చేయించాడు. కామ్రేడ్ లెనిన్ !

ఈ ఆజ్ఞను కూడ గౌరవప్రదంగా నెరవేరుస్తామని ప్రతినబూను తున్నాం!...

"మన దేశంలోని వివిధ జాతులు ఇచ్ఛాపూర్వకంగా ఏకం కావలసిన ఆవశ్యకతను, రిపబ్లిక్కుల యూనియన్ అనే చట్రం లోపలనే వివిధ జాతులమధ్య సోదర సహకారం వుండ వలసిన ఆవశ్యకతను గురించి కామ్రేడ్ లెనిన్ నిర్విరామంగా కోరేవాడు. మనల నుండి వీడిపోతూ కామ్రేడ్ లెనిన్ రిపబ్లి క్కుల యూనియన్‌ను స్థిరపరచి విస్తరింపజేయమని ప్రతిజ్ఞ చేయించాడు. కామ్రేడ్ లెనిన్! ఈ ఆజ్ఞను కూడ గౌరవ ప్రదంగా నిర్వర్తించుతామని ప్రతిజ్ఞ చేస్తున్నాం!...

"మనపార్టీ ప్రధాన కర్తవ్యాలలో ఒకటి రెడార్మీని బలపరచుట, రెడార్మీ పరిస్థితులను అభివృద్ధిచేయుట అని లెనిన్ అనేకసార్లు పేర్కొన్నాడు...కాబట్టి, కామ్రేడ్స్! మన రెడార్మీని, నౌకాదళాన్ని బలపరచటానికి సకలవిధాలా ప్రయ త్నించుతామని మనం ప్రతిన బూనుదాం!...

"మననుండి వీడిపోతూ కామ్రేడ్ లెనిన్ కమ్యూనిస్టు ఇంటర్‌నేషనల్ సూత్రాలకు విశ్వాసంతో కట్టుబడి యుండ వలసిందని ప్రతిన చేయించాడు. కామ్రేడ్ లెనిన్! యావత్ప్రపంచ కష్టజీవుల యూనియన్‌ను - కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్‌ను విస్తరింపజేసి బలపరచుటకు మా ప్రాణాలను సహితం లెక్కచేయమని మేము శపథంచేస్తున్నాం!"

ఎవనిపేరు యుగయుగాలవరకు చిరస్మరణీయంగా వుంటుందో అట్టి తమ నాయకుడైన లెనిన్ స్మారకంగా బోల్షివిక్‌పార్టీ గావించిన శపథం యిది.

1924 మేలో పార్టీ 13 వ కాంగ్రెస్ సమావేశమయింది. దీనికి 7 లక్షల, 35 వేల, 881 మంది సభ్యులకు ప్రాతినిధ్యం వహించే ప్రతినిధులు హాజరయ్యారు. వోటింగు హక్కుగలిగిన ప్రతినిధులు 748 మందీ, వోటింగుహక్కులేకుండా చర్చించే హక్కుగల ప్రతినిధులు 416మంది హాజరయ్యారు. సభ్యత్వంలో కిందటి కాంగ్రెస్‌కంటే ఇప్పుడు గమనించదగిన అభివృద్ధికి కారణం రెండున్నర లక్షల కొత్తసభ్యులు లెనిన్ స్మారక సభ్యత్వ ఉద్యమంద్వారా పార్టీలో చేరటంవల్లనే.

ట్రాట్స్కీవాదుల ప్రతిపక్షవేదికను కాంగ్రెస్ ఏక గ్రీవంగా ఖండించింది. అది మార్క్సిజం నుండి పెడతోవపట్టిన మధ్యతరగతివాదమనీ, లెనినిజాన్ని కుసంస్కరించే ప్రయత్న మని కాంగ్రెస్ దానిని ఖండించింది. "పార్టీ వ్యవహారాలు," "చర్చాఫలితాలు" అని 13 వ పార్టీ కాన్ఫరెన్సు తీర్మానాలను ఈ కాంగ్రెస్ ఆమోదించింది.

పట్టణాలకూ, పల్లెలకూ మధ్య సంబంధాన్ని బలపరచ డానికి పరిశ్రమలను మరింత విస్తృతం చేయాలని కాంగ్రెస్ ఉత్తరువు లిచ్చింది. ఇనుము, ఉక్కు పరిశ్రమ త్వరితంగా అభి వృద్ధిచెందవలసిన ఆవశ్యకతను ప్రత్యేకంగా నొక్కి చెబుతూనే చిన్న పరిశ్రమలను ప్రధానంగా విస్తృతపరచాలని కాంగ్రెస్ ఉత్తరువు లిచ్చింది.

దేశీయ వర్తకంలో ప్రజాకమిసార్ల సంఘాన్ని ఏర్పరచ డాన్ని కాంగ్రెస్ ఆమోదించింది. వర్తకసంఘాలను మార్కెట్టుపై కంట్రోలును సంపాదించి వర్తకరంగంలో ప్రయివేటు

పెట్టుబడి తుడిచివేసే బాధ్యతను కాంగ్రెస్ అప్పగిం చింది.

గ్రామసీమల్లో వడ్డీవ్యాపారస్థులను తుడిచివేయటానికి గాను రైతాంగానికి చౌకగా ప్రభుత్వంయిచ్చే ఋణాలను ఎక్కువ చేయవలసిందని కాంగ్రెస్ ఉత్తరువులిచ్చింది.

గ్రామసీమలో రైతాంగం మధ్య సహకార ఉద్యమాన్ని అత్యున్నతస్థాయికి పెంపొందించుట ప్రధాన కర్తవ్యమని కాంగ్రెస్ తెలియజేసింది.

లెనిన్ స్మారక సభ్యత్వంయొక్క గాఢ ప్రాముఖ్యతను కాంగ్రెస్ నొక్కిచెప్పింది. యువక పార్టీసభ్యులకు, ముఖ్యంగా లెనిన్ స్మారకకాలంలో చేరిన సభ్యులకు లెనినిజంయొక్క సూత్రాలను బోధించుటలో ఇతోధికకృషి చేయాలిసిన ఆవశ్య తను పార్టీదృష్టికి కాంగ్రెస్ తెచ్చింది.

## 5

### పునరుద్ధరణాకాలం ముగిసే సమయంలో సోవియట్ యూనియన్ – మనదేశంలో సోషలిస్టు నిర్మాణమూ విజయమూ అనే సమస్య – జినోవీవ్, కామెనివ్‌ల "నూతనప్రతిపక్షం"–పార్టీ పదునాల్గవ కాంగ్రెస్–దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం గావించే విధానం

నాలుగు సంవత్సరాలకుపైగా బోల్షివిక్ పార్టీ, కార్మిక వర్గమూ నూతన ఆర్థికవిధాన పద్ధతులపైన అతికష్టపడి పని

చేస్తూవచ్చింది. ఆర్థికపునరుద్ధరణ అనే వీరోచితకార్యం పూర్తి గానచ్చింది. సోవియట్ యూనియన్ యొక్క ఆర్థిక, రాజకీయ బలం క్రమంగా వృద్ధికాజొచ్చింది.

ఈ సమయానికి అంతర్జాతీయ పరిస్థితిలో మార్పు వచ్చింది. సామ్రాజ్యవాద యుద్ధానంతరం ప్రజాసామాన్యం యొక్క ప్రథమ విప్లవదాడిని పెట్టుబడిదారీ విధానం తట్టుకో గలిగింది. జర్మనీ, ఇటలీ, బల్గేరియా, పోలండు ఇంకా అనేక యితరదేశాలలోని విప్లవోద్యమం అణచివేయబడింది. ఈ పనిలో పెట్టుబడిదారీ వర్గానికి రాజీబేరగాళ్ళయిన సోషల్ డెమాక్రటిక్ పార్టీ నాయకులు సహాయపడ్డారు. విప్లవ ప్రవాహం తాత్కాలికంగా వెనుతగ్గింది. పశ్చిమ యూరప్‌లో పెట్టుబడిదారీ విధానం తాత్కాలికంగా కొంతవరకు నిల దొక్కుకోసాగింది. పెట్టుబడిదారీ విధాన పరిస్థితి కొంతవరకు స్థిరపడసాగింది. కాని పెట్టుబడిదారీ విధానం స్థిరీకరణ వల్ల పెట్టుబడిదారీ సమాజంలోని మూల వైరుధ్యాలు తొలగ లేదు. పైగా అందుకు భిన్నంగా పెట్టుబడిదారీ విధానం కొంత వరకు స్థిరపడటం పెట్టుబడిదార్లకు కార్మికులకు మధ్యగల వైరుధ్యాలను హెచ్చించింది. వలసదేశాలకు, సామ్రాజ్య వాదానికి మధ్యగల వైరుధ్యాలను వివిధ సామ్రాజ్యవాద దేశాల ముఠాలమధ్యగలవైరుధ్యాలను హెచ్చించింది. పెట్టుబడి దారీ విధాన స్థిరీకరణ, వైరుధ్యాలు మరొకసారి బ్రద్దలుగావ డానికి మార్గాన్ని వేస్తున్నది. పెట్టుబడిదారీ దేశాలలో నూతన సంక్షోభానికి దారివేస్తున్నది.

పెట్టుబడిదారీ విధాన స్థిరీకరణతో పాటు సోవియట్ యూనియన్ కూడా స్థిరపడసాగింది. కాని యీ రెండు స్థిరీకరణ

మార్గాలకు స్వభావంలో ప్రధానంగా భేదముంది. పెట్టుబడిదారీ విధాన స్థిరీకరణ, మరొక పెట్టుబడిదారీ నూతన సంక్షోభానికి ప్రారంభం మాత్రమే. సోవియట్ యూనియన్ స్థిరపడడమంటే సోషలిస్టు దేశంయొక్క ఆర్థిక రాజకీయ బలం మరింత పెంపొందడ మన్నమాట.

పశ్చిమ యూరప్‌లో విప్లవం ఓడిపోయినప్పటికి అంతర్జాతీయరంగంలో సోవియట్ యూనియన్ పరిస్థితి బలపడసాగింది. ఆ బలపడటం నెమ్మది నెమ్మదిగా జరుగుతున్నమాట నిజమే గావచ్చు.

1922 లో ఇటలీలోని జినోవాలో జరుగుతున్న అంతర్జాతీయ ఆర్థిక సమావేశానికి సోవియట్ యూనియన్‌ను ఆహ్వానించారు. పెట్టుబడిదారీ దేశాలలో విప్లవ ఓటమితో ధైర్యం తెచ్చుకొన్న సామ్రాజ్యవాద ప్రభుత్వాలు, జినోవా సమావేశంలో రాజనీతి రూపేణా సోవియట్ రిపబ్లిక్కుపై మరల ఒత్తిడి తీసుకురావటానికి ప్రయత్నించారు. సామ్రాజ్యవాదులు సోవియట్ రిపబ్లిక్కును సిగ్గుమాలిన కోర్కెలు కోరారు. అక్టోబరువిప్లవం జాతిపరం చేసిన ఫ్యాక్టరీలను, కర్మాగారాలను విదేశీపెట్టుబడిదారులకు తిరిగి అప్పజెప్పాలని కోరారు. జారు ప్రభుత్వం చేసిన ఋణాలను సోవియట్ ప్రభుత్వం చెల్లించాలని కూడా వత్తిడిచేశారు. దీనికి బదులుగా సోవియట్ ప్రభుత్వానికి నామమాత్రపు ఋణాలను యిస్తామని సామ్రాజ్యవాద ప్రభుత్వాలు వాగ్దానం చేశాయి.

సోవియట్ యూనియన్, ఈ కోర్కెలను తిరస్కరించింది.

జినోవా కాన్ఫరెన్సు ఫలితాలు శూన్యం.

1923 లో బ్రిటిష్ విదేశాంగమంత్రి లార్డుకర్జన్ చేసిన అంతిమ హెచ్చరికలో (అల్టిమేటమ్) తిరిగి సోవియట్‌పై దాడి సాగించుతామనే బెదిరింపువుంది. కాని దీనికి కూడా అవసరమైనరీతిగానే సోవియట్ ప్రభుత్వం జవాబిచ్చింది.

సోవియట్ ప్రభుత్వ బలాన్ని పరీక్షించిన పిమ్మట, అది నిలబడగలదనే విషయాన్ని తాము నమ్మిన పిమ్మట, పెట్టుబడిదారీదేశాలు ఒకదాని తర్వాత ఒకటి రాత్య సంబంధాలను పెట్టుకొన సాగినాయి. 1924 లో బ్రిటన్, ఫ్రాన్సు, జపాన్, ఇటలీలు సోవియట్‌తో రాత్యసంబంధాలు పెట్టుకొన్నాయి.

సోవియట్ యూనియన్ శాంతియుత కాలాన్ని, ఊపిరి పీల్చుకొనే దీర్ఘ వ్యవధిని, పొందగలిగిందని స్పష్టం.

ఇక ఆంతరంగిక పరిస్థితికూడా మారింది. బోల్షివిక్ పార్టీ నాయకత్వాన కార్మికులు, రైతులు స్వార్థత్యాగంతో చేసిన ప్రయత్నాలు ఫలించాయి. జాతీయ ఆర్థికవిధానం త్వరితంగా అభివృద్ధి చెందిందనుట స్పష్టం. 1924 - 25 ఆర్థిక సంవత్సరంలో వ్యవసాయ ఉత్పత్తి అప్పుడే యుద్ధపూర్వ స్థాయికి చేరింది. యుద్ధపూర్వ ఉత్పత్తికి నూటికి 87 పాళ్ళు ఉత్పత్తి అయింది. 1925 లో సోవియట్‌లోని పెద్దతరగతి పరిశ్రమలు యుద్ధపూర్వ పారిశ్రామికోత్పత్తిలో దాదాపు నూటికి 75 పాళ్ళు ఉత్పత్తి చేస్తున్నాయి. 1924 - 25 ఆర్థిక సంవత్సరంలో యంత్రనిర్మాణ పరిశ్రమలలో 38½ కోట్ల రూబుల్సు పెట్టుబడి పెట్టగల్గింది. దేశాన్ని విద్యుచ్ఛక్తిమయం చేసే పథకం విజయవంతంగా సాగుతోంది. జాతీయ ఆర్థిక

విధానంలో కీలక స్థానాలను సోషలిజం స్థిరపరచుకోసాగింది. పరిశ్రమలలోను, వర్తకంలోను, ప్రయివేటు పెట్టుబడికి వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో ప్రముఖ విజయాలు లభించాయి.

ఆర్థిక అభివృద్ధితోపాటు కార్మిక, కర్షకుల పరిస్థితిలో మరికొంత అభివృద్ధి కలిగింది. కార్మికవర్గం వేగంగా పెరుగజొచ్చింది. జీతాలు పెరిగాయి. అలాగే కార్మికుల ఉత్పాదశక్తి కూడా పెరిగింది. రైతుల జీవన ప్రమాణం చాలా అభివృద్ధి చెందింది. 1924 – 25 లో కార్మిక కర్షకుల ప్రభుత్వం చిన్న రైతులకు సహాయంచేసే నిమిత్తం 29 కోట్ల రూబుల్సు ప్రత్యేకించగలిగింది. కార్మిక, కర్షకుల పరిస్థితిలో అభివృద్ధి ప్రజాసామాన్యంయొక్క రాజకీయ కార్యకలాపాలు ఎక్కువ కావడానికి దారితీసింది. శ్రామికవర్గ నియంతృత్వం ఇప్పుడు మరింత దృఢతరమైంది. బోల్షివిక్ పార్టీ ప్రతిష్టా, పలుకుబడి పెరిగాయి.

జాతీయ, ఆర్థిక పునరుద్ధరణ పూర్తిగా వచ్చింది. కాని వట్టి ఆర్థిక పునరుద్ధరణ జరిగిన మాత్రాన, యుద్ధాత్పూర్వ స్థాయికి చేరుకోనంత మాత్రాన సోషలిజం నిర్మింపబడుతున్న సోవియట్ యూనియన్‌కు సరిపోదు. యుద్ధానికి పూర్వమున్న స్థాయి వెనుకబడ్డ దేశపుస్థాయి. ఆ స్థాయినుండి ముందుకు పురోగమించాలి. ఊపిరిపీల్చుకోవటానికి లభించిన దీర్ఘవ్యవధి సోవియట్ ప్రభుత్వం మరింత పెంపొందటానికి అవకాశాన్ని కల్గించింది.

దీనితో యీ క్రింది అత్యవసర సమస్యలను పరిష్కరించ వలసి వచ్చింది. మన అభివృద్ధి నిర్మాణాల స్వభావం ఏమిటి?

భవిష్యత్ స్వరూపం ఏమిటి? సోవియట్ యూనియన్‌లో సోషలిజం యొక్క భవితవ్యం ఏమిటి? సోవియట్ యూనియన్‌లో ఆర్థిక అభివృద్ధిని ఏమార్గాన సాగించాలి? సోషలిజం వైపుకా లేక మరో వైపుకా? సోషలిస్టు ఆర్థిక విధానాన్ని మనం నిర్మించాలా? నిర్మించగలమా? లేక పెట్టుబడిదారీ ఆర్థిక విధానమనే మరొక క్షేత్రానికి ఎరువు వేసే గతి పడుతుందా? సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు ఆర్థిక విధానాన్ని నిర్మించడం సాధ్యమా? ఒక వేళ సాధ్యమైతే పెట్టుబడిదారీ దేశాలలో విప్లవం ఆలస్యం అయినప్పటికీ, పెట్టుబడిదారీ విధానం స్థిరపడినప్పటికీ, అది సాధ్యమవుతుందా? నూతన ఆర్థిక విధానం మనదేశంలో అన్నివిధాల సోషలిస్టు శక్తులను బలపరచి వృద్ధిపరచుతున్నప్పటికీ పెట్టుబడిదారీ విధానాన్ని కూడ కొంతవరకు అది పెంపొందించుతూంది గదా. అలాంటి సమయంలో యీ నూతన ఆర్థిక విధానం ద్వారా అసలు సోషలిస్టు ఆర్థికవిధానం నిర్మించటం సాధ్యమౌతుందా? సోషలిస్టు ఆర్థిక విధానం నిర్మించటం ఎలాగు? ఏ కోణం నుండి ఆ నిర్మాణం ప్రారంభం కావాలి?

పునరుద్ధరణ అంతమయ్యే కాలంలో ఈ సమస్యలన్నీ పార్టీని ఎదుర్కొన్నాయి. ఇవి వట్టి సిద్ధాంత రూపమైన సమస్యలు మాత్రమే కాదు; ఆచరణలో స్థిరపడిన ఆర్థిక విధానంలో ఎదుర్కొంటున్న ప్రత్యక్ష సమస్యలు.

ఈసమస్యలన్నిటికి తిన్ననిసరళమైన జవాబులు కావాలి. పరిశ్రమల, వ్యవసాయ అభివృద్ధి కార్యక్రమంలో నిమగ్నులైన పార్టీ సభ్యులను, ప్రజలను కూడా గమ్యాన్ని గురించి స్పష్ట

మైన అభిప్రాయం వుండాలి. సోషలిజం వైపుకు పురోగమిస్తు న్నామా లేక పెట్టుబడిదారీ విధానం వైపుకు నడుస్తున్నామా అనే విషయంపై స్పష్టమైన అభిప్రాయం ఉండాలి.

ఈ సమస్యలన్నిటికి సూటి సమాధానాలు ఈయక పోయినట్లైతే. మన నిర్మాణాత్మకమైన దైనందినకార్యకలాపానికి ఒక భవిష్యత్ స్వరూపం లేకుండా చీకటిలో తడుముకొనే వృధాశ్రమ అవుతుంది. ఈ సమస్యలన్నిటికి పార్టీ సూటియైన, నిశ్చితమైన సమాధానాలను ఇచ్చింది.

అవును. మనదేశంలో సోషలిస్టు ఆర్థిక విధానాన్ని నిర్మించగలం, నిర్మించి తీరాలి. సోషలిస్టు ఆర్థిక విధానం నిర్మించటానికి, సంపూర్ణ సోషలిస్టు సమాజం నిర్మించటానికి అవుసరమైన వన్నీ మనకున్నాయి అని పార్టీ సమాధాన మిచ్చింది. **1917** అక్టోబరులో కార్మికవర్గం పెట్టుబడిదారీ విధానాన్ని రాజకీయంగా నాశనంచేసి, తమ రాజకీయ నియం

తృత్వాన్ని స్థాపించింది. అప్పటినుండి పెట్టుబడిదారీ విధాన ఆర్థిక శక్తిని ఛిన్నాభిన్నంచేసి సోషలిస్టు ఆర్థిక విధానాన్ని నిర్మించటాని కవుసరమైన ప్రతిచర్యా సోవియట్ ప్రభుత్వం తీసుకొంటున్నది. ఈ చర్యలు ఏమంటే: పెట్టుబడిదార్ల, భూస్వాముల ఆస్తులను స్వాధీనపరచుకొనుట, భూమి, ఫ్యాక్టరీలు, మిల్లులు, రైల్వేలు, బ్యాంకులు, ప్రజా ఆస్తిగా మార్చుట, నూతన ఆర్థిక విధానం అవలంబించుట, ప్రభుత్వ యాజమాన్యాన సోషలిస్టు పరిశ్రమను నిర్మించుట, లెనిన్ సహకార పథకాన్ని ఆచరణలో పెట్టుట, దేశమంతటా నూతన సోషలిస్టు ఆర్థిక విధానాన్ని నిర్మించి పెట్టుబడిదారీ విధానాన్ని

ఆర్థికంగా కూడా నాశనం చేయటానికి పూనుకొనడం ఇప్పటి ప్రధాన కర్తవ్యం. ఈ ముఖ్యకర్తవ్యాన్ని పూర్తిచేయటానికే మన ప్రత్యక్ష కార్యకలాపమంతా, మన చర్యలన్నీ వినియోగించబడాలి. కార్మికవర్గం యీ పనిని చేయగలదు. చేసి తీరుతుంది. ఈ బ్రహ్మాండమైన కర్తవ్యాన్ని ఆచరణలో పెట్టాలంటే, మొదట దేశాన్ని పారిశ్రామికం చేయాలి. దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికమయం చేయటం గొలుసులో ముఖ్యమైన కొలికిలాంటిది. దీనితోపాటు సోషలిస్టు ఆర్థిక విధాన నిర్మాణం కూడా ప్రారంభం కావాలి. పశ్చిమ ఖండంలో విప్లవం ఆలస్యమవటంగాని, సోవియటేతర దేశాలలో పెట్టుబడిదారీ విధానం కొంతవరకు స్థిరపడటంగాని, సోషలిజం వైపుకు పురోగమించటాన్ని ఆపలేవు. నూతన ఆర్థికవిధానమే ఈ కర్తవ్యాన్ని సులభం చేయగలదు. మన ఆర్థికవిధానానికి సోషలిస్టు పునాదిని వేయుటను సులభపరచే ప్రత్యేక ఉద్దేశ్యంతోనే పార్టీ యీ నూతన ఆర్థిక విధానాన్ని ప్రవేశపెట్టింది.

మనదేశంలో సోషలిస్టు నిర్మాణం విజయం పొందుట సాధ్యమా అనే ప్రశ్నకు పార్టీ యిచ్చిన జవాబు అది.

కాని ఒకదేశంలో సోషలిజం విజయంపొందుట సాధ్యమా అనే సమస్య అంతటితో అంతంకాలేదని పార్టీకి తెలుసు. సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు నిర్మాణం మానవచరిత్రలో ఒక చారిత్రాత్మకమైన మార్పును తీసుకువస్తుంది. సోవియట్‌యూనియన్‌లో కార్మికవర్గ, రైతాంగాలకు విజయాన్ని సమకూరుస్తుంది. ప్రపంచచరిత్రలో ఒక నూతన

శకాన్ని ప్రారంభించుతుంది. అయినప్పటికి యిది సోవియట్ యూనియన్ యొక్క ఆంతరంగిక విషయమే. సోషలిస్టువిజయం యొక్క సమస్యలో ఒక భాగంమాత్రమే. ఈ సమస్యయొక్క రెండవభాగం దాని అంతర్జాతీయవైఖరి. ఒకదేశంలో సోషలిజం విజయం పొందగలదనే ప్రతిపాదనను నిరూపించుతూ కామ్రేడ్ స్టాలిన్ ఈ సమస్యను రెండుదృక్పథాలగుండా అనగా ఆంతరంగికంగానూ, అంతర్జాతీయంగానూ చూడాలని పదేపదే చెప్పాడు. ఆంతరంగిక దృష్ట్యా ఈ సమస్యను చూడాలంటే దేశంలోని వర్గసంబంధాలను గమనించాలి. సోవియట్ యూనియన్ యొక్క కార్మికవర్గమూ, రైతాంగమూ ఆర్థికంగా తమ దేశంలోని పెట్టుబడిదారీ వర్గాన్ని నాశనంచేసి సంపూర్ణ సోషలిస్టు సమాజాన్ని నిర్మించగల స్ఫూర్తిసామర్థ్యాన్ని కలిగి ఉన్నాయి. అంతర్జాతీయ దృష్ట్యాగూడా అనగా విదేశ సంబంధాల దృష్ట్యా యీ సమస్యను గమనించాలి. అంటే సోవియట్ యూనియన్‌కు, పెట్టుబడిదారీ దేశాలను మధ్యగల సంబంధాలను అనుసరించి చూడాలి. సోవియట్ విధానాన్ని ద్వేషిస్తూ సోవియట్ యూనియన్‌పై తిరిగి సాయుధదాడి సల్పటానికి అవకాశంకోసం ఎదురుచూస్తూ, సోవియట్ యూనియన్‌లో పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించటానికి అంతర్జాతీయ పెట్టుబడిదారీవర్గం ఎదురుచూస్తుంది. వీరికీ సోవియటు ప్రజలకూ మధ్యగల సంబంధాల దృష్ట్యా ఈ సమస్యను గమనించాలి. ఇప్పటికింకా సోవియట్ యూనియన్ ఒక్కటే సోషలిస్టుదేశం. ఇతరదేశాలన్నీ పెట్టుబడిదారీ దేశాలుగానే వుండిపోయాయి. సోవియట్ యూనియన్‌ను పెట్టుబడిదారీ ప్రపంచం చుట్టుముట్టివుంది. ఇందువల్ల పెట్టుబడిదారీ దేశాలదాడి

ప్రమాదం వుండనేవుంది., పెట్టుబడిదారీదేశాలు చుట్టూవున్న న్నాళ్ళూ పెట్టుబడిదారులు దాడిచేసే ప్రమాదం వున్నదనుట సుస్పష్టమే. సోవియట్ ప్రజలు తమ స్వంత ప్రయత్నాల ద్వారానే బాహ్యప్రమాదాన్ని, సోవియట్ యూనియన్‌పై పెట్టుబడిదారులు దాడిచేసే ప్రమాదాన్ని నాశనంచేయగలరా? లేరు. వారు చేయజాలరు. పెట్టుబడిదారులదాడి ప్రమాదం నాశనం చేయాలంటే పెట్టుబడిదారీ దేశాల చక్రబంధాన్ని నాశనంచేయాలి. కనీసం అనేకదేశాలలో శ్రామికవర్గ విప్లవాలు విజయంపొందినప్పుడే ఆపని సాధ్యమవుతుంది. పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని రద్దుచేయుటద్వారాను, సోషలిస్టు ఆర్థిక విధానాన్ని నిర్మించుటద్వారాను ద్యోతకమైన సోవియట్ యూనియన్‌లోని సోషలిస్టు విజయం అంతిమ విజయంగా పరిగణించరాదని దీనినిబట్టి తేలుతుంది. ఇంతేగాక విదేశ సాయుధదాడి ప్రమాదం, పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించటానికి ఆదేశాలుచేసే ప్రయత్నాల ప్రమాదం తొలగిపోలేదు. ఇంతేగాక సోషలిస్టుదేశానికి ఇలాంటి అపాయంరాదనే గ్యారంటీ ఏమీలేదు. విదేశీపెట్టుబడిదారుల దాడి అపాయాన్ని నాశనం చేయాలంటే, పెట్టుబడిదారీ దేశాల చక్రబంధాన్ని నాశనంచేయాలి.

సోవియట్ ప్రభుత్వం సరియైన విధానాన్ని అవలంబించి నన్నాళ్లూ, 1918_20 సంవత్సరాలలోని పెట్టుబడిదారీ దేశాల మొదటిదాడిని తిప్పికొట్టినట్లే విదేశ పెట్టుబడిదారుల కొత్త దాడులనుగూడా సోవియట్ ప్రజలూ, రెడార్మీ తిప్పికొట్ట గలరు. దీని అర్థం పెట్టుబడిదారీ దేశాలు కొత్తదాడిని సల్పే

ప్రమాదం తొలగిపోయిందనికాదు. మొదటదాడిలో వారు అపజయం చెందినమాత్రాన మరో ప్రమాదం లేకపోలేదు. ఇంతేగాక ఈ దాడి ప్రమాదానికి మూలకందమైన పెట్టుబడి దారీ దేశాల చక్రబంధం ఇంకా ఉండనే ఉంది. పెట్టుబడిదారీ దేశాల చక్రబంధం అలాగే ఉన్నంతవరకూ, కొత్తదాడిని ఓడించినప్పటికీ దాడి ప్రమాదంమాత్రం నశించిపోదు.

దీనినిబట్టి పెట్టుబడిదారీ దేశాలలో శ్రామికవర్గ విప్లవ విజయం సోవియట్ కష్టజీవులకు చాలా ముఖ్యమైన విషయమని స్పష్టమవుతూంది.

మనదేశంలో సోషలిస్టు విజయమనే సమస్యపై పార్టీ విధానమిది.

సెంట్రల్ కమిటీ రానున్న పార్టీ 14 వ కాన్ఫరెన్సులో యీ పోకడను చర్చించాలనీ, ఇది పార్టీ పోకడగా ఆమోదించి బలపరచాలనీ కోరింది. ఇది పార్టీ సభ్యులందరికి వర్తించే పార్టీ నిబంధన (Law)గా వుండాలనికూడా సెంట్రల్ కమిటీ కోరింది.

పార్టీ యీ పోకడ వ్యతిరేకపక్షాలవారిపైన పిడుగులా పడింది. ముఖ్యంగాదీనికి నిర్ణీతమైన ఆచరణయోగ్య స్వభావాన్ని పార్టీ కలిగించింది. దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికమయంచేసే ప్రత్యక్ష పథకంతో దీన్ని కలిపివేసింది. దీనిని పార్టీ నిబంధనగా, పార్టీ సభ్యులందరికీ వర్తించేటటువంటి పదునాల్గవ కాన్ఫరెన్సు తీర్మానంగా ఆమోదించాలని కోరింది. ఇలా కోరడంవల్ల ప్రతిపక్షులకు మరింతగా పిడుగులాంటి దెబ్బఅయింది.

ట్రాట్స్కీ-వాదులు పార్టీ పోకడను వ్యతిరేకించి మెన్షివిక్కుల "శాశ్వత విప్లవ సిద్ధాంతాన్ని" ప్రతిపాదించారు.

దాన్ని మార్క్సిస్టు సిద్ధాంతమని పిలవటం మార్క్సిజానికే అవమానకరం. ఈ సిద్ధాంతం సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు నిర్మాణం, విజయం అసాధ్యమంటుంది.

బుఖారిన్‌వాదులు పార్టీ పోకడను బహిరంగంగా ఎదిరించ సాహసించలేకపోయారు. కాని వారు దానిస్థానే తమ స్వంతసిద్ధాంతాన్ని రహస్యంగా యిరికించాలని చూచారు. పెట్టుబడిదారీవర్గం శాంతియుతంగా సోషలింజంలోకి పెంపొందుతుందని "ఆ సిద్ధాంతం." "ధనికులుకండి" అనే "కొత్త" నినాదంతో దానిని విశదీకరించారు. బుఖారిన్‌వాదుల వాదన ప్రకారం, సోషలిజం విజయం పొందడమంటే పెట్టుబడిదారీ వర్గాన్ని పోషించి మరింత ధనికులనుచేయటం కాని వారిని నాశనం చేయటంగాదు.

దేశం ఆర్థికంగానూ, టెక్నికల్‌గానూ వెనుకబడి ఉండటంవల్ల సోవియట్ యూనియన్‌లో సోషలిజం విజయం పొందుట అసాధ్యమని జినోవీవ్, కామెనీవ్‌లు చెప్ప సాహసించారు. కాని యిలా అనటం తొందరపాటని గ్రహించి ఏదో ఒక ముసుగుతో వెనక్కి-తగ్గటం మంచిదని త్వరలోనే గ్రహించారు.

పార్టీ పదునాల్గవ కాన్ఫరెన్సు (1925 ఏప్రిల్) బహిరంగ ప్రతిపక్షుల, రహస్య ప్రతిపక్షుల యీ లొంగుబాటు "సిద్ధాంతాల"న్నిటినీ ఖండించింది. సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు విజయంకోసం పనిచేయాలనే పార్టీ పోకడను ధృవపరచింది. ఇందుకోసం ఒక తీర్మానం చేసింది. మరో గత్యంతరంలేని జినోవీవ్, కామెనీవ్‌లు ఈ తీర్మానానికి ఓటుచేయ

నిశ్చయించుకొన్నారు. కాని వారు తమపోరాటాన్ని వాయిదా వేస్తున్నారనీ, పదునాల్గవ కాంగ్రెసులో "పార్టీపై యుద్ధం సాగించటానికి" నిశ్చయించుకొన్నారనీ, పార్టీకి తెలుసు. "నూతన ప్రతిపక్షం" ఏర్పరచడానికి లెనిన్‌గ్రాడ్‌లో అనుచరులను పోగుచేసుకొంటున్నారు.

1925 డిసెంబరులో పార్టీ పదునాల్గవ కాంగ్రెసు ప్రారంభమైంది.

పార్టీ ఆంతరంగికపరిస్థితి చాలా ఉద్రిక్తంగానూ, క్లిష్టంగానూ ఉంది. లెనిన్‌గ్రాడ్ లాంటి ముఖ్యమైన పార్టీకేంద్రం నుండి వచ్చిన ప్రతినిధులంతా తమ సెంట్రల్‌కమిటీని వ్యతిరేకించ సాహసించిన ఉదంతం పార్టీచరిత్రలో ఎన్నడూ లేదు.

కాంగ్రెస్‌కు 665 మంది వోటింగుకలిగిన ప్రతినిధులు వచ్చారు. వోటులేకుండా చర్చించే హక్కుగల ప్రతినిధులు 641 మంది హాజరయ్యారు. వీరంతా 6 లక్షల 43 వేల పార్టీ సభ్యులకు, 4 లక్షల 45 వేలమంది కాండిడేటు సభ్యులకు ప్రాతినిధ్యం వహించారు. గత కాంగ్రెసుకంటె ఈ సంఖ్య కొద్దిగా తక్కువ. పార్టీవ్యతిరేక వ్యక్తులు యూనివర్సిటీలలోని, ఆఫీసులలోని పార్టీసంస్థలలో ప్రవేశించగల్గారు. ఇలాంటివారిని కొంతవరకు వడపోయుట ఈ తగ్గుదలకు కారణం.

సెంట్రల్‌కమిటీ తరఫున రాజకీయరిపోర్టును కామ్రేడ్ స్టాలిన్ ఇచ్చాడు. సోవియట్‌యూనియన్ రాజకీయ, ఆర్థిక బలం ఎలా అభివృద్ధిచెందిందో స్టాలిన్ వివరంగా చిత్రించాడు. సోవియట్ ఆర్థికవిధానం కల్గించిన పౌకర్యాలవల్ల వ్యవసాయము పరిశ్రమలూ కొద్దికాలంలోనే పునరుద్ధరించబడ్డాయి. యుద్ధ

పూర్వస్థాయికి చేరుకొంటున్నాయి. ఈ ఫలితాలు సంతృప్తి కరంగా ఉన్నప్పటికీ మనం అంతటితో ఆగిపోగూడదని కామ్రేడ్ స్టాలిన్ సూచించాడు. మనదేశమింకా వెనుకబడిన వ్యవసాయక దేశంగానే వున్నదన్న విషయాన్ని అవి రద్దు చేయజాలవని అన్నాడు. దేశఉత్పత్తి మొత్తంలో మూడింట రెండుపాళ్ళు వ్యవసాయంద్వారా జరుగుతుంది. పరిశ్రమల ఉత్పత్తి మూడనవంతు మాత్రమే. పెట్టుబడిదారీ దేశాలతో సంబంధం లేకుండా ఆర్థికంగా మనదేశం స్వతంత్రమై వుండాలంటే మన దేశాన్ని పారిశ్రామిక దేశంగా మార్చాలి. ఈ సమస్య పార్టీని సూటిగా ఎదుర్కొంటున్నదని కామ్రేడ్ స్టాలిన్ అన్నాడు. మనదేశాన్ని పారిశ్రామికం చేయగలం. చేసితీరాలి. సోషలిస్టువిజయంకోసం, దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం చేసేందుకు పోరాడుట ఈనాడుపార్టీయొక్క ప్రధాన కర్తవ్యం.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు :

"వ్యవసాయక దేశమైన మన దేశాన్ని తన కవసరమైన యంత్రసామగ్రిని స్వంతప్రయత్నాలద్వారా ఉత్పత్తిచేసికోగల పారిశ్రామికదేశంగా మార్చాలి. ఇదీ మనపార్టీ సాధారణ పోకడకు ప్రాతిపదికాసారాంశము."

దేశాన్ని పారిశ్రామికం చేయటం దాని ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ధృవపరుస్తుంది. దాని రక్షణశక్తిని బలపరుస్తుంది. సోవియట్‌యూనియన్‌లో సోషలిస్టు విజయానికి అవసరమైన పరిస్థితులను సృష్టిస్తుంది.

జినోవీవ్ వాదులు పార్టీ సాధారణపంథాను వ్యతిరే కించారు. స్టాలిన్ ప్రవేశపెట్టిన సోషలిస్టు పారిశ్రామిక పథ కానికి బదులుగా జినోవీవ్ అనుచరుడగు సుకోల్నికోవ్ ఒక బూర్జువాపథకాన్ని ప్రవేశపెట్టాడు. అది షార్క్-లాంటి మనుష్యులను చంపే చేపలాంటి సామ్రాజ్యవాద నరభక్షకు లలో ప్రచారంలో వుంది. ఈ పథకాన్ననుసరించి సోవియట్ యూనియన్ ముడిపదార్థాలను, ఆహారపదార్థాలను ఉత్పత్తి చేసి వాటిని ఎగుమతిచేసే దేశంగానేముఖ్యంగా ఉండిపోవాలి. యంత్రాలను దిగుమతిచేసుకోవాలే గాని స్వయంగా ఉత్పత్తి చేయగూడదు. ఇదివరలో అది యంత్రసామగ్రిని ఉత్పత్తి చేయనూ లేదు. 1925 లో ఉన్న పరిస్థితులనుబట్టి యీ పథకం వల్ల పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన విదేశాలకు సోవియట్ యూనియన్ ఆర్థికంగా బానిసత్వం వహించు టే అవుతుంది. పెట్టుబడిదారీ దేశాలలోని షార్క్-ల్లాంటి సామ్రాజ్యవాద దోపిడిగాండ్ర లాభంకోసం, సోవియట్‌యూనియన్ పారి శ్రామికంగా వెనుకబడి వుండవలసివస్తుంది.

ఈ పథకాన్నేగనుక అంగీకరించివుంటే మనదేశం నిర్వీర్యమైన వ్యవసాయక దేశంగా వుండి పెట్టుబడిదారీ ప్రపం చానికి వ్యవసాయక అనుబంధంగా తయారయ్యేది. చుట్టూ వున్న పెట్టుబడిదారీ ప్రపంచాన్నుండి సంరక్షించుకోలేని బలహీన దేశంగా వుండిపోయేది. తుదకు సోవియట్ యూని యన్‌లో సోషలిస్టు ఆశయానికే మృత్యుసమానమైన ముప్పు వాటిల్లేది.

జినోవీవ్‌వాదుల ఆర్థిక "పథకం" సోవియట్ యూని యన్‌ను బానిసగావించే పథకమని కాంగ్రెస్ ఖండించింది.

"నూతన ప్రతిపక్షం" వారి దాడులుకూడా అలాగే అపజయం పొందాయి. ఉదాహరణకు వారు (లెనిన్‌ను ధిక్కరించి) మన ప్రభుత్వ పరిశ్రమలు సోషలిస్టు పరిశ్రమలు కావని అన్నారు. సోషలిస్టు నిర్మాణకార్యంలో కార్మికవర్గానికి మధ్యతరగతిరైతు మిత్రుడు కాజాలడని (లెనిన్‌ను ధిక్కరించి) అన్నారు. ఈ రెండు సందర్భాలలో గూడా వారు అపజయం పొందారు.

"నూతన ప్రతిపక్షం" యొక్క దాడులు లెనినిస్టుసిద్ధాంత వ్యతిరేకమని కాంగ్రెస్ ఖండించింది.

"నూతన ప్రతిపక్షం"లోని ట్రాట్స్కీ-వాద - మెన్షివిక్ వాద సారాంశాన్ని కామ్రేడ్ స్టాలిన్ వెల్లడి చేశారు. లెనిన్ నిరంతరాయంగా పోరాటం సాగించిన పార్టీ శత్రువుల పాత పాటలనే, జినోవీవ్, కామెనీవ్‌లు ఆలాపించుతున్నారని కామ్రేడ్ స్టాలిన్ తెలియ జేశాడు.

జినోవీవ్‌వాదులు బురఖా వేసుకొన్న ట్రాట్స్కీ-వాదులు తప్ప మరెవ్వరూ కావని స్పష్టమైంది.

సోషలిజాన్ని నిర్మించే పనిలో కార్మికవర్గానికీ, మధ్య తరగతి రైతుకూ మధ్య దృఢమైన మైత్రిని నిలబెట్టుట మన పార్టీ ముఖ్యకర్తవ్యం. ఈ విషయాన్ని కామ్రేడ్ స్టాలిన్ నొక్కి చెప్పారు. ఆకాలంలో పార్టీలో రైతుసమస్యపైన రెండు పెడ దారులు (డీవియేషన్సు) వున్నాయని పేర్కొన్నాడు. ఈ రెండు కూడా పైనచెప్పిన మైత్రికి ప్రమాదం కలిగించాయి. మొదటిది కులక్ ప్రమాదాన్ని తక్కువ అంచనా వేసి చిన్న చూపు చూసింది. రెండవది కులక్కులంటే భయపడి గాభరాచెంది

మధ్య తరగతి రైతుపాత్రను తక్కువ అంచనావేసింది. ఇందులో ఏ పెడదారి మరింత చెడ్డది అన్న ప్రశ్నకు జవాబిస్తూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు: "ఇందులో ఒక దానికి మరొకటి తీసిపోదు. రెండూచెడ్డవే. వీటినిగనక పెరగనిచ్చిన పక్షంలో పార్టీని శిథిలపరచి నాశనంచేస్తాయి. అదృష్టవశాత్తు ఈ రెండు పెడదారులను వదలించుకొనే సామర్థ్యంగల శక్తులు మన పార్టీలో వున్నాయి."

వాస్తవంగా "అతివాద", మితవాద పెడదారుల రెండింటినీ నాశనంచేసి పార్టీ ఆపీడ వదిలించుకొంది.

ఆర్థికాభివృద్ధి సమస్యపై చర్చను క్రోడీకరించుతూ, పార్టీ పదునాలవ కాంగ్రెస్, ప్రతిపక్షవాదుల లొంగుబాటు పథకాలను ఏకగ్రీవంగా తోసిపుచ్చింది. సుప్రసిద్ధమైన తన తీర్మానంలో యిలా వ్రాసింది:

"శ్రామికవర్గ నియంతృత్వ దేశమైన మన దేశంలో ఆర్థికాభివృద్ధి దృష్ట్యా 'సంపూర్ణమైన సోషలిస్టు సమాజనిర్మాణానికి అన్నివిధాలా అవకాశముంది' (లెనిన్) అని కాంగ్రెసు అభిప్రాయపడుతోంది. సోవియట్‌యూనియన్‌లో సోషలిస్టు నిర్మాణ విజయంకోసం పోరాడుటే పార్టీ ముఖ్యకర్తవ్యమని కాంగ్రెస్ భావించుతోంది."

పార్టీ పదునాల్గవ కాంగ్రెసు, నూతన పార్టీ నిబంధనలను ఆమోదించింది.

14 వ కాంగ్రెసునుండే, మనపార్టీ సోవియట్ యూనియన్ యొక్క కమ్యూనిస్టు (బోల్షివిక్కు) పార్టీ సో. యూ. క (బో) పార్టీ (C. P. S. U. (B)) అని పిలవబడుతూ వచ్చింది.

జినోవీవ్ వాదులు కాంగ్రెస్‌లో ఓడిపోయినప్పటికీ వారు పార్టీకి తలయొగ్గలేదు. 14 వ కాంగ్రెస్ తీర్మానాలకు వ్యతిరేకంగా పోరాటాన్ని ప్రారంభించారు. కాంగ్రెస్ జరిగిన వెంటనే జినోవీవ్ యువ కమ్యూనిస్టు సమితియొక్క లెనిన్‌గ్రాడ్ రాష్ట్రకమిటీని సమావేశపరచాడు. ఇందులో ముఖ్యులు జినోవీవ్, జాటాట్‌స్కీ, బాకయవ్, యవడోకిమోవ్, కుక్లిన్, సఫరోవ్ మొదలగువారు, లెనినిస్టు సెంట్రల్ కమిటీపట్ల ద్వేషభావంతో ప్రవర్తించే ఇతర గోముఖవ్యాఘ్రాలతో వీరు కలిసి ఒకముఠా ఏర్పరచారు. యువ కమ్యూనిస్టు సమితి చరిత్రలో ఎన్నడూ జరగని విధంగా లెనిన్‌గ్రాడ్ రాష్ట్రకమిటీ ఈ మీటింగులో ఒక తీర్మానం చేసింది. పార్టీ పదునాల్గవ కాంగ్రెస్ తీర్మానాలకు కట్టుబడియుండటానికి అది నిరాకరించింది.

కాని లెనిన్‌గ్రాడ్ యువ కమ్యూనిస్టు సమితి నాయకుడైన జినోవీవ్ అనుచరులు, లెనిన్‌గ్రాడ్‌లోని యువ కమ్యూనిస్టు సమితి సభ్యుల ప్రజాచిత్తాన్ని ఏ విధంగానూ ప్రతిబింబించుటలేదు. అందుచేత వారు త్వరలోనే ఓడింపబడ్డారు. లెనిన్‌గ్రాడ్ సంస్థ యువ కమ్యూనిస్టు సమితిలో తన కర్హమైన యథాస్థానాన్ని త్వరలోనే సంపాదించుకొంది.

పదునాల్గవ కాంగ్రెస్ ముగిసే సమయాన కాంగ్రెస్ ప్రతినిధులు కొందరిని - కామ్రేడ్ మోలటోవ్, కిరోవ్, వొరొషిలోవ్, కాలినిన్, యాండ్రియవ్ మొదలగు వారిని ~~లెనిన్‌గ్రాడ్‌కు పార్టీ పంపి~~ తప్పుడునటనలతో లెనిన్‌గ్రాడ్ సభ్యుల అంగీకారాన్ని సంపాదించినవారి ప్రతినిధులు కాంగ్రెస్‌లో తీసు

కొన్ని ఘోరమైన పార్టీ వ్యతిరేక చర్య స్వభావాన్ని ఆ పార్టీ సంస్థసభ్యులకు విశదపరచటానికే పంపారు. కాంగ్రెస్‌పై రిపోర్టులు యిచ్చిన మీటింగులలో చాల గాలి దుమారం లేచింది. లెనిన్‌గ్రాడ్ పార్టీ సంస్థ యొక్క అత్యవసర సభ (కాన్ఫరెన్సు) సమావేశమయింది. లెనిన్‌గ్రాడ్ పార్టీ సభ్యుల లోని అత్యధిక సంఖ్యాకులు (నూటికి 97 మంది) పార్టీ వ్యతిరేకమైన జినోవీవ్ "నూతన ప్రతిపక్షాన్ని" ఖండించారు. ఈ "నూతన ప్రతిపక్షం" అప్పటికే సైన్యంలేని సైన్యాధికారుల ముఠాలాగా తయారైంది.

లెనిన్‌గ్రాడ్ బోల్షివిక్కులు లెనిన్, స్టాలిన్ పార్టీ అనుచరుల అగ్రశ్రేణిలో నిలబడ్డారు. పార్టీ పదునాల్గవ కాంగ్రెస్ ఫలితాలను క్రోడీకరించుతూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా వ్రాశాడు:

"సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు (బోల్షివిక్కు) పార్టీ 14 వ కాంగ్రెస్‌యొక్క చారిత్రక ప్రాముఖ్యత ఈ కింది విషయాలలో వుంది. కాంగ్రెస్ "నూతన ప్రతిపక్షం"యొక్క తప్పులకు గల అసలు మూలాలనే అది బయటపెట్టగలిగింది. వారి నిరాశావాదాన్ని, ఏడుపుగొట్టుతనాన్ని కాలతన్నింది. సోషలిజంకోసం ముందు సాగించవలసిన పోరాట పంథాను వివరంగాను, స్పష్టంగానూ చూపించింది. విజయ భవిష్యత్తును పార్టీ ముందు పెట్టింది. ఆవిధంగా సోషలిస్టు నిర్మాణవిజయంలో అభేద్యమైన విశ్వాసాన్ని శ్రామికవర్గానికి కల్గించింది." (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో, 1947, 177 వ పేజి).

# క్లుప్త సారాంశం

ఆర్థిక పునరుద్ధరణ అనే శాంతియుత కార్యకలాపానికి పరివర్తన చెందే సంవత్సరాలు బోల్షివిక్కు పార్టీ చరిత్రలో అత్యంత క్లిష్టమైన సమయాలు. మహా క్లిష్టపరిస్థితిలో యుద్ధ కమ్యూనిజం అనే విధానంనుండి నూతన ఆర్థిక విధానానికి పార్టీ దేశాన్ని మరల్చింది. ఇది చాలా కష్టమైన మార్పు. ఒక నూతన ఆర్థిక పునాదిపైన కార్మిక కర్షక సమ్మేళనాన్ని పార్టీ దృఢపరచింది. సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌ల యూనియన్ ఏర్పడింది.

నూతన ఆర్థిక విధానంద్వారా దేశ ఆర్థిక జీవిత పునరుద్ధరణలో నిశ్చిత ఫలితాలు గలిగాయి. ఆర్థిక పునరుద్ధరణా కాలంలో విజయవంతంగా బయటపడి దేశాన్ని పారిశ్రామికం చేసే నూతనయుగంలోకి సోవియట్ యూనియన్ ప్రవేశించింది.

అంతర్యుద్ధంనుండి శాంతియుత సోషలిస్టు నిర్మాణానికి పరివర్తనతోపాటు చాలా కష్టాలు వచ్చాయి. ముఖ్యంగా ప్రథమ దశలలో చాలా కష్టాలు వచ్చాయి. బోల్షివిజానికి శత్రువులు, సో. యూ. క. (బో) పార్టీ అనుచరులలోని పార్టీ వ్యతిరేక వ్యక్తులు, ఈ కాలమంతటా లెనినిస్టు పార్టీకి వ్యతిరేకంగా తెగించి పోరాడారు. పార్టీ వ్యతిరేక వ్యక్తులైన వీరికి ట్రాట్స్కీ నాయకత్వం వహించాడు. ఈ పోరాటంలో అతని తోత్తులు కామెనివ్, జినోవీవ్, బుఖారిన్‌లు. లెనిన్ మరణానంతరం ప్రతిపక్షులు, బోల్షివిక్కు పార్టీ అనుచరుల గుండెనిబ్బరం చెడగొట్టి, పార్టీని చీల్చి సోవియట్ యూనియన్‌లో సోషలిజంయొక్క విజయం సాధ్యంకాదనే అపనమ్మ

కాన్ని వ్యాపింపజేయాలని తలచారు. పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించే పార్టీని, నూతన బూర్జువా రాజకీయ సంస్థ నొకదానిని, సోవియట్ యూనియన్‌లో ఏర్పరచడానికి ట్రాట్‌స్కీ-వాదులు వాస్తవంగా ప్రయత్నిస్తూ వచ్చారు.

లెనిన్ జెండాకింద, లెనినిస్టు సెంట్రల్ కమిటీ చుట్టూ, కామ్రేడ్ స్టాలిన్‌చుట్టూ, పార్టీ ఆదుకుంది. అది ట్రాట్‌స్కీ-వాదులను, లెనిన్‌గ్రాడ్‌లోని వారి నూతన స్నేహితులను, జినోవీవ్ - కామెనివ్ "నూతన ప్రతిపక్షాన్ని" ఓడించింది.

బలాన్ని, సాధనసంపత్తిని సమీకరించిన పిదప బోల్షివిక్‌పార్టీ, తనచరిత్రలో సోషలిస్టు పారిశ్రామికంచేసే ఒక నూతన దశను దేశ చరిత్రలో తీసుకువచ్చింది.

# పదో అధ్యాయం

## దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం చేసే పోరాటంలో బోల్షివిక్ పార్టీ

## [ 1926 - 1929 ]

దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం చేసే కాలంలో వచ్చిన కష్టాలు–వాటిని జయించటానికి చేసిన పోరాటం–ట్రాట్స్కీ–వాదులు, జినోవీవ్ వాదులు పార్టీ ప్రతికూల కూటమిని (బ్లాకు) ఏర్పరచుట. ఈ కూటమి గావించిన సోవియట్ వ్యతిరేక చర్యలు – దీని ఓటమి

దేశాన్ని సోషలిస్టుపారిశ్రామికం చేయాలనే సోవియట్ ప్రభుత్వపు సాధారణ పంథాను (జనరల్ లైను) అమలులో పెట్టేందుకు 14వ కాంగ్రెస్ తర్వాత, పార్టీ తీవ్రమైన పోరాటాన్ని ప్రారంభించింది.

పునరుద్ధరణా కాలంలో అన్నిటికంటె ప్రధాన కర్తవ్యం వ్యవసాయాన్ని పునరుద్ధరించటం. వ్యవసాయ పునరుద్ధరణ ముడివస్తువులను, ఆహార పదార్థాలను సంపాదించ వచ్చు. పరిశ్రమలను, ప్రస్తుతమున్న మిల్లులను తిరిగి పనిజేయించవచ్చు.

సోవియట్ ప్రభుత్వం ఈ కర్తవ్యాని అనుకొన్న దాని కంటే సులభంగా నెరవేర్చింది.

కాని పునరుద్ధరణా కాలంలో ప్రధానమైన లోపాలు మూడున్నాయి.

మొదటిది : మిల్లులు, ఫ్యాక్టరీలు పాతవి. పాతబడి తుప్పుబట్టిన యంత్ర సామగ్రితో నిండివున్నాయి. త్వరలోనే అవి పనికిరాకుండా పోవచ్చు. వాటికి అధునాతన యంత్ర సామగ్రిని సమకూర్చటం నేటి కర్తవ్యం.

రెండవది : పునరుద్ధరణా కాలంలో పరిశ్రమలు చాలా సంకుచితమగు పునాదిపైన ఆధారపడివున్నాయి. దేశాని కత్యవసరమైన యంత్రనిర్మాణ కర్మాగారాలు లేనేలేవు. ఇలాంటి కర్మాగారాలను వందలకొలది నిర్మించాలి. ఇవిలేనిదే ఏదేశాన్ని కూడ నిజంగా పారిశ్రామిక దేశంగా భావించజాలం. ఇప్పటి కర్తవ్యం యీ కర్మాగారాలను నిర్మించి వాటికి అధునాతన యంత్ర సామగ్రిని కూర్చటం.

మూడవది : ఈ కాలంలోని పరిశ్రమలు చాలావరకు తేలికపరిశ్రమలు. వీటిని వృద్ధిచేసి, వాటికాళ్ళమీద అవి నిల్వగలేటట్లు ప్రభుత్వం చేసింది. కాని భారీపరిశ్రమలు లేని బలహీనతవల్ల ఒకానొక దశకు వచ్చేసరికి చిన్న పరిశ్రమల అభివృద్ధికి కూడా ఆటంకం కల్గింది. ఇంతేగాక దేశానికి ఇతర అవసరాలు ఇంకా వున్నాయి. వాటిని బాగా వృద్ధిచెందిన భారీ పరిశ్రమలు మాత్రమే తీర్చగలవు. కాబట్టి భారీ పరిశ్రమల వైపుకు మొగ్గటమే ఇప్పటి కర్తవ్యం.

దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం చేయటంవల్లనే ఈ కర్తవ్యాలు పూర్తి గావలసి ఉన్నాయి.

జారు ప్రభుత్వ రష్యాలో లేనటువంటి నూతన పరిశ్రమ లను అనగా కొత్త యంత్రాలు, యంత్రపరికరాలు, మోటార్లు, రసాయనిక కర్మాగారాలు, ఇనుము, ఉక్కు కర్మాగారాలు మొదలగువాటిని అనేకం నిర్మించవలసియుంది. ఇంజన్ల ఉత్పత్తిని, విద్యుత్పరికరాల ఉత్పత్తిని కొనసాగించి బొగ్గు, ముడి ఇనుములను గనులనుండి త్రవ్వటం వృద్ధిచెయ్యాలి. సోవియట్ యూనియన్‌లో సోషలిజం విజయమందటానికి యిది అవసరం.

నూతన ఆయుధ పరిశ్రమను నిర్మించటం, మరఫిరంగులు, ఫిరంగి గుండ్లు, విమానాలు, టాంకులు, మెషిన్‌గన్ లు ఉత్పత్తి చేయటానికి కొత్త పరిశ్రమలను నెలకొల్పటం అవసరం. పెట్టుబడిదారీ ప్రపంచంచే చుట్టు ముట్టడింపబడి వున్నందున సోవియట్ యూనియన్ రక్షణకు యిది అవసరం.

ట్రాక్టరు (మరనాగలి)ఉత్పత్తిచేసే పరిశ్రమలను నిర్మించటం అవసరం. ఆధునిక వ్యవసాయ యంత్రాలను ఉత్పత్తి చేసే కర్మాగారాలను నిర్మించుటకూడా అవసరం. వ్యవసాయానికి ఈ యంత్రాలను అందించటంవల్ల లక్షలాది వ్యక్తిగత రైతు క్షేత్రాలు, పెద్ద పెద్ద సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా మారటానికి అవకాశ మేర్పడుతుంది. గ్రామసీమలో సోషలిజం విజయం పొందటానికి యిది అత్యవసరం.

ఇదంతాకూడా దేశాన్ని పారిశ్రామికమయంచేసే విధానంద్వారానే నెరవేరుతుంది. దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం చేయటమనేదానికి యిదే అర్థం.

అంతపెద్ద ప్రమాణంమీాద నిర్మాణకార్యం కొనసాగించాలంటే కోట్లకొలది రూబుల్సును పెట్టుబడి పెట్టవలసి

యుంటుంది. విదేశీ ఋణాలమీద ఆధారపడటమనే సమస్యే లేనేలేదు. ఎందువల్లనంటే పెట్టుబడిదారీదేశాలు ఋణాలను యివ్వ నిరాకరించాయి. మన స్వంతసాధన సంపత్తితోనే, విదేశసహాయం లేకుండానే మనం ఈ నిర్మాణాన్ని కొనసాగించాలి. కాని మనదేశం అప్పుడు చాల బీదదేశం.

ముఖ్యమైన కష్టాలలో అది ఒకటి.

వలసదేశాలను దోపిడిచేయుటద్వారా గాని, లేక ఓడిపోయిన దేశాలనుండి గుంజిన నష్టపరిహారాలద్వారాగాని, లేక విదేశ రుణాలద్వారాగాని వచ్చిన విదేశనిధులతో పెట్టుబడిదారీదేశాలు భారీపరిశ్రమలను నిర్మించడం సర్వసాధారణం. వలసదేశాలను, ఓడిపోయినదేశాలను దోపిడిచేయటంటద్వారా ధనాన్ని సంపాదించే అపఖ్యాతికరమైన మార్గాలకు సోవియట్ యూనియన్ పూనుకోదు. అది దాని నైతికసూత్రం. ఇక విదేశాల ఋణాలసంగతి: సోవియట్‌యూనియన్‌కు ఆమార్గం అరికట్టబడింది. పెట్టుబడిదారీదేశాలు దానికి ఏమాత్రమూ అప్పు ఈయడానికి నిరాకరించాయి. దేశం లోపలనుండే ధనాన్ని సంపాదించాలి.

అలాగే సంపాదించారు. ఏ పెట్టుబడిదారీదేశంలోను కనుగొననివిధంగా సోవియట్‌యూనియన్‌లో ఆర్థిక మూలాధారాలను కనుగొన్నారు. సోవియట్ ప్రభుత్వం పెట్టుబడిదారులనుండీ, భూస్వాములనుండీ అక్టోబరు సోషలిస్టువిప్లవం లాగుకొన్న భూములను, ఫ్యాక్టరీలను, మిల్లులను అన్నిటిని తన అధీనంలో వుంచుకొంది. ఇంకా రవాణాసాధనాలను, బ్యాంకులను, స్వదేశీ, విదేశీ వర్తకాన్ని తన అధీనంలో వుంచు

కొంది. ప్రభుత్వయాజమాన్యంకిందవున్న మిల్లులద్వారా,ఫ్యాక్టరీలద్వారా, రవాణాద్వారా, బ్యాంకులద్వారా, స్వదేశ, విదేశ వర్తకంద్వారాను వచ్చే లాభాలన్నీ పరాన్న భుక్కులైన పెట్టుబడిదారీవర్గం జేబుల్లోకి పోలేదు. అవి సోవియట్ పరిశ్రమలను మరింత విస్తృతం చేయటానికి ఉపయోగించబడ్డాయి.

సోవియట్ ప్రభుత్వం జార్ ప్రభువు చేసిన ఋణాలను రద్దుచేసింది. వీటికి ప్రజలు సాలీనా వడ్డీకిందనే కోట్లకొలది బంగారు రూబుల్సును చెల్లించుతూ ఉండేవారు. భూమిపై భూస్వాముల హక్కును రద్దుచేయటంద్వారా సోవియట్ ప్రభుత్వం రైతులను విముక్తి చేసింది. వారు ప్రతిఏటా మగతా క్రింద చెల్లించవలసిన 50 కోట్ల బంగారురూబుల్సు బాకీని రద్దుచేసింది. ఈ భారంనుండి విముక్తులైన రైతాంగం నూతనంగా శక్తివంతమైన పరిశ్రమలను నిర్మించటంలో ప్రభుత్వానికి సహాయపడగలస్థితికి వచ్చింది. రైతులకు ట్రాక్టర్లు, ఇతర వ్యవసాయక యంత్రాలు చాలా అవసరం. వాటిని సంపాదించటంలో వారికి ప్రత్యేక ప్రయోజనముంది.

'ఈవిధంగా ప్రభుత్వాదాయానికి (రెవిన్యూ) మూలాధారాలన్నీ సోవియట్ ప్రభుత్వం చేతిలోవున్నాయి. భారీ పరిశ్రమలను నిర్మించటానికవసరమైన కోటానుకోట్ల రూబుల్సును అవి ఈయగలవు. కావలసిందల్లా ఖచ్చితమైన వ్యవహారధోరణి. ధనాన్ని ఖచ్చితంగా పొదుపుగా వాడటం నేర్చుకోవాలి. పరిశ్రమలను రేషనలైజ్ చేయటం, (తక్కువ యంత్రసామగ్రితో ఎక్కువ ఉత్పత్తిచేసేటట్లు నూతన యంత్ర

సామగ్రిని సమకూర్చటం - అనువాదకుడు) ఉత్పత్తి ఖర్చులను తగ్గించటం, దుబారాఖర్చును తొలగించివేయటం మొదలైనవి నేడు అవసరం.

సోవియట్ ప్రభుత్వం అవలంబించిన మార్గంకూడా ఇదే.

దుబారాలేని ఖచ్చితమైన ఆర్థికవిధాన పరిపాలనవల్ల పెట్టుబడి అభివృద్ధికి లభించేధనం సంవత్సర సంవత్సరానికీ వృద్ధి చెందింది. నీపర్ హైడ్రో ఎలెక్ట్రిక్ పవర్ స్టేషన్ (నీపర్ విద్యుచ్ఛక్తి కర్మాగారము), టర్కిస్థాన్-సైబీరియన్ రైల్వే, స్టాలిన్‌గ్రాడ్ ట్రాక్టరు పరిశ్రమలు ఇంకా అనేక యంత్ర సామగ్రి నుత్పత్తిచేసే పరిశ్రమలు, "ఆమో" (జిస్) [AMO (ZIS)] మోటారు పరిశ్రమలు మొదలైన బ్రహ్మాండమైన పెద్ద పరిశ్రమలను ప్రారంభించుట సాధ్యమైంది.

1926_27 లో 100 కోట్ల రూబుల్సును పరిశ్రమలలో పెట్టుబడిపెట్టారు. తరవాత మూడేండ్లకు ఇది 500 కోట్ల రూబుల్సుకు పెంచుట సాధ్యమైంది.

దేశాన్ని పారిశ్రామికం చేసే కార్యక్రమం క్రమ పద్ధతిని ముందుకు సాగుతోంది.

సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు ఆర్థికవిధానం పెంపొందుతూ బలపడటం పెట్టుబడిదారీ విధానపు ఉనికికి అపాయకరమని పెట్టుబడిదారీ దేశాలు భావించసాగాయి. అందుచే సోవియట్‌పైన తిరిగి ఒత్తిడిని తీసుకురావడానికి సామ్రాజ్యవాద ప్రభుత్వాలు తాము చేయగలిగినదంతా చేశాయి. దేశంలో అస్థిరభావాన్ని కల్గించటానికీ, అశాంతి భావాన్ని కల్గించటానికీ, పారిశ్రామికం చేసేప్రయత్నాలను

విఫలం చేయటానికీ కనీసం ఆటంకం కల్గించటానికీ, సామ్రాజ్య వాద ప్రభుత్వాలు ప్రయత్నించాయి.

1927 మేలో ఆరోజుల్లో పదవిలోనున్న కరుడుగట్టిన బ్రిటిష్ కన్సర్వేటివ్‌లు ఆర్కస్ పైన (బ్రిటన్‌లోని సోవియట్ వర్తక సంస్థ) రెచ్చగొట్టే ఉద్దేశంతో దాడిచేశారు. 1927 మే 26 తేదీన బ్రిటిష్ కన్సర్వేటివ్ ప్రభుత్వం సోవియట్‌తో, వర్తక సంబంధాలను, దౌత్యసంబంధాలను త్రెంచివేసుకొంది.

1927 జూన్ 7 వ తేదీన వార్సాలోని సోవియట్ రాయబారి కామ్రేడ్ వాయకోవ్‌ను పోలెండులో నివాస ముండి పౌరహక్కులను సంపాదించిన రష్యన్ వైట్ గార్డు ఒకడు హత్యచేశాడు.

ఇదే కాలంలో సోవియట్ యూనియన్‌లో బ్రిటిష్ గూఢచారులు, ప్రభుత్వదృష్టిని యితరవిధాల మరలింప దలచిన వారు (స్పైస్ అండ్ డైవర్షనిస్టు) లెనిన్ గ్రాడ్‌లో పార్టీ క్లబ్‌లోని ఒకమీటింగులో బాంబులు విసిరారు. 30 మందికి గాయాలుతగిలాయి. అందులో కొందరు చాలా ప్రమాద కరంగా గాయపడ్డారు.

1927 వేసవిలో బెర్లిన్, పీకింగ్, షాంగే, టీన్‌సిన్ పట్టణాలలోని సోవియట్ రాయబార కార్యాలయాలపైన, వర్తక ప్రతినిధి కార్యాలయాలపైన దాదాపు ఒకేసారి దాడులు జరిగాయి.

ఇది సోవియట్ ప్రభుత్వానికి అదనపు కష్టాలను తెచ్చి పెట్టింది. కాని సోవియట్ యూనియన్ బెదిరింపులకు లొంగ లేదు. సామ్రాజ్యవాదులు, ఇతర ప్రతిపక్షులు వారి ఏజంట్లు

రెచ్చగొట్టడానికి ప్రయత్నించినా వాటిని సులభంగానే తిప్పి గొట్టింది.

ట్రాట్స్కీవాదులు, ఇతర ప్రతిపక్షులు సాగించిన రహస్య ప్రభుత్వ ప్రతికూల చర్యలవల్ల సోవియట్ ప్రభుత్వానికీ, పార్టీకీవచ్చిన కష్టాలు ఏమీ తక్కువకాదు. సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా "చేంబర్లను మొదలుకొని ట్రాట్స్కీ వరకు సంయుక్త సంఘటన లాంటిది ఒకటి ఏర్పడుతూంది" అని కామ్రేడ్ స్టాలిన్ ఊరకనే చెప్పలేదు. పార్టీ పదునాల్గవ కాంగ్రెస్ తీర్మానాలను లక్ష్యంచేయక, తాము పార్టీయెడల విశ్వాసవంతంగా తమ ఆయుధాలను ఇంకా దించనేలేదు. పైగా పార్టీలో చీలికలు కల్గించటానికి తమ ప్రయత్నాలను తీవ్రతరం చేశారు.

**1926** వేసవిలో ట్రాట్స్కీవాదులు, జినోవీవ్ వాదులు పార్టీ వ్యతిరేక కూటమిని ఏర్పరచటంలో ఏకమయ్యారు. ఓడిపోయిన ప్రతిపక్ష ముఠాల అవశేషాలన్నిటినీ సమీకరించే కేంద్రంగా ఆ కూటమిని తయారుచేశారు. లెనినిస్టు వ్యతిరేక పార్టీకి వారు పునాదివేశారు. ముఠాలు ఏర్పరచటాన్ని నిషేధించిన పార్టీ కాంగ్రెస్ తీర్మానాలను, పార్టీ నిబంధనలను వారు పూర్తిగా ఉల్లంఘించారు. అపఖ్యాతిపాలయిన మెన్షివిక్కు ఆగస్టుకూటమిని పోలిన ఈ పార్టీవ్యతిరేక కూటమిని రద్దుచేయని పక్షంలో దాని అనుయాయులను పరిస్థితులు ప్రమాదకరంగా పరిణమించుతాయని సెంట్రల్ కమిటీ హెచ్చరించింది. కాని ఆ కూటమిని బలపరచేవారు దానిని వదలుకోలేదు.

ఆ సంవత్సరం ఆకురాలుకాలంలో 15 వ సమావేశం (కాన్ఫరెన్సు) రేపోమాపో జరుగుతుండనగా మాస్కో, లెనిన్ గ్రాడ్ మొదలగు పట్టణాలలోని ఫ్యాక్టరీ పార్టీ మీటింగులలో పార్టీపైన కొత్తగా చర్చను రుద్దాలని ప్రయత్నించారు. పార్టీ సభ్యులు చర్చించాలని వారు ప్రయత్నించిన వేదిక (రాజకీయ ప్రకటన - అనువాదకుడు) కొత్తదేమీకాదు. ఇది ట్రాట్స్కీ వాదుల మెన్షివిక్కుల లెనినిస్టు వ్యతిరేక వేదికకు మారు రూపమే. పార్టీ సభ్యులు ప్రతిపక్షులపైన గట్టిదెబ్బకొట్టారు. కొన్నిచోట్ల వారిని మీటింగులలోనుంచి నెట్టివేశారు. ఆ కూటమిని బలపరచినవారిని సెంట్రల్ కమిటీ మరొకసారి హెచ్చరించింది. పార్టీ వారి రహస్య కుట్ర చర్యలను ఇక ఏ మాత్రమూ సహించమని హెచ్చరించింది.

ఆతర్వాత ట్రాట్స్కీ, జినోవీవ్, సొకోల్నికోవ్‌లు కామెనివ్ సంతకంచేసిన ఒక ప్రకటనను సెంట్రల్‌కమిటీకి ప్రతిపక్షం యిచ్చింది. అందులో తమ ముఠాతత్వ కార్యకలాపాన్ని తామే ఖండించుకొన్నారు. మున్ముందు పార్టీపట్ల విశ్వాసంతో వుంటామని వాగ్దానంచేశారు. అయినప్పటికి ఆకూటమి యింకా కొనసాగుతూనేవుంది. దాని అనుచరులు పార్టీ వ్యతిరేక రహస్య కార్యకలాపం మానివేయలేదు. తాము స్థాపించదలచిన లెనినిస్టు వ్యతిరేకపార్టీకోసం వారు మనుష్యులను కూడగట్టుతూనే ఉన్నారు. ఒక రహస్య ముద్రణాలయాన్ని ప్రారంభించారు. తమను బలపరిచే వారినుండి సభ్యత్వ చందాలను వసూలుచేశారు. తమ వేదికను ప్రచారం చేశారు.

ట్రాట్స్కీ-వాదుల, జినోవీవ్ వాదుల ప్రవర్తనను దృష్టిలోపెట్టుకొని పార్టీ 15 వ సమావేశమూ, (1926 నవంబరు) కమ్యూనిస్టు ఇంటర్ నేషనల్ యొక్క కార్యనిర్వాహక వర్గ విస్తృత సమావేశమూ, (1926 డిసెంబరు), ట్రాట్స్కీ-వాదుల, జినోవీవ్ వాదుల కూటమి సమస్యను చర్చించాయి. ఈ కూటమి నంటిపెట్టుకొన్నవారు చీలికలు గలిగించేవారనీ, వీరి వేదిక పూర్తిగా మెన్షివిక్కు వేదికయనీ ఖండించుతూ తీర్మానించాయి.

కాని యిందువల్లకూడా వారికి బుద్ధిరాలేదు.

1927లో సోవియట్ యూనియన్‌తో దౌత్య, వర్తక సంబంధాలను బ్రిటిషు కన్సర్వేటివ్‌లు తెగతెంపులు చేసుకొన్న సమయాన్నే ఈ కూటమి మరింత పటిమతో పార్టీని ఎదుర్కొంది. లెనినిస్టు వ్యతిరేకమైన కొత్తవేదిక నొకదానిని సృష్టించింది. దీనికి "83 గురి వేదిక" అనిపేరు పెట్టారు. దీనిని పార్టీసభ్యులలో ప్రచారంచేయ ప్రారంభించారు. దీనిపై సాధారణ సభ్యులంతా చర్చనుప్రారంభించాలని సెంట్రల్ కమిటీపై ఇదే సమయాన వత్తిడితెచ్చారు.

ప్రతికూల వేదికలన్నిటిలోకి అసత్యాలతోను, కపటంతోను కూడిన వేదిక ఇది.

ట్రాట్స్కీ-వాదులు, జినోవీవ్ వాదులు పార్టీనిర్ణయాలను పాటించటంలో తమ కభ్యంతరంలేదని, పార్టీపట్ల విశ్వాసంగా వుంటానికి తామందరమూ అనుకూలురమేనని తమవేదికలో చెప్పుకొన్నారు. కాని ఆచరణలో వారు పార్టీనిర్ణయాలను పూర్తిగా ఉల్లంఘించారు. పార్టీకి, దాని సెంట్రల్‌కమిటీకి

విశ్వాసంగా వుండాలనే అభిప్రాయాన్నే అపహాస్యం చేశారు.

తమ వేదికలో పార్టీ ఐక్యతను తమ కభ్యంతరంలేదని, చీలికలను తాము వ్యతిరేకులమని వారు చెప్పుకొన్నారు. కాని ఆచరణలో వారు పార్టీ ఐక్యతను ఉల్లంఘించి చీలికలు పెట్టడానికి పనిచేశారు. అప్పటికే వారు లెనినిస్టు వ్యతిరేక రహస్య పార్టీని నిర్మించారు. సోవియట్ ప్రతికూలమైన విప్లవ ప్రతిఘాతక పార్టీకి కావలసిన హంగులన్నీ దీనికున్నాయి.

దేశాన్ని పారిశ్రామికం చేయటానికి తామంతా అనుకూలురమేనని వారు తమ వేదికలో చెప్పుకొన్నారు. పైగా ఆకృషిలో తగినంత త్వరగా ముందుకు సాగటంలేదని సెంట్రల్ కమిటీని నిందించారుకూడ. కాని ఆచరణలో సోవియట్ యూనియన్‌లో సోషలిజం విజయం పొందుతుందని చేసిన పార్టీ తీర్మానానికి తప్పులు పట్టటంతప్ప వారు చేసినపని ఏమీ లేదు. దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం గావించే విధానాన్ని ఎగతాళిచేశారు. అనేక మిల్లులను, ఫ్యాక్టరీలను ప్రత్యేక సౌకర్యాల రూపేణా (కన్సెషన్స్) విదేశీయులకు అప్పజెప్పాలని కోరారు. సోవియట్ యూనియన్‌లో విదేశపెట్టుబడి దారులకు కల్గించే ప్రత్యేక సౌకర్యాలపైన తమ ఆశలన్నీ పెట్టుకొన్నారు.

తామంతా సమిష్టివ్యవసాయ ఉద్యమానికి అనుకూలురమని తమ వేదికలోవారు చెప్పుకొన్నారు. పైగా తగినంత త్వరగా సమిష్టి వ్యవసాయపద్ధతి ప్రారంభించలేదని సెంట్రల్ కమిటీని నిందించారు కూడా. కాని ఆచరణలో, సోషలిస్టు నిర్మాణ కార్యంలో రైతులను చేర్చుకొనే విధానాన్ని ఎగతాళి

చేశారు. కార్మికవర్గానికి, రైతాంగానికి మధ్య "పరిష్కరింప వీలులేని వైరుధ్యాలు" తప్పనిసరిగా ఉంటాయని బోధించారు. గ్రామసీమలలో "నాగరిక కౌలుదారుల"పైన అనగా కులకుల పైన తమ ఆశలు పెట్టుకొన్నారు.

ఇది ప్రతిపక్షు వేదిక లన్నిటిలోకి అత్యంత అసత్యాలతో కూడిన వేదిక.

పార్టీని మోసగించటం దానిఉద్దేశ్యం. వెంటనే దానిపై సర్వసాధారణ చర్చను ప్రారంభించటానికి సెంట్రల్ కమిటీ తిరస్కరించింది. పార్టీ నిబంధనల ననుసరించి పార్టీ కాంగ్రెస్‌కు రెండు నెలల ముందు ఈ చర్చ ప్రారంభింప బడుతుందని సెంట్రల్ కమిటీ ప్రతిపక్షులకు తెలియజేసింది.

1927 అక్టోబరులో 15 వ కాంగ్రెస్ రెండు నెలలకు జరుగుతుందనగా పార్టీ సర్వసాధారణ చర్చ ప్రారంభమవు తుందని సెంట్రల్ కమిటీ ప్రకటించింది. దీనితో పోరాటం ప్రారంభమైంది. దీని ఫలితం ట్రాట్స్కీ వాదుల, జినోవీవ్ వాదుల కూటమికి నిజంగా విచారకరమైనది. సెంట్రల్ కమిటి విధానానికి అనుకూలంగా 7 లక్షల 24 వేల పార్టీ సభ్యులు వోటు చేశారు. 4 వేల మంది మాత్రమే అనగా నూటికి ఒక్కరు కంటెకూడ తక్కువ ట్రాట్స్కీవాదుల, జినోవీవ్ వాదుల కూటమికి వోటు చేశారు. పార్టీ వ్యతిరేక కూటమి పూర్తిగా ఓడిపోయింది. ఈ కూటమి వేదికను పార్టీ సభ్యుల లోని అత్యధిక సంఖ్యాకులు ఏకగ్రీవంగా తిరస్కరించారు.

ప్రతిపక్షులు ఏ పార్టీ తీర్పుకై విన్నవించుకున్నారో ఆ పార్టీ తీర్పు ఆ విధంగా, స్పష్టంగా వ్యక్తమయింది.

కాని యీ పాఠాన్ని కూడా ఈ కూటమిని బలపర్చిన వారు నేర్చుకోలేదు. పార్టీ అభిప్రాయానికి తల ఒగ్గటానికి బదులుగా దానిని నాశనం చేయాలని వారు నిశ్చయించుకొన్నారు. చర్చ ముగియకముందే తమకు అవమానకరమైన అపజయం సంభవించుతుందని గ్రహించి పార్టీకి, సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా మరింత తీవ్రపోరాట రూపాలను అవలంబించాలని నిశ్చయించు కొన్నారు. మాస్కోలోను, లెనిన్ గ్రాడ్‌లోను బహిరంగంగా అసమ్మతి ప్రదర్శనాలను లేవదీయాలని నిశ్చయించుకొన్నారు. ఆ ప్రదర్శనాలకు వారు నిర్ణయించిన దినం నవంబరు 7 వ తేదీ. నాడు అక్టోబరు విప్లవ వర్ధంతి. ప్రతియేటా ఆరోజున సోవియట్ యూనియన్‌లోని కష్టజీవులు దేశమంతటా విప్లవ ప్రదర్శనాలను గావించుతారు. ట్రాట్స్కీ వాదులు, జినోవీవ్ వాదులు పోటీ ప్రదర్శనాన్ని సాగించటానికి ఆవిధంగా పథకం వేసుకొన్నారు. కాని అనుకొన్న విధంగానే ఈ కూటమికి చెందినవారు, పాపం కొద్దిమంది వేళ్ళతో లెక్కింపతగిన తమ ఉపగ్రహాలు, వారి మద్దతుదారులు సర్వజన ప్రదర్శనంలో మునిగిపోయి వీధులనుండి తుడిచివేయబడ్డారు.

ట్రాట్స్కీవాదులు, జినోవీవ్‌వాదులు ఇప్పుడు నిశ్చితంగా సోవియట్ వ్యతిరేకులయ్యారనుటలో ఎట్టి సందేహమూ లేదు. పార్టీ సర్వసాధారణచర్చలో సెంట్రల్‌కమిటీకి వ్యతిరేకంగా వారు పార్టీకి విజ్ఞప్తి చేసుకొన్నారు. ఇప్పుడు ఈ అల్ప ప్రదర్శనద్వారా పార్టీ, సోవియట్ ప్రభుత్వాల శత్రువర్గాలకు విజ్ఞప్తిచేశారు - బోల్షివిక్ పార్టీని కూలద్రోయటం తమ

లక్ష్యంగా వారు ఒకసారి పెట్టుకొన్నతరువాత సోవియట్ ప్రభుత్వాన్ని కూడా కూలద్రోయాలనే వరకు వారు పోక తప్పదు. ఎందుచేతనంటే సోవియట్ యూనియన్‌లో బోల్షివిక్ పార్టీ, ప్రభుత్వమూ విడదీయ వీలులేనివి. అందుచేత ట్రాట్స్కీ వాదుల, జినోవీవ్ వాదుల కూటమిలోని కథానాయకులు(రింగ్ లీడర్లు) పార్టీనుండి తమంతకు తామే బహిష్కృతులయ్యారు. సోవియట్ వ్యతిరేకచర్యలనే ఊబిలో మునిగినవారిని బోల్షివిక్ పార్టీ తన అనుచరులలో ఉంచుకొని సహించటం అసంభవం. 1927 నవంబరు 14 వ తేదీన సెంట్రల్ కమిటీ, సెంట్రల్ కంట్రోల్ కమిషన్ల సంయుక్త సమావేశంలో ట్రాట్స్కీని, జినోవీవ్‌ను పార్టీనుంచి వెళ్ళగొట్టారు.

## 2

సోషలిస్టు పరిశ్రమాభివృద్ధి- వ్యవసాయం వెనుక బడుట - పార్టీ 15 వ కాంగ్రెస్ - సమిష్టి వ్యవసాయ విధానం - ట్రాట్స్కీ, జినోవీవ్ వాదులకూటమి పలాయనం - రాజకీయ కపటనాటకం

**1927** సంవత్సరాంతానికి దేశాన్ని సోషలిస్టు పారిశ్రామికం గావించే విధానం నిస్సందేహంగా నిశ్చితవిజయాన్ని పొందింది. నూతన ఆర్థికవిధానంక్రింద దేశాన్ని పారిశ్రామికం చేయటం కొద్దికాలంలోనే తగు అభివృద్ధిని పొందింది. పరిశ్రమల, వ్యవసాయం ఉత్పత్తిమొత్తం (కలప పరిశ్రమ, చేపలు

పట్టుటతో సహా) యుద్ధ పూర్వస్థాయిని చేరడమేగాక దాటి పోయిందికూడా. పారిశ్రామిక ఉత్పత్తి దేశం మొత్తపు ఉత్పత్తిలో నూటికి 42 పాళ్ళకు చేరింది. ఇది యుద్ధానికి పూర్వపు నిష్పత్తి.

ప్రయివేటు పరిశ్రమల రంగాన్ని దెబ్బకొడుతూ సోషలిస్టు పారిశ్రామిక రంగం వేగంగా వృద్ధికాజొచ్చింది. 1924-25 లో మొత్తం ఉత్పత్తిలో సోషలిస్టు పరిశ్రమల ఉత్పత్తి నూటికి 81 పాళ్లు. అదే 1926-27 లో నూటికి 86 పాళ్ళకు పెరిగింది. ఇక ప్రయివేటు పరిశ్రమలలోని ఉత్పత్తి అదేకాలంలో నూటికి 19 నుండి (1924-25) నూటికి 14 కి (1926-27) పడిపోయింది.

దీని అర్థం సోవియట్‌యూనియన్‌లోని పారిశ్రామిక విధానం నిశ్చితసోషలిస్టు స్వభావాన్ని కలిగియున్నదని చెప్ప వచ్చు. పరిశ్రమలు సోషలిస్టు ఉత్పత్తివిధాన విజయంవైపుకు అభివృద్ధి చెందుతున్నా యన్నమాట. పరిశ్రమలకు సంబంధించినంతవరకు, "ఏది జయించుతుంది" అన్న ప్రశ్నకు సోషలిజమే జయించుతుందనే సమాధానం అప్పటికే నిశ్చయమై పోయింది.

వర్తకరంగంలో కూడ ప్రైవేటు వర్తకుని తొలగించటముకూడా ఇంత వేగంగానే సాగింది. 1924 - 25 లో చిల్లర వర్తకంలో అతనివంతు నూటికి 42 పాళ్ళు. 1926-27 లో అది నూటికి 32 పాళ్ళకు పడిపోయింది. ఇక టోకువ్యాపారంలో ప్రయివేటు వర్తకునివంతు నూటికి 9 పాళ్ళనుండి (1924-25) నూటికి 5 పాళ్ళకు (1926-27) అదేకాలంలో పడిపోయింది.

పెద్దపెద్ద (లార్జిస్కేల్) సోషలిస్టు పరిశ్రమలు ఇంకా త్వరితగతిని అభివృద్ధిచెందాయి. పునరుద్ధరణాకాలం తరువాత మొదటి సంవత్సరంలోనే అనగా 1927 లో యీ సోషలిస్టు పరిశ్రమల ఉత్పత్తి గత సంవత్సరపు ఉత్పత్తికంటె నూటికి 18 పాళ్లు వృద్ధిఅయింది. ఈ అభివృద్ధి నిజంగా రికార్డు (అంతకు పూర్వపు హద్దులను మీరిపోవుట -అనువాదకుడు) అనవచ్చు. బాగా అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలయొక్క పెద్ద పరిశ్రమలుగూడా ఈ రికార్డు నందుకోలేదు.

కాని వ్యవసాయంలో ముఖ్యంగా ధాన్యపుపంటలో పరిస్థితి భిన్నంగావుంది. మొత్తంమీద వ్యవసాయం యుద్ధ పూర్వస్థాయిని మించిపోయి నప్పటికీ, వ్యవసాయంలో ముఖ్య శాఖయైన . ధాన్యపుపంట ఉత్పత్తి మొత్తం యుద్ధ పూర్వపు పంటతో పోల్చితే నూటికి 91 పాళ్ళేవుంది. ఇందులో మార్కెటుకు వెళ్ళేభాగం చూస్తే అనగా పట్టణాల సప్లయికి అమ్మబడే ధాన్యంచూస్తే యుద్ధ పూర్వసంఖ్యలో నూటికి 37 పాళ్ళే చేరుకోగలిగింది. ఇంతేగాక మార్కెటుకు అవసరమయ్యే ధాన్యం ఇంకా పడిపోయే ప్రమాదకర సూచనలు అగుపడ్డాయి.

దీని అర్థం మార్కెట్టుకు ధాన్యాన్ని సప్లయిచేసే పెద్ద భూఖండాలు చిన్నభూఖండాలుగానూ, చిన్నవి మరింత చిన్నవిగానూ చీలిపోయే క్రమం 1918లో ప్రారంభమై ఇంకా కొనసాగుతుందన్నమాట. ఈ చిన్నచిన్న రైతుభూఖండాలు ఆచరణలో తమ సహజ ఆర్థిక స్వరూపాన్ని తిరిగి స్వీకరిస్తున్నాయి. మార్కెట్లకు చాలాతక్కువధాన్యాన్ని మాత్రమే సప్లయి

చేయగల్గుతున్నాయి. 1927 కాలంలో ధాన్యపుపంట యుద్ధ పూర్వకాలంలోకంటె కొంచెం మాత్రమే తక్కువ. కాని పట్ణాలకు సప్లయిచేసే అమ్మకపుధాన్యం యుద్ధపూర్వ అమ్మకపు ధాన్యంలో మూడవవంతుకు కొంచెంపైగా మాత్రమేవుంది.

ధాన్యపు ఉత్పత్తి అలావుండే పక్షంలో పట్ణప్రజలు, సైన్యం నిరంతరక్షామాన్ని ఎదుర్కొనవలసి వస్తుందనటంలో ఎట్టి సందేహమూలేదు.

ధాన్యపు ఉత్పత్తిలో సంక్షోభం ప్రారంభమైనప్పుడు దానితోపాటు వ్యవసాయానికవుసరమైన పసువుల విషయంలో కూడ సంక్షోభం రాకతప్పదు.

ఈ దురవస్థనుండి తప్పించుకొనే ఏకైకమార్గం ఒకటే. ట్రాక్టర్లను, వ్యవసాయ యంత్రాలను ఉపయోగించి పెద్ద పెట్టున (లార్జిస్కేలు) వ్యవసాయం సాగించటం. దీనివల్ల అవ సపు అమ్మకధాన్యం అనేకరెట్లు వృద్ధికాగలదు. దేశం అవలంబించవలసిన మార్గాలు రెండేవున్నాయి. ఒకటి పెద్దఎత్తున పెట్టుబడిదారీ వ్యవసాయాన్ని ప్రారంభించడం. ఇలా చేసినట్లయితే రైతు జనసామాన్యం నాశనమౌతుంది. కార్మికవర్గ రైతాంగాలమధ్య మైత్రి నాశనమవుతుంది. కులకోల బలం వృద్ధిచెందుతుంది. పల్లెపట్టులో సోషలిజం పతనం చెందుతుంది. రెండవది చిన్నచిన్న రైతుభూములను పెద్ద సోషలిస్టు భూఖండాలుగా ఏకంచేసి సమిష్టి క్షేత్రాలుగా మార్చటం. ఈ సమిష్టి క్షేత్రాలలో ట్రాక్టర్లను, ఇతర ఆధునిక యంత్రాలను ఉపయోగించి ధాన్యపు ఉత్పత్తిని త్వరగా అభివృద్ధి చేయ

వచ్చు. ఇందువల్ల అదనపు అమ్మకపుధాన్యంకూడా త్వరగా వృద్ధిచెందుతుంది.

బోల్షివిక్కు-పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ రెండవ మార్గాన్నే అనగా సమిష్టిక్షేత్రాలద్వారా వ్యవసాయాన్ని అభివృద్ధిపరచే మార్గాన్నే అనుసరించుతా యన్నది స్పష్టమే.

ఈ విషయంలో ఈ క్రింది లెనిన్ సూత్రాలను పార్టీ అనుసరించి నడచింది. చిన్నచిన్న రైతు క్షేత్రాలను విస్తార ప్రమాణ సహకార సమిష్టి వ్యవసాయక్షేత్రాలుగా మార్చవలసిన ఆవశ్యకతను గురించి లెనిన్ ఇలా తెలియజేశాడు:

(ఎ) "చిన్న భూఖండ వ్యవసాయంలో దారిద్ర్యం నుండి తప్పించుకొనే మార్గంలేదు". (లెనిన్ కలెక్టెడ్ వర్కు్స, రష్యన్ ఎడిషన్, **24**వ వాల్యూమ్ **540** పేజీ).

(బి) "స్వాతంత్ర్య దేశంలోని స్వేచ్ఛావంతులమైన మనం కూడా పూర్వపద్ధతులలో చిన్న భూఖండాల వ్యవసాయం కొనసాగించినట్లయితే అనివార్యమైన వినాశనాన్ని మనం ఇంకా ఎదుర్కొనవలసియుంటుంది." (లెనిన్ కలెక్టెడ్ వర్కు్స, రష్యన్ ఎడిషన్, **20**వ వాల్యూమ్, **417** పేజి)

(సి) "రైతు వ్యవసాయాన్ని యింకా అభివృద్ధి చేయాలంటే తర్వాత దశకు అది తప్పనిసరిగా పరివర్తన చెందేటట్లు చేయడం మన బాధ్యత. చిన్నచిన్న, విడివిడిగానున్న, తక్కువ ఆదాయం వచ్చే, చాలా వెనుకబడ్డ రైతు భూఖండాలను, క్రమంగా విస్తార ప్రమాణ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా కలిపివేయటం ఆ తరువాతి దశలో తప్పనిసరిఅవుతుంది." (లెనిన్ కలెక్టెడ్ వర్క్స్, రష్యన్ ఎడిషన్, **26**వ వాల్యూం **299**వ పేజీ),

(డి) "ఆచరణలో ఉమ్మడి, సమిష్టి, సహకార సంఘ (Artel) వ్యవసాయంవలన లాభాలను రైతులకు రుజువుచేయ గలిగినపుడే; సహకార పద్ధతులు లేక సంఘ (Artel) వ్యవసాయం ద్వారా రైతులకు సహాయం చేయుటలో జయప్రద మైనప్పుడే; ప్రభుత్వాధికారాన్ని కలిగియున్న కార్మికవర్గం తన పంథాయొక్క నిజాయితీని రైతులకు వాస్తవంగా నచ్చచెప్ప గలదు. లక్షలాది రైతుల నిజమైన, నిలకడయైన అండను పొందగలదు." (లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947, 2వ వాల్యూమ్, 539వ పేజి)

పార్టీ 15 వ కాంగ్రెస్‌కు ముందు పరిస్థితి అలా వుంది.

1927 డిసెంబరు 2వ తేదీన పార్టీ 15 వ కాంగ్రెస్ ప్రారంభమైంది. దీనికి 8 లక్షల, 87 వేల 233 పార్టీ సభ్యులకు, 3 లక్షల 48 వేల 957 కాండిడేటుసభ్యులకు ప్రాతినిధ్యం వహించిన ప్రతినిధులు వచ్చారు. ఇందులో వోటింగు హక్కు గల ప్రతినిధులు 898 మంది, చర్చించే హక్కు మాత్రం గల ప్రతినిధులు 771 మంది వచ్చారు.

సెంట్రల్ కమిటీ తరపున కామ్రేడ్ స్టాలిన్ రిపోర్టు ఇస్తూ పారిశ్రామిక విధాన సత్ఫలితాలనూ, సోషలిస్టు పరిశ్రమ త్వరితంగా వ్యాపించటాన్ని గురించీ చెప్పాడు. పార్టీకి యీ క్రింది కర్తవ్యాన్ని యిచ్చాడు :

"పట్టణాలలోని, పల్లెలలోని ఆర్థిక శాఖ లన్నిటిలోను, సోషలిస్టు కీలకస్థానాలను విస్తరింపజేసి సుస్థిరపరచుకోవాలి. జాతీయ ఆర్థిక విధానంలో పెట్టుబడిదారీవ్యక్తులను తొలగించే మార్గం అనుసరించాలి."

పరిశ్రమలతో వ్యవసాయాన్ని పోలుస్తూ వ్యవసాయం, ముఖ్యంగా ధాన్యపు ఉత్పత్తి వెనుకబడివుందని తెలియజేశాడు. వ్యవసాయంచెల్లాచెదురై ఉండటంవల్ల, ఆధునిక యంత్రాలను ఉపయోగించే అవకాశం లేకపోవటంవల్ల ధాన్యపు వుత్పత్తి వెనుకబడివుంది. వ్యవసాయం అలా దుస్థితిలో వుండటం మొత్తం జాతీయ ఆర్థిక విధానాన్నంతా ప్రమాదానికి గురి చేస్తుందని కామ్రేడ్ స్టాలిన్ నొక్కిచెప్పాడు.

"దీనినుంచి బయటపడే మార్గ మేమిటి?"అని కామ్రేడ్ స్టాలిన్ ప్రశ్నించాడు.

ఆయన చెప్పిన జవాబిది: "చిన్న చిన్న చెదురుగా వున్న రైతు క్షేత్రాలను, ఉమ్మడిగా వ్యవసాయం చేసే ప్రాతిపదికపైన పెద్ద పెద్ద ఐక్య క్షేత్రాలుగా మార్చటమే దీనికిమార్గం. నూతన ఉన్నతసాంకేతిక పద్ధతుల ప్రాతిపదికపైన సమిష్టివ్యవసాయాన్ని ప్రవేశపెట్టుటే దీనికిమార్గం. చిన్న చిన్న, కొద్దిపాటి రైతుభూఖండాలను క్రమంగా నిశ్చితంగా కలిపి వేయాలి. వ్యవసాయ యంత్రాలను, ట్రాక్టర్లను ఉపయోగించి శాస్త్రీయ పద్ధతులతో ఎక్కువ వ్యవసాయం చేసేటటువంటి ఉమ్మడి సమిష్టి సహకార వ్యవసాయ క్షేత్రాలుగా వీటిని కలిపివేయాలి. అయితే ఈ పద్ధతి నిర్బంధంవల్లగాక ఉదాహరణ చూపించుటద్వారాను, ఒప్పించుటద్వారానుమాత్రమే జరగాలి. ఇంతకు మినహా మరొక మార్గంలేదు."

వ్యవసాయంలో సమిష్టి పద్ధతిని పూర్తిగా పెంపొందించాలని 15 వ కాంగ్రెస్ ఒక తీర్మానం చేసింది. సమిష్టి వ్యవసాయక్షేత్రాలను ప్రభుత్వవ్యవసాయక్షేత్రాలను వ్యాపింప

జేసి స్థిరపరచే ఒకపథకాన్ని కాంగ్రెసు ఆమోదించింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను ఏర్పరచే పోరాటంలో అవలంబించవల సిన పద్ధతులను గురించి స్పష్టమైన సూచనలను కాంగ్రెస్ తయారుచేసింది.

అదే సమయాన కాంగ్రెస్ ఈక్రింది ఉత్తరువులను చేసింది.

"కులక్‌లకు వ్యతిరేకంగా దాడిని యింకా పెంపొందించాలి. గ్రామసీమలో పెట్టుబడిదారీ విధాన అభివృద్ధిని అరికట్టి సోషలిజంవైపు రైతు వ్యవసాయాన్ని నడిపించే కొత్త పద్ధతులను అనేకం అవలంబించాలి." (సో. యూ. క. (బో) పార్టీ తీర్మానాలు, రష్యన్ ఎడిషన్ 2వ భాగం, 260వ పేజీ.)

ఆర్థిక ప్లానింగ్ లోతుగా వేరూనింది. యావదార్థిక రంగంలో పెట్టుబడిదారీ వ్యక్తులకు వ్యతిరేకంగా సోషలిస్టు దాడిని క్రమపద్ధతిని సంఘటితపరచాలి. ఈ ఉద్దేశ్యంతో జాతీయ ఆర్థిక సంపదాభివృద్ధికి ప్రథమ పంచవర్ష ప్రణాళికను తయారుచేయమని ఆయాసంఘాలకు కాంగ్రెస్ ఆదేశమిచ్చింది.

సోషలిస్టు నిర్మాణ సమస్యలపైన నిర్ణయాలు చేసిన తరువాత, ట్రాట్స్కీ, జినోవీవ్ వాదుల కూటమిని రద్దుజేసే సమస్యను కాంగ్రెస్ చర్చింప పూనుకొంది.

కాంగ్రెస్ యీక్రింది విషయాన్ని గుర్తించింది : "ప్రతిపక్షం సిద్ధాంత రీత్యా లెనినిజంతో తెగతెంపులు చేసుకొంది. మెన్షివిక్కు ముఠాగా పతనం చెందింది. అంతర్జాతీయ, జాతీయ పెట్టుబడిదారీ శక్తులకు లొంగిపోయే మార్గాన్ని అవలంబించింది. అందుచేత శ్రామికవర్గ నియంతృత్వ ప్రభుత్వానికి వ్యతి

రేకంగా విప్లవ ప్రతిఘాతకశక్తి చేతిలో వాస్తవంగా సాధన మైందనుట స్పష్టం." (సో. యూ. క. (బో) పార్టీ తీర్మానాలు రష్యన్ ఎడిషన్, రెండవభాగం, 232 వ పేజీ).

పార్టీకి, ప్రతిపక్షానికి మధ్య విభేదాలు కార్యక్రమ విషయంలోని విభేదాలుగా మారాయని కాంగ్రెస్ గుర్తించింది. ట్రాట్స్కీ-యొక్క ప్రతిపక్షం సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాట మార్గాన్ని అవలంబించిందని కాంగ్రెస్ గుర్తించింది. అందుచే ట్రాట్స్కీ-యొక్క ప్రతిపక్ష అనుచరులకు, దాని అభిప్రాయాలను ప్రచారం చేసేవారికి బోల్షివిక్ పార్టీలో సభ్యత్వం వుండదనీ ఈ రెండింటికీ పొసగదని కాంగ్రెస్ ప్రకటించింది.

ట్రాట్స్కీ-ని, జినోవీవ్‌ను పార్టీనుంచి వెళ్ళగొట్టాలని సెంట్రల్ కమిటీ, సెంట్రల్ కంట్రోల్ కమిషన్ తమసంయుక్త సమావేశంలో చేసిన తీర్మానాన్ని కాంగ్రెసు ఆమోదించింది. ఇంతేగాక ట్రాట్స్కీ, జినోవీవ్ వాదుల కూటమిలోని ముఖ్య (యాక్టివ్) సభ్యులనందరిని అనగా రాడెక్, ప్రియోబ్రాఝెన్‌స్కీ, రకోవస్కీ, ప్యాటకోవ్, సెరిబ్రియాకోవ్, ఐ. స్మిర్నోవ్, కామెనివ్, సార్కిస్, శాపురోవ్, లిఫ్‌సిజ్, మిడివానీ, స్మిల్గాలనూ, "డెమాక్రటిక్ సెంట్రలిజం" ముఠా నంతటినీ (శాప్రొనోవ్, వి. స్మిర్‌నోవ్, బోఘుస్లావస్కీ, డోబ్నిస్ మొదలగువారు) పార్టీనుంచి వెళ్ళగొట్ట నిశ్చయించింది. సిద్ధాంతరీత్యా ఓడిపోయి, సంఘటనరీత్యా పరాభూతమై ట్రాట్స్కీ, జినోవీవ్ వాదులకూటమి సభ్యులు ప్రజలలో తమపలుకుబడియొక్క తుది అవశేషాలనుకూడ పోగొట్టుకొన్నారు.

పార్టీనుండి వెళ్ళగొట్టబడిన లెనినిస్టు వ్యతిరేకులు, ట్రాట్స్కీ-జాన్ని పరిత్యజించినట్లు పశ్చాత్తాప పడుతూ, పార్టీ లోకి తమని తిరిగి తీసుకోవలసిందని కోరుతూ పార్టీ 15వ కాంగ్రెస్ జరిగిన కొద్దికాలానికే ప్రకటనలు చేయసాగారు. ఆరోజుల్లో ట్రాట్స్కీ, రకోవస్కీ, రాడెక్, క్రెస్టిన్‌స్కీ, సొకోల్నికోవ్ మొదలగువారు ప్రజాశత్రువులనీ, విదేశగూఢచారి శాఖలు వారిని గూఢచారులుగా తీసుకొన్నారనీ పార్టీకి అప్పుడు తెలియనిమాట నిజమే. సోవియట్ ప్రజలను వ్యతిరేకంగా పెట్టుబడిదారీ దేశాలలోని సోవియట్ శత్రువులతో "సహకరించే" నిమిత్తం కామెనెవ్, జినోవీవ్, ప్యాటకోవ్ మొదలగువారు సంబంధాలేర్పరచుకొంటున్నారనీ అప్పుడు పార్టీకి తెలియనిమాట నిజమే. లెనిన్‌ను, లెనినిస్టు పార్టీని మహా క్లిష్ట సమయాలలో తరచు ఎదిరించుతూ వచ్చిన ఈ వ్యక్తులు ఎలాంటి మోసానికైనా పాల్పడతారని పార్టీ అనుభంవల్ల నేర్చుకొంది. అందుచే వారు తిరిగి తమను పార్టీలో చేర్చుకోమని పెట్టిన దరఖాస్తులలోని ప్రకటనలు విశ్వసింపదగవికావని పార్టీకి తెలుసు. వారిచిత్తశుద్ధికి యీక్రింది షరతులను పెట్టింది.

(ఎ) ట్రాట్స్కీ-వాదం బోల్షివిక్ వ్యతిరేక, సోవియట్ వ్యతిరేక సిద్ధాంతమని వారు బహిరంగంగా దానిని ఖండించాలి.

(బి) పార్టీ విధానమే సరియైన విధానమని వారు బహిరంగంగా అంగీకరించాలి.

(సి) పార్టీ నిర్ణయాలకు దాని సంఘాల నిర్ణయాలకు బేషరతుగా వారు కట్టుబడివుండాలి.

(డి) వారు కొంత కాలం అర్హతా పరీక్షకు (ప్రొబే షన్) నిలబడాలి. ఈ కాలంలో వారిని పార్టీ పరీక్షించుతుంది. ఈ కాలం ముగిశాక వారి పరీక్షా ఫలితాన్ననుసరించి ప్రతి దరఖాస్తుదారుని పార్టీలో చేర్చుకొనే విషయమై వేరువేరుగా ఆలోచించుతుంది.

పార్టీ నుండి బహిష్కరించబడినవారు ఈ అంశాలను బహిరంగంగా అంగీకరించటం అన్నివిధాల మంచిదనిపార్టీ భావించింది.ఎందువల్లనంటే అలా చేయడంవల్ల ట్రాట్స్కీ, జినో వీవ్ వాదుల అనుచరులలో ఐక్యతభగ్నమై వారిమనోనిబ్బరాన్ని కూల్చివేస్తుంది. మరొకసారి పార్టీయొక్క బలాన్ని, సరియైన పంథాను ప్రదర్శించుతుంది. వీరిదరఖాస్తులు చిత్తశుద్ధితో చేయ బడినట్లయితే వారిని తిరిగి పార్టీలోనికి తీసుకోవటానికి అవకాశ ముంటుంది. చిత్తశుద్ధితో కూడుకొనని పక్షంలో వారిని ప్రజల కళ్ళముందు బయటపెట్టవచ్చు. వారిక తప్పుతోవ పట్టిన వ్యక్తులు ఏమాత్రమూ కారనీ, నియమరహితులైన పదవీ వ్యామోహపరులనీ, కార్మికవర్గాన్ని మోసగించేవారనీ, బాగు పరచడానికి వీలులేని గోముఖవ్యాఘ్రాలనీ బయటపెట్టవచ్చు.

పార్టీలో తిరిగి చేర్చుకోవటానికి పెట్టిన షరతులను బహిష్కరింపబడినవారిలో అధికసంఖ్యాకులు అంగీకరించారు. అలా బహిరంగంగా పత్రికలలో ప్రకటనలు కూడ చేశారు. వారిని దయతలచాలనీ, పార్టీ వ్యక్తులుగా, కార్మికవర్గ వ్యక్తు లుగా, తయారయే అవకాశాన్ని మరొకసారి వారికి యివ్వక పోవడం సరియైనదికాదని తలచి, పార్టీ వారిని తమ అనుచరు లలో చేర్చుకొంది.

కాని ఏ కొద్దిమందో తప్ప, ట్రాట్స్కీ, జినోవీవ్ వాదుల కూటమిలోని "నాయకమణుల" పశ్చాత్తాప ప్రకటనలన్నీ అబద్ధమనీ, మొదటి నుండి చివరిదాకా కపటంతో కూడుకొని వున్నవనీ, తర్వాత కాలం రుజువుచేసింది.

తమ దరఖాస్తులను పార్టీ కిచ్చేముందే యీ పెద్దమనుష్యులు ఏ ఒక రాజకీయ ధోరణికి కూడ ప్రాతినిధ్యం వహించటం మానివేశారు. ప్రజలముందు తమ అభిప్రాయాలను సమర్థించుకోలేని స్థితికి వచ్చారు. తమ స్వంత అభిప్రాయాల అవశేషాలను బహిరంగంగా కాలరాయటానికి కూడా సిధపడి నియమ రహితులైన పదవీ వ్యామోహ పరుల ముఠాగా తయారయ్యారు. వారికి వ్యతిరేకమైన పార్టీ అభిప్రాయాలను బహిరంగంగా స్తుతించ సిద్ధమయ్యారు. ఊసరవెల్లుల లాగ రంగు ఫిరాయించటానికి సిధపడ్డారు. వాళ్ళకు కావలసిందల్లా పార్టీలోనూ, కార్మిక వర్గంలోనూ ఎలాగైనా నిలిచి కార్మిక వర్గానికీ, పార్టీకీ హానిని కల్గించే అవకాశాన్ని పొందటమే.

ట్రాట్స్కీ, జినోవీవ్ వాదుల కూటమియొక్క "నాయకమణులు" రాజకీయ జూదగాండ్రని, రాజకీయ గోముఖ వ్యాఘ్రాలనీ ఋజువయ్యింది.

రాజకీయ వంచకులు తరచుగా మోసంతో ప్రారంభించి ప్రజలను, కార్మికవర్గాన్ని, కార్మికవర్గ పార్టీని మోసగించుట ద్వారా తమ దుష్కృత్యాలను నెరవేర్చుకోగల్గుతారు. కాని రాజకీయ వంచకులను ఉత్త దగాకోరులుగా మాత్రమే ఎంచ కూడదు. రాజకీయవంచకులు, నియమరహితులైన రాజకీయ పదవీ వ్యామోహాపరుల ముఠాయే. వీరు ప్రజల విశ్వాసాన్ని

ఎన్నడో కోల్పోయారు. మోసంద్వారా, ఊసరవెల్లిలా రంగులు ఫిరాయించుటద్వారా, దగాకోరుతనంద్వారా ఏదో ఒకరకంగా ప్రజల విశ్వాసాన్ని చూరగొనాలని ప్రయత్నిస్తారు. రాజకీయవ్యక్తులమనే పదవిని ఎలాగైనా నిలబెట్టుకోవాలని ప్రయత్నించుతారు. తమను బలపరచేవారిని ఎక్కడైనాసరే, చివరకు నేరస్థులలోనైనా సరే, సమాజంలో చెత్తలోనైనాసరే, ప్రజలకు ప్రచండ శత్రువులలోనైనాసరే దొరుకుతారేమోనని అన్వేషించుతారు. ఇలాంటి నియమ రహితులైన రాజకీయ పదవీవ్యామోహపరుల ముఠాయే రాజకీయవంచకులు. ఒక "శుభ"సమయాన రాజకీయ వేదిక నెక్కి ప్రజల "పరిపాలకులు"గా వారి వీపులపైన ఎగబ్రాకటానికి ఎట్టివారితోనైనాసరే వీరు కలుస్తారు.

ఈపై వర్ణించిన రాజకీయవంచకుల ముఠాకే ట్రాట్స్కీ, జినోవీవ్ వాదకూటమియొక్క "నాయకమణులు" చెందుతారు.

## 3

### కులక్‌లపైన దాడి-బుఖారిన్, రైకోవ్‌ల పార్టీ వ్యతిరేక ముఠా - ప్రథమ పంచవర్ష ప్రణాళికను ఆమోదించుట - సోషలిస్టు పోటీ - ప్రజా సమిష్టి వ్యవసాయ ఉద్యమ ప్రారంభం

పార్టీ విధానానికి, సోషలిస్టు నిర్మాణానికి, సమిష్టి వ్యవసాయానికి వ్యతిరేకంగా ట్రాట్స్కీ, జినోవీవ్‌వాద కూటమి

ఆందోళన సాగించింది. సమిష్టి వ్యవసాయక్షేత్రాలవల్ల వచ్చే ఫలితం ఏమీ వుండదనీ, వారంత వారే సోషలిజంలోకి "పరివర్తన" చెందుతారు కాబట్టి కులక్‌లను అలా వదలివేయాలనీ బుఖారిన్‌వాదులు ఆందోళన సాగించారు. పైగా పెట్టుబడిదారీవర్గం మరింత ధనవంతులవడంకూడా సోషలిజానికి ఏలాంటి అపాయకరమూ కాదనీ వారన్నారు. దేశంలోని పెట్టుబడిదారీ వ్యక్తులు, అందరికన్నా ముఖ్యంగా కులక్‌లు, ఈ ఆందోళనకు త్వరగా ఉత్సాహాన్ని ప్రకటించారు. పత్రికలలో పడే వ్యాఖ్యలనుబట్టి తాము ఒంటరివాళ్ళము కామనీ, తమను సమర్థించేవారూ, తమ తరఫున మధ్యవర్తిత్వం చేసే వారూ ట్రాట్స్కీ, జినోవీవ్, కామెనివ్, బుఖారిన్, రైకోవ్ మొదలగువారు వున్నారనీ, కులక్‌లు తెలుసుకొన్నారు. సోవియట్ ప్రభుత్వ విధానానికి వ్యతిరేకంగా కులక్‌ల ప్రతిఘటనా స్వభావాన్ని ఇది సహజంగానే మరింత గట్టిపరచింది. నిజానికి కులక్‌ల ప్రతిఘటన రోజురోజుకూ మరింత మొండిరూపం దాల్చింది. కుప్పలుతిప్పలుగా తాము నిల్వచేసిన అదనపు ధాన్యాలను సోవియట్ ప్రభుత్వానికి అమ్మడానికి ఒక్కుమ్మడిగా వారు తిరస్కరించారు. గ్రామసీమలోని ప్రభుత్వోద్యోగులపైన, పార్టీ వర్కర్లపైన, సమిష్టి వ్యవసాయంలోని రైతులపైన దౌర్జన్యచర్యలకు పూనుకొన్నారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను, ప్రభుత్వ ధాన్య గిడ్డంగులను తగలబెట్టారు.

కులక్‌ల ప్రతిఘటనను భగ్నంచేయనంతవరకూ, రైతాంగం ఎట్టఎదుట బహిరంగంగా పోరాటంలో కులక్‌లను ఓడించనంతవరకూ కార్మికవర్గమూ, రెడార్మీ ఆహార పదార్థాల కొరత

వల్ల బాధపడుతుంది. రైతులలో సమిష్టి వ్యవసాయ ఉద్యమం ప్రజా ఉద్యమంగా వృద్ధిపొందదు. ఈ విషయాలు పార్టీ గుర్తించింది.

15 వ కాంగ్రెస్ ఉత్తరువుల ననుసరించి కులక్‌లపైన నిశ్చితదాడిని పార్టీ సాగించింది. ఈ దాడి సాగించుటలో యీ క్రింది నినాదాన్ని అమలులో పెట్టింది. "బీదరైతాంగంపైన దృఢంగా ఆధారపడాలి. మధ్యతరగతి రైతుతో మైత్రిని బలపరచాలి. కులక్‌లకు వ్యతిరేకంగా నిశ్చితపోరాటాన్ని సాగించాలి." నిర్ణీతధరలకు ప్రభుత్వానికి తమ అధనపు ధాన్యాలను అమ్మటానికి నిరాకరించిన కులక్‌లకు వ్యతిరేకంగా అనేక అత్యవసర చర్యలను పార్టీ, ప్రభుత్వమూ తీసుకొన్నాయి. క్రిమినల్ కోడ్‌లోని 107 వ నిబంధన ననుసరించి కులక్‌లు అధిక లాభాపేక్షుపరులు తమ అదనపు ధాన్యాన్ని నిర్ణీతధరకు ప్రభుత్వానికి అమ్మనిపక్షంలో వారినుండి దానిని వశపర్చుకొనే హక్కు కోర్టుకు యిచ్చింది. బీదరైతులకు అనేక సౌకర్యాలను కలుగజేసింది. అందులో ఒకటి, కులక్‌లనుండి ప్రభుత్వం వశపర్చుకొన్న ధాన్యంలో నాల్గవవంతును బీదరైతులకు ఇచ్చుట.

ఈ అత్యవసర చర్యలవల్ల మంచిఫలితాలే కల్గాయి. బీదరైతులు, మధ్యతరగతిరైతులు కలసి కులక్‌లకు వ్యతిరేకంగా నిశ్చిత పోరాటాన్ని సాగించారు. కులక్‌లు వేరు చేయబడ్డారు. కులక్‌ల, అధికలాభాపేక్షుపరుల ప్రతిఘటన భగ్నంచేయబడింది. 1928 సంవత్సరాంతానికి సోవియట్ ప్రభుత్వం చేతిలో తగినంతధాన్యం నిల్వవుంది. సమిష్టివ్యవసాయ ఉద్యమం దృఢంగా అంగలువేస్తూ ముందుకు సాగింది.

అదే సంవత్సరం డొనెడ్జి బొగ్గుప్రాంతంలోని షాఖ్తి జిల్లాలో, పెట్టుబడిదారీ నిపుణులతో గూడిన విధ్వంసకులసంస్థ పెద్ద దొకటి ఉన్నట్లు బయటపడింది. పూర్వపుగనుల యజమానులతోను అనగా రష్యన్ పెట్టుబడిదారులతోను, విదేశ పెట్టుబడిదారులతోను, ఇంకా విదేశ సైనికగూఢచారి శాఖతోను షాఖ్తి విధ్వంసకులు సన్నిహిత సంబంధాలను కల్గియున్నారు. సోషలిస్టు పరిశ్రమాభివృద్ధిని విచ్ఛిన్నంచేసి సోవియట్ యూనియన్‌లో పెట్టుబడిదారీ విధానపు పునరుద్ధరణను సులభపరచడం వారి లక్ష్యం. ఈవిధ్వంసకులు బొగ్గు ఉత్పత్తిని తగ్గించటానికి గనుల్లో బుద్ధిపూర్వకంగా అవకతవక మేనేజిమెంటు చేశారు. యంత్రాలను, గాలి - వెల్తురు వచ్చే పరికరాలను చెడగొట్టారు. కప్పులు కూలిపోయేట్లు గనులు పేలిపోయేటట్లు చేశారు. గనులలో, కర్మాగారాలలో విద్యుచ్ఛక్తి స్టేషన్లకు నిప్పుపెట్టారు. విధ్వంసకులు బుద్ధిపూర్వకంగా కార్మికుల పరిస్థితుల అభివృద్ధిని ఆటంకపరచారు. సోవియట్ కార్మిక సంరక్షణ చట్టాలను ఉల్లంఘించారు.

విధ్వంసకులను విచారించి వారికి తగినశిక్షలను ప్రభుత్వం విధించింది.

షాఖ్తి కేసునుంచి అవసరమైన గుణపాఠాలను గ్రహించవలసిందని సెంట్రల్ కమిటీ అన్ని పార్టీసంస్థలను ఆజ్ఞాపించింది. ఉత్పత్తిసాంకేతికజ్ఞానం (టెక్నిక్)లో బోల్షివిక్ వర్తక నిర్వాహక వర్గాలు ప్రవీణులు కావాలని కామ్రేడ్ స్టాలిన్ ప్రకటించాడు. పాతపెట్టుబడిదారీ ప్రవీణులలోని విధ్వంసకుల చేతిల్లో సులభంగా మోసపోవటం ఇక ఏమాత్రమూ పనికిరాదన్నాడు.

కార్మికవర్గ అనుచరులనుండి వచ్చినవారికి నూతన సాంకేతిక విద్యలో తరిఫీదును హెచ్చించాలని కామ్రేడ్ స్టాలిన్ తెలియ జేశాడు.

సెంట్రల్ కమిటీ తీర్మానం ననుసరించి టెక్నికల్ కాలే జీలో ప్రవేశులైన యువకులకు తరిఫీదును హెచ్చించారు. వేల కొలది పార్టీ సభ్యులు, యువ కమ్యూనిస్టు సమితిసభ్యులు, పార్టీకి చెందకపోయినా కార్మికవర్గ ఆశయానికి కృషిచేసే యితరులు దీనిని అధ్యయనం చేయటానికి సమీకరించబడ్డారు.

కులక్‌లపైన దాడిని ఇంకా కొనసాగించక ముందు' ట్రాట్స్కీ, జినోవీవ్‌వాదుల కూటమిని రద్దుచేయటంలో పార్టీ నిమగ్నమై యున్నప్పుడు బుఖారిన్, రైకోవ్ ముఠా దాదాపు అణగిమణగివుంది. పార్టీ ప్రతికూల శక్తులకు రిజర్వుగా వుంటూ, ట్రాట్స్కీ వాదులను బహిరంగంగా సమర్థించే సాహసం లేకుండా వుండిపోయింది. ఒక్కొక్కసారి ట్రాట్స్కీ వాదులకు వ్యతిరేకంగా పార్టీతో కలసి పనిచేయటం ప్రారంభిం చింది. కాని పార్టీ కులక్‌లపై దాడి ప్రారంభించగానే, బుఖా రిన్, రైకోవ్ ముఠా తనముసుగు తోసివేసి పార్టీ విధానాన్ని బహిరంగంగా ఎదుర్కొన ప్రారంభించింది. బుఖారిన్, రైకోవ్ ముఠాయొక్క కులక్ ఆత్మ (మనస్తత్వం) వారిని బాగా ఆవ రించింది. వారు బహిరంగంగా కులక్‌లను సమర్థించారు. అత్యావ సర చర్యలను ఉపసంహరించుకోవాలనీ అలా చేయనిపక్షంలో వ్యవసాయం "శిథిలమవుతుందనీ", అప్పుడే యీ శిథిలతాక్రమం ప్రారంభమయిందని కూడా వాదించుతూ అమాయకులను భయపెట్ట సాగారు. వ్యవసాయ విధానంలో ఉన్నతరూపాలైన

సమిష్టి వ్యవసాయక్షేత్రాల, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల అభివృద్ధిని చూడకుండా కళ్లుమూసుకున్నారు. కులక్ల వ్యవసాయం పడిపోవటం చూసి, దానిని వ్యవసాయ శిథిలతగా వారు పేర్కొన్నారు. తమవాదనకు ఏదో ఒక రకపు సిద్ధాంత ప్రమాణం ఈయడానికిగాను వారు "వర్గ కలహం అణగారి పోయిందనే" అసంబద్ధ సిద్ధాంతాన్ని ఒకటి సృష్టించారు. ఈ సిద్ధాంతాన్ని బట్టి పెట్టుబడిదారీ వ్యక్తులపైన సోషలిజం విజయం పొందినకొలదీ వర్గకలహం తీవ్రస్వభావాన్ని కోల్పోతుందని వాదించారు. వర్గ కలహం త్వరలోనే పూర్తిగా అణగిపోతుందనీ, పోరాటం లేకుండానే వర్గశత్రువు తన స్థానాలను వదులుకొని లొంగుతాడనీ, కనుక కులక్లపైన దాడి అవసరం లేదనీ వాదించారు. కులక్లు సోషలిజంలోకి శాంతియుతంగా మారుతారని తుప్పుపట్టిన బూర్జువా సిద్ధాంతానికి ఈ విధంగా మెరుగుపెట్ట ప్రయత్నించారు. తన కాళ్ళకింద పునాదిని సోషలిస్టు అభివృద్ధి తెగగొట్టినకొలదీ మరింత తీవ్రమైన ప్రతిఘటనా రూపాలను వర్గశత్రువు అవలంబించుతాడనీ, వర్గశత్రువును నాశనంచేసిన తర్వాతనే వర్గకలహం "అణగి" పోతుందనీచెప్పే సుప్రసిద్ధమైన లెనినిస్టు ప్రతిపాదనను వీరు ఒక్కసారి నెట్టివేశారు.

బుఖారిన్ – రైకోవ్ ముఠా మితవాద అవకాశవాదుల ముఠాయని పార్టీ సులభంగానే గ్రహించింది. ఈ ముఠాకూ ట్రాట్స్కీ, జినోవీవ్ వాదుల కూటమికీ వున్న భేదమల్లా రూపంలోనే. ట్రాట్స్కీ, జినోవీవ్ వాద లొంగుబాటు దారులు "శాశ్వత విప్లవం" అనే అతివాద విప్లవకరమైన పెడబొబ్బలతో తమ స్వభావాన్ని కప్పిపుచ్చుకొనేందుకు కొంతఅవకాశ

ముంది. కాని కులక్‌లపై దాడిసాగించిన పార్టీని ఎదిర్చిన బుఖారిన్ - రైకోవ్ ముఠా తమ లొంగుబాటు స్వభావాన్ని కప్పిపుచ్చుకొనుట సాధ్యం కాలేదు. గ్రామసీమలోని విప్లవ ప్రతీఘాత శక్తులను, ముఖ్యంగా కులక్‌లను ఎట్టిముసుగుగాని, మారురూపంగాని లేకుండా బహిరంగంగా సమర్థించవలసి వచ్చింది. ఇదే యీ రెండుముఠాలకు ఉన్న భేదం.

ఇప్పుడో, మరి కొన్నాళ్ళకో పార్టీకి వ్యతిరేకంగా ఉమ్మడి పోరాటానికి ట్రాట్స్కీ - జినోవీవ్ వాదుల కూటమి అవశేషాలతో, బుఖారిన్ - రైకోవ్ ముఠా భుజం భుజం కలుపుతారని పార్టీ అర్థంచేసుకొంది.

ఒకప్రక్క రాజకీయప్రకటనలు చేస్తూ మరొకప్రక్క బుఖారిన్ - రైకోవ్ ముఠా తమ అనుచరులను సమీకరించి సంఘటితపరచటానికి "పనిచేసింది". బుఖారిన్‌ద్వారా స్లెప్కోవ్, మేరట్స్కీ, ఐషన్‌వాల్డ్, గోల్డెన్‌బర్గ్ మొదలగు బూర్జువా యువకవ్యక్తులను దగ్గరకుచేర్చారు. ట్రాట్స్కీద్వారా కార్మిక సంఘాలలోని ఉన్నత నిరంకుశోద్యోగులను (మెల్నిశాన్స్కీ, డోగడోవ్ మొదలగు వారు) రైకోవ్‌ద్వారా దిగజారి పోయిన ఉన్నత సోవియట్ ఉద్యోగులను (ఎ. స్మిర్నోవ్, ఈస్మాండ్, వి. షిమిట్ మొదలగువారు) కలిపి ఒక ముఠాను ఏర్పరిచారు. రాజకీయంగా దిగజారిపోయిన వ్యక్తులను, తమ లొంగుబాటు మనస్తత్వాలను రహస్యంగా లేకుండా బహిరంగపరచిన వ్యక్తులను ఈముఠా వెంటనే ఆకర్షించింది.

సుమారు ఈ కాలంలోనే బుఖారిన్ - రైకోవ్ ముఠా మాస్కో పార్టీసంస్థలో ఉన్నతస్థానాలలో వున్నవారి అండను

సంపాదించింది.(యుగ్లనోవ్, కోటూవ్, యుఖనోవ్, రియూటిన్, యగోడా, పాలొాస్కీ మొదలగువారు) కుడిపక్షం (రైట్సు) లోని ఒక భాగం పార్టీపోకడను బహిరంగంగా ఎదుర్కో కుండా దాగివుంది. కులక్‌లకు సౌకర్యాలు (కన్సెషన్స్) కలుగ జేయవలెనని, కులక్‌లపై భారమైన పన్ను విధించటం మంచిది కాదని, పారిశ్రామిక విధానం ప్రజలకు భారమైనదనీ, భారీ పరిశ్రమల అభివృద్ధి తొందరపాటనీ మాస్కోలోని పార్టీ పత్రికలలోను, పార్టీ మీటింగులలోను వీరు ప్రచారంచేశారు. యుగ్లనోవ్ నీపర్ హైడ్రో - ఎలెక్ట్రిక్ స్కీమును వ్యతిరే కించాడు. భారీ పరిశ్రమలకు ఖర్చుపెట్టే నిధులను చిన్న పరిశ్రమలకు ఖర్చుపెట్టాలని కోరాడు. మాస్కో బట్టల పరి శ్రమకు కేంద్రమనీ, ఇక ముందుకూడా అలాగే వుండాలనీ, మాస్కోలో ఇంజనీరింగ్ పరిశ్రమలను నిర్మించవలసిన అవసరం లేదనీ యుగ్లనోవ్ తదితర మితవాద లొంగుబాటుదారులు వాదించారు.

మాస్కో పార్టీసంస్థ యుగ్లనోవ్‌ను, అతని అనుచరు లను బయటపెట్టింది. వారిని ఆఖరిసారిగా హెచ్చరించింది. పార్టీ సెంట్రల్‌కమిటీ చుట్టూ ఇదివరకుకంటె మరింత సన్ని హితంగా మాస్కో-పార్టీసంస్థ నిలిచింది. సో. యూ. క. (బో) పార్టీయొక్క మాస్కో-కమిటీ సర్వసభ్య సమావేశం 1928 లో జరిగింది. అందులో మాట్లాడుతూ కామ్రేడ్ స్టాలిన్ రెండు రంగాలలో పోరాటం సాగించాలని అన్నాడు. ముఖ్యంగా మితవాద పెడమార్గంపై పోరాటం మరింత కేంద్రీకరించాలని అన్నాడు. మితవాదులు (Rights) పార్టీలోపల దాగియున్న కులక్ ఏజంట్లని అన్నాడు,

"పార్టీలోగనక మితవాదపెడమార్గం (రైట్‌డీవియేషన్) జయించినట్లయితే అది పెట్టుబడిదారీ శక్తులను విజృంభింప జేస్తుంది. శ్రామికవర్గ విప్లవస్థానాలను కూలదోస్తుంది. మన దేశంలో పెట్టుబడిదారీ విధాన పునరుద్ధరణకు అవకాశాలను హెచ్చుచేస్తుంది" అని కామ్రేడ్ స్టాలిన్ అన్నాడు (జె. స్టాలిన్ ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947, 233 పేజీ)

1929 ప్రారంభంలో మితవాద లొంగుబాటుదార్ల ముఠాఅనుమతిని బుఖారిన్, కామెనివ్ ద్వారా ట్రాట్స్కీ-వాదులతో సంబంధా లేర్పరచుకొంటున్నాడనీ, పార్టీకి వ్యతిరేకంగా సంయుక్త పోరాటం సాగించేందుకు ఒక ఒడంబడికకై సంప్రదింపులు సాగించుతున్నాడనీ తెలిసింది. మితవాద లొంగుబాటు దారుల నేరపూరితమైన యీ చర్యలను సెంట్రల్ కమిటీ బయట పెట్టింది. బుఖారిన్, రైకోవ్, టాంస్కీ తదితరులను యీ విషయం వారికి దుఃఖాంతంగా ముగియవచ్చునని హెచ్చరించింది. కాని యీ హెచ్చరికను మితవాద లొంగుబాటుదారులు వినిపించుకోలేదు. సెంట్రల్ కమిటీ మీటింగులో మరొక పార్టీ వ్యతిరేక నూతన వేదికను ఒక ప్రకటన రూపేణా బహిర్గతం చేశారు. దీనిని సెంట్రల్ కమిటీ ఖండించింది. ట్రాట్స్కీ, జినోవీవ్ వాదుల కూటమికి పట్టిన గతిని జ్ఞప్తికి తెస్తూ అది వారిని మరొకసారి హెచ్చరించింది. అయినప్పటికీ బుఖారిన్, రైకోవ్ ముఠా పార్టీ వ్యతిరేక చర్యలను కొనసాగిస్తూ వచ్చారు. రైకోవ్, టాంస్కీ, బుఖారిన్‌లు సెంట్రల్ కమిటీకి తమ రాజీనామాలను ఇచ్చారు. వారు ఆ విధంగా పార్టీని బెదిరించగలమని భావించారు. రాజీనా

మూల ద్వారా అవలంబించిన విధ్వంసక విధానాన్ని సెంట్రల్ కమిటీ ఖండించింది. 1929 నవంబరులో సమావేశమయిన సెంట్రల్ కమిటీ సర్వసభ్య సమావేశం (ప్లీనం) మితవాద లొంగుబాటుదారుల అభిప్రాయాల ప్రచారానికి, పార్టీ సభ్యత్వానికి పొసగదని ప్రకటించింది. మితవాద లొంగుబాటుదారులకు ప్రేరేపకుడు, నాయకుడు అయిన బుఖారిన్‌ను సెంట్రల్ కమిటీ పొలిటికల్ బ్యూరో నుండి (అధిష్టానవర్గము నుండి) తొలగించి వేయడానికి తీర్మానించింది. రైకోవ్, టాంస్కీ ఇతర మితవాద లొంగుబాటుదారులను కఠినంగా హెచ్చరించింది.

పరిస్థితులు తమకు దుఃఖాంతంగా మారినవని మితవాద లొంగుబాటుదారుల నాయకులు గ్రహించారు. తమ తప్పులను అంగీకరించుతూ పార్టీ రాజకీయ పోకడయే సరియైనదని చెబుతూ ఒక ప్రకటన చేశారు.

తమ అనుచరులు ఒక్కసారిగా చెల్లాచెదురు కాకుండా కాపాడుకోనేందుకుగాను, మితవాద లొంగుబాటుదార్లు తాత్కాలికంగా వెనకడుగు వేయటానికి నిశ్చయించుకొన్నారు.

మితవాద లొంగుబాటుదారులకు వ్యతిరేకంగా పార్టీ సాగించిన పోరాట ప్రథమదశ ఇంతటితో ముగిసింది.

పార్టీలో కొత్తగా తలయెత్తిన ఈ భేదాభిప్రాయాలు సోవియట్ యూనియన్ యొక్క బాహ్యశత్రువుల దృష్టిని పడకుండా తప్పించుకుపోలేదు. పార్టీలోని "నూతన విభేదాలు" బలహీనతకు చిహ్నమని భావించి యుద్ధంలో సోవియట్

యూనియన్‌ను దింపాలని వారు మరొక ప్రయత్నం చేశారు. అలా దింపుటద్వారా పారిశ్రామిక విధాన కార్యకలాపం సరియైన మార్గానికి రాకముందే దానిని నాశనంచేయాలని సామ్రాజ్యవాదులు ప్రయత్నించారు. 1929 వేసవిలో చైనాకు సోవియట్ యూనియన్‌కు మధ్య ఒక తగాదాను రెచ్చ గొట్టారు. చైనా ఈస్టరన్ రైల్వేను (ఇది సోవియట్ యూని యన్‌కు చెందియుంది) చైనా మిలటరీ నాయకులు ఆక్రమించు కొనేటట్లూ, మనదేశ దూరప్రాచ్య సరిహద్దుపై చైనా తెల్ల సైన్యాలు (విప్లవ ప్రతీఘాతక సైన్యాలు) దాడి చేసేటట్లు సామ్రాజ్యవాదులు రెచ్చగొట్టారు. కాని చైనా మిలటరీ నాయకుల దాడిని వెంటనే సోవియట్ ప్రభుత్వం అణచివేసింది. రెడ్ఆర్మీచే పారద్రోలబడిన సైనికనాయకులు తిరోగమించారు. మంచూరియా అధికారులతో ఒడంబడిక చేసుకొనుటతో ఈ తగాదా అంతమైంది. బయట శత్రువులు ఎన్ని కుట్రలు చేసినప్పటికీ పార్టీలోపల "విభేదాలు" వచ్చినప్పటికీ, ఈ ఆటం కాలన్నిటినీ అధిగమించుతూ మరొకసారి సోవియట్ యూని యన్ శాంతి విధానం జయించింది.

బ్రిటిష్ కన్సర్వేటివులు తెగతెంచివేసిన దౌత్య వర్తక సంబంధాలు ఇది జరిగిన కొద్దికాలానికే తిరిగి బ్రిటన్, సోవి యట్ యూనియన్‌ల మధ్య నెలకొల్పబడ్డాయి.

ఇంటా, బయటా శత్రువుల దాడులను జయప్రదంగా తిరగగొట్టుతూ భారీ పరిశ్రమలను అభివృద్ధిచేయుటలోను, సోషలిస్టు పోటీని ఏర్పరచుటలోను ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను నిర్మించుటలోను

పార్టీ చురుకుగా నిమగ్నమైంది. ఇంతేగాక జాతీయ ఆర్థిక సంపదను అభివృద్ధి చేసేందుకై పంచవర్ష ప్రణాళికను ఆమోదించి అమలుపరచేందుకు పునాదిని ఏర్పరచటంలో పార్టీ నిమగ్నమైంది.

1929 ఏప్రిల్‌లో పార్టీ 16 వ సమావేశాన్ని (కాన్ఫరెన్సును) జరిపింది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక దాని ఎజెండాలో ముఖ్య విషయం. మితవాద లొంగుబాటుదారులు పంచవర్ష ప్రణాళికకు 'అతి కనీస సవరణల'తో (Minimal Variant) ఒక పథకాన్ని సూచించారు. దీనిని సమావేశం తిరస్కరించింది. ఏ పరిస్థితులలోనైనా సరే పంచవర్ష ప్రణాళిక యొక్క అత్యున్నత రూపాన్ని (Optimal Variant) తప్పనిసరిగా అంగీకరించాలని సమావేశం తీర్మానించింది. ఆవిధంగా సోషలిస్టు నిర్మాణానికై ప్రఖ్యాతమైన పంచవర్ష ప్రణాళికను పార్టీ అంగీకరించింది.

1928-33 సంవత్సరాల మధ్య జాతీయ ఆర్థిక విధానంలో 6460 కోట్ల రూబుల్సును యంత్ర నిర్మాణ పరిశ్రమలలో పెట్టుబడి పెట్టింది. ఇందులో 1950 కోట్ల రూబుల్సు పారిశ్రామిక అభివృద్ధికి, విద్యుచ్ఛక్తి అభివృద్ధికి కేటాయించబడ్డాయి. రవాణా అభివృద్ధికి 1000 కోట్ల రూబుల్సు, వ్యవసాయానికి 2320 కోట్లు కేటాయించబడ్డాయి.

సోవియట్ యూనియన్ యొక్క వ్యవసాయానికి పరిశ్రమకు ఆధునిక టెక్నిక్ సమకూర్చటానికి యిది అతి విస్తృతమైన ప్రణాళిక.

"యావత్తు పరిశ్రమలనేగాక రవాణాను, వ్యవసాయాన్ని గూడ సోషలిజంయొక్క ప్రాతిపదికపైన పునర్నిర్మించేటటు వంటీ, వాటికి తిరిగి అవసరమయ్యే సామగ్రిని సమకూర్చేటటు వంటీ పరిశ్రమను మనదేశంలో నిర్మించటమే పంచవర్ష ప్రణాళికయొక్క ప్రధాన కర్తవ్యం." అని కామ్రేడ్ స్టాలిన్ అన్నాడు. (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947, 397 వ పేజి)

ఈ ప్రణాళిక బహు విస్తారమైనదైనప్పటికీ, బోల్షివిక్కులకు ఆశ్చర్యమూ కల్గించలేదు, దిగ్భ్రమా గల్గించలేదు. సమిష్టి వ్యవసాయ, పారిశ్రామిక విధానాల అభివృద్ధి క్రమమంతా ఇందుకు మార్గాన్ని సుగమం చేసింది. కార్మికులు, రైతులు, పనిలో ఉత్సాహావేశపరులై ముందు కొచ్చారు. సోషలిస్టు పోటీ రూపాన యీ ఉత్సాహం వ్యక్తమయింది.

సోషలిస్టు పోటీని మరింత పెంపొందించ వలసిందిగా కోరుతూ పార్టీ 16వ సమావేశం శ్రమజీవులందరికీ విజ్ఞప్తి చేసింది.

కృషిపట్ల నూతన వైఖరినీ, కృషి విధానంలో అనుసరించదగిన అనేక ఆదర్శ పద్ధతులనూ సోషలిస్టు పోటీ ఉత్పత్తి చేసింది. అనేక ఫ్యాక్టరీలలో, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలో ప్రభుత్వ ప్రణాళికల అంచనాను మించిపోయే ఉత్పత్తిని తయారుచేయుటకు వేరే తమ ప్రణాళికలను కార్మికులు, సమిష్టి వ్యవసాయదారులు తయారు చేశారు. పనిలో వారు శౌర్యాన్ని ప్రదర్శించారు. ప్రభుత్వమూ, పార్టీ నిర్ణయించిన సోషలిస్టు అభివృద్ధి ప్రణాళికను

పూర్తి చేయడమే గాక మించిపోయారు కూడ. పనిపట్ల వైఖరి మారింది. పెట్టుబడిదారీ విధానంలో పని యిచ్ఛాపూర్వకంగా వుండేదికాదు. నిర్బంధంగా శిక్షించి పనిచేయించుకొనేవారు. అట్టి పరిస్థితి నుండి యిప్పుడు పనిచేయటం "గౌరవంగా, గర్వింపదగినదిగా, వీరోచితమైనదిగా, శౌర్యవంతమైనదిగా" మారింది. (స్టాలిన్)

నూతన పారిశ్రామిక నిర్మాణం బ్రహ్మాండమైన స్థాయిలో దేశమంతటా అభివృద్ధిచెంద సాగింది. నీపర్ హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రణాళిక జోరుగా సాగుతూంది... క్రామటార్స్క్ - గోర్లోవ్కా ఇనుము, ఉక్కు-పరిశ్రమలు, లుగాన్స్క్‌లో లోకో మోటివ్ (ఇంజను) పరిశ్రమల పునర్నిర్మాణం డానెడ్జ్ బేసిన్‌లో ప్రారంభమయ్యాయి. కొత్తబొగ్గుగనులు, బ్లాస్టు ఫర్నేసులు (లోహాలను కరిగించే కొలుములు) నెలకొల్పబడినాయి. యురల్సు మెషిన్ బిల్డింగువర్క్స (యంత్రనిర్మాణ పరిశ్రమ), బెరిజ్నికి, సోలికామ్స్క్‌లలో (యురల్సు) రసాయన పరిశ్రమల నిర్మాణం ప్రారంభమయింది. మాగ్నిటోగార్స్క్‌లో ఇనుము ఉక్కు-మిల్లుల నిర్మాణం ప్రారంభమైంది. మాస్కోలోను, గోర్కీలోను పెద్దపెద్దఆటోమొబైల్ కర్మాగారాలు (మోటారు పరిశ్రమలు) నిర్మింపబడుతున్నాయి. డాన్ నదీ తీరంలోనిరోస్టావ్ నగరంలో పెద్దపెద్ద ట్రాక్టర్ కర్మాగారాలు, కోతకోసే యంత్రాలకర్మాగారాలు, వ్యవసాయక యంత్రకర్మాగారాలు నిర్మింపబడుతూ వున్నాయి. కుజెనెట్స్క్ బొగ్గుగనులు విస్తరింపబడుతున్నాయి. సోవియట్ యూనియన్‌లో ఇది రెండవ బొగ్గు కేంద్రం. స్టాలిన్‌గ్రాడ్ సమీపంలోని మైదానంలో పెద్ద ట్రాక్టరు పరిశ్రమ 11 నెలలలోపలనే తలఎత్తింది. నీపర్

హైడ్రో - ఎలెక్ట్రిక్ స్టేషనూ, స్టాలిన్‌గ్రాడ్ ట్రాక్టరు పరిశ్రమలను నిర్మించుటలో కార్మికులు శ్రామిక ఉత్పాదకశక్తిలో ప్రపంచరికార్డులనే మించిపోయారు.

అంతటి బ్రహ్మాండమైన స్థాయిలో పారిశ్రామిక నిర్మాణంగాని నూతనాభివృద్ధికి అంతటి ఉత్సాహంగాని లక్షలాది కార్మికప్రజలు పనిలో వీరత్వాన్ని ప్రదర్శించటంగాని చరిత్ర ఇదివరకెన్నడూ ఎరగదు.

వాస్తవానికి, సోషలిస్టు పోటీవలన జనించి ఉద్వేగపరచబడిన శ్రామికోత్సాహా వెల్లువఅది.

ఈసారి రైతులు కార్మికులకు వెనుకబడలేదు. గ్రామాలలో తమ సమిష్టి వ్యవసాయక్షేత్రాలు నిర్మించుకొంటున్న రైతాంగ ప్రజలలో కార్యోత్సాహం వ్యాపించింది. రైతాంగ ప్రజలు సమిష్టివ్యవసాయం వైపుకు నిశ్చితంగా మొగ్గసాగారు. ఈ విషయంలో ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు, మెషిన్, ట్రాక్టరు స్టేషన్లు గొప్పపాత్రను నిర్వహించాయి. రైతులు గుంపులు గుంపులుగా ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలకు, మెషిన్ - ట్రాక్టర స్టేషన్లకూ వచ్చేవారు. ట్రాక్టర్లు, ఇతర వ్యవసాయ యంత్రాలు పనిచేయటం గమనించేవారు. అవి పనిచేసే విధానాన్ని ప్రశంసించి అప్పటి కప్పుడే అక్కడికక్కడే "మనంకూడ సమిష్టివ్యవసాయంలో చేరదాం" అని నిశ్చయించుకొనేవారు. వ్యవసాయ విషయంలో వారికి ఐక్యతలేదు. ప్రతివాడు కొద్దిపాటి తన చిన్న భూఖండాన్ని వ్యక్తిగతంగా సాగుచేస్తాడు. అతనికి మంచి వ్యవసాయ సాధనాలుగాని, నాగళ్ళుగాని లేవు. పెద్ద ఖండాలయిన బీళ్లను

బ్రద్దలుచేయటానికి అతనికి మార్గంలేదు. తమ భూఖండాలు అభివృద్ధి అయ్యే భవిష్యత్తు సూచనలేదు. దారిద్ర్యంచే పీడింపబడి, ఒంటరిగాళ్ళై వారిగతికి వారు వదలివేయబడ్డారు. ఇలాంటి స్థితిలో ఉన్న రైతులు తమ జీవితం బాగుపడటానికి ఒక మంచి మార్గాన్ని కనుగొన్నారు. తమ చిన్న ఖండాలను సహకార భూములుగా, సమిష్టి వ్యవసాయక్షేత్రాలుగా కలిపివేయుటమే ఆమార్గం. ఎట్టి బీడుభూమినైనాసరే, "కఠినమైనభూమి"నైనా సరే బద్దలుచేయగల ట్రాక్టర్లు లభించాయి. యంత్రాలు, డబ్బు, మనుష్యులు, సలహా వీటన్నిటి రూపంలోనూ ప్రభుత్వం సహాయం చేయసాగింది. సోవియట్ ప్రభుత్వంచే యిటీవలనే ఓడింపబడి కులక్‌లు పదవీభ్రష్టులయ్యారు. వారి బానిసత్వం తొలగిపోయింది. లక్షలాది రైతులకు ఇది ఆనందదాయకమైంది. ఇలాంటి మంచి జీవితానికి మార్గాన్ని రైతులు గనుగొన్నారు.

ఈ ప్రాతిపదికపైన సమిష్టి వ్యవసాయోద్యమం ప్రారంభమై, ఆతర్వాత ముఖ్యంగా 1929 అంతంలో త్వరితంగా వృద్ధిచెందింది. ఇదివరకెన్నడూలేని వేగంతో సోషలిస్టు పరిశ్రమ సహితం సమిష్టి వ్యవసాయోద్యమం అభివృద్ధి చెందింది.

1928 లో సమిష్టి వ్యవసాయక్షేత్రాల మొత్తం పంట ప్రదేశం 13 లక్షల, 90 వేల హెక్టార్లు (హెక్టారంటే 2 ఎకరాల 47 సెంట్లు). 1930 లో సాగుబడి కిందకు తీసుకరాదలచిన సమిష్టి వ్యవసాయక్షేత్రాల వైశాల్యం 1½ కోట్ల హెక్టార్లు.

సమిష్టి వ్యవసాయక్షేత్రాల అభివృద్ధి గమనాన్ని గురించి "గొప్పమార్పు తెచ్చిన సంవత్సరం" (1929) అనే శీర్షిక క్రింద కామ్రేడ్ స్టాలిన్ ఒక వ్యాసం వ్రాశాడు. "సాధారణంగా ప్రజాపరం గావించబడిన మన పెద్దపెద్ద పరిశ్రమలే మహత్తర వేగంతో అభివృద్ధిచెందటానికి పేరుపడ్డాయి. కాని యీసంవత్సరంలో జరిగిన అభివృద్ధి వేగపు ఉరవడికి సాటి ఇదివరకెన్నడూ మన సోషలిస్టు పరిశ్రమలలో గూడా లేదు."

ఇది సమిష్టి వ్యవసాయ ఉద్యమ అభివృద్ధిలో ఒక మైలురాయి.

ఇది ప్రజా బాహుళ్య సమిష్టి వ్యవసాయ ఉద్యమానికి ప్రారంభం.

"గొప్ప మార్పుతెచ్చిన సంవత్సరం" అనే తన వ్యాసంలో "ప్రస్తుత సమిష్టి వ్యవసాయ ఉద్యమంయొక్క నూతన రూపం ఏమిటి?" అని ప్రశ్నించి కామ్రేడ్ స్టాలిన్ ఈ విధంగా జవాబిచ్చాడు:

"ప్రస్తుత సమిష్టి వ్యవసాయ ఉద్యమంలోని నూతన నిశ్చితరూపం ఏమంటే, పూర్వంవలె విడివిడి ముఠాలుగా రైతులు సమిష్టిక్షేత్రాలలో చేరటంలేదు. గ్రామాలకు గ్రామాలు, తాలూకాలను తాలూకాలు(Volosts), జిల్లాలను జిల్లాలు, ఒక్కొక్కసారి ప్రదేశాలకు ప్రదేశాలు సమిష్టి వ్యవసాయంలో చేర ప్రారంభించాయి. దీని కర్థం ఏమిటి? మధ్యతరగతి రైతు సమిష్టి వ్యవసాయ ఉద్యమంలో చేరడమన్నమాట. సోవియట్ ప్రభుత్వం అత్యంత ప్రధానంగా సాధించిన వ్యవసాయాభివృద్ధిలో తీవ్రమైన మార్పుకు ఇదీ ప్రాతిపదిక..."

దృఢమైన సమిష్టి వ్యవసాయపద్ధతి పునాదితో కులక్‌లను ఒక వర్గంగాలేకుండా తొలగించటానికి సమయం పరిపక్వమవుతున్నదని లేదా ఇదివరకే పరిపక్వమయిందని దీని అర్థం.

## క్లుప్తసారాంశం

**1926 – 29** మధ్యకాలంలో సోషలిస్టు పారిశ్రామికం చేసే పోరాటంలో, దేశీయ విదేశీయ రంగాలలోవచ్చిన అనేక కష్టాలను ఎదుర్కొని పార్టీ జయించింది. సోషలిస్టు పారిశ్రామిక విధానం పార్టీయొక్క, కార్మికవర్గం యొక్క ప్రయత్నాలవల్ల విజయం పొందాయి.

ముఖ్యంగా పారిశ్రామిక విధానంలోని అత్యంత కష్ట సమస్యలలో ఒకటి పరిష్కరించబడింది. ఇది భారీపరిశ్రమలను నిర్మించటానికి అవసరమైన ధనసేకరణ. జాతీయ ఆర్థిక సంపదనంతను తిరిగి పోషించ (Re-equip) సామర్థ్యం గల భారీపరిశ్రమలకు పునాదులు వేయబడ్డాయి.

సోషలిస్టు నిర్మాణానికై ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఆమోదించబడింది. కొత్తఫ్యాక్టరీలను, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను, సమిష్టి వ్యవసాయక్షేత్రాలను బహు విస్తారంగా నిర్మించటం అభివృద్ధి చెందింది.

సోషలిజంవైపుకు ఇలా పురోగమించటం దేశంలో వర్గ కలహాన్ని తీవ్రతరం చేసింది. పార్టీలోపల ఆంతరంగిక పోరాటాన్ని కూడా తీవ్రతరం చేసింది. ఈ పోరాటంవలన ముఖ్య ఫలితాలివి: కులక్‌ల ప్రతిఘటన అణచ వేయబడింది. ట్రాట్స్కీ, జినోవీవ్ లొంగుబాటు దారులకూటమి సోవియట్ వ్యతిరేక

కూటమిగా బట్టబయలయింది. మితవాద లొంగుబాటుదారులు కులక్ల ఏజంట్లుగా బట్టబయలయ్యారు. ట్రాట్స్కీ-వాదులను పార్టీనుండి వెళ్ళగొట్టారు. ట్రాట్స్కీ-వాదుల, మితవాద అవకాశ వాదుల భావాలకు, సో. యూ. క. (బో) పార్టీ సభ్యత్వానికి పొసగదని స్పష్టీకరించబడింది.

బోల్షివిక్ పార్టీచే సిద్ధాంతరీత్యా ఓడింపబడి కార్మిక వర్గంలో అండనంతా పోగొట్టుకొని ట్రాట్స్కీ-వాదులు ఒక రాజకీయ ధోరణికి చెందియుండుట అనేది మానివేశారు. నీతి నియమంలేని పదవీవ్యామోహపరుల, రాజకీయ జూదగాండ్ర గూడుపుఠాని ముఠాగా, రాజకీయ వంచకుల ముఠాగా ట్రాట్స్కీ-వాదులు తయారయ్యారు.

భారీ పరిశ్రమకు పునాదులను వేసింది. సోవియట్ యూనియన్ యొక్క సోషలిస్టు పునర్నిర్మాణానికై తయారు చేయబడిన ప్రథమ పంచవర్ష ప్రణాళికను పూర్తిచేయటానికి కార్మికవర్గాన్ని, రైతాంగాన్ని పార్టీ సమీకరించింది. లక్షలాది శ్రమజీవులలో దేశమంతటా సోషలిస్టుపోటీ అభివృద్ధి చెందింది. దీనివలన ప్రబల కార్యోత్సాహం వెల్లివిరిసింది. నూతన శ్రామిక క్రమశిక్షణ ఉద్భవించింది.

పరిశ్రమలలో సోషలిస్టు విజయ పరంపరలు లభించాయి. వ్యవసాయంలో ప్రముఖ ప్రారంభవిజయాలు లభించాయి. సమిష్టి వ్యవసాయక్షేత్రాలవైపుకు మధ్యతరగతి రైతు మొగ్గాడు. ప్రజాబాహుళ్య సమిష్టి వ్యవసాయ ఉద్యమం ప్రారంభమైంది. ఇలాంటి గొప్పమార్పులతో ఈకాలం అంతమయింది.

# పదకొండో అధ్యాయం

## సమిష్టి వ్యవసాయ నిర్మాణానికై సాగించిన పోరాటంలో బోల్షివిక్ పార్టీ

[1930—34]

## 1930 – 34 లో అంతర్జాతీయ పరిస్థితి – పెట్టుబడిదారీ దేశాలలో ఆర్థిక సంక్షోభం – మంచూరియాపై జపాను దురాక్రమణ – జర్మనీలో ఫాసిస్టులు అధికారానికి వచ్చుట – రెండు యుద్ధబీజాలు

**సోవియట్** యూనియన్‌లో సోషలిస్టు పారిశ్రామిక విధానంలో ముఖ్యమైన అభివృద్ధి ఒకప్రక్క జరుగుతూంది. పరిశ్రమల అభివృద్ధి త్వరితంగా జరుగుతూవుంది. మరొకప్రక్క పెట్టుబడిదారీ దేశాలలో ఇదివరకు ఎన్నడూ కనివిని యెరుగని విధంగా 1929 సంవత్సరాంతంలో సర్వనాశనకారియైన ప్రపంచ ఆర్థిక సంక్షోభం తలయెత్తింది. తరవాత మూడేండ్లలో అది మరింత తీవ్రరూపం దాల్చింది. పారిశ్రామిక సంక్షోభం వ్యవసాయక సంక్షోభంతో పెనవేసుకొని యుండటంవల్ల, పెట్టుబడిదారీ దేశాల పరిస్థితులు మరింత అధ్వాన్నమయాయి.

ఆర్థిక సంక్షోభ కాలంలోని మూడేండ్లలోను 1929తో పోల్చిచూస్తే (1930–33) అమెరికాలోని పారిశ్రామిక ఉత్పత్తి నూటికి అరవైఅయిదుపాళ్ళకు పడిపోయింది. గ్రేట్‌బ్రిటన్‌లో నూటికి ఎనభైఆరుపాళ్ళకు, జర్మనీలో నూటికి అరవైఆరు

పాళ్లను, ఫ్రాన్సులో నూటికి డెబ్బైయేడుపాళ్ళను పడిపోయింది. కాని ఇదేకాలంలో సోవియట్ యూనియన్‌లోని పారిశ్రామిక ఉత్పత్తి రెండురెట్లకంటే పైగా పెరిగింది. 1929 తో పోల్చి చూస్తే 1933 లో 100 కి 201 పాళ్ళకు పెరిగింది.

పెట్టుబడిదారీ ఆర్థికవిధానంకంటె సోషలిస్టు ఆర్థిక విధానమే గొప్పదని తెలియజేయటానికి ఇది మరొక నిదర్శనం. ఆర్థికసంక్షోభం అంటే ఏమిటో ఎరగనిదేశం ప్రపంచంలో ఒక్క సోషలిస్టుదేశమేనని ఇది తెలియజేసింది.

ప్రపంచ ఆర్థికసంక్షోభం రెండుకోట్ల 40 లక్షలమందిని నిరుద్యోగానికి గురిచేసి. ఆకలి, దారిద్ర్యం, దుఃఖాలతో బాధపడేటట్లు చేసింది. వ్యవసాయసంక్షోభం కోట్లకొలది రైతులకు కష్టాలను తెచ్చిపెట్టింది.

ప్రపంచ ఆర్థికసంక్షోభం సామ్రాజ్యవాద దేశాల మధ్య వైరుధ్యాలను హెచ్చించింది. జయించిన దేశాలకు పరాభూతమైన దేశాలకుమధ్య, సామ్రాజ్య దేశాలకు వలస పరాధీనదేశాలకు మధ్య, కార్మికులకు పెట్టుబడిదారులకు మధ్య, రైతులకు భూస్వాములకు మధ్య వైరుధ్యాలను అది తీవ్రతరంచేసింది.

పార్టీ 16 వ కాంగ్రెస్‌లో సెంట్రల్‌కమిటీ తరఫున కామ్రేడ్ స్టాలిన్ రిపోర్టునిచ్చాడు. అందులో, ఆర్థికసంక్షోభం నుండి బయటపడటానికి పెట్టుబడిదారీవర్గం వెదికే మార్గాన్ని గురించి ఇలా చెప్పాడు: ఒకప్రక్క అత్యంత అభివృద్ధినిరోధకమైన, జాతీయ దురహంకారపూరితమైన సామ్రాజ్యవాద పెట్టుబడిదారీశక్తులతో కూడిన ఫాసిస్టు నియంతృత్వాన్ని

ఏర్పరచుటద్వారా కార్మికవర్గాన్ని అణచిపారవేయ ప్రయత్నిస్తారు. మరొకప్రక్క ఆత్మరక్షణ చేసుకోలేని బలహీన దేశాలను నష్టపరచి వలసదేశాలను, కీలక ప్రదేశాలను (Spheres of Influence) తిరిగి పంచుకోవటానికి యుద్ధాన్ని ప్రేరేపించుతారు.

సరిగ్గా అదే జరిగింది.

1932 లో జపాన్ యుద్ధప్రమాదాన్ని తీవ్రతరం చేసింది. ఆర్థికసంక్షోభం మూలంగా యూరోపియన్ దేశాలూ అమెరికా, తమ తమ ఆంతరంగిక సమస్యలలో పూర్తిగా నిమగ్నమవటం జూచింది. ఈ అవకాశాన్ని తీసుకొని జపాను సామ్రాజ్యవాదులు బలహీనమైన రక్షణలుగలిగిన చైనాపై ఒత్తిడితే నిశ్చయించారు. చైనాను పాదాక్రాంతం చేసుకొని దానిని ఏలాలని ప్రయత్నించారు. తామే రెచ్చగొట్టిన "స్థానిక ఘటనలను" నీతినియమరహితంగా ఉపయోగించుకొని, జపాను సామ్రాజ్యవాదులు, బందిపోటు దోపిడిగాండ్రవలె చైనాపై యుద్ధం ప్రకటించకుండానే మంచూరియాలోకి తమ సైన్యాలను నడిపారు. జపానుసైనికులు మంచూరియానంతా కైవశం చేసుకొన్నారు. ఉత్తరచైనాను జయించటానికి సోవియట్‌పై దాడి చేయటానికి అనువైన సైనికప్రదేశాన్ని ఆవిధంగా ఏర్పరచుకోసాగారు. తన ఇష్టంవచ్చినట్లు ప్రవర్తించడానికి, నానా జాతిసమితి నుండి (League of Nations) జపాను తొలగిపోయింది. అమితవేగంగా ఆయుధబలాన్ని పెంపొందించసాగింది.

ఇందువల్ల అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు దూర ప్రాచ్యంలో తమ నావికాబలాలను బలపరచుకోవలసివచ్చింది.

చైనాను ఓడించాలనీ, ఆదేశంనుంచి యూరోపియన్ అమెరికన్ సామ్రాజ్యవాదులను తరిమివేయాలనీ జపాను ప్రయత్నించు చున్నదని స్పష్టమయింది. అందుచే ఆదేశాలు దీనికి జవాబుగా తమ ఆయుధబలాలను వృద్ధిచేయసాగాయి.

జపాను మరొకప్రక్క సోవియట్ తూర్పుభాగాన్ని ఆక్రమించాలనే ప్రయత్నాన్నికూడా చేస్తూంది. ఈ ప్రమాదాన్ని చూడకుండా సోవియట్‌యూనియన్ కళ్ళు మూసుకోలేదు. సహజంగానే తన దూరప్రాచ్య దేశరక్షణలను తీవ్రంగా బలపరచ పూనుకొంది.

ఆవిధంగా జపాను ఫాసిస్టుసామ్రాజ్యవాదుల పుణ్యమా అంటూ దూరప్రాచ్యంలో మొదటి యుద్ధబీజం ఏర్పడింది.

ఒక్క దూరప్రాచ్యంలోనేగాక యూరప్‌లోకూడా పెట్టుబడిదారీ విధాన వైరుధ్యాలను ఆర్థిక సంక్షోభం తీవ్రతరం చేసింది. పరిశ్రమలలోను, వ్యవసాయంలోను దీర్ఘకాల సంక్షోభం ప్రారంభమయింది. నిరుద్యోగ సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. బీదతరగతి ప్రజలకు 'రోజు రోజు అస్థిరత్వం హెచ్చింది. కార్మికులలోనూ రైతులలోనూ అసంతృప్తి వ్యాపించింది. కార్మికవర్గంలో అసంతృప్తి విప్లవ ద్వేషంగా మారింది. యుద్ధంవల్లనూ విజేతలైన, ఆంగ్లో - ఫ్రెంచి దేశాలకు యుద్ధ నష్టపరిహారాలను చెల్లించుటవల్లనూ, ఆర్థిక సంక్షోభంవల్లనూ ఆర్థికంగా పూర్తిగా డస్సిపోయిన జర్మనీ విషయంలో ఇది ముఖ్యంగా సంభవించింది. జర్మనీ కార్మిక వర్గం అటు బ్రిటిష్, ఫ్రెంచి విదేశ పెట్టుబడిదారుల కిందనూ, స్వదేశ పెట్టుబడిదారులకిందనూ రెండువిధాల నలిగిపోయింది.

ఫాసిస్టులు అధికారానికి రాకముందు రీచ్‌స్టాగ్ ఎన్నికలు జరిగాయి. ఇందులో జర్మనీ కమ్యూనిస్టుపార్టీకి అరవైలక్షల వోట్లు వచ్చాయి. దీనిద్వారా ఈ అసంతృప్తి ఎంతవరకు వ్యాపించిందో స్పష్టంగా ప్రదర్శితమైంది. జర్మనీలో ఇంకా మిగిలివున్న బూర్జువా ప్రజాతంత్ర హక్కులు తమకు నష్టదాయకంగా పరిణమించవచ్చుననీ, ఈ హక్కులను విప్లవోద్యమాన్ని విస్తృతం చేయటానికి కార్మికవర్గం ఉపయోగించుకోవచ్చుననీ, జర్మన్ పెట్టుబడిదారీవర్గం గ్రహించింది. అందుచేత జర్మనీలో పెట్టుబడిదారీ అధికారాన్ని నిలబెట్టుకోడానికి ఒకే మార్గమున్నదని వారునిశ్చయించారు. అది బూర్జువా పౌరహక్కులను రద్దుచేయుట, రీచ్‌స్టాగ్‌ను (శాసనసభ) ఒక బండిసున్నాగా మార్చుట, హింసాపూరితమైన బూర్జువా జాతీయ నియంతృత్వాన్ని స్థాపించుట. ఈ నియంతృత్వం కార్మికవర్గాన్ని అణచివేయగలేదిగాను, గత యుద్ధంలో జర్మనీ ఓటమికి తిరిగి పగతీర్చుకోవాలనే మధ్యతరగతి ప్రజలపై ఆధారపడేదిగానుండాలి. అందుచేత వారు ఫాసిస్టుపార్టీని అధికారం వహించటానికి ఆహ్వానించారు. ఈ పార్టీ ప్రజలను మోసగించటానికి "నేషనల్ సోషలిస్టుపార్టీ" అని పేరు పెట్టుకొంది. అత్యంత అభివృద్ధినిరోధకమైనట్టియు, కార్మికవర్గానికి అత్యంత శత్రువైనట్టియూ సామ్రాజ్యవాద పెట్టుబడిదారీవర్గ భాగానికి ఈఫాసిస్టు పార్టీ ప్రాతినిధ్యం వహించుతుంది. రెండవది జాతీయతత్వంతో కూడిన ఈ పార్టీ లక్షలాది మధ్యతరగతి ప్రజలను పెడత్రోవను పట్టించ సామర్థ్యం కలది. ప్రతీకారం తీర్చుకోవాలని (తమను జయించినవారిపై – అనువాదకుడు) శపథం పట్టినది. ఈ విషయంలో కార్మికవర్గ ద్రోహులైన జర్మన్ సోషల్ డెమాక్రటిక్

పార్టీ నాయకులు వారికి సహాయపడ్డారు. రాజీ విధానంద్వారా వారు ఫాసిజానికి మార్గాన్ని సుగమం చేశారు.

1933 లో జర్మన్ ఫాసిస్టులను అధికారానికి తీసుకొని వచ్చిన పరిస్థితు లివి.

జర్మనీలోని ఘటనలను విశదీకరించుతూ పార్టీ 17 వ కాంగ్రెస్‌లో తన రిపోర్టులో కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"జర్మనీలో ఫాసిస్టు విజయం కార్మికవర్గ బలహీనతకు చిహ్నమనీ, ఫాసిజానికి దారితీసిన సోషల్ డెమాక్రటిక్ పార్టీ కార్మికవర్గానికి చేసిన ద్రోహ ఫలితమనీ మాత్రమే భావించ రాదు. అది పెట్టుబడిదారీ బలహీనతనుకూడ చిహ్నం. పాత పార్లమెంటరీ పద్ధతులద్వారానూ, బూర్జువా ప్రజాతంత్ర పద్ధతులద్వారాను పరిపాలించలేక పెట్టుబడిదారీవర్గం, తనదేశ ఆంతరంగిక వ్యవహారంలో హింసా పద్ధతులతోకూడిన పరిపాల నను పూనుకోవలసి వచ్చింది..." (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో, 1947, 461 పేజీ).

రీచ్‌స్టాగ్‌కు నిప్పుపెట్టి కార్మికవర్గాన్ని క్రూరంగా అణచి వేసి కార్మికవర్గ సంస్థలను నాశనంచేసి బూర్జువా ప్రజాతంత్ర హక్కులను రద్దుచేసి జర్మన్ ఫాసిస్టులు తమదేశీయవిధానాన్ని ప్రారంభించారు. నానాజాతి సమితినుండి ఉపసంహరించుకొని జర్మనీకి అనుకూలంగా వుండేటట్లు యూరోపియన్ రాజ్యాల సరిహద్దులను బలవంతంగా మార్చుటకై యుద్ధానికి బహి రంగంగా సన్నాహంచేస్తూ వారు తమ విదేశాంగ విధానాన్ని ప్రారంభించారు. ఆ విధంగా యూరప్ నడిబొడ్డున జర్మన్ ఫాసిస్టులపుణ్యమా అంటూ యుద్ధానికి రెండవబీజం ఏర్పడింది.

సహజంగానే అలాంటి తీవ్ర పరిస్థితిని చూడనుండా సోవియట్ యూనియన్ కళ్ళు మూసుకోలేదు. పశ్చిమఖండం లోని ఘటనల క్రమాన్ని సోవియట్ యూనియన్ జాగ్రత్తగా గమనించ ప్రారంభించింది. పశ్చిమ సరిహద్దులలో తన రక్షణ లను బలపరచుకో సాగింది.

## 2

### కులక్ వ్యక్తులను అదుపులో పెట్టు విధానం నుండి వారిని ఒక వర్గంగా లేకుండా తొలగించివేసే విధానం అవలంబించుట-సమిష్టి వ్యవసాయ ఉద్యమంలో పార్టీ విధానానికి పెడర్థాలు చెప్పేవారికి వ్యతిరేకంగా జరిగిన పోరాటం - అస్త్రరంగాలలోను పెట్టుబడిదారీ వ్యక్తులపై దాడి - పార్టీ 16వ కాంగ్రెస్

అదివరలో ప్రభుత్వమూ పార్టీ చేసిన కృషి ఫలితంగా 1929 - 30 సంవత్సరాలలో సమిష్టి క్షేత్రాలలోకి రైతులు గుంపులు గుంపులుగా చేరారు. ట్రాక్టర్లను, వ్యవసాయ యంత్రాలను పెద్దయెత్తున ఉత్పత్తి చేయుచున్న సోషలిస్టు పరిశ్రమలు అభివృద్ధి అయాయి. 1928 - 29 లలో ధాన్య సేకరణ ఉద్యమంలో కులక్‌లకు వ్యతిరేకంగా తీవ్రచర్యలు తీసుకోబడ్డాయి. క్రమక్రమంగా సమిష్టి వ్యవసాయానికి రైతు లను అలవాటుచేసిన వ్యవసాయ సహకార సంఘాలు వ్యాప్తి

చెందాయి. మొదటి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు మంచి ఫలితాలను సాధించాయి. ఇవన్నీ దృఢమైన సమిష్టి వ్యవసాయ పద్ధతికి మార్గాన్ని సుకరం చేశాయి. గ్రామాలకు గ్రామాలు, జిల్లాలకు జిల్లాలు, ప్రదేశాలకు ప్రదేశాలలోని రైతులంతా సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లో చేరారు.

దృఢమైన సమిష్టి వ్యవసాయ విధానం కేవలం శాంతియుతంగా జరిగే క్రమంకాదు. రైతులలో అత్యధిక సంఖ్యాకులు సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో ఊరికే చేరలేదు. రైతాంగ ప్రజలు కులక్‌లపై సాగించిన పోరాటక్రమం అది. దృఢమైన సమిష్టి వ్యవసాయ విధానమంటే సమిష్టి వ్యవసాయ క్షేత్రం ఏర్పడిన గ్రామంలోని భూమి అంతా సమిష్టి వ్యవసాయ క్షేత్రంలోకి పోవడమన్నమాట. కాని యీ భూమిలో చాల భాగం కులక్‌ల చేతిలో వుంది. అందుచే రైతులు వారిని ఆ భూములనుంచి తరిమివేసి వారి పశువులను, యంత్రాలను వశపరచుకొని వారి భూమిని లాక్కొనేవారు. వారిని అరెస్టు చేయాలని ఆ జిల్లా నుండి వారిని తరిమివేయాలని సోవియట్ అధికారులను రైతులు కోరేవారు.

అందుచే దృఢమైన సమిష్టి వ్యవసాయ విధానమనే ప్రాతిపదికపైన కులక్‌లనుఒకవర్గంగా రద్దుచేయడానికిఆవిధానం ఉద్దేశించబడింది.

కులక్‌లను అంతమొందించటానికీ, వారి ప్రతిఘటనను భగ్నంచేయటానికీ, ఒక వర్గంగా వారిని ఏరివేయటానికీ, కులక్ వ్యవసాయం స్థానే ప్రభుత్వ వ్యవసాయం, సమిష్టి వ్యవ

సాయం యేర్పరచడాకి తగినంత బలమైన భౌతిక పునాది ఈ సమయానికి సోవియట్ యూనియన్‌కు ఏర్పడింది.

1927 లో కులక్‌లు 60 కోట్ల పూడ్ల ధాన్యాన్ని ఉత్పత్తిచేస్తూ వుండేవారు. అందులో 13 కోట్ల పూడ్ల ధాన్యం అమ్మకానికి వస్తూవుండేది. ఆ సంవత్సరం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు అమ్మగలిగిన ధాన్యం 3½ కోట్ల పూడ్ల ధాన్యం మాత్రమే. (పూడ్ అంటే మణుగున్నర) 1929 లో ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలను, సమిష్టి వ్యవసాయక్షేత్రాలను అభివృద్ధిపరచే దృఢమైన విధానాన్ని బోల్షివిక్‌పార్టీ అవలంబించటంవల్లా, గ్రామసీమలను సోషలిస్టు పరిశ్రమలు ట్రాక్టర్లనూ వ్యవసాయ యంత్రాలను సప్లయి చేయుటలో అభివృద్ధి చూపుటవల్లా, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలూ, ప్రముఖస్థానం వహించాయి. ఆ సంవత్సరం సమిష్టివ్యవసాయక్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు అప్పుడే 40 కోట్ల పూడ్ల ధాన్యాన్ని పండించాయి. ఇందులో 13 కోట్ల పూడ్లకు పైగా ధాన్యం అమ్మకానికి వచ్చింది. ఇది 1927లో కులక్‌లు అమ్మిన దానికంటె ఎక్కువ. 1930 లో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు అమ్మకానికిగాను 40 కోట్ల పూడ్ల ధాన్యాన్ని ఉత్పత్తి చేయవలసివుంది. వాస్తవంగా అలా ఉత్పత్తి చేశాయి కూడ. ఇది 1927 లో కులక్‌లు మార్కెటుకు సప్లయి చేసిన ధాన్యం కంటె చాలా ఎక్కువ. దీనికీ దానికీ అసలు పోలికేలేదు.

ఆ విధంగా దేశ ఆర్థిక జీవితంలో వర్గశక్తుల బలాబలాలు మారాయి. కులక్‌ల ధాన్యపు ఉత్పత్తిస్థానే, ప్రభుత్వ

వ్యవసాయ క్షేత్రాల, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల ధాన్యపు ఉత్పత్తికి అవసరమైన భౌతిక పునాది యేర్పడింది. ఈ కారణాలవల్ల కులక్‌లను అదుపులోవుంచే విధానంనుండి నూతన విధానానికి అనగా వారిని ఒక వర్గంగా లేకుండా ఏరివేసే విధానానికి దృఢమైన సమిష్టి వ్యవసాయ విధాన పునాదిమీద బోల్షివిక్ పార్టీ పురోగమించింది.

1929 కి పూర్వం సోవియట్ ప్రభుత్వం కులక్‌లను అదుపులోపెట్టే విధానాన్ని అవలంబించింది. కులక్‌లపైన హెచ్చు పన్నులను విధించింది. నిర్ణీతధరలను ప్రభుత్వానికి అతడు ధాన్యం అమ్మేటట్లు నిర్బంధించింది. భూమి కౌలుచట్టం ప్రకారం అతడు ఉపయోగించుకొనే భూమిమొత్తం విషయంలో కొంతపరిమితి పెట్టింది. ప్రయివేటు భూములలో వ్యవసాయ కూలీలను జీతానికి నియమించే విషయమై చేసిన చట్టంప్రకారం అతని వ్యవసాయ భూమిని పరిమితం జేసింది. కాని ప్రభుత్వం ఇంకా కులక్‌లను ఏరివేసే విధానాన్ని అవలంచించలేదు. భూమికౌలు చట్టంవలనా, కూలీలను వ్యవసాయంలో పెట్టుకొనే విషయమై చేసిన చట్టంవలనా, కులక్‌లు కొంతకాలం వ్యవసాయంసాగించగల్గారు. కులక్ భూములను వశపరచుకోరాదనే నిషేధంవల్ల కులక్‌లకు ఈ విషయంలో కొంత గ్యారంటీ లభించింది. దీని ఫలితంగా కులక్‌వర్గం పెరగకుండా అరికట్టబడింది. ఈ నిర్బంధాలను తట్టుకోలేక కులక్ వర్గంలో కొందరు ఈ వృత్తిని మానివేసి నాశనమయ్యారు. కాని ఈ విధానం ఒక వర్గంగా వున్న కులక్‌ల ఆర్థిక పునాదులను నాశనం చేయలేదు. వారిని ఏరివేసే విధానానికైనా పూనుకోలేదు. ఇది కులక్‌లను

అదుపులో వుంచే విధానమేకాని పరిసారవేసే విధానంకాదు. ఈ విధానం ఒకానొక కాలంవరకు అవసరం. అనగా ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు బలహీనంగా వుండి ధాన్యపుఉత్పత్తిలో కులక్‌ల స్థానాన్ని అవి ఆక్రమించుకో లేనన్నాళ్ళు ఈ విధానం అవసరం.

1929 సంవత్సరాంతంలో సమిష్టి వ్యవసాయక్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు అభివృద్ధి చెందుటతో సోవియట్ ప్రభుత్వం ఈ విధానాన్ని మానివేసింది. కులక్‌లను పరివేసి ఒక వర్గంగా లేకుండా వారిని నాశనం చేయటానికి కొత్త విధానాన్ని అవలంబించింది. అది కౌలుచట్టాన్ని, జీతానికి కూలీలను పెట్టుకొనే చట్టాన్ని రద్దుచేసింది. ఆవిధంగా కులక్‌లకు భూమి, జీతపు పనివాళ్ళు లేకుండా చేసింది. కులక్‌ల భూమిని వశపర్చుకోవడానికి గల నిషేధాన్ని తొలగించింది. సమిష్టి వ్యవసాయక్షేత్రాల లాభంకోసం, కులక్‌ల వ్యవసాయ ఆస్తిని, యంత్రాలను, పశువులను వశపర్చుకోవడానికి రైతులకు అనుమతి నిచ్చింది. కులక్‌ల ఆస్తి వశపర్చుకోబడింది. 1918 లో పారిశ్రామిక రంగంలో పెట్టుబడిదారుల ఆస్తిని లాక్కొన్నట్లే ఇప్పుడు కులక్‌ల ఆస్తి లాక్కోబడింది. అయితే ఒక భేదముంది. కులక్‌ల ఉత్పత్తి సాధనాలు ప్రభుత్వానికి గాక, సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో ఐక్యమైయున్న రైతుల చేతులలోకి వచ్చాయి. ఇది తీవ్రమైన విప్లవం. పాత గుణాత్మక స్థితినుండి నూతన గుణాత్మక స్థితికి గంతువేయడ మన్నమాట. దీని ఫలితాలు 1917 అక్టోబరు విప్లవ ఫలితాలకు సమానం.

ఈ విప్లవంయొక్క విలక్షణ స్వరూపమేమంటే, ఇది ప్రభుత్వ చొరవవల్ల పైనుండి పూర్తిచేయబడింది. కులక్‌ల బానిసత్వాన్ని కూల్చివేసి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో స్వేచ్ఛగా బ్రతకడానికి పోరాడుతున్న లక్షలాది రైతులు, కిందినుండి దానిని ప్రత్యక్షంగా బలపరచారు.

ఈ విప్లవం ఒక్క దెబ్బతో సోషలిస్టు నిర్మాణం యొక్క మూడు ప్రధాన సమస్యలను పరిష్కరించింది.

(1) పెట్టుబడిదారీ పునరుద్ధరణకు ప్రధానమైన అండగా వున్న కులక్ వర్గాన్ని అది రద్దుచేసింది. మనదేశంలో ఈవర్గం అధిక సంఖ్యగావున్న దోపిడిదార్ల వర్గం.

(2) మనదేశంలో బహు సంఖ్యాకులైన కష్టజీవులైన, రైతువర్గాన్ని పెట్టుబడిదారీ విధానానికి విత్తనంవేసే వ్యక్తిగత వ్యవసాయ పంథానుండి సమిష్టి సహకార సోషలిస్టు వ్యవసాయానికి అది మరల్చింది.

(3) వ్యవసాయంలో సోవియట్ ప్రభుత్వానికి సోషలిస్టు పునాదిని అది కల్గించింది. ఈ పునాది చాలా విస్తృతమైనదీ, ముఖ్యంగా అవసరమైనదీ. కాని అది జాతీయ ఆర్థికవిధానంలో చాలా తక్కువ అభివృద్ధి చెందినశాఖ.

ఇది దేశంలోని పెట్టుబడిదారీ విధాన పునరుద్ధరణకు ఉపయోగించే అంతిమ ముఖ్య స్థావరాలను నాశనం చేసింది. ఇంతేగాక సోషలిస్టు ఆర్ధికవిధానం నిర్మించటానికి నూతన నిశ్చిత పరిస్థితులను సృష్టించింది.

కులక్‌లను ఒక వర్గంగా లేకుండా ఏరివేసే విధానానికి కారణాలను విశదపరుస్తూ, దృఢమైన సమిష్టి వ్యవసాయ

విధానానికై చేసిన రైతాంగ ప్రజా ఉద్యమ ఫలితాలను క్రోడీకరించుతూ, కామ్రేడ్ స్టాలిన్ 1929 లో ఇలా వ్రాశాడు:

"సోవియట్ యూనియన్‌లో పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించటానికి కలలు గంటున్న అన్నిదేశాల పెట్టుబడిదారుల అంతిమ ఆశ 'స్వంత ఆస్తి అనే పవిత్ర సూత్రం.' ఇది కూలిపోయి అదృశ్యమౌతోంది. పెట్టుబడిదారీ విధానమనే క్షేత్రానికి రైతులు ఎరువు పదార్థమని వారు భావించేవారు. పెట్టుబడిదారులు హర్షించే "స్వంతఆస్తి" అనే పతాకను రైతులు ఒక్కుమ్మడిగా వదలిపెట్టి పోసాగారు. సమిష్టివ్యవసాయ విధానపంథాను, సోషలిస్టుపంథాను వారు అవలంబించ సాగారు. పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించవచ్చునసే తుదిఆశ కూలిపోసాగింది." (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో, 1947, 298 వ పేజీ.)

"1930 జనవరి 5వ తేదీన సో. యూ. క. (బో) పార్టీ సెంట్రల్‌కమిటీ, కులక్‌లను ఒక వర్గంగా ఏరివేసే విధానాన్ని గురించి ఒక చారిత్రాత్మకమైన తీర్మానాన్ని చేసింది. ఆతీర్మానం పేరు "సమిష్టివిధానవేగం, సమిష్టివ్యవసాయక్షేత్రాల అభివృద్ధికి సహాయపడేందుకు ప్రభుత్వచర్యలు." సోవియట్ యూనియన్‌లోని వివిధజిల్లాలలో వున్న భిన్నభిన్న పరిస్థితులను ఈ తీర్మానం గమనించింది. సమిష్టివిధానానికి వివిధప్రదేశాలు ఎంతెంతవరకు సిద్ధంగా వున్నాయో ఈ తీర్మానం గుర్తించింది.

సమిష్టివిధాన వేగానికి వివిధ పరిమాణాలు నిర్ణయించబడ్డాయి. ఈఉద్దేశ్యంతో సో. యూ. క. (బో)పార్టీ సెంట్రల్

కమిటీ సోవియట్‌యూనియన్‌లోని వివిధప్రాంతాలను మూడు ముఠాలుగా విభజించింది.

మొదటిముఠాలో ముఖ్యంగా ధాన్యంపండే ప్రదేశాలున్నాయి. అనగా ఉత్తరకాకసస్ (క్యూబాన్, డాన్, టెరెక్) మధ్య ఓల్గాప్రదేశం, కింది ఓల్గాప్రదేశం. ఇవి సమిష్టివ్యవసాయానికి పరిపక్వంగా వున్నాయి. వీటికి ఎక్కువట్రాక్టర్లు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలు, గతంలో ధాన్యసేకరణ ఉద్యమంలో కులక్‌లతో పోరాడిన అనుభవమూ ఉన్నాయి. ధాన్యంపండే ప్రదేశాలయిన ఈ ముఠాలో, 1931 వసంత ఋతువునాటికి సమిష్టి విధానం మొత్తంమీద పూర్తికావాలని సెంట్రల్ కమిటీ సూచించింది.

ధాన్యంపండే ప్రదేశాల రెండవముఠాలో యుక్రెయిన్, నల్ల రేగడిగల మధ్యప్రదేశం, సైబీరియా, యురల్స్, కజిక్‌స్థాన్ మొదలైనవి ఉన్నాయి. 1932 వసంతఋతువు నాటికి యిక్కడ సమిష్టి విధానం పూర్తి చేయాలని సూచించింది.

ఇతరప్రదేశాలలో, ప్రాంతాలలో,రిపబ్లిక్‌లలో (మాస్కో ప్రాంతం, ట్రాన్స్‌కాకేషియా, మధ్య ఆసియారిపబ్లిక్‌లు) ప్రథమ పంచవర్ష ప్రణాళిక పూర్తిఅయ్యేనాటికి అనగా 1933 నాటికి సమిష్టి వ్యవసాయ విధానం పూర్తిచేయాలని సూచించింది.

సమిష్టి వ్యవసాయవిధానం త్వరితంగా పెంపొందటం చూచి ట్రాక్టర్లను, పంటలను కోసే యంత్రాలను, ట్రాక్టర్లు లాగే యంత్రాలను ఉత్పత్తిచేసే కర్మాగారాల నిర్మాణాన్ని వేగిర పరచుట అవసరమని పార్టీ సెంట్రల్‌కమిటీ భావిం

చింది. దీనితోపాటు సెంట్రల్ కమిటీ ఒక హెచ్చరిక చేసింది. "సమిష్టి వ్యవసాయ ఉద్యమంలోని ప్రస్తుతదశలో గుర్రాల వ్యవసాయం చేయుటలోని ప్రాముఖ్యతను తక్కువ అంచనా వేసే ధోరణి వ్యాపించింది. ఇందువల్ల గుర్రాలను ఇష్టంవచ్చి నట్లు అమ్మివేయడం, వదిలించుకోవడం జరుగుతున్నది. ఈ ధోరణిని ఖచ్చితంగా అరికట్టాలి." మొదట అనుకొన్నప్లాను కంటె రెట్టింపుగా 1929-30 సంవత్సరంలో సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు ప్రభుత్వము ఋణాలను ఇచ్చింది. (50 కోట్ల రూబుల్స్.)

సమిష్టి వ్యవసాయక్షేత్రాల భూములను సర్వేచేయ టానికి, సరిహద్దులు నిర్ణయించటానికి అయ్యేఖర్చులను ప్రభు త్వమే భరించాలని నిర్ణయించింది.

సమిష్టివ్యవసాయ ఉద్యమంయొక్క <u>ముఖ్యస్వరూపం</u> ఆదశలో వ్యవసాయ ఆర్టెల్ మాత్రమే (Artel). ఇందులో ముఖ్యమైన ఉత్పత్తిసాధనాలు మాత్రమే సమిష్టిక్షేత్రపరం అవుతాయని చాలా ముఖ్యమైన ఉత్తరువులిస్తూ సెంట్రల్ కమిటీ తీర్మానించింది. (రైతులందరూ కలిసి పనిచేయడం మాత్రమేగాక అతడు తన భూమిని, పనిముట్లను, భవనాలను, పశువులను ఏకంగా ఉపయోగించి సేద్యంచేస్తారు. కాని ఎవరి యిండ్లు వారివే. ఎవరి తోటలువారివే. ఎవరి పాడిపశువులు వారివే. దీనినే ఆర్టెల్ అంటారు - అనువాదకుడు.)

"పైనుంచి 'ఉత్తరువులు' చేయుటద్వారా సమిష్టి వ్యవ సాయ ఉద్యమాన్ని బలవంతంగా రుద్దేప్రయత్నాలు చేయ రాదు. ఇలా చేయటంవల్ల సమిష్టి వ్యవసాయక్షేత్రాల నిర్మా

ణంలో నిజమైన సోషలిస్టు పోటీకి బదులుగా వేళాకోళపు సమిష్టివిధానం ఏర్పడుతోంది." అని సెంట్రల్ కమిటీ చాలా తీవ్రంగా పార్టీ సంస్థలను హెచ్చరించింది. (సో. యూ. క. (బో) పార్టీ తీర్మానాలు రష్యన్ ఎడిషన్, రెండవభాగం, 662పేజీ)

పార్టీ నూతనవిధానాన్ని పల్లెపట్టులలో ఎలా అనువర్తింప జేయాలో సెంట్రల్ కమిటీ తన తీర్మానంలో స్పష్ట పరచింది.

కులక్‌లను ఒకవర్గంగా లేకుండా ఏరివేసే విధానం, దృఢమైన సమిష్టి వ్యవసాయవిధానం, శక్తివంతమైన సమిష్టి వ్యవసాయ ఉద్యమాన్ని త్వరితపరచాయి. జిల్లాలకు జిల్లాలుగా, గ్రామాలకు గ్రామాలుగా రైతులు తమ కడ్డంగానున్న కులక్‌లను తుడిచిపెట్టి వారి బానిసత్వంనుండి తాము విముక్తి పొందారు. సమిష్టి వ్యవసాయవిధానం ఎంతో ప్రముఖమైన అభివృద్ధి చెందింది. కాని ఇందులో పార్టీ వర్కర్లు చేసిన తప్పులు సమిష్టి వ్యవసాయ అభివృద్ధిపట్ల పార్టీ విధానాన్ని గురించి వారి వక్రభాష్యాలు, త్వరలోనే బయటపడ్డాయి. సమిష్టి వ్యవసాయ విధాన విజయాలతో తలతిరిగి పోరాదని పార్టీ వర్కర్లకు సెంట్రల్ కమిటీ హెచ్చరిక చేసినప్పటికీ, కాల స్థలపరిస్థితులను గమనించకుండానే, సమిష్టి వ్యయసాయ క్షేత్రాలలో చేరటానికి రైతుల సంసిద్ధతను గమనించకుండానే, చాలామంది వర్కర్లు సమిష్టి వ్యవసాయ పద్ధతియొక్క గమనాన్ని కృత్రిమంగా హెచ్చించ సాగారు.

రైతులు ఇచ్ఛికంగా సమిష్టి వ్యవసాయంలో చేరాలనే సూత్రాన్ని ఉల్లంఘించారు. అనేక జిల్లాలలో వారి ఆస్తిని

లాక్కుంటామని, వారికి వోటుహక్కు లేకుండా చేస్తామని బెదిరించి రైతులను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో బలవంతంగా చేర్పించారు.

అనేక జిల్లాలలో సమిష్టి వ్యవసాయ విధానానికి అవసరమైన ప్రాథమిక కార్యకలాపంగానీ, ఈవిషయంలో పార్టీ విధానంలో అంతర్భూతమైవున్న సూత్రాలను ఓపికగా వివరించి చెప్పటగానీ జరగలేదు. దానిస్థానే పైనుంచి నిరంకుశ ఉత్తరువులు చేయుట, సమిష్టి వ్యవసాయక్షేత్రాల నిర్మాణాన్ని గురించీ, నూటికి ఎన్నివంతులు క్షేత్రాలు సమిష్టి వ్యవసాయ పద్ధతిలో చేరాయనే విషయాన్ని గురించీ, అతిశయోక్తుల తోను, కల్పనలతోను కూడిన లెక్కలు ఈయసాగారు.

సమిష్టి వ్యవసాయ ఉద్యమ ప్రధాన స్వరూపం వ్యవసాయక ఆర్టెల్ అని, దీనిలో ప్రధాన ఉత్పత్తి సాధనాలు మాత్రమే సమిష్టిపరం చేయబడతాయనీ సెంట్రల్ కమిటీ ప్రత్యేకించి చెప్పినప్పటికి అనేక స్థలాలలో ఆర్టెల్ స్వరూపాన్ని వదలి తిన్నగా కమ్యూన్ స్వరూపానికి గంతువేసే వెర్రిమొర్రి టాయ ప్రయత్నాలు జరిగాయి. నివాసస్థలాలను, మార్కెటు కోసం గాక స్వంతంగా పెంచుకొనే పాడి ఆవులను, చిన్న పశువులను, కోళ్లను కూడా సమిష్టి క్షేత్రాలపరం చేశారు.

సమిష్టి విధానంలోని ప్రాథమిక విజయాలతో కొన్ని ప్రదేశాలలోని అధికారంలోవున్నవ్యక్తులు మత్తెక్కిపోయారు. సమిష్టి విధానం ఏ వేగంలో ఏ కాలపరిమితులలో జరగాలో స్పష్టంగా తెలియజేసిన సెంట్రల్ కమిటీ సూచనలను వారు ఉల్లంఘించారు. సంఖ్యల ముమ్మరం కోసం పడే తాపత్ర

యంలో మాస్కో ప్రాంతంలోని నాయకత్వం 1930వ సంవత్సరం నాటికి సమిష్టి విధానాన్ని పూర్తి చేయవలసిందని తమక్రింద అధికారులకు సూచనాప్రాయంగా తెలియజేశారు. ఇందుకు 1932 సంవత్సరాంతంవరకు వ్యవధి అనగా మూడేండ్ల వ్యవధి ఉన్నప్పటికీ వారలా చేశారు. ట్రాన్స్‌కాకేషియా, మధ్య ఆశియాలలో చేసిన ఉల్లంఘనలు ఇంకా తీవ్రమైనవి.

పార్టీ విధానాన్ని ఇలా విచ్ఛిన్నంచేయటాన్ని కులక్‌లు, వారి తొత్తులు అదనుగా తీసుకొన్నారు. వారంతకు వారే వ్యవసాయ ఆర్టెల్స్‌కు బదులుగా కమ్యూన్‌లను నిర్మించాలని సూచించారు. ఇండ్ల స్థలాలు, చిన్నచిన్న పసువులు, కోళ్ళు మొదలైనవి కూడా సాముదాయకం చేయాలని వీరు సూచించారు. ఇంతేగాక సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరేముందు తమతమ జంతువులను చంపివేయవలసిందని రైతులను కులక్‌లు ప్రేరేపించారు. "ఎలాగైనా వాటిని వాళ్ళు తీసుకుపోతారు" అని కులక్‌లు వాదించారు. సమిష్టి వ్యవసాయవిధానక్రమంలో స్థానిక సంస్థలు చేసిన తప్పులు, విచ్ఛిన్న చర్యలు రైతాంగాన్ని క్రోధాగ్నితో నింపి సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాట్లను రెచ్చగొట్టుతాయని వర్గ శత్రువు అంచనా వేశాడు.

పార్టీ సంస్థలు చేసిన తప్పులవల్ల, వర్గ శత్రువు కావాలని చేసిన రెచ్చగొట్టే చర్యలవల్ల, సమిష్టి వ్యవసాయవిధానం ఒక ప్రక్క ఎదురులేకుండా జయప్రదంగా సాగుతున్నప్పటికీ, 1930 ఫిబ్రవరి రెండవ పక్షంలో అనేక జిల్లాలలో రైతులలో అపాయకరమైన తీవ్ర అసంతృప్తి చిహ్నాలు కనిపించాయి. అక్కడక్కడ కులక్‌లూ, వారి తొత్తులూ సోవియట్ వ్యతిరేక చర్యలను సయితం రైతులను సూటిగా రెచ్చగొట్టగలిగారు.

సమిష్టి విధానాన్ని భగ్నమొనర్చగల వక్రభాష్యాలు పార్టీ విధానానికి చేయబడుతున్నాయనే ప్రమాద సూచనలు అనేకం పార్టీ సెంట్రల్ కమిటీకి చేరాయి. వెంటనే ఈపరిస్థితిని బాగుపరచటానికీ, సాధ్యమైనంత త్వరలో తప్పులను సరిదిద్దుకునే కర్తవ్యాన్ని పార్టీ వర్కర్లముందు పెట్టడానికీ, సెంట్రల్ కమిటీ పూనుకొంది. సెంట్రల్ కమిటీ నిర్ణయాలను అనుసరించి 1930 మార్చి 2వ తేదీన కామ్రేడ్ స్టాలిన్ వ్రాసిన "విజయోన్మాదం" అనే వ్యాసం ప్రకటించబడింది. సమిష్టి విధాన విజయాలతో తల తిరిగిపోయి తీవ్రమైన తప్పులు చేసే వారినీ, పార్టీ పోకడనుండి దూరమైనవారినీ, సమిష్టివ్యవసాయ విధానంలో చేరవలసిందిగా రైతులను నిర్బంధించటానికి ప్రయత్నించేవారినందరినీ, యీ వ్యాసం హెచ్చరించింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను ఏర్పరచుట ఇచ్ఛాపూర్వకంగా ఉండాలన్న సూత్రాన్ని ఈ వ్యాసం మరీమరీ నొక్కి చెప్పింది. సమిష్టి విధానానికి అవలంబించవలసిన పద్ధతులను, వేగాన్ని నిర్ణయించుటకు సోవియట్ యూనియన్‌లో వివిధ జిల్లాలలోని విభిన్న పరిస్థితులను గమనించాలని యీ వ్యాసం మరీ మరీ నొక్కి చెప్పింది. సమిష్టి వ్యవసాయ ఉద్యమంలో ప్రధాన స్వరూపం వ్యవసాయక "ఆర్టెల్" అని కామ్రేడ్ స్టాలిన్ పునరుద్ఘాటించాడు. యీ"ఆర్టెల్"లో ప్రధానఉత్పత్తిసాధనాలు, ముఖ్యంగా ధాన్యం పండించుటలో ఉపయోగించిన సాధనాలు మాత్రమే సాముదాయకము చేయబడతాయి. కాని ఇండ్ల స్థలం, ఇండ్లు, పాడి పసువులలో కొంతభాగం, చిన్నచిన్న పసువులు, కోళ్ళు మొదలైనవి సాముదాయకం చేయబడవు.

కామ్రేడ్ స్టాలిన్ వ్యాసం రాజకీయంగా చాల ప్రాముఖ్యమైంది. పార్టీ సంస్థలు తమ తప్పులను దిద్దుకొనుటలో అది సహాయపడింది. పార్టీ పోకడను విచ్ఛిన్నం చేయటాన్ని అవకాశంగా తీసుకొని, సోవియట్ ప్రభుత్వంపై రైతులను రెచ్చగొట్టాలని ప్రయత్నించుచున్న శత్రువులను ఇది పెద్ద దెబ్బగొట్టింది. బోల్షివిక్-పార్టీ పోకడకూ స్థానిక అధికార వర్గాల "తీవ్రవాద" వెర్రివెంకటాయి (Pig headed) విచ్ఛిన్న చర్యలకూ ఏమీ సంబంధం లేదని రైతాంగ జన బాహుళ్యం ఇప్పుడు గ్రహించింది. ఈ వ్యాసం రైతుల మనస్సుకు శాంతిని చేకూర్చింది.

తప్పులను విచ్ఛిన్న చర్యలను సరి దిద్దుటలో కామ్రేడ్ స్టాలిన్ వ్యాసం ప్రారంభించిన పనిని పూర్తిచేయటానికి సో. యూ. క. (బో) పార్టీ సెంట్రల్ కమిటీ మరొక చర్య తీసుకోవాలని నిశ్చయించింది. 1930 మార్చి 15 వ తేదీన "సమిష్టి వ్యవసాయ ఉద్యమంలో పార్టీ పోకడకు చేయబడిన వక్ర భాష్యాలను ఎదిరించుటకు అవలంబించవలసిన చర్యలు" అనే తీర్మానాన్ని ప్రకటించింది.

చేసిన తప్పులను మూలకారణాలను ఈ తీర్మానం విశదీకరించింది. లెనినిస్టు, స్టాలినిస్టు పార్టీ పోకడనుండి ఎడ బాసైన ఫలితంగా, పార్టీ సూచనలను బాహాటంగా ఉల్లం ఘించిన ఫలితంగా, ఈ తప్పులు జరిగాయని ఆ తీర్మానం చూపించింది,

"తీవ్ర" వాద విచ్ఛిన్న కృత్యాలు వర్గ శత్రువుకు తిన్నగా ఉపకరించుతాయని సెంట్రల్ కమిటీ తెలియజేసింది.

"పార్టీ పోకడను విచ్ఛిన్నం చేయుటను చిత్తశుద్ధితో ఎదిరించనివారిని, ఎదిరించలేనివారిని, వారివారి స్థానాలనుంచి తొలగించి వారి స్థానే మరికొందరిని నియమించాలి." అని సెంట్రల్ కమిటీ ఉత్తరువులిచ్చింది. (సో. యూ. క. (బో) పార్టీ తీర్మానాలు, 2 వ భాగం, 663 పేజీ)

కొన్ని రాష్ట్రాలు, ప్రాంతాల పార్టీ సంస్థల నాయకత్వాన్ని సెంట్రల్ కమిటీ మార్చివేసింది (మాస్కో-ప్రాంతం, ట్రాన్స్‌కాకేషియా). ఇవి రాజకీయంగా తప్పులు చేశాయి. తమతప్పులను దిద్దుకొనే సామర్థ్యం వీటికిలేనట్లు రుజువయింది.

1930 ఏప్రిల్ 3 వ తేదీన "సమిష్టి వ్యవసాయ కార్యమేదునకు సమాధానం" అనే పేరుతో కామ్రేడ్ స్టాలిన్ వ్యాసం ఒకటి ప్రచురించబడింది. ఇందులో రైతాంగ సమస్యపై చేసిన తప్పులకు మూలకారణాన్ని సమిష్టి వ్యవసాయ ఉద్యమంలో చేసిన పెద్ద తప్పులకు మూలకారణాన్ని తెలియజేశాడు. అవి: మధ్యతరగతి రైతుఎడల తప్పుడువైఖరి. (Incorrect Approach). సమిష్టి వ్యవసాయక్షేత్రాలు ఇచ్ఛాపూర్వకంగా నిర్మించబడాలనే లెనినిస్టు సూత్రాన్ని ఉల్లంఘించుట, సోవియట్ యూనియన్‌లోని వివిధ జిల్లాలలోవున్న విభిన్న పరిస్థితులబట్టి అవసరమైన మార్పులు చేసుకోవచ్చుననే లెనినిస్టు సూత్రాన్ని ఉల్లంఘించుట, ఆర్టెల్ స్వరూపాన్ని విడిచి తిన్నగా కమ్యూన్ స్వరూపానికి గంతువేయాలనే ప్రయత్నాలు.

అనేక జిల్లాలలో స్థానిక పార్టీ వర్కర్లు పార్టీ పాలసీని విచ్ఛిన్నం చేస్తూ చేసిన కృత్యాలను సరిదిద్దుటలో ఈ చర్యలు పార్టీకి తోడ్పడ్డాయి.

ఈ విషయంలో సెంట్రల్ కమిటీ ఎక్కువ గట్టితనాన్ని ప్రదర్శించవలసి వచ్చింది. విజయాలతో తలతిరిగిపోయిన చాల మంది పార్టీ వర్కర్లు పార్టీ పోకడనుండి త్వరితంగా దూరమై పోతున్నారు. ఇలాంటివారిని వెనువెంటనే సరిదిద్దటానికి సెంట్రల్ కమిటీ సామర్థ్యంతో ప్రవాహానికి ఎదురు ఈదవలసి వచ్చింది.

సమిష్టి వ్యవసాయ ఉద్యమంలో పార్టీ పోకడకువచ్చిన వక్ర భాష్యాలను పార్టీ జయప్రదంగా సరిదిద్దింది.

దీనివలన సమిష్టి వ్యవసాయ ఉద్యమ విజయాలను సుస్థిర పరచుకొనుట సాధ్యమైంది.

దీనివలన సమిష్టి వ్యవసాయ ఉద్యమం నూతనంగా శక్తివంతంగా పురోగమించటం సాధ్యమైంది.

కులక్‌లను ఒక వర్గంగా ఏరివేసే విధానాన్ని పార్టీ అవలంబించక ముందు, పెట్టుబడిదారీ అంశాలను తొలగించే ఉద్దేశ్యంతో వాటిపై తీవ్రమైనదాడిని పారిశ్రామిక రంగంలో ముఖ్యంగా పట్టణాలలో సాగించబడింది. అంతవరకు గ్రామ సీమా, వ్యవసాయమూ, పట్టణాలకు, పరిశ్రమలకు వెనకబడి వుండేవి. అందువల్ల ఆదాడి సర్వతోముఖంగాదు. సంపూర్ణ మైనదీగాదు. సాధారణ స్వభావాన్ని కలిగియుండలేదు. కాని గ్రామసీమ వెనకబడి యుండటమనేది గతకాల విషయంగా మారిపోతోంది. కులక్ వర్గాన్ని ఏరివేయడానికి రైతులుచేసే పోరాటం స్పష్టమైన స్వరూపాన్ని పొందింది. పార్టీ కులక్ వర్గాన్ని ఏరివేసే విధానాన్ని అవలంబించింది. పెట్టుబడిదారీ అంశాలపై దాడి సర్వ సాధారణ స్వభావాన్ని వహించింది.

పాక్షిక దాడి రంగమంతటా జరిగే సమగ్రమైన దాడిగా మారింది. పార్టీ 16 వ కాంగ్రెస్ జరిగేనాటికి అన్నిరంగాల లోను పెట్టుబడిదారీ అంశాలపై సర్వతోముఖమైన దాడి ప్రారంభమయింది.

1930 జూన్ 26 వ తేదీన పార్టీ 16 వ కాంగ్రెస్ సమావేశమయింది. దానికి 1260874 మంది పార్టీసభ్యులకూ, 711609 మంది కాండిడేటు సభ్యులకూ ప్రాతినిధ్యం వహించిన ప్రతినిధులు వచ్చారు. వీరిలో 1268 మందికి వోటింగుహక్కు ఉంది. 891 మందికి వోటింగుహక్కు లేదు, కాని చర్చించే హక్కు ఉంది.

పార్టీచరిత్రలో 16 వ కాంగ్రెస్ "కులక్‌లను ఒక వర్గంగా లేకుండా ఏరివేయడానికీ, దృఢమైన సమిష్టివ్యవసాయ విధానాన్ని అమలులోకి తేడానికీ, రంగమంతటా సోషలిజం జైత్ర యాత్ర సాగించిన" కాంగ్రెస్‌గా పిలువబడుతుంది (స్టాలిన్).

సెంట్రల్ కమిటీకి రాజకీయ రిపోర్టును నివేదించుతూ సోషలిస్టుదాడిని వృద్ధిచేయటంలో బోల్షివిక్ పార్టీ సాధించిన గొప్ప విజయాలను కామ్రేడ్ స్టాలిన్ తెలియజేశాడు.

సోషలిస్టు పారిశ్రామిక విధానం చాలా అభివృద్ధి చెందింది. దేశంయొక్క ఉత్పత్తిలో పరిశ్రమల ఉత్పత్తిభాగం వ్యవసాయ ఉత్పత్తికంటె మించిపోయింది. 1929-30 ఆర్థిక సంవత్సరంలో దేశంమొత్తం ఉత్పత్తిమొత్తంలో పరిశ్రమల భాగం 100 కి 53 పాళ్ళుంది. వ్యవసాయ ఉత్పత్తి 100 కి 47 పాళ్ళు మాత్రమేవుంది.

1926-27 ఆర్థికసంవత్సరంలో అనగా పార్టీ 15 వ కాంగ్రెస్ సమయంలో పారిశ్రామిక ఉత్పత్తి మొత్తం యుద్ధ పూర్వవుత్పత్తితో పోల్చితే 100 కి 102½ పాళ్లు మాత్రమే. 1929-30 ఆర్థికసంవత్సరంలో అనగా 16 వ 'కాంగ్రెస్ సమయంలో అది నూటికి 180 పాళ్ళు పెరిగింది.

భారీపరిశ్రమలూ అనగా యంత్రనిర్మాణమూ-ఉత్పత్తి సాధనాలఉత్పత్తి - క్రమంగా శక్తివంతంగా పెరగజొచ్చింది.

"... వ్యవసాయకదేశం నుండి పారిశ్రామికదేశంగా మనదేశం పరివర్తనం చెందేకాలంలో మనం ఉన్నాం." అని కామ్రేడ్ స్టాలిన్ కాంగ్రెస్‌లో ప్రకటించాడు. దీనికి అత్యుత్సాహంతో హర్షధ్వానాలు చేశారు.

కాని పారిశ్రామికాభివృద్ధి వేగాన్ని (రేటు) అభివృద్ధి స్థాయిగాతలచి గందరగోళ పరచరాదని స్టాలిన్ విశదీకరించాడు. సోషలిస్టు పారిశ్రామికాభివృద్ధిలో ఇదివరకెన్నడూ ఎరుగని వేగం కనపడి నప్పటికీ, పారిశ్రామికాభివృద్ధి స్థాయిలో చూచినట్లయితే అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకు మనం ఇంకా చాలవెనకబడియున్నాం. సోవియట్ యూనియన్‌లో విద్యుచ్ఛక్తి నిర్మాణంలో మహోన్నతాభివృద్ధి జరిగింది. అయినప్పటికీ ఈ విషయంలో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలకు వెనుకబడియున్నాం. లోహపరిశ్రమ విషయంలోకూడా అంతే. పంచవర్ష ప్రణాళిక ప్రకారం 1929-30 సంవత్సరానికి సోవియట్‌యూనియన్‌లో ముడి ఇనుము (Pig Iron) ఉత్పత్తి 55 లక్షల టన్నులుకావాలి.

1929 లో జర్మనీలో అది 134 లక్షల టన్నులు ఉత్పత్తి అయింది. ఫ్రాన్సులో 104½ లక్షలటన్నులు ఉత్పత్తి అయింది. సాంకేతికంగానూ (టెక్నికల్ గాను) ఆర్థికంగానూ మనం వెనక బడివున్నాం. అతిస్వల్పకాలంలో దీన్ని పోగొట్టుకోవాలంటే మన పారిశ్రామికాభివృద్ధి వేగాన్ని మరింత తీవ్రపరచాలి. సోషలిస్టుపరిశ్రమాభివృద్ధి వేగాన్ని తగ్గించటానికి ప్రయత్నించే అవకాశ పునాదులపై అత్యంత నిశితమైన పోరాటాన్ని సాగించాలి.

"... మన పరిశ్రమల అభివృద్ధివేగాన్ని తగ్గించుట అవసరమని చెప్పేవారు సోషలిజానికి శత్రువులు. మన పగ శత్రువుల ఏజెంట్లు." అని కామ్రేడ్ స్టాలిన్ అన్నారు. (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, రష్యన్ ఎడిషన్, 369పే)

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో మొదటిసంవత్సర కార్య క్రమం విజయవంతంగా పూర్తి అయి మించిపోయిందికూడా. అప్పుడు ప్రజలనుండి "పంచవర్ష ప్రణాళికను నాలుగు సంవత్స రాలలోనే పూర్తి చేయాలి" అనే నినాదం ఉద్భవించింది. అనేక పారిశ్రామిక శాఖలు (నూనె, పీట్, యంత్రనిర్మాణం, వ్యవసాయయంత్రాలు, విద్యుచ్ఛక్తి పరికరాలు) తమ ప్రణా ళికలను చాల విజయప్రదంగా కొనసాగిస్తున్నాయి. 5 ఏళ్ళ "ప్రణాళికలు 2½ లేక 3 ఏండ్లలోనే పూర్తి కానున్నాయి." "పంచవర్ష ప్రణాళికను నాలుగేండ్లలోనేపూర్తి చేయాలి." అన్న నినాదం సాధ్యమయ్యే నినాదమేనని ఇది రుజువుచేసింది. ఆవిధంగా దానినిగురించి సందేహించిన నిరాశావాదుల అవ కాశవాదాన్ని బయటపెట్టింది.

"సోషలిస్టు నిర్మాణంలో ఉత్సాహభరితమైన బోల్షివిక్ టెంపో నిలబడేటట్లు పంచవర్ష ప్రణాళిక వాస్తవంగా నాలు గేండ్లలోనే పూర్తి అయ్యేటట్లు" పార్టీ సెంట్రల్ కమిటీ చూడాలని 16 వ కాంగ్రెస్ ఉత్తరువు చేసింది.

పార్టీ 16 వ కాంగ్రెస్ నాటికి సోవియట్ యూనియన్ వ్యవసాయాభివృద్ధిలో అద్భుతమైన మార్పు వచ్చింది. రైతాంగ జనబాహుళ్యం సోషలిజంవైపుకు మరలారు. 1928 వ వసంత కాలంలో సమిష్టి వ్యవసాయ విధానంలో చేరిన రైతు కుటుం బాలు నూటికి రెండు లేక మూడు మాత్రమే. కాని 1930 మే 1 వ తేదీకి ప్రధానంగా ధాన్యంపండే ప్రాంతాలలోసమిష్టి వ్యవసాయ విధానం అవలంబించిన రైతు కుటుంబాల సంఖ్య నూటికి 40 లేక 50 వరకువుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల పంటభూమి 3 కోట్ల 60 లక్షల హెక్టార్లకు పెరిగింది.

1930 జనవరి 5 వ తేదీన సెంట్రల్ కమిటీ నిర్దేశించిన హెచ్చు కార్యక్రమం (3 కోట్ల హెక్టార్లు) కూడా పూర్తి అయి మించిపోయింది. సమిష్టి వ్యవసాయాభివృద్ధియొక్క పంచవర్ష ప్రణాళిక కార్యక్రమం రెండేండ్లలో పూర్తిఅయి ఒకటిన్నర రెట్లకు మించిపోయింది కూడా.

ఈ మూడేండ్లలోను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు అమ్మటానికి సప్లయిచేసిన ధాన్యం 40 రెట్లుకుపైగా పెరిగింది. 1930 నాటికి దేశం మొత్తంమీద మార్కెట్‌కు వచ్చిన ధాన్యంలో సగం ధాన్యం ఈ సమిష్టి ధాన్యాన్ని కలపలేదు.

ఇక ముందు వ్యవసాయ భవిష్యత్తును నిర్ణయించేది వ్యక్తిగత రైతు క్షేత్రాలుగావనీ, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలనీ రుజువయింది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోకి రైతాంగం ఒక్కుమ్మడిగా చేరేముందు సోవియట్ ప్రభుత్వం ప్రధానంగా సోషలిస్టు పరిశ్రమలపైననే ఆధారపడేది. కాని ఇప్పుడు త్వరితగతిని విస్తరించుతున్న సోషలిస్టు వ్యవసాయ రంగంపైన అనగా సమిష్టి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలపైన కూడా ఆధారపడనారంభించింది.

పార్టీ 16 వ కాంగ్రెస్ చేసిన ఒక తీర్మానంలో చెప్పినట్లు, సమిష్టి వ్యవసాయ రైతాంగం "సోవియట్ ప్రభుత్వానికి నిజమైన, దృఢమైన అండ"గా మారింది.

## 3

జాతీయ ఆర్థిక సంపద శాఖలన్నింటిని పునర్నిర్మించే విధానం - టెక్నికల్ ప్రాధాన్యత - సమిష్టి వ్యవసాయ ఉద్యమం మరింత వ్యాపించుట - మెషిన్ ట్రాక్టర్ స్టేషన్ల యొక్క రాజకీయ శాఖలు - పంచవర్ష ప్రణాళికను నాలుగేండ్లలో పూర్తిచేయడంవల్ల వచ్చిన ఫలితాలు - రంగమంతటా సోషలిస్టు విజయం - పార్టీ 17 వ కాంగ్రెస్

భారీ పరిశ్రమలు, ముఖ్యంగా యంత్రనిర్మాణపరిశ్రమ, నిర్మింపబడ్డాయి. అవి తమ కాళ్ళమీద భద్రంగా నిలబడ

గల్గాయి. ఇంతేగాక అవి చాలా త్వరితగతిని అభివృద్ధి చెందుతున్నట్లు స్పష్టమైంది. ఇక పార్టీని ఎదుర్కొన్న తర్వాతి కర్తవ్యం ఏమంటే, జాతీయ ఆర్థిక విధానంయొక్క శాఖలన్నిటిని నవీన అధునాతన పద్ధతులపై పునర్నిర్మించుట. , లోహం, ఆహారం, కలప పరిశ్రమలకూ, చిన్న పరిశ్రమలకూ, ఆయుధ పరిశ్రమకూ, రవాణాశాఖకూ, వ్యవసాయానికీ ఆధునిక టెక్నిక్‌ను, ఆధునికయంత్రాలనూ సప్లయిచేయాలి. వ్యవసాయ ఉత్పత్తికి, పారిశ్రామిక వస్తువులకు గిరాకీ (డిమాండ్) చాలా హెచ్చింది. ఇందువల్ల అన్ని శాఖలలోను ఉత్పత్తిని రెండు, మూడురెట్లు చేయవలసివచ్చింది. కాని ఫ్యాక్టరీలకు, మిల్లులకు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలకు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు అధునాతన పరికరాలను తగినంతగా సప్లయి చేస్తేతప్ప ఇది సాధ్యంకాదు. పాత పరికరాలతో ఇప్పుడు మనం కోరే అధికోత్పత్తిని సాధించలేము.

జాతీయ ఆర్థిక విధానంయొక్క ప్రధాన శాఖల నన్నింటినీ పునర్నిర్మించితే తప్ప, రోజురోజుకూ పెరుగుచున్న దేశ అవసరాలను, ఆర్థిక విధాన అవసరాలను సంతృప్తిపరచుట సాధ్యం కానేరదు.

పునర్నిర్మాణం లేకుండా రంగమంతటా సోషలిజం యొక్క దాడిని పూర్తిజేయుట సాధ్యంకాదు. ఎందువల్లనంటే పట్టణాలలోని, పల్లెలలోని పెట్టుబడిదారీ వ్యక్తులను పోరాడి నాశనంచేయాలి. ఇందుకు శ్రమశక్తినీ, ఆస్తినీ నూతన పద్ధతిలో నిర్మించినంత మాత్రాన చాలదు. టెక్నిక్‌లో నూతనత్వమూ ఆధిక్యతాకూడా ఇందు కవసరం.

పునర్నిర్మాణం లేకుండా టెక్నిక్‌లోనూ, ఆరికంగానూ అభివృద్ధి చెందిన దేశాలను మించిపోవటం అసాధ్యం. ఎందువల్లనంటే పారిశ్రామికాభివృద్ధి వేగంలో పెట్టుబడిదారీ దేశాలను సోవియట్ యూనియన్ మించిపోయినప్పటికీ, పారిశ్రామికాభివృద్ధి స్థాయిలోను, పారిశ్రామిక ఉత్పత్తి పరిమాణంలోను సోవియట్ యూనియన్ ఇంకా వెనకబడే వుంది.

మనం వాటితో కలుసుకోవాలంటే ఉత్పత్తిలోను ప్రతి శాఖను నూతన టెక్నిక్‌తో నింపాలి. అత్యంత అధునాతన టెక్నికల్ పద్ధతులపైన వాటిని పునర్నిర్మించాలి.

ఆవిధంగా టెక్నిక్ సమస్య నిశ్చితప్రాముఖ్యతవహించింది.

మనకు ప్రధానమైన అవరోధం ఆధునిక యంత్రాలు, యంత్ర పనిముట్లు తగినంతగా లేకపోవటంకాదు. నిజానికి మన యంత్ర నిర్మాణ పరిశ్రమ ఆధునిక పరికరాలను ఉత్పత్తి చేసే స్థితిలోవుంది. పోతే, దీనికి అవరోధంఅల్లా, టెక్నిక్‌పట్ల మన పారిశ్రామిక నిర్వాహకవర్గాలు అవలంబించే తప్పుడు వైఖరియే. పునర్నిర్మాణ కాలంలో టెక్నిక్ యొక్క ప్రాధాన్యతను తక్కువ అంచనావేసిఅలక్ష్యభావంతో త్రోసిపుచ్చే వీరి ధోరణియే దీనికి ప్రతిబంధకం. వీరి అభిప్రాయంలో టెక్నికల్ విషయాలన్నీ "ప్రవీణులకు" సంబంధించినవి. రెండవరకం ప్రాముఖ్యత గలవి. వాటిని "బూర్జువా ప్రవీణుల" చేతులలోనే వదలివేయాలి. ఉత్పత్తి యొక్క టెక్నికల్ విషయాలలో కమ్యూనిస్టు పారిశ్రామిక నిర్వాహకవర్గాలు జోక్యం కలుగజేసుకోరాదు. అంతకంటె ప్రధానమైన అనగా పరిశ్రమల "సాధారణ" నిర్వహణ బాధ్యత తీసుకోవాలని వీరభిప్రాయం.

అందుచేత "బూర్జువా ప్రవీణుల"కు ఉత్పత్తి విషయాలలో పూర్తి స్వేచ్ఛను ఇచ్చివేశారు. కమ్యూనిస్టు పారిశ్రామిక నిర్వాహకవర్గాలు మాత్రం "సాధారణ" అజమాయిషీ మాత్రం చేస్తూ కూర్చున్నారు. అంటే కాగితాల మీద సంతకాలు చేస్తూ కూర్చున్నారు.

అలాంటి వైఖరి ఉన్నపుడు "సాధారణ" అజమాయిషీ పేరడీగా (అపహాస్య అనుకరణ) పతనం చెందుతుంది. కాగితాలపైన వృధాగా సంతకాలు పెట్టడ మవుతుంది. నిరర్ధకంగా కాగితాలతో హడావిడి చేయడం అవుతుంది.

టెక్నికల్ విషయాలలో ఇలాంటి నిర్లక్ష్య వైఖరిని కమ్యూనిస్టు పారిశ్రామిక నిర్వాహకవర్గాలు ఇంకా కొనసాగించినట్లయితే, అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలను వెనకబడ వేయటం అలావుంచి కనీసం వాటిని అతిక్రమించనైనా అతిక్రమించియుండే వాళ్ళంగాదు. ముఖ్యంగా ఈ పునర్నిర్మాణకాలంలో ఇలాంటి వైఖరి మనదేశాన్ని వెనుకబడియుండే గతికి పాల్పడజేసేది. మన అభివృద్ధి వేగాన్ని తగ్గించివేసియుండేది. వాస్తవానికి పారిశ్రామికాభివృద్ధి వేగాన్ని కుంటుపరచి తగ్గించివేయాలనీ, ఆవిధంగా ఉత్పత్తి బాధ్యతను "ప్రవీణుల"మీద పారవేసి తాము "కులాసాగా కాలంగడపాలనీ" కమ్యూనిస్టు పారిశ్రామిక నిర్వాహకవర్గంలోని ఒకభాగం, తలుస్తూవుండేది. వారి ఈ రహస్యకోర్కెకు ఒక ముసుగుగా పైన వివరించిన నిర్లక్ష్యవైఖరి ఉపయోగపడింది.

కమ్యూనిస్టు పారిశ్రామికనిర్వాహకవర్గాలు తమదృష్టిని టెక్నికల్ విషయాల మీదకు మరల్చాలి. టెక్నిక్ అంటే అభి

రుచిని అలవరచుకోవాలి. ఆధునిక టెక్నిక్‌లో ప్రాముఖ్యత సంపాదించుట బోల్షివిక్ పారిశ్రామిక నిర్వాహకవర్గాలకు చాలా అవసరమని వాటికి నిరూపించాలి. లేక పోయినట్లయితే మనదేశాన్ని, వెనకబడటం, స్థంభించి పోవటం అనే దుస్థితికి గురిజేసిన వారమవుతాం.

ఈ సమస్యను పరిష్కరించనిదే అభివృద్ధి అసాధ్యం.

1931 ఫిబ్రవరిలో పారిశ్రామిక యజమానుల మొదటి సభలో కామ్రేడ్ స్టాలిన్ ఇచ్చిన ఉపన్యాసం ఈ సందర్భంలో అత్యంత ప్రధానమైనది.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"టెంపోను (వేగాన్ని) కాస్తతగ్గించడమూ, పురోగమనానికి అడ్డుపెట్టడమూ సాధ్యంకాదా అని ఒక్కొక్కసారి ప్రశ్నించుతున్నారు. లేదు. కామ్రేడ్స్! అదిసాధ్యంకాదు. టెంపోను తగ్గించవీల్లేదు... టెంపోను తగ్గించటమంటే వెనకబడటం. వెనకబడ్డవాళ్ళు ఓడిపోకతప్పదు. కాని మనం ఓడిపోవడానికి ఇష్టపడం. ఔను. ఓడిపోనిరాకరించుతాం!"

వెనకబడి వుండటంవల్ల అభివృద్ధి శూన్యతవల్ల రష్యా వరుసగా అపజయాలను పొందడం రష్యా పాత చరిత్రలో ఒక ముఖ్యలక్షణం. మంగోల్ ఖానులు మన దేశాన్ని ఓడించారు. టర్కిష్ 'బే'లు (ప్రభువులు) ఓడించారు. స్వీడిష్ భూస్వామ్య ప్రభువులు ఓడించారు. పోలిష్, లిథూనియన్ భూస్వాములు ఓడించారు. బ్రిటిష్, ఫ్రెంచి పెట్టుబడిదారులు ఓడించారు. జపాన్ రాచప్రభువులు ఓడించారు. ఇలా అందరూ మన

దేశాన్ని ఓడించుతూ వచ్చారు - ఎందువల్ల? అది వెనకబడి ఉండటంవల్ల.

"అభివృద్ధిచెందిన దేశాలకంటె మనం యాభై లేక వందేండ్లు వెనుకబడిఉన్నాం. మనం పదేండ్లలో యీదూరాన్ని అధిగమించాలి. మనం ఇలా చెయ్యానన్నా చేయాలి. లేదా వారి చేతిలో నాశనమైనా కావాలి.

"అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలకూ మనకూ ఉన్న అంతరాన్ని పదేండ్లలో ఏమయినాసరే మనం అధిగమించాలి. ఇందుకు మనకు "భౌతిక" (Objective) అవకాశాలన్నీ వున్నాయి. మనకు లేనిదల్లా ఈ అవకాశాలను సరిగా ఉపయోగించుకొనే సామర్థ్యమే. అదిమనమీదే ఆధారపడివుంది మనమీద మాత్రమే అని జ్ఞాపకం ఉంచుకోండి. ఈ అవకాశాలను ఉపయోగించుకొనుట ఈ పాటికి మనం నేర్చుకొని ఉండవలసింది. ఉత్పత్తిలో జోక్యం కలుగజేసుకోరాదనే చచ్చువిధానాన్ని ఈపాటికి అంతమొందించి యుండవలసింది. ప్రస్తుత పరిస్థితులకు అవసరమైన నూతనవిధానాన్ని, ప్రతివిషయంలోను శ్రద్ధకలుగజేసుకొనే విధానాన్ని అవలంబించవలసిన సమయమిదే. నీవొక ఫ్యాక్టరీ యజమాని అయినట్లయితే ఫ్యాక్టరీ వ్యవహారాలన్నింటి లోను శ్రద్ధతీసుకో. ప్రతి విషయాన్ని పరిశీలించు. ఏదీ నీకంటపడకుండా తప్పించుకు పోనీయకు. తిరిగితిరిగి నేర్చుకో. బోల్షివిక్కులు టెక్నిక్‌లో ప్రావీణ్యతను గడించాలి. బోల్షివిక్కులు తామే "ప్రవీణులు" కావలసిన సమయమిది. పునర్నిర్మాణ కాలంలో టెక్నికే అన్ని

టికీ కీలకం." (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో- 1947, 335, 358 పేజీలు)

కామ్రేడ్ స్టాలిన్ ఉపన్యాసంయొక్క చారిత్రక ప్రాముఖ్యత ఈక్రింది విషయాలలో వుంది. కమ్యూనిస్టు పారిశ్రామిక నిర్వాహకవర్గాలు టెక్నిక్‌పట్ల అవలంబించిన నిర్లక్ష్య వైఖరిని అది తుదముట్టించింది. టెక్నిక్ సమస్యను వారు ఎదుర్కొనేటట్లు చేసింది. బోల్షివిక్కులు తామే టెక్నిక్‌లో ప్రావీణ్యతను సంపాదించటానికి సాగించిన పోరాటంలో ఒక కొత్త దశను ప్రారంభించింది. తద్వారా ఆర్థిక పునర్నిర్మాణ కార్యం అభివృద్ధిచెందటానికి సహాయపడింది.

ఆనాటినుండి టెక్నికల్ విజ్ఞానం బూర్జువా "ప్రవీణుల" గుత్తసొత్తు కావడం మానివేసింది. బోల్షివిక్కు పారిశ్రామిక కార్యనిర్వాహక వర్గాలకు ప్రధానంగా అవసరమయిన విషయంగా మారింది. "ప్రవీణులు" అనేమాట అగౌరవపదంగా చూడబడటం పోయింది. టెక్నిక్‌లో ప్రావీణ్యతను సంపాదించిన బోల్షివిక్‌లకు గౌరవప్రదమైన బిరుదుగా ఆ పదం మారింది.

ఆనాటినుండి టెక్నికల్ ప్రావీణ్యత సంపాదించి పరిశ్రమలు నడపగలిగిన కమ్యూనిస్టు "ప్రవీణులు" వేలాదివేలుగా తలయెత్తక తప్పదు. వాస్తవంగా అలా తయారయ్యారు కూడా.

వీరంతా నూతన మేధావివర్గం. సోవియట్ టెక్నికల్ మేధావివర్గం. కార్మికవర్గంనుండి, రైతాంగంనుండి ఉదయించిన మేధావివర్గం. మన పరిశ్రమలను నిర్వహించుటలో వారే ప్రధాన శక్తిగా తయారయ్యారు.

ఇదంతా ఆర్థిక పునర్నిర్మాణ కార్యాన్ని అభివృద్ధి చేయక తప్పదు. వాస్తవానికి అలా చేసింది కూడా.

పునర్నిర్మాణం ఒక పరిశ్రమకు, రవాణాకు మాత్రమే అంటిపెట్టుకోలేదు. అది వ్యవసాయంలో మరింత తీవ్రవేగంతో అభివృద్ధి అయింది. దానికి కారణం తెలుసుకోడం ఏమంత కష్టంకాదు. ఇతర శాఖలకంటే వ్యవసాయం తక్కువగా మెకనైజ్ చేయబడింది (యంత్రాలు తక్కువగా ఉపయోగించబడ్డాయి). ఆధునిక యంత్రాల అవసరం ఇతర శాఖల కంటె వ్యవసాయంలో ఎక్కువగా ఉంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల సంఖ్య వారం వారం, నెలనెలా పెరుగజొచ్చింది. దానితోపాటు, వేలకొలది ట్రాక్టరను, వ్యవసాయయంత్రాలకు గిరాకీ హెచ్చింది. అందుచేత యిప్పుడు ఆధునిక వ్యవసాయ యంత్రాలను హెచ్చుగా సప్లయిచేయడం అవసరం.

సమిష్టి వ్యవసాయ ఉద్యమంలో మరింత అభివృద్ధి 1931 లో కనిపించింది. ముఖ్యంగా ధాన్యం పండే జిల్లాలలో నూటికి 80 వంతులు రైతుల భూములు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలుగా యేకీకృతం చెయ్యబడ్డాయి. అప్పుడే ఇక్కడ దృఢమైన సమిష్టి వ్యవసాయవిధానం మొత్తంమీద విజయం పొందింది. ధాన్యం పంట తక్కువగా పండే తక్కువ ప్రాముఖ్యంగల జిల్లాలలోను, పారిశ్రామిక పంటలు పండే జిల్లాలలోను, నూటికి 50 వంతులకంటె హెచ్చుగా రైతుల భూములు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేరాయి. ఇప్పటికి అప్పుడే 2 లక్షల సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు, నాలుగువేల ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు ఏర్పడ్డాయి. ఇవన్నీకలిసి దేశం

లోని పంటభూమి మొత్తంలో, మూడింట రెండు వంతు లుండేవి. వ్యక్తిగత రైతులు మూడవవంతు మాత్రమే సాగు చేసేవారు.

గ్రామసీమల్లో సోషలిజానికి ఇది అద్భుతమైన విజయం.

కాని అంతవరకు సమిష్టి వ్యవసాయ ఉద్యమం విస్తరించిందేగాని నైపుణ్యం హెచ్చుగా పెరగలేదు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు సంఖ్యలో హెచ్చుతున్నాయి. జిల్లాజిల్లాకు వ్యాపించుతున్నాయి. కాని సమిష్టి వ్యవసాయ క్షేత్రాల పనిలోగాని వాటిలోని వ్యక్తుల నేర్పరితనంలోగాని దీనికి సరితూగే అభివృద్ధి కనిపించలేదు. ఇందుకు కారణం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు సంఖ్యరీత్యా ఎంత అభివృద్ధి చెందుతున్నాయో, వాటికి తగినట్లుగా, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల లోని తరిఫీదుపొందిన వ్యక్తులూ, నాయకత్వం వహించే కేడర్లూ పెంపొందలేదు. దీని ఫలితంగా కొత్త వ్యవసాయ క్షేత్రాలలోని పని కొన్ని సమయాలలో సంతృప్తికరంగా ఉండేదికాదు. సమిష్టి వ్యసాయ క్షేత్రాలే ఇంకా బలహీనంగా ఉండేవి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు అనివార్యంగా అవసరమైన చదువుకొన్న వ్యక్తులు గ్రామసీమల్లో కొరతగా ఉండడం కూడా ఇంకొక కారణం (లెక్కలు వ్రాసేవాళ్లు, నిల్వ సరుకు మేనేజర్లు, కార్యదర్శులు వగైరా కొరతగా ఉండేవారు). పెద్ద ఎత్తున సమిష్టి వ్యవసాయ పరిశ్రమను నిర్వహించడంలో రైతులకు అనుభవం లేకుండాపోవడంకూడా ఇందుకు కారణం. నిన్నటి వ్యక్తిగత రైతులే ఈనాటి సమిష్టి వ్యవసాయ రైతులు. వారికి చిన్న చిన్న భూఖండాలను వ్యవసాయం చేయటంలోనే

అనుభవముంది. కాని పెద్ద పెద్ద వ్యవసాయ క్షేత్రాలను నిర్వ హించడం తెలియదు. ఈ అనుభవం ఒకరోజులో వచ్చేదికాదు.

అందుచేత ప్రథమదశలోని సమిష్టి వ్యవసాయపు పని తీవ్రమైన లోపాలవల్ల కుంటుపడింది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో పని ఇంకా సరిగా సంఘటితం కాలేదని స్పష్ట మయింది. పనిలో దృఢమైన క్రమశిక్షణ లేదు. అనేక సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ఆదాయాన్ని, పనిచేసిన రోజుల యూనిట్ల సంఖ్యనుబట్టి గాక, కుటుంబంలోని సభ్యుల సంఖ్య ననుసరించి పంచిపెట్టడం జరిగింది. చిత్తశుద్ధిగా కష్టపడి పని చేసిన సమిష్టి వ్యవసాయ రైతులకంటె పని ఎగగొట్టేవారికే తరచుగా ఆదాయం లభించేది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల నిర్వహణలోని యీ లోపాలు దానిసభ్యుల కార్యోత్సాహాన్ని తగ్గించివేశాయి. మంచి అదనుకాలంలో సభ్యులు పనిని యెగ గొట్టిన ఉదాహరణలు అనేకం ఉన్నాయి. శీతకాలం మంచు పడేవరకు పంటలలో కొంత భాగం కోయకుండా వదలి వేయడం జరిగేది. ఒకవేళ కోసినా చాలాధాన్యం పోయేటట్లు అజాగ్రతగా కోయడం జరిగేది. యంత్రాలకు, గుర్రాలకు సాధారణంగా పని అంతటికీ వ్యక్తిగత బాధ్యత లేకపోవడం చేత సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు బలహీనబడి వాటి ఆదా యం తగ్గిపోయింది.

పూర్వపు కులక్‌లు, వారి తొత్తులు సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో ఎలాగో దూరి వాటిలో నమ్మకమైన స్థానాలను అధిష్టించగలిగారు. అలాంటి పరిస్థితి ప్రత్యేకంగా అధ్వా న్నంగా వుంది. పూర్వం కులక్‌లు చాల తరచుగా తమ నెరుగ

నటువంటి జిల్లాలకు వెళ్ళేవారు. బుద్ధిపూర్వకంగా విధ్వంసమూ మోసమూ చేసే ఉద్దేశ్యంతో సమిష్టి వ్యవసాయ క్షేత్రాల లోకి దూరేవారు. ఒక్కొక్కప్పుడు పార్టీ వర్కర్లు, సోవియట్ ఉద్యోగులు అజాగ్రత్తగా ఉండడంవల్ల కులక్‌లు తమ స్వంత జిల్లాల్లో సహితం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోకి చొరబడ గలిగారు. మాజీకులక్‌లు పూర్తిగా తమ ఎత్తుగడలను మార్చి వేయడంవల్ల సమిష్టివ్యవసాయక్షేత్రాలలోకి చొరబడటంసులభ మైంది. వారు ఇంతకు పూర్వం సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను బహిరంగంగా ఎదిర్చిపోరాడారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల లోని ముఖ్య కేడర్లను, అగ్రగాములైన సమిష్టి వ్యవసాయ రైతులను రాక్షసంగా వేటాడారు. క్రూరంగా హత్యచేశారు. వారి ఇండ్లను, గాదెలను తగలబెట్టారు. ఈ పద్ధతుల ద్వారా భయపెట్టి రైతాంగ ప్రజలను సమిష్టి వ్యవసాయ క్షేత్రా లల్లో చేరకుండా నిరుత్సాహపరచగలమని వారు తలచారు.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాలపై వారి బహిరంగ పోరాటం ఇపుడు విఫలమయింది. అందుచే తమ యెత్తుగడ లను వారు మార్చుకొన్నారు. ఇక నిరుపయోగమైన తమ తుపాకులను అవతల పారవేశారు. ఒక్క ఈగను సహితం చంపనటువంటి దౌర్జన్య రహితమైన అమాయక ప్రజల్లాగ నటించసాగారు. సోవియట్‌ను విశ్వాసంతో సమర్థించేవారిలా అభినయించారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోకి రాగానే రహస్యంగా తమ విధ్వంసకచర్యలను కొనసాగించారు. లోపల నుండే సమిష్టి వ్యవసాయక్షేత్రాలను నిర్మాణరహితం చేయ డానికి, పనిలో క్రమశిక్షణను భగ్నంచేయడానికి, పంట లెక్క లను గందరగోళం చేయడానికి, చేసిన పని లెక్కలను గందర

గోళ పరచడానికి ప్రయత్నించారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని గుర్రాలకు బుద్ధిపూర్వకంగా గ్లాండర్స్, మాంజీ (చర్మవ్యాధి) మొదలగు అంటువ్యాధులను సోకించి నాశనం చేయుట ఘాతుకమైన వారి పన్నాగాలలో ఒక భాగం. నిర్లక్ష్యంగా పోషించీ, ఇతర పద్ధతులవలంబించీ ఆ గుర్రాలను పనికిరాకుండా చేయడం కూడా వారి పన్నుగడల్లో ఒక భాగం. ఈ విషయాలలో తరచుగా వాళ్ళు కృతకృత్యులయ్యారు. వారు ట్రాక్టర్లను వ్యవసాయ యంత్రాలను నష్టపరచారు.

కులక్‌లు తరచుగా సమిష్టివ్యవసాయ రైతులను మోసగించగల్గారు. పట్టుపడకుండా విధ్వంసక చర్యలు చేశారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ఇంకా బలహీనంగా ఉండడం వల్లా, వాటిలోని వ్యక్తులు అనుభవం లేనివారగుటవల్లా ఇలా జరిగింది.

కులక్‌ల విధ్వంసక చర్యలను అంతమొందించడానికీ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలను బలపరచటానికీ, కార్యకర్తలను, సలహాలను, నాయకత్వాన్ని వెంటనే వాటికి అందజేయాలి.

బోల్షివిక్ పార్టీ ఇలాంటి సహాయం ఇచ్చింది.

1933 జనవరిలో పార్టీ సెంట్రల్ కమిటీ సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు సేవచేస్తూన్న మెషిన్-ట్రాక్టర్ స్టేషన్లలో రాజకీయ శాఖలను నిర్మించాలని తీర్మానించింది. ఈ రాజకీయ శాఖలలో పనిచేయడానికీ, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో సహాయపడటానికీ, గ్రామ సీమలకు దాదాపు 17 వేల పార్టీ వర్కర్లు పంపబడ్డారు.

ఈ సహాయం వలన చాలా మంచిఫలితాలు జరిగాయి.

రెండేండ్లలో (1933 - 34) మెషిన్ - ట్రాక్టర స్టేషన్లలోని రాజకీయ శాఖలు, సమిష్టి వ్యవసాయదారుల ఉత్సాహవంతమైన సంఘాన్ని నిర్మించాయి. ఆ క్షేత్రాల పని లోని లోపాలను తొలగించి సుస్థిరపరచాయి. వాటినుండి శత్రువులగు కులక్‌లనూ, విధ్వంసకారులనూ పారద్రోలాయి.

రాజకీయ శాఖలు తమ కర్తవ్యాన్ని శ్లాఘనీయంగా నిర్వర్తించాయి. నిర్మాణవిషయంలోనూ, సామర్థ్యంవిషయం లోనూ కూడా రెండువిధాలా సమిష్టి వ్యవసాయక్షేత్రాలను తర్ఫీదుచేశాయి. వాటి నిర్వహణను అభివృద్ధిచేశాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల సభ్యుల రాజకీయ స్థాయిని హెచ్చించాయి.

అఖిల సోవియట్ సమిష్టి వ్యవసాయ మేటిపనివాగల (షాక్‌వర్కరు్స) మొదటి కాంగ్రెస్ 1933 ఫిబ్రవరిలో జరిగింది. ఇందులో కామ్రేడ్ స్టాలిన్ ఉపన్యసించాడు. ఈ ఘటనలు సమిష్టి వ్యవసాయక్షేత్రాలను దృఢపరచుటలోను, వాటి సభ్యులను ఉత్సాహాన్నిచ్చుటలోను అత్యంత ప్రాముఖ్యత వహించాయి.

గ్రామసీమలలో పూర్వ వ్యవసాయ పద్ధతికి నేటి కొత్త సమిష్టి పద్ధతికి భేదాన్ని తెలియజేస్తూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"పాతవిధానంకింద రైతులు ప్రతిఒక్కరూ ఒంటరిగా పనిచేసేవారు. తమ తాత ముత్తాతలు అవలంబించిన ప్రాచీన పద్ధతులను అనుసరించేవారు. పాతబడ్డ శ్రామిక సాధనాలను

ఉపయోగించేవారు. భూస్వాముల కోసం, పెట్టుబడిదారుల కోసం, కులక్ కోసం, లాభాలు గుంజేవారికోసం వారుపనిచేసే వారు. ఇతరులకు భోగభాగ్యాలు సమకూరుస్తూ తాము కటిక దరిద్రంతో జీవించేవారు. నూతన సమిష్టి వ్యవసాయ పద్ధతి కింద రైతులు, ఉమ్మడిగా సహకారంతో ట్రాక్టర్లు, వ్యవసాయ యంత్రాలు మొదలగు ఆధునిక సాధనాల సహాయంతో పనిచేస్తున్నారు. వారు తమకోసం, తమ సమిష్టి వ్యవసాయ క్షేత్రాల కోసం పనిచేస్తున్నారు. పెట్టుబడిదారులు, భూస్వాములు, కులక్‌లు, లాభాలుగుంజేవారు లేకుండా జీవిస్తున్నారు. దినదినానికి తమసంస్కృతి యోగక్షేమాల స్థాయిని హెచ్చించే లక్ష్యంతో పని చేస్తున్నారు. (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947 - 443 పేజీ)

సమిష్టి వ్యవసాయ మార్గాన్ని అవలంబించినందువల్ల రైతులు సాధించిన దేమిటో తన ఉపన్యాసంలో కామ్రేడ్ స్టాలిన్ తెలియజేశాడు. లక్షలాది బీద రైతులను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో చేర్పించి, కులక్‌ల బానిసత్వంనుండి బోల్షివిక్ పార్టీ తప్పించింది. సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో మంచి భూములున్నాయి. వాటి ఆధీనంలో చక్కని ఉత్పత్తి సాధనాలున్నాయి. అలాంటి సమిష్టి వ్యవసాయక్షేత్రాలలో ఇదివరకు కటిక దరిద్ర జీవితం గడిపిన లక్షలాది బీదరైతులు చేరిన ఫలితంగా మధ్యతరగతి రైతుల స్థాయికి పోయారు. జీవన భద్రత చేకూరింది.

సమిష్టి వ్యవసాయక్షేత్రాల అభివృద్ధిలో ఇది మొదటి విజయం. ఇది మొదటి మెట్టు.

సమిష్టి వ్యవసాయ రైతులను అనగా మాజీ బీదరైతులను, మధ్యతరగతి రైతులను మరింత ఉన్నత స్థాయికి తీసికొని పోవటం, సమిష్టి వ్యవసాయదారు లందరిని సౌభాగ్యవంతులను చేయుటం, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలన్నింటినీ బోల్షివిక్కు వ్యవసాయ క్షేత్రాలుగా చేయటం రెండవ మెట్టని కామ్రేడ్ స్టాలిన్ చెప్పాడు.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు.

"సమిష్టి వ్యవసాయదారులు సంపన్న వంతులు కావాలంటే ఒకే ఒక విషయం అవసరం. అది సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలో వారు చిత్తశుద్ధిగా పనిచేయడం, ట్రాక్టరను, యంత్రాలను, దుక్కి పశువులను తగు సామర్థ్యంతో ఉపయోగించుకోవాలి. భూమిని సమర్థతతో సాగుచేసుకొని, సమిష్టి వ్యవసాయక్షేత్రాల ఆస్తిని ఆప్యాయతతో కాపాడుకోవాలి."

(పై గ్రంథమే 448 వ పేజీ)

లక్షలాది సమిష్టి వ్యవసాయ రైతులలో కామ్రేడ్ స్టాలిన్ ఉపన్యాసం గాఢమైన సదభిప్రాయం కల్గించింది. అది సమిష్టి వ్యవసాయక్షేత్రాలకు దైనందినకార్యక్రమ సూచికగా మారింది.

**1934** సంవత్సరాంతంనాటికి సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు బలిష్టమై అజేయమైన శక్తిగా తయారయ్యాయి. వాటిలోకి సోవియట్ యూనియన్‌లోని రైతాంగ కుటుంబాలలో నూటికి 75 వంతులు చేరాయి. పంటపండే ప్రదేశంలోని రైతాంగ కుటుంబాలలో నూటికి తొంభై వాటిలో చేరాయి.

1934 లో అప్పటికే సోవియట్ గ్రామసీమలలో 2 లక్షల 81 వేల ట్రాక్టర్లు, 32 వేల హార్వెష్టర్ల కంబైన్లు (పంటకోసం కోసి నూర్చే యంత్రాలు) ఉన్నాయి. ఆసంవత్సరం వసంతకాలంలో విత్తనాలు వేయడం 1933 కంటే పదిహేను లేక ఇరవై రోజులు ముందే పూర్తి అయింది. 1932 కంటే 30 లేక 40 రోజులు ముందే అయిపోయింది. ఇక ప్రభుత్వానికి ధాన్యం అప్పజెప్పే పథకం 1932 కంటే మూడునెలల ముందే పూర్తి అయింది.

కార్మిక కర్షక ప్రభుత్వమూ, పార్టీ ఇచ్చిన అత్యద్భుత సహాయఫలితంగా సమిష్టి వ్యవసాయక్షేత్రాలు రెండేండ్లలో ఎంత దృఢంగా నిలదొక్కుకొన్నాయో ఇది తెలియజేస్తుంది.

సమిష్టి వ్యవసాయపద్ధతియొక్క ఈ దృఢమైన విజయమూ, తత్ఫలితంగా వ్యవసాయంలో వచ్చిన అభివృద్ధి ఫలితంగా సోవియట్ ప్రభుత్వం ఆహారపదార్థాలపైన ఇతర పదార్థాలపైనా రేషనింగును రద్దుచేసింది. ఆహారపదార్థాలను ఎట్టి పరిమితిలేకుండా కొనుటకు అనుమతించింది.

తాత్కాలికంగా నియమింపబడిన మెషిన్ ట్రాక్టర్ల స్టేషనులోని రాజకీయశాఖలపని పూర్తి అవడంచేత, సెంట్రల్ కమిటీ వాటిని వారి వారి స్థానికప్రాంతాలలోని జిల్లా పార్టీ కమిటీలతో కలిపివేసి మామూలు పార్టీసంఘాలుగా మార్చి వేయాలని నిశ్చయించింది.

వ్యవసాయంలోను, పరిశ్రమలలోనూ ఈ విజయాలన్నీ పంచవర్ష ప్రణాళిక విజయవంతంగా పూర్తి అవడంవల్ల సాధ్యమయ్యాయి.

1933 ప్రారంభం నాటికి ప్రథమ పంచవర్ష ప్రణాళిక నిర్ణీతకాలానికి ముందుగానే, అంటే నాలుగేండ్ల మూడు నెలల్లోనే, పూర్తిఅయినట్లు స్పష్టమయింది.

ఇది సోవియట్‌యూనియన్ యొక్క కార్మికవర్గ రైతాంగాలకు అద్భుత చరిత్రాత్మకవిజయం.

1933 జనవరిలో జరిగిన సెంట్రల్‌కమిటీయొక్క, పార్టీ సెంట్రల్‌కంట్రోల్ కమిషన్ యొక్క సర్వసభ్య సమావేశంలో రిపోర్టునిస్తూ ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఫలితాలను కామ్రేడ్ స్టాలిన్ సమీక్షచేశాడు. ప్రథమ పంచవర్ష ప్రణాళికను పూర్తి చేసిన కాలంలో పార్టీ, సోవియట్‌ప్రభుత్వమూ యీ కింది ప్రధాన ఫలితాలను సాధించిందని ఆ రిపోర్టు స్పష్టపరచింది.

(ఎ) వ్యవసాయక దేశంనుండి పారిశ్రామిక దేశంగా సోవియట్‌యూనియన్ మారింది. దేశం ఉత్పత్తి మొత్తంలో పారిశ్రామిక ఉత్పత్తినంతు నూటికి 70 పాళ్ళు హెచ్చింది.

(బి) పారిశ్రామిక రంగంలో సోషలిస్టు ఆర్థికవిధానం పెట్టుబడిదారీ వ్యక్తులను తొలగించివేసింది. పరిశ్రమలలో సోషలిస్టు ఆర్థికవిధాన మొక్కటే నిలచిపోయింది.

(సి) వ్యవసాయక రంగంలో కులక్కులనే ఒక వర్గంగా లేకుండా సోషలిస్టు ఆర్థికవిధానం ప్రాబల్యశక్తిగా తయారయింది.

(డి) సమిష్టివ్యవసాయ విధానం గ్రామసీమల్లో దారిద్ర్యాన్ని, లేమిని, అంతమొందించింది. కోట్లకొలది బీద రైతులకు జీవనభద్రత చేకూరింది.

(ఇ) సోషలిస్టువిధానం పరిశ్రమలలో నిరుద్యోగాన్ని రద్దుచేసింది. అనేక పారిశ్రామిక శాఖలలో దినానికి 8 గంటలు పనిచేయించుతూనే అత్యధిక పారిశ్రామిక వృత్తులలో 7 గంటల పని ప్రవేశపెట్టింది. అనారోగ్యకరమైన వృత్తులలో దినానికి 6 గంటలపనిని ప్రవేశపెట్టింది.

(ఎఫ్) జాతీయ ఆర్థికవిధాన శాఖలన్నిటిలోనూ సోషలిస్టు విజయం, మానవుణ్ణి మానవుడు దోపిడీచేసే పద్ధతి రద్దు చేసింది.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక విజయాలవలన ఏతావాతా సారాంశం ఏమంటే:— దోపిడీ భారాన్నుండి కార్మికులను, రైతులను అవి పూర్తిగా విముక్తి చేశాయి. సోవియట్ యూనియన్‌లోని కష్టజీవులందరికీ సంపదవంతమైన సంస్కృతీ భూయిష్టమైన జీవితానికి దారి సుగమం చేశాయి.

1934 జనవరిలో పార్టీ 17 వ కాంగ్రెస్ జరిగింది. దానికి 18 లక్షల 74 వేల 488 పార్టీసభ్యులకు, 9 లక్షల 35 వేల 298 కాండిడేటు సభ్యులకు ప్రాతినిధ్యం వహించిన ప్రతినిధులు వచ్చారు. ఈ ప్రతినిధులలో 1225 మందికి ఓటింగు హక్కువున్నది. 736 మందికి చర్చించే హక్కువుంది కాని వోటింగుహక్కు లేదు.

గత కాంగ్రెస్ నుండి పార్టీ చేసిన పనిని ఈ కాంగ్రెస్ సమీక్షించింది. ఆర్థిక, సాంస్కృతిక జీవిత శాఖలన్నిటిలోను సోషలిజం సాధించిన నిశ్చిత విజయాలను అది గమనించింది. యావత్తు రంగంలోను పార్టీ సాధారణపోకడ విజయం పొందినట్లు గుర్తించింది.

చరిత్రలో "పార్టీ 17వ కాంగ్రెస్ విజేతల కాంగ్రెస్‌గా" ప్రసిద్ధికెక్కింది.

సెంట్రల్ కమిటీ పనినిగురించి రిపోర్టునిస్తూ యీసమీాక్షా కాలంలో సోవియట్ యూనియన్‌లో జరిగిన ప్రధానమైన మార్పులను కామ్రేడ్ స్టాలిన్ పేర్కొన్నాడు.

"ఈ కాలంలో సోవియట్ యూనియన్ పూర్తిగా రూపాంతరం చెందింది. వెనకబడివుండటం, మధ్యయుగాల పరిస్థితి అనే బెరడును తోసిపారవేసింది. వ్యవసాయక దేశమైన అది పారిశ్రామిక దేశంగా మారింది. చిన్నచిన్న వ్యక్తిగత, రైతుల వ్యవసాయం పోయింది. పెద్దయెత్తున యంత్రాల నుపయోగించే సమిష్టి వ్యవసాయదేశంగా మారింది. అజ్ఞానం, అవిద్య, సంస్కృతీ లేని స్థితినుండి విద్యాసంస్కృతులతో కూడిన దేశంగా మారింది – లేక మారుతూంది.

"సోవియట్ యూనియన్‌లోని వివిధజాతులు తమతమ భాషలలోనే బోధచేసేటటువంటి ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత పాఠశాలలు అంతటా వ్యాపించాయి." (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీష్ ఎడిషన్, మాస్కో 1947, 470 పేజీ)

ఈ సమయానికి దేశపరిశ్రమలలో నూటికి 99 పాళ్ళు సోషలిస్టు పరిశ్రమలే. సోషలిస్టు వ్యవసాయం అనగా సమిష్టి వ్యవసాయక్షేత్రాలలోను, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలలోను సాగయ్యే వ్యవసాయం మొత్తంపంట భూమిలో నూటికి 90 పాళ్ళవరకు విస్తరించింది. ఇక వర్తకవిషయం: ఆరంగం నుండి పెట్టుబడిదారీ వ్యక్తులు పూర్తిగా తొలగించబడ్డారు.

నూతన ఆర్థికవిధానాన్ని (N. E. P.) ప్రవేశపెట్టి నప్పుడు మనదేశంలో ఐదురకాల సామాజిక, ఆర్థికవిధానా లున్నాయని లెనిన్ అన్నాడు.

మొదటిది : పితృస్వామిక ఆర్థికవిధానం. (కుటుంబంలో తండ్రి యాజమాన్యం ఉంటుంది. దీనికిసంబంధించిన ఆర్థికవిధా నమే పితృస్వామికము – అనువాదకుడు) దీనిలో ఎక్కువగా సహజ ఆర్థికరూపమే వుంటుంది. అనగా దాదాపు దీనిలో వర్తకమనేది ఉండదు. రెండవది : చిన్నసరుకుల ఉత్పత్తి విధానం. తమ వ్యవసాయ ఉత్పత్తిని అమ్ముకొనే వ్యవసాయ క్షేత్రాలలోని అధికసంఖ్యాక ప్రజలు, చేతిపనివారు యీ విధా నాన్ని ప్రతిబింబిస్తారు. నూతన ఆర్థికవిధానంలోని మొదటి సంవత్సరాలలో ఈ ఆర్థిక స్వరూపం అధికసంఖ్యాక ప్రజలలో వ్యాపించింది. మూడవది : ప్రయివేటు పెట్టుబడిదారీ విధానం. నూతన ఆర్థికవిధాన ప్రాథమికదశలో ఇది తిరిగి తలయెత్తడం ప్రారంభించింది. నాల్గవది : ప్రభుత్వ పెట్టుబడిదారీ విధానం. ఇది ముఖ్యంగా ఇతరులకు సౌకర్యాలు (కన్సెషన్స్) ఇచ్చే రూపంలోవుంది. అయితే ఇది అంతగా పెంపొందలేదు. ఐద వది : సోషలిజం. ఇంకా బలహీనంగాఉన్న సోషలిస్టు పరిశ్రమ, నూతన అర్థికవిధాన ప్రారంభంలో ఆర్థికంగా అప్రాముఖ్యంగా ఉన్న సమిష్టి వ్యవసాయక్షేత్రాలు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు ఆకాలంలో బలహీనంగావున్న ప్రభుత్వ వర్తక సహకారసమితులు – ఇవన్నీ ఇందులో జేరతాయి.

ఈ స్వరూపాలన్నిటిలోనూ సోషలిస్టు స్వరూపం పైచేయి సంపాదించాలని లెనిన్ అన్నాడు.

సోషలిస్టు ఆర్థికరూపాలకు సంపూర్ణవిజయం సమకూర్చే ఉద్దేశంతో నూతన ఆర్థికవిధానం ప్రవేశపెట్టబడింది.

పార్టీ 17 వ కాంగ్రెస్ నాటికే ఈ ఆశయం సాధించబడింది.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"ఇప్పుడు పైనచెప్పిన సామాజిక ఆర్థిక స్వరూపాలలో మొదటిది, మూడవది, నాల్గవది లేదని చెప్పవచ్చు. రెండవ ఆర్థిక స్వరూపం అప్రాముఖ్య స్థానానికి నెట్టివేయబడింది. పోతే, ఐదవ సామాజిక ఆర్థికస్వరూపానికి అనగా సోషలిస్టు స్వరూపానికి ఎదురులేదు. జాతీయ ఆర్థికవిధానం అంతటిలోనూ ఏకైక అధికారశక్తిగా ఇది తయారయింది." (పైగ్రంథమే 472 వ పేజీ)

కామ్రేడ్ స్టాలిన్ తనరిపోర్టులో సిద్ధాంత - రాజకీయ నాయకత్వ సమస్యకు ప్రముఖస్థానం ఇచ్చాడు. పార్టీశత్రువులు, అవకాశవాదులు, పెడమార్గం బట్టిన అన్ని రకాల జాతీయవాదులు ఓడిపోయినా, వారిసిద్ధాంత అవశేషాలు ఇంకా కొందరి పార్టీసభ్యుల మనస్సులలో మిణుకుమిణుకుమంటూనే ఉన్నాయి. అప్పుడప్పుడు అవి బయటపడుతున్నాయని కామ్రేడ్ స్టాలిన్ పార్టీని హెచ్చరించాడు. ఆర్థికరంగంలోను, ముఖ్యంగా ప్రజల మనస్సులలోను పెట్టుబడిదారీ చిహ్నాలు మిగిలి ఉన్నాయి. ఓడిపోయిన లెనినిస్టు వ్యతిరేక ముఠాల సిద్ధాంతం తిరిగి తలయెత్తడానికి ఇవి అనుకూలమైన క్షేత్రంగా ఉపయోగపడతాయి. ప్రజల మనస్తత్వాభివృద్ధి తమ ఆర్థికస్థితితో బాటు అడుగువేయదు. దీని ఫలితంగా ప్రజల

మనస్సులలో బూర్జువా అభిప్రాయాల అవశేషాలు ఇంకా మిగిలివుండి ఆర్థికరంగంలో పెట్టుబడిదారీ విధానం రద్దయి నప్పటికీకూడా కొనసాగుతుంటాయి. ఇంకా మరొక విషయం మనం గుర్తుంచుకోవాలి. మనం ఎల్లప్పుడూ దేనికి వ్యతిరేకంగా తుపాకిని సంసిద్ధపరచి వుంచాలో, అట్టి మన చుట్టూవున్న పెట్టుబడిదారీ ప్రపంచం ఈ అవశేషాలను పునరుద్ధరించి పోషించటానికి ప్రయత్నిస్తుంది.

జాతీయసమస్యపై ముఖ్యంగా పాతుకొనియున్న ప్రజల మనస్సులలోని పెట్టుబడిదారీ అవశేషాలను గురించి కూడా కామ్రేడ్ స్టాలిన్ చర్చించాడు. మహారష్యా అనే జాతీయ దురహంకార పెడమార్గానికి వ్యతిరేకంగాను, స్థానిక జాతీయ అనే పెడమార్గానికి వ్యతిరేకంగా, రెండురంగాలలోను బోల్షివిక్ పార్టీ పోరాడుతోంది. అనేకరిపబ్లిక్కులలో (యుక్రెయిన్, బైలోరష్యా మొదలయినవి) పార్టీసంస్థలు స్థానిక జాతీయ వాదానికి వ్యతిరేకంగా పోరాటాన్ని సడలించాయి. చివరకది శత్రుశక్తులతో దురాక్రమణశక్తులతో కలిసేవరకు పెరగ నిచ్చాయి. ఆవిధంగా అది ప్రభుత్వానికి ప్రమాదకరమయింది. జాతీయసమస్యపై ఈ రెండు పెడమార్గాలలో ఏది ఎక్కువ అపాయకరం అనే ప్రశ్నకు సమాధానంగా కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"మనం దేనిపై పోరాటాన్ని మానివేసి ప్రభుత్వానికి అపాయకరంగా పరిణమించేదాక పెరగనిచ్చామో ఆ పెడ మార్గమే ప్రధానంగా అపాయకరమైంది." (పై గ్రంథమే. 507 వ పేజీ)

సిద్ధాంత - రాజకీయ కార్యకలాపంలో పార్టీ ఎక్కువ ఉత్సాహంగా ఉండాలని కామ్రేడ్ స్టాలిన్ ఆదేశించాడు. ప్రతికూలవర్గ సిద్ధాంతాన్ని, సిద్ధాంత అవశేషాలనూ, లెనిని జానికి ప్రతికూల ధోరణులను నిరంతరం బయటపెట్టాలని కామ్రేడ్ స్టాలిన్ కోరాడు.

తన రిపోర్టులో కామ్రేడ్ స్టాలిన్ మరొక విషయాన్ని కూడ తెలియజేశాడు. సరియైన నిర్ణయాలు చేసినంతమాత్రాన విజయం గ్యారంటీగా వస్తుందని తలచగాదు. విజయం గ్యారంటీ సరియైన స్థానంలో సరియైనవ్యక్తులను నియమించడం అవసరం. నాయకసంఘాల నిర్ణయాలను వీరు అమలుపెట్ట గలిగియుండాలి. నిర్ణయాలను నిర్వర్తించుటలో ఎప్పటికప్పుడు తనిఖీ చేసేవారుగా వుండాలి. ఇట్టి నిర్మాణపద్ధతులు కనుక లేకపోతే నిర్ణయాలన్నీ దైనందిన జీవితంనుండి విడిపోయి కాగితాలతుక్కుగా ఉండిపోయే ప్రమాదంవుంది. లెనిన్ యొక్క ప్రఖ్యాతమైన ఈక్రింది ప్రవచనాన్ని దీనికి బలంగా కామ్రేడ్ స్టాలిన్ పేర్కొన్నాడు. సంఘటన కార్యకలాపంలో ముఖ్యమైన విషయం ఎలాంటి వ్యక్తులను ఎన్నుకోవాలి. నిర్ణయాలను నిర్వర్తించుటలో తనిఖీ వుంచాలి అనేదే యీ ప్రవచనం. అవలంబించిన తీర్మానాలను, వాటిని ఆచరణలో పెట్టే నిర్మాణకార్యకలాపానికి తారతమ్యం ఉండ రాదని స్టాలిన్ అన్నాడు. ఆ తీర్మానాలను పూర్తిచేశారా, లేదా ? అని తనిఖీ చేయకపోవడం మన దైనందిన కార్యంలో ముఖ్యమైన దోషమని కామ్రేడ్ స్టాలిన్ తెలియజేశాడు.

ప్రభుత్వ నిర్ణయాలను, పార్టీ నిర్ణయాలను నిర్వర్తించుటలో సమర్థమైన అజమాయిషీ వుంచడానికిగాను పార్టీ 17 వ కాంగ్రెస్ సో. యూ. క. (బో) పార్టీ సెంట్రల్ కమిటీ ఆధ్వర్యాన ఒక పార్టీ కంట్రోల్ కమిషన్‌ను నెలకొల్పింది. సెంట్రల్ కంట్రోలుకమిషన్, కార్మిక, కర్షక అజమాయిషీ సంఘం - ఈ రెండిటి సంయుక్త సంఘం స్థానే సోవియట్ యూనియన్ ప్రజామంత్రి మండలి (కౌన్సిల్ ఆఫ్ పీపుల్స్ కమిస్సార్) ఆధ్వర్యాన సోవియట్ కంట్రోల్ కమిషన్‌ను నెలకొల్పింది. పార్టీ 12 వ కాంగ్రెస్ నెలకొల్పిన పై సంయుక్త సంఘం తన కర్తవ్యాలను పూర్తి చేసింది కనుక దానిని రద్దు చేసింది.

నూతనదశలో పార్టీ నిర్మాణ కర్తవ్యాలను ఈ క్రింది విధంగా కామ్రేడ్ స్టాలిన్ సూత్రీకరించాడు:

(1) పార్టీ రాజకీయపోకడ అవసరాలకు అనుగుణ్యంగా మన నిర్మాణ కార్యకలాపాన్ని మార్చాలి.

(2) రాజకీయ నాయకత్వస్థాయికి నిర్మాణనాయకత్వం వృద్ధి చెందాలి.

(3) పార్టీ తీర్మానాలను, రాజకీయ నినాదాలను జయప్రదంగా నిర్వహించే సంపూర్ణ సామర్థ్యంగల నిర్మాణ నాయకత్వం పెంపొందాలి.

తన ఉపన్యాసాన్ని ముగిస్తూ కామ్రేడ్ స్టాలిన్ పార్టీని ఇలా హెచ్చరించాడు. సోషలిజం అనేక విజయాలను సాధించింది. ఆ విజయాలను గురించి మనం గర్వపడటం న్యాయమే. అయితే విజయాలతో మనం కొట్టుకొనిపోరాదు. మన తలలు "తిరిగి పోరాదు". జోకొట్టబడరాదు.

"...మనం పార్టీని జోకొట్టరాదు, దాని జాగరూకతను మరింత నిశితం చేయాలి. మనం పార్టీని నిద్రపోయేట్లు జోకొట్టరాదు, పైగా దానిని పోరాటానికిసిద్ధపరచాలి; పార్టీని నిరాయుధం చేయరాదు; సాయుధం చేయాలి. రెండవ పంచవర్ష ప్రణాళికను పూర్తి చేయడానికి నిరంతర సమీకరణ స్థితిలో పార్టీని ఉంచాలి. అంతేగాని సమీకరణ లేకుండా ఉంచరాదు" అని కామ్రేడ్ స్టాలిన్ అన్నాడు. (పై గ్రంథమే 517వ పేజీ)

జాతీయ ఆర్థిక సంపదను పెంపొందించడానికి ఏర్పరిచిన రెండవ పంచవర్ష ప్రణాళికను గురించి 17వ కాంగ్రెస్‌లో కామ్రేడ్స్ మాలటోవ్, క్విబిషేవ్‌లు రిపోర్టులిచ్చారు. రెండవ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమం మొదటిదానికంటే చాల విస్తృతమైంది. రెండవ పంచవర్ష ప్రణాళిక ముగిసేనాటికి అనగా 1937 నాటికి పారిశ్రామికోత్పత్తి యుద్ధపూర్వ ఉత్పత్తితో పోల్చితే దాదాపు ఎనిమిదిరెట్లు పెరగాలి. ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో యంత్ర నిర్మాణ పరిశ్రమలలో పెట్టిన పెట్టుబడి 6400 కోట్ల రూబుల్సు. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో దీనిని 13,300 కోట్ల రూబుల్సుకు పెంచాలని నిర్ణయించబడింది. ఇంత విస్తార ప్రమాణంలో కొత్తగా పెట్టుబడి పెట్టడంవల్ల, జాతీయ ఆర్థిక విధానంలోని అన్ని శాఖలను పూర్తిగా టెక్నికల్‌గా పునర్నిర్మించడానికి అవకాశం లభించుతుంది.

రెండవ పంచవర్ష ప్రణాళిక, యంత్ర సహాయంతో వ్యవసాయం చేసే పనిని ప్రధానంగా పూర్తి చేయాలి.

1932 లో ట్రాక్టర్ల హార్స్‌పవర్ 22½ లక్షలు. 1933 లో దానిని 80 లక్షలకు పెంచాలి. ఈ ప్రణాళికలో శాస్త్రీయ వ్యవసాయ పద్ధతులను విస్తృతంగా ఉపయోగించాలని నిర్ణయించబడింది. (సరిగ్గా ఏ పంట తర్వాత ఏ పంటను వేయాలో నిర్ణయించడం, మంచిరకపు విత్తనాలనుపరి ఉపయోగించడం, ఆకురాలు కాలంలో దున్నడం వగైరా).

రవాణా, రహదారుల సాధనాలను టెక్నికల్ గా పునర్నిర్మించడానికి ఒక అద్భుతమైన ప్రణాళిక తయారు చేయబడింది.

రెండవ పంచవర్ష ప్రణాళికలో కార్మికుల కర్షకుల జీవన సాంస్కృతిక స్థాయిని యింకా అభివృద్ధి చేయడానికి విస్తృతమైన కార్యక్రమం వుంది.

17 వ కాంగ్రెస్ ఎక్కువగా తన దృష్టిని నిర్మాణ విషయాలపట్ల కేంద్రీకరించింది. కామ్రేడ్ కగోనోవిచ్ రిపోర్టును పురస్కరించుకొని సోవియట్ల కృషిపైన, పార్టీ కృషిపైన కాంగ్రెసు తీర్మానాలు చేసింది, పార్టీ సర్వసాధారణ పోకడ విజయం పొందింది. పార్టీ విధానం లక్షలాది కార్మికుల, రైతుల అనుభవం అనే పరీక్షలో నెగ్గింది. అందుచేత నిర్మాణ సమస్య యింకా మరింత ప్రాముఖ్యతను సంపాదించింది. రెండవ పంచవర్ష ప్రణాళికలోని నూతనమైన క్లిష్టమైన కర్తవ్యాల వల్ల అన్నిరంగాలలోను ఉన్నతమైన స్థాయి అవసరమయింది.

కాంగ్రెస్ నిర్మాణ సమస్యలపైన చేసిన తీర్మానాలలో ఇలా చెప్పింది : "అన్ని రంగాలలోను పనిని అభివృద్ధిచేయుట, అన్నిటికంటె ప్రప్రథమంగా దైనందిన నిర్మాణనాయకత్వంలో

పనిని అభివృద్ధిచేయుట అనే సమస్యతోపాటు రెండవ పంచవర్ష ప్రణాళికలోని యీ క్రింది ప్రధాన కర్తవ్యాలు మనలను త్వరితంగా నిరంతరం ఎదుర్కొంటున్నాయి. ఆ కర్తవ్యాలివి : పెట్టుబడిదారీ వ్యక్తులను పూర్తిగా ఏరివేయుట, ఆర్థికరంగం లోను, ప్రజల మనస్సుల్లోనూ పెట్టుబడిదారీ అవశేషాలను పోగొట్టుట, ఆధునిక టెక్నికల్ పద్ధతుల మీద జాతీయ ఆర్థిక విధానాన్నంతా పూర్తిగా పునర్నిర్మించుట, నూతన టెక్నికల్ పరికరాలను ఉపయోగించు విధానం నేర్చుకొనుట, నూతన పరిశ్రమలను కనుగొని పనిచేయుట, వ్యవసాయాన్ని యంత్రా లతో నడుపుట, వ్యవసాయ ఉత్పాదకశక్తిని అభివృద్ధిచేయుట" (సో. యూ. క. (బో) పార్టీ తీర్మానాలు, రష్యన్ ఎడిషన్, రెండవ భాగం 591 వ పేజీ)

17 వ కాంగ్రెస్ పాత పార్టీ నిబంధనలకు భిన్నమైన కొత్త నిబంధనలను అవలంబించింది. నిబంధనలకు మొదట ఒక ఉపోద్ఘాతం (ప్రియాంబుల్) కాంగ్రెస్ చేర్చింది. ఈ ఉపోద్ఘా తం కమ్యూనిస్టుపార్టీ అంటే ఏమిటో క్లుప్తంగా నిర్వచించింది. శ్రామికవర్గ పోరాటంలో దాని పాత్రను, శ్రామికవర్గ నియం తృత్వ అంగ నిర్మాణంలో దాని స్థానాన్ని నిర్వచించింది. ఈ కొత్త నిబంధనలు పార్టీ సభ్యుల విధులను వివరంగా ఒక్కొ క్కటిగా తెలియజేశాయి. కొత్త సభ్యులను చేర్చుకొనుటలో మరింత కఠినమైన నిబంధనలు ఏర్పాటుచేబడ్డాయి. సానుభూతిపరుల గ్రూపులను గురించి ఒక క్లాజు చేర్చబడింది. పార్టీ యొక్క సంఘటనా స్వరూపాన్ని గురించి కొత్త నిబంధనలు ఎక్కువ స్పష్టంగా విశదీకరించాయి. పార్టీ కణాలను గురించిన (Nuclei)

నిబంధనలు సరిక్రొత్తగా వ్రాయబడ్డాయి. పార్టీ 17 వ కాంగ్రెస్ నాటినుండి పార్టీ కణాలను ప్రాథమిక సంఘాలని పిలిచారు. పార్టీ అంతర్గత ప్రజాతంత్రాన్ని గురించీ, పార్టీ క్రమశిక్షణను గురించీ నిబంధనలు కూడ సరిక్రొత్తగా వ్రాయబడ్డాయి.

# 4

## రాజకీయ వంచకులుగా బుఖారిన్ వాదులు పతనమొందుట - వంచకులైన ట్రాట్స్కీ వాదులు హంతకులు, గూఢచారులు అయిన వైట్‌గార్డుముఠాగా పతనమొందుట - యస్. యం. కిరావ్‌ను నీచంగా హత్యచేయుట - బోల్షివిక్ జాగరూకతను హెచ్చించడానికి పార్టీ తీసుకొన్న చర్యలు

మనదేశంలో సోషలిజం సాధించిన విజయాలు పార్టీకి కార్మికులకు సమిష్టి వ్యవసాయ దారులకు మాత్రమే గాక మన సోవియట్ మేధావులకు, సోవియట్ యూనియన్‌లోని గౌరవ పౌరులందరికీ సంతోషాన్ని గల్గించాయి.

కాని ఓడిపోయిన పీడక వర్గాల అవశేషాలకు అవి సంతోషాన్ని కల్గించలేదు. పైగా కాలంగడచినకొద్దీ అవి వారిని మరింత రెచ్చగొట్టాయి.

ఓడిపోయిన వర్గాల తొత్తులను, నామ మాత్రంగా మిగిలివున్న బుఖారిన్ ట్రాట్స్కీ అనుచరులను అవి రెచ్చగొట్టాయి.

కార్మికులు, సమిష్టి వ్యవసాయదారులు సాధించిన విజయాలను ఈ పెద్దమనుష్యులు ఇలా అంచనా వేశారు. ప్రతి విజయాన్ని హర్షించిన ప్రజల ప్రయోజన దృష్ట్యా వీరు చూడలేదు. జీవిత వాస్తవికతలతో సంబంధాలన్నీ పోగొట్టుకొనిన వీరు తమ కుళ్ళిపోయిన పనికిమాలిన ముఠాతత్వ ప్రయోజనాల దృష్టితో చూశారు. మనదేశంలో సోషలిజం సాధించిన విజయాలు పార్టీ విధానం సాధించిన విజయాలేఇవి వారి పూర్తి దివాళాకోరు విధానాన్ని తెలియజేస్తున్నాయి. అయినా ఈ పెద్దమనుష్యులు స్పష్టమైన వాస్తవిక విషయాలను అంగీకరించి అందరి ఆశయాలకి కృషిచేయడానికి బదులు తమ అపజయానికీ, దివాళాకోరు తనానికీ పార్టీపైన, ప్రజలపైన పగతీర్చుకొన ప్రారంభించారు. వారు కార్మికుల, సమిష్టి వ్యవసాయదారుల ఆశయానికి విరుద్ధంగా విధ్వంసక చర్యలు, దుష్కృత్యాలు ప్రారంభించారు. గనులను పేల్చివేయుట, ఫ్యాక్టరీలను నిప్పుపెట్టుట, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలలోను సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను విధ్వంసకచర్యలు చేయుట ప్రారంభించారు. వీరి ఉద్దేశం కార్మికుల, సమిష్టి వ్యవసాయ రైతుల విజయాలను నేలపాలుజేసి సోవియట్ ప్రభుత్వంపై ప్రజల అసంతృప్తిని రేకెత్తించాలని, అలా చేస్తూనే తమ చిన్న ముఠాను బయటపడి నాశనంగాకుండా రక్షించుకునేందుకుగాను, పార్టీకి భక్తివిశ్వాసాలు ప్రకటించేవారు. పార్టీని జోహుకుంగాళ్ళవలె పొగిడేవారు. దానిని స్తోత్రించేవారు. దానికి వంగి

వంగి సలాములు చేసేవారు. కాని వాస్తవంలో తమ రహస్య విధ్వంసక చర్యలను కార్మిక కర్షకులను వ్యతిరేకంగా కొనసాగిస్తూ వుండేవారు.

పార్టీ 17 వ కాంగ్రెస్‌లో బుఖారిన్, రైకోవ్, టామ్‌స్కీ (Tomsky) లు పశ్చాత్తాప పడుతూ ఉపన్యాసాలిచ్చారు. పార్టీని పొగడుతూ దాని విజయాలను ఆకాశాని కెత్తివేశారు. కాని కాంగ్రెస్‌వారి ఉపన్యాసాలలోని మోసాన్ని చిత్తశుద్ధి లేకపోవడాన్ని కనిపెట్టింది. ఎందువల్లనంటే పార్టీ తన సభ్యులనుండి కోరేది భట్రాజుపొగడ్తలు, స్తోత్రపాఠాలూ కాదు. సోషలిస్టు రంగంలో చైతన్యయుతంగా పనిచేయడమే కోరుతుంది. కాని చాలకాలంనుండి బుఖారిన్‌వాదులు ఇలాంటి సూచనలేమీ కనబరచలేదు. ఈ పెద్దమనుష్యుల పైపై ఉపన్యాసాలు వాస్తవంలో కాంగ్రెసుకు బయటనున్న తమ అనుచరులకై ఉద్దేశింపబడ్డాయి. మోసంచేయుటలో వారికి ఒక పాఠంగా అవి ఉపయోగించాలనీ, వారు తమ ఆయుధాలను క్రింద పారవేయరాదనీ, బుఖారిన్ మొదలైనవారి ఉపన్యాసాల ఉద్దేశ్యం.

17 వ కాంగ్రెస్‌లో ట్రాట్స్కీ-వాదులైన జినోవీవ్, కామెనివ్‌లుకూడా ఉపన్యసించారు. తమ తప్పులకు రొమ్ములు బాదుకొంటూ నిందించుకొన్నారు. అంతకంటె అధికంగా పార్టీ విజయాలను స్తోత్రపాఠం చేశారు. కాని అపరిశుద్ధమైన కల్లోలపడుతున్న తమ ఆత్మను కప్పిపుచ్చుకోడానికే పార్టీని ఇలా సంపూర్ణంగా పొగడుట, రోత పుట్టించే ఆత్మనిందను పూనుకొనుట సాగించారనీ కాంగ్రెసు గమనించక పోలేదు.

అయినప్పటికీ కాంగ్రెసులో ఈ పెద్దమనుష్యులు రోత పుట్టించే ఉపన్యాసాలు ఇస్తున్నప్పుడు యస్. యం. కిరోవ్ ప్రాణాలను బలిగొనే హంతక పన్నాగం పన్నుతున్నారని పార్టీకి తెలియనూ తెలియదు. అనుమానించనూ లేదు.

1934 డిశంబరు ఒకటవ తేదీన లెనిన్‌గ్రాడ్‌లోని స్మోల్నీలో రివాల్వారు దెబ్బతో యస్. యం. కిరోవ్ నీచంగా హత్య గావించబడ్డాడు.

హంతకుడు వెంటనే దొరికాడు. లెనిన్‌గ్రాడ్‌లో జినోవీవ్‌వాదులతో కూడిన సోవియట్ వ్యతిరేక ముఠా సభ్యులతో నిండియుండే రహస్య విప్లవ ప్రతీఘాత ముఠాలో, ఈ హంతకుడు ఒక సభ్యుడని తేలిపోయింది.

యస్. యం. కిరోవ్‌ను పార్టీ, కార్మికవర్గమూ ఎంతో ప్రేమించింది. అతని హత్య ప్రజలను గాఢంగా కదిలించి వేసింది. దేశమంతా గాఢ విచారమూ, ఆగ్రహావేశమూ వ్యాపించాయి.

పరిశోధనల ఫలితంగా 1933-34 లలో లెనిన్‌గ్రాడ్‌లో రహస్య విప్లవ ప్రతీఘాత దౌర్జన్యవాదుల ముఠా ఒకటి ఏర్పడిందని బయటపడింది. దీనిలో జినోవీవ్ యొక్క ప్రతిపక్షంలోని మాజీసభ్యులు "లెనిన్‌గ్రాడ్ కేంద్రం" అనే ముఠా నాయకత్వంక్రిందచేరారు. ఈముఠాఉద్దేశం కమ్యూనిస్టుపార్టీ నాయకులను హత్యచేయడం. వారి ప్రథమ బలిగా కిరోవ్‌ను ఎన్నుకొన్నారు. ఈ విప్లవ ప్రతీఘాతక ముఠా సభ్యుల సాక్ష్యం వల్ల ఈక్రింది విషయాలు తేలాయి. వీరికి విదేశ పెట్టుబడిదార్

ప్రభుత్వాల ప్రతినిధులతో సంబంధా లున్నాయి. వారినుండి ధనసహాయం పొందుతున్నారు.

ఈ సంస్థలో బయటపడిన సభ్యులకు సోవియట్ యూనియన్ సుప్రీమ్‌కోర్టుయొక్క సైనిక అధికారవర్గం (Collegium) అన్నిటికన్న ఎక్కువయిన శిక్షను - తుపాకితో కాల్చిచంపే మరణశిక్షను - విధించింది.

త్వరలోనే "మాస్కో కేంద్రం" అని పిలువబడే ఒక రహస్య విప్లవ ప్రతీఘాత సంస్థ ఉన్నట్లు కనుగొనబడింది. ప్రాథమిక పరిశోధనలో, విచారణలో ఈక్రింది విషయాలు బయటపడ్డాయి. జినోవీవ్, కామినివ్, యవడోకిమోవ్ మొదలగు ఈ సంస్థ నాయకులు హంతకపాత్రను వహించారు. తమ అనుచరులలో దౌర్జన్యవాద మనస్తత్వాన్ని వ్యాపింప జేయడానికి వీరు పనిచేశారు. సోవియట్ ప్రభుత్వం యొక్క, పార్టీ సెంట్రల్ కమిటీయొక్క సభ్యులను హత్యగావించడానికి కుట్రపన్నారు.

వీరు ఎంతటి వంచకత్వానికి నీచత్వానికీ పాల్పడ్డారో యీ క్రింది విషయం తెలియజేసింది. కిరోవ్ హత్యను ప్రేరేపించి కుట్రపన్నిన వారిలో ఒకడునూ, ఈ హత్యను త్వరగా సాగించమని హంతకుని ప్రేరేపించిన వాడునూ అయిన జినోవీవ్ కిరోవ్‌ను పొగుడుతూ స్మృతివాక్యాలు వ్రాశాడు. అది ప్రచురించాలని కోరాడు.

జినోవీవ్‌వాదులు కోర్టులో తమ అపరాధానికి ఎక్కువ బాధ పడుతున్నట్లు నటించారు. కాని అక్కడకూడ తమ

కపటనాటకాన్ని వదలిపెట్టలేదు. ట్రాట్స్కీతో వారి సంబంధాలను కప్పిపుచ్చుకొన్నారు. ట్రాట్స్కీ-వాదులతో కలిసి తాము ఫాసిస్టు గూఢచారులకు అమ్ముడుబోయిన విషయాన్ని కప్పిపుచ్చారు. తమ విధ్వంసక చర్యలను, గూఢచారి కార్య కలాపాలను కప్పిపుచ్చారు. బుఖారిన్‌వాదులతో తమకుగల సంబంధాలను, ట్రాట్స్కీ- బుఖారిన్‌లు సంయుక్తంగా ఫాసిస్టు తొత్తుల ముఠాగా ఏర్పడ్డ విషయాన్ని దాచివేశారు.

కామ్రేడ్ కిరోవ్ హత్య ట్రాట్స్కీ- బుఖారిన్‌ల ఈ సంయుక్త ముఠా చేసిన పనియని తర్వాత బయటపడింది.

అప్పటికే 1935 లోనే జినోవీవ్ ముఠా, ముసుగు వేసుకొన్న వైట్‌గార్డు సంస్థయని స్పష్టమైంది. ఆ ముఠా సభ్యులను వైట్‌గార్డులవలె పూర్తిగా చూడతగినవారని స్పష్ట మయింది.

మరొక సంవత్సరంపోయిన తర్వాత కిరోవ్ హత్యకు నిజంగా, వాస్తవంగా, స్వయంగా కుట్రపన్నినవారు ట్రాట్స్కీ- జినోవివ్, కామెనివ్ ఇంకా వారితోటి మిత్రులు అని బయట పడింది. సెంట్రల్ కమిటీలోని ఇతర సభ్యులనుకూడ హత్య చేయడానికి వారు సన్నాహాలను చేసినట్లుకూడ బయట బడింది. జినోవివ్, కామెనీవ్, బాకయవ్, యవడోకి మోవ్, పికెల్, ఐ. యన్. స్మిర్నోవ్, మ్రాచ్‌కోవిస్కీ, టెర్ - వాగన్యాన్, రీన్‌గోల్డు మొదలగువారిపై విచారణ ప్రారంభమైంది. సూటిగా సాక్ష్యం బయటపడడం వల్ల కోర్టులో తాము కిరోవ్ హత్యకు కుట్రపన్నుటే గాక ఇతరపార్టీ నాయకులను ప్రభుత్వ నాయకులను హత్యచేయ

డానికి కుట్ర పన్నుతున్నామని బహిరంగంగా అంగీకరించవలసి వచ్చింది. తర్వాత విచారణ ఫలితంగా ఈ హంతకులు గూఢచారి శాఖలో పనిచేస్తున్నారని, ప్రభుత్వ దృష్టిని మరల్చే చర్యను సంఘటిత పరుస్తున్నారని బయటపడింది. వీరు రాజకీయంగాను నైతికంగాను ఎంత అమానుషంగా పతనం చెందారో పార్టీకి విశ్వాసవంతంగా వుంటామనే వారి కపటప్రకటనల చాటున తుచ్ఛద్రోహం, రాక్షసత్వమూ ఎంతవుందో 1936 లో మాస్కోలో జరిగిన విచారణలో బయటపడింది.

ఈ హంతకుల గూఢచారుల ముఠాకు ముఖ్యమైన ప్రేరేపకుడూ సూత్రధారీ, నమ్మకద్రోహి అయిన (జుడాస్) ట్రాట్స్కీ. అతని విప్లవ ప్రతీఘాతక సూచనలను అమలు పరచేది ట్రాట్స్కీ ఏజంట్లూ సహాయకులూ అయిన జినోవీవ్, కామెనివ్‌లూ వారి తొత్తులగు ట్రాట్స్కీ వాదులూ, సామ్రాజ్యవాద దేశాలు సోవియట్ యూనియన్‌పై దాడిచేసే పక్షంలో, దానిని ఓడించడానికి వారు సన్నాహం చేస్తున్నారు. కార్మిక కర్షక ప్రభుత్వాన్ని గురించి వారు అపజయ భీతిని వ్యాపింపజేసే వారయ్యారు. (Defeatists) జర్మన్ జపాను ఫాసిస్టులకు వారు నీచమైన సేవకులుగాను, ఏజంట్లుగాను తయారయ్యారు.

కిరోవ్ దారుణహత్యలో పాల్గొన్న వ్యక్తుల విచారణల నుండి పార్టీసంస్థలు నేర్చుకోవలసిన ముఖ్యపాఠం ఏమిటి? అవి తమ రాజకీయ అజాగరూకతనూ అంతమొందించాలి. పార్టీ సంస్థలు తమ జాగరూకతను పార్టీసభ్యుల అందరి జాగరూకతను హెచ్చించాలి.

కిరోవ్ దారుణహత్యవిషయమై పార్టీ సెంట్రల్ కమిటీ పార్టీ సంస్థలకు పంపిన సర్క్యులర్ లేఖలో ఈ క్రిందివిధంగా తెలియజేసింది.

"(ఎ) మనం బలపడినకొద్దీ శత్రువు మచ్చికైపోతాడని, దాడిని తక్కువచేస్తాడనుకునే తప్పుడు అభిప్రాయంవల్ల పుట్టిన అవకాశవాద ఆత్మసంతృప్తిని మనం తుదముట్టించాలి. మన శత్రువులు నెమ్మదినెమ్మదిగా సోషలిజంలోకి పాకి వస్తారని చివరకు నిజమైన సోషలిస్టులవుతారని మితవాద పెడతోవ అన్నివిధాలా హామీనిస్తుంది. దీని పునర్జన్మయే అవకాశవాద ఆత్మసంతృప్తి. తమ విజయాలతో సంతృప్తిపడి విశ్రాంతి తీసుకోవడం బోల్షివిక్కుల పనిగాదు. తమ స్థానాలలో నిద్రపోవడం వారి పనిగాదు. మనకు కావల్సింది ఆత్మసంతృప్తి కాదు. అతి జాగరూకత. నిజమైన బోల్షివిక్కు విప్లవ జాగరూకత. శత్రువుల పరిస్థితి అధ్వాన్నమయినకొలదీ వారు మరింతఆత్రుతగా "తీవ్రమైనపద్ధతులను" పట్టుకొని వేలాడుతారు. సోవియట్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగించే పోరాటంలో పతనం చెందిన తమకు ఇది ఒక్కటేమార్గమని వారు భావించుతారు. ఈ విషయాన్ని మనం గుర్తుపెట్టుకొని జాగరూకులమై ఉండాలి.

"(బి) మనం పార్టీ సభ్యులకు పార్టీ చరిత్రను బోధించాలి. ఆ బోధ సరియైన పద్ధతిలో జరగాలి. పార్టీ చరిత్రలోని నానా రకాల పార్టీ వ్యతిరేక ముఠాలను, పార్టీ పోకడను ఎదుర్కొనుటలో వారవలంబించిన పద్ధతులను, వారి ఎత్తుగడలను బోధించాలి. ఇంతకన్నా ప్రధాన విషయం, పార్టీ వ్యతిరేక

ముతాలను ఎదిరించుటలో మన పార్టీ పద్ధతులను, ఎత్తుగడలను - ఈ వ్యతిరేకముఠాను కూలదోసి ఓడించుటలో పార్టీకి సహాయపడిన ఎత్తుగడలను, పద్ధతులను బోధించాలి.

శాసనబద్ధ ప్రజాతంత్రవాదులను, సోషలిస్టు-రివల్యూషనరీలను, మెన్షివిక్కులను, అరాచకవాదులను ఎదిరించి, ఓడించడమేగాక, ట్రాట్స్కీవాదులను, 'డెమాక్రెటిక్ సెంట్రలిస్టులను', 'కార్మిక ప్రతిపక్ష ముఠాను', జినోవీవ్ వాదులను మితవాద పెడమార్గం పట్టేవారిని (రైట్‌డీవియేటర్సు), మితవాదానికి అతివాదానికి గంతులువేస్తూ రంగులుమార్చే ఊసరవెల్లులను, ఇంకా ఇలాంటివారిని పార్టీ ఎలా ఎదుర్కొని ఓడించిందో పార్టీసభ్యులు తెలుసుకోవాలి. మనపార్టీ చరిత్రను అర్ధంచేసుకొనుట, పార్టీచరిత్ర పరిజ్ఞానమూ, మనపార్టీ సభ్యులకు విప్లవ జాగరూకతను పూర్తిగా కలగజేయడానికి చాల ముఖ్యమైన, అవసరమైన సాధనమని మనం మరచిపోరాదు.

పార్టీనుండి శత్రువర్గ వ్యక్తులను, యాదృచ్ఛికంగా పార్టీలోకి కొట్టుకొని వచ్చిన వారిని తొలగించివేయడం 1933 లో ప్రారంభమైంది. పార్టీసభ్యుల రికార్డులను జాగ్రత్తగా పరీక్షజేయడం ముఖ్యంగా జరిగింది. కిరోవ్ దారుణ హత్య తర్వాత పాతపార్టీ సభ్యత్వ పత్రాలస్థానే కొత్తవి జారీచేయడం ప్రారంభమయింది. ఈకాలంలో పైవిషయాలు ప్రముఖస్థానాన్ని వహించాయి.

పార్టీ సభ్యుల రికార్డులను పరీక్షచేసేముందు అనేక పార్టీసంస్థలు పార్టీపత్రాలవిషయంలో నిర్లక్ష్యంగాను బాధ్యతారహితంగాను ప్రవర్తించేవి. అనేక సంస్థలలో కమ్యూనిస్టుల

సభ్యత్వ జాబితాలలో సహించరాని గందరగోళం పూర్తిగా ప్రబలియుండేది. పార్టీ పత్రాన్ని తమ గూఢచారి కార్యకలాపాలకు, విధ్వంసక చర్యలకు తెరగా శత్రువులు ఉపయోగించుకొన్నారు. గందరగోళ పరిస్థితులను తమ ఘాతుకకృత్యాల కోసం వినియోగించుకొన్నారు. పార్టీ సంస్థలనాయకులనేకమంది కొత్తసభ్యులను చేర్చుకొనుట, పార్టీ పత్రాలను జారీ చేయుట, మొదలగు పనులను తక్కువస్థానాలలో వున్న వ్యక్తులకు ఇచ్చారు. వారివిశ్వాసాన్ని పరీక్షచేయకుండానే అనేకమంది పార్టీ సభ్యులకుకూడ తరచుగా ఈ పనులను అప్పగించారు.

1935 మే 13వ తేదీన పార్టీ పత్రాలను జారీచేయుట, భద్రంగా వుంచుట, జాబితా తయారుచేయుట మొదలగు వాటి విషయమై పార్టీసంస్థలన్నిటికీ సెంట్రల్ కమిటీ ఒక సర్క్యులర్ లేఖపంపింది. పార్టీసభ్యుల రికార్డులను జాగ్రత్తగా పరీక్షచేయవలసిందనీ, "మనపార్టీ కుటుంబంలో బోల్షివిక్ క్రమపద్ధతిని నెలకొల్పవలెననీ" పార్టీ సంస్థలన్నిటికీ ఉత్తరువిచ్చింది.

పార్టీసభ్యులరికార్డులను పరీక్షచేయుట చాలా రాజకీయ ప్రాముఖ్యతగల విషయం. పార్టీసభ్యుల రికార్డులపరీక్షవల్ల తేలిన ఫలితాలను చర్చించడానికి పార్టీసెంట్రల్ కమిటీ సర్వసభ్యసమావేశం 1935 డిశంబరు 25 వ తేదీన జరిగింది. ఈ క్రిందితీర్మానం చేసింది. సో. యూ. క. (బో) పార్టీ అనుచరవర్గాన్ని బలపరచుటలో, ఈ పరీక్షచూడడం చాల రాజకీయ, నిర్మాణ ప్రాముఖ్యతగల విషయం – అని సెంట్రల్ కమిటీ ప్రకటించింది.

పార్టీసభ్యుల రికార్డులను సరిచూసినపిమ్మట పార్టీ పత్రాలనుమార్చినపిదప కొత్తసభ్యులను పార్టీలోకి తీసుకోవడం ప్రారంభమయింది. ఈసందర్భంలో సో. యూ. క. (బో) పార్టీ సెంట్రల్‌కమిటీ పార్టీలోకి కొత్తసభ్యులను గుంపులుగుంపులుగా చేర్చుకోరాదని తెలియజేసింది. ఖచ్చితంగా వ్యక్తిగతంగా చేర్చుకొనే పద్ధతిని అవలంబించాలని అంది. "నిజంగా అభివృద్ధి చెందిన ప్రజలను, కార్మికవర్గ ఆశయానికి నిజంగా కృషిచేసే వారిని, మనదేశంలోని అత్యుత్తమ ప్రజలను, అన్నిటికంటే ముఖ్యంగా కార్మికులనుండి, రైతులనుండి వచ్చినవారిని, ఉత్సాహవంతులైన మేధావులను, సోషలిజంకోసం వివిధ రంగాలలో జరిగిన పోరాటాలలో పరీక్షకు నిలబడినవారిని పార్టీలోకి తీసుకోవాలి."- అని సెంట్రల్‌కమిటీ నిర్ణయించింది.

సో. యూ. క. (బో) పార్టీ అనుచరులలోకి నెమ్మదిగా దూరటానికి శత్రువ్యక్తులు పదేపదే ప్రయత్నించుతారన్న విషయం పార్టీలోకి కొత్తసభ్యులను తిరిగి చేర్చుకొనేటప్పుడు జ్ఞాపకం పెట్టుకోవాలని పార్టీసంస్థలను సెంట్రల్‌కమిటీ హెచ్చరించింది. అందుచేత:

"బోల్షివిక్ జాగరూకతను అత్యంత ఉన్నతస్థాయికి హెచ్చించుట లెనినిస్టు పార్టీపతాకాన్ని దిగ్విజయంగా ఎగరవేయుట, పార్టీ అనుచరులలో శత్రువర్గాలకు చెందిన పరాయి వ్యక్తులూ యాదృచ్ఛికంగా వచ్చేవారు చేరబడకుండా జాగ్రత్త తీసుకొనుట ప్రతిపార్టీసంస్థయొక్క కర్తవ్యం."(సో. యూ. క. (బో) పార్టీ సెంట్రల్‌కమిటీ 1936 లో ప్రవదా 270వ సంచికలో ప్రచురించబడిన తీర్మానం.

పార్టీ అనుచరులను వడపోయుటద్వారాను, దృఢపర చుట ద్వారాను, పార్టీ శత్రువులను నాశనం చేయుటద్వారాను, పార్టీ పోకడపై చేసే వక్రభాష్యాలను ఎదిరించుటద్వారాను సెంట్రల్ కమిటీ చుట్టూ బోల్షివిక్ పార్టీ మరింత సన్నిహితంగా నిలబడింది. సెంట్రల్ కమిటీ నాయకత్వం క్రింద సోవియట్ దేశమూ, బోల్షివిక్ పార్టీ వర్గరహిత సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని పూర్తిచేసే నూతన దశకు సాగిపోయింది.

## క్లుప్తసారాంశం

అధికారాన్ని కైవశం చేసుకొన్న తర్వాత శ్రామికవర్గ విప్లవానికి అతికష్టమైన చరిత్రాత్మక సమస్యను 1930 - 34 కాలంలో బోల్షివిక్ పార్టీ పరిష్కరించింది. ఆ సమస్య : లక్షలాది చిన్నరైతు స్వంత ఆస్తిదారులను సోషలిస్టు సమిష్టి వ్యవసాయ మార్గాన్ని అవలంబించేలా చేయడం.

దోపిడీ చేసే వర్గాలలో అధిక సంఖ్యాకులైన కులక్కులను ఏరివేయడం, రైతాంగంలో ఎక్కువమంది సమిష్టి వ్యవసాయ పద్ధతిని అవలంబించడం, దేశంలోని పెట్టుబడిదారీ విధానపు తుదివేళ్ళను పెకిలించివేసింది. వ్యవసాయంలో సోషలిజం యొక్క అంతిమ విజయానికి దారితీసింది. గ్రామసీమల్లో సోవియట్ అధికారం పూర్తిగా సుస్థిరపడడానికి దారితీసింది.

సంఘటనా స్వభావానికి చెందిన అనేకకష్టాలను దాటిన పిమ్మట, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు దృఢంగా నెలకొని సంపత్కరమైన మార్గాన్ని చేపట్టాయి.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఫలితంగా మొదటిరకపు సోషలిస్టు భారీపరిశ్రమల రూపంలోను యంత్రాల నుపయోగించిన సమిష్టి వ్యవసాయరూపంలోను మనదేశంలో సోషలిస్టు ఆర్థిక విధానానికి అచంచలమైన పునాదివేయబడింది. నిరుద్యోగాన్ని అంతమొందించింది. కష్టజీవుల జీవన, సాంస్కృతిక ప్రమాణాలను క్రమంగా అభివృద్ధిచేయుటకు తగు పరిస్థితులను కల్పించింది.

బోల్షివిక్ పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ అవలంబించిన విప్లవకరమైన, ధైర్యయుతమైన విజ్ఞతా పూర్వకమైన విధానం వల్ల మనదేశంలోని కష్టజీవులందరూ ముఖ్యంగా కార్మిక వర్గమూ, సమిష్టి వ్యవసాయదారులు అఖండమైన విజయాలను సాధించారు.

చుట్టూ నున్న పెట్టుబడిదారీ ప్రపంచం సోవియట్ బలాన్ని ధ్వంసం చేసి కూలదోయటానికిగాను ద్విగుణీకృత శక్తితో సోవియట్ యూనియన్‌లోనే గూఢచారుల, విధ్వంసకుల, హంతకుల ముఠాలను నిర్మించడానికి పనిచేసింది. జర్మనీ, జపాన్‌లలో ఫాసిజం అధికారానికి రావడంతో చుట్టూ నున్న పెట్టుబడిదారీ ప్రపంచపు శత్రు కార్యకలాపాలు ముఖ్యంగా హెచ్చాయి. తమకు నమ్మకమైన సేవకులుగా పనిచేయడానికి ఫాసిజానికి ట్రాట్స్కీవాదులు జినోవీవ్‌వాదులు దొరికారు. సోవియట్ యూనియన్‌ను ఓడించి పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించడానికి గూఢచారులుగాను, విధ్వంసకారులుగాను పనిచేసి దౌర్జన్య కృత్యాలు చేయడానికీ, అభి

వృద్ధిని పెడమార్గం పట్టించే కృత్యాలు చేయడానికే వారు సిద్ధంగా వున్నారు.

నైతిక పతనం పొందిన వీరిని, ఈ ప్రజాశత్రువులను, ఈ దేశ ద్రోహులను నిర్దాక్షిణ్యంగా, అతి కఠినంగా సోవియట్ ప్రభుత్వం శిక్షించింది.

# పన్నెండో అధ్యాయం

## సోషలిస్టు సమాజ నిర్మాణాన్ని పూర్తిగావించు పోరాటంలో బోల్షివిక్ పార్టీ నూతనరాజ్యాంగ శాసనాన్ని ప్రవేశ పెట్టుట

[ 1935 – 37 ]

**1935-37 అంతర్జాతీయ పరిస్థితి - ఆర్థిక సంక్షోభ తీవ్రత తాత్కాలికంగా తగ్గుట - నూతన ఆర్థిక సంక్షోభ ప్రారంభం - ఇటలీ అబిసీనియాను ఆక్రమించుట - స్పెయిన్‌పై జర్మన్, ఇటలీల దురాక్రమణ - మధ్య చైనాపై జపాను దండయాత్ర - రెండవ సామ్రాజ్య వాద యుద్ధం**

**1929** రెండవ అర్థభాగంలో పెట్టుబడిదారీ దేశాలలో తలఎత్తిన ఆర్థికసంక్షోభం 1933 సంవత్సరాంతం వరకు నిలిచింది. అటుతర్వాత పరిశ్రమలు పడిపోవటం ఆగిపోయింది. ఆర్థికసంక్షోభం తర్వాత కొంతకాలం స్తబ్ధతాకాలం ప్రవేశించింది. ఆతర్వాత పరిశ్రమలు కొంతవరకు పునరుద్ధరణ పొందే పరిస్థితి, అనగా కొంత పైకిపోయేధోరణి వచ్చింది. కాని యీ పైకిపోయే ధోరణి నూతనమైన, ఉన్నతమైన ప్రాతిపదిక మీద ఉద్భవిల్లే పారిశ్రామిక వికాసం (boom) లాంటిదికాదు. ప్రపంచ పెట్టుబడిదారీ పరిశ్రమలు 1929 స్థాయికైనా చేరలేక పోయాయి. 1937 మధ్యకాలంనాటికి నూటికి 95 లేక 96 పాళ్లు మాత్రమే చేరుకొన్నాయి. 1937 రెండవ అర్థభాగంలో కొత్తగా ఆర్థికసంక్షోభం ప్రారంభమయింది. మొదట అమెరికాలో ప్రారంభమయింది. 1937 సంవత్సరాంతానికి అమెరికాలో

నిరుద్యోగుల సంఖ్య ఒక కోటిమందికి పెరిగింది. బ్రిటన్‌లో కూడ నిరుద్యోగం త్వరగా హెచ్చసాగింది.

ఆవిధంగా పెట్టుబడిదారీ దేశాలు పూర్వపు ఆర్థిక సంక్షోభం వలన కలిగిన వినాశాలనుండి కోలుకోనక ముందే మరొక ఆర్థికసంక్షోభానికి గురి అయ్యాయి.

దీని ఫలితంగా సామ్రాజ్యవాద దేశాలమధ్య వైరుధ్యాలు పెట్టుబడిదార్లకు శ్రామికులకు మధ్య ఉన్న వైరుధ్యాల వలెనే మరింత తీవ్రంగా పెంపొందాయి. అందుచేత దురాక్రమణ చేసే ప్రభుత్వాలు, ఆత్మరక్షణలో బలహీనమైన యితరదేశాలను నష్టపరచి తమ దేశంలో ఆర్థికసంక్షోభం మూలంగా వచ్చిన నష్టాలను పూడ్చుకొని కోలుకోడానికి ద్విగుణీకృత ప్రయత్నాలను చేశాయి. దురాక్రమణకు పేరు పడ్డ జర్మనీ జపాన్‌లకు తోడు ఈసారి మూడవదేశం ఇటలీ కూడ చేరింది.

1935 లో ఫాసిస్టు ఇటలీ అబిసీనియాపై దాడిచేసి దానిని పాదాక్రాంతం చేసింది. "అంతర్జాతీయ న్యాయ సూత్రాల"ను ధిక్కరించి నిర్హేతుకంగా అది దురాక్రమణ చేసింది. యుద్ధం ప్రకటించకుండా బందిపోటులా అది దాడి చేసింది. ఈపద్ధతి ఫాసిస్టులకు మామూలైపోయింది. ఇది అబిసీనియాకే గాక బ్రిటన్‌కు కూడా దెబ్బే. యూరపు నుండి ఇండియాకు ఆశియాకంతకూ పోయే బ్రిటన్ యొక్క సముద్ర మార్గాలకు కూడ ఇది దెబ్బ. అబిసీనియాలో ఇటలీ పీఠం వేయకుండా అడ్డుపెట్టేందుకు బ్రిటన్ విఫలప్రయత్నం చేసింది. తాను తన యిష్టంవచ్చినట్లు మున్ముందు ప్రవర్తించటానికి

గాను, ఇటలీ కొంతకాలానికి నానాజాతి సమితినుండి ఉపసంహ రించుకొంది. తన దేశాన్ని తీవ్రంగా సాయుధం చేయసాగింది.

ఆవిధంగా యూరప్ ఆసియాలమధ్య అతిదగ్గర అయిన సముద్రమార్గాలలో ఒక నూతన యుద్ధబీజం నాటబడింది.

ఫాసిస్టు జర్మనీ తనంతను తానే వర్సేలిస్ సంధి ఒడం బడికను చించివేసింది. యూరప్ చిత్రపటాన్ని దౌర్జన్యంగా తిరిగి వ్రాయించే ఒక పథకాన్ని చేపట్టింది. తమ పొరుగున వున్న దేశాలను, లేక కనీసం జర్మన్ ప్రజలు కొందరున్న దేశాలను, పాదాక్రాంతం చేసుకోవాలని జర్మన్ ఫాసిస్టులు బహిరంగంగానే ప్రయత్నించసాగారు. ఆవిధంగానే మొదట ఆస్ట్రియాను పట్టుకోవాలని, అతర్వాత జకోస్లోవేకియాను దెబ్బకొట్టాలని, ఆతర్వాత జర్మనీ సరిహద్దులలో నున్నట్టియూ, జర్మన్ ప్రజలున్న కొంత ప్రదేశం గల పోలెండును దెబ్బ కొట్టాలనీ, వారు ప్లానువేశారు. ఆతర్వాత...ఆ..."మనం చూద్దాం."

**1936** వేసవిలో స్పానిష్ రిపబ్లిక్‌లో క్షోభ్యం కల్గించు కొని దానిపై జర్మనీ ఇటలీలు సైనిక దండయాత్ర సాగిం చాయి. స్పానిష్ ఫాసిస్టులను బలపరచే వంకతో ఫ్రాన్సు వెనుభాగంలోని స్పానిష్ ప్రాంతంపైన తమ సైన్యాలను రహస్యంగా దించే అవకాశాన్ని అవి సంపాదించాయి. స్పానిష్ సముద్ర జలాలలో – బాలియారిక్ దీవుల ప్రాంతాలలోనూ, దక్షిణాన జిబ్రాల్టర్‌లోనూ, తమ నౌకాదళాలను ఉంచాయి. **1938** ప్రారంభంలో జర్మన్ ఫాసిస్టులు ఆస్ట్రియాను, ఆక్ర మించారు. ఆవిధంగా డాన్యూబ్ నది మధ్య ప్రాంతంలో

స్థిరపడ్డారు. యూరప్ దక్షిణభాగంలో ఆడ్రియాటిక్ సముద్రం వరకు వ్యాపించారు.

జర్మన్ ఇటాలియన్ ఫాసిస్టులు స్పెయిన్‌లో తమ దాడిని విస్తృతం చేశారు. అదే సమయంలో వారు తాము స్పానిష్ "కమ్యూనిస్టుల" (రెడ్స్)తో పోరాడుతున్నామే కాని మరేవిధమైన ఉద్దేశ్యమూ తమకు లేదని ప్రపంచానికి హామీ నిస్తూ చాటుకొన్నారు. ఈ పన్నాగం పనికిమాలిన పన్నాగం. అమాయకులను మోసగించటానికి ఉద్దేశించబడింది. వాస్తవానికి వారు బ్రిటన్, ఫ్రాన్సులను దెబ్బ గొడుతున్నారు. ఆసియా ఆఫ్రికాలలో వారికున్న వలసప్రదేశాలతో గల సముద్రమార్గాలను ఆక్రమించడానికి ఫాసిస్టులు ప్రయత్నిస్తున్నారు.

ఇక ఆస్ట్రియా ఆక్రమణను గురించి దీనిని వర్సేలిస్ సంధి ఒడంబడికకు వ్యతిరేకంగా జర్మనీసాగించిన పోరాటమని తోసివేయ వీలులేదు. లేక ప్రథమ సామ్రాజ్యవాదయుద్ధంలో తాను పోగొట్టుకొన్న ప్రదేశాన్ని పునరాక్రమించుట ద్వారా, జర్మనీ తన "జాతీయ" ప్రయోజనాలను సంరక్షించుటకు యత్నించుతున్నదని గాని సమర్థించ వీలులేదు. యుద్ధానికి పూర్వంగాని తర్వాతగాని జర్మనీలో ఆస్ట్రియా ఒక భాగం కాదు. ఆస్ట్రియాను బలప్రయోగం ద్వారా దురాక్రమణ చేయడం విదేశభూమిని వశపరచుకొనే సామ్రాజ్యవాదచర్యకు స్పష్టమైన ఉదాహరణ. పశ్చిమ యూరప్‌ఖండంలో ప్రాబల్యస్థానాన్ని సంపాదించాలనే ఫాసిస్టు జర్మనీ కోర్కెలను అది ధృవ పరచింది.

ఇది అన్నిటికన్న ముఖ్యంగా ఫ్రాన్సు బ్రిటన్ల ప్రయోజ నాలకు దెబ్బ.

ఆవిధంగా యూరప్‌కు దక్షిణాన ఆస్ట్రియా, ఆడ్రియాటిక్ మండలంలోను యూరప్‌కు బాగా పశ్చిమాన స్పెయిన్‌లో స్పానిష్ తీరంలోని సముద్ర జలాలలోను, నూతన యుద్ధ బీజాలు నాట బడ్డాయి.

1937 లో జపాన్ ఫాసిస్టు మిలటరిస్టులు పీపింగ్ (పీకింగ్) పట్టుకొన్నారు. మధ్య చైనాపై దండయాత్ర చేశారు. షాంగేను ఆక్రమించారు. అనేక సంవత్సరాల క్రితం మంచూరియాపై చేసిన దండయాత్రలాగానే, జపాన్‌కు అలవాటయిన పద్ధతినే, బందిపోటుదొంగవలెనే, జపాన్‌వాళ్ళు తాము కల్పించిన అనేక "స్థానిక ఘటనలను" దుర్బుద్ధితో ఉపయోగించుకొని "అంతర్జాతీయ ప్రమాణాలను", సంధులను, ఒడంబడికలను అన్నిటినీ ఉల్లంఘించి మధ్య చైనాపై దండయాత్ర సాగించారు. టీన్‌స్టిన్, షాంగేలను పట్టుకొనడంతో జపాన్ చేతుల్లోకి విశాలమైన చైనా మార్కెటు లభించింది. షాంగై, టీన్‌స్టిన్‌లను జపాను తన చేతుల్లో ఉంచుకొన్నన్నాళ్లు, అది యేక్షణమైనా, బ్రిటన్, అమెరికాలు పెద్ద పెద్ద మొత్తాలను పెట్టుబడి పెట్టిన మధ్యచైనానుండి వాటిని తరిమివేయ గలదు.

జపాను దురాక్రమణదారులపై చైనా ప్రజలూ, చైనా సైన్యమూ వీరోచితమైన పోరాటం చేస్తున్నారు. చైనాలో అద్భుతమైన జాతీయ పునరుజ్జీవనం ప్రారంభమయింది. చైనాకు గల విశాలప్రదేశం, అశేష మనుష్య సంపద, చైనా భూభాగం

నుండి దురాక్రమణదారులను పూర్తిగా తరిమివేసేవరకు తుది దాకా స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించాలనే చైనా జాతీయ ప్రభుత్వం నిశ్చయమూ, చైనాలో జపాన్ సామ్రాజ్యవాదులకు భవిష్యత్తులేదని, ఉండబోదని నిస్సందేహంగా తెలియజేస్తున్నాయి.

కాని ప్రస్తుత సమయంలో చైనా వర్తకపు తాళాలు జపానుచేతుల్లో ఉన్నాయి. చైనాపై జపాను యుద్ధం, బ్రిటన్ అమెరికాల ప్రయోజనాలకు చాల తీవ్రమయిన దెబ్బ.

ఆవిధంగా పసిఫిక్‌లో చైనామండలంలో మరొక యుద్ధ బీజం నాటబడింది. ఈ విషయాలన్నీ ద్వితీయ సామ్రాజ్యవాద యుద్ధం అప్పుడే ప్రారంభమయిందని తెలియజేస్తున్నాయి. అది ఎట్టి యుద్ధ ప్రకటన లేకుండానే రహస్యంగా ప్రారంభమయింది. వివిధ ప్రభుత్వాలూ, జాతులూ దాదాపు తెలియకుండానే ద్వితీయ సామ్రాజ్యవాద యుద్ధ పరిధిలోకి నెమ్మదిగా జారాయి. ప్రపంచంలోని వివిధ ప్రదేశాలలో యుద్ధాన్ని ప్రారంభించినది మూడు దురాక్రమణ దేశాలు. అవి ఫాసిస్టు వర్గాలు అధికారంలోవున్న జర్మనీ, ఇటలీ, జపానులు. జిబ్రాల్టర్ నుండి షాంగేవరకు విస్తరించిన బ్రహ్మాండమైన విశాల ప్రదేశంపై యుద్ధం జరుగుతోంది. ఈయుద్ధ పరిధిలోకి అప్పుడే 50 కోట్ల ప్రజలను అది యీడ్చింది. చివరకు తేలేదేమంటే ఈ యుద్ధం బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికాల పెట్టుబడిదారీ ప్రయోజనాలకు వ్యతిరేకంగా కొనసాగింపబడుతోంది. ప్రజాతంత్రమని పిలువబడే ప్రభుత్వాలకు నష్టం కల్గించి, దురాక్రమణ దేశాలకు అనుకూలంగా ప్రపంచాన్నీ, పలుకుబడి ప్రాంతాలనూ పునర్విభజించుటే ఈ యుద్ధంయొక్క లక్ష్యం.

ద్వితీయ సామ్రాజ్యవాద యుద్ధంయొక్క ప్రత్యేక స్వరూపం ఒకటి వుంది. అది: ఇంతవరకు దురాక్రమణదేశాలే యుద్ధాలు ప్రారంభించి విస్తరింప జేస్తున్నాయి. ఇతర ప్రభుత్వాలు "ప్రజాతంత్ర" ప్రభుత్వాలు, వాస్తవంలో తమపైననే యుద్ధం సాగించబడుతున్నప్పటికీ, అవి తమకు పట్టనట్లు నటిస్తున్నాయి. చేతులు కడుక్కొన్నాయి. వెనుక్కుతగ్గుతూ, తమ శాంతిప్రియత్వాన్ని గురించి తెగపొగడుకొంటూ ఫాసిస్టు దురాక్రమణదారులను దూషించుతూ వున్నాయి......కాని తాము ప్రతిఘటించడానికి సిద్ధమౌతున్నామని ఒక ప్రక్క చెపుతూనే, మరొకప్రక్క దురాక్రమణదారులకు తమ స్థానాలను ఒకదానితర్వాత మరొకదానిని కట్టబెడుతున్నాయి.

ఈ యుద్ధం విచిత్రమైన ఏకపక్ష స్వభావం కల్గిన యుద్ధమని ముందు ముందు చూస్తాం. అంతమాత్రాన ఏమంత తక్కువ అమానుష యుద్ధంగాదు. ఈ యుద్ధంలో బలహీనమైన రక్షణకల్గిన అబిసీనియా, స్పెయిన్, చైనా ప్రజలను నిర్దాక్షిణ్యంగా ఓడించుతున్నారు.

యుద్ధంయొక్క ఏకపక్ష స్వభావం "ప్రజాతంత్ర"దేశాల ఆర్థిక లేక సైనిక బలహీనతవల్ల అని తలచడం పొరపాటు. ఫాసిస్టు దేశాలకంటె "ప్రజాతంత్ర" దేశాలు బలీయమైనవన్న మాట నిజమే. కాని ఫాసిస్టు ప్రభుత్వాలకు వ్యతిరేకంగా "ప్రజాతంత్ర" దేశాల సంయుక్త సంఘటన లేకపోవడం మూలంగా విస్తరించుచున్న, ప్రపంచ యుద్ధానికి ఈ ఏకపక్ష స్వభావం ఏర్పడింది. ప్రజాతంత్ర దేశాలనబడేవి ఫాసిస్టు దేశాల "మితిమించిన చర్యలను" ఆమోదించనిమాట నిజమే.

ఫాసిస్టు దేశాలకు ఏమాత్రపు బలం అదనంగా చేరినా అవి భయపడతాయి. కాని అవి యూరప్‌లోని కార్మికవర్గ ఉద్యమం, ఆశియాలోని జాతీయ విమోచన ఉద్యమం అంటే ఇంతకంటె ఎక్కువ భయపడతాయి. ఈ "అపాయకరమైన" ఉద్యమాలకు "అద్భుతమైన విరుగుడు" ఫాసిజం అని అవి భావిస్తున్నాయి. ఈ కారణంవల్ల "ప్రజాతంత్ర" దేశాల పరిపాలక వర్గాలు, ముఖ్యంగా బ్రిటన్‌ను పరిపాలించే కన్సర్వేటివ్ ముఠాలు, అహంకార పూరితులయిన ఫాసిస్టు పరిపాలకులను "అతిగా పోవద్దని" బ్రతిమాలే విధానాన్ని అవలంబించుతున్నాయి. ఫాసిస్టులు కార్మికవర్గంపట్ల, జాతీయ విమోచన ఉద్యమంపట్ల అభివృద్ధి నిరోధక పోలీసు విధానం అవలంబించుతున్నారు. దీనిపట్లకూడా తమకు పూర్తిగా సానుభూతి వుందనీ, దానిని తాము "పూర్తిగా అర్థం చేసుకొంటున్నామనీ" ఒక విధమైన హామీని ఫాసిస్టులకు వారిస్తున్నారు. ఈ విషయంలో బ్రిటన్ పాలకవర్గాలు, జారు ప్రభుత్వంకింద రష్యన్ లిబరల్ రాచరికవాద పెట్టుబడిదారీవర్గం అవలంబించిన పద్ధతినే అవలంబించుతున్నారు. జారు "అతిగాపోయే" విధానానికి ఒక ప్రక్క భయపడుతూనే ఈ లిబరల్ రాచరిక వాద పెట్టుబడిదారీవర్గం ప్రజలంటే మరింత భయపడింది. అందుచేత జారుప్రభుత్వాన్ని బ్రతిమలాడే విధానం అది అవలంబించింది. తత్ఫలితంగా ప్రజలకు వ్యతిరేకంగా జారుతో కుట్రచేసింది. ఈ ద్వంద్వవిధానం అవలంబించినందువల్ల రష్యాలోని లిబరల్ రాచరికవాద పెట్టుబడిదారీవర్గం బాగా నష్టపడ్డట్లు మనకు తెలుసు. అలాగే బ్రిటన్ పరిపాలకవర్గాలు

ఫ్రాన్సు, అమెరికాలలోని వారి మిత్రులూ భవిష్యచ్చరిత్రలో నష్టపోతారని మనం భావించవచ్చు.

అంతర్జాతీయ పరిస్థితిలో అలాంటి మార్పును చూడకుండా సోవియట్ యూనియన్ కళ్ళు మూసుకోజాలదు. దుష్ట సూచకమైన ఘటనలను అలక్ష్యపరచజాలదు. దురాక్రమణదారుడు ప్రారంభించిన ఎంత చిన్న యుద్ధమైనా, ఏయుద్ధమైనా శాంతియుత దేశాలను ప్రమాదాన్ని కలిగిస్తుంది. వివిధదేశాల మీాద "కనబడకుండా" ప్రారంభించబడిన రెండవ సామ్రాజ్యవాద యుద్ధం 50 కోట్ల ప్రజలను ఆవరించింది. అలాంటి యుద్ధం అన్నిదేశాలకూ ముఖ్యంగా సోవియట్‌యూనియన్‌కు తీవ్రమైన అపాయాన్ని కలుగచేయక తప్పదు. జర్మనీ, ఇటలీ, జపానులు "కమ్యూనిస్టు వ్యతిరేకకూటమి" నిర్మించుటతో యీావిషయం తేటతెల్లమయింది. అందుచేత తన శాంతివిధానాన్ని అనుసరిస్తూనే మనదేశం తన సరిహద్దురక్షణలను ఇంకా బలపరచడానికి పూనుకొంది. రెడార్మీ, నౌకాసైన్యాలయొక్క పోరాటసామర్థ్యాన్ని వృద్ధిచేయ ప్రారంభించింది. 1934 సంవత్సరాంతంలో సోవియట్‌యూనియన్ నానాజాతిసమితిలో చేరింది. నానాజాతిసమితి బలహీనత దానికి తెలుసు. అయినప్పటికీ దురాక్రమణదారులను బయటపెట్టడానికి అది ఉపయోగపడుతుంది. ఎంత బలహీనంగా ఉన్నప్పటికిన్నీ అది యుద్ధం ప్రారంభంకాకుండా ఆటంకపరచ వచ్చుననీ, శాంతికి కొంతవరకు అది సాధనమనీ తెలిసే సోవియట్ యూనియన్ దానిలో చేరింది. ఇలాంటి సమయాలలో నానాజాతిసమితి లాంటి బలహీనమైన అంతర్జాతీయ సంస్థనుసైతం నిర్లక్ష్యపరచరాదని సోవియట్ యూనియన్ భావించింది.

దురాక్రమణదారులు చేయబోయే దాడికి వ్యతిరేకంగా ఫ్రాన్సు, సోవియట్ యూనియన్ల మధ్య పరస్పర సహాయసంధి 1935 మేలో జరిగింది. అదే కాలంలో సోవియట్ యూనియన్ జకోస్లోవేకియాల మధ్య అలాంటి సంధి మరొకటి జరిగింది. 1936 మార్చిలో సోవియట్ యూనియన్, మంగోలియన్ ప్రజా రిపబ్లిక్‌తో పరస్పర సహాయసంధి చేసుకొంది. 1937 ఆగస్టులో చైనా రిపబ్లిక్‌తో నిరాక్రమణ సంధిని (నాన్ ఎగ్రెషన్ పాక్టు) చేసుకొంది.

## 2

సోవియట్ యూనియన్ వ్యవసాయంలోను, పరిశ్రమల్లోను మరికొంత అభివృద్ధి – అనుకొన్న కాలానికి ముందుగానే రెండవ పంచవర్ష ప్రణాళిక పూర్తియగుట– వ్యవసాయ పునర్నిర్మాణం – సమిష్టి వ్యవసాయపద్ధతి పూర్తియగుట – కేడర్ల ప్రాముఖ్యత – స్టఖనోవ ఉద్యమం– ప్రజల జీవన ప్రమాణం హెచ్చుట – ప్రజల విజ్ఞానస్థాయి హెచ్చుట – సోవియట్ విప్లవబలం

**1930-33** ఆర్థికసంక్షోభం తర్వాత మూడేండ్లలోనే పెట్టుబడిదారీ దేశాలలో ఆర్థికసంక్షోభం తిరిగి తలయెత్తింది. కాని సోవియట్‌యూనియన్‌లో ఈదశ అంతటా పరిశ్రమలు క్రమంగా అభివృద్ధి చెందసాగాయి. 1937 మధ్యభాగం నాటికి

ప్రపంచపెట్టుబడిదారీ పరిశ్రమలుమొత్తంగా తీసుకొన్నట్లయితే, 1929 ఉత్పత్తిస్థాయికి నూటికి 95 లేక 96 పాళ్ళను మాత్రమే రాగలాయి. కాని 1937 రెండవ అర్ధభాగంలో మళ్ళా నూతన సంక్షోభ శృంఖలాలలో చిక్కుకొన్నాయి. కాని సోవియట్ యూనియన్ పరిశ్రమలు క్రమంగా సమిష్టి అభివృద్ధిని పొందాయి. 1929 ఉత్పత్తితో పోల్చితే 1937 సంవత్సరాంతానికి సోవియట్ పరిశ్రమలఉత్పత్తి నూటికి 428 పాళ్లుపెరిగింది. యుద్ధపూర్వ ఉత్పత్తితో పోల్చిచూస్తే ఇది ఏడురెట్లున్నమాట.

బోల్షివిక్‌పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ నిరంతరాయంగా అవలంబించిన పునర్నిర్మాణ విధానంయొక్క ప్రత్యక్ష ఫలితంగానే ఈ విజయాలు లభించాయి.

ఈ విజయాల ఫలితంగా రెండవ పంచవర్ష పారిశ్రామిక ప్రణాళిక అనుకొన్న కాలానికి ముందుగానే, 1937 ఏప్రిల్ ఒకటవతేదీకి పూర్తిఅయింది. అనగా నాలుగేండ్ల మూడు నెలలకే పూర్తిఅయింది.

ఇది సోషలిజానికి చాల ప్రాముఖ్యమైన విజయం.

వ్యవసాయంలో అభివృద్ధికూడ దాదాపు ఇలాగేసాగింది. అన్నిరకాల పంటలుపండే మొత్తం భూమి 1913లో (యుద్ధానికి పూర్వం) 10½ కోట్ల హెక్టార్లుండేది. ఇది 1937 నాటికి పదమూడున్నరకోట్ల హెక్టార్లకు పెరిగింది. ధాన్యపుపంట 1913 లో 480 కోట్ల పూడ్లు ఉండేది. 1937 లో 680 కోట్ల పూడ్లకు పెరిగింది. ఇదేకాలంలో ముడిపత్తి 4 కోట్ల 40 లక్షల పూడ్లనుండి 15 కోట్ల 40 లక్షల పూడ్లకు పెరిగింది. ఫ్లాక్స్ (ఒకరకమైన నార) ఒకకోటి 90 లక్షల పూడ్లనుండి 3 కోట్ల

10 లక్షల పూడ్లకు పెరిగింది. బీటుదుంప (దీనినుండి పంచదార తీస్తారు) 65 కోట్ల 40 లక్షల పూడ్లనుండి 131 కోట్ల 10 లక్షల పూడ్లకు పెరిగింది. నూనెగింజలు 12 కోట్ల 90 లక్షల పూడ్ల నుండి 30 కోట్ల 60 లక్షల పూడ్లకు పెరిగింది.

1937లో సమిష్టి వ్యవసాయక్షేత్రాలొక్కటే (ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలను మినహాయించి) 170 కోట్ల పూడ్ల అదనపు ధాన్యాన్ని మార్కెట్లకు సప్లయిచేసింది. 1913 లో భూస్వాములు, కులక్‌లు, రైతులుకలసి మార్కెట్టుకు సప్లయి చేసిన మొత్తం ధాన్యంకంటె కనీసం ఇది 40 కోట్ల పూడ్లు ఎక్కువ.

వ్యవసాయంలో ఒక్కభాగంమాత్రం, పశువుల పెంపకం మాత్రం, యుద్ధపూర్వస్థాయికి వెనకబడింది. చాల నెమ్మదిగా అభివృద్ధి చెందుతోంది. వ్యవసాయాన్ని సమిష్టి వ్యవసాయంగా మార్చుట దాదాపు పూర్తిఅయినట్లే చెప్పవచ్చు. 1937 నాటికి సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లోకి చేరిన రైతుకుటుంబాల సంఖ్య ఒక కోటి 85 లక్షలు. అంటె మొత్తం రైతుకుటుంబాలలో నూటికి 93 పాళ్ళు అన్నమాట. సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లోని ధాన్యపుపంటభూమి, రైతులపంట భూమి మొత్తంలో నూటికి 99 పాళ్ళు అయింది.

వ్యవసాయ పునర్నిర్మాణ ఫలితాలూ, వ్యవసాయ పనులకు ట్రాక్టర్లను యంత్రాలను విరవిగా సప్లయిచేయడం వలన ఫలితాలూ ఇపుడు స్పష్టంగా కన్పించాయి.

పరిశ్రమలను, వ్యవసాయాన్ని పునర్నిర్మించుట పూర్తి అయిన ఫలితంగా, జాతీయ ఆర్థిక సంపదకు మొదటిరకపు

టెక్నిక్ కావలసినంత సప్లైచేయబడింది. పరిశ్రమలు, వ్యవసాయం, రవాణామార్గాలు, సైన్యమూ వీటన్నిటికీ ఆధునిక టెక్నిక్ కలిగిన పనిముట్లు పెద్దమొత్తాలలో లభించాయి. అంటే యంత్రాలు, యంత్రపరికరాలు, ట్రాక్టర్లు, వ్యవసాయ యంత్రాలు, ఇంజన్లు, స్టీమర్లు, శతఘ్నులు, టాంకులు, విమానాలు, యుద్ధనౌకలు లభించాయి. ఈ టెక్నిక్‌ను పూర్తిగా ఉపయోగించుకోడంద్వారా ఎక్కువ ఫలితాలను సాధించగల తర్ఫీదు పొందిన వ్యక్తులు లక్షలాదిగా అవసరమయ్యారు. ఇది లేకుండాఅంటేటెక్నిక్‌లో ప్రావీణ్యతసంపాదించిన తగినంతమంది వ్యక్తులు లేకపోతే, టెక్నిక్ అనేది నిర్జీవమైన వినియోగపడని లోహంగా ఉండిపోతుంది. ఇది చాలప్రమాదకరమైన విషయం. టెక్నిక్ వ్యాపించుటతోపాటు టెక్నిక్‌ను పూర్తిగా ఉపయోగించుకొని వ్యవవహరించగల తర్ఫీదు పొందిన వ్యక్తుల, కేడర్ల సంఖ్య పెరగడంలేదు. పైగా వెనకబడికూడ వుంటున్నది. మన పారిశ్రామిక నిర్వాహకవర్గాలలో చాలభాగం ఈ ప్రమాదాన్ని గుర్తించలేదు. టెక్నిక్ "దానంతటకదే పని పూర్తి చేస్తుంది" అని వారు నమ్మారు. కనక, పరిస్థితులు మరింత క్లిష్టమయ్యాయి. పూర్వం వారు టెక్నిక్ ప్రాముఖ్యతను తక్కువ అంచనావేసి నిర్లక్ష్యంగా చూశారు. ఇపుడు వారే దీనిని ఎక్కువ అంచనావేసి దానికి అద్భుతశక్తిని ఆపాదించ సాగారు. టెక్నిక్‌లో ప్రావీణ్యత సంపాదించిన వారు లేకపోతే, టెక్నిక్ మృతవస్తువు మాత్రమేనని వారు గ్రహించలేదు. టెక్నిక్ ఎక్కువ ఉత్పాదకశక్తి కలదిగా కావాలంటే, దానిలో ప్రావీణ్యత సంపాదించిన వ్యక్తులు అవసరమని వారు గ్రహించలేదు.

ఆ విధంగా టెక్నిక్‌లో ప్రావీణ్యత సంపాదించిన కేడర్ల సమస్య ఒక ప్రధాన సమస్యగా మారింది.

టెక్నిక్‌కోసం మితిమించిన ఉత్సాహాన్ని ప్రదర్శించి తత్ఫలితంగా తర్ఫీదు నొందిన వ్యక్తుల, కేడర్ల ప్రాముఖ్యతను తక్కువ అంచనావేసిన పారిశ్రామిక నిర్వాహకులు, తమ దృష్టిని టెక్నిక్‌ను అధ్యయనంచేసి ప్రావీణ్యత సంపాదించడం వైపు మరల్చవలసివచ్చింది. టెక్నిక్‌ను అవగాహన చేసుకొని దానితో ఎక్కువ ఫలితాలను సంపాదించగలిగే సామర్థ్యం గల అసంఖ్యాకమైన కేడర్లను తర్ఫీదుచేయుటకు అవసరమైన అన్ని పనులవైపు దృష్టి మరల్చవలసి వచ్చింది.

పునర్నిర్మాణ ప్రారంభకాలంలో దేశంలో టెక్నిక్ కొరత ఏర్పడింది. "పునర్నిర్మాణ కాలంలో టెక్నికే ప్రతి దానిని నిశ్చయించుతుంది" అనే నినాదాన్ని పార్టీ ఇచ్చింది. ఇపుడు టెక్నిక్ కావలసినంత సమృద్ధిగావుంది. ప్రధానవిషయాలలో పునర్నిర్మాణం పూర్తి అయిపోయింది. ఇపుడు కేడర్ల కొరతతో దేశం అవస్థపడుతోంది. అందుచేత ఇపుడు టెక్నిక్ వైపుగాక దానిని పూర్తిగా వినియోగించుకొన సామర్థ్యంగల కేడర్లవైపు వ్యక్తులవైపు దృష్టి మరల్చడం పార్టీ కర్తవ్యమయింది. ఇందునుగాను పార్టీ ఒక కొత్త నినాదం ఈయవలసివచ్చింది.

ఈ విషయంలో **1935** మేలో రెడార్మీ విద్యాలయాల నుండి వచ్చిన పట్టభద్రులకు కామ్రేడ్ స్టాలిన్ ఇచ్చిన ఉపన్యాసం చాల ప్రాముఖ్యమైనది. కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు :

"ఇదివరకు మనం 'టెక్నిక్కే ప్రతిదీ నిశ్చయించుతుంది' అని అనేవాళ్ళం. ఈ నినాదం టెక్నిక్ కొరతను తుదముట్టించుటలో సహాయపడింది. మన ప్రజలకు మొదటి రకపు టెక్నిక్‌తో కూడిన పరికరాలను సమకూర్చడానికీ, ప్రతిశాఖలోను విశాలమైన టెక్నికల్ పునాదిని సృష్టించడానికీ ఈనినాదం తోడ్పడింది. అంతవరకు మంచిదే. కాని ఇది చాలదు. ఇది తగినంతగా చాలదు. టెక్నిక్‌ను కొనసాగించాలంటే, దానిని పూర్తిగా ఉపయోగించుకోవాలంటే, దానిలో ప్రావీణ్యత సంపాదించిన వ్యక్తులు మనకు కావాలి. టెక్నిక్ కళా సూత్రాలన్నింటినీ అవగాహనచేసుకొని ఉపయోగించ సామర్థ్యంగల కేడర్లు మనకు కావాలి. టెక్నిక్‌లో ప్రావీణ్యత సంపాదించినవారు లేకపోతే అది మృతవస్తువే. దానిలో ప్రావీణ్యత సంపాదించినవారి చేతులలో టెక్నిక్ అత్యద్భుత కృత్యాలను చేయగలదు - చేయాలి. మన మొదటిరకపు మిల్లులలోను, ఫ్యాక్టరీలలోను, మన ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోను, మన రవాణా మార్గాలలోను, రెడార్మీలోను టెక్నిక్ ఉపయోగించ సామర్థ్యం గల కేడర్లు తగినంతమంది వున్నట్లయితే, మనదేశం ప్రస్తుతంకన్న మూడు లేక నాలుగు రెట్లు గొప్ప ఫలితాలను సంపాదించగలదు. అందుచేత టెక్నిక్‌లో ప్రావీణ్యత సంపాదించిన కార్మికులపైన కేడర్లపైన వ్యక్తులపైనా ఇపుడు మనదృష్టిని కేంద్రీకరించాలి. అందుచేతనే 'టెక్నిక్కే ప్రతిదీ నిశ్చయించుతుంది' అనే పాత నినాదం స్థానే కొత్త నినాదం ఈయాలి. ఈ పాత నినాదం గతించిపోయిన కాలాన్ని ప్రతిబింబిస్తుంది. కొత్త

నినాదం 'కేడర్లే ప్రతిదీ నిశ్చయించుతారు' అనేదిగా వుండాలి. ఇదే ఇప్పుడు ప్రధాన విషయం......

"అత్యంత విలువకలిగి అత్యంత నిశ్చితమైన వ్యక్తులూ కేడర్లూ, ప్రపంచంలో అన్నిటికన్నా విలువైన పెట్టుబడి అని గ్రహించవలసిన సమయమిది. మన ప్రస్తుత పరిస్థితుల్లో 'కేడర్లే ప్రతిదీ నిశ్చయించుతారు' అనే విషయాన్ని గుర్తించాలి. వ్యవసాయంలోను పరిశ్రమలలోను, రవాణాల్లోను, సైన్యంలోను మనకు అసంఖ్యాకమైన మంచి కేడర్లు ఉన్నట్లయితే మనదేశం అజేయ మవుతుంది. మనకలాంటి కేడర్లు లేకపోయినట్లయితే రెండు కాళ్ళూ లేని కుంటివాళ్ళమవుతాం" (జె. స్టాలిన్, ప్రాబ్లెమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్ మాస్కో 1947, 523 - 24 పేజీలు).

కనుక టెక్నికల్ కేడర్లకు తర్ఫీదును హెచ్చించుట నేటి ప్రధానకర్తవ్యం. శ్రామిక ఉత్పాదక శక్తిని నిరంతరం హెచ్చించాలనే లక్ష్యంతో నూతన టెక్నిక్‌లో త్వరితంగా ప్రావీణ్యత సంపాదించుట నేటి ప్రధాన కర్తవ్యం.

అలాంటి కేడర్ల అభివృద్ధికీ, మనప్రజలు నూతన టెక్నిక్‌లో ప్రావీణ్యత సంపాదిస్తున్నా రనడానికీ, శ్రామిక ఉత్పాదక శక్తి నిరంతరం పెరుగుతుందనడానికీ చక్కని ఉదాహరణ స్టఖనోవ్ ఉద్యమం. ఆ ఉద్యమం డొనెట్జ్ బేసిన్‌లో బొగ్గు పరిశ్రమలో పుట్టిపెరిగింది. ఇతర పారిశ్రామిక శాఖలకు, రైల్వేలకు, వ్యవసాయానికీ ఆ ఉద్యమం వ్యాపించింది. మధ్య ఇర్మినో బొగ్గుగనిలో (డొనెట్జిబేసిక్) బొగ్గు తవ్వే కార్మికుడు ఎలెక్జీ స్టఖనోవ్ ఈ ఉద్యమానికి మూలపురుషుడు. ఇతనిని

బట్టే ఈ ఉద్యమానికి ఆ పేరు వచ్చింది. స్టఖనోవ్‌కు ముందు నికిటా ఇజటోవ్ బొగ్గు తవ్వటంలో పూర్వపు రికార్డుల నన్నిటిని మించివేశాడు. 1935 ఆగస్టు 31 వ తేదీన స్టఖనోవ్ ఒక్క షిఫ్టులో 102 టన్నుల బొగ్గు తవ్వాడు: ఆవిధంగా మామూలు ఉత్పత్తి ప్రమాణానికి 14 రెట్లు పనిని పూర్తిచేశాడు. దీనితో శ్రామిక ఉత్పాదకశక్తిలో నూతన అభివృద్ధికీ, ఉత్పత్తిప్రమాణాలను హెచ్చించడానికీ కార్మికులు, సమిష్టి వ్యవసాయ రైతులు ప్రజా ఉద్యమాన్ని ప్రారంభించారు. మోటారు పరిశ్రమలో బుసీగిన్, చెప్పుల పరిశ్రమలో స్మెటానిన్, రైల్వేలలో క్రివోనాస్, కలప పరిశ్రమలో ముసిన్స్కి, బట్టల పరిశ్రమలో ఇనడ్సోకియా. వినోగ్రడోవా, మేరియావినోగ్రడోవా అనువారలు, వ్యవసాయంలో మేరియా డెమ్‌చెన్‌కో, మేరీనా గ్నాటెన్కో, పి. ఏంజిలానా, పోలాగుటిన్, కోలిసావ్, కోవర్డాక్, బోరిన్ అనువారలు స్టఖనోవ్ ఉద్యమ ప్రథమ మార్గదర్శకులు.

వారిని ఇతరులు దళాలకు దళాలుగా అనుసరించి, ప్రారంభకాలంలోని శ్రామిక ఉత్పాదకశక్తిని మించిపోయారు.

1935 నవంబరులో క్రెమ్లిన్‌లో అఖిల రష్యన్ స్టఖనోవ్ వర్కర్ల మొదటిసభ జరిగింది. ఈ సభా, ఇందులో కామ్రేడ్ స్టాలిన్ ఇచ్చిన ఉపన్యాసమూ స్టఖనోవ్ ఉద్యమానికి అద్భుతమైన ప్రోత్సాహాన్నిచ్చింది.

తన ఉపన్యాసంలో కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు :

"స్టఖనోవ్ ఉద్యమం సోషలిస్టు పోటీయొక్క నూతన వెల్లువకు ప్రతిబింబం. సోషలిస్టు పోటీలో నూతన ఉన్నత

దశకు ప్రతిబింబం...... గతంలో, అంటే మూడేండ్ల కిందట, సోషలిస్టు పోటీయొక్క ప్రథమ దశలో, సోషలిస్టు పోటీ ఆధునిక టెక్నిక్‌తో, తప్పని సరిగా కలసియుండటం అనేది లేదు. ఆకాలంలో వాస్తవానికి మనకు ఆధునిక టెక్నిక్ లేదు. కాని సోషలిస్టు పోటీలోని ప్రస్తుత దశఅయిన స్టఖనోవ్ ఉద్యమం తప్పనిసరిగా ఆధునిక టెక్నిక్‌తో సంబంధం కలిగివుంది. నూతనమైన ఉన్నతమైన టెక్నిక్ లేకుండా స్టఖనోవ్ ఉద్యమాన్ని సాగించడం అనూహ్యం. కామ్రేడ్స్ స్టఖనోవ్, బుసీజిన్, స్మెటానిన్, క్రివోనాస్, ప్రోనిన్, వినోగ్రాడోవాలు, తమ వృత్తులయొక్క టెక్నిక్‌లో పూర్తి ప్రావీణ్యత సంపాదించి దాని నుపయోగించి ముందుకు పోగలిగినట్టి కష్టజీవులైన స్త్రీ పురుషులు కొత్తవారు ఇంకా అనేకమంది మనకున్నారు. కాని మూడేండ్ల క్రితం మన కలాంటి వ్యక్తులులేరు. దాదాపు లేరనే చెప్పవచ్చు......స్టఖనోవ్ ఉద్యమం పాత టెక్నికల్ ప్రమాణాలను ఓడించివేస్తున్నది. ఆ ప్రమాణాలు ప్రస్తుతానికి పనికిరానివి. స్టఖనోవ్ ఉద్యమం అనేక విషయాలలో అగ్ర శ్రేణికి చెందిన పెట్టుబడిదారీదేశాల ఉత్పాదక శక్తిని మించిపోతోంది. ఆ విధంగా మనదేశంలో సోషలిజాన్ని సుస్థిరపరచే ప్రత్యక్ష అవకాశాన్ని కలుగజేస్తున్నది. అన్నిదేశాలలోకి అత్యంత సౌభాగ్యవంతమైన దేశంగా మన దేశాన్ని మార్చే అవకాశాన్ని కల్గించుతున్నది. ఇందులోనే స్టఖనోవ్ ఉద్యమం యొక్క ప్రాముఖ్యత ఉంది." (పైగ్రంథమే 526 - 27 పేజీలు)

స్టఖనోవ్ వర్కర్లు పనిచేసే పద్ధతులను వర్ణించుతూ మనదేశ భవిష్యత్తుకు స్టఖనోవ్ ఉద్యమం ఎలాంటి అత్యద్భుత

ప్రాముఖ్యత కలిగియున్నదో తెలియజేస్తూ కామ్రేడ్ స్టాలిన్ ఇంకా ఇలా అన్నాడు:

"మన కామ్రేడ్సు అయిన స్టఖనోవ్ వర్కర్ల వంక శ్రద్ధగా పరిశీలించండి. వారు ఎలాంటి వ్యక్తులు ? వారిలో చాలామంది యువకులు లేక మధ్యవయస్కులు అయిన స్త్రీ పురుషులు. టెక్నికల్ జ్ఞానమూ, సంస్కృతీ గల్గిన ప్రజలు. సరియైన, ఖచ్చితమైన పని పద్ధతులకు చక్కని ఉదాహరణలను కల్పించినవారు. నిమిషాలనేగాక సెకండ్లను సైతం లెక్కించడం నేర్చుకొన్నవారు. పనిలో కాలం విలువను గుర్తించిన వారు. వారిలో అధిక సంఖ్యాకులు టెక్నికల్ మినిమమ్ పాఠ్యక్రమమును గుర్తుచేసి టెక్నికల్ విద్యను కొనసాగిస్తూ ఉన్నటువంటి వారు. (టెక్నికల్ మినిమమ్ అంటే సోషలిస్టు పరిశ్రమలలోని కార్మికులకు అవసరమైన కనీస టెక్నికల్ పరిజ్ఞాన స్థాయి - అనువాదకుడు) కొందరి ఇంజనీర్లకు, టెక్నిషియన్లకు పరిశ్రమ నిర్వాహకులకుఉన్న స్తబ్ధత, ఛాందసమూ (Conservatism) వీరిలోలేదు. వీరు ధైర్యంగా ముందుకు పురోగమిస్తున్నారు. బూజుపట్టిన టెక్నికల్ ప్రమాణాలను నాశనంచేసి, నూతన ఉన్నతమైన ప్రమాణాలను సృష్టించుతున్నారు. మన పారిశ్రామిక నాయకులు వేసిన ఆర్థిక పథకాలకు, శక్తిసామర్థ్యాలకు సంబంధించిన అంచనాలకు వీరు కొన్ని సవరణలను ప్రవేశపెడుతున్నారు. ఇంజనీర్లు టెక్నిషియన్లు చెప్పేదానిని తరచుగా సవరించుతున్నారు. కొత్త విషయాలను చేరుస్తున్నారు. వీరు తమ పనియొక్క టెక్నిక్‌లో పూర్తిగా ప్రావీణ్యతను సంపాదించిన

వారు. టెక్నిక్ ద్వారా ఎంతవరకు సాధ్యమౌతుందో అంత వరకూ ఫలితాన్ని గుంజగలిగిన సామర్థ్యం కలవారు. అందు చేత వీరు ఇంజనీర్లకు టెక్నీషియన్లకు తరచుగా క్రొత్త విష యాన్ని బోధించి వారిని ముందుకు నెడుతున్నారు. ఈనాడు స్టఖనోవ్ వర్కర్లు సంఖ్యలో చాలా తక్కువమందే కాని మున్ముందు ఇంతకు పదిరెట్లు అవుతారనడంలో సందేహంలేదు. స్టఖనోవ్ వర్కర్లు మన పరిశ్రమలలో క్రొత్త పోకడలను తొక్కుతున్నారనీ, స్టఖనోవ్ ఉద్యమం మన పరిశ్రమల భవిష్యత్తును ప్రతిబింబించుతుందనీ, అది కార్మికవర్గ టెక్నికల్ స్థాయిని, సాంస్కృతిక స్థాయిని భవిష్యత్తులో అభివృద్ధి చేసే బీజాన్ని కలిగివుందనీ మనకు స్పష్టమవడంలేదా? అది ఒక మార్గాన్ని చూపించుతోంది. సోషలిజంనుండి కమ్యూ నిజానికి పరివర్తనచెందేందుకు అవసరమైన శారీరకశ్రమకూ, మానసికశ్రమకూ మధ్యవిభేదాన్ని తొలగించేందు కవసరమైన ఉన్నత శ్రామిక ఉత్పాదక పరిమాణాలను ఈమార్గమొక్కటే సాధించగలదని స్పష్టమగుటలేదా?" (పై గ్రంథమే 529వ పేజీ)

స్టఖనోవ్ ఉద్యమం వ్యాప్తి, అనుకున్నకాలానికి ముందుగానే రెండవ పంచవర్ష ప్రణాళికను పూర్తిచేయుట, కష్టజీవుల జీవనస్థాయిని సాంస్కృతిక స్థాయిని నూతనంగా హెచ్చించడానికి అవసరమైన పరిస్థితులను కల్పించాయి.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో కార్మికుల, ఆఫీసు గుమాస్తాల, నిజమైన జీతాలు రెట్టింపుకంటె ఎక్కువ హెచ్చాయి. 1933 లో మొత్తం చెల్లించిన జీతాలు 3400 కోట్ల రూబుల్సు. 1937 నాటికి ఆసంఖ్య 8100 కోట్ల

రూబుల్సుకు పెరిగింది. ప్రభుత్వం అదేకాలంలో సోషల్ ఇన్సూరెన్సుకొరకు ఖర్చుపెట్టిన ధనాన్ని 460 కోట్ల రూబుల్సు నుండి 560 కోట్ల రూబుల్సుకు పెంచింది. 1937 లోనే వెయ్యి కోట్ల రూబుల్స్ కార్మికులకు, గుమాస్తాలకు ఇచ్చే ప్రభుత్వ భీమాకు, వారి జీవిత పరిస్థితులను అభివృద్ధి చేయడానికీ, వారి సాంస్కృతిక అవసరాలను తీర్చడానికీ, శానిటోరియంలకూ, ఆరోగ్య కేంద్రాలకూ, విశ్రాంతి గృహాలకూ, వైద్య సహాయానికీ ఖర్చుపెట్టబడింది.

గ్రామసీమల్లో సమిష్టి వ్యవసాయ పద్ధతి నిశ్చితంగా స్థిరపడింది. 1935 ఫిబ్రవరిలో సమిష్టి వ్యవసాయపు మేటి పనివారల రెండవ కాంగ్రెస్ జరిగింది. అందులో అంగీకరించబడిన వ్యవసాయ ఆర్టెల్ నిబంధనల ఫలితంగా సమిష్టి వ్యవసాయ క్షేత్రాలక్రింద ఉన్న భూమి శాశ్వతపట్టాతో ఆ క్షేత్రాలకే లభించింది. సమిష్టి వ్యవసాయ పద్ధతి స్థిరపడటం గ్రామీణ ప్రజల్లో దారిద్ర్యాన్ని, భద్రతలేమిని అంతమొందించింది. ఇదివరకు, మూడేళ్ళక్రిందట, సమిష్టి వ్యవసాయదారులు ఒక రోజు పని యూనిట్‌కు ఒకటి లేక రెండు కిలోగ్రాముల ధాన్యాన్ని పొందుతూవుండేవారు. ఇప్పుడు ధాన్యం పండించే ప్రాంతాలలోని సమిష్టివ్యవసాయదారులలో అధిక సంఖ్యాకులు 5 నుండి 12 కిలోగ్రాములవరకు సంపాదిస్తున్నారు. ఇంకా కొంతమంది ఒక రోజుపని యూనిట్‌కు 20 కిలోగ్రాములవరకు సంపాదిస్తున్నారు. ఇదంతా ఇతర రకాల ఉత్పత్తి, ద్రవ్యరూపమైన ఆదాయమూ కాకనే. ధాన్యం పండే ప్రాంతాలలో సాలీనా 500 మొదలు 1500 పూడ్ల ధాన్యం ఆదాయం కల సమిష్టి వ్యవసాయ రైతుకుటుంబాలు లక్షలాది ఉన్నాయి.

పత్తి, బీటుదుంప, ఫ్లాక్సు, పశుసంపద, ద్రాక్షతోటలు, నిమ్మ, దబ్బ మొదలగు పండ్లతోటలు, కూరగాయలు, ఇతర పండ్లు పండించే ప్రాంతాలలో సాలీనా వేలకొలది రూబుల్సు ఆదాయం వచ్చే కుటుంబా లున్నాయి. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు భాగ్యవంతమైనవిగా తయారయ్యాయి. ఇపుడు సమిష్టి వ్యవసాయ కుటుంబానికి ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య కొత్తధాన్యపు గిడ్డంగులు, సరుకు గిడ్డంగులు నిర్మించడం. పూర్వపు నిల్వగిడ్డంగులు సాలీనా వచ్చే కొద్దిపాటి మొత్తాన్ని నిల్వచేసేందుకు నిర్మింపబడ్డాయి. కాని ఇప్పుడవి కుటుంబం లోని అవసరాల్లో పదోవంతుకుకూడా సరిపోవడంలేదు.

1936 లో ప్రజల క్షేమస్థాయి అభివృద్ధి అయింది గనుక, ప్రభుత్వం గర్భస్రావాన్ని నిషేధించింది. దీనితోబాటే ప్రసూతి వైద్యశాలలను, శిశుపోషకశాలలను, పాల కేంద్రాలను, కిండర్‌గార్టెన్‌లను (శిశు విహార స్థలాలను) నిర్మించడానికి విస్తృత కార్యక్రమాన్ని ప్రవేశపెట్టింది. 1935 లో ఇందుకు 87½ కోట్ల రూబుల్స్ ఖర్చుపెడితే, 1936 లో 217 కోట్ల 40 లక్షల రూబుల్స్ కేటాయించబడ్డాయి. పెద్ద కుటుంబాలకు తగు గ్రాంటులను (సహాయనిధులను) ప్రభుత్వం ఇస్తూ ఒక చట్టంచేసింది. ఈ చట్టంకింద 1937 లో నూరు కోట్ల రూబుల్సు గ్రాంటుచేయబడ్డాయి.

అందరికీ నిర్బంధవిద్యావిధానం, కొత్త స్కూళ్ళ నిర్మాణం, ప్రజల సాంస్కృతికాభివృద్ధి త్వరగా హెచ్చడానికి సహాయపడ్డాయి. దేశమంతటా పెద్దయెత్తున స్కూళ్ళు నిర్మించబడ్డాయి. 1914 లో ప్రాథమిక, మాధ్యమికస్కూళ్ళ విద్యార్థులు

80 లక్షలుండేవారు. 1936-37 లో 2 కోట్ల 80 లక్షలకు ఈ సంఖ్య పెరిగింది. ఇదేకాలంలో యూనివర్సిటీ విద్యార్థుల సంఖ్య లక్షా పన్నెండువేలనుండి 5 లక్షల 42 వేలకు పెరిగింది.

ఇది నిశ్చయంగా ఒక సాంస్కృతిక విప్లవమే.

ప్రజలజీవనప్రమాణస్థాయి, సాంస్కృతికస్థాయి అభివృద్ధి చెందడం సోవియట్ విప్లవబలానికీ అజేయశక్తికీ ప్రతిబింబం. గతంలోని విప్లవాలు నశించిపోయాయంటే దానికి కారణం అవి ప్రజలకు స్వాతంత్ర్యమిచ్చినా, వారి భౌతిక, సాంస్కృతిక పరిస్థితులలో తీవ్రమైన అభివృద్ధిని ఏమీ తీసుకొనిరాలేక పోయాయి. అదే వాటిప్రధాన బలహీనత. మన విప్లవం జారుప్రభుత్వం నుండి, పెట్టుబడిదారీవిధానం నుండి ప్రజలను విముక్తి చేయడమేగాక వారి జీవనస్థితిలోను సాంస్కృతికస్థితి లోను తీవ్రమైన అభివృద్ధిని తీసుకువచ్చింది. అదే మన విప్లవానికి ఇతరవిప్లవాలకు ఉన్న తేడా మన విప్లవంయొక్క బలమూ అజేయశక్తీ ఇందులోనే ఉన్నాయి.

అఖిలసోవియట్ స్టఖనోవ్ వర్కర్ల మొదటిసభలో మాట్లాడుతూ కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"ప్రపంచంలో మన శ్రామికవిప్లవం ఒక్కటే ప్రజలకు రాజకీయఫలితాలనే గాక భౌతిక ఫలితాలనుకూడ చూపించ గలిగిన విప్లవం. కార్మిక విప్లవాలన్నింటిలోను అధికారాన్ని చేపట్టగలిగింది ఒక్క విప్లవమేనని మనకు తెలుసు. అది పారిస్ కమ్యూన్. కాని అది చాలకాలం నిల్వలేదు. అది పెట్టుబడి దారీ సంకెళ్ళను తుత్తినియలు చేయడానికి ప్రయత్నించినమాట నిజమే. కాని వాటిని నాశనంచేయడానికి దానికి వ్యవధిలేదు.

విప్లవంమూలంగా లాభకరమైన భౌతికఫలితాలను ప్రజలకు చూపించడానికి అంతకంటె వ్యవధిలేదు. మన విప్లవమొక్కటే పెట్టుబడిదారీ విధానపు సంకెళ్ళను తుత్తినియలుచేసి, ప్రజలకు స్వాతంత్ర్యం సమకూర్చుటేగాక, ప్రజలను సౌభాగ్యవంతమైన జీవితానికి అవసరమైన భౌతిక పరిస్థితులను సృష్టించుటలో కూడ విజయం పొందింది. ఇందులోనే మన విప్లవబలమూ అజేయశక్తీ ఇమిడి ఉన్నాయి." (పై గ్రంథమే 532 వ పేజీ)

# 3

## సోవియట్ల 8 వ కాంగ్రెస్ - సోవియట్ యూనియన్ యొక్క నూతన రాజ్యాంగ చట్టాన్ని ఆమోదించుట

**1935** ఫిబ్రవరిలో సోవియట్‌యూనియన్ సోవియట్ల ఏడవకాంగ్రెస్ జరిగింది. 1924లో ఆమోదించబడిన సోవియట్ యూనియన్ ప్రథమ రాజ్యాంగచట్టాన్ని మార్చాలని ఇది తీర్మానించింది. 1924 లో ఈ చట్టాన్ని ఆమోదించిన నాటి నుండీ సోవియట్‌యూనియన్ జీవితంలో బ్రహ్మాండమైన మార్పులువచ్చాయి. ఈ మార్పుల ఫలితంగా రాజ్యాంగ చట్టాన్ని మార్పుచేయాల్సిన అవసరం కలిగింది. పైన చెప్పిన ఈకాలంలో దేశంలోని వర్గసంబంధాలు పూర్తిగా మారి పోయాయి. నూతన సోషలిస్టుపరిశ్రమల నిర్మాణం జరిగింది.

కులక్‌లు నాశనం చేయబడ్డారు. సమిష్టి వ్యవసాయపద్ధతి విజయంపొందింది. జాతీయ ఆర్థిక విధానంలోని ప్రతి శాఖలోను సోవియట్ సమాజానికి పునాదిగా ఉత్పత్తి సాధనాలపై సోషలిస్టు యాజమాన్యం నెలకొల్పబడింది. సోషలిజం యొక్క విజయం వల్ల ఎన్నికలపద్ధతి మరింత ప్రజాతంత్రం చేయడం సాధ్యమయింది. అందరికీ సమానంగా రహస్యపద్ధతిని, తిన్నగా ఎన్నుకొనే వోటింగుపద్ధతిని ప్రవేశపెట్టడం సాధ్యమయింది.

ఇందుకుగాను కామ్రేడ్ స్టాలిన్ అధ్యక్షత కింద ఒక రాజ్యాంగ ఉపసంఘం (కమిషన్) నెలకొల్పబడింది. అది సోవియట్ నూతన రాజ్యాంగ ముసాయిదా చట్టాన్ని తయారు చేసింది. ఈ ముసాయిదా దేశవ్యాపిత చర్చకు పెట్టబడింది. ఆచర్చ $5\frac{1}{2}$ నెలలు జరిగింది. అటుతర్వాత సోవియట్ల 8వ కాంగ్రెస్ ప్రత్యేకసమావేశానికి ఆ ముసాయిదా నివేదించబడింది.

సోవియట్‌యూనియన్ యొక్క ఈ నూతన రాజ్యాంగ చట్టాన్ని ఆమోదించడమో, తిరస్కరించడమో ఏదో ఒకటి నిర్ణయించడానికి సోవియట్ల ఎనిమిదవ కాంగ్రెస్ 1936 నవంబరులో ప్రత్యేకంగా సమావేశమైంది.

నూతన రాజ్యాంగ చట్టం ముసాయిదాను గురించి, కాంగ్రెస్‌లో రిపోర్టుచేస్తూ కామ్రేడ్ స్టాలిన్, 1924 చట్టం ఆమోదింపబడిననాటి నుండి ఇప్పటివరకు సోవియట్ యూనియన్‌లో జరిగిన ముఖ్యమైన మార్పులను గురించి అంశాలవారీగా వివరించి చెప్పాడు.

1924 రాజ్యాంగ చట్టం నూతన ఆర్థిక విధానం యొక్క ప్రాథమిక దశలో తయారుచేయబడింది. ఆ కాలంలో

సోషలిజం యొక్క అభివృద్ధితోపాటు, పెట్టుబడిదారీ విధానం కూడా అభివృద్ధిచెందడానికి సోవియట్ ప్రభుత్వం అనుమతించింది. పెట్టుబడిదారీ విధానం, సోషలిస్టు విధానం-యీ రెండిటి మధ్య పోటీ క్రమంలో, ఆర్థికరంగంలో పెట్టుబడిదారీ విధానంపై సోషలిజంయొక్క విజయం సంఘటితపరచి సఫలమయ్యేట్లు సోవియట్ ప్రభుత్వం ఒకపథకం వేసింది. "ఎవరు జయించుతారు?" అన్న సమస్య ఇంకా పరిష్కరించబడలేదు. పాతబూజుపట్టిన టెక్నికల్ పరికరాలతో నిండియున్న పరిశ్రమలు యుద్ధ పూర్వస్థాయినికూడ చేరలేదు. వ్యవసాయ పరిస్థితి ఇంతకంటె మరింత శోచనీయంగావుంది. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలు, సమిష్టి వ్యవసాయక్షేత్రాలు, వ్యక్తిగత రైతుక్షేత్రాలనే మహాసముద్రంలో దీవులుగా మాత్రమే ఉన్నాయి. ఆనాటిసమస్య కులక్‌లను ఏరివేయడంకాదు. వారిని అదుపులో ఉంచడం మాత్రమే. దేశవర్తకంలో సోషలిస్టు వర్తక రంగంయొక్క భాగం నూటికి 50 పాళ్లు మాత్రమే అపుడు ఉండేది.

1936 నాటి సోవియట్ యూనియన్ పరిస్థితి పూర్తిగా ఇందుకు విభిన్నం. ఆనాటికి దేశ ఆర్థికజీవితం పూర్తిమార్పుకు లోనయింది. ఆర్థిక జీవితరంగాలన్నింటిలోను పెట్టుబడిదారీ వ్యక్తులు పూర్తిగా తొలగింపబడి సోషలిస్టు విధానం జయం పొందింది. ఇపుడు శక్తివంతమైన సోషలిస్టు పరిశ్రమలు ఉన్నాయి. అవి యుద్ధపూర్వ ఉత్పత్తికి 7 రెట్లు ఉత్పత్తిని వృద్ధి చేశాయి. ప్రయివేటు పరిశ్రమలను పూర్తిగా రద్దుచేశాయి. ఆధునిక యంత్రాలతోకూడిన యంత్రసహిత సోషలిస్టు వ్యవ

సాయం (మెకనైజ్డ్ ఫార్మింగ్) సమిష్టి వ్యవసాయ క్షేత్రాల లోను, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలలోను ప్రపంచంలోకెల్లా పెద్దయెత్తున కొనసాగించబడి విజయం పొందింది. 1936 నాటికి కులకులు ఒకవర్గంగా లేకుండా పూర్తిగా తొలగించబడ్డారు. దేశ ఆర్థికజీవితంలో వ్యక్తిగత రైతులు ఇక ఎట్టి ప్రాముఖ్య తనూ ప్రదర్శించడంలేదు. వర్తకం పూర్తిగా ప్రభుత్వం చేతుల్లో, సహకారసంఘాల చేతుల్లో కేంద్రీకరింపబడింది. మానవుని మానవుడు దోపిడీచేయడం శాశ్వతంగా రద్దుచేయ బడింది. ఆర్థిక జీవితశాఖలన్నింటిలోను నూతన సోషలిస్టు విధానానికి అచంచలమైన పునాదిగా, ఉత్పత్తిసాధనాలపై సోషలిస్టు యాజమాన్యం దృఢంగా నెలకొల్పబడింది. నూతన సోషలిస్టు సమాజంలో ఆర్థికసంక్షోభం, దారిద్ర్యం, నిరు ద్యోగం, నిరాధారపు బ్రతుకు అనేవి శాశ్వతంగా అంతర్ధాన మయ్యాయి. సోవియట్ సమాజంలోని సభ్యులందరికీ సంప త్కరమైన విజ్ఞానవంతమైన జీవితానికి అవసరమగు పరిస్థితులు సృష్టించ బడ్డాయి.

సోవియట్ యూనియన్ ప్రజల వర్గనిర్మాణంలోకూడ తదనుగుణ్యంగానే మార్పువచ్చిందని తన రిపోర్టులో కా. మేక్ స్టాలిన్ తెలియజేశాడు. ఇదివరకే అంతర్యుద్ధకాలంలో భూస్వామ్య వర్గమూ, పాతకాల సామ్రాజ్యవాద పెద్దపెట్టుబడి దారీవర్గం తొలగించబడ్డాయి. సోషలిస్టునిర్మాణ కాలంలో దోపిడీ వ్యక్తులందరూ-పెట్టుబడిదారులు, వర్తకులు, కులకులు అధికలాభాపేక్షాపరులు - తొలగించబడ్డారు. తొలగించబడిన దోపిడీవర్గాల నామమాత్రపు అవశేషాలు మాత్రమే ఇంకా

మిగిలివున్నాయి. వాటిని పూర్తిగా తొలగించివేయడం అతి త్వరలోనే జరుగుతుంది.

సోవియట్ యూనియన్‌లోని కష్టజీవులు - కార్మికులు, రైతులు, మేధావులు - సోషలిస్టు నిర్మాణకాలంలో గొప్ప మార్పుకు లోనయ్యారు.

పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి సాధనాలు తమ చేతుల్లో ఉండేవికావు. తాము దోపిడీ చేయబడే వర్గంగా ఉండే వారు. కాని కార్మికవర్గం ఇపుడాస్థితిలో లేదు. అది పెట్టుబడిదారీ విధానాన్ని రద్దుచేసింది. పెట్టుబడిదార్లనుండి ఉత్పత్తి సాధనాలను లాగివేసి, ప్రజల ఆస్తిగా మార్చివేసింది. పూర్వం వాడబడిన సరియైన రూఢిఅర్థంలో, "శ్రామికవర్గం" ఈనాడు సోవియట్ యూనియన్‌లో లేదు. సోవియట్ యూనియన్‌లోని శ్రామికవర్గం ప్రభుత్వఅధికారాన్ని చేపట్టుటవల్ల అది పూర్తిగా ఒక నూతనవర్గంగా మారిపోయింది. దోపిడీనుండి విముక్తి చెంది, పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్ని రద్దుచేసి, ఉత్పత్తి సాధనాలపై సోషలిస్టు యాజమాన్యం నెలకొల్పి కార్మికవర్గం తనపై దోపిడిని రద్దుచేసుకొంది. అందుచేత మానవ చరిత్రలో ఇదివరకెన్నడూ ఎరగనటువంటి కొత్తరకపు కార్మికవర్గం యిది.

సోవియట్ యూనియన్‌లో రైతులపరిస్థితుల్లో వచ్చిన మార్పులుకూడ అంతకేమాత్రం తీసిపోవు. పూర్వపురోజుల్లో చిన్నచిన్న మధ్యరకపు చెల్లాచెదురై పోయిన రైతుకుటుంబాలు కొండుకోట్లవరకు ఉండేవి. వెనకబడ్డ టెక్నికల్ పరికరాలతో తమ చిన్నచిన్న భూఖండాల వ్యవసాయంలో ఒంటరిగా ఆ కుటుంబాలు నిమగ్నమైపోయేవి. కాని భూస్వాములు,

కులక్‌లు, వర్తకులు, అధిక లాభాపేక్షాపరులు, వడ్డీ వ్యాపారులు దోపిడీచేసేవారు. సోవియట్ యూనియన్‌లో ఇపుడు పూర్తిగా నూతన రైతాంగం తలయెత్తింది. రైతులను దోపిడీచేయడానికి భూస్వాములు, కులక్‌లు, వర్తకులు, వడ్డీ వ్యాపారులు ఇక లేరు. రైతాంగ కుటుంబాలలో అత్యంత అధికసంఖ్య, ఉత్పత్తి సాధనాల ప్రయివేటు యాజమాన్యం మీాద ఆధారపడటంలేదు. సమిష్టి యాజమాన్యం కింద వున్న సమిష్టిక్షేత్రాలలో చేరారు. ఈ సమిష్టి యాజమాన్యం – సమిష్టికృషిద్వారా పెంపొందింది. ఇది అన్నిరకాల దోపిడీనుండి విముక్తి చెందిన కొత్తరకపు రైతాంగం. మానవ చరిత్ర ఇదివరకెన్నడూ ఇలాంటి రైతాంగాన్ని ఎరగదు.

సోవియట్ యూనియన్‌లోని మేధావి వర్గంకూడ మార్పుచెందింది. అందులో చాలభాగం పూర్తిగా నూతన మేధావివర్గంగా మారిపోయింది. దానిలోని అధిక సంఖ్యాకులు కార్మికులనుండి, రైతులనుండి వచ్చారు. పూర్వపు మేధావి వర్గంవలె అది పెట్టుబడిదారీ విధానానికి సేవచేయడంలేదు. సోషలిజానికి సేవచేస్తున్నది. సోషలిస్టు సమాజంలో వారు సమానహోదాగల సభ్యులయ్యారు. కార్మికులు రైతులతో కలసి ఈ మేధావివర్గం నూతన సోషలిస్టు సమాజాన్ని నిర్మించు తోంది. అన్నివిధాల దోపిడీనుండి విముక్తిచెంది ప్రజలకు సేవ చేస్తున్న కొత్తరకపు మేధావివర్గం ఇది. ఇలాంటి మేధావి వర్గాన్ని మానవచరిత్ర ఇదివరకెన్నడు ఎరగదు.

ఆవిధంగా సోవియట్ యూనియన్‌లో కష్టజీవుల మధ్య ఉన్న పాతవర్గవిభేదాలు అంతర్ధానమైపోతున్నాయి. పూర్వపు

వర్గ ప్రత్యేకత సమసిపోతూవుంది. కార్మికుల రైతుల మేధా వుల మధ్య ఆర్థిక రాజకీయ వైరుధ్యాలు క్షీణించి అంతర్ధాన మవుతున్నాయి. సమాజంలో నైతిక రాజకీయ ఐక్యతకు పునాది వేయబడింది.

సోవియట్ యూనియన్ జీవితంలోని ఈ గాఢమైన మార్పులు, సోవియట్ యూనియన్‌లో సోషలిజం పొందిన ఈ నిశ్చిత విజయాలు, నూతన రాజ్యాంగ చట్టంలో ప్రతి బింబించాయి.

నూతన రాజ్యాంగ చట్టం ప్రకారం, సోవియట్ సమా జంలో రెండు మిత్రవర్గాలు ఏర్పడ్డాయి. వీరు కార్మికులు, రైతులు. ఇంకా ఈ వర్గాలకు ప్రత్యేక స్వభావాలు అలాగే ఉన్నప్పటికీ ఇవి మిత్రవర్గాలే. సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల యూనియన్ కార్మికుల రైతుల సోషలిస్టు ప్రభుత్వం.

భూస్వాముల, పెట్టుబడిదారుల అధికారాన్ని కూల ద్రోసి శ్రామికవర్గ నియంతృత్వాన్ని సాధించిన ఫలితంగా కష్టజీవుల ప్రతినిధుల సోవియట్లు అభివృద్ధిచెంది బలపడ్డాయి. అవే సోవియట్ యూనియన్ రాజకీయ పునాది.

సోవియట్ యూనియన్‌లోని అధికారమంతా పట్టణాల లోని, పల్లెలలోని కష్టజీవులకు చెందుతుంది. కష్టజీవుల ప్రతి నిధుల సోవియట్లద్వారా ఈ అధికారం వారికి చెందుతుంది. సోవియట్ యూనియన్‌లోకల్లా ఉన్నతమైన ప్రభుత్వ అధికార సంస్థ దాని సుప్రీమ్ సోవియట్.

సుప్రీమ్ సోవియట్‌లో రెండు చాంబర్సు (శాసన సభలు) ఉంటాయి. ఈ రెంటికీ సమానహక్కు లుంటాయి.

(1) యూనియన్ సోవియట్. (2) జాతుల సోవియట్. సుప్రీమ్ సోవియట్‌ను సోవియట్ ప్రజలు నాలుగేండ్లకొకసారి ఎన్నుకొంటారు. ఈ ఎన్నికలు సర్వజనీన, సమాన, రహస్య పద్ధతి ద్వారా తిన్నగా ఎన్నుకొనే వోటింగుహక్కు ప్రాతిపదికమీద జరుగుతాయి.

కష్టజీవుల ప్రతినిధుల అన్నిసోవియట్లకు వలెనే సుప్రీమ్ సోవియట్ ఎన్నికలుకూడ సార్వజనీనమైనవి. దీనిఅర్థం సోవియట్ యూనియన్‌లో పౌరులంతా, 18 ఏళ్ళుదాటిన వారంతా జాతి, మత, తెగ, రాష్ట్రి, విద్య, ఆస్తి, ఉనికి, గత జీవితం మొదలైన వాటితో నిమిత్తం లేకుండా ప్రతినిధుల ఎన్నికలలో వోటుచేయవచ్చు. పోటీచేయవచ్చు. కాని పిచ్చివారికి, కోర్టుశిక్షించిన వ్యక్తులకు ఎన్నికలహక్కు ఉండదు; వోటింగు హక్కుకూడా వుండదు.

ప్రతినిధుల ఎన్నికలు సమాన హక్కుకలిగిన ప్రాతిపదికపై జరుగుతాయి. దీనిఅర్థం ప్రతిపౌరుడు ఒకవోటు కలిగియుంటాడు. సమానహోదాతో పౌరులంతా ఎన్నికలంలో పాల్గొంటారు.

ప్రతినిధుల ఎన్నికలు ప్రత్యక్ష ఎన్నికలు. దీనిఅర్థం కష్టజీవుల ప్రతినిధుల సోవియట్లన్నింటినీ పల్లెల పట్టణాల సోవియట్లుమొదలు సుప్రీమ్ సోవియటువరకు, పౌరులు ప్రత్యక్షవోటుద్వారా ఎన్నుకొంటారు.

రెండు శాసనసభల సంయుక్త సమావేశంలో సుప్రీమ్ సోవియట్ తన అధ్యక్షవర్గాన్ని (ప్రెసీడియం) సోవియట్

యూనియన్ ప్రజామంత్రి వర్గాన్ని (Council of Peoples' Commissars of the U. S. S. R.) ఎన్నుకుంది.

సోషలిస్టు ఆర్థికవిధానమూ, ఉత్పత్తి సాధనాలపై సోషలిస్టు యాజమాన్యమూ ఈ రెండూ సోవియట్ యూనియన్ ఆర్థిక విధానానికిపునాది. "ప్రతివానిచే అతని శక్తి ననుసరించి పనిచేయించాలి. అతని పనిననుసరించి ప్రతిఫలం ముట్టజెప్పాలి" అనే సోషలిస్టు సూత్రాన్ని సోవియట్ యూనియన్ ఆచరణలో పెట్టింది.

సోవియట్ యూనియన్‌లోని పౌరులందరికీ పనిచేసే హక్కు, విశ్రాంతి విరామాల హక్కు, చదువుకొనేహక్కు, వృద్ధాప్యంలోనూ, జబ్బుపడినపుడు అంగవైకల్యం కలిగినపుడూ జీవితభృతి పొందేహక్కూ గ్యారంటీ చేయబడ్డాయి.

స్త్రీలకు పురుషులతోపాటు అన్నిరంగాలలోను సమాన హక్కులు లభించాయి.

జాతి, తెగ భేదాల్లేకుండా పౌరులందరికీ సమాన హక్కులు ఉండటం అనేది సోవియట్ యూనియన్‌లో ఒక అనుల్లంఘనీయమైన చట్టం.

పౌరులందరికీ మతస్వాతంత్ర్యం, మతవ్యతిరేక ప్రచార స్వాతంత్ర్యం గుర్తించ బడింది.

సోషలిస్టు సమాజాన్ని బలపరచడానికి కాను నూతన రాజ్యాంగ చట్టం ఈ క్రింది హక్కులను ఇచ్చింది: వాక్, సభా, పత్రికా, సమావేశ స్వాతంత్ర్యాలు, ప్రజాసంస్థలుగా ఐక్యమయ్యేహక్కు, వ్యక్తిస్వాతంత్ర్యం, కుటుంబ స్వాతంత్ర్యం, రహస్య (Privacy) ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొనే

స్వాతంత్ర్యం. కార్మిక ప్రజల ప్రయోజనాలను సంరక్షిస్తు న్నందుకుగానీ, శాస్త్రీయ పరిశోధనా చర్యలకుగానీ, జాతీయ స్వాతంత్ర్యానికై పోరాటం సల్పినందుకుగానీ, తమదేశాలలో నిర్బంధాలకు గురిచేయబడిన విదేశ్థులకు తలదాచుకొనేహక్కు- సోవియట్ రాజ్యాంగం ఇచ్చింది.

నూతన రాజ్యాంగచట్టం సోవియట్ యూనియన్ ప్రజలందరిపైన బాధ్యతాయుతమైన విధులనుకూడ నిర్దే శించింది. అవి: చట్టాలను అనుసరించాలి. శ్రామిక క్రమశిక్ష ణను నిలబెట్టాలి. ప్రజావిధులను చిత్తశుద్ధితో నిర్వర్తిం చాలి. సోషలిస్టుసంఘ నిబంధనలను గౌరవించాలి. ప్రజా ఆస్తిని సోషలిస్టుఆస్తిని కాపాడి పెంపొందించాలి. సోషలిస్టు మాతృభూమిని సంరక్షించాలి.

"మాతృభూమిని సంరక్షించడం సోవియట్ యూని యన్ యొక్క ప్రతిపౌరుని పవిత్ర కర్తవ్యం."

వివిధ సంఘాలుగా ఏర్పడే ప్రజలహక్కును గురించి చర్చిస్తూ రాజ్యాంగ చట్టంలోని ఒక నిబంధన ఇలా తెలియ జేస్తున్నది.

"కార్మికవర్గంలోనీ, కష్టజీవులైన ఇతర ప్రజావిభాగాల లోనీ, అత్యంత ఉత్సాహవంతులైన రాజకీయంగా చైతన్య వంతులైన పౌరులు, సోవియట్‌యూనియన్ కమ్యూనిస్టుపార్టీ (బోల్షివిక్)లో సంఘటితమవుతారు. ఈ పార్టీ, సోవియట్ విధానాన్ని అభివృద్ధిచేసి బలపరచే పోరాటంలో, కష్టజీవులకు అగ్రశ్రేణిలో నిలుస్తుంది. కష్టజీవులసంస్థలన్నిటిలోను, ప్రభుత్వ ప్రజాసంస్థలన్నిటిలోను నాయకమణి ఈపార్టీ."

సోవియట్ల ఎనిమిదవ కాంగ్రెస్, సోవియట్ నూతన రాజ్యాంగచట్ట ముసాయిదాను ఏకగ్రీవంగా అంగీకరించి తీర్మానించింది.

ఆవిధంగా సోషలిస్టు విజయాన్నీ కార్మిక కర్షక ప్రజా తంత్రాన్నీ ప్రతిబింబించే ఒక నూతన రాజ్యాంగచట్టాన్ని సోవియట్‌దేశం సంపాదించింది.

సోవియట్‌యూనియన్ నూతన అభివృద్ధిదశలో ప్రవే శించింది. సోషలిస్టుసమాజ నిర్మాణం పూర్తిచేసిన దశనుండి, కమ్యూనిస్టు సమాజానికి క్రమంగా పరివర్తన చెందేదశకు పురోగమించింది. ఆ కమ్యూనిస్టుసమాజ జీవితంలో "ప్రతి వాని నుండి అతని సామర్థ్యాలను బట్టి పనిచేయించుకోవాలి. ప్రతివానికీ అతని అవసరాలను బట్టి ఉత్పత్తిని పంచాలి" అనే కమ్యూనిస్టు సూత్రం మార్గదర్శక సూత్రంగా వుంటుంది. ఈ చారిత్రాత్మక ఘటనను నూతన రాజ్యాంగం శాసనరీత్యా స్థిరీకరించింది.

# 4

దేశద్రోహులూ, విధ్వంసకులూ, గూఢ చారులూ అయిన బుఖారిన్ ట్రాట్స్కీముఠా అవ శేషాలను తుడిచిపెట్టుట - సోవియట్‌యూనియన్ యొక్క సుప్రీమ్ సోవియట్ ఎన్నికకు సన్నాహం - విశాలమైన ఆంతరంగికపార్టీ ప్రజాతంత్రపద్ధతిని పార్టీ విధానంగా అవలంబించుట - సుప్రీమ్ సోవియట్‌ఎన్నిక

1937 లో బుఖారిన్-ట్రాట్స్కీ-ముఠాయొక్క రాక్షస నేరాలకు సంబంధించిన క్రొత్తవిషయాలు బయటపడ్డాయి. ప్యాటకోవ్, రాడెక్ తదితరుల విచారణ, తుకాచెవస్కీ, యాకిర్ మొదలగువారి విచారణ, చివరకు బుఖారిన్, రైకోవ్, క్రెస్టెన్స్కీ, రోజన్‌గోల్ట్స్ మొదలైనవారి విచారణలు ఈక్రింది విషయాలను బయటపెట్టాయి. బుఖారిన్‌వాదులూ, ట్రాట్స్కీ-వాదులూ చాలకాలంక్రితమే ప్రజాశత్రువుల ఉమ్మడి ముఠాగా తయారయ్యారు. "మితవాదుల, ట్రాట్స్కీ-వాదుల కూటమి"గా సంయుక్తంగా పనిచేస్తున్నారు.

•

మానవజాతికి క్షుద్రకీటకాలైన వీరు, ప్రజాశత్రువులగు ట్రాట్స్కీ, జినోవీవ్, కామెనివ్‌లతో కలసి, అక్టోబరు సోషలిస్టువిప్లవ ప్రారంభదినాలనుండే సోవియట్ ప్రభుత్వం పైన, పార్టీపైన, లెనిన్‌పైన కుట్ర సాగించుతున్నారని ఈవిచారణలో తేలింది. 20 ఏండ్ల కాలంలో కావించిన ఈ క్రింది ఘోరకృత్యాలన్నీ బూర్జువాదేశాల గూఢచారి శాఖల ఆజ్ఞ ప్రకారం ట్రాట్స్కీ, జినోవీవ్, కామెనివ్, బుఖారిన్, రైకోవ్, వారితొత్తులూ కలసి స్వయంగా గాని సూచనలిచ్చిగాని జరిపించారు. అవి: 1918 ప్రారంభంలో బ్రెస్ట్‌లిటోవ్స్క్ సంధిని భగ్నపరచాలని చేసిన విద్రోహపు ప్రయత్నాలు, లెనిన్‌పై కుట్ర, 1918 వసంత ఋతువులో లెనిన్, స్టాలిన్, స్వెర్డ్‌లోవ్‌లను అరెస్టుచేసి హత్యచేయడానికి "తీవ్రవాద" సోషలిస్టు - రివల్యూషనరీలతో కలిసి కుట్రచేయుట; 1918 వేసవిలో లెనిన్‌ను తుపాకితో కాల్చి గాయపర్చిన రాక్షస

కృత్యం, అదేసంవత్సరం వేసవిలో "తీవ్రవాద" సోషలిస్టు - రివల్యూషనరీల తిరుగుబాటు. పార్టీలోపల నుండే లెనిన్ నాయకత్వాన్ని కుంటువడజేసి కూలదోయాలనే ఉద్దేశ్యంతో 1921 లో పార్టీలోని విభేదాలను ఉద్దేశ్యపూర్వకంగా తీవ్ర పరచుట, లెనిన్ వ్యాధిగ్రస్తుడై ఉన్నప్పుడు, అతని మరణానంతరం పార్టీ నాయకత్వాన్ని కూలదోయడానికి చేసిన యత్నాలు. విదేశ గూఢచారిశాఖలకు ప్రభుత్వ రహస్యాలను బయటపెట్టి, అవసరమైన భోగట్టాను రహస్యంగా అందజేయుట, కిరోవ్‌ను నీచంగా హత్యచేయుట, విధ్వంసకచర్యలు కొనసాగించుట, అభివృద్ధిని ఆటంకపరచే కృత్యాలుచేయుట, గనులు మొదలైనవానిని పేల్చుట, మెన్‌ఝిన్‌స్కీ, క్విబిషేవ్, గోర్కీలను పిరికిపందలవలె హత్యచేయుట.

క్రూరరాక్షసులయిన ట్రాట్‌స్కీ, బుఖారిన్‌లు తమ యజమానులయిన విదేశప్రభుత్వాల గూఢచారిశాఖల కోర్కెల ననుసరించి, సోవియట్ ప్రభుత్వాన్ని నాశనంచేయడానికి పూనుకొన్నారు. దేశరక్షణశక్తిని కూలద్రోయడానికీ, విదేశ సైనిక దండయాత్రకు సహాయపడడానికీ, రెడార్మీ ఓటమికై మార్గాన్ని సుగమం చేయడానికీ, సోవియట్‌యూనియన్‌ను ఛిన్నాభిన్నం చేయడానికి ప్రయత్నించారు. ఇంతేగాక సోవియట్ సముద్రతీర ప్రాంతాన్ని జపాన్‌కు, సోవియట్ బైలోరష్యాను పోలెండుకు, సోవియట్ యుక్రెయిన్‌ను జర్మనీకు కట్టబెట్టాలని ప్రయత్నించారు. కార్మికుల, సమిష్టి వ్యవసాయదారుల విజయాలను నాశనం చేయాలనీ, సోవియట్‌యూనియన్‌లో పెట్టుబడిదారీ బానిసత్వాన్ని పునరుద్ధరించాలనీ ప్రయత్నించారు.

ఈ వైట్‌గార్డు మరుగుజ్జుల బలం ఒక దోమకంటె ఎక్కువేమీ కాదు. అయినా తాము దేశానికి యజమానుల మని తలచి ఉబ్బితబ్బిబ్బై, యుక్రెయిన్, బైలో రష్యా సముద్రతీర ప్రదేశాలను అమ్మివేయడానికి అధికారం నిజంగా తమ చేతుల్లోనే వుందని ఊహించుకొన్నారు.

సోవియట్ దేశానికి నిజమైన యజమానులు సోవియట్ ప్రజలేననీ, రైకోవ్‌లు, బుఖారిన్‌లు, జినోవీవ్‌లు, కామెనివ్‌లు ప్రభుత్వ తాత్కాలిక నౌకర్లు మాత్రమేననీ, ఏసమయంలో నైనాసరే వారిని పదవులనుండి పనికిమాలిన చెత్తను తుడిచి పారవేసినట్లు ప్రభుత్వం తుడిచిపెట్టగలదనీ, ఈ వైట్‌గార్డు క్షుద్రకీటకాలు మరిచిపోయారు.

సోవియట్ ప్రజలు ఒక వేలు కదిలించినంతమాత్రాన వారు పత్తా తెలియకుండా ఉఫ్‌న ఎగిరిపోతారని నీచమైన యీ ఫాసిస్టు తొత్తులు మరిచిపోయారు.

సోవియట్ కోర్టు బుఖారిన్ - ట్రాట్స్కీ కిరాతకులకు మరణశిక్ష విధించింది.

అంతరంగిక వ్యవహారాల ప్రజామంత్రివర్గం ఈ శిక్షను అమలు పరచింది.

సోవియట్ ప్రజలు బుఖారిన్ - ట్రాట్స్కీముఠాను అంత మొందించడాన్ని అంగీకరించి, తర్వాత కార్యక్రమానికి వెళ్లారు.

తర్వాత కార్యక్రమం సుప్రీం సోవియట్ ఎన్నికకు సన్నాహం చేయుట, దానిని క్రమబద్ధంగా కొనసాగించుట.

పార్టీ తన బలాన్నంతా ఎన్నికల సన్నాహాలకు విని యోగించింది. సోవియట్ యూనియన్ నూతన రాజ్యాంగ

చట్టాన్ని అమలుపరచడం దేశరాజకీయ జీవితంలో మార్పును తీసుకొస్తుందని పార్టీ భావించింది. ఈ మార్పుకు అర్థం ఎన్నికల పద్ధతిలో పూర్తి ప్రజాతంత్ర విధానం ఏర్పడుట. సంకుచిత వోటింగు పద్ధతిస్థానే సార్వజనీన వోటింగుహక్కు ప్రవేశ పెట్టుట. ఇదివరకటి అసమాన వోటింగుపద్ధతిని పూర్తిగా రద్దుచేసి, దాని స్థానే సమాన వోటింగు పద్ధతిని నెలకొల్పుట. పరోక్ష ఎన్నికల స్థానే సూటి ఎన్నికలను, బహిరంగ బాలట్ స్థానే రహస్య బాలట్‌ను ప్రవేశపెట్టుట.

నూతన రాజ్యాంగ చట్టాన్ని ప్రవేశపెట్టకముందు మత గురువులపైన, మాజీ వైట్‌గార్డులపైన, మాజీ కులక్‌లపైన, సామాజికంగా ఉపయోగకరమైన వృత్తిలో నిమగ్నంకాని వ్యక్తులపైన, ఎన్నికల విషయమై కొన్ని నిర్బంధాలుండేవి. నూతన రాజ్యాంగ చట్టం పైనచెప్పినవారి విషయంలో ఎన్నికల నిర్బంధాలనన్నిటినీ రద్దుచేసింది. ప్రతినిధులను ఎన్నుకొనే హక్కు సార్వజనీనం చేసింది.

ఇదివరకు ప్రతినిధుల ఎన్నిక అసమానంగా ఉండేది. పట్టణప్రజల ప్రాతినిధ్యానికీ, గ్రామప్రజల ప్రాతినిధ్యానికీ సూత్రాల్లోనే భేదవుండేది. సమాన వోటింగు హక్కును సంకుచిత పరచవలసిన ఆవశ్యకత ఇప్పుడు రద్దయింది. కనుక సమాన ప్రాతిపదికపైన ఎన్నికలలో పాల్గొనడానికి పౌరులందరికీ హక్కు ఈయబడింది.

ఇదివరలో సోవియట్ అధికారంయొక్క మాధ్యమిక ఉన్నత సంస్థల (Organs) ఎన్నికలు పరోక్షంగా ఉండేవి. కాని ఇపుడు నూతన రాజ్యాంగ చట్టంకింద, గ్రామ సోవియట్

మొదలు పట్టణ సోవియట్ వరకు సుప్రీమ్ సోవియట్‌తో సహా అన్నిటినీ ప్రజలు ప్రత్యక్షంగా ఎన్నుకోవాలి.

పూర్వం సోవియట్ ప్రతినిధులను బహిరంగ బాలట్ ద్వారా ఎన్నుకొనేవారు. అభ్యర్థుల జాబితాలద్వారా ఎన్నుకో నక్కరలేదు. ప్రతి నియోజకవర్గంలోను నిల్చున్న వ్యక్తిగత అభ్యర్థులకు వోటు చేయవచ్చును.

ఇది దేశరాజకీయ జీవితంలో ఒక నిశ్చితమైన మార్పు.

నూతన ఎన్నికలవిధానం ప్రజల రాజకీయ కార్యాచరణను వృద్ధిచేయుటకు దారితీయాలి. వాస్తవంగా అలా దారితీసింది కూడ. సోవియట్ అధికార సంస్థలపైన ప్రజలు ఎక్కువగా పెత్తనం వహించసాగారు. సోవియట్ ప్రభుత్వ సంస్థలకు ప్రజలపట్ల బాధ్యత హెచ్చింది.

ఈ మార్పుకు పూర్తిగా తయారై ఉండేందుకుగాను, పార్టీయే ఈ మార్పుకు చోదకశక్తిగా ఉండాలి. రానున్న ఎన్నికల్లో పార్టీ నాయకపాత్ర పూర్తిగా స్థిరపడాలి. కాని పార్టీ సంస్థలు తమ దైనందిన కార్యాచరణలో సంపూర్ణంగా ప్రజాతంత్రమైనపుడే, పార్టీ ఆంతరంగిక జీవితంలో డెమాక్రటిక్ సెంట్రలిజం (కేంద్రీకృత ప్రజాస్వామికం) సూత్రాలను పూర్తిగా పార్టీ నిబంధనలు నిర్దేశించినట్లు అమలుపరచినపుడే, ఇది సాధ్యమవుతుంది. పార్టీ నిర్వాహక వర్గాలన్నీ ఎన్నుకోబడాలి. పార్టీలో విమర్శ - ఆత్మ విమర్శ సంపూర్ణంగా అభివృద్ధి చెందాలి. పార్టీ సభ్యులకు పార్టీ సంఘాలు పూర్తి బాధ్యత వహించాలి. పార్టీ సభ్యులు తమకుతాము సంపూ

ర్ణంగా ఉత్సాహవంతులై పనిచేయాలి. అపుడే పార్టీ నాయక పాత్ర స్థిరపడుతుంది.

1937 ఫిబ్రవరి ఆఖరులో సెంట్రల్ కమిటీ ప్లీనం(సర్వ సభ్య సమావేశం) జరిగింది. దానిలో సుప్రీమ్ సోవియట్ ఎన్నికలకు పార్టీ సంస్థలను సన్నాహపరిచేవిషయమై కామ్రేడ్ జడనోవ్ రిపోర్టు ఇచ్చాడు. పార్టీసంస్థలు, పార్టీ నిబంధనలను, తమ దైనందిన కార్యంలో డెమాక్రటిక్ సెంట్రలిజం సూత్రాలను నిరంతరం ఉల్లంఘించు తున్నారు. ఎన్నికలకు బదులుగా కోఆప్షన్ పద్ధతి ప్రవేశపెడుతున్నారు. వ్యక్తిగత అభ్యర్థులకు బదులుగా అభ్యర్థుల జాబితాలకు వోటు చేస్తున్నారు. రహస్య బాలట్‌కు బదులుగా బహిరంగ బాలట్ సాగించుతున్నారు - అని ఆ రిపోర్టులో కామ్రేడ్ జడనోవ్ తెలియ జేశాడు. ఇలాంటి అలవాట్లు కలిగిన సంస్థలు సుప్రీమ్ సోవియట్ ఎన్నికలలో తమ కర్తవ్యాలను సరిగా నిర్వర్తించలేవనుట స్పష్టమే. అందుచేత పార్టీ సంస్థలలో అలాంటి ప్రజాతంత్ర వ్యతిరేక పద్ధతులకు స్వస్తి చెప్పించి విశాలమైన ప్రజాతంత్ర పద్ధతులపైన పార్టీని పునర్నిర్మించడం అన్నింటికన్నా ప్రధాన కర్తవ్యం.

ఆ విధంగానే కామ్రేడ్ జడనోవ్ రిపోర్టు విన్నాక, సెంట్రల్‌కమిటీ ప్లీనం ఇలా తీర్మానించింది :

"(ఎ) పార్టీనిబంధనలు నిర్దేశించే విధంగా పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్ర సూత్రాలను బేషరతుగా పూర్తిగా కట్టుబడుతూ పార్టీ పనిని పునర్నిర్మించాలి.

"(బి) పార్టీ కమిటీల సభ్యులను కోఆప్ట్ చేసుకొనే అలవాటును తుదముట్టించాలి. పార్టీ సంస్థల యొక్క నాయక

సంఘాలను పార్టీ నిబంధనలు నిర్దేశించిన విధంగా, ఎన్నిక సూత్రాన్ని పునరుద్ధరించాలి.

"(సి) పార్టీ సంఘాలను ఎన్నుకొనుటలో జాబితాల ద్వారా వోటుచేయు పద్ధతిని నిషేధించాలి. వ్యక్తిగత అభ్యర్థులకే వోటు చేయాలి. పార్టీ సభ్యులందరికీ ఆ అభ్యర్థులను సవాలు చేయడానికీ, విమర్శించడానికీ నిర్నిబంధమైన హక్కు గ్యారంటీగా ఉండాలి.

"(డి) పార్టీ సంఘాలను ఎన్నుకొనుటలో రహస్య బాలట్ ప్రవేశపెట్టాలి.

"(ఇ) పార్టీ సంస్థలన్నిటిలోను ఉన్న పార్టీ సంఘాల ఎన్నికలు జరపాలి. అనగా ప్రాథమిక పార్టీ సంస్థలయొక్క పార్టీ కమిటీలు మొదలు ప్రాదేశిక, ప్రాంతీయ కమిటీల వరకు, వివిధజాతుల కమ్యూనిస్టుపార్టీల సెంట్రల్ కమిటీల వరకు ఎన్నికలు జరపాలి. ఈ ఎన్నికలు మే 20 తేదీలోగా పూర్తి చేయాలి.

"(ఎఫ్) పార్టీసంఘాల ఉద్యోగపరిమితికాలం విషయమై పార్టీ నిబంధనల సూత్రాలను ఖచ్చితంగా అమలుజరపాలని పార్టీ సంస్థలన్నీ ఆదేశించాలి. అనగా : సంవత్సరానికొకసారి ప్రాథమిక పార్టీ సంస్థల ఎన్నికలు జరపాలి. సంవత్సరానికొక సారి జిల్లా, పట్టణ సంస్థలను ఎన్నుకోవాలి. ప్రాంతీయ, ప్రాదేశిక, రిపబ్లిక్ సంస్థలలో ప్రతి 18 నెలలకు ఒకసారి ఎన్నికలు జరపాలి.

"(జి) ప్రాథమిక పార్టీ సంస్థలన్నీ ఫ్యాక్టరీ సర్వసభ్య సమావేశాలలోనే పార్టీ కమిటీలను ఖచ్చితంగా ఎన్నుకోనే

పద్ధతిక కట్టుపడాలి. ఫ్యాక్టరీ సర్వసభ్య సమావేశాలను బదులుగా ప్రతినిధుల సభల ద్వారా పార్టీ కమిటీలను ఎన్నుకొనే పద్ధతిని అనుమతించరాదు.

"(హెచ్) ప్రాథమిక పార్టీ సంస్థలలో సర్వసభ్య సమావేశాలు దాదాపు పూర్తిగా రద్దుచేసి, వాటి స్థానే షాప్ మీటింగులు, ప్రతినిధుల సభలు జరుపుచున్నారు. ఈ పద్ధతిని ఇక అంతమొందించాలి."

ఈ విధంగా పార్టీ రానున్న ఎన్నికలకు తన సన్నాహాలను కొనసాగించింది.

సెంట్రల్ కమిటీ యొక్క ఈ నిర్ణయం అద్భుతమైన రాజకీయ ప్రాముఖ్యత కల్గివుంది. సోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్ ఎన్నికలలో, పార్టీ ప్రచారాన్ని ఇది ప్రారంభించింది. దీని ప్రాముఖ్యత పైన చెప్పిన యీ ఒక్క విషయంలో మాత్రమే కాక ఇంకా ఈ క్రింది విషయంలో కూడ ఇమిడివుంది. పార్టీ సంస్థలు తమపనిని తిరిగి సంఘటిత పరచుకోడానికీ, పార్టీ ఆంతరంగిక ప్రజాతంత్ర సూత్రాలను అవి అనుసరింపజేయడానికీ, సుప్రీమ్ సోవియట్ ఎన్నికలకు పూర్తిగా సంసిద్ధంకావడానికీ ఈ నిర్ణయం సహాయపడింది.

పార్టీ సభ్యులు కాని ప్రజలూ, కమ్యూనిస్టులూ కలిసిన కూటమిని ఎన్నుకోవాలనే సూత్రాన్ని తన ఎన్నికల ప్రచారంలో కేంద్రవిషయంగా చేయాలని పార్టీ నిర్ణయించింది. పార్టీకి చెందని ప్రజలతో కలిపి అభ్యర్థులను సంయుక్తంగా ఆయా నియోజక వర్గాలలో పోటీ చేయించడానికి నిర్ణయించుట ద్వారా పార్టీ ఒక ఒడంబడికకు వచ్చింది. పార్టీకిచెందని

ప్రజలతో ఒక కూటమిని ఏర్పరచుకొని పార్టీ ఎన్నికలలో దిగింది. ఇది బూర్జువాదేశాల ఎన్నికల్లో ఎన్నడూ కనీవిని ఎరగనిది. ఇది అక్కడ పూర్తిగా సాధ్యంకానటువంటి విషయం కూడ. కాని మనదేశంలో ఇలాంటి కూటమి నేర్పరచుట పూర్తిగా సహజమైన విషయమే. ఎందుచేతనంటే, శత్రు వర్గాలు మనదేశంలో ఇక ఏమాత్రమూ లేవు. ప్రజలలోని అన్ని భాగాలలోను రాజకీయ నైతిక ఐక్యత ఉన్నదనుట నిర్వి వాదాంశం.

1937 డిశెంబరు 7 వ తేదీన పార్టీ సెంట్రల్ కమిటీ వోటర్లకు ఒక విజ్ఞప్తి చేసింది. ఆ విజ్ఞప్తిలో ఇలా ఉంది :

"మనసోషలిస్టు రాజ్యాంగచట్టం ప్రాతిపదిక ననుసరించి, 1937 డిశెంబరు 12 వ తేదీన సోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్‌కు ప్రతినిధులను ఎన్నుకొంటారు. పార్టీసభ్యులుకాని కార్మికులు, రైతులు, ఆఫీసుగుమస్తాలు, మేధావులతో సమ్మేళనమై ఒక కూటమిగా బోల్షివిక్ పార్టీ ఎన్నికలలో పోటీచేస్తున్నది... పార్టీకి చెందని ప్రజలకూ తనకూ మధ్య బోల్షివిక్ పార్టీ గోడకట్టుకోదు. తద్విరుద్ధంగా, పార్టీకిచెందని ప్రజలతో సమ్మేళనమై ఒక కూటమిగా ఎన్నికలలో పాల్గొంటుంది. కార్మికుల ఆఫీసుగుమస్తాల సంఘాలతోను, యువ కమ్యూనిస్టు సమితులలోను (Young Communist Leagues) పార్టీకి చెందని ఇతర సంస్థలతోను సొసైటీలతోను కూటమి నేర్పరచుకొని ఎన్నికలలో పార్టీ పోటీచేస్తుంది. దీనిఫలితంగా అభ్యర్థులు, కమ్యూనిస్టులకూ, పార్టీకీచెందని ప్రజలకూ సంయుక్త అభ్యర్థులవుతారు. పార్టీకి చెందని ప్రతి ప్రతినిధీ కమ్యూనిస్టులనుకూడ

ప్రతినిధి అవుతాడు. అలాగే ప్రతి కమ్యూనిస్టు ప్రతినిధి పార్టీకి చెందని ప్రజలకుకూడా ప్రతినిధి అవుతాడు."

సెంట్రల్ కమిటీ ప్రకటన వోటర్లకు ఈ క్రింది విజ్ఞప్తి చేస్తూ ముగించింది :

"కమ్యూనిస్టు అభ్యర్థులకు ఎంత ఏకగ్రీవంగా వోటు చేయాలో, అలాగే పార్టీకి చెందని అభ్యర్థులకుకూడ ఓటు చేయాలని కమ్యూనిస్టులను వారి సానుభూతి పరులను సో. యూ. క. (బో) పార్టీ సెంట్రల్ కమిటీ కోరుతోంది.

"పార్టీ సభ్యులుగాని అభ్యర్థులకు ఎంత ఏకగ్రీవంగా తాము వోటుచేస్తారో, అంత ఏకగ్రీవంగాను కమ్యూనిస్టు అభ్యర్థులకుకూడ వోటుచేయాలని పార్టీకి చెందని వోటర్లను సెంట్రల్ కమిటీ కోరుతోంది.

"జాతుల సోవియట్‌కు, యూనియన్ సోవియట్‌కు ప్రతినిధుల నెన్నుకోడానికి, 1937 డిశంబరు 12 వ తేదీన పోలింగు స్టేషన్ల వద్ద వోటర్లంతా ఒక్క-మనిషిలా హాజరుకావాలని సెంట్రల్ కమిటీ కోరుతోంది.

"సోవియట్ ప్రభుత్వంయొక్క- అత్యున్నత సంస్థకు ప్రతినిధులను ఎన్నుకొనే తమ గౌరవమైన హక్కు-ను వినియోగించుకోకుండా ఏ ఒక్క- వోటరుకూడ మిగిలి పోరాదు.

"సుప్రీమ్ సోవియట్ ఎన్నికలలో ఎట్టి మినహాయింపు లేకుండా వోటర్లంతా పాల్గొనాలి. ఇలా పాల్గొనేటట్లు చూడడం ప్రతి ఒక్క-నీ పౌరధర్మం. ఈ ధర్మాన్ని నిర్వర్తించకుండా కార్యోత్సాహ పరుడైన ఒక్క- పౌరుడూ మిగిలి పోరాదు.

"1937 డిశంబరు 12 వ తేదీ ఒక గొప్పపర్వదినం కావాలి. ఆనాడు సోవియట్ యూనియన్‌లోని అన్నిజాతుల కష్టజీవులు లెనిన్ - స్టాలిన్ల విజయపతాకం చుట్టూ ఐక్యమై పండుగ చేసుకోవాలి."

1937 డిశంబరు 11 వ తేదీన అనగా ఎన్నికలు రేపనగా తమను అభ్యర్థిగా నియమించిన ప్రాంతంలోని వోటర్లను ఉద్దేశించి కామ్రేడ్ స్టాలిన్ ఉపన్యసించాడు. ఎలాంటి వారిని సుప్రీమ్ సోవియట్ ప్రతినిధులుగా, తమ ప్రతినిధులుగా ప్రజలు ఎన్నుకోవాలో తెలియజేస్తూ స్టాలిన్ ఇలా అన్నాడు:

"వోటర్లు అంటే ప్రజలు, తమ ప్రతినిధులు తమ కర్త వ్యాలకు తగినట్లుగా ఉండాలని కోరాలి. తమ పనిలోవారు రాజకీయ అల్పబుద్ధుల (Philistines) స్థాయికి దిగజారగూడదు. వారు తమస్థానాలలో లెనిన్‌లాంటి రాజకీయ వ్యక్తులుగా ఉండాలి. ప్రజానాయకులుగా వారు లెనిన్‌వలె స్పష్టంగాను నిశ్చితంగాను ఉండాలి. లెనిన్‌లాగ వారు పోరాటాలలో నిర్భయంగా వుండాలి. శత్రువులపట్ల నిర్దాక్షిణ్యంగా వుండాలి. పరిస్థితులు క్లిష్టమవుతున్నపుడు, ఏదైనా ప్రమాదం నెత్తిమీద కొచ్చినపుడు, ఏమాత్రం గాభరానుగాని, దానిచిహ్నాలనుగాని ప్రదర్శించరాదు. ఏమాత్రం గాభరా ప్రదర్శించని లెనిన్ లాగ వారు నిలబడాలి. విషమసమస్యలను పరిష్కరించవలసి వచ్చినపుడు, అనుకూల ప్రతికూల శక్తులను సమగ్రంగా అంచనావేసి, ఆసమస్యలకు అవసరమైన సమగ్రమైన పరిష్కార (Orientation) మిచ్చుటలో లెనిన్‌లాగ వివేచనతోను తొందరపాటు లేకుండా (Deliberate) ఉండాలి. లెనిన్ లాగ

వారు చిత్తశుద్ధిలోను నీతివంతులుగాను ఉండాలి. లెనిన్‌లాగ తమ ప్రజలను ప్రేమించాలి."

డిశంబరు 12వ తేదీన సుప్రీం సోవియట్ ఎన్నికలు అత్యంత ఉత్సాహంతో జరిగాయి. అవి వట్టి ఎన్నికలు మాత్రమే కాదు. ఆనాడు సోవియట్‌ప్రజలు తమ విజయాన్ని పండుగచేసుకొని ఆనందించారు. ఆ విధంగా సోవియట్ ప్రజల మధ్య వున్న స్నేహాన్ని ప్రదర్శించే పర్వదినమది.

మొత్తం 9 కోట్ల 40 లక్షల వోటర్లలోను 9 కోట్ల 10 లక్షల వోటర్లు అనగా నూటికి 96.8 మంది వోటుచేశారు. వీరిలో 8 కోట్ల 98 లక్షల 44 వేలు అనగా నూటికి 98.6 కమ్యూనిస్టుల-పార్టీకి చెందని ప్రజల కూటమికి వోటు చేశారు. 6,32,000 మంది మాత్రం, అనగా నూటికి ఒకటికంటె కూడ తక్కువ, ఈకూటమికి వ్యతిరేకంగా వోటుచేశారు. ఈ కూటమి అభ్యర్థులంతా ఒక్కరు కూడ మిగలకుండా ఎన్నుకోబడ్డారు.

ఆ విధంగా 9 కోట్ల ప్రజలు సోవియట్ యూనియన్ లోని సోషలిస్టు విజయాన్ని తమ ఏకగ్రీవమైన ఓటు ద్వారా ధృవపరచారు.

ఇది కమ్యూనిస్టుల - పార్టీకి చెందని ప్రజల యొక్క కూటమి అఖండ విజయం.

ఇది బోల్షివిక్‌పార్టీకి అఖండ విజయం.

అక్టోబరు విప్లవం యొక్క 12వ వార్షికసభలో ఇచ్చిన చారిత్రకోపన్యాసంలో, కామ్రేడ్ మాలటోవ్ చెప్పినట్లు ఇది సోవియట్ ప్రజల నైతిక, రాజకీయ ఐక్యతను అత్యద్భుత ధ్రువ-పత్రం.

# సారాంశం

బోల్షివిక్ పార్టీ అధిగమించిన చారిత్రక పంథా నుంచి మనం తెల్సుకోవలసిన సారాంశ మేమిటి?

సో. యూ. క. (బో) పార్టీ చరిత్ర మనకు నేర్పేదేమిటి?

ఈ క్రింది విషయాలను నేర్పుతూంది.

1. విప్లవ శ్రామికవర్గ పార్టీ లేనిదే, అవకాశవాదరహిత పార్టీ లేనిదే, రాజీబేరగాళ్ళతోను, లొంగుబాటు దార్లతోను సమాధాన పడనిపార్టీ లేనిదే, పెట్టుబడిదారీవర్గంపట్ల, దాని ప్రభుత్వాధికారంపట్ల విప్లవ వైఖరిని ప్రదర్శించే పార్టీ లేనిదే, శ్రామికవర్గ విప్లవ విజయమూ, శ్రామికవర్గ నియంతృత్వ విజయమూ అసాధ్యమని ప్రప్రథమంగా పార్టీ చరిత్ర మనకు బోధించుతుంది.

అలాంటిపార్టీ లేకుండా శ్రామికవర్గాన్ని వదలివేయడమంటే, దానికి విప్లవ నాయకత్వం లేకుండా చేయడమే. దానికి విప్లవ నాయకత్వం లేకుండా వదలివేయడమంటే శ్రామికవర్గ విప్లవ ఆశయాన్ని నాశనం చేయడమే.

శాంతియుత పరిసితులలో పెరిగి, అవకాశవాదుల తోక పట్టుకొని నడుస్తూ, "సమాజ సంస్కరణలను" గురించి కలలు గంటూ, సామాజిక విప్లవమంటే భయపడుతూవుండే పశ్చిమ యూరోపియన్ సోషల్ డెమాక్రటిక్ పార్టీలాంటి మామూలు రకంపార్టీ అలాంటి విప్లవపార్టీ కాజాలదు.

ఒక కొత్తరకపు పార్టీ, మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీ, సమాజిక విప్లవపార్టీ, పెట్టుబడిదారీ విధానంపై నిశ్చిత పోరా

టాలు సాగించడానికి శ్రామిక వర్గాన్ని సన్నాహం చేయ సామర్థ్యంగలపార్టీ, శ్రామికవర్గ విప్లవ విజయాన్ని సంఘటితం చేయగలపార్టీ, ఒక్కటే అలాంటి విప్లవపార్టీ అవుతుంది.

సోవియట్ యూనియన్‌లోని బోల్షివిక్ పార్టీ అలాంటి పార్టీ.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు: "విప్లవ పూర్వ కాలంలో, దాదాపు అభివృద్ధి శాంతియుతంగా జరిగేకాలంలో, కార్మికవర్గంలో రెండవ ఇంటర్నేషనల్ పార్టీలు ప్రాబల్యంగా ఉన్నాయి. చట్టబద్ధ పోరాట రూపాలు మాత్రమే ముఖ్య రూపాలుగా ఆ కాలంలో ఎంచబడుతున్నాయి. అపుడు పార్టీకి అంత ప్రాముఖ్యతలేదు - ఉండజాలదు కూడా. తరవాత బహిరంగ విప్లవ సంగ్రామ పరిస్థితులలో మాత్రమే దానికి అలాంటి నిశ్చిత ప్రాముఖ్యత వచ్చింది.

"రెండవ ఇంటర్నేషనల్‌పై చేసినదాడులకు జవాబుగా దానిని సమర్థించుతూ కాట్‌స్కీ యిలా అన్నాడు:

"రెండవ ఇంటర్నేషనల్ పార్టీలు శాంతి సాధనాలేకాని యుద్ధకాలంలోనూ, శ్రామికవర్గం విప్లవపోరాటం సాగించు కాలంలోను ఎట్టి ప్రాముఖ్య చర్యలను తీసుకోడానికి శక్తిహీన మైనవి. ఇది నిజమే. కాని దీని అర్థమేమిటి? రెండవ ఇంటర్నేషనల్ పార్టీలు శ్రామికవర్గ విప్లవ పోరాటానికి పనికిరానివనీ, అవి కార్మికులను అధికారానికి నడిపే తీవ్రవాద (మిలిటెంటు) శ్రామికవర్గ పార్టీలు కావనీ, శాసనసభా పోరాటాలకు, ఎన్నికలను మాత్రం ఉపయోగపడే యంత్రాలనీ స్పష్టమైంది. రెండవ ఇంటర్నేషనల్‌లో అవకాశవాదులు ఉన్నతస్థాయిలో

ఉన్నపుడు, శ్రామికవర్గానికి నాయకత్వం వహించిన సంస్థ పార్టీ గాదు. దీని శాసనసభ ముఠాయే నాయకత్వంవహించింది. ఇలాఎందుకు జరిగిందో పై విషయాలే స్పష్టపరుస్తున్నాయి.ఆకాలంలో శాసనసభముఠాకు పార్టీ ఒక తోకగాను, ఉపాంగంగాను మాత్రంగా ఉండేదనుట స్పష్టమే. అలాంటి పరిస్థితులలో అలాంటి పార్టీ నాయకత్వం వహించియున్నపుడు శ్రామిక వర్గాన్ని విప్లవానికి తయారుచేయడమనే సమస్యయే లేదని వేరే చెప్ప నవసరంలేదు.

"నూతన యుగోదయంతో పరిస్థితులు పూర్తిగా మార్పుచెందాయి. ఈ నూతనయుగం బహిరంగ వర్గ ఘర్షణతోను, శ్రామికవర్గంయొక్క విప్లవ కార్యాచరణతోను, శ్రామికవర్గ విప్లవంతోను నిండియుంది. సామ్రాజ్యవాదాన్ని కూలద్రోసి శ్రామికవర్గం అధికారాన్ని కైవశం చేసుకోడానికి సర్వశక్తులను ప్రత్యక్షంగా సమకూర్చుతున్న కాలమిది. ఈ కాలంలో శ్రామికవర్గాన్ని అనేక నూతన కర్తవ్యాలు ఎదుర్కొన్నాయి. అవి: నూతన విప్లవ పద్ధతులపైన పార్టీ పనినంతటినీ పునర్నిర్మించుట; అధికారాన్ని కైవశం చేసుకొనే విప్లవ పోరాటతత్వంతో కార్మికులను తయారుచేయుట; అదనపు బలాలను (రిజర్వులను) సన్నాహపరచి కదల్చుట; పొరుగుదేశాలలోని శ్రామికులతో మైత్రిని నెలకొల్పుట; వలసదేశాలలోని, పరాధీనదేశాలలోని స్వాతంత్ర్య ఉద్యమాలతో గట్టి సంబంధాల నేర్పరచుకొనుట మొదలైనవి. శాంతియుతమైన శాసనబద్ధ పోరాట పరిస్థితులలో పెరిగిన పాత సోషల్ డెమాక్రటిక్ పార్టీలు, ఈ కర్తవ్యాలను నెరవేర్చగలవని అనుకొంటే నిరాశా నిర్వేదాలకు గురియై అనివార్యమైన

అపజయానికి పాల్పడాలి. అలాంటి కర్తవ్యాలను భుజస్కంధాలపై వేసుకోవల్సిన శ్రామికవర్గం పాత పార్టీల నాయకత్వం కింద వుంటే, అది పూర్తిగా నిరాయుధ మవుతుంది. శ్రామిక వర్గం అలాంటి స్థితిగతులకు అంగీకరించ జాలదని వేరే చెప్ప నక్కర్లేదు.

"కాబట్టి ఒక నూతనపార్టీ, మిలిటెంటు (తీవ్రవాద) పార్టీ, విప్లవపార్టీ కావాలి. అధికారం కైవశం చేసుకొనే పోరాటంలోకి శ్రామికవర్గాన్ని నడప ధైర్యంకలిగిన పార్టీ కావాలి. విప్లవ సమయంలో విషమ పరిస్థితులమధ్య మన మార్గాలను గనుగొనగల్గిన, అనుభవంగల పార్టీ కావాలి. తన ఆశయం చేరుకోడానికి మార్గ మధ్యంలోనున్న అడ్డంకులనే గుట్టలను చక్కగా తప్పుకొని నడపగల్గిన పార్టీ కావాలి.

"అలాంటి పార్టీ లేకుండా సామ్రాజ్యవాదాన్ని కూల దోయాలనిగాని, శ్రామికవర్గ నియంతృత్వాన్ని సాధించాలని గాని తలచడంకూడ నిరర్థకం.

"అలాంటి నూతనపార్టీ లెనినిస్టుపార్టీయే. (జె. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీష్ ఎడిషన్, మాస్కో 1947, 80, 81 పేజీలు)

(2) పార్టీ చరిత్ర మనకు మరోవిషయాన్ని కూడ బోధించుతుంది. కార్మికవర్గ ఉద్యమంయొక్క పరిణత సిద్ధాంతాన్ని, మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని పూర్తిగా అవగాహన చేసుకొంటే తప్ప, కార్మికవర్గ పార్టీ తన వర్గానికి నాయకపాత్రను నిర్వహించలేదు. శ్రామికవర్గ విప్లవనిర్మాత పాత్రనూ నాయకపాత్రనూ నిర్వహించ లేదు.

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతంయొక్క శక్తి ఈ కింది విషయాలలో ఇమిడి ఉంది: ఎట్టిపరిస్థితిలోనైనా సరియైన పరిష్కార మార్గాన్ని కనుగొనేందుకు సిద్ధాంతం పార్టీకి సహాయపడుతుంది. వర్తమాన ఘటనల్లోని ఆంతరంగిక సంబంధాలను అర్థంచేసుకోడానికి సహాయపడుతుంది. ఆ ఘటనల క్రమాన్ని ముందుగా చూడగల్గడమేగాక, ప్రస్తుతం అవి ఏమార్గాన ఎలా వృద్ధి చెందుతున్నాయో గ్రహించుటేగాక, భవిష్యత్ లో అవి ఏమార్గాన ఎలా అభివృద్ధి చెందితీరుతాయో దానిని గూడ గ్రహించడానికి ఆ సిద్ధాంతం తోడ్పడుతుంది.

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకొన్న పార్టీమాత్రమే ఆత్మవిశ్వాసంతో పురోగమించి కార్మికవర్గాన్ని ముందుకు నడపగలదు.

తద్విరుద్ధంగా, మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోని పార్టీ తన మార్గంకోసం చీకట్లో దేవులాడుతుంది. తన చర్యలలో విశ్వాసాన్ని కోల్పోతుంది. కార్మికవర్గాన్ని ముందుకు నడపలేక పోతుంది.

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోడానికి కావలసిందల్లా, మార్క్స్, ఏంగిల్స్, లెనిన్ గ్రంథాలనుండి విడిగా కొన్ని సారాంశాలను (Conclusions), సూత్రాలను (Propositions) కష్టపడి వల్లించడమని భావించవచ్చు. సమయం వచ్చినప్పుడు వాటిని ఉల్లేఖించి అంతటితో ఆగిపోవడమనుకోవచ్చు. కంఠతా వల్లించిన ఈ సారాంశాలూ, సూత్రాలూ ప్రతి పరిస్థితికీ ప్రతిసమయానికీ సరిపోతాయని ఆశించవచ్చు. కానిమార్క్సిస్టు-

లెనినిస్టు సిద్ధాంతాన్ని ఆ దృష్టితో చూడడం పూర్తిగా తప్పు. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం పిడివాదుల (Dogmas) సంపుటియనిగాని, ప్రశ్నోత్తరావళియనిగాని, మతవిశ్వాస చిహ్నమనిగాని భావించరాదు. మార్క్సిస్టులు పిడివాదులని, ఛాందస పండితులనికాని భావించరాదు. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం సమాజాభివృద్ధియొక్క శాస్త్రం. కార్మికవర్గంయొక్క శ్రామికవర్గ విప్లవంయొక్క, కమ్యూనిస్టు సమాజ నిర్మాణం యొక్క శాస్త్రం (Science). అది శాస్త్రం అగుటవల్ల ఒకచోటనే ఆగిపోజాలదు, ఆగిపోదు. అది అభివృద్ధి చెందుతూ సమగ్రత చెందుతూ వుంటుంది. తన అభివృద్ధిలో నూతన అనుభవంతోను, నూతన విజ్ఞానంతోను అది మరింత సంపదవంతమవుతుంది. దాని సారాంశాలూ, సూత్రాలూ కాలక్రమంలో కొన్ని మారక తప్పదు. వాటిస్థానే నూతన సారాంశాలూ, సూత్రాలూ, నూతన చారిత్రక పరిస్థితులకు అనుగుణ్యాంగా తప్పక వస్తాయి.

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోవడమంటే దాని సూత్రాలను, సారాంశాలను కంఠతా వల్లించి ప్రతి అక్షరం పట్టుకొని వ్రేలాడటమని కానే కాదు. మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోవడమంటే, అన్నిటికన్నా ప్రప్రథమంగ, దానిలోని అక్షరాలకు దాని సారాంశానికి ఉన్న తేడాను గుర్తించుట నేర్చుకోవాలి.

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోవడమంటే ఇది. ఈ సిద్ధాంతంయొక్క

సారాంశాన్ని జీర్ణంచేసుకొని మార్పుచెందుతున్న శ్రామికుల వర్గ పోరాట పరిస్థితులలోని విప్లవోద్యమ ప్రత్యక్ష సమస్యలను పరిష్కరించుటలో, ఆ సిద్ధాంతాన్ని ఉపయోగించ గలిగి యుండాలి.

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోవడమంటే అర్థం విప్లవోద్యమంయొక్క నూతన అనుభవంతోను, నూతన సూత్రాలతోను, సారాంశాలతోను ఈ సిద్ధాంతాన్ని మరింత పెంపొందించగల్గుటయే. సిద్ధాంత సారాంశం ననుసరించి, ఎట్టి జంకూ గొంకూ లేకుండా, బూజు పట్టిన పాత సూత్రాల సారాంశాల స్థానే నూతన చారిత్రక పరిస్థితికి అనుగుణ్యమైన సూత్రాలను, సారాంశాలను నెలకొల్పి ఆ సిద్ధాంతాన్ని అభివృద్ధిచేసి పురోగమింపజేయుటయే.

---

మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం పిడివాదం కాదు. కార్యాచరణకు మార్గం చూపేది.

రెండవ రష్యన్ విప్లవానికి పూర్వం (1917 ఫిబ్రవరికి పూర్వం) పెట్టుబడిదారీ విధానంనుండి సోషలిజానికి పరివర్తన చెందే కాలంలో, సమాజానికి చాల అనువైన రాజకీయ స్వరూపం పార్లమెంటరీ డెమాక్రటిక్ రిపబ్లిక్ అని అన్ని దేశాల మార్క్సిస్టులూ భావించేవారు. శ్రామికవర్గ నియంతృత్వానికి బాగా అనుకూలమైన రూపం పారిస్ కమ్యూన్ లాంటి రాజకీయ స్వరూపం అనీ, పార్లమెంటరీ రిపబ్లిక్ కాదనీ, 1870 ప్రాంతాలలో మార్క్సు చెప్పినమాట నిజమే. కాని దురదృష్టవశాత్తు మార్క్సు ఈ సూత్రాన్ని తన వ్రాతలలో మరింత పెంపొందించలేదు. ఈసూత్రం అడుగునపడి పోయింది.

ఇంతేకాక 1891 లో ఎర్ ఫర్ట్ (Erfurt) కార్యక్రమ ముసాయి దాను విమర్శించుతూ ఏంగెల్సు ఒక ప్రకటన చేశాడు. ఇది ప్రామాణికమైనది కూడా. "శ్రామికవర్గ నియంతృత్వం యొక్క నిర్ణీతరూపం... ప్రజాతంత్ర రిపబ్లిక్" అని ఆ ప్రకటన. దీనితో శ్రామికవర్గ నియంతృత్వానికి రాజకీయ రూపం ప్రజాతంత్ర రిపబ్లిక్కేనని మార్క్సిస్టులు భావించుతూ వచ్చా రనుటలో ఎట్టి సందేహమూ లేదు. ఏంగెల్స్ సూత్రం ఆ తర్వాత మార్క్సిస్టులందరికీ, లెనిన్ తో సహా, అనుసరించదగిన సూత్ర మైంది. కాని 1905 రష్యన్ విప్లవమూ, ముఖ్యంగా 1917 ఫిబ్రవరి విప్లవమూ సామాజిక రాజకీయసంస్థకు నూతన రూపాన్ని తెచ్చిపెట్టాయి. ఆ రూపం కార్మిక కర్షక ప్రతిని ధుల సోవియట్లు. లెనిన్ రష్యన్ విప్లవాల రెంటి అనుభవాన్ని అధ్యయనం చేసిన ఫలితంగా, మార్క్సిస్టు సిద్ధాంత ప్రాతిపది కపై మరొక కొత్త నిర్ణయానికి వచ్చాడు. శ్రామికవర్గ నియం తృత్వానికి మంచి రాజకీయ స్వరూపం పార్లమెంటరీ డెమాక్ర టిక్ రిపబ్లిక్ కాదనీ, సోవియట్ల రిపబ్లికని లెనిన్ నిర్ధారణకు వచ్చాడు. దీనిని ఆధారం చేసుకొని ముందుకు పోతూ లెనిన్ 1917 ఏప్రిల్ లో, అనగా బూర్జువా విప్లవంనుండి సోషలిస్టు విప్లవానికి పరివర్తనం చెందేకాలంలో శ్రామికవర్గ నియంతృ త్వానికి మంచి రాజకీయ స్వరూపం సోవియట్ల రిపబ్లిక్కేనని నినాదమిచ్చాడు. అన్నిదేశాలలోని అవకాశవాదులు పార్ల మెంటరీ రిపబ్లిక్ కే అంటిపెట్టుకొన్నారు. లెనిన్ మార్క్సిజం నుండి దూరమవుతున్నాడనీ, ప్రజాతంత్రాన్ని నాశనం చేస్తున్నా డనీ నిందించ సాగారు. కాని మార్క్సిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహనచేసుకొన్న నిజమైనమార్క్సిస్టు లెనినేగాని

యీ అవకాశవాదులుకారు. లెనిన్ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని నూతన అనుభవంతో పెంపొందించి పురోగమింప జేస్తున్నాడు. పోతే ఇక అవకాశవాదులు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని వెనక్కు లాగుతూ, దాని సూత్రాలలో ఒకదానిని పిడివాదంగా మార్చివేస్తున్నారు.

లెనిన్ గనుక మార్క్సిజం యొక్క ప్రతి అక్షరాన్ని తు. చ. తప్పరాదని బెదిరిపోయినట్లయితే, ఏంగెల్సుచే సూత్రీకరించబడిన ఈ పాత మార్క్సిస్టు సూత్రాల స్థానే నూతనచారిత్రక పరిస్థితులకు అనుగుణ్యంగావుండే సూత్రాలను అనగా సోవియట్ల రిపబ్లిక్‌కు సంబంధించిన సూత్రాలను సూచించడానికి సాహసించకపోయినట్లయితే, మన పార్టీ, మన విప్లవం, మన మార్క్సిజం, ఏమైపోయేది? పార్టీ చీకటిలో తడుముకొంటూ ఉండేది. సోవియట్లు సంఘటనారహితమై వుండేవి. సోవియట్ అధికారం మనకు లభించియుండేదికాదు. మార్క్సిస్టు సిద్ధాంతం తీవ్రమైన అపజయాన్ని పొందేది. శ్రామికవర్గం ఓడిపోయేది. దాని శత్రువులు జయించి యుండేవారు.

సామ్రాజ్యవాద దశకు పూర్వమున్న పెట్టుబడిదారీ విధానాన్ని అధ్యయనం చేసిన ఫలితంగా ఏంగెల్సూ, మార్క్సూ ఈక్రింది నిర్ణయానికివచ్చారు: "ఒంటరిగా ఒక దేశంలో సోషలిస్టు విప్లవం విజయం పొందజాలదు. నాగరికదేశాలన్నీ లేక వాటిలో అధికసంఖ్య ఒకేసారి దెబ్బకొట్టడంవల్ల సోషలిస్టు విప్లవం విజయం పొందుతుంది." అని ఈ నిర్ణయం. ఇది 19వ శతాబ్దం మధ్యకాలంనాటిసంగతి. ఈ నిర్ధారణ ఆ తరు

వాత మార్క్సిస్టులందరికీ మార్గదర్శక సూత్రమైంది. కాని ఇరవయ్యో శతాబ్దప్రారంభం నాటికి సామ్రాజ్యవాదదశకు పూర్వమున్న పెట్టుబడిదారీవిధానం సామ్రాజ్యవాద పెట్టుబడి దారీ విధానంగా పెంపొందింది. వృద్ధియగుతున్న పెట్టుబడిదారీ విధానం, మరణశయ్యపై నున్న పెట్టుబడిదారీ విధానంగా మారింది. సామ్రాజ్యవాదపెట్టుబడిదారీవిధానాన్ని అధ్యయనం చేసిన ఫలితంగా లెనిన్, మార్క్సిస్టు సిద్ధాంత ప్రాతిపదికపైన, ఈ క్రిందినిర్ణయానికి వచ్చాడు. మార్క్సు ఎంగెల్సుల పాత సూత్రం నూతన చారిత్రక పరిస్థితులకు ఇక యేమాత్రం సరిపోదు. సోషలిస్టు విప్లవం ఒంటరిగా ఒక దేశంలో జయిం చుట పూర్తిగా సంభవం. అన్నిదేశాల అవకాశవాదులు మార్క్సు ఎంగెల్సుల పాత సూత్రాన్ని అంటిపెట్టుకొన్నారు. లెనిన్ మార్క్సిజానికి దూరమవుతున్నాడని నిందించారు. కాని మార్క్సిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అధ్యయనం చేసిన నిజమైన మార్క్సిస్టు లెనిన్‌గాని ఆ అవకాశవాదులు కారు. ఎందువల్ల నంటే లెనిన్ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని నూతన అనుభవంతో పెంపొందించి దానిని ముందుకు కొనిపోతున్నాడు. కాగా అవకాశవాదులు దానిని వెనక్కులాగి దానినొక నిర్జీవప్రతిమగా చేస్తున్నారు.

లెనిన్ గనుక మార్క్సిజం యొక్క ప్రతి అక్షరాన్ని తు. చ. తప్పరాదని భయపడి, మార్క్సిజం యొక్క పాత సూత్రాలలో ఒకదానిని త్రోసిపుచ్చి దాని స్థానే, నూతన చారిత్రక పరిస్థితులకు అనుగుణ్యంగా వుండే మరోనిర్ణయాన్ని అనగా – ఒంటరిగా ఒక దేశంలో సోషలిజం విజయంపొందుట సాధ్యము అని చెప్పే ఒక నూతననిర్ణయాన్ని – చేయడానికి

తగిన సిద్ధాంత విశ్వాసస్థైర్యమే లేనట్లయితే, మన పార్టీ, మన విప్లవం, మన మార్క్సిజం ఏమైపోయేది? పార్టీ చీకటిలో తడుముకొంటూవుండేది. శ్రామికవర్గ విప్లవానికి నాయకత్వం లేకుండాపోయేది. మార్క్సిస్టు సిద్ధాంతం క్షీణించ ప్రారంభించేది. శ్రామికవర్గం పరాజయంపొందేది. వారి శత్రువులు విజయం పొందేవారు.

అవకాశవాదం మార్క్సిస్టు సిద్ధాంతాన్ని గాని, లేక దాని సూత్రాలను, నిర్ణయాలనుగాని ప్రతిసారి ప్రత్యక్షంగా తిరస్కరించుతుందనడానికి వీలులేదు. మార్క్సిజం యొక్క కొన్ని ప్రతిపాదనలు అప్పటికే బూజుపట్టినప్పటికీ, వాటినే పట్టుకొని వేలాడి, వాటిని ఒకపిడివాదంగా మార్చడానికి ప్రయత్నించడమూ, తత్ఫలితంగా మార్క్సిజం ఇంకా అభివృద్ధి చెందకుండా ఆటంకపరచడమూ తత్ఫలితంగా శ్రామికవర్గ విప్లవోద్యమాభివృద్ధిని కుంటుపరచడమూ - ఈ రూపంలో కూడ అవకాశవాదం అప్పుడప్పుడు బయటపడుతుంది.

ఎంగెల్సు మరణానంతరం సిద్ధాంతకర్తలలో మేటి లెనిన్ తర్వాత స్టాలిన్ తదితరశిష్యులనీ చెప్పడం ఏమాత్రం అతిశయోక్తి కాదు. శ్రామికవర్గ పోరాటాలయొక్క నూతన పరిస్థితులలోని నూతన అనుభవంతో మార్క్సిస్టు సిద్ధాంతాన్ని పెంపొందించి ముందుకు కొనిపోయిన మార్క్సిస్టులు వీరు మాత్రమే.

లెనినూ, లెనినిస్టులూ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని అభివృద్ధి పరచారు. కనుకనే లెనినిజం అంటే మరింత అభివృద్ధి చెందిన మార్క్సిజం. శ్రామికుల వర్గపోరాటాల నూతన

పరిస్థితులలోని మార్క్సిజం అది. సామ్రాజ్యవాదమూ, శ్రామికవర్గ విప్లవాల దశలోని మార్క్సిజం అది. ప్రపంచంలోని ఆరవభాగంలో సోషలిజం విజయం పొందినదశలోని మార్క్సిజం అది.

బోల్షివిక్ పార్టీ నాయకులు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకోపోయినట్లయితే, ఈ సిద్ధాంతాన్ని కార్యాచరణకు మార్గదర్శకమని వారు గ్రహించకపోయినట్లయితే, శ్రామికుల వర్గ పోరాటంయొక్క నూతన అనుభవంతో మార్క్సిస్టు సిద్ధాంతాన్ని పెంపొందించి ముందుకుకొనిపోవుట వారు నేర్చుకొని యుండకపోయినట్లయితే 1917 అక్టోబరులో బోల్షివిక్ పార్టీ జయించి యుండేదికాదు.

అమెరికా కార్మికవర్గ ఉద్యమాన్ని నడిపే బాధ్యత తీసుకొన్న అమెరికాలోని జర్మన్ మార్క్సిస్టులను విమర్శించుతూ ఏంగెల్సు ఇలా వ్రాశాడు:

"అమెరికన్ ప్రజాసామాన్యాన్ని కదిలించే సాధనంగా తమ సిద్ధాంతాన్ని ఎలా ఉపయోగించాలో జర్మన్లకు తెలియదు; వారిలో చాలమందికి అసలు సిద్ధాంతమే తెలియదు. సిద్ధాంతాన్ని వారు ఆచరణతో సంబంధంలేని పిడివాదంగా చూస్తున్నారు. కంఠతా వల్లించవలసిన ద్రాన్నిగా భావిస్తున్నారు. అలా వల్లిస్తే ఎట్టిగడబిడ లేకుండా అన్ని అవసరాలను అదే నెరవేరుస్తుందని భావిస్తున్నారు. వారికి సిద్ధాంతం మతవిశ్వాసంలాంటిదేకాని కార్యాచరణకు మార్గదర్శికాదు."

(సోర్జికి వ్రాసిన ఉత్తరం, 1886 నవంబరు 29)

విప్లవ ఉద్యమం ముందుకుపోయి సోషలిస్టు విప్లవానికి పరివర్తన కోరుచున్న సమయంలో ఇంకా శ్రామికవర్గ రైతాంగ విప్లవ ప్రజాతంత్ర నియంతృత్వ మనే పాత సూత్రాన్ని కామెనివ్, కొంతమంది పూర్వపు బోల్షివిక్‌లు పట్టుకొని వ్రేలాడ సాగారు. వారిని విమర్శించుతూ 1917 ఏప్రిల్‌లో లెనిన్ ఇలా వ్రాశాడు :

"మన బోధన పిడివాదంకాదు. కార్యాచరణకు అది మార్గదర్శిని. 'సూత్రాలు' మహా అయితే సాధారణ కర్తవ్యాలను నిర్దేశించగలవు. కాని చారిత్రక్రమంలో ప్రతి ప్రత్యేక దశ యొక్క వాస్తవ (Concrete) ఆర్థిక రాజకీయ పరిస్థితుల ననుసరించి ఇవి తప్పనిసరిగా సవరణ చేయబడాలి. ఇలాంటి సూత్రాలను బట్టీ పట్టి వల్లెవేయడాన్ని మార్క్సు, ఎంగెల్సులు ఎగతాళి చేయడం సరియైనదే... మార్క్సిస్టు వాస్తవిక జీవితాన్ని, నిర్దిష్ట వాస్తవికతలను గుర్తించాలి. నిన్నటి (పాత కాలపు) సిద్ధాంతాన్ని పట్టుకొని వ్రేలాడరాదు. ఈ నిర్వివాదమైన సత్యాన్ని గ్రహించడం అవసరం..." (లెనిన్ కలెక్టెడ్ వర్క్సు, రష్యన్ ఎడిషన్, 20వ వాల్యూమ్, 100, 101 పేజీ)

(3) కార్మికవర్గ అనుచరులలోనే తీవ్రంగా పనిచేస్తూన్నట్టి పెట్టుబడిదార్ల చేతుల్లోకి కార్మికవర్గంలోని వెనుకబడ్డ భాగాలను నెట్టి కార్మికవర్గ ఐక్యతను చీల్చుచున్నట్టి మధ్యతరగతి పార్టీలను నాశనంచేస్తేతప్ప శ్రామికవర్గ విప్లవవిజయం అసాధ్యం - అని పార్టీ చరిత్ర ఇంకా మనకు బోధించుతోంది.

పెటీబూర్జువా పార్టీలగు సోషలిస్టు రివల్యూషనరీలను, మెన్షివిక్‌లను, అరాచక వాదులను (సంకుచిత), జాతీయవాదు

లను వ్యతిరేకంగా చేసిన పోరాట చరిత్రయే, ఈ పార్టీల సంపూర్ణ పరాజయ చరిత్రయే మనపార్టీ చరిత్ర. ఈ పార్టీలను పూర్తిగా ఓడించివేసి 'కార్మికవర్గ అనుచరులనుండి బయటకు తరిమివుండక పోయినట్లయితే, కార్మికవర్గ ఐక్యత సాధ్య మయ్యేదికాదు. ఇక కార్మికవర్గమే ఐక్యంగాని పక్షంలో శ్రామిక విప్లవవిజయం అసాధ్యం.

ఈపార్టీలు మొదట పెట్టుబడిదారీ విధానాన్ని కాపాడ డానికి నిలబడ్డాయి. అక్టోబరు విప్లవం తరువాత పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించడానికి పాటుపడ్డాయి. ఇలాంటి పార్టీ లను పూర్తిగా ఓడించి వుండకపోయినట్లయితే, శ్రామికవర్గ నియంతృత్వం కాపాడటంకాని, విదేశసాయుధ దురాక్రమణ నుండి ఓడించడంగాని, సోషలిజం నిర్మించడంగాని సాధ్యమయేవి కావు.

ప్రజలను మోసగించడానికి తమపార్టీలను "విప్లవ" పార్టీలుగా, "సోషలిస్టు" పార్టీలుగా పేరుపెట్టుకొన్న సోషలిస్టు రివల్యూషనరీలు, మెన్షివిక్‌లు, అరాచకవాదులు, (సంకుచిత) జాతీయవాదులు - మొదలైన అన్ని పెటీబూర్జువాపార్టీలు, అక్టోబరు సోషలిస్టు విప్లవానికి పూర్వమే విప్లవ ప్రతీఘాతక పార్టీలుగా తయారయ్యారు. ఇది.ఏదో యాదృచ్ఛిక ఘటన అని భావించరాదు. తరువాత విప్లవానంతరం విదేశపెట్టుబడి దారీ ప్రభుత్వాల గూఢచారిశాఖ ఏజంట్లుగా తయారయ్యారు. గూఢచారుల, విధ్వంసకుల, అభివృద్ధిని పెడమార్గాన్ని పట్టించే వారల, హంతకుల దేశద్రోహుల ముఠాగా తయారయ్యారు. లెనిన్ ఇలా అన్నాడు :

"అత్యంత విప్లవకరమైన మార్క్సిస్టు పార్టీ వల్లనే ఇతర పార్టీలను వ్యతిరేకంగా ఎడతెగని పోరాటం సాగించుట వల్లనే, సామాజిక విప్లవదశలో శ్రామికవర్గ ఐక్యత సాధించ బడుతుంది."

(లెనిన్ కలెక్టెడ్‌వర్క్స్, రష్యన్ ఎడిషన్, 26 వ వాల్యూం 50 వ పేజీ)

(4) తన అనుచరులలోవున్న అవకాశవాదులకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటాన్ని కార్మికవర్గ పార్టీ సాగించాలి. తమ మధ్యలోనేవున్న లొంగుబాటుదారులను నాశనంచేయాలి. ఇలా చేయకపోతే, పార్టీ, తన అనుచరులలో ఐక్యతనుగాని, క్రమశిక్షణనుగాని నిలబెట్టలేను. శ్రామిక విప్లవ నిర్మాతగాను, నాయకురాలుగాను తాను పాత్రను అది నిర్వహించలేదు. ఇంతేగాక నూతన సోషలిస్టు సమాజ నిర్మాతగా తన పాత్రను అది నిర్వహించలేదు - అని కూడా పార్టీ చరిత్ర మనకు బోధించుతోంది.

పార్టీలోని అవకాశవాద ముఠాలకు, "ఎకనమిస్టులకు", మెన్షివిక్కులకు, ట్రాట్స్కీవాదులకు, బుఖారిన్ వాదులకు, పెడదారిపట్టిన జాతీయవాదులకు వ్యతిరేకంగా సాగించిన పోరాట చరిత్రయే మనపార్టీ అంతరంగిక జీవితాభివృద్ధియొక్క చరిత్ర.

లొంగుబాటుదారులైన ఈముఠాలన్నీ వాస్తవానికి మన పార్టీలోని మెన్షివిక్ ఏజంట్లనీ, వీరు మెన్షివిజం అనే మడ్డి కుళ్ళుతో మెన్షివిక్ సిద్ధాంతాన్ని కొనసాగించేవారనీ - పార్టీ చరిత్ర మనకు బోధించుతోంది. మెన్షివిక్‌లలాగానే ఈ లొంగు

భాటుదారులు కార్మికవర్గంలోను, పార్టీలోను బూర్జువా పలుకుబడికి వాహనాలుగా పనిచేశారు. అందుచేత పార్టీలోని యీ ముఠాలను రద్దుచేయడానికి సాగించిన పోరాటం, మెన్షి విజాన్ని అంతంచేయడానికి సాగించిన పోరాటంయొక్క కొనసాగింపే.

మెన్షివిక్‌లను, "ఎకనమిస్టులను" మనం ఓడించి యుండకపోయినట్లయితే, మనం పార్టీని నిర్మించి శ్రామిక విప్లవానికి కార్మికవర్గాన్ని నడపగలిగివుండే వాళ్ళం కాదు.

ట్రాట్స్కీ-వాదులను, బుఖారిన్‌వాదులను మనం ఓడించి యుండకపోతే సోషలిజాన్ని నిర్మించడానికి అవసరమైన పరిస్థితు లను సృష్టించి యుండేవాళ్ళం కాదు.

అన్నిరకాల, అన్నిరంగుల పెడత్రోవపట్టిన జాతీయ వాదులను ఓడించి యుండకపోతే, మనం ప్రజలలో అంతర్జా తీయ భావాన్ని వ్యాపింపచేసి యుండేవాళ్ళం కాదు. సోవి యట్ యూనియన్‌లోని వివిధజాతుల మధ్య దృఢమైత్రి అనే జెండాను సంరక్షించి యుండేవాళ్ళంకాదు. సోవియట్ సోష లిస్టు రిపబ్లిక్కుల యూనియన్‌ను నిర్మించగలిగి యుండేవాళ్ళం కాదు.

పార్టీలోని అవకాశవాద వ్యక్తులకు వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో బోల్షివిక్కులు ఎక్కువ కాలాన్ని వినియోగించినట్లు కొందరికి కన్పించవచ్చు. అవకాశవాదుల ప్రాముఖ్యతను ఎక్కువ అంచనా వేసినట్లుకూడా కొందరు భావించవచ్చు. కాని ఆభావం పూర్తిగా తప్పు. అవకాశ వాదం మనమధ్య వుండటం ఆరోగ్యవంతమైన శరీరంలో రాచ

పుండు లాంటిది. దీనిని మనం సహించరాదు. పార్టీ, కార్మిక వర్గానికి నాయకత్వం వహించిన దళం; దానికి ముందు నిలిచిన బురుజు. దానికి సైన్యాధికారవర్గం. కార్మికవర్గాన్ని నడిపే ఉద్యోగులలో నిరాశావాదులు, అవకాశవాదులు, లొంగుబాటుదారులు, దేశద్రోహులుఉండుట సహించరానివిషయం. పెట్టుబడిదారీవర్గానికి వ్యతిరేకంగా తాను జీవన్మరణ సంగ్రామం సాగించుతున్నప్పుడు, తన స్వంత ఉద్యోగులలోనే, తన స్వంత కోటలోనే లొంగుబాటుదారులు, దేశద్రోహులు ఉన్నట్లైతే, కార్మికవర్గం – సైనిక శ్రేణినుండి, వెనుకభాగంనుండి – వచ్చే రెండుమంటల మధ్య చిక్కుకొంటుంది. అలాంటి పోరాటం అపజయంతో అంతమొందుతుందన్న విషయం స్పష్టమే. ఒకకోటను పట్టాలంటే దానికి సులభమైన మార్గం లోపలి నుండి పట్టడమే. విజయాన్ని సాధించాలంటే కార్మికవర్గ పార్టీ, దాని నాయకవర్గమూ, దాని అగ్రశ్రేణిలో నిలిచిన బురుజులలో లొంగుబాటుదారులను, యుద్ధరంగం వదలి శత్రువులలో చేరి పోయేవారిని, ద్రోహులను, నీచులను లేకుండా శుద్ధిచేయాలి.

లెనిన్‌తోను, పార్టీతోను పోరాడిన ట్రాట్స్కీవాదులు, బుఖారిన్‌వాదులు, పెడత్రోవపట్టిన జాతీయవాదులు, మెన్షివిక్, సోషలిస్టు రివల్యూషనరీ పార్టీలలాగానే పతనమయ్యారంటే అనగా గూఢచారులు, విధ్వంసకులు, హంతకులు, అభివృద్ధిని పెడత్రోవలో పెట్టినవారు, దేశద్రోహులుగా తయారై విదేశ గూఢచారి శాఖలకు ఏజంట్లయ్యారంటే దానిని ఏదో యాదృచ్ఛిక ఘటనగా భావించరాదు. లెనిన్ ఇలా అన్నాడు:

"మన అనుచరులలో సంస్కరణవాదులను, మెన్షివిక్‌లను ఉంచుకొని శ్రామిక విప్లవ విజయాన్ని సాధించుట అసాధ్యం. సాధించినా ఆ విజయాన్ని నిలబెట్టుకొనుట అసాధ్యం. ఇది సిద్ధాంతరీత్యా స్పష్టమే. రష్యా, హంగరీల రెండిటి అనుభవం యీ విషయాన్ని కళ్ళకుగట్టినట్లు ధృవపర చింది... రష్యాలో అనేకసార్లు క్లిష్టపరిస్థితులు ఉదయించాయి. మన పార్టీలో మెన్షివిక్‌లు, సంస్కరణవాదులు, పెటీబూర్జువా ప్రజాతంత్రవాదులు ఉండిపోయినట్లయితే, ఆ క్లిష్ట సమయా లలో సోవియట్ ప్రభుత్వం తప్పనిసరిగా, నిస్సందేహంగా కూల ద్రోయబడి వుండేది..." (లెనిన్ కలెక్టెడ్‌వర్క్సు, రష్యన్ ఎడిషన్, 25వ వాల్యూం, 462, 463 పేజీలు)

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు :

"మనపార్టీ సకాలంలో తనలోని అవకాశవాద కుళ్లును తొలగించుకోగల్గింది; తన అనుచరులలో లిక్విడేటర్లను, మెన్షివిక్‌లను, వదలించుకోగల్గింది; ఇందువల్ల పార్టీలో ఆంతరంగిక ఐక్యతను, అనుచరులలో సాటిలేని సన్నిహితత్వాన్ని యేర్పర చుటలో పార్టీ జయంపొందింది. అవకాశవాదులను, సంస్కరణ వాదులను, సామ్రాజ్యవాదులను (Social Imperialists) జాతీయ దురహంకారులను (Social chauvinists) గుడ్డిదేశ భక్తులను (Social patriots), అహింసావాదులను (Social pacifists) తమలో నుండి నెట్టిశుద్ధిచేయుటద్వారా శ్రామిక వర్గ పార్టీ అభివృద్ధిచెంది బలపడుతుంది. అవకాశవాద వ్యక్తు లను వడపోతపోయుటద్వారా పార్టీబలపడుతుంది."(జె.స్టాలిన్,

ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947, 91వ పేజీ)

(5) పార్టీ గనక తన విజయాలతో కొట్టుకొనిపోతే, అహంభావాన్ని పెంపొందించుకొనుట ప్రారంభించితే, తన పనిలోని లోపాలను గమనించుట మానివేస్తే, తన తప్పులను అంగీకరించడానికి భయపడితే, సకాలంలో ఆ తప్పులను చిత్తశుద్ధితోను, నిష్కపటంగాను సరిచేసుకొనకపోతే, కార్మికవర్గ నాయకురాలుగా తన పాత్రను నిర్వహించలేదని కూడ మనను పార్టీ చరిత్ర బోధించుతోంది.

విమర్శన – ఆత్మవిమర్శన అంటే భయపడకపోతే, తన పనిలో లోపాలను, పొరపాట్లను దాచిపెట్టడం మానివేస్తే, తన (పార్టీ) పనిలోని తప్పులనుండి గుణపాఠాలను నేర్చుకొని తన అనుచరులకు బోధించి విద్యావంతులను చేస్తే, సకాలంలో తన తప్పులను దిద్దుకొనడం దానికి తెలిసియుంటే, పార్టీ అజేయమవుతుంది.

తన తప్పులను కప్పిపెడితే, కటువైన సమస్యలను ఎదుర్కొనక తప్పించుకు తిరిగితే, అంతా బాగానేవుందని నటించుతూ తన లోటుపాట్లను కప్పివేస్తే, విమర్శన, ఆత్మవిమర్శన అంటే సహించకపోతే, ఆత్మ సంతృప్తికి ఆత్మస్తుతికి లొంగిపోతే, తనవిజయాలతో మత్తెక్కిపోతే, పార్టీ నాశనమైపోతుంది.

లెనిన్ ఇంకా ఇలా అన్నాడు :

"తన వర్గం పట్ల, శ్రామిక ప్రజాసామాన్యం పట్ల, తన బాధ్యతలను ఆచరణలో పార్టీ ఎలా నిర్వర్తించుచున్నదీ, అది

ఎంత మనః పూర్వకంగా పనిచేయుచున్నదీ విచారించాలంటే అతి ప్రధానమైన ఖచ్చితమైన పరీక్ష ఇది: ఒక రాజకీయపార్టీ తనుచేసిన పొరపాట్లపట్ల అవలంబించే వైఖరే ఈ పరీక్ష. నిష్కపటంగా తప్పును అంగీకరించడం, దానికిగల కారణాలను అన్వేషించడం, అలాంటి తప్పుకు దారితీసిన పరిస్థితులను పరిశీలించడం, దానిని సరిదిద్దడానికి మార్గాలను క్షుణ్ణంగా చర్చించడం, బాధ్యతగల పార్టీకి విశిష్ట లక్షణం. అదీ తన విధులను నిర్వర్తించడానికి మార్గం. అదీ తనవర్గాన్ని తన ప్రజాసామాన్యాన్ని ప్రబోధించి తర్ఫీదు చేయాల్సిన విధానం." (లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు, ఇంగ్లీషు ఎడిషన్, మాస్కో 1947, రెండవ వాల్యూం 599 వ పేజీ)

లెనిన్ ఇంకా ఇలా అన్నాడు:

"ఇదివరలో విప్లవ పార్టీలన్నీ నాశనమయ్యాయంటే కారణం అవి అహంభావాన్ని పెంపొందించుకొన్నాయి. తమ బలం ఎందులో ఇమిడివుందో అవి గ్రహించలేక పోయాయి. తమ బలహీనతలను గురించి చెప్పుకోడానికి అవి భయపడ్డాయి. కాని మనం నాశనంకాము. ఎందుచేతనంటె మన బలహీనతను గురించి మాట్లాడడానికి మనకు భయంలేదు. మనబలహీనతలను పోగొట్టుకొనుట నేర్చుకొంటాం." (లెనిన్ కలెక్టెడ్ వర్క్సు, రష్యన్ఎడిషన్, 27వ వాల్యూం. 260-61 వ పేజీలు)

(6) తుదివిషయం. పార్టీకి ప్రజాసామాన్యంతో విశాలమైన సంబంధాలు లేకపోయినట్లయితే, ఆ సంబంధాలను నిరంతరం పార్టీ బలపర్చుకోనట్లయితే, ప్రజాసామాన్యం చెప్పే

దానికి శ్రద్ధగా చెవియొగ్గి వినడం నేర్చుకొనక పోయినట్లయితే. వారి అత్యంత అవసరాలను అర్థంచేసుకొనక పోయినట్లయితే, ప్రజాసామాన్యానికి నేర్పుటేగాక వారినుండి తాను నేర్చుకో డానికి సిద్ధపడక పోయినట్లయితే, కార్మికవర్గ పార్టీ, లక్షలాది కార్మికవర్గ ప్రజలను ఇతర కష్టజీవులను నడుప సామర్థ్యంగల వాస్తవిక ప్రజాపార్టీ కాజాలదు – అని పార్టీ చరిత్ర మనను బోధించుతుంది.

లెనిన్ చెప్పినట్లు, "పార్టీ కష్టజీవులైన ప్రజాబాహుళ్యంతోనూ, ముఖ్యంగా శ్రామికవర్గంతో, కష్టజీవులైన శ్రామికవర్గేతర ప్రజలతో సయితం తాను సంబంధం పెట్టుకో గలిగితే, సన్నిహిత సంబంధాన్ని నెలకొల్పుకోగలిగితే, కనీసం కొంతవరకైనా వారిలో మిళితమై పోగలిగితే, పార్టీ అజేయం కాగలుగుతుంది." (లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు, ఇంగ్లీషు ఎడిషను మాస్కో 1947, రెండవ వాల్యూం 574 పేజీ)

తనపార్టీ అనే సంకుచితమైన ఆవరణలోనే పార్టీగనుక ముడుచుకు పోయినట్లయితే, ప్రజాసామాన్యంనుండి అది వేరు పడిపోయినట్లయితే, నిరంకుశాధికారమనే తుప్పు తనను ఆవరించడాన్ని అది సహించినట్లయితే, పార్టీ నాశనమైపోతుంది.

కామ్రేడ్ స్టాలిన్ ఇలా అన్నాడు:

"ప్రజాసామాన్య బాహుళ్యంతో బోల్షివిక్‌లు సంబంధము కలిగియున్నన్నాళ్ళు వారు అజేయులని ఒక సూత్రంగా మనం చెప్పవచ్చు. తద్విరుద్ధంగా, బోల్షివిక్‌లు ప్రజాసామాన్యం నుండి వేరుపడిపోయి వారితో సంబంధాన్ని పోగొట్టుకొన్న

మరుక్షణమే, నిరంకుశాధికారమనే తుప్పు వారిని ఆవరించిన మరుక్షణమే, వారు తమ బలాన్నంతా పోగొట్టుకొని ఒక గుండుసున్నా అవుతారు.

"ప్రాచీన గ్రీకుల పురాణగాధలో ఆంటయస్ (Antaehs) అనే ప్రఖ్యాత వీరుడున్నాడు. ఆ కథప్రకారం అతడు సముద్రాల దేవతయగు పోసీడన్‌కు (Poseidon) భూదేవత యగు 'గే' (Gaea) కు పుట్టాడు. ఆంటియస్ తనను కన్న, తనకు స్తన్యమిచ్చి పోషించిన తల్లి అంటే ఎక్కువ మమకారంతో ఉండేవాడు. ఈ ఆంటియస్ ఓడించని వీరుడంటూ లేడు. అతన్ని అజేయుడని భావించేవారు. అతనికీ బలం ఎక్కడనుండివచ్చింది? తన శత్రువు పోరాటంలో తనను ఎక్కువకష్టాన్ని కలిగించినపుడు ప్రతిసారీ అతడు తనను కని స్తన్యమిచ్చి పోషించిన తల్లిని అనగా భూదేవతను తాకేవాడు. అందువల్ల అతనికి నూతనశక్తి లభించేది. అయితే అతని కొక బలహీనత వుంది. ఏదో ఒకవిధంగా భూమినుండి దూరమయ్యే అపాయమే ఆ బలహీనత. అతని శత్రువులను ఈ బలహీనత తెలుసు. అందుకోసం వారు వేచియున్నారు. ఒకరోజున యీ బలహీన అంశాన్ని అదునుగాతీసుకొని, ఆంటియస్‌ను వోడించిన శత్రువు వచ్చాడు. అతనిపేరు హెర్క్యులెస్. ఆంటియస్‌ను హెర్క్యులెస్ ఎలా ఓడించగల్గాడు? అతడు ఆంటియస్‌ను పైకెత్తి క్రింద భూమిని తాకకుండా గాలిలో నిలబెట్టి, అతనిని గొంతుపిసికి చంపాడు.

"గ్రీకు పురాణంలోని వీరుడైన ఆంటియస్‌ను బోల్షివిక్‌లు జ్ఞాపకం చేస్తున్నారని నేను భావించుతున్నాను.

ఆంటియస్‌లాగానే వారు తమను కని, స్తన్యమిచ్చి పోషించిన తమ తల్లితో అనగా ప్రజాసామాన్యంతో అంటిపెట్టుకొని యుండటంవల్లనే వారు బలంగావున్నారు. తమ తల్లిని, అనగా ప్రజలను అంటిపెట్టుకొని యున్నన్నాళ్ళు వారు అజేయులుగా ఉండితీరుతారు.

"బోల్షివిక్ నాయకత్వం యొక్క ఆజేయతలోని రహస్యం ఇదే." (జె. స్టాలిన్, డిఫెక్ట్సు ఇన్ పార్టీవర్క్)

అవీ, బోల్షివిక్‌పార్టీ అధిగమించిన చారిత్రక పంథా నుండి నేర్చుకోవలసిన ముఖ్యపాఠాలు.

2-5-53



# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 1 | చెందిప్పటికీ | చెందినప్పటికీ |
| 8 | 20 | Pesant bourgeoisie | Peasant bourgeoisie |
| 14 | 2 | Emanciption | Emancipation |
| 31 | 4 | లాడిమిర్ | వ్లాడిమిర్ |
| 36 | 8 | లెలిన్ | లెనిన్ |
| 36 | 21 | డాన్ నదీతీరంలోని (రోస్టావ్) | (డాన్ నదీతీరంలోని రోస్టావ్) |
| 42 | 24 | వ౧ విప్లవమూ | వర్గ విప్లవమూ |
| 45 | 8 | ప్రాఖమ్యుత | ప్రాముఖ్యత |
| 47 | 20 | లెనిన్ ఈ దృష్టిలో | లెనిన్ దృష్టిలో |
| 48 | 17 | లెలిన్ | లెనిన్ |
| 50 | 19 | వ్రత్యుత్తరాలను | ప్రత్యుత్తరాలను |
| 81 | 17 | What is to done | What is to be done |
| 87 | 8 | నియంతృత్వ సాపన | నియంతృత్వ స్థాపన |
| 89 | 23 | లొంగనవసరంలేరనీ | లొంగనవసరం లేదనీ |
| 91 | 21 | సానంవుండాలని | స్థానంవుండాలని |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 95 | 14 | మార్ట్రా వే | మార్ట్రావ్ |
| 103 | 2 | వక్తులనే | వ్యక్తులనే |
| 104 | 12 | శ్రామికవ సంస్థలను | శ్రామికవర్గసంస్థలను |
| 110 | 11 | ప్రాముఖ్వత | ప్రాముఖ్యత |
| 112 | 9 | బలపడాయి | బలపడ్డాయి |
| 120 | 23 | టాట్కీస | ట్రాట్స్కీ |
| 122 | 9 | భరింపవేని | భరింపలేని |
| 138 | 6 | సోషల్ - డెమాక్రటిక్ పాట్ర | సోషల్ - డెమాక్రటిక్ పార్టీ |
| 139 | 23 | రైతులకంటేను | రైతులంటేను |
| 144 | 15 | 41 వ పేజీ | 414 వ పేజీ |
| 151 | 1 | నిశ్చింతగా | నిశ్చితంగా |
| 158 | 23 | సరిష్కరించుటలో | పరిష్కరించుటలో |
| 160 | 1 | విప్లవాన్ని "ఆపడానికికాదు. | విప్లవాన్ని "ఆపడానికి" కాదు |
| 165 | 2 | నాగించే | సాగించే |
| 200 | 1 | యిదవ | అయిదవ |
| 200 | 21 | స్టోఒపిన్ | స్టోలీపిన్ |
| 206 | 1 | శ్రామికవ | శ్రామికవర్గ |
| 234 | 9 | స్త్రీ | (సి) |
| 240 | 13 | బూర్జున్వాసమాజం | బూర్జువాసమాజం |
| 249 | 1 | గోయ | గోచర |
| 249 | 2 | చాచర | చాయ |
| 253 | 11 | మునూప్పె, ట్టుబడిదారీ | మున్నూ, పెట్టుబడిదారీ |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 268 | 23 | ప్రధామైన | ప్రధానమైన |
| 271 | 19 | నేర్పరితనంవఃలో | నేర్పరితనంలో |
| 287 | 20 | సంబంభాల | సంభంధాల |
| 287 | 24 | చైనత్యం | చైతన్యం |
| 293 | 21 | రహస్యవార్టీ | రహస్యపార్టీ |
| 301 | 7 | 190 | 1910 |
| 303 | 6 | సాగించారు | సాగించేవారు |
| 307 | 19 | ట్రాట్స్కీలవరకు | మార్గావ్, ట్రాట్స్కీల వరకు |
| 321 | 13 | 912 | 1912 |
| 349 | 5 | కార్మకుల | కార్మికుల |
| 368 | 1 | యుధ్ధచేస్తున్న | యుద్ధంచేస్తున్న |
| 381 | 2 | పాలోనడానికి | పాల్గొనడానికి |
| 395 | 15 | చక్రవర్తియే సిదమాయ్యాడు | చక్రవర్తియే సిద్ధమయ్యాడు |
| 400 | 5 | సామాజ్యవాద | సామ్రాజ్యవాద |
| 416 | 10 | బోల్షివిక్ పారీ | బోల్షివిక్ పార్టీ |
| 420 | 20 | బోల్షివిక్ పార్టీ | బోల్షివిక్ పార్టీ |
| 429 | 10 | అందోళనల | ఆందోళనల |
| 431 | 3 | మవ | మన |
| 440 | 1 | తత్వాత | తర్వాత |
| 455 | 1 | Provisiona | Provisional |
| 479 | 13 | చట్టాలు చేసిండి | చట్టాలు చేసింది |
| 481 | 12 | రాయబారులు | రాయబారాలు |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 483 | 11 | స్టానినూ | స్టాలినూ |
| 510 | 17 | ప్రభుత్వమా | ప్రభుత్వమూ |
| 523 | 25 | అధికా | అధిక |
| 529 | 1 | ocial Composition | Social Composition |
| 533 | 13 | ఆగిపోయెనంట | కోల్చాక్ గుండెల |
| 537 | 2 | దిద్బంధాన్ని | దిగ్బంధాన్ని |
| 545 | 17 | అంతర్యుదమూ | అంతర్యుద్ధమూ |
| 547 | 1 | యీాక్రింది. విషయాలు | ఈక్రింది విషయాలు |
| 548 | 3 | వివర్ంచవచ్చు | వివరించవచ్చు |
| 549 | 1 | నిజమైన పుత్రుడు. తన తల్లి పట్ల | నిజమైన పుత్రుడు తన తల్లి పట్ల |
| 549 | 3 | ంతంగా వుంది | వంతంగా వుంది |
| 559 | 12 | విదేశం | విదేశ |
| 591 | 4 | అరమయ్య | అరమయ్యో |
| 600 | 7 | (గిల్డ్ గార్డు) | (ఓల్డ్ గార్డు) |
| 602 | 4 | ఉపయోగించు కొన్నాడు | ఉపయోగించు కొన్నారు |
| 602 | 12 | సిదాంత | సిద్ధాంత |
| 603 | 13 | యాతత్ | యావత్ |
| 603 | 18 | నమాధి | సమాధి |
| 611 | 16 | అధివృద్ధి | అభివృద్ధి |
| 611 | 19 | 925 | 1925 |
| 612 | 16 | పూర్తిగా వచ్చింది | పూర్తి గావచ్చింది |
| 613 | 10 | సాధ్యమవుతుంది ? | సాధ్యమవుతుందా ? |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 618 | 8 | ముఖ్యమై విషయం | ముఖ్యమైన విషయం |
| 619 | 20 | ప్రతిపక్షాల | ప్రతిపక్షుల |
| 623 | 11 | సారాంశాన్ని | సారాంశాన్ని |
| 625 | 22,23 | మొదలగు వారిని లెనిన్‌గ్రాడ్‌కు పార్టీ పంపి తప్పుడు ప్రకటనలతో | మొదలగువారిని – తప్పుడు ప్రకటనలతో |
| 626 | 2 | విదశ పరచటానికే వీరినిపంపారు | విదశపరచటానికి పంపారు |
| 636 | 7 | స్టేషస్ | స్టేషన్ |
| 636 | 22 | ప్రభుత్యాలు | ప్రభుత్వాలు |
| 639 | 6 | చేంబర్లను | చేంబర్లేను |
| 650 | 19 | నిర్బధంవల్ల | నిర్బంధంవల్ల |
| 553 | 5 | టాట్స్కీ | ట్రాట్స్కీ |
| 53 | 5 | ప్రెస్టిన్‌స్కీ | క్రెస్టిన్‌స్కీ |
| 53 | 10 | జినోనివ్ | జినోవీవ్ |
| 53 | 23 | పార్ణీ | పార్టీ |
| 54 | 8 | టాట్స్కీ | ట్రాట్స్కీ |
| 59 | 14 | విధ్యంసకులు | విధ్వంసకులు |
| 63 | 19 | పార్టీసంస | పార్టీ సంస్థ |
| 64 | 20 | టాట్కీన | ట్రాట్స్కీ |
| 8 | 2 | సోవియడ్ యూనియన్ | సోవియట్ యూనియన్ |
| 4 | 5 | వ్యపసాయ | వ్యవసాయ |
| 7 | 12 | చేసివ | చేసిన |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 700 | 12, 13 | అభివృద్ధి. స్థాయిగా తలచి | అభివృద్ధి స్థాయిగా తలచి |
| 701 | 17 | పేట్ | ఫీట్ |
| 701 | 20 | ప్రణాళికలు 2 | ప్రణాళికలు 2½ |
| 704 | 4 | బొగ్గులో | వంటచెరుకు |
| 705 | 2 | సాధ్యం | అసాధ్యం |
| 707 | 16 | ఓడిపో నిరాకరించుతా! | ఓడిపోనిరాకరించుతా. |
| 715 | 3 | ప్యవసాయదారుల | వ్యవసాయదారుల |
| 723 | 11 | పై గంథమే | పై గ్రంథమే |
| 731 | 10 | విజయాలే ఇవి. | విజయాలే. ఇవి |
| 731 | 13 | అశయాలకి | ఆశయాలకి |
| 731 | 22 | అసంతృత్తిని | అసంతృప్తిని |
| 731 | 25 | స్తో)త్రించేవారు | స్తోత్రించేవారు |
| 732 | 2 | చర్వలను | చర్యలను |
| 732 | 2, 3 | కోనసాగిస్తూ | కొనసాగిస్తూ |
| 732 | 12 | సూచన లేమీ | సూచన లేమీ కూడ |
| 733 | 1 | రోదపుట్టించే | రోతపుట్టించే |
| 740 | 21 | యీాదృచ్ఛికంగా | యాదృచ్ఛికంగా |
| 740 | 21 | జారబడకుండా | జొరబడకుండా |
| 751 | 10 | కితం | క్రితం |
| 757 | 1 | పపంచ పెట్టుబడిదారీ | ప్రపంచ పెట్టుబడి |
| 762 | 3 | ప్యక్తులూ | వ్యక్తులూ |
| 770 | 14 | 924 | 1924 |
| 785 | 4 | ఆభ్యర్థుల | అభ్యర్థుల |



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B151 |
| పుస్తకం పేరు | సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీ చరిత్ర |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 841 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | X, [illegible], XVI, 6[illegible], 747, 816 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Soumya |
| స్కాన్ చేసినది | Ashwini |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |